# శ్రీరామావతార శ్రేష్ఠత్వ ప్రస్తావన.

శ్రీగురుమూర్తియైన రామదాసా! శ్రీవిష్ణువుయొక్క దశావతారములలో పురాతనములయిన శ్రీరామావతారమును, శ్రీకృష్ణావతారమును శ్రేష్ఠములని వినుచున్నాను (1). ఆ రెండవతారములలో ఏది శ్రేష్ఠమైనది? నా ఎదుట ఆ తత్త్వమును చెప్పుము. దేనిని విని నిరంతరము సుఖించెదమో ఆ చరిత్రమును నేను వినగోరుచున్నాను, ” అని విష్ణుదాసు అడుగగా (2), శ్రీరామదాసు ఇట్లు నిరూపించు చున్నాడు;

విష్ణుదాసా! వినుము. చక్కగా అడిగితివి. సావధానమనస్కుడవగుము. నరులందరును ఇచ్చట శ్రీరామావతారము శ్రేష్ఠమయినదని తెలిసికొనదగును (3). ఈ విషయమున మనోహరమగు పూర్వవృత్తాంతము ఒకటి చెప్పుచున్నాను వినుము. ఇరువురు బ్రాహ్మణులచే వివాదరూపముగా కీర్తింపబడి, పుణ్యప్రదమైనది (4). ఎట్లనిన :- అయోధ్యానగర ప్రాంతమున రామదాసు అను ఒక బ్రాహ్మణుడు గలడు. అట్లే ద్వారకా నగర ప్రాంతమున కృష్ణుడు అను ఒక బ్రాహ్మణుడు గలడు (5). వారిరువురును నిరంతరము చక్కగా శ్రీరామ, కృష్ణులను సేవించుచుండిరి. వారొకప్పుడు ప్రయాగక్షేత్రమున మాఘమాసమునందు చేరిరి (6). త్రివేణియందు స్నానముచేసి, శ్రీమహావిష్ణువును ఆరాధించి, పౌరాణిక ముఖమునుండి కథాశ్రవణమునకై ఆ పౌరాణికుని ఎదుట కూర్చుండిరి (7). ఇట్లు వీరిరువురును కథాశ్రవణము చేయుచు, ఆ పౌరాణికుని సేవించుచుండగా, ప్రసంగవశాన వచ్చిన శ్రీరామ చరితమును రామభక్తుడైన విప్రుడు విని (8), సంతుష్టుడై, అప్పుడే ఆ పౌరాణికుని పూజించి, గొప్పగా సత్కరించెను. అప్పుడు కృష్ణుడను కృష్ణభక్తుడైన విప్రుడు కోపావిష్టుడై రాముని అధిక్షేపించెను (9). అంత ఆ యిరువురికిని వివాదము కలిగినది. ఆ వివాదము ఎట్టిదనిన.....

కృష్ణోపాసకుడు :- “ఓరీ రామదాసా! ఏమిపుడు నీవు దుఃఖియగు రామునియొక్క కథను వినినమాత్రముననే మిక్కిలి సంతోషమునంది వ్యాసపౌరాణికుని పూజించితివి, ఇది వ్యర్థము. నీవు మూఢుడవని తెలుసుకుంటిని (10).

**నాన్యచ్చరిత్రం కస్యాపి పావనం శ్రుతితోషదమ్ ।**
**యథా కృష్ణస్య మే రమ్యం నానాక్రీడాపురస్సరమ్ ॥ 11**

**తత్కృష్ణవచనం శ్రుత్వా రామాఖ్యః ప్రాహ సస్మితః ।**
**రామోపాసక ఉవాచ**
**రామః క్లేశీ కథం ప్రోక్తస్త్వయా కృష్ణః కథం సుఖీ ॥ 12**

కథం కృష్ణస్య తే రమ్యం చరితం దురితాపహమ్ ।
కథం రామస్య మే రమ్యం చరిత న్నేరితం త్వయా ॥ **13**

వదాద్య విస్తరేణైవ శృణ్వంత్వేతే సభాసదః ।
కృష్ణోపాసక ఉవాచ
సమ్యక్ పృష్టం త్వయా రామ సావధానమనాః శృణు ॥ **14**

వదామి రాఘవస్యాథ కృష్ణస్య చరితం త్వహమ్ ।
క్లేశదం తోషదం నృణాం శృణ్వంత్వేతే సభాసదః ॥ **15**

తవ రామస్య జన్మాదౌ జాతః శాపః పితుః పురా ।
శాపస్యాదావపి పురా తద్ధేతో రావణేన హి ॥ **16**

లంకాం తత్పితరౌ నీతౌ ప్రారంభే దుఃఖమీదృశమ్ ।
మమ కృష్ణస్య జన్మాదౌ తత్పిత్రోః సౌఖ్యదాయకైః ॥ **17**

వివాహమంగళైః కంసః పూజయామాస సాదరమ్ ॥
రామోపాసక ఉవాచ
రే రే శృణు త్వం దుర్బుద్ధే న స శాపో వరోఽర్పితః ॥ **18**

యత్ప్రసాదాతపుత్రస్య నృపస్య తనయస్త్వభూత్ ।
తథా మద్రామభీత్యా తౌ నీతావపి విసర్జితౌ ॥ **19**

## శ్రీరామోపాసక-శ్రీకృష్ణోపాసకుల వివాదము.

వినుటకు కర్ణానందప్రదమైన వేరు కథలేదా? ఎట్లనిన వివిధ క్రీడావిచారములచే వినోదప్రదమైన శ్రీకృష్ణుని చరిత్రము ఎంత రమ్యమైనది? చూడుము (11)

రామోపాసకుడు :- (కృష్ణోపాసకుని మాటలను విని చిరనవ్వు నవ్వుచు) శ్రీరాముడు దుఃఖియని ఎట్లుచెప్పితివి? కృష్ణుడు సుఖియనియెట్లు చెప్పితివి? శ్రీకృష్ణుని చరిత్ర రమ్యము అని దురితపరి హారకము ఎట్లగును? ఎట్లు నా రామునియొక్క చరిత్రమును రమ్యము కాదని చెప్పితివి (13). విస్తరించి చక్కగా మాటలాడుము. ఈ సభికులందరును విననీ...

కృష్ణోపాసకుడు :- రామదాసా! బాగుగా అడిగితివి. అయిన చక్కగా వినుము (14). మనుష్యులకు క్లేశములను ఇచ్చునట్టి రామచరిత్రను, సంతోషమునిచ్చునట్టి కృష్ణచరిత్రను చెప్పెద. ఈ సభాసదులందరు

విందురుగాక (15). నీ రాముని యొక్క జన్మాదియందు మునుపు తండ్రికి శాపము సంభవించెను మరియు శాపమునకు మునుపే క్లేశము (16). ఆ కారణమునుబట్టి రావణుడు వాని తల్లిదండ్రులయిన కౌసల్య, దశరథులను లంకకెత్తుకొనిపోయెను. మొదటనే దుఃఖమిట్టిదిగానున్నది. నా కృష్ణునియొక్క జన్మాదియందు వారితల్లిదండ్రులగు దేవకీ వసుదేవులను సౌఖ్యదాయకములయిన (17) వివాహ మంగళములతోడ కంసుడు సాదరముగా పూజించెను.

రామోపాసకుడు :- ఓరోరి దుర్బుద్ధీ! అది శాపము కాదురా, వరముగా నొప్పింపబడినది (18). ఏ ప్రసాదమువలన పుత్రుడయిన దశరథునికి కొడుకు కలిగెనో; ఆ అనుగ్రహమే కారణము. అట్లే నా రామునికి వెరచియే రావణుడు వారిని పట్టుకొనిపోయినను విడిచి వేసెను (19).

**దశాస్యేన తత్పితరౌ జన్మాదౌ పౌరుషం త్విదమ్ ।**
**తవ కృష్ణస్య జన్మాదౌ పిత్రోః కారాగృహస్థితిః ॥ 20**

**రాజభోగనిషేదార్థం శాపో యదుకులాయ చ ।**
**జన్మాపి వదిశాలాయాం వియోగశ్చ తయోరపి ॥ 21**

**సహోదరవధశ్చాపి తద్ధేతోర్మాతులేన హి ।**
**న బాహుజశ్చ వైశ్యశ్చ యస్య తాతావుభౌ స్మృతౌ ॥ 22**

**గోరక్షకస్య తనయః ప్రవాసః శైశవేఽపి చ ।**
**పరేణ పోషితశ్చాపి కనీయాన్ బలభద్రతః ॥ 23**

**ఏవం నానావిధం దుఃఖం తవ కృష్ణస్య నో సుఖమ్ ।**
**కృష్ణోపాసక ఉవాచ**
**ఆత్మార్థం తవ రామేణ తాటికా స్త్రీ విదారితా ।**
**నార్యాం విమోచితా బాణః పిత్రోః ఖేదో వియోగతః ॥ 24**

**రామోపాసక ఉవాచ**

**ద్విజఘ్నా నిహతా దుష్టా మమ రామేణ తాటికా ।**
**మునియజ్ఞరక్షణార్థం ముదా రాజ్ఞాఽర్పితౌ శిశూ ॥ 25**

**తవ కృష్ణేన రక్షార్థమాత్మనః పూతనా హతా ।**
**తథాఽఽత్మార్థం ప్రాణిహింసా బహు తేన కృతా వ్రజే ॥ 26**

గోపైశ్చ సంగతిస్త్తస్య తథైవ గోపరక్షణమ్ ।
గోవధః సర్పఘాతశ్చ ఖగవాజివధస్తథా ॥ **27**

రాసభవృషఘాతశ్చ చౌర్యం ద్యూతం వనేఽటనమ్ ।
కంబళావరణం శీతపర్జన్యోష్ణ ప్రపీడనమ్ ॥ **28**

క్షుత్తృడ్భ్యాం పీడనం నిత్యం గోపాలోచ్ఛిష్టసేవనమ్ ।
ఆత్మార్థం యాచితం చాన్నం ద్విజస్త్రీభ్యో వనే ముహుః ॥ **29**

ఇంద్రధ్వజపూజనాది వృద్ధాచార ప్రలోపనమ్ ।
పరస్త్రీగమనం జ్యేష్ఠనారీభిః క్రీడనం చిరమ్ ॥ **30**

జన్మాదియందు ఇది ఒక పౌరుషము. నీ కృష్ణుని జన్మాదియందు తల్లిదండ్రులకు కారాగారావాసము (20). యదుకులమునకే రాజ్యభోగములు లేనట్టు శాపము. పుట్టుకను చూతమా కారాగారమునందు. వెంటనే తల్లిదండ్రులను విడనాడుట (21). మేనమామయగు కంసునిచే అన్నలందరు మృతినందుట. ఆహా రాజునుకాడు, వైశ్యుడును కాడు. ఇట్టి తండ్రులిరువురు (22). గోపాలకుని బిడ్డడు. బాల్యమునందే ప్రవాసము. పరునిచే పోషింపబడినవాడు. బలరాముని కన్నను చిన్నవాడు (23). ఇట్లు నానా విధములయిన దుఃఖములు నీ శ్రీకృష్ణునికి సుఖము సున్నాయే.

కృష్ణోపాసకుడు :– నీ రాముడు తనకొరకే తాటకయను స్త్రీని చంపెను. ఆడదానిమీద బాణమును ప్రయోగించెను. తాను విడనాడి మునీంద్రునితోడపోయి, తండ్రిని సంకటపెట్టెను (24).

రామోపాసకుడు :– బ్రాహ్మణఘాతినియగు దుష్టురాలయిన తాటకిని నా రాముడు సంహరించెను. విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించుటకే సంతోషముతో ఆ దశరథుడే బిడ్డలను పంపించెను (25). నీ కృష్ణుడు ఆత్మరక్షణమునకై పూతనను సంహరించెను. అట్లే తనకొరకు గొల్లపల్లెలో చాలా ప్రాణహింసలు చేయబడెను (26). గోపాలకులతోడ స్నేహము, అట్లె ఆవులమేపి కాపాడుట. ధేనుక సంహారము. వృషభసంహారము. సర్పహత్య. పక్షివధ. అశ్వహింసనము (27). గాడిదను చంపుట. దొంగతనము చేసెను. అడవులలో తిరుగుట. కంబళికప్పుకొనుట. ఎల్లప్పుడు శీతవాతోష్ణబాధలను సహించునట్టి దురవస్థ (28). ఆకలిదప్పిని సహించుట, గొల్లవాండ్ర ఉచ్ఛిష్టమును సేవించుట. ఇట్టి పల్లెటూరి పాడుబ్రతుకు. మరల అన్నము లేక తనకొరకు బ్రాహ్మణస్త్రీలనుండి అన్నమును యాచించెను (29). వంశాచారముగా వచ్చిన ఇంద్రయాగాది సత్కర్మలను నిలిపివేసెను. పరకాంతలతో జేరుట, తనకన్నను పెద్దవాండ్రయిన స్త్రీలను పొందుట (30).

నగ్నస్త్రీదర్శనం వహ్నిప్రాశనం దామబంధనమ్ ।
ఉన్మూలనం చ యమయోర్మృత్పర్యుషితసేవనమ్ ॥ 31

రోదనం నవనీతార్థం ముహుర్మాత్రా ప్రతాడనమ్ ।
గోగోపికాసు చాస్నేహః పూర్వస్థలవిసర్జనమ్ ॥ 32

కృతా రజకహత్యా చ యుద్ధం క్షత్రియవత్ కృతమ్ ।
గజహత్యా మల్లహత్యా యుద్ధం మాతులమర్దనమ్ ॥ 33

నైష్ఠుర్యమాప్తవర్గేషు రాజ్యప్రాప్తిస్తథైవ చ ।
నృపాజ్ఞానర్తనం చాపి క్రీడా దాస్యా కురూపయా ॥ 34

యుద్ధాత్పరాజయశ్చాపి రిపవే పృష్ఠదర్శనమ్ ।
గిరౌ దగ్ధః పరైర్జ్ఞాతః స్వీయస్థలవిమోచనమ్ ॥ 35

అబ్ధితారనివాసశ్చ బలాత్స్త్రీహరణం కృతమ్ ।
భౌమాసురపరద్రవ్యహరణం పరసూనుతః ॥ 36

స్వీయగోత్రవధార్థం హి పాండుజాయోపదేశితమ్ ।
శనైః స్తోయావరోపాశ్చ వృక్షార్థం సంగరః సురైః ॥ 37

కృష్ణోపాసక ఉవాచ

కిం త్వం జల్పసి శృణ్వద్య తవ రామస్య కామినః ।
కస్య సా దుహితా బ్రూహి కృతః స వర్ణసంకరః ॥ 38

శివచాపస్య భంగేన శివస్యాప్యపరాధితమ్ ।
జామదగ్న్యమానభంగకరణం ముద్గలస్య చ ॥ 39

ఆజ్ఞాం వినా లక్ష్మణేన తద్వల్ల్యస్త్రోటితాః శుభాః ।
సదారణ్యచరః స్వార్థం పశుహింసాపరాయణః ॥ 40

వనాశ్రమీ వన్యజీవీ మాంసాహారీ ధనుర్ధరః ।
వ్యాధకర్మరతః శీతపర్జన్యోష్ణప్రపీడితః ॥ 41

నగ్నలను పొందుట, నగ్నస్త్రీలను చూచుట, నిప్పులను మ్రింగుట, త్రాటితో కట్టబడుట, చెట్లను పెళ్ళగించుట, మట్టిని చల్దిని తినుట (31). వెన్నకై ఏడ్చుట, పలుమార్లు తల్లిచే దెబ్బలుతినుట, గొల్లభామలతో చెలిమి, మొదటి ఉనికిని (జన్మస్థానమును) విడచుట (32) మొదలైనవి గాక, రజకుని చంపెను. క్షత్రియునివలె యుద్ధముచేసెను. ఏనుగును చంపెను. మల్లయుద్ధమాడెను. మల్లులను, మేనమామను వధించెను. (33). ఆప్తవర్గమువారితో నిష్ఠురత. రాజ్యమునందుట తగని దయినను రాజ్యమందుట. రాజులయాజ్ఞానుసారము వర్తించుట. కురూపియైన వ్యభిచారితో క్రీడనము (34). యుద్ధమునందు పరాజితుడై పారిపోవుట. పగవానికి వీపుజూపుట, కొండలో కాలిపోయెనని శత్రువులచే తెలియబడుట. తన తావును విడిచి సముద్రతీరమున వాసముజేయుట. (35). బలాత్కారముగా స్త్రీలను పట్టుట. నరకాసురునియొక్క పరద్రవ్యములను అపహరించుట (36). పాండురాజుయొక్క పత్నియైన కుంతిచేత స్వీయకుల నాశనమునకై ఉపదేశమునందుట. జనులచే దొంగయని ఆరోపింపబడుట. పారిజాత వృక్షమునకై దేవతలతో జగడము. ఆహా! ఎంత సొగసురా నీ కృష్ణుని కథ (37).

కృష్ణోపాసకుడు :- ఏమిరా మొరపెట్టుచున్నావు? కామియగు నీ రామునియొక్క సంగతిని కొంచెము వినుము. ఆ సీత ఎవనికూతురు చెప్పుము? ఆ రాముడు వర్ణసాంకర్యము చేసినవాడు గదా (38). శ్రీకంఠ చాపఖండన (శివ ధనుర్భంగ) ముచే శివాపరాధమును చేసినవాడు. జామదగ్న్యుడగు పరశురామునికి మానభంగము ఒనరించెను (39). ముద్గల మునీంద్రునియొక్క అనుజ్ఞనందక ఆయన ఆశ్రమమునందలి మంచితీగెలను లక్ష్మణునిచే కత్తిరింపించెను. ఎల్లప్పుడు అరణ్యవాసమే. తనకై పశువులను సంహరించెను (40) ధనుర్ధరుడై వనమున వసించుచు వన్యవస్తువులను తిని జీవించుచు, మాంసాహారుడై ఉండెను. వ్యాధకర్మరతుడు, వర్షసీతాతప ప్రపీడితుడు (41).

**పాదగామీ చర్మవాసా జటావల్కలవాన్నఖీ ।**
**శ్మశ్రుధారీ తరుచ్ఛాయాశ్రయీ పాత్రవివర్జితః ॥ 42**

**రాక్షసేన హృతా పత్నీ తవ రామస్య కాననే ।**
**పత్న్యర్థం హి కృతః శోకస్తథా దాస్యా ప్రపూజితః ॥ 43**

**రామోపాసక ఉవాచ**

**రామేణ మోచితా పత్నీ కృతా చ్ఛాయామయీ పురా ।**
**న సా దాసీ తు శబరీ మునిసేవనతత్పరా ॥ 44**

జీవన్ముక్తా తత్కృపయా మోక్షమాప శుచివ్రతా ।
తవ కృష్ణస్య తాః పత్నీర్భోక్ష్యంత్యద్యాపి శత్రవః ॥ 45

జిత్వాఽర్జునం బలాదేవ హృతాః పూర్వం సహస్రశః ।
స్త్రీజితశ్చ స్త్రియా దత్తః త్రయక్రీతశ్చ నారదాత్ ॥ 46

సర్వాసాం కామపూర్త్యర్థం నిశి నిద్రావివర్జితః ।
బంధుభ్యాం గోపికా భుక్తా మాతృతుల్య వయోధికాః ॥ 47

కృష్ణోపాసక ఉవాచ

బంధునా తవ రామశ్చ పశుభీత్యా న నిద్రితః ।
బంధుపత్న్యర్పితా తారా సుగ్రీవాయ యథాసుఖమ్ ॥ 48

వానరైశ్చ కృతా మైత్రీ స్పర్శితం దుందుభేః శవమ్ ।
నిరర్థకం హతో వాలీ సాహాయ్యం వానరైః కృతమ్ ॥ 49

వానరో యస్య వై యానం వృథా తాలా విదారితాః ।
సాగరో రోధితో యేన లంకా సా జ్వాలితా వరా ॥ 50

రామోపాసక ఉవాచ

దరిద్రేణ సుదామ్నా తే కృష్ణేన మైత్రికీ కృతా ।
న జ్ఞేయా వానరాస్తేఽపి సర్వే వేదాంశ రూపిణః ॥ 51

పాదచారియైనవాడు, చర్మమును కప్పికొనినవాడు, జటా వల్కల నఖములుగలవాడై చెట్లనీడలలో విశ్రాంతినందుచు, నీళ్ళకుకూడా ఒకపాత్రలేకయుండెను (42). నీ రాముని పత్నిని అరణ్యమున రావణుడు అపహరించెను. భార్యకై కండ్లార ఏడ్చిఏడ్చి, దాసియగుదానిచే సత్కరింపబడెనట. ఎంతఘనత! (43).

రామోపాసకుడు :– మునుపు రామునిచే విడువబడిన పత్ని ఛాయామయియైనది. అది దాసికాదు. మునిసేవాపరాయణయగు శబరియను భగవద్భక్తురాలు (44). జీవన్ముక్తయగు ఆమె శ్రీరామచంద్ర స్వామి యొక్క అనుగ్రహముచే మోక్షమునందెను. ఆమెగదా పరిశుద్ధాచరణ గలది. ఆమె దాసి ఎట్లగును?

నీ కృష్ణునియొక్క ఆ పత్నులందరిని ఇప్పటికిని శత్రువులు అనుభవించుచున్నారు గదా (45). ఆహా! వారు అర్జునుని జయించి, ఖలులు బలత్కారముగా వేలకొలది వనితామణులను కొల్లగొట్టికొనిపోలేదా! మరియు నీ కృష్ణుడు స్త్రీలచే జయింపబడినవాడు. స్త్రీ చే దానము చేయబడి, మరల నారదునిచే క్రయమిచ్చి కొనబడినవాడు (46). అందరి కామపూర్తికొరకు రాత్రియంతయు నిద్రచెడి చుట్టినఘనుడు. తన బంధువులను, గోపికలను వయోధికలై తల్లులవంటి వాండ్రుగా ఉన్న వారైనను గ్రామ్యసుఖక్రీడలతో వారిననుభవించెను. ఆహా ఏమనవచ్చును (47)

కృష్ణోపాసకుడు :- తమ్ముడైన లక్ష్మణుడును, నీ రాముడును పశుభీతిచే నిద్రపోచాలకపోయిరి. అన్నయైన వాలి భార్యయగు తారను తమ్ముడగు సుగ్రీవునికి యథేచ్ఛముగా అనుభవింపుమని యిచ్చెను (48). కోతులతో చెలిమిచేసెను. దుందుభియొక్క కుణకముకంటెను వ్యర్థముగా వాలిని చంపెను. వానరులయొక్క సహాయమునందెను (49). కోతినెక్కి తిరిగెను. నిరర్థకముగా తాళవృక్షములు(తాటిచెట్లు) కత్తిరింపబడెను. సముద్రము నిరోధింపబడెను. మేలైన లంకానగరము కాల్చబడెను. (50).

రామోపాసకుడు :- దరిద్రుడైన కుచేలునితో నీ కృష్ణుడు స్నేహముచేసెను. నా రామునియొక్క దూతలగు కోతులను కోతులుగా ఎంచవలదు. అందరును వేదాంశరూపులే (51).

**కాపట్యేన హతో యేన జరాసంధో నిరర్థకః ।**
**సాహాయ్యం సర్వదా యస్య కృతం గోపైర్వ్రజే వనే ॥ 52**

**గోపాలస్య కృతం యానం క్రీడనం సర్వదా వనే ।**
**జ్వలితా యేన సా కాశీ సుహృద్రుక్మీ విరూపితః ॥ 53**

**శివభక్తేన సమరః కృతో బాణేన సాదరమ్ ।**
**శివేనాపి కృతం యుద్ధం చైద్యేన నిందతో ముహుః ॥ 54**

**పరైః పౌత్రౌ జితౌ యస్య యేన స్త్రీణాం పరస్పరమ్ ।**
**కృతా విషమతా చాత్ర పారిజాతార్పణాదిభిః ॥ 55**

**కృష్ణోపాసక ఉవాచ**
**తవాపి రామపుత్రేణ సుహృద్బద్ధో రణే జితః ।**
**శివభక్తదశాస్యేన రామేణ సంగరః కృతః ॥ 56**

**ద్విజహత్యా కృతా యేన మునినా నిందితోఽపి యః ।**
**తథా మిత్రం జితోయస్య బంధుజేన విభీషణః ॥ 57**

**పరగేహస్థితా పత్నీ పునర్యేనాశ్రితా సుఖమ్ ।**
**నైష్ఠుర్యం చ కృతం పత్న్యాం స్త్రీణాం కామా న పూరితాః ॥ 58**

**యానారూఢా కృతా యాత్రా వేశ్యాః స్పృష్టాస్తథా రహః ।**
**పతివ్రతాయాం సీతాయాం దోషారోపః కృతోఽపి చ ॥ 59**

నీ కృష్ణునిచే వంచనలో వ్యర్థముగా జరాసంధుడు సంహరింపబడెను. గొల్లపల్లెలోను, వనమునను, గోపాలకులచే సహాయము పొందెను (52). గొల్లచిన్నవానిమీద ఎక్కి నిరంతరము క్రీడించెను. కాశీనగరమునకు చిచ్చుపెట్టెను. మంచిమనస్సుగల రుక్మిణిని వికృతునిజేసెను (53). శివభక్తుడగు బాణునితోడ సాదరముగా జగడమాడెను. శివునితోను యుద్ధముజేసెను. శిశుపాలుని నిందలను పలుమార్లు వినెను (54). శత్రువులచే మనుమడు జయింపబడెను. మరి మీ కృష్ణుడు పారిజాత అర్పణాదులచేత పరస్పరము పణతులలో వైషమ్యమును చూపెను (55).

కృష్ణోపాసకుడు :- నీ రామపుత్రునిచే మిత్రుడు బంధింపబడెను. రణమున జితుడయ్యె. శివభక్తుడగు రావణునితో రాముడు యుద్ధముజేసెను (56). కావుననే బ్రహ్మహత్యచేసినవాడు అయ్యె. అందువలననే మునీంద్రునిచే నిందింపబడెను. తమ్మునికొడుకు మిత్రుడగు విభీషణుని జయించెను (57). పరుని ఇంటనున్న పణతిని తెచ్చి, పరమానందముతో మరల చేర్చికొనెను. పత్నియందు నిష్ఠురములాడెను. స్త్రీలు కామినులై రాగా వారి కామమును పూర్తిజేయలేదు (58). వేశ్యలచే అంటబడియుండెను. విమానమునెక్కి రహస్యముగా యాత్రలను ఆచరించెను. పతివ్రతయగు సీతాదేవియందు దోషమును ఆరోపించి, నిందితుడయ్యె (59).

**పుత్రం హంతుం కృతా చాజ్ఞా శూద్రసింహవధౌ కృతౌ ।**
**పత్నీసక్తాఽఽశ్రితా యేన యస్యాజ్ఞా పాలితా నృపైః ॥ 60**

**రామోపాసక ఉవాచ**

**అంతే కృష్ణస్య తే శాపాద్వంశచ్ఛేదో హ్యభూద్ ద్విజ ।**
**అబ్ధినా లోపితా యస్య నగరీ ద్వారకా శుభా ॥ 61**

**స్వగోత్రస్య వధస్త్వంతే మద్యపానాది యత్కులే ।**
**దర్శనం హ్యర్జునాయాంతే యేన మిత్రాయ నార్పితమ్ ॥ 62**

**స్వస్థానం గమనం యేన కృతమేకాకినా తథా ।**
**స క్షతోఽపి కృతస్త్వంతే వ్యాధేనాల్పేన పక్షిణా ॥ 63**

కృష్ణోపాసక ఉవాచ

తవ రామేణ సమరః పుత్రేణాపి కృతో మహాన్ ।
తథా సీతా మయా త్యక్తా చేతి లోకాం ప్రతార్థ చ ॥ 64

వాల్మీకేరాశ్రమం గత్వా దృష్ట్వా సీతాసుతౌ రహః ।
పిణ్యాకేన తథేంగుద్యా పిండదానాదికం కృతమ్ ॥ 65

దండకే తవ రామేణ స్వపిత్రే భ్రమతాఽర్పితమ్ ।
తథైరావణభుక్తాయాః స్పృష్టః స మంచకాః స్థలే ॥ 66

తథాఽశ్వత్థచ్ఛేదనార్థం మహాన్ యజ్ఞః కృతో ముహుః ।
స్వమంత్రిణశ్చ శేషాయుః పూర్త్యర్థం సంగరోఽపి చ ॥ 67

కారితో మయరాజేన పూర్వజేన లవాదిభిః ।
పుష్పాస్వాదనమాత్రాదిపత్న్యాః శిక్షా తథా కృతా ॥ 68

మమ కృష్ణేన బాలత్వే లీలయా పూతనా హతా ।
హతాస్తృణాసురాద్యాశ్చ ధృతోఽంగుల్యా గిరిస్తథా ॥ 69

తన కుమారుని చంపుటకుకూడా ఆజ్ఞనిచ్చెను. తాను నిజాజ్ఞచే రాజులను పాలించువాడై అనుకూలయగు పత్నిని ఆశ్రయించినవాడై యుండినను శూద్రసింహావధలను ఆచరించెను (60).

రామోపాసకుడు :- ఓరి విప్రుడా! నీ కృష్ణునికి చివరలో శాపమునుండి వంశచ్ఛేదమయినదే! ద్వారకయను మంగళనగరము సముద్రములో మునిగిపోయెనే (61). మద్యపానముచే స్వవంశ నాశనము చేయబడెను. తన మిత్రుడనయిన పాండుపుత్రునికి చివరలో దర్శనమునివ్వకపోయెనె (62). ఒంటరిగా తానొక్కడే నిజధామమునకు వెడలెనే. కడపట బోయవాడు ఒక బాణముతో కొట్టగా ఆ దెబ్బను స్వీకరించెను కదా? (63)

కృష్ణోపాసకుడు :- నీ రాముడు తన కొడుకుతోడనే గొప్ప యుద్ధముజెసెను. సీతను నేను విడిచితినని లోకులను వంచించి (64), వాల్మీకి ఆశ్రమమునకు రహస్యముగా పోయి, కుమారులను జూచెను. ఇంగుదీపిణ్యాకాదులచే (రేగుపండ్ల పిండిచే) పిండదానాదులనొసగి, అరణ్యమున తన తండ్రికి శ్రాద్ధకర్మలను ఆచరించెను. అట్లే రావణుని మంచముమీద వానిచే అనుభవింపబడిన

దానినుండి యంటబడెను (65, 66). అట్లే అశ్వత్థచ్ఛేదనమునకై పలుమార్లు గొప్పయజ్ఞములను ఆచరించెను. ఆయుర్బలము తీరిన తన మంత్రిని బ్రతికించుటకై (67), యమధర్మరాజుతో యుద్ధముజేసెను. తమ్మునిచే లవాదులతో పుష్పాస్వాదనమాత్రాదిగా పత్నికి శిక్షచేయబడెను (68).

మా కృష్ణుడు బాల్యమున వినోదముగా పూతనను చంపెను. తృణాసురాదులను సంహరించెను. లీలచే తన వ్రేలిమీద కొండను ధరించెను (69).

**రామోపాసక ఉవాచ**

**మమ రామేణ బాలత్వే లీలయా తాటికా హతా ।**
**మారీచాద్యా హతాశ్చాపి పర్వతాస్తారితా జలే ॥ 70**

**కృష్ణోపాసక ఉవాచ**

**మమ కృష్ణస్వరూపేణ గోపికా మోహితా వ్రజే ।**
**మోహితా రాధికా శ్రేష్ఠా మదనస్యాపి మోహినీ ॥ 71**

**రామోపాసక ఉవాచ**

**మమ రామేణ దేవానా మోహితాః స్వీయరూపతః ।**
**దేవపత్న్యో రహో రాత్రౌ మాతృతుల్యా విచింతితాః ॥ 72**

**తాః కృతార్థాః స్వవరాద్యతో జాతాస్తు గోపికాః ।**
**తాంబూలోచ్ఛిష్టస్వరసం దాసీ రామస్య భక్తితః ॥ 73**

**పీత్వా యస్యైవ వరతో వ్రజే సా రాధికా హ్యభూత్ ।**
**అతో మే రాఘవో ధన్యో యస్యైకా దయితాఽత్ర హి ॥ 74**

**కృష్ణోపాసక ఉవాచ**

**మమ కృష్ణేన పత్న్యశ్చ సహస్రాణి హి షోడశ ।**
**సాష్టోత్తరశతాన్యత్రోద్వాహితాశ్చ విధానతః ॥ 75**

**రామోపాసక ఉవాచ**

**మమ రామస్వరూపేణ సర్వాస్తా మోహితాః స్త్రియః ।**
**మాతృవన్మోహితాస్తేన వీరేణ పురుషార్థినా ॥ 76**

**కృష్ణేన రతికామేన మోహితా గోపికాః స్త్రియః ।**

**కృష్ణోపాసక ఉవాచ**

**గజేంద్రో మమ కృష్ణేన లీలయా నిహతో ద్విజ ॥ 77**

రామోపాసకుడు :- మా రాముడు బాల్యమున లీలావినోదముగా తాటకను సంహరించెను. మారీచాదులను మర్దించెను. నీటిలో కొండలను తేలునట్లు నిలిపెను (70).

కృష్ణోపాసకుడు :- నా కృష్ణస్వరూపముచే వ్రజమున గోపికలందరు మహాక్రాంతులైరి. మన్మథమోహినియగు రాధిక కూడా మా కృష్ణుని మోహించెను (71).

రామోపాసకుడు :- మా రామునిని దేవతలయొక్క పత్నులు రాత్రిలో రహస్యముగా వచ్చి దివ్యాంగ సౌందర్యమును జూచి మోహించిరి. అయిననేమి? వారిని పరకాంతలని తల్లులవలె ఎంచెను (72). మరి మా రాముడు వారి కామమును పూర్తికావలెననియే గోపికలుగా అవతరించునట్లు వరమిచ్చి, కృతార్థులను జేసెను. ఒక దాసి మా రామునియొక్క తాంబూల తమ్మరసమును భక్తితో (73) ఆస్వాదించి, ఆనందించినందున నా దేవదేవుని వరమువలననే వ్రజమున రాధికగా అవతరించెను కదా? ఏకపత్నీవ్రతుడయిన మా రామునికి ఒక్క జానకీదేవియే ప్రేయసీమణి గాన రాముడే ధన్యుడు (74).

కృష్ణోపాసకుడు :- మా కృష్ణుడు క్రమమున విధివిధానమును అనుసరించియే వేలమందికి పైన 108 మందిని వివాహమాడిన పురుషోత్తముడు గదా!(75).

రామోపాసకుడు :- మా రాముని దివ్యాంగ సౌందర్యమును చూచి, మోహించిన వారలేగదా వారు? పురుషోత్తముడును శూరాగ్రేసరుడును అతడేకావున పరకాంతలను తల్లులవలె చింతించి పరిత్యజించెను (76). మీ కృష్ణుడు రతికాముకుడు కావున ఆ గోపికాంగనలనందరిన మోహించి, కామకేళి నిమగ్నుడయ్యె.

కృష్ణోపాసకుడు :- విప్రుడా! మా కృష్ణుడు గజశ్రేష్ఠమును లీలావినోదముగా సంహరించెను (77).

**రామోపాసక ఉవాచ**

**మమ రామేణ నాగేంద్రరిపురష్టాపదో హతః ।**

**కృష్ణోపాసక ఉవాచ**

**మమ కృష్ణప్రతాపేన యమునా ఖండితా త్వభూత్ ॥ 78**

రామోపాసక ఉవాచ
మమ రామప్రతాపేన ఖండితా జాహ్నవీ త్వభూత్ ।
కృష్ణోపాసక ఉవాచ
మమకృష్ణేన వై స్వర్గాదానీతః సురపాదపః ॥ **79**

రామోపాసక ఉవాచ
మమ రామేణ వైస్వర్గాదానీతౌ సురపాదపౌ ।
కృష్ణోపాసక ఉవాచ
మమ కృష్ణేన స్వగురోర్మాతుశ్చాపి సుతా మృతాః ॥ **80**

సుజీవితాః సమానీతాః సప్త తాభ్యాం నివేదితాః ।
రామోపాసక ఉవాచ
మమ రామేణ సాకేతే సప్త మర్త్యాః సుజీవితాః ॥ **81**

కృష్ణోపాసక ఉవాచ
మమ కృష్ణేన పౌరుష్యాద్విప్రస్య జీవితాః సుతాః ।
రామోపాసక ఉవాచ
మమ రామేణ సచివః సుమంత్రో జీవితః పునః ॥ **82**

కృష్ణోపాసక ఉవాచ
మమ కృష్ణేన ద్రౌపద్యాః సంధితం హి ఫలం తరౌ ।
రామోపాసక ఉవాచ
మమ రామేణ వైదేహ్యాః సంధితం తులసీదళమ్ ॥ **83**

రామో పాసకుడు :– ఓరి! అదియొక గొప్పనా; మా రాముడు నాగేంద్రశత్రువయిన అష్టాపద సింహమును సంహరించెను గదరా!

కృష్ణో పాసకుడు :– మా కృష్ణుని ప్రతాపమువలన యమునానది రెండు ఖండములుగా ఖండింపబడినది (78)

రామోపాసకుడు :– ఓరీ! మా రాముని ప్రతాపమువలన గంగానదియే ఖండింపబడినదోయి.

కృష్ణోపాసకుడు :– మా కృష్ణుడు స్వర్గమునుండి రెండు సురవృక్షములను తెచ్చెను (79).

రామోపాసకుడు :– మా రామునిచేత గదా స్వర్గమునుండి పారిజాత, కల్ప వృక్షములు తీసుకు రాబడినది?

కృష్ణోపాసకుడు :– మా కృష్ణుడు తన గురువైన సాందీపునికి, తన తల్లికిని కుమారులు మరణించగా (80). వారి నేడుగురిని తీసుకువచ్చి, వారికి నమస్కరించెను

రామోపాసకుడు :– మా రాముడు సాకేతమున ఏడుగురు మానవులను బ్రతికించెను (81).

కృష్ణోపాసకుడు :– మా శ్రీకృష్ణుడు నిజపౌరుష శక్తిచేతనే బ్రాహ్మణ పుత్రులను బ్రతికించి యిచ్చెను

రామోపాసకుడు :– మా రాముడు మరల మంత్రియగు సుమంత్రునిని బ్రతికించెను (82).

కృష్ణోపాసకుడు :– మా కృష్ణుని మహిమ వలన గదా ద్రౌపదీదేవిచే వృక్షమునందు ఫలము సంధింపబడెను.

రామోపాసకుడు :– మా రాముని మహిమవలన జానకీదేవిచే తులసీవృక్షమున దళము చేర్పబడినది (83).

**కృష్ణోపాసక ఉవాచ**
**మమ కృష్ణప్రతాపశ్చ జనాన్సందర్శితః పురా ।**
**దుర్వాససాఽన్నయాజ్ఞా సా గోపికానాం కృతా వృజే ॥ 84**

**రామోపాసక ఉవాచ**
**మమ రామప్రతాపశ్చ జనాన్ సందర్శితః పురా ।**
**దుర్వాససాఽన్నయాజ్ఞా సా కృతా రామస్య తత్పురి ॥ 85**

**కృష్ణోపాసక ఉవాచ**
**మమ కృష్ణేన రూపాణి బహూన్యజ్ఞ కృతాని హి ।**
**రామోపాసక ఉవాచ**
**బహూని రాఘవేణాపి స్వరూపాణి కృతాని హి ॥ 86**

**కృష్ణోపాసక ఉవాచ**
**మమ కృష్ణేన మిత్రాయ దత్తం స్వర్ణమయం పురమ్ ।**
**రామోపాసక ఉవాచ**
**మమ రామేణ మిత్రాయ దత్తా స్వర్ణమయీ పురీమ్ ॥ 87**

కృష్ణోపాసక ఉవాచ
సూర్యగ్రహే కురుక్షేత్రే స్నానం కృష్ణేన మే కృతమ్ ।
రామోపాసక ఉవాచ
సూర్యగ్రహే కురుక్షేత్రే రామేణాప్యవగాహితమ్ ॥ **88**

మే రామస్య వచశ్చైకం సత్యమేవ చ నాన్యథా ।
తే కృష్ణస్య హ్యనేకాని వచనాన్యనృతాని హి ॥ **89**

రామస్య మే శరస్త్వేకః శత్రునిర్దలనక్షమః ।
విఫలాస్తవ కృష్ణస్య బహవోఽరిషు మార్గణాః ॥ **90**

ఏకా స్త్రీ మమ రామస్య తే కృష్ణస్య బహుస్త్రియః ।
పత్న్యాః శయ్యాం వినాం నాన్యా శయ్యా రామస్య వై మమ ॥ **91**

కృష్ణోపాసకుడు :- మా శ్రీకృష్ణుని ప్రాభవము, గోపికలయెదుట దుర్వాసమహర్షి అన్నమును యాచించినపుడు సమస్తలోకులచేతను చూడబడెను (84).

రామోపాసకుడు :- మా రాముని సామర్థ్యమును, అయోధ్యలో ఆ దుర్వాసమునీంద్రుడు శిష్య పరివారముతో వచ్చి అన్నమును యాచించినపుడు లోకులు చక్కగా ఎరిగిరి (85).

కృష్ణోపాసకుడు :- మా శ్రీకృష్ణుని ఇచ్చట అనేకరూపములు చూపించబడినవి .

రామోపాసకుడు :- మా రామునిచేత బహుస్వరూపములు లోకమునకు ఆశ్చర్యకరముగా చూపబడెను (86).

కృష్ణోపాసకుడు :- మా కృష్ణుడు తన మిత్రునికి కనకమయమైన దివ్యనగరము నొసగెను (87).

రామోపాసకుడు :- రాముడు తనమిత్రునికి సువర్ణమయమైన పట్టణమును అనుగ్రహించి ఇచ్చెను.

కృష్ణోపాసకుడు :- మా కృష్ణుడు కురుక్షేత్రమున సూర్యగ్రహణ సమయమున స్నానము చేసెను.

రామోపాసకుడు :- మా రాముడు అంతకమునుపే కురుక్షేత్రమున సూర్యోపరాగ పుణ్యకాలమున స్నానక్రియలు ఒనర్చెను (88). మరి వినుము....

విప్రుడా! మా రామునికి మాట ఒక్కటియే. అది సత్య పరిపూతమైనది. ఆ మాట యెన్నటికి మారదు. మీ కృష్ణునికి అనృతవచనములు అనేకములు (89). మరియు మా రామునికి బాణమును ఒక్కటియే. అది సమస్త శత్రునిర్మూలనదక్షమై ఒప్పుచున్నది. నీ కృష్ణునికి శత్రువులమీద ప్రయోగించునట్టి బాణములు వ్యర్థములగునవి ఎన్నియో లెక్కలేదు (90). నా రామునికి ఒక్కటే భార్య. నీ కృష్ణునికి అనేకమంది స్త్రీలు పత్నులైరి. మా రామునికి పత్నియొక్క పాన్పుతప్ప తక్కిన పరుపులేదు (91).

స్త్రీణాం శయ్యాం వినా వహ్నిః శయ్యా కృష్ణస్య తే ద్విజ ।
రామస్థితిర్మధ్యదేశే సాకేతే సరయూతటే ॥ 92

అబ్ధేస్తటే పశ్చిమే తే స్థితిః కృష్ణస్య వై తవ ।
బంధుత్రయం మే రామస్య కృష్ణస్యైకోఽగ్రజస్తవ ॥ 93

గౌర్మణిః పుష్పకం వృక్షౌ కటకే మునినాఽర్పితే ।
ఐరావతకులోద్భూతశ్చతుర్దంతో గజోఽపి చ ॥ 94

ఏతాని మమ రామస్య నవ రత్నాని సంతి హి ।
మణిద్వయం పారిజాతస్త్వితి రత్నత్రయం తవ ॥ 95

కృష్ణస్య సంతి భో విప్ర త్వం తం స్తౌషి కథం వృథా ।
సప్తద్వీపేశ్వరో రామో మమ పృథ్వీశవందితః ॥ 96

ఈశత్వం జగదీశత్వం సమమేవ ద్వయం స్మృతమ్ ।
అతో న మమ రామేణ తుల్యం కృష్ణం విచింతయ ॥ 97

యస్య చాపం హి కోదండం యస్యాక్షయ్యాః పతత్రిణః ।
విప్రేష్టపూరణం యస్య వ్రతం నిత్య ద్విజోత్తమ ॥ 98
యస్య సింహాసనం ఛత్రం వ్యజనం చామరద్వయమ్ ।
యస్య యానం పుష్పకం తత్సుపుత్రౌ తౌ పితుః సమౌ ॥ 99

అద్యాపి పాల్యతే యస్య దత్తం దానం ద్విజోత్తమాన్ ।
రామనాథపురస్యైవ రాజ్యం రామస్య మే నృపైః ॥ 100

తవ కృష్ణేన కిం దత్తం వద యద్వర్తతేఽధునా ।
కరోత్యహర్నిశం శంభుశ్చాపి మే రామచింతనమ్ ॥ 101

నీ కృష్ణునికి పణతుల పాన్పులుగాక, వేరుపరుపులు ఎన్నియో గలవు. మా రామునికి సరయూ తీరమునందు అయోధ్యలో శ్రీరామునికి భూమధ్య దేశ నివాసము (92). నీ కృష్ణునికి పశ్చిమదిక్కులో సముద్రతీరమున చివరిలో ఎక్కడనో ఒకమూలలో వాసము. నా రామునికి ముగ్గురుతమ్ములు గలరు. నీ కృష్ణునికి ఒక అన్నయట (93). కామధేనువు, చింతామణి, రత్నము, కౌస్తుభరత్నము,

పుష్పకవిమానము, పారిజాతము, కల్పవృక్షము, మునీంద్రుడు అర్పించిన కంకణములు రెండు, నాలుగు దంతములు కలిగిన ఐరావతమను గజేంద్రము (94). ఇట్లు రత్నములనగా శ్రేష్ఠవస్తువులు తొమ్మిదిగలవు (95). అట్టివాని నేమి యూరకే పొగడుచున్నావు. వెఱ్ఱి విప్రుడా! నా రాముడు సప్తద్వీపాధిపతియైనవాడు. సమస్తరాజేంద్రులచేతను వందింపబడినవాడు (96). ఈశ్వరత్వమును, జగదీశ్వరత్వమును, మా రామునియందు సమముగా చెప్పబడినది. అందువలన నా రామునితో నీ శ్రీకృష్ణుడు ఎన్నటికిని సముడుగాడని తలంచుము (97). నా రామునికి హరిహరకోదండమే చాపము. బాణములు అక్షయములు. బ్రాహ్మణసంతృప్తి యనునదియే నిత్య సద్వ్రతము (98). మహారాజ చిహ్నములైన దివ్యసింహాసన, ఛత్ర, చామర, వ్యజనములు గలవు. వాహనమును చూతమా పుష్పకవిమానము. పుత్రులను విచారింతుమా తండ్రితో సమానులగువారు (99). ఇప్పటికిని శ్రీరామునిచే ఇవ్వబడిన దానములను బ్రాహ్మణులు అనుభవించుచున్నారు. అట్టి మా శ్రీరాముని రామనాథపురమునకు బ్రాహ్మణాధిపత్యము కలిగియున్నది. నీ కృష్ణుడు అట్టిదానమేదియు చేసినవాడు కాదు.

**తారక మే రామనామ కాశ్యాం శంభుర్జనాన్సదా ।**
**మృత్యూన్ముఖాంస్తారణార్థం ద్విజోపదిశతి స్వయమ్ ॥ 102**

**అతఏవ జనాంశ్చాపి సర్వత్ర మరణోన్ముఖాన్ ।**
**స్వీయాన్ముహుః శిక్షయంతి ధ్యేయో రామోఽధునా త్వితి ॥ 103**

**తథాప్రాణివిమోక్షార్థం సదా తచ్ఛవవాహకైః ।**
**రామరామేతి రామేతి నామ భూమ్యాముదీర్యతే ॥ 104**

**యన్నామమహిమా చోక్తం తం స్తౌమ్యధునా ముహుః ।**
**వాల్మీకినాఽప్యత ఏవ పూర్వం తచ్చరితం కృతమ్ ॥ 105**

**శతకోటిమితం శ్రేష్ఠం యస్మిన్ రామాయణే ద్విజ ।**
**కృష్ణాదీనాం చరిత్రాణి సంతి హ్యంతర్గతాని హి ॥ 106**

**శ్రీరామదాస ఉవాచ**

**ఏవం తయోర్వివదతోర్ద్విజయోశ్చ పరస్పరమ్ ।**
**బభూవాకాశజా వాణీ తాం తౌ సర్వే చ సుశ్రువుః ॥ 107**

**రామస్యాగ్రే స్తుతిః కేషామపి కర్తుం ఘటేత న ।**
**ఇతి తాం ఖేచరీం వాణీం శ్రుత్వా సర్వే సభాసదః ॥ 108**

**చక్రుర్జయస్వనార్వ్హాస్తైర్వాదయంతి స్మ తాలికాః ।**
**తం రామోపాసకం సర్వే వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 109**

**నిర్జరా అపి తే సర్వే విమానస్థా ముదాన్వితాః ।**
**తం రామోపాసకం ప్రీత్యా వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 110**

**తదా కృష్ణోపాసకః స లజ్జయా నతమస్తకః ।**
**తం రామోపాసకం నత్వా ప్రార్థయామాస వై ముహుః ॥ 111**

**తదా రామోపాసకోఽపి తం నత్వాఽఽలింగ్య వై దృఢమ్**
**ఉవాచ మధురం వాక్యం శృణు కృష్ణ ద్విజోత్తమ ॥ 112**

**న నందసూనోః పృథగస్తి రామో**
**న రామతోఽన్యో వసుదేవసూనుః ।**
**తథాఽప్యయోధ్యాపురపాలబాలే**
**స లక్ష్మణే ధావతి మే మనీషా ॥ 113**

రాత్రింబగళ్ళును, పరమేశ్వరుడు మారామునినే చింతించుచున్నాడు (101) మా రాముని నామమే తారక నామము. ఓరి బ్రాహ్మణుడా! వినుము కాశీనగరములో మరణోన్ముఖులగు ప్రాణులందరికిని సద్గతి కలుగుటకై సాక్షాత్ శివుడే ఈ రామ నామమును తానుగా ఉపదేశించుచున్నాడు (102) అందువల్లనే జనులందరును మోక్షేచ్ఛగల తమవారినందరిని "ఇప్పుడు రాముడే గతి. వానినే ధ్యానింప వలయును" అని బలాత్కారముతో ప్రేరేపించుచున్నారు (103). అట్లే ప్రాణికి సద్గతి కలుగవలయును అని ఆ ప్రాణియొక్క పాడెను మోసికొనిపోవువారు రామ! రామ! రామ! అని ముమ్మారుగా తన్నామమును పఠించుచున్నారు (104). ఆ నామమహిమ ఇట్లుండగా, పలుమార్లు నేను ఆ లీలామానుష విగ్రహుడగు స్వామిని ఏమని ఎట్లు వర్ణింపగలను? ఓయి బ్రాహ్మణుడా! అందువల్లనే వాల్మీకిమహర్షి ఆ శ్రీరామచరిత్రను శతకోటి (నూరుకోట్ల శ్లోకములలో)ప్రవిస్తరముగా రామాయణమనే గొప్ప గ్రంథమును రచించెను. కృష్ణాదులయొక్క చరిత్రలన్నియును దానిలోనే అంతర్భేదములైయున్నవి (105, 106).

## శ్రీరామ-శ్రీకృష్ణుల అభేదవర్ణనము.

అని ఇట్లు కృష్ణోపాసక, రామోపాసకు లిరువురును పరస్పరము వివాదము చేయుచుండగా గగనాన ఆకాశవాణి ఒకటి వినబడెను. దానిని సభికులందరును వినిరి (107). అది "శ్రీరాముని ఎదుట ఎవరినిగాని స్తుతించుటకు అలవిగాదు," అని అశరీరవాణిని వినిన సభాసీనులందరును (108) జయజయ ధ్వనులతోను, కరతాళములతోను గొప్ప కోలాహలముగావించిరి. గగనమున విమానారూఢులైన దేవతలందరును ఆనందమునంది, ఆ రామోపాసనకునిమీద పూలవాన కురిపించిరి. అపుడు కృష్ణోపాసకుడు లజ్జాభారముచే తలవంచుకుని (119,110), ఆ రామోపాసకునికి నమస్కరించి, పలుమార్లు ప్రార్థించుచుండెను. అప్పుడు రామోపాసకుడును కృష్ణోపాసకునికి నమస్కరించి, ఆలింగించికొని, "వినుమోయి విప్రవర్యా! (111) నందనందనుడగు కృష్ణుని కన్నను శ్రీరాముడు వేరుగాలేడు. దశరథనందనుడగు రామునికన్నను శ్రీకృష్ణుడు వేరుగాలేడు. వాడేవీడు-వీడేవాడు. అట్లయినను అయోధ్యాపురము నేలిన వాడును, లక్ష్మణ సహచరుడయిన వాడును అగు శ్రీబాల రామమూర్తి యందు నా మనస్సు నిమగ్నమగుచున్నది (112). అందువలన నీ అసూయచేత నేను కృష్ణుని నిందించి, శ్రీరామునికి వందనమును చేసితిని. వారిరువురును ఒక్కటేయని నేను బాగుగా ఎఱుగుదును (113).

**అతః స్తుతో మయా రామః కృష్ణస్య నిందనం కృతమ్ ।**
**తవేష్యయా ద్విజశ్రేష్ఠ వేద్మి తౌ ద్వౌ సమావితి ॥ 114**

**రామ ఏవాత్ర కృష్ణశ్చ కృష్ణ ఏవాత్ర రాఘవః ।**
**ఉభయోర్నాంతర విప్ర కౌతుకాచ్చ మయేరితమ్ ॥ 115**

**మానయత్యంతరం యో నా తయోః శ్రీరామకృష్ణయోః ।**
**పరస్పరం స నిరయే పతిష్యతి న సంశయః ।**
**త్వద్గర్వపరిహారార్థం ఖేచర్యా రాఘవః సుతః ॥ 116**

**ఇత్యుక్త్వా సాంత్వయిత్వా తం రామః కృష్ణాహ్వయం ద్విజమ్ ।**
**తూష్ణీం తస్థౌ సభామధ్యే సభాసద్భిః సుపూజితః ॥ 117**

**తతస్తౌ మాఘమాసాంతే స్వం స్వం దేశం ప్రజగ్మతుః ।**
**తస్మాచ్ఛిష్యావతారేషు న రామసదృశః పరః ॥ 118**

**అతస్తం భజ భావేన తస్యైవ చరితం శృణు ।**
**యదన్యద్వర్ణయామ్యగ్రే మహామంగళకారకమ్ ॥ 119**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, శ్రీరామకృష్ణోపాసకయోర్వివాదో నామ, తృతీయః సర్గః ॥**

కృష్ణుడే ఇచ్చట రాముడు. రాముడే ఇచ్చట కృష్ణుడు. ఇరువురికిని భేదమే లేదు. నేను వినోదముగా చెప్పితిని (114). ఆ రామ-కృష్ణులకు ఏ మానవుడు భేదమునెంచునో వాడు నిస్సంశయముగా నరకము పొందుచున్నాడు (115). నీ గర్వ పరిహారమునకై ఆ ఆకాశవాణి ఇట్లు రామునే స్తుతించెను", అని చెప్పి కృష్ణోపాసకుని పలుమార్లు సమాధానపరచి, శ్రీరామోపాసకుడు సభాసదులచే చక్కగా పూజింపబడి, ఊరకే కూర్చుండెను (116). అంత అందరును

మాఘమాసము ముగిసిన తరువాత తమతమ ప్రాంతములకు వెళ్ళిరి. కావున ఓయి శిష్యుడవగు విష్ణుదాసా! వినుము! అవతారములలో రామావతారమునకు మించినది లేదు (117). కావున నీవు అతనినే భావించుచు కృతార్థుడవగుము. ఆ శ్రీరామ దివ్యచరితామృతమునే కర్ణానందముగా వినుము. మంగళకరమైన ఆ దివ్య చరితము ఎట్టిదో అభివర్ణించెదనని (118) శ్రీరామదాసు ఇట్లు నిరూపించు చున్నాడు.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, పూర్వార్ధములో, శ్రీరామ-శ్రీకృష్ణ ఉపాసకుల వివాదమును వర్ణించు 3వ సర్గ ముగిసినది.**

# చతుర్థః సర్గః-4వ సర్గ

శతనారీవరప్రదానము, మూలకాసుర ఆఖ్యానము.

శ్రీరామదాస ఉవాచ

ఏకదా రాఘవః శిష్య సభాసంస్థో జనైర్వృతః ।
దదర్శ ద్రాక్షావల్లీనాం మంటపే కాకముత్తమమ్ ॥ 1

ఉభయోర్నేత్రయోరేకనేత్రమూర్తిసమన్వితమ్ ।
అతిదీనం కృశం వ్యగ్రదృష్టిం దీర్ఘస్వరం చలన్ ॥ 2

ముహుర్ముహుశ్చ పశ్యంతమాత్మానం శబ్దపూర్వకమ్ ।
తం దృష్ట్వా తత్కృపావిష్టః స్మృత్వా క్రోధం పురా కృతమ్ ॥ 3

ఉవాచ కాకం శ్రీరామః సుఖమాగచ్ఛ మేఽన్తికమ్ ।
తద్రామవచనం శ్రుత్వా ద్రాక్షావల్ల్యాశ్చ మంటపాత్ ॥ 4

శీఘ్రముడ్డీయ కాకస్తు రామాగ్రే సదసిస్థితః ।
రామం పశ్యన్ దీర్ఘరవం స చకార ముహుర్ముహుః ॥ 5

తదా తం రాఘవః ప్రాహ తత్కృపావిష్టమానసః ।
నేత్రం వినా వరానాన్యాన్ కాక యాచస్వ మాం ప్రతి ॥ 6

తద్రామవచనం శ్రుత్వా కాకః ప్రాహావనీపతిమ్ ।
కృపావలోకనం రామ మయ్యస్తు తవ సర్వదా ॥ 7

కిం వరైరితరైర్వ్యర్థైరిహైవ సుఖదాయకైః ।
తత్కాకవచనం శ్రుత్వా రామస్తం వాక్యమబ్రవీత్ ॥ 8

ద్వీపాంతరేషు యద్వృత్తం భవిష్యం భూతమేవ చ ।
వర్తమానం చ సకలం త్వన్నేత్రవిషయేఽస్తు తత్ ॥ 9

భావికార్యాణి సర్వాణి కాక త్వం వేత్సి మద్వరాత్ ।
జనాః పశ్యంతు తే గత్యా శకునాంశ్చ నిరంతరమ్ ॥ 10

స్థిరత్వే స్థిరకార్యాణి గతే త్వయ్యతిసత్వరమ్ ।
భవిష్యంతి హి కార్యాణి నరాణాం శకునం త్వితి ॥ 11

పశ్యంతు సకలా భూమౌ జనాః కార్యప్రసిద్ధయే ।
గ్రామే గృహప్రవేశే తే వామభాగే న చేద్గతిః ॥ 12

గమనే దక్షిణే భాగే యది తే గమనం తదా ।
లోకానామస్తు శకునం మహామంగళకారకమ్ ॥ 13

ప్రేతదశాహపిండాయ యది స్పర్శో భవేన్న తే ।
మాఽస్తు తర్హి గతిస్తేషాం ప్రేతానాం మమ వాక్యతః ॥ 14

శ్రీరామదాసు చెప్పుచున్నాడు. "శిష్యుడా! వినుము, శ్రీరామచంద్రుడు ఒకప్పుడు సకల పరివారముతో సభను అలంకరించి ఉండగా, దూరమున ఉండిన ద్రాక్షాలతా మంటపమున రెండుకండ్లకును ఒకటే కనుపాప కలిగినదియు, కృశించినదియును, వెరచుచుండు చూపుగలదియును, దైన్యముతో నిడుపుగా మొరపెట్టునదియు ఐన ఒక కాకిని (2), పలుమార్లు తన్నే చూచుచూ శబ్దము చేయుచుండగా దానిని చూచెను. అపుడు రాముడు దానిని చూచి, మునుపు తాను కోపావిష్టుడైన వృత్తాంతమును స్మరించి ఆ కాకిని జూచి (3) సుఖముగా "నావద్దకు రమ్ము" అని పలకరించెను. అంత ఆ కాకి రామవాక్యమును వినగానే ద్రాక్షామంటపమునుండి (4) ఎగిరివచ్చి, శ్రీరామ సన్నిధానమున నిలచెను. మరి రాముని జూచి, పలుమార్లు దీర్ఘనాదములను ఆచరించెను (5). అపుడు శ్రీరాముడు దయార్ద్రహృదయుడై, "ఓయి కాకీ! కన్నుతప్ప తక్కిన వరములను ఏవైనను ఆపేక్షింపుము. నేనిచ్చెదను," అని అనుగ్రహించెను (6). ఆ రామవాక్యమునకు కాకి, "నీ కరుణాకటాక్షము నాయందు నిరంతము కలిగియుండనీ (7). రామచంద్రా! ఇహలోకముననే సుఖప్రదములగు ఇతర వరములవలన నాకేమి ప్రయోజనము? ఆ వ్యర్థ వరములు వద్దు," అని ప్రార్థించెను. ఆ కాకవచనమును విని శ్రీరామచంద్రస్వామి (8) నీకు, సంతతికి ద్వీపాంతరములలో జరిగినది, జరుగుచుండునది, జరుగునది కూడా నగు సకల విషయములును నీ కంటికి గోచరించు చుండునుగాక (9). ఓ వాయసమా! నా వరములవలన భవిష్యత్కార్యములన్నిటిని తెలియుము. నీగతివలన ఎల్లప్పుడును లోకులు శకునములుగా నెఱుగుచుందురు గాక (10). నీవు స్థిరత్వము నొందియుండగా స్థిరకార్యములు, గమనము నొందియుండగా మిక్కిలి త్వరగా కార్యములును కాగలవు (11), ఇట్లు శకునములను లోకులు భూమిలో చూచుచుందురుగాక! గ్రామప్రవేశమునందును, గృహప్రవేశమునందును ఎడమవైపున గతి కలుగకపోయిన (12) అప్పుడు దక్షిణ భాగమున గతికలిగితే లోకమున మంగళప్రదమైన శకునమగుగాక (13) ప్రేతముయొక్క దశాహ పిండమునకు నీ స్పర్శ

కలుగకపోతే, అట్టి ప్రేతములకు సద్గతి లేకపోవునట్లు నీకు నేను వరము నిచ్చియున్నాను (14).

**అంతకాలే మానవస్య వాంఛితం నైవ పూరితమ్ ।**
**ప్రేతదశాహపిండస్యాస్పర్శాజ్జానంతు తన్నరాః ॥ 15**

**ప్రేత్యస్య వంశజః కశ్చిద్యద్యత్ప్రేతస్య వాంఛితమ్ ।**
**తత్తే స్పర్శాద్విదిత్వా తు స యదా పూరయిష్యతి ॥ 16**

**తదా పిండం స్పృశస్వ త్వం నోచేన్మా స్పృశ సర్వథా ।**
**అన్యమేకం వరం దద్మి లిపిమాత్రేతు పుస్తకే ॥ 17**

**యత్ కించిల్లేఖకైశ్చ విస్మృతం తత్ర మద్వరాత్ ।**
**కుర్వంతు పదచిహ్నం తే సర్వత్ర జగతీతలే ॥ 18**

**త్వత్పదం పుస్తకే దృష్ట్వా జనా జానంతు విస్మృతమ్ ।**
**లిఖితం పార్శ్వభాగేషు లేఖకైః పుస్తకస్య యత్ ॥ 19**

**ఇతి దత్వా వరాన్ రామస్తూష్ణీమాసీత్ స్మితాననః ।**
**కాకోఽపి తుష్టః శ్రీరామం నత్వోడ్డీయ మతస్తదా ॥ 20**

**ఏవం నానాచరిత్రాణి చకార రఘునందనః ।**
**ఏకదా రాఘవో రాత్రౌ పారిజాతతరోరథః ॥ 21**

**నిద్రితో హేమపర్యంకే జానక్యాఽస్పృశ్యయా వినా ।**
**ఏతస్మిన్నంతరే తస్యాం రాత్రౌ తే రామరక్షకాః ॥ 22**

**ద్వారపాశ్చాపి దాస్యశ్చ దాసాద్యాః సకలాస్తదా ।**
**యయుర్వై కీర్తనం శ్రోతుం క్వాపి రామస్య భక్తితః ॥ 23**

**దృష్ట్వా తం సమయం వేగాత్కామబాణప్రపీడితః ।**
**పౌరాణాం శతనార్యస్తా వస్త్రాలంకారభూషితాః ॥ 24**

ఆ ప్రేతమునకు తిలోదకములిచ్చునట్టి మానవులు ఈ ప్రేతముయొక్క వాంఛితములు ఇవియు మరణ సమయమున నెరవేరి యుండలేదు కావున ఇట్లు వాయసము పిండమును అంటలేదని తెలియుదురుగాక (15). ఆ ప్రేతముయొక్క వంశజుడు ఎవడైనను ఆ ప్రేతమునకు ఏయే వాంఛలు

గలవో వాటినెరిగి చెప్పుచువచ్చిన (16) ఆ పిండమునంటి వాటినిపూర్తి జేసిన పిదప ఆ పిండమును స్పృశింతువుగాక. అట్లు కాకపోయిన ఆ పిండమును స్పృశింపవలదు. మరియొక వరమునిచ్చెదను (17). వ్రాయువారిలో ఎవరైనను వ్రాయునపుడు ఒకచోట ఏదైనను వ్రాయుదానిని మరచితే, వారు నా వరమువలన అచ్చట నీపాదచిహ్నమును గురుతుగాపెట్టి వ్రాయుదురుగాక (18). లోకులు నీ పాదచిహ్నమును పుస్తకమున చూచి, తమరు మరుపును తెలియుదురుగాక. అచ్చట మరచినదానిని పుస్తకములో ప్రక్కన వ్రాయుచుందురు" (19). అని ఇట్లు వరములనిచ్చి చిరునవ్వు నవ్వుచు ఊరకే కూర్చుండెను. అంత ఆ కాకమును సంతోషించి, యచ్చటనుండి ఎగిరి వెళ్ళెను (20).

## నూరుమంది పురాంగనలు శ్రీరాముని మోహించి వరమందుట

శ్రీరామచంద్రుడిట్లు వివిధ వినోదములను చేసి చూపుచు విలాసముగ ఉండెను. ఒకప్పుడు శ్రీరాముడు రాత్రికాలమున పారిజాత వృక్షపు మొదలువద్ద (21) జానకీ స్పర్శనము లేక బంగారు పట్టెమంచముపై సుఖముగా నిద్రించుచుండగా, అంతలో అచ్చటి శ్రీరామభటులందరును, (22), ద్వారపాలకులును, దాసీజనులును, దాసవర్గమువారును అత్యంత భక్తితో శ్రీరామ కీర్తనము జరుగుచుండగా దానిని వినుటకు వెడలిరి (23) ఆ సమయమునే ప్రతీక్షించుచుండి పౌరాంగనలు నూరుమంది కామబాణ ప్రపీడితులై దివ్యాభరణ వస్త్రాలంకారాదులచే శృంగారముజేసికొని, వెడలిరి (24).

**తారుణ్యమదసంభ్రాంతా హేమకుంభపయోధరాః ।**
**చంద్రాననాః శుకఘ్రాణాః కమలాంఘ్ర్యో మృగీదృశః ॥ 25**

**పీతకౌశేయవసనా రుక్మనూపురనిస్స్వనాః ।**
**పరస్పరం తాః సంమన్త్ర్య ప్రథమే వయసి స్థితాః ॥ 26**

**కాచిత్తం వీజయామస శ్రీరామం వ్యజనేన హి ।**
**కాచిద్దధార రామార్థం స్వకరే పుష్పమాలికామ్ ॥ 27**

**కాచిత్తాంబూలపాత్రం చ కాచిత్కుంభ జలస్య సా ।**
**పాత్రం నిష్ఠీవనస్యాన్యా సా దధార విలాసినీ ॥ 28**

**దధార చందనం కాచిక్కాచిద్దివ్యాన్నముత్తమమ్ ।**
**కాచిత్పక్వాన్ననైవేద్యం కాచిద్రంభాఫలాదికమ్ ॥ 29**

ఏతస్మిన్నంతరే కాచిత్పాదసంవాహనం శనైః ।
రామస్య కర్తుముద్యుక్తా తత్పదం పాణినాఽస్పృశత్ ॥ **30**

తేన రామః ప్రబుద్ధోఽభూత్ స్మృత్వాఽపృశ్యాం విదేహజామ్ ।
కేన మే స్పర్శితః పాదశ్చకితశ్చేత్యుపావిశత్ ॥ **31**

తావద్దదర్శ శ్రీరామః శతశశ్చ పురః స్థితాః ।
పౌరాణాం ప్రమదాః సర్వా రుక్మాలంకారమండితాః ॥ **32**

రామం సముత్థితం దృష్ట్వా ప్రణేముస్తాస్తదా భువి ।
స్వశిరాంసి నిధాయాథ తుష్టువుర్వివిధోక్తిభిః ॥ **33**

తాః సర్వా రాఘవః ప్రాహ కిమర్థమిహ పుష్పకే ।
రాత్రౌ సమాగతాః సర్వాస్తథ్యం మాం కథ్యతాం స్త్రియః ॥ **34**

తద్రామవచనం శ్రుత్వా విలజ్జంత్యః పురస్త్రియః ।
అవాఙ్ముఖాః సంస్థితాస్తా స్తూష్ణీమేవ సమంతతః ॥ **35**

యౌవనగర్వముచే తొణకిసలాడుచుండు వారును, కనకకుంభములవంటి పాలిండ్లచే నొప్పుచుండువారును, చంద్రముఖులును, కమలతూడుల వంటి చేతులు గలవారును, కంజాంఘలును, ఏణాక్షులును (25) శోణాధరులును, పట్టుపీతాంబరధారులును, చక్కగా ముస్తాబైన ఆ స్త్రీలు పరస్పరమాలోచించుకొని శ్రీరాముడు నిద్రించుచుండు ప్రదేశమునకు వచ్చి, (26) ఒకతె దివ్యమైన విసనకఱ్ఱచే వీచుచూ, మరియొకతె పూష్పమాలికలను తురుముకొనుచు (27), నింకొకతె తాంబూలపు పళ్ళెమునందుకొనుచూ, వేరొకతె జలపాత్రమును ధరించి (28), మరియు ఇంకొకతె గంధపుగిన్నెను ఎత్తుచు ఇట్లు యౌవనముయొక్క ప్రథమభాగమున అనుభవించునట్టి మంచివయస్సుచే మనోజ్ఞుడైన శ్రీరామమూర్తిని సేవించనెంచినవారలై అందొకతె తిన్నగా శ్రీరామునికి పాదసంవాహన సేవను చేయనారంభించగా (30), అపుడు శ్రీరాముడు, "ఏమిది? సీతాదేవి అస్పృశ్యయై దూరదేశ వర్తినియై ఉండగా, వీరిట్లు వచ్చి నన్ను స్పృశించినారు?" అని దిగ్గునలేచి కూర్చుని, (31) నూరుమంది పురాంగనలను విలోకించెను. దివ్యాలంకారములతో వెల్గుచుండు వారందరును (32), శ్రీరాముని దర్శించి, అతని పాదములమీద ప్రణమిల్లి, తమ శిరస్సులను వంచి, నానా ప్రకారములుగా స్తుతించిరి (33). అంత ఆ శ్రీరామచంద్రుడు, "ఎందుకు మీరు పుష్పకవిమానమునకు అర్ధరాత్రి సమయమున వచ్చితిరి? మీస్థితిని యథార్థముగా నాకు తెలియజేయవలయును అని ఆజ్ఞాపించెను (34). అందుకు వారు సిగ్గుపడి, మాటాడచాలక తలవంచి, కొంతసేపు ఊరకే యుండిరి (35).

తాసు కాచిత్తదా రామం గతలజ్జాఽబ్రవీద్వచః ।
సర్వం జానంతి ప్రభవో యదర్థమాగతా వయమ్ ॥ 36

ఉపేక్షణీయా నో రామ వయం సర్వాః స్త్రియస్త్వయా ।
ఇతి తాసామభిప్రాయం జ్ఞాత్వా స రఘునందనః ॥ 37

అబ్రవీన్మధురం వాక్యం శృణుధ్వం ప్రమదోత్తమాః ।
ఏకపత్నీవ్రతం మేఽస్తి మాతృతుల్యాః స్త్రియే మమ ॥ 38

ఇతరాః సకలాః సీతారహితాశ్చేహ జన్మని ।
గచ్ఛధ్వం నిజగేహాని మాఽధర్మేఽస్తు మయి నృపే ॥ 39

రాజ్యం శాసతి భో నార్యః క్షమితం వోఽపరాధితమ్ ।
ఇతి తా రామవాగ్బాణైః కామబాణప్రపీడితాః ॥ 40

తాడితాశ్చ విశేషేణ నిపేతుర్మూర్ఛితా భువి ।
పతితాస్తా నిరీక్ష్యాథ సర్వా రామోఽతివిహ్వలః ॥ 41

తా ఉవాచ పునః శీఘ్రం సుష్ఠువాక్యైః కృపాన్వితః ।
శృణుధ్వం మే వచో నార్యః సకృద్రత్యా మయా సహ ॥ 42

యుష్మాకం న భవేత్తుష్టిర్వ్రతభంగోఽపి మే భవేత్ ।
అతః శృణుత మే వాక్యం యాగే పూర్వం మయార్పితాః ॥ 43

గురవే రుక్మజాశ్చైవ సీతాయాః శతమూర్తయః ।
తాసాం ఫలేన యుష్మాభిర్ద్వాపరే క్రీడనం చిరమ్ ॥ 44

కరిష్యామి న సందేహః కృష్ణరూపేణ వై సుఖమ్ ।
నానానృపాణాం యుష్మాభిర్భవధ్వం బాలికాస్తదా ॥ 45

భౌమాసురశ్చ యుష్మాకం సంహరిష్యతి వై యదా ।
తదా సర్వా మోచయామి హత్వా తం జగతీసుతమ్ ॥ 46

కరిష్యామి వివాహాంశ్చ యుష్మాభిర్ద్వారకాపురి ।
స్త్రీషోడశసహస్రాణామూర్ధ్వతోఽన్యాః శతం త్వహమ్ ॥ 47

**ఇతి రామవచః శ్రుత్వా తుష్టాస్తాః పురయోషితః ।**
**నత్వా రామం యయుః సర్వాస్తూష్ణీం స్వం స్వం గృహం ప్రతి ॥ 48**

వారిలో ఒకతె ధైర్యము తెచ్చుకుని, "స్వామీ! ప్రభువులు సమస్తము నెఱుగగలరు. మేమెందుకు వచ్చితిమనునది దేవరవారి చిత్తమునకే తెలియును (36). అబలలగు మేమందరము నీచే ఉపేక్షింప బడతగినవారు కాము," అని ఇట్లు వారి అభిప్రాయమును తెలియజేయగా విని, శ్రీరాముడు (37) మృదుమధుర భాషణములతో, "ఉత్తములగు మత్తకాశినులారా! నాకు ఏకపత్నీవ్రతమొక్కటి గలదు (38). ఈ జన్మమునందు సీతాదేవి తప్ప తక్కిన స్త్రీలందరును నాకు తల్లులవంటివారు. మీరు సుఖముగా మీ ఇండ్లకు వెడలండి. రాజ్యమేలుచుండు రాజగు నా యందు అధర్మము సంభవించ కూడదు. మీరు స్త్రీలు గావున మీ తప్పును మన్నించితిని," అని ఇట్లు సమాధానము చెప్పెను. శ్రీరాముని యొక్క యిట్టి వాగ్బాణములు చెవిన దూరగా ఆ కాంతలు రామబాణములచే పీడింపబడి ఆ మాటల దెబ్బలకు మూర్ఛితులైరి. అందరు ఇట్లు స్మృతితప్పి, నేలపైబడిన దుఃఖస్థితిని చూచి, శ్రీరఘురాముడు పశ్చాత్తాపము చెంది కరుణారసార్ద్ర హృదయుడై, మరి వారితో (42), "నారీమణులారా నామాటను ఆలకించి, సమాహితురాండ్రగుదురుగాక! నేనొకమారు మీతో రతిక్రీడ అందినంత మాత్రమున మీకు తృప్తి చాలదు. నాకు వ్రతభంగమగుచున్నది. కావున నా మాట వినుడు. శ్రీ గురు మూర్తికి నేను మునుపు 100 బంగారు సీతాప్రతిమలను దానముగా ఒసగితిని. వాటిఫలితము వలన మీతో ద్వాపరయుగమున చిరకాలము శ్రీకృష్ణరూపముతో రతిక్రీడాసుఖములను అనుభవించెదను. ఇందులో సందేహములేదు. అప్పుడు మీరు నానాదేశాధీశ్వరులగు రాజులకు కన్యారత్నములుగా అవతరించండి. భూదేవి పుత్రుడయిన నరకాసురుడు మిమ్ములనుపట్టి చంపుటకు యత్నించినపుడు వానిని సంహరించి, మిమ్ములనందరిని విడిపించెదను. ద్వారకాపట్టణమున మిమ్ములందరిని పెండ్లిజేసికొందును. వేలమందికిపైగా నూరుమందిని కూడా స్వీకరించెదను," అని చెప్పిన శ్రీరామవాక్యమును విని సంతోషించిన పరకాంతలగు వారందరును శ్రీరామచంద్రస్వామికి నమస్కరించి, ఊరకే తమతమ ఇండ్లకు వెడలిరి.

**తతః స్త్రీస్తా విసర్జ్యాసౌరామో దాసీః సమాహ్వయత్ ।**
**దృష్ట్వా కామపి నో దాసీం రామో దాసాంస్తదాహ్వయత్ ॥ 49**

**తేష్వప్యేకం న దృష్ట్వా స ద్వారపాలన్సమాహ్వయత్ ।**
**తానప్యదృష్ట్వా రామస్తు రక్షకాంశ్చ సమాహ్వయత్ ॥ 50**

తేష్వప్యేకం న దృష్ట్వా స రాఘవశ్చాతివిస్మితః ।
విమానాట్టాలమారుహ్య సౌమిత్రిం వై సమాహ్వయత్ ॥ **51**

ఊర్మిళా రామవాక్యం తచ్ఛ్రుత్వా తం చాలయత్పతిమ్ ।
ఊర్మిళాచాలనాచ్ఛీఘ్రం ప్రబుద్ధోఽభూత్స లక్ష్మణః ॥ **52**

రామవాక్యం సోఽపి శ్రుత్వా రతిశాలాబహిర్యయౌ ।
దత్వా ప్రత్యుత్తరం రామం యయౌ వేగేన లక్ష్మణః ॥ **53**

ఏతస్మిన్నంతరే రామో రోదనం నగరాద్బహిః ।
శుశ్రావ స్త్రీకృతం ఘోరం కిమిదం చేతి విస్మితః ॥ **54**

తతో దృష్ట్వా స సౌమిత్రిం సర్వం వృత్తం న్యవేదయత్ ।
లక్ష్మణో రామవాక్య తచ్ఛ్రుత్వా దూతాన్నిజాంస్తదా ॥ **55**

ప్రేష్య దూతాన్కీర్తనస్థానాదాహ్వాయామాస వేగతః ।
రామదూతాస్తదోచుస్తాన్ కథం శ్రీరామకీర్తనమ్ ॥ **56**

అసమాప్తం విహాయాఽద్య గంతవ్యం స్వామినం ప్రతిః ।
తేష్వేవ కేచిదూచుస్తే పాలనీయా తు సేవకైః ॥ **57**

ప్రభోరాజ్ఞాఽద్యచాస్మాభిర్నో చేన్నః పాతక స్పృశేత్ ।
కేచిదూచురిదం తస్య కీర్తనం మంగళప్రదమ్ ॥ **58**

అంత ఆ రఘుపుంగవుడు వారిని పంపివేసి, పనికత్తెలను పిలిచెను. ఒక్క దాసియును అచ్చట లేకపోవుటచే పనివాండ్రను పిలిచెను. ఆ దాసులును అచ్చట లేనిసంగతిని ఎరిగి, ద్వారపాలకులను పిలిచెను. వారుకూడా అచ్చట గానక ఆ రాఘవుడు రక్షక శాఖవారిని పిలిచెను. వారిలో ఒక్కడును కానరానందున, ఈ సంగతిని పరిభావించి శ్రీరామచంద్రస్వామి ఎంతో ఆశ్చర్యము నందుచు, విమానమునెక్కి, కోటగోడనెక్కి లక్ష్మణస్వామిని పిలిచెను. అంత అప్పుడు ఊర్మిళాదేవి శ్రీరామ వాక్యమును విని పతిని లేపెను. ఊర్మిళకదలినందున త్వరగా మేల్కొనిన లక్ష్మణుడును శ్రీరామ వాక్యమును విని పడకటింటినుండి వెలువడి వచ్చి, శ్రీరఘురామునికి ప్రత్యుత్తరమిచ్చి మిక్కిలి వేగముతో వెడలెను (53).

## శ్రీరామసంకీర్తన కాలక్షేపాభివర్ణనము.

అంతలో అచ్చుట శ్రీరామచంద్రస్వామి ఊరివెలుపల ఒక రోదన ధ్వనిని వినెను. స్త్రీయొక్క మొరయని వినగానే తెలిసికొన ఏమిదియని ఆశ్చర్యపడుచు, అంత అచ్చుటికివచ్చిన లక్ష్మణునిజూచి, సర్వ వృత్తాంతమును తెలిపెను. లక్ష్మణుడు ఆ శ్రీరామవాక్యములను విని తన దూతలను పిలిచి, వారిని పంపి, శ్రీరామభజనమందిర కీర్తనమున ఉండిన శ్రీరామదూతలనందరిని వెంటనే పిలిపించెను. అచ్చుట అప్పుడు రామసేవకులు పిలుచుచుండు వీరిని జూచి, “ఇచట శ్రీరామకీర్తన సంపూర్ణము కాకమునుపే ప్రభుసన్నిధానమునకు ఎట్లు వచ్చెదము?” అని ఆక్షేపించిరి. వారిలో కొందరు, “మనము రాజాజ్ఞను ఉల్లంఘించక పాలింపవలయును. అట్లు లేకపోయిన మనకు పాపము వచ్చును,” అని చెప్పిరి.

**స్వామ్యాజ్ఞాభంగదోషఘ్నం కథం త్యక్త్వా ప్రగమ్యతామ్ ।**
**కేచిదూచుః కీర్తనస్థాన్ శ్రుత్వాఽస్మాన్న సుఖీ భవేత్ ॥ 59**

**ఇతి సందిగ్ధచిత్తాస్తే న తదా రాఘవం యయుః ।**
**తతో లక్ష్మణదూతాస్తే రామం వృత్తం న్యవేదయన్ ॥ 60**

**తతః కించిత్ క్రోధయుక్తః సౌమిత్రిం ప్రాహ రాఘవః ।**
**మత్కీర్తనసమాసక్తాన్నాహం దండయితుం క్షమః ॥ 61**

**తథాప్యేతన్న యోగ్యం హి కించిత్ శిక్షాం కరోమ్యహమ్ ।**
**ఇత్యుక్త్వా తాం తు రుదతీం పునః శ్రుత్వా బహిః ప్రభుః ॥ 62**

**విమానం ప్రాహ గచ్ఛాద్య బహిః పుర్యాః స్త్రియం ప్రతి ।**
**తథేతి రామవాక్యేన యయౌ తన్నగరాద్బహిః ॥ 63**

**యత్ర సాఽతివిలాప స్త్రీ కరోతి సరయూతటే ।**
**తామంజననిభాం నారీం రుదంతీం రాఘవోఽబ్రవీత్ ॥ 64**

**శ్రీరామ ఉవాచ**

**కిం తే దుఃఖం వదస్వాద్య కా త్వం రోదిషి వై కథమ్ ।**
**ఇతి రామవచః శ్రుత్వా సా రామం వాక్యమబ్రవీత్ ॥ 65**

**చిరకాలం కరోమ్యత్ర రోదనం రఘునందన ।**
**అద్య శ్రుతం త్వయా రామ కించిత్పుణ్యచయాన్మునేః ॥ 66**

**నిర్మితా విధినా పూర్వం నిద్రానామ్నీ త్వహం ప్రభో ।**
**దత్తం తేన మమ స్థానం కుంభకర్ణే చిరం సుఖమ్ ॥ 67**

మరికొందరు, "ఇది రామునియొక్క కీర్తనము, శుభప్రదము. ప్రభువుయొక్క ఆజ్ఞను ఉల్లంఘించిన దోషమును కూడా పోగొట్టగలదు, కావున ఎట్లు దీనిని వదలిపోవచ్చును?" అనిరి. ఇంకొందరు, "తనకీర్తనమున మనమున్నామని విని మన ప్రభువు సంతోషించుచుండును," అని మందలించిరి. ఇట్లు సందేహపడుచుండు మనసులు గల వారందరును అప్పుడు శ్రీరామసన్నిధానమునకు వెడలలేదు. అంత ఆ సంగతిని లక్ష్మణదూతలు వచ్చి శ్రీరామునికి విన్నవించిరి. అప్పుడు రాముడు కొంచెము కోపమునంది, లక్ష్మణునితో, "నా కీర్తనమున నొక్కిసొక్కి యుండుట తగదు, కావున కొంచెముగా శిక్షించెదను," అని చెప్పి, వెలుపల దుఃఖధ్వని చేయుచుండుటను మరల వినెను (61).

## శ్రీరాముడు నిద్రాంగనలకు వరములు ఇచ్చుట

అంత ఆ రామచంద్రుడు విమానమును ఊరివెలుపల ఏడ్చుచున్న స్త్రీ సమీపమునకు వెడలునట్లు ఆజ్ఞాపించెను. అంత ఆ విమానము అట్లే రామాజ్ఞానుసారముగా వచ్చెను. అంత నచ్చట సరయూ తీరమున శ్రీరాముడు కాటుకవలె నల్లనిదైన మేనుగల్గి ఏడ్చుచుండెడు స్త్రీని జూచి, "ఏమి నీదుఃఖము? ఎందుకు ఇట్లు ఏడ్చుచున్నావు చెప్పుము," అని అడిగెను. అందుకు ఆ స్త్రీ, "రఘురామా! చిరకాలము నుండి నేను ఇచ్చట ఇదేవిధముగా ఏడ్చుచున్నాను. నేడు కొంచము మునీంద్రుని పుణ్యప్రభావము వలన నీకు ఈ రోదనము వినబడెను. మహాప్రభూ! నేను పూర్వము బ్రహ్మచే నిర్మింపబడినదానను. నాపేరు 'నిద్ర' యనబడును. ఆ విధి నాకు కుంభకర్ణునియందు నివాసస్థానము ఏర్పరచెను. వాడుండు నంతవరకు నేనట్లే చిరకాలము సుఖముగా నుంటిని.

**యావత్కాలం స్థితా రామ స త్వయా నిహతో రణే ।**
**తతో నష్టనివాసాఽహం గతా శీఘ్రం విధిం ప్రతి ॥ 68**

**తేన త్వాం ప్రేషితా రామ తతః ప్రాప్తా త్విమాం పురీమ్ ।**
**సీమాచారభయాదస్యాం నగర్యాం న గతిర్మమ ॥ 69**

**అత్రైవ సంస్థితా రామ శోచంతీ సరయూతటే ।**
**మే స్థానం వద రామాద్య యత్ర స్థాస్యామ్యహం సుఖమ్ ॥ 70**

**తత్తస్యా వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్ ।**
**స్మృత్వా దూతకృతం పూర్వం తదా క్రోధేన చోదితః ॥ 71**

నిద్రే శ్రుణు వచో మేఽద్య తే స్థానం కీర్తయామ్యహమ్ ।
పాపాత్మానో నరా భూమ్యాం యే శృణ్వంతి హి కీర్తనమ్ ॥ **72**

పురాణశ్రవణం వేదపఠనం పూజనం జపమ్ ।
తపో ధ్యానం చ హోమాది యద్యత్ కుర్వంతి పాపినః ॥ **73**

తేషు త్వం తిష్ఠ మద్వాక్యాద్దీనదేవనరేష్వపి ।
జడే బాలేఽథ గుర్విణ్యాముపవాసోత్తరోఽశివే ॥ **74**

తథా విద్యార్థిని శ్రాంతే వాంతే జాగరకాముకే ।
ఏతేషు తే స్థలో దత్తమేతాన్మోహయ మద్వరాత్ ॥ **75**

తద్రామవచనం శ్రుత్వా సా తుష్టా ప్రణనామ తమ్ ।
యయౌ రామః స్వనగరీం సుఖం నిద్రాం చకార వై ॥ **76**

తదారభ్య పురోక్తేషు వాసం నిద్రాఽకరోత్సుఖమ్ ।
పాపాత్మనామతో నిద్రా బాధతే పుణ్యకర్మసు ॥ **77**

రావణుని నీవు రణమున చంపితివి. అంత నా ఉనికిపట్టు పోగా నేను బ్రహ్మదేవునివద్దకు పోతిని. అతడు ఇచ్చటకు పంపెను. అందువలన నేనిచ్చటికి వచ్చితిని. ఇచ్చటి సీమాచార నడతలచేత వెరవుకలిగి, ఈ నీ పట్టణమున నాకు ప్రవేశము లేకపోయెను. శ్రీరామా! ఈ సరయూతీరముననే దుఃఖించుచు పడియున్నాను. నేనెచ్చట సుఖముగా వసింపగలనో దానిని ఆజ్ఞాపింపుము," అని విన్నవించెను. దాని మాటలను విన్న శ్రీరాముడు, మునుపు దూతలుచేసిన కృత్యమును స్మరించి, క్రోధావిష్టుడై ఆ నిద్రాంగనతో, "ఓసి నిద్రా! నా మాట వినుము. నీకు నివాసస్థానమును చూపించెదను. ఈ పుడమిని పాపాత్ములైన నరులెవ్వరు సంకీర్తనమును వినుచుందురో, పురాణశ్రవణము జేయుదురో, వేదమును పఠించెదరో, దేవతలను పూజించెదరో, మంత్రములను జపించెదరో, తపమును ఆచరించెదరో, ధ్యానారూఢులగుచుందురో, అగ్నిహోత్రాది సత్కర్మలను ఆచరించెదరో, ఇంకను ఇట్టి సత్కర్మలను ఏ పాపాత్ములు చేయుచుందురో దురదృష్టముగలవారైన అట్టి మానవులయందు నా వరము వలన నీవు వసింపుము. జడుడైన బాలునియందును, గర్భిణియందును, ఉపవాసము పారణచేసిన వానియందును అట్లే బడలిన బంధుర విద్యార్థులయందును, జాగరణచేయనెంచిన వానియందును వీరలయందు నీకు స్థలమివ్వబడినది. నా వరమువలన వీరిని సంభ్రాంతులను చేయుము," అని వరమునివ్వగా; ఆ నిద్రాంగన మిగుల సంతోషమునంది, ఆ శ్రీరామచంద్రస్వామికి నమస్కరించెను. శ్రీరాముడును తన నగరమును ప్రవేశించి, సుఖముగా నిద్రించెను. అది మొదలు

వెనుకజెప్పబడిన వారిలో నిద్రాంగన సుఖముగా నివసించుచు వచ్చెను. అందువలన పాపాత్ములకు పుణ్యకర్మలయందు నిద్ర బాధించుచున్నది. అది మొదలు సేవకులైన నరులయందు, నరపతులయందు నిద్ర మెండుగా ఉన్నది.

తదారభ్య సేవకేషు నరేష్వప్యవనీతలే ।
నిద్రాగ్రస్తేషు పుణ్యాత్మా సహస్రేష్వపి కశ్చన ॥ **78**

శుశ్రావ తత్కీర్తనాది చకార పూజనాదికమ్ ।
శ్రీరామదాస ఉవాచ
అథాన్యాం సంప్రవక్ష్యామి కథాం సీతాయశస్కరీమ్ ॥ **79**

కుంభకర్ణస్య పుత్రస్య నికుంభస్య చ గుర్విణీ ।
ప్రభూత్యర్థం పితుర్గేహం గతా ద్వీపాన్తరం ప్రియా ॥ **80**

రావణాదివధే జాతే తస్యాం జాతస్తు పౌంద్రకః ।
మాయాపుర్యాం శతశిరాః శతద్వయకరః పురా ॥ **81**

శ్రోణానదీతటే చాసీద్రావణః క్షీరసాగరే ।
సహోయాత్పౌంద్రకస్తస్యోద్వేజయిత్వా విభీషణమ్ ॥ **82**

శతాననే వై సార్ధం లంకారాజ్యం చకార సః ।
తతో విభీషణో రామం గత్వా సర్వం న్యవేదయత్ ॥ **83**

సీతావిభీషణాభ్యాం వై రామో లంకాం యయౌ ద్రుతమ్ ।
నిహత్య రావణం సీతా యుద్ధే రామే జితేఽథ తమ్ ॥ **84**

విభీషణాయ తాం లంకాం హత్వా తం పౌంద్రకం దదౌ ।
అథైకదా సభాసంస్థం రాఘవం స విభీషణః ॥ **85**

యయౌ విషణ్ణః సచివైశ్చతుర్భిః ససుతః స్త్రియా ।
నత్వా రామం సాశ్రునేత్రశ్చేచ్ఛ్వసన్ కంపితాధరః ॥ **86**

ఉవాచ సకలం వృత్తం లంకాయాః ప్రస్ఖలద్గిరా ।
రామ రాజీవపత్రాక్ష త్రాహి మాం శరణాగతమ్ ॥ **87**

**మూలర్క్షే కుంభకర్ణేన జాతః పుత్రః పురా వనే ।**
**దూతైస్త్యక్తో వృక్షమూలే బాలకస్తత్ర వర్ధితః ॥ 88**

అది మొదలు; అట్టి నిద్ర కమ్మినవారిలో జాగరూకుడు వేయింటికొకడు దొరకవచ్చును. అట్టివాడు శ్రీరామకీర్తనాదికమును వినును. తత్పూజనాదికమును చేయును (78). అని యిట్లు రామదాసుడు ఇంకా చెప్పుచున్నాడు. "వినుము విష్ణుదాసా!....

## సీతాదేవి శతకంఠరావణుని సంహరించుట.

జానకీదేవియొక్క సత్కీర్తికరమైన మరియొక కథను చెప్పుచున్నాను. అది ఎట్లనిన, కుంభకర్ణుని కొడుకైన నికుంభునియొక్క పత్ని గర్భిణియై కానుపుకై ఆరుమాసములు వేకటిలోనే పుట్టినింటికి జనెను. ఇచ్చట రావణాదుల సంహారము జరిగిన పిమ్మట ఆమె పౌండ్రకుడనువానిని కనెను. మునుపు 200 చేతులును 100 తలలును గలవాడైన రావణుడను వాడు క్షీరసాగరమున శోణానదీతీరమున మాయాపురియందు ఉండెను. అతని సహాయమువలన పౌండ్రకుడు విభీషణుని వెడలగొట్టి, ఆ శతకంఠ రావణునితోకలసి లంకారాజ్యమును అనుభవించుచుండెను. అంత ఆ విభీషణుడు వచ్చి, శ్రీరామసన్నిధికి సర్వమును విన్నవించెను. సీతను విభీషణుని బిలచికొని శ్రీరాముడు త్వరగా లంకకు వచ్చెను. అపుడు యుద్ధమునందు శ్రీరాముడు మూర్ఛితుడు కాగానే సీతాదేవి ఆ పౌండ్రకుని సంహరించి, లంకారాజ్యమును విభీషణునికి ఇచ్చెను. అంత సీతారాములు అయోధ్యకు వచ్చి సుఖముగా ఉండిరి.

## మూలకాసురుని వృత్తాంతము.

పిమ్మట ఒకప్పుడు శ్రీరామచంద్రస్వామి సభాసీనుడై ఉండగా విభీషణుడు తన భార్యా పుత్రులను, మంత్రులను నలుగురిని కూడా వెంటదీసుకుని వచ్చి, సాష్టాంగ ప్రణామములను ఒనర్చుచు కన్నీరు క్రమ్మివచ్చుచుండగా గద్గదస్వరముతో లంకావృత్తాంతమునంతటిని ఇట్లు విన్నవించెను. "రాజీవాక్షుడైన రామచంద్రస్వామీ! శరణాగతుడైన నన్ను పరిరక్షింపుము. మునుపు కుంభకర్ణునికి మూలానక్షత్రమునందు ఒక కొడుకు పుట్టెను.

**మక్షికాభిః స్వవమనజలస్య బిందుభిర్ముహుః ।**
**సోఽధునా తరుణః శ్రుత్వా త్వత్కృతం స్వకులక్షయమ్ ॥ 89**

**తపసా తోష్య బ్రహ్మాణం తద్వరేణాతిగర్వితః ।**
**పాతాలస్థై రాక్షసైశ్చ లంకాయాం సముపాగతః ॥ 90**

మయా తేన తు షణ్మాసం కృతం యుద్ధం మహత్తమమ్ ।
మాం జిత్వా స పురీం యాతస్తదాఽహ సచివైః స్త్రియా ॥ 91

సపుత్రో గుప్తమార్గేణ భూమిజేన పలాయితః ।
శనైర్వివరమార్గేణ లంకాయా యోజనోపరి ॥ 92

రాత్రౌ బహిర్వినిర్గత్య వివరాత్త్వాం సమాగతః ।
మూలర్క్షే యః సముత్పన్న స్తరుమూలే వివర్ధితః ॥ 93

మూలకాసురనామ్నాఽతః పరాం ఖ్యాతిం గతోఽధునా ।
సంగరే తేన మాముక్తమాదౌ త్వాం తు విభీషణమ్ ॥ 94

హత్వా లంకాపురీం ప్రాప్య తతో గచ్ఛామి రాఘవమ్ ।
మత్పితా నిహతో యేన నిహతం సకలం కులమ్ ॥ 95

తం రామ సంగరే హత్వాఽఽనృణ్యం గచ్ఛామ్యహం పితుః ।
ఆగమిష్యతి సోఽత్రాపి త్వాం యోద్ధుం రఘునందన ॥ 96

ఇదానీం యద్ధితం చాగ్రే తత్కురుష్వ రఘూత్తమ ।
తత్తస్య సకలం వృత్తం శ్రుత్వా రామోఽతివిస్మితః ॥ 97

లక్ష్మణం ప్రాహ వేగేన పార్థివాన్ జగతీతలే ।
స్వస్వరాజ్యస్థితాన్ సర్వాన్దూతైరాకారయాధునా ॥ 98

దూతలనుపంపి ఆ మూలకాసురుని ఒకచెట్టుక్రింద అరణ్యములో పడవేసి వచ్చునట్లు కుంభకర్ణుడు ఆజ్ఞాపించెను. ఆ బిడ్డడు తేనెటీగలు విడిచిన తేనె బిందువులతో ఒక చెట్టుక్రిందనే పెరిగెను. వాడిపుడు నీచేత చేయబడిన తన కులనాశనమును విని, తపస్సుచేసి, బ్రహ్మదేవుని మెప్పించి, వరములను పొంది, వరములతో గర్వించి, పాతాళలోకమున ఉన్న రాక్షసులతో కలసి లంకకువచ్చెను. నేను ఆ మూలకాసురునితో ఆరు మాసములు ఘోరయుద్ధము జేసితిని. చివరకతడు నన్నుజయించి, లంకారాజ్యమున కొల్లగొట్టెను. అపుడు నేను ఇచ్చటికి పత్నీ పుత్ర పరివారముతో కలసి గుప్తమార్గమగు భూమిలోని బిలమునుండి వెలువడుటకై పరుగెత్తితిని. ఇట్లు తిన్నగా వచ్చి లంకకు ఒకామడ దూరమున బిలమార్గమునుండి బయటకు వచ్చి నీ సన్నిధానమునందితిని. 'మూలానక్షత్రమునందు పుట్టి వృక్షమూలమున పెరిగినవాడు కావున ఇప్పుడు మూలకాసురుడని సుప్రసిద్ధి'నందియున్నాడు. యుద్ధమునందు వాడు నన్ను చూచి, "మొదట విభీషణుడగు నిన్ను చంపి లంకారాజ్యమును స్వీకరించి,

పిదప శ్రీరామునిమీద దండెత్తి వెడలుచున్నాను. నా తండ్రిని చంపినవాని కులమునంతటిని నేను నాశనముచేయుదును. ఆ రాముని చంపి, తండ్రివద్ద నేను తండ్రి ఋణమును తీర్చుకొనెదను," అని చెప్పినాడు. కావున శ్రీరామా! నీ వద్దకు వాడు యుద్ధముచేయుటకై వచ్చుచున్నాడు. కావున ఈ విషయమునందు నీవేమి యోచన చేయుచున్నావో చేయుము," అనిన విభీషణునియొక్క వచనములను విని శ్రీరాముడు ఎంతో ఆశ్చర్యముగ లక్ష్మణునితో, "తమ్ముడా! త్వరగా ఈ భూమిపై గల రాజులందరికి, వారివారి రాజ్యములకు దూతలను పంపి పిలిపింపుము," అని ఆజ్ఞాపించెను.

**తథేతి రామవచనాద్దూతానాజ్ఞాపయత్తదా ।**
**లక్ష్మణస్తేఽపి వేగేన గత్వా దూతాః సమాగతాః ॥ 99**

**ప్రోచుః సభాయాం శ్రీరామం నృపాణాం వచనాని తే ।**
**కేచిన్నృపః పాలయంతి తవాజ్ఞాం రఘునందన ॥ 100**

**కేచిన్న పాలయంత్యాజ్ఞాం తవ తత్కారణం శృణు ।**
**చంపికాయాః సుమత్యాశ్చ స్వయంవరసముద్భవమ్ ॥ 101**

**దుఃఖం హృదయసంస్థం యత్తదద్యాపి గతం న హి ।**
**యూపకేతుశరాఘాతభిన్నమర్మస్థలాః పునః ॥ 102**

**స్మృత్వా మదనసుందర్యా దుఃఖం కాంత్యుద్భవం నృపాః ।**
**ఆజ్ఞాం న పాలయంత్యద్య తవ రాఘవ సత్ప్రభో ॥ 103**

**పాలితా యైస్తవాజ్ఞా తే సుగ్రీవాద్యా నృపోత్తమాః ।**
**స్వస్వకోటిబలైర్యుక్తాః సమాయాతాః సహస్రశః ॥ 104**

**తద్దూతవచనం శ్రుత్వా రామో రాజీవలోచనః ।**
**ప్రాహ మద్బాణఘాతాంస్తే స్పృహయంతి నృపాధమాః ॥ 105**

**ఆదౌ హత్వా కౌంబకర్ణిం తాన్గచ్ఛామి తతస్త్వహమ్ ।**
**ఇత్యుక్త్వా సుదినే రామః సేనయా బంధుభిర్జవాత్ ॥ 106**

**మూలకాసురఘాతార్థమాదౌ పుర్యా బహిర్యయౌ ।**
**కించిత్ సైన్యయుతం పుర్యాం యూపకేతుం న్యవేశయత్ ॥ 107**

**కుశాద్యాః సప్త బాలాస్తే రామేణ సహ నిర్యయుః ।**
**విమానే సకలాం సేనాం స్థాపయామాస రాఘవః ॥ 108**

**తావత్తే పార్థివాః సర్వే నానావాహనసంస్థితాః ।**
**వేష్టితాః స్వస్వసైన్యైశ్చ నత్వా రామం పురః స్థితాః ॥ 109**

**తాన్ రామః స్థాపయామాస విమానే సైన్యసంయుతాన్ ।**
**అష్టాదశపద్మమితైః కపిభిః కపిరాడ్ యయౌ ॥ 110**

రామాజ్ఞను తలదాల్చిన లక్ష్మణుడు దూతలను, ఆయారాజుల వద్దకు పంపెను. ఆ దూతలు వేగముగా వెడలి ఆయా రాజులవద్దనుండి తెలిసికొనివచ్చిన సమాచారమును శ్రీరాముని పాదపద్మములవద్ద విన్నవించిరి. "శ్రీరామ ప్రభూ! కొందరు రాజులు నీ యాజ్ఞను శిరసావహించి పరిపాలించుచున్నారు. కొందరు నీ ఆజ్ఞను ఉల్లంఘించుచున్నారు. దానికి కారణమేమనిన, వినుము; వారికి చంపికా, సుమతీ వివాహ స్వయంవరమునందు కలిగిన దుఃఖము ఇంకా వారి మదిలోనే నిలచియున్నది, మరియు వారు యూపకేతువుయొక్క బాణపు దెబ్బచేత బాధనొంది, మదనసుందరి యొక్క మనోహరకాంతి విశేషముచే కలిగిన దుఃఖమును తలచి, ఈ నీ యాజ్ఞను పరిపాలింపక యున్నారు. ఎవరు నీ ఆజ్ఞను పరిపాలించుదురో వారనగా సుగ్రీవాది రాజులు తమతమ కోట్లకొలది సైన్యములను తీసికొని, వేలకొలదిగా వచ్చుచున్నారు," అని విన్నవించిన దూత వాక్యములను విని రాజీవాక్షుడగు రాముడు, "ఈ నృపాధములు నాయొక్క బాణపుదెబ్బను కోరుతున్నారు. మొదట కుంభకర్ణుని కొడుకగు కౌంభకర్ణిని సంహరించి, ఆ తరువాత వారిని గురించి ఆలోచించెద" అని చెప్పిన శ్రీరాముడు సుదినమున కొంత సేనలతోకలసి యూపకేతువును నగర రక్షణమునకు నియమించి, కుశాదులు 7గురు కుమారులును, తమ్ములును, సకలసేనలును వెంటరాగా, మూలకా సురుని సంహరించుటకై ప్రయాణమై ఊరి వెలుపలికి వచ్చెను. సమస్తసేనలను విమానమున నెక్కించెను. అంతలో సుహృత్తులగు రాజులందరును నానావాహనములు ఎక్కి తమతమ సైన్యములతో శ్రీరామునికి నమస్కరించి, ఎదుట నిలిచిరి. రాముడు వారినందరిని, వారి పరివారమును కలసి విమానమున ఎక్కించెను.

**ఆరురోహ విమానాగ్ర్యం కపిభీ రాఘవాజ్ఞయా ।**
**తతః సీతాం వినా రామః స్వయం స్థిత్వా తు పుష్పకే ॥ 111**

**పశ్యన్నానావిధాన్ దేశాన్యయౌ లంకావిహాయసా ।**
**యాత్రాకాలే యథా యానరచతాఽఽసీత్తథా పునః ॥ 112**

తతో రామం సమాయాతం శ్రుత్వా స మూలకాసురః ।
యయౌ లంకాంబహిర్యోద్ధుం రాఘవేణ బలీయసా ॥ 113

దశకోటిమితాం సేనాం బిభ్రాన్ స వరదర్పితః ।
తతస్తే రాక్షసాః పద్భిర్నిహన్యుః ప్లవగాన్ ముహుః ॥ 114

వానరా రాక్షసాంశ్చాపి నిహన్యుస్తాన్ ద్రుషన్నగైః ।
ఏవం బభూవ తద్యుద్ధం తుములం దినసప్తకమ్ ॥ 115

తత్ర యే యే మృతా యుద్ధే వానరాస్తాన్స మారుతిః ।
ద్రోణాచలం సమానీయ జీవయామాస పూర్వవత్ ॥ 116

తతః సా రాక్షసీ సేనా చతుర్థాంశావశేషితా ।
తాన్నష్టాన్ రాక్షసేంద్రః స దృష్ట్వా క్రోధయుతస్తదా ॥ 117

మంత్రిణశ్చోదయామాస తథా సేనాపతీన్ బలైః ।
తానాగతాన్ రణభువం రామవీరాః సహస్రశః ॥ 118

శతఘ్నీభిర్భ్రాస్త్రయంత్రైః బిందిపాలభుసుండిభిః ।
పరిఘైః పట్టిశైః శూలైః కుంతైః ఖడ్గైర్వ్యమర్దయన్ ॥ 119

తేఽపి తాలైస్తమాలైశ్చ హింతాలైశ్చ ద్రుషన్నగైః ।
శాలైః శిలాభిః శ్రీరామవీరాన్ సంమర్దయన్ రణే ॥ 120

పునర్యుద్ధం మహచ్చాసీత్తుములం రోమహర్షణమ్ ।
తతస్తాన్ మంత్రిణః సర్వాంస్తథా సేనాపతీనపి ॥ 121

రామవీరాః క్షణేనైవ చక్రుః సంయమనీగతాన్ ।
తాన్ సర్వాన్ నిహతాన్ శ్రుత్వా క్రోధేన మూలకాసురః ॥ 122

కపిసేనా నాయకుడైన సుగ్రీవుడు 18 పద్మముల సంఖ్యగల మహాకపిసైన్యముతో వచ్చి, శ్రీరామాజ్ఞనంది విమానమునెక్కి విరాజించెను. అంత ఆ శ్రీరామచంద్రుడు జానకీదేవిని వదిలి తానొక్కడే పుష్పకవిమానమున సుఖాసీనుడై నానావిధ దేశవినోదములను విలోకించుచు, గగన మార్గమున లంకానగరమును గురించి వెడలెను. తీర్థయాత్రా సమయమున పుష్పకవిమానమున సన్నివేశములు ఎట్లు కల్పింపబడియుండెనో మరల అట్లే జేయబడినది (112)

## మూలకాసుర యుద్ధములో కుశుని పరాక్రమము.

అంతనచ్చట మూలకాసురుడు శ్రీరాముడు వచ్చుచున్న సంగతిని విని లంకకు బయట బలిష్ఠుడగు శ్రీరామునితో యుద్ధముచేయనెంచి, 10 కోట్ల సంఖ్యగల మహాసైన్యమును తీసికొని బ్రహ్మావరములచే గర్వించినవాడై వచ్చెను. అంత ఆ రాక్షసులు తమకాళ్ళత్రొక్కిళ్ళలో కపివీరులను పలుమార్లు చంపుచు వచ్చిరి. కపివీరులును రాక్షసులనుకూడ చెట్లు, రాళ్ళచే చితకకొట్టిరి. ఇట్లు వారి యుద్ధము 7 రోజులు అవిచ్ఛిన్నముగా జరిగినది. అచ్చట వానరులెవరెవరు యుద్ధమున మృతినొందుచుండిరో వారినందరిని ఆంజనేయుడు మునుపటివలె ద్రోణాచలమును తెచ్చి, బ్రతికించుచుండెను. అంత ఆ రాక్షససేన నాల్గింటినొకపాలు మిగిలినదయ్యె. దానిని చూచి మూలకాసురుడు క్రోధావిష్టుడై మంత్రులను సేనాపతులను ప్రేరేపించి పంపెను. వారు సైన్యములతో వచ్చుట చూచి, వేలకొలది శ్రీరామవీరులు ఫిరంగులు, కరయంత్రములు, భిండివాలములు (ఇనుప అలుగుకట్టిసాగు) భుసుండములు (కత్తులు కొనగంటగల యినప దొణ్ణెలు) పరిఘలు (లాఠీకట్లలు) శూలములు, కుంతములు, ఖడ్గములు మొదలైన ఆయుధములచే బాగా కొట్టసాగిరి. ఆ రాక్షసవీరులును వీరిని తాల, హింతాల, తక్కోల, తమాలాది వృక్షములచే, కొండలతో పడగొట్టుచుండిరి. మరల గొప్ప సంకులయుద్ధమొకటి ఆశ్చర్యకరముగా జరిగెను.

**స్వయం దివ్యరథే స్థిత్వా కించిత్ సైన్యయుతో యయౌ ।**
**తమాగతం నృపా దృష్ట్వా యయుర్యోద్ధుం సహస్రశః ॥ 123**

**వవర్షుః శరజాలైశ్చ చక్రుర్దుందుభినిఃస్వనాన్ ।**
**తాన్సర్వాన్ రాక్షసేంద్రః స చకార భువి మూర్ఛితాన్ ॥ 124**

**తాన్ మూర్ఛితాన్ నృపాన్ దృష్ట్వా యోద్ధుం తేన పునర్యయుః ।**
**సుమంత్రాద్యా మంత్రిణశ్చ రాఘవస్యాజ్ఞయా బలైః ॥ 125**

**తాన్సర్వాన్ మూర్ఛితాన్ బాణైశ్చకార మూలకాసురః ।**
**మూర్ఛితాన్ మంత్రిణో దృష్ట్వా కుశాద్యా బాలకా యయుః ॥ 126**

**తతో బభూవ తుములం యుద్ధం తల్లోమహర్షణమ్ ।**
**తతః కుశః స్వబాణౌఘైః లంకాయాం మూలకాసురమ్ ॥ 127**

**పక్షిపద్ధట్టమధ్యే స పపాత పునరుత్థితః ।**
**తతో౽భిచారికం హోమం రథశస్త్రార్థముత్తమమ్ ॥ 128**

**కర్తుం వివేశ స గుహాం బద్ధ్వా ద్వారాణ్యనేకశః ।**
**తతో విభీషణః ప్రాహ హోమధూమం నిరీక్ష్య చ ॥ 129**

**రాఘవం కల్పవృక్షాధః సంస్థితం బంధువేష్టితమ్ ।**
**హోమం కరోత్యయం దుష్టః ప్రేషయస్వ కపీన్మునః ॥ 130**

**హోమే సమాప్తేఽజేయః స భవిష్యతి మహాసురః ।**
**ఏతస్మిన్నంతరే బ్రహ్మా యయౌ రామం సురైర్యుతః ॥ 131**

**నత్వా తం రాఘవశ్చాపి పూజయామాస సాదరమ్ ।**
**తదాఽఽహ రాఘవం బ్రహ్మా వరస్త్వస్మై మయాఽర్పితః ॥ 132**

**యదా వీరాన్న మే మృత్యుర్భవత్వితి పురా మమ ।**
**అనేన యాచితం రామ తపోంతేఽంగీకృతం మయా ॥ 133**

ఆ వెనుక మూలకాసురుని మంత్రులను, సేనాపతులను కూడా శ్రీరామవీరులు క్షణమాత్రమున యమపురికి పంపివేసిరి. ఇట్లు వారు పడిపోయిన సంగతి విని మూలకాసురుడు క్రోధాక్రాంతుడై తానే దివ్యరథమునునెక్కి, కొంత సైన్యమును తీసికొని వచ్చెను. వచ్చుచున్న వానిని చూచి, వేలకొలది రాజులు వెడలిరి. బాణవర్షమును కురిపించిరి. రణభేరీలను మ్రోగించిరి. వారినందరిని రాక్షసరాజు మూర్ఛాక్రాంతుల జేసెను. ఇట్లు నేలపైబడిన రాజులనుచూచి సుమంత్రాది మంత్రివీరులును, శ్రీరామాజ్ఞచే యుద్ధమునకు బయలుదేరిరి. మూలకాసురుడు వారినికూడా మూర్ఛితులను జేసెను. మంత్రులు మూర్ఛితులగుట జూచి, కుశాదులగు బాలవీరులు వెడలిరి. అంత అద్భుతములగు తుములయుద్ధము జరిగెను. అంత ఆ కుశుడు తన బాణసమూహముచే మూలకాసురుని లంకాపట్టణమున ఒక మంచమీద పడద్రోసెను. ఆ మూలకాసురుడును మరల లేచి పడిపోయెను. అందువలన అతడు దివ్యాయుధ, దివ్యరథములను సంపాదించుకొనుటకై అభిచారిక హోమమును ఆరంభించెను. ఆ హోమమునకు ఎవరును రానట్లు అన్ని మార్గములను బంధించి ఒక గుహలో ప్రవేశించెను. అంత ఆ విభీషణుడు హోమధూమమును అవలోకించి, కల్పవృక్షముక్రింది బంధు పరివారముతో పరివృతుడై కూర్చుండియుండిన శ్రీరామచంద్రస్వామి సన్నిధికివచ్చి, “స్వామీ! ఈ దుష్టుడు హోమమును చేయనారంభించెను. మరల ఈ కపివీరులను పంపుము. హోమము పరిసమాప్తి నందెనా ఈ మహాసురుడు అజేయుడగును,” అని చెప్పెను (130) అంతలో బ్రహ్మదేవుడు దేవతలతోకూడి అచ్చటి శ్రీరామసన్నిధికి వచ్చెను. శ్రీరామచంద్రుడును బ్రహ్మను చూచి నమస్కరించి, సాదరముతో సత్కరించెను. అప్పుడు బ్రహ్మదేవుడు శ్రీరామునితో, “నేను వీనికిట్లు వరమిచ్చితిని. ఈ మూలకాసురుడు మునుపు వీరుని నుండి నాకు మరణము కలుగకూడదు. అని వరము వేడెను. నీ కట్లే కడపటయగునని నేను అంగీకరించితిని.

అతోఽస్య పురుషాన్మృత్యుర్న భవిష్యతి రాఘవ ।
స్త్రీహస్తాన్మరణం చాస్య విద్ధి త్వం రఘునందన ॥ 134

అన్యత్ కించిత్ ప్రవక్ష్యామి కారణం మరణేఽస్య హి ।
ఏకదా శోకయుక్తేన పురాఽనేన ద్విజాగ్రతః ॥ 135

సీతాచండీనిమిత్తేన జాతో మే హి కులక్షయః ।
ఇతి యన్నిష్ఠురం వాక్యముక్తం తన్మునిభిః శ్రుతమ్ ॥ 136

తేష్వేకస్తం మునిః క్రోధాద్దదౌ శాపం హి రాక్షసమ్ ।
యా చండేతి త్వయోక్తా సాఽద్యైవ త్వాం మారయిష్యతి ॥ 137

తన్మునేర్వచనం శ్రుత్వా తం జఘాన స రాక్షసః ।
తద్భీత్యా మునయః సర్వే తూష్ణీంభూతాః స్థితా పురా ॥ 138

తస్మాత్తన్మునివాక్యేన మమాపి వరదానతః ।
సీతాహస్తాన్మృతిశ్చాస్య భవిష్యతి న సంశయః ॥ 139

అతః సీతాం సమానీయ తయైనం జహి రాక్షసమ్ ।
ఇత్యుక్త్వా రామమామంత్ర్యం యయౌ వేధా నిజం పదమ్ ॥ 140

రామోఽపి బ్రహ్మవచనం శ్రుత్వా ప్రాహ విభీషణమ్ ।
మూలకాసురహోమాయ న కార్యం విఘ్నమద్య హి ॥ 141

సీతాయామత్ర యాతాయాం విఘ్నం కార్యం ప్లవంగమైః ।
ఇత్యుక్త్వా గరుడం ప్రాహ రామః పుష్పకసంస్థితః ॥ 142

అయోధ్యాం గచ్ఛ శీఘ్రం త్వం వాయుపుత్రేణ మద్గిరా ।
తామత్రానయ వైదేహీం స్వపృష్ఠే తాం నివేశ్య చ ॥ 143

సమంతతస్తాం దృష్టేభ్యః పథి రక్షతు మారుతిః ।
తథేతి రామవచనమురరీకృత్య సాదరమ్ ।
తావుభౌ రాఘవం నత్వాఽయోధ్యా శీఘ్రం ప్రజగ్మతుః ॥ 144

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, శతనారీవరప్రదానం, మూలకాసురాఖ్యానం నామ, చతుర్థ స్సర్గః ॥**

## బ్రహ్మదేవుడు మూలకాసురుని వరమును విన్నవించుట

శ్రీరామా! నేనిచ్చిన వరప్రభావమువలన పురుషులనుండి ఇతనికి మరణము కలుగదు. స్త్రీ హస్తమునుండియే ఇతనికి మరణమని నీవెరుగుము. మరియొకసంగతిని చెప్పెదను. వీని మరణమున మరియొక కారణము గలదు. ఒకప్పుడితడు బ్రాహ్మణుల ఎదుట దుఃఖించుచు– సీత చండ(దుర్గ) కావున, దాని వలననే నా కులము నాశనమయ్యె– అని నిష్ఠురమునాడెను. అచ్చట మునులందరును వినిరి. వారిలో నొకడు కోపావిష్టుడై– ఓరి దురాత్మా! ఎవతిని నీవు చండయని దూషించితివో, ఆమెయే నిన్ను సంహరింపగలదు," అని శాపమునిచ్చెను. ఆ మునీంద్రుని మాటలను విని ఈ మూర్ఖుడు వానిని చంపెను. ఆ భయమువలన మునులందరును మునుపు ఊరకే ఉండిరి. కావున ఆ ముని వాక్యము వలనను నాయొక్క వరప్రదానమువలనను సీతాదేవి చేతిమీదుగానే ఇతనికి మరణముగలదు. ఇందుకు సంశయము లేదు. గనుక సీతాదేవిని పిలుపింపుము. ఆమె వలననే వీనిని జయింపుము," అని బ్రహ్మదేవుడు శ్రీరామచంద్రస్వామికి భావికార్యమును సూచించి, అనుజ్ఞనంది, తనస్థానమునకు వెడలెను (140). శ్రీరాముడును బ్రహ్మవాక్యమువిని విభీషణునితో, "మూలకాసురుడు చేయుచుండు హోమమునకు ఇప్పుడు విఘ్నము చేయవలదు. సీత ఇచ్చటికి వచ్చిన తరువాత కపులచే హోమమునకు విఘ్నము చేయింతము," అని చెప్పి, గరుడుని చూచి, "నీవు త్వరగా అయోధ్యకు వెళ్ళి, ఆంజనేయునితో నా మాటను విన్నవించి, నా సీతాదేవిని నీ వీపుమీద ఎక్కించుకుని రమ్ము. అంతట మార్గమున దుష్టులవలన కలుగు బాధలను ఆంజనేయుడు తొలగించుగాక," అని ఆజ్ఞాపించెను. అంత గరుడుడు, ఆంజనేయుడు ఇరువురును శ్రీరామవాక్యమును అట్లే అని అంగీకరించి, శ్రీరాముని పాదపద్మములకు నమస్కరించి అయోధ్యకు వెడలిరి.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, పూర్వార్ధములో, నూరుమంది స్త్రీలకు వరమును ప్రసాదించుట, మూలకాసుర ఆఖ్యానం అనే 4వ సర్గ ముగిసినది.**

# పంచమః సర్గః-5వ సర్గ

సీతావిరహవర్ణన

**శ్రీరామదాస ఉవాచ**

**అథ భూమిసుతాఽయోధ్యాపుర్యాం సా హృది రాఘవమ్ ।**
**స్మరంత్యాసీత్తద్విరహాద్వ్యాకులా నాప శం క్షణమ్ ॥ 1**

**ప్రాసాదే సా కదా తస్థౌ కదా ప్రాసాద మూర్ధని ।**
**కదా ద్రాక్షామంటపాద్యః కదా సన్యస్తభూషణా ॥ 2**

**వారస్త్రీణాం కదా నృత్యం దదర్శ జనకాత్మజా ।**
**కదా జయార్థం రామస్య కార్తవీర్యమపూజయత్ ॥ 3**

**కదాఽకరోచ్చ తులసీశివాశ్వత్థాన్ ప్రదక్షిణః ।**
**మన్యుసూక్తాని విప్రైశ్చ పాఠయామాస జానకీ ॥ 4**

**గోమయేనాంజనేయం సా కుడ్యాం కృత్వాఽర్చ్య జానకీ ।**
**అకరోత్ప్రత్యహం పుచ్ఛవృద్ధిం స్వాంగులిమాత్రతః ॥ 5**

**శతరుద్రీయసూక్తస్య జయార్థం రాఘవస్య సా ।**
**దుర్గాయాః పూజనం నిత్యం చకార నియతవ్రతా ॥ 6**

## శ్రీ జానకీదేవియొక్క విరహాదివర్ణనము.

శ్రీరామదాసు ఇట్లుచెప్పుచున్నాడు : అంత ఆ సీతాదేవి అయోధ్యాపట్టణమునందు తన మనసున శ్రీరామచంద్రస్వామిని స్మరించి, ధ్యానముచేయుచు, శ్రీరామ విరహమువలన కలతనొంది, కన్నీరు నిండగా, మేడమీద నెప్పుడుండునో, ఎప్పుడు ఆభరణములనన్నిటిని తీసి పెట్టుచున్నదో, వారవనితల యొక్క నృత్తగీతాదికాన్ని ఎప్పుడు చూచునో, శ్రీరామునికి జయము కలుగునట్లు శ్రీకార్తవీర్యార్జునుని ఎప్పుడు పూజించునో, శివప్రదక్షిణమును అశ్వత్థ ప్రదక్షిణమును తులసీ ప్రదక్షిణమును ఎప్పుడు చేయుచుండునో, ఎప్పుడు బ్రాహ్మణులచేత మన్యుసూక్తమును పఠన చేయించునో తెలియలేదు. సీతమ్మ గోమయముచే ఆంజనేయుని గోడమీదచేయించి పెట్టి పూజించి, ప్రతిదినము అంగుళ మాత్రము తోక పెరుగునట్లు చేయుచుండును. బ్రాహ్మణులను పిలిపించి, వారిచే శ్రీరామునికి జయము కలుగవలయునని శతరుద్రీయ (నమక, చమక) సూక్తములయొక్క జపమును చేయించును.

గణేశం మారుతిం శంభుం స్థండిలే స్థాప్య ప్రేమతః ।
చకార బద్ధ్వా ద్వారాణి గవాక్షైః సేచయజ్జలమ్ ॥ 7

కార్తవీర్యస్య యంత్రాణి స్థాపయామాస జానకీ ।
మంచకే రాఘవేంద్రస్య పూజయామాస సర్వదా ॥ 8

కదా సఖీమధ్యగా సా త్యక్తాలంకారమండనా ।
జలయంత్రాంతికే నిద్రాం నాప తద్విరహాగ్నినా ॥ 9

కదా నిరీక్ష్య ప్రాసాదే కాకమాహ విదేహజా ।
యది శీఘ్రం రాఘవస్య దర్శనం మే భవిష్యతి ॥ 10

తర్హి త్వం గచ్ఛ వేగేన నో చేదత్ర స్థిరో భవ ।
తత్సీతావచనం శ్రుత్వా కాకస్తూడ్డీయ వేగతః ॥ 11

తేన కించిత్సమాశ్వస్తా పవనం ప్రాహ జానకీ ।
స్పృష్ట్వా త్వం రాఘవాంగాని మాం స్పర్శం కర్తుమర్హసి ॥ 12

కదా చంద్రం నిశి ప్రాహ త్వం స్పృష్ట్వా శీతలైః కరైః ।
శ్రీరామం మాం స్పృశస్వాద్య స్వకరైః సుఖకారకైః ॥ 13

శుక్లపక్షే ద్వితీయాయాం సీతాఽలంకారమండితా ।
స్నాత్వా ప్రాసాదశిఖరాత్సఖీభిః పరివేష్టితా ॥ 14

అపశ్యచ్ఛశినం హర్షాదేనం రామోఽద్య పశ్యతి ।
అంతరేణాద్య రామస్య సంయోగో మాం భవేదితి ॥ 15

రామే గతే కదా సీతా హరిద్రాకజ్జలాదికైః ।
నాత్మానం ధూపయామాస హ్యత్రిపత్న్యర్పితం వినా ॥ 16

చందనం పుష్పమాలాశ్చ పుష్పశయ్యాం విదేహజా ।
నాంగీచకార శ్రీరామవిరహానలపీడితా ॥ 17

ఎల్లప్పుడును ఉదక కలశములలో దుర్గాదేవిని, శ్రీగణపతిని, ఆంజనేయుని, శంభుస్వామిని, జలవర్తి మూర్తులుగా పూజించుచుండును. వాకిళ్ళను మూసి, గవాక్షములగుండా నీళ్ళను పారపోయు చుండును. శ్రీకార్తవీర్యయంత్రమును శ్రీరాముని మంచముమీద స్థాపించి సంపూజించు చుండును. ఆమె ఒకప్పుడు చెలికత్తెలనడుమ కూర్చుండి తన భూషణాలంకారములను వదలి ఉండును. శ్రీరామ విరహాగ్నిచేత ఆ సీతమ్మ జలయంత్రముల సమీపమునను నిద్రనందకపోయె. ఒకప్పుడు మేడమీద కూర్చుండియుండిన వాయసమును చూచి, “శ్రీరామునియొక్క దర్శనము త్వరగా నాకు కలుగునట్లయిన నీవు ఇచ్చటినుండి త్వరగా కదులుము. లేదా కూర్చుండియుండుము,” అని చెప్పగా; ఆ కాకి త్వరగా శ్రీరామదర్శనము కాగలదను శకునమును చూపునదియై అచ్చటినుండి త్వరగా లేచి వెడలెను. అందువలన కొంత సమాధానమునంది, జానకీదేవి గాలివీచుచుండగా ఆ గాలిని చూచి, “నీవు శ్రీరాముని దివ్యాంగములను స్పృశించి, నన్ను తాకుటకు తగినవాడుగా ఉన్నావు,” అని మాటలాడును, ఒకప్పుడు రాత్రిలో చంద్రునిగురించి, “నీయొక్క చల్లని కిరణములచే శ్రీరామస్వామిని స్పృశించి పిదప సుఖకరములగు నీ కిరణములచే నన్ను స్పృశింపుము,” అని విలపించును. శుక్లపక్షమున విదియనాడు సీతమ్మ అలంకారము జేసికొని, స్నానముజేసి, చెలికత్తెలతో కూడి మేడమీది నుండి నేను ఈ చంద్రునిచే రాముడు చూడబడుచున్నాడని, త్వరగా నాకును శ్రీరామునికిని నేడు సమాగమము కలుగుచున్నదనియును, ఉల్లాసముతో చంద్రునిని చూచుచుండును. శ్రీరాముడు విజయయాత్రజేసి వెడలిన పిదప; ఒకప్పుడు పసుపు కాటుకలను అలంకరించుకొనెను. అత్రిమహర్షియొక్క పత్నియైన అనసూయ అనుగ్రహించి ఇచ్చిన అలంకార ఆభరణములను తప్ప తక్కిన భూషణములను ఒకసారైనా ధరించదు. చందనమును, పుష్పరసములను, పూలపాన్పును సీతాదేవి ఒక్కసారైనా శ్రీరామవిరహము వలన అంగీకరించదు.

**శకునాన్ సా దదర్శాథ శ్రీరామదర్శనేచ్ఛయా ।**
**తుష్టాఽభూచ్ఛకునైః శ్రుత్వా శీఘ్రం రామసమాగమః ॥ 18**

**భవేదితి సఖీయుక్తా దదౌ సర్వాన్ సుశర్కరాః ।**
**కదా పరగృహం సీతా న యయౌ రాఘవం వినా ॥ 19**

**నైకా తస్థౌ క్వాపి సీతా స్వాభ్యంగోద్వర్తనం జహౌ ।**
**న మిష్టాన్నం న తాంబూలం న గీతం కేశబంధనమ్ ॥ 20**

**అంగీచకార శ్రీరామవిరహానలదీపితా ।**
**సంభాషణం స నాన్యేన పురుషేణాకరోత్కదా ॥ 21**

నాకరోత్సస్మితం వక్త్రం నోర్ధ్వాస్యాఽన్యం దదర్శ సా ।
అన్యాక్షిగోచరా నాభూన్న సంతుష్టాఽభవత్కదా ॥ 22

పర్యంకే శయనం సీతా నాకరోద్రాఘవం వినా ।
ముకురే న దదర్శేత్థం ముఖం విరహపాండురమ్ ॥ 23

న దధౌ వసనం చిత్రం న చిత్రాం కంచుకీం దధౌ ।
న తస్థౌ ద్వారదేశే సా దేహళ్యంగణభూమిషు ॥ 24

న యయౌ శరయూం స్నాతుం యయౌ నోపవనం వనమ్ ।
ఆరామం న యయౌ సీతా న తథా పుష్పవాటికామ్ ॥ 25

న చకార స్వతో దూరం మాంగల్యాని విదేహజా ।
వస్త్రాని ద్విజపత్నీస్తైస్తోషయామాస జానకీ ॥ 26

నియమానకరోన్నానాం దేవీనాం చ పృథక్ పృథక్ ।
నియమైశ్చ వ్రతైస్తస్థౌ స్వయం నిత్యం విదేహజా ॥ 27

వటకానాం మహామాలాదర్పయామి హనూమతే ।
మోదకాన్ గణరాజాయ దాస్యామి పూరణాన్వితాన్ ॥ 28

శ్రీరాముని చూడవలయునను అత్యంత కుతూహలముతో శకునములను చూచును. అట్టి శకునములలో త్వరగా శ్రీరామసమావేశము కలుగునని విని ఆనందమునొందుచు తనసఖులతో సరసములాడుచు అందరికిని చక్కెర పంచుచుండును. శ్రీరాముడు లేనందున తాను ఒంటరిగా ఎప్పుడును పరగృహమునకు ప్రవేశించకయుండె. ఎప్పుడును తానొంటరిగా కూర్చొనదు. అభ్యంగనమును, నలుగును వదలిపెట్టెను. ఉల్లాసోత్తేజకమగు మృష్టాన్నమును తినదు. తాంబూలమును వేసికొనదు. సంగీతమును వినదు. తలదువ్వి కొప్పుపెట్టుట, జడవేసికొనుట మొదలైన కేశ అలంకారములను ఒనరింపదు. శ్రీరామ విరహాగ్నిచే సంతప్తగాత్రయగు సీతమ్మ ఒకప్పుడును పరులతో మాటాడలేదు. నవ్వుమోమును చూపలేదు. తలఎత్తి ఎవనిని చూడలేదు. పరపురుషుని కంట కనుపడదయ్యె. ఒకప్పుడును సంతుష్టాంతరంగ కాదయ్యె. శ్రీరామచంద్రస్వామి లేనప్పుడు జానకీదేవి ఎన్నడును మంచముమీద, పాన్పుపై పవళించలేదు. విరహముతో పాలిపోయిన తన ముఖమును అద్దమున చూచినదిలేదు. చిత్రాలంకారములుగల చీరను ఎప్పుడును కట్టలేదు. విచిత్రమైన రవికె ఒకప్పుడును తొడిగినదిలేదు. వాకిళ్ళలో నిలువలేదు. ముంగిళ్ళలో నడవలలో నిలుబడలేదు.

సరయూనదికి స్నానమునకు పోలేదు. పుష్పవాటికలకుపోయి విహరించలేదు. మాంగళ్యవస్తువులను తనవద్దనే పెట్టికొని వానిచే బ్రాహ్మణసువాసినులను సత్కరించుచూ, వారినెడబాయక వర్తించుచు వచ్చెను. దేవతా సంతృప్తికొరకై వేర్వేరుగా నియమములను అనేకములుగా జేసెను. తానుగానే సనియమముగా వ్రతములనాచరించుచు, నిరంతరము సీతాదేవి సత్ప్రవర్తనముచే మెలగెను. "వడియముల సరములను ఆంజనేయస్వామికి కానుకగా అర్పించెదను," అనియును; "ఓ గణపతీ! నీకు పూర్ణముల(కుడుములతో)తో నింపబడిన జిల్లేడుకాయల మాలను సమర్పించెదను,

**సిద్ధాన్నేనాపి నైవేద్య తే దాస్యామి గణాధిప ।**
**దుర్గే త్వాం బలిదానం చ కరిష్యామి ప్రసీద మే ॥ 29**

**చండికే త్వాం ప్రదాస్యామి రక్తం జిహ్వోద్భవం త్వహమ్ ।**
**సుష్టృన్నం మాషసంయుక్తం బలిదీపసమన్వితమ్ ॥ 30**

**శీఘ్రం రామో జయం ప్రాప్య శిశుభిర్యాతు వై పురీమ్ ।**
**మందవారే కరిష్యామి పంచ చోపోషణాన్యహమ్ ॥ 31**

**నోపభోక్ష్యామి మధురం నోపభోక్ష్యామ్యహం ఘృతమ్ ।**
**మాసమేకం కరిష్యామి వ్రతాన్యేవం సవిస్తరాత్ ॥ 32**

**కృష్ణపక్షే తృతీయాయాం చతుర్థ్యాం వా మహేశ్వరి ।**
**కించిత్కించిన్మాసి మాసి తిలవృద్ధిం విధాయ చ ॥ 33**

**గుడేనాహం తిలాన్భోక్ష్యే యావచ్ఛ్రీరామదర్శనమ్ ।**
**భవిష్యతి కుశాద్యైశ్చ లక్ష్మణాద్యైశ్చ బంధుభిః ॥ 34**

**సత్వరం నవరాత్రం చ సఖీభిశ్చ కరోమ్యహమ్ ।**
**ఏకస్మిన్నేవ దివసే నవభిః ప్రభుదర్శనే ॥ 35**

**రవివారే కరిష్యామి రవేఽహం పూజనం తవ ।**
**ఇత్థం దినే దినే సీతా నియమానకరోత్తదా ॥ 36**

**బ్రాహ్మణైరర్ఘ్యదానం చ కారయామాస జానకీ ।**
**న సా సుష్వాప రాత్రౌ తు దివా వా వరవర్ణినీ ॥ 37**

ఏవం దినే దినే సీతా శ్రీరామవిరహాతురా ।
న శమాప క్వాపి దేశే శ్రీరామార్పితమానసా ॥ 38

ఏవం తా ఊర్మిళాద్యాశ్చ చంపికాద్యాపి వై స్త్రియః ।
స్వస్వస్వామివియోగాగ్నిజ్వలితా వ్యాకులాః క్షణమ్ ॥ 39

అంతమాత్రమే గాదు పక్వాన్నములను కూడా నివేదించెదను స్వామీ," అనియు; "ఓదుర్గాదేవీ! నీవు ప్రసన్నురాలవగుము. నీకు బలిప్రదానములను సమర్పించెదను. నన్ను అనుగ్రహింపుము," అనియూ; "ఓ చండీదేవీ! బలిదీపములతో కూడిన మంచి మినుప పప్పుగలసిన పక్వాన్నములను అర్పించెదను. త్వరగా శ్రీరామచంద్రస్వామి బిడ్డలతోడ జయమునొంది వచ్చును గాక," అనియూ; ప్రతి శనివారమున 5 మార్లు ఉపవాసవ్రతము నాచరించెదను," అనియూ; "ఓ మహేశ్వరీదేవీ! శ్రీరామచంద్రస్వామి సపరివారుడుగా నాకు దర్శనము నిచ్చునంతవరకు, అతనికి జయమును, కీర్తి ప్రతిష్ఠలు కలుగుటకై, ప్రతినెలలోను కొంచెము కొంచెము అభివృద్ధియగునట్లు తిలగడపిష్టము (చిలిమి యుండలను) కృష్ణపక్షతదియనాడు గాని, చవితినాడుగాని భక్షించెదను. నా చెలికత్తెలతో కలసి నవరాత్రవ్రతమును ఆచరించెదను," అనియు; "ఓ సూర్యభగవానుడా! ఆదివారమునాడు నీయొక్క విద్యుక్తపూజన వ్రతమును ఆచరించెదను," అనియు; ఇట్లు ప్రతినిత్యము పలువిధములుగా నియమములను ఆరంభించుచు చేయుచుండెను. బ్రాహ్మణులచే దేవతలకు సమంత్రక వ్రత అర్ఘ్యములను ఇప్పించుచుండెను. ఆమె పతినెడబాసియుండెను. చింతచే రాత్రిగాని, పగలుగాని కొంచమైనను నిద్రనొందదయ్యె.

న సుఖం క్వాపి వై ప్రాపుః స్వకాంతార్పితమానసాః ।
సర్వాస్తా లులుఠుర్నార్యో మణిభూమౌ మృగీదృశః ॥ 40

కాచిన్నర్తయతి క్రీడామయూరం న ముదా తదా ।
శుకం న పాఠయత్యన్యా పంజరస్థం కుతూహలాత్ ॥ 41

లాలయేన్నకులం నాన్యా నాలాపయతి సారికమ్ ।
అపరాఽతీవ సంతప్తా నైవ ఖేలతి సారసైః ॥ 42

ఖేజిరే న విలాసం తా రేమిరే నైవ మందిరే ।
సఖీభిరూచిరే నాలం వీణావాద్యం న శుశ్రువుః ॥ 43

కల్పద్రుమప్రసూతం యద్రవవత్తత్సుధోపమమ్ ।
మందారకుసుమామోదం న వపుర్మధురం మధు ॥ **44**

యోగిన్య ఇవ తా ముగ్ధా నాసాగ్రన్యస్తలోచనాః ।
అలక్ష్యధ్యానసంధానాః స్వనాథార్పితమానసాః ॥ **45**

చంద్రకాంతిమణిచ్ఛన్నే స్రవద్వారికణద్రవే ।
క్షణం వాతాయనే స్థిత్వా జలయంత్రేణక్షణం క్వచిత్ ॥ **46**

రచయంతి క్షణం శయ్యా దీర్ఘికా భోజినీదలైః ।
వీజ్యమానాః సఖీభిస్తాః శీతలైః కదలీదలైః ॥ **47**

ఇత్థం యుగసమాం రాత్రిం దినం తా మేనిరే సదా ।
కథంచిద్ధారణాం కృత్వా విహ్వలాః సజ్వరాః స్థితాః ॥ **48**

ఏతస్మిన్నంతరే సీతా నియమైశ్చ వ్రతాదిభిః ।
సమానీతావాంజనేయగరుడావీయతుఃపురీమ్ ॥ **49**

ఇట్లు దినదినమున జానకీదేవి శ్రీరామవిరహాగ్నిలో కాగి, దైవమగు పతినే ధ్యానించుచు ఎచ్చటను, యేవిధముగాను, కొంచమైనను సుఖమునందలేదు, మరియు అట్లే సీతాదేవియొక్క తోడికోడండ్రగు ఊర్మిళాదులును, కోడండ్రగు చంపికాది అంగనలు, తమతమ పతులనెడబాసియుండు చితాగ్నిచే సంతప్తగాత్రలును, వ్యాకులిత హృదయులునై ఎచ్చటను, ఎట్లును సుఖమునందక సదాచార సత్కర్మా చరణములతో దైవమును ప్రార్థించుచు వర్తించిరి. ఆ సుందరీమణులందరును రత్నకుట్టిమములైన గృహ, భూములమీద విరహాగ్నిచే మండిపోవుచూ పొర్లిపొర్లి తపించుచుండిరి. ఒకతె అప్పుడు ఆనందించుచు, ఆటల నెమలిని ఆడించలేదు. మరియొకతె పంజరమున ఉండెడు చిలుకకు మాటలనేర్పక ఉండెను. వేరొకతె ముంగిసను ముద్దాడలేదు. ఇంకొకతె గోరవంకను పాడించలేదు. మరియొకతె మిక్కిలి సంతాపమునొంది సారసములతో ఆటలాడలేదు. విలాసినులెవ్వరును విలాసము నందరైరి. సుందరాంగులు మందిరములలో ఆనందమందలేదు. ఆ సరసవాణులు సుఖీజనులను పలకరించలేదు. ఆ మగువలు మంజువీణల మంగళవాద్యములను ఆకర్ణించలేదు. ఆ అమృతమునకు సమానమైన కల్పవృక్షముయొక్క పుష్పమును, మందారపుష్ప పరిమళమును, మధురమైన మధువును సేవించలేదు. వారందరును యోగినులవలె ముక్కుకొనయందు ఉంచబడిన చూపుగలవారలై లక్ష్య

ధ్యానములలో ఒకదానిని లక్షించక తమతమ పతులయందే సమర్పింపబడిన చిత్తముగలవారైరి. చంద్రకాంతమణులచే కప్పబడిన జలబిందువులు స్రవించుచుండునట్టి కిటికీలలో కొంతసేపు నిలుచుచూ, నిడుపైన తామరరేకుల పాన్పుపై కొంతసేపు విశ్రమిస్తూ, చల్లని అరిటాకులచే సఖులు వీచుచుండుటచే కొంతసేపు ఊరడించుచును, ఇట్లు పతులనెడబాసిన పణతులు పగలును, రాత్రియును నిరంతరము దినమొక యుగముగా ఎంచుచుండిరి. ఆహా! ఏమనవచ్చును. ఎట్లో ప్రాణములను నిలుపుకొని, కలతనంది విరహజ్వర తాపము గల వారైయుండిరి (48). అంతలో ఇట్లుండగా సీతాదేవి నియమముల చేతను, వ్రతాదులచేతను గరుడాంజనేయులను ఆహ్వానము జేసెను. వారలును పట్టణమును జేరిరి.

**ప్రస్ఫురచ్చ భుజో వామః సీతాయా నయనం తథా ।**
**సుచిహ్నం మన్యమానా సా కించిత్తుష్టాఽభవత్తదా ॥ 50**

**అథ తౌ కంపనోద్భూతగరుడౌ సదసి స్థితమ్ ।**
**అయోధ్యాయాం యూపకేతుం వృత్తం కథయతో జవాత్ ॥ 51**

**చచ్ఛ్రుత్వా యూపకేతుః స వృత్తం సీతాం న్యవేదయత్ ।**
**సా తు తుష్టామనాః సీతా తస్మిన్నేవ దినే శుభే ॥ 52**

**రామవాక్యాదారురోహ గరుడం వేగవత్తరమ్ ।**
**అగ్నిహోత్రం పురస్కృత్య ఋత్విగ్భిశ్చ పురోధసా ॥ 53**

**పతిం వినాఽగ్నినా నారీ సీమాముల్లంఘ్య న వ్రజేత్ ।**
**స దోషోఽత్ర న విజ్ఞేయః సీతోద్యోగో విహాయసా ॥ 54**

**భయే ప్రాప్తే ప్రవాసోఽపి స్త్రీణాముక్తోఽగ్నిభిః సహ ।**
**పతినా రహితానాం చ న దోషః కథ్యతేఽత్ర హి ॥ 55**

**భూమిగైర్బ్రాహ్మణాద్యైశ్చ న దేవచరితం చరేత్ ।**
**తతః స రక్షయామాస మారుతిస్తాం సమంతతః ॥ 56**

**పశ్యంతీ వివిధాన్ దేశాన్ సీతా లంకాం యయౌ ముదా ।**
**దదర్శ కల్పవృక్షాధః పుష్పకస్థం రఘూత్తమమ్ ॥ 57**

**ననామ శిరసా భక్త్యా సాఽవరుహ్య ఖగాధిపాత్ ।**
**తాం దృష్ట్వా రాఘవః ప్రాహ సీతే తేఽద్య సుఖం కథమ్ ॥ 58**

**వివర్ణమంగయష్టిస్తే కృశాఽద్య పరిలక్ష్యతే ।**
**తద్రామవచనం శ్రుత్వా జానకీ సుస్మితాననా ॥ 59**

**విలజ్జంతీ వినోదేన రాఘవం ప్రాహ సాదరమ్ ।**
**స్వామింస్త్వద్విరహాదేతత్సర్వం త్వం విద్ధి రాఘవ ॥ 60**

జానకీదేవికి ఎడమ కనుబొమ్మయును, ఎడమభుజమును, ఎడమ కన్నుకూడ చలించినందున శుభశకునములు కలిగినవని కొంత ఊరడింపు కలిగెను. అంతనప్పుడు గరుడ, ఆంజనేయులు ఇరువురును అయోధ్యాపట్టణమున సభాసీనుడై ఉండెడు యూపకేతుమహారాజు గారి సన్నిధికి సమస్తవృత్తాంతమును త్వరగా విన్నవించిరి. ఆ యూపకేతు మాటలను విని, వెంటనే ఆసంగతిని జానకీదేవిగారి యొక్క సన్నిధికి విజ్ఞాపించెను. ఆమె మిక్కిలి సంతోషమునొంది, మంగళకరమైన ఆ శుభదినమునందే శ్రీరామచంద్రస్వామియొక్క ఆజ్ఞా వనము వలన వేగముగల గరుడునిమీద తమ అగ్నిహోత్రములను, ఋత్విక్ పురోహితులను కూడా సంస్థాపించి కూర్చుండెను. తనతోడ మగడు లేనప్పుడు పాటించు మర్యాద నంతటిని అతిక్రమించి, అగ్నిహోత్రములతో పోకూడదు. అట్టిదోషము నిచ్చుట సీతమ్మయొక్క గగనమున పోవునట్టి ప్రయాణ అవసరమున ఎంచకూడదు, మరియు ధర్మజ్ఞ సమయవిచారము చూడగా, ...

'భయము సంభవించినపుడును, పరస్థలవాసముననను స్త్రీలకు అగ్నిహోత్రములతో వెడలుట పతిని ఎడబాసినప్పుడును దోషములేదు,' అని చెప్పబడినది. భూమిలో సంచరించునట్టి బ్రాహ్మణాదులకు, దేవతలు వర్తించునట్లు తామును చరింపవలయుననిన సరిపడదు.

**న నిద్రామి న జాగర్మి నాశ్నామి న పిబామ్యహమ్ ।**
**ధ్యాయామ్యహం కేవలం త్వాం యోగినీవ వియోగినీ ॥ 61**

**నిద్రాదరిద్రనయనా స్వప్నేఽపి న తవాననమ్ ।**
**ఆనంది సర్వథా యన్మే మందభాగ్యా విలోకయే ॥ 62**

**త్వదాననప్రతినిధిర్విధుర్విధురయా మయా ।**
**ఉదితోఽపి న చాలోకి తాపం వై త్యక్తుకామయా ॥ 63**

త్వదాలాపసమాలాపం కలయన్ కిల కాకలీమ్ ।
కోకిలోఽపి మయాఽఽకర్ణి నాలకాకీర్ణకర్ణయా ॥ 64

త్వదంగసంగమధురో ధవధూపితయా మయా ।
నానిలోఽపి మయాలింగి క్వచిద్విశ్రాంతయా భృశమ్ ॥ 65

నానా యమాశ్చ నియమా జయార్థం తవ రాఘవ ।
కుర్వత్యా మమ నైవాభూత్సుఖం త్వద్విరహాగ్నినా ॥ 66

తతోవిహస్య శ్రీరామస్తామాలింగ్య పునః పునః ।
కరాభ్యాం తత్స్తనౌ స్పృష్ట్వా పపౌ బింబాధరామృతమ్ ॥ 67

అథాపరదినే రామః స్నాత్వా స్నాతాం విదేహజామ్ ।
అస్త్రవిద్యాం శస్త్రవిద్యామస్త్రాహ్వానవిసర్జనే ॥ 68

శిక్షయామాస సకలాం ధనుర్విద్యాం సవిస్తరామ్ ।
రామాజ్ఞయా లక్ష్మణోఽపి రథం సిద్ధం చకార సః ॥ 69

దారుకః సారథిర్యస్మిన్ శస్త్రాణ్యస్త్రాణ్యనేకశః ।
గదాపద్మం తు యత్రాస్తి యత్రాస్తి గరుడో ధ్వజే ॥ 70

అంత ఆంజనేయుడు అంతటా ఆమెను రక్షించుకొనుచుండెను. అప్పుడు సంతోషముతో సీతమ్మ నానాదేశవినోదములను అవలోకించుచు, లంకానగరమునకు వెడలెను. పుష్పకవిమానమున కల్పవృక్షముక్రింద సుఖాసీనుడై ఉండెడు శ్రీరామచంద్రస్వామిని చూచెను. పిదప ఆ జానకీదేవి గరుడునినుండి దిగి భక్తితో ప్రణామము ఒనర్చెను. ఆమెను చూచి, శ్రీరాముడు, "దేవీ! నీకు సుఖమెట్లు? నీ దేహము మిక్కిలి కృశించి తెల్లబారియున్నది," అని అడుగగా, ఆ రామవాక్యములను విని, సీతాదేవి చిరునవ్వుతో సిగ్గుపడుచు సాదరవినోదముగా శ్రీరామునితో, "స్వామీ! నీ విరహము వలననే ఇట్లు తటస్థించినది. ఈ సంగతినంతటిని నీవే తెలిసియున్నావు. నేను నిద్రపోను, మేల్కొని యుండను, తినను, నీరుద్రావను, నిన్నొక్కడినే ధ్యానించుచుందును. వియోగముగల నేను యోగిని వలె వర్తించుచుందును. నిద్రకు దరిద్రదశ నిచ్చిన నా కండ్లలో స్వప్నముపడి ఆనందప్రదమయిన నీ దివ్యాననమును సర్వప్రకారములతో చూచినదానను కాను. తాపనివృత్తి నిచ్చునట్టి విధురయగు నేను, "నీ మోమునకు ప్రతినిధియైన చంద్రుడు ఉదయించుచుండినను నిరీక్షించనైతిని. కోకిలపక్షి నీతో సమానమైన మధురమగు సూక్ష్మధ్వనిని గదా చేయుచుండును. అట్టి కోకిలను కూడా నేను ముంగురలచే

మూయబడిన చెవులతో వినలేదు. ఒకప్పుడును నేను మిక్కిలి విశ్రాంతినందినదాననైన ఇంటిలో ప్రణయనము చేయబడిన అగ్నిహోత్రుడు తద్ధూమముచే నీ అంగసంగము గలవాడై ఇంపుగా నుండునుగదా? అట్టి అగ్నిహోత్రుని కూడా కాచుకొనలేదు. వివిధములగు వ్రతములను నియమములను మీకు జయము కలుగవలయునని నేను నిరంతరముగా ఆచరించుచు నీ విరహాగ్ని సంతాపము గలదాననై సుఖమనుదానిని ఎరుగనైతిని," అని సీతమ్మ పతికి ప్రణయా లాపములను సవినయముగా విన్నవించెను. అంత ఆ శృంగార మంగళాంగుడగు శ్రీరాముడు ఆమెను ఆలింగించి, పలుమార్లు సరసఖేలనముచే సంతోషపరచెను. (67). పిదప రెండవనాడు శ్రీరామచంద్రస్వామి స్నానముచేసి, సుస్నాతయగు జానకీదేవికి అస్త్రవిద్యను, శస్త్రవిద్యను, అస్త్రములయొక్క ప్రయోగ ఉపసంహారములను, సమస్త ధనుర్విద్యను సవిస్తరముగా ఉపదేశించి అనుగ్రహించెను. శ్రీరామాజ్ఞచే లక్ష్మణుడును దివ్యరథమును సిద్ధపరచెను. దారుకుడు ఆ రథమునకు సారథిగా ఉండును. అనేక శస్త్రములు ఆ రథమున గలవు.

**యస్మిన్ శైబ్యశ్చ సుగ్రీవస్తథా చైవ వలాహకః ।**
**మేఘపుష్పశ్చ చత్వారో వాయుగాస్తురగోత్తమాః ॥ 71**

**యత్ర ఛత్రం వరం దివ్యం హేమదండం విరాజతే ।**
**యస్మిన్ శుక్లే చామరే ద్వే యస్మిన్నీలాదిరుక్మజమ్ ॥ 72**

**తం రథం రాఘవో దృష్ట్వా జానకీం వాక్యమబ్రవీత్ ।**
**సీతే స్థిత్వా స్యందనేఽస్మిన్ జహి త్వం మూలకాసురమ్ ॥ 73**

**తథేతి రామవాక్యాచ్ఛాయాం సీతా ప్రచోదయత్ ।**
**తామసీ సాఽపి తం నత్వా పరిక్రమ్య పునః పునః ॥ 74**

**ఆరురోహ రథం వేగాత్ ఘోరా ఘర్ఘరనిఃస్వనా ।**
**ఏతస్మిన్నంతరే రామప్రేరితా వానరోత్తమాః ॥ 75**

**లంకాం గత్వా పూర్వవచ్చ హవనాత్తం ప్రచాలయన్ ।**
**తతస్తే వానరాః సర్వే యయుః శ్రీరాఘవం పునః ॥ 76**

**యయౌ స్థిత్వా రథే యోద్ధుం క్రోధేన మూలకాసురః ।**
**మార్గే భువి పపాతస్య మకుటః స్ఖలితో భువి ॥ 77**

**అనివర్త్యాసురో గర్వాద్యయౌ రణభువం జవాత్ ।**
**సీతాచ్ఛాయాఽపి సైన్యేన యయౌ సా లక్ష్మణాదిభిః ॥ 78**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, సీతావిరహో నామ, పంచమః సర్గః ॥**

సీతాదేవి ఎక్కు రథమునకు శైబ్య, సుగ్రీవ, వలాహక, మేఘపుష్పములను నాలుగు గుఱ్ఱములు కట్టబడిఉన్నవి. ఆ తురగములు వాయువేగము గలవి. దివ్యమైన తెల్లనిగొడుగు, కనకదండము, రెండు తెల్లని చామరములు ప్రకాశించుచుండును. కీళ్ళు మొదలైనవి కూడా సువర్ణ రజిత నిర్మితములు. అట్టి రథము శ్రీరాముడవలోకించి, సీతాదేవితో, "ఓ సీతా! నీవీరథమున కూర్చుండి, శత్రువగు మూలకాసురుని సంహరింపుము," అని ఆజ్ఞాపించెను. అట్లే కానిమ్మన్ని ఆ ఇల్లాలు ఛాయాసీతను ప్రేరేపించెను. ఆ తామసీరూపిణియగు ఛాయాసీత కూడా వచ్చి, శ్రీరాముని చరణారవిందములకు నమస్కరించి, పలుమార్లు ప్రదక్షిణలుజేసి, త్వరగా ఆ సిద్ధమైన రథమునెక్కెను. ఆ ఛాయాసీత ఎట్టిదనిన మిక్కిలి భయంకర ఆకారమును, ఘోర కఠిననాదము గలదిగా ఉండెను. ఈ నడుమ శ్రీరామునిచే ప్రేరేపింపబడిన వానరోత్తములు లంకకు వెడలి, మునుపువలెనే హోమకర్మనుండి ఆ మూలకాసురునిని కదిలించిరి. మరి ఆసంగతిని తెచ్చి శ్రీరామసన్నిధికి విన్నవించి అచ్చట నిలచిరి. అంత ఆ మూలకాసురుడు క్రుద్ధుడై రథమునెక్కి యుద్ధమునకు వచ్చెను. ఇట్లు వాడు వచ్చుచుండగా దారిలో నేలమీద కిరీటము జారికూలెను. ఆ రక్కసుడు అంతలో వెనుక దిరుగక గర్వమువలన రణభూమికివచ్చెను. సీతాచ్ఛాయగూడ లక్ష్మణాదులతోను సైన్యముతోను వెడలెను.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, పూర్వార్ధములో, సీతావిరహవేదనమనే 5వ సర్గ ముగిసినది.**

# షష్టః సర్గః-6వ సర్గ

రాజ్యవిభాగ వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథ చ్ఛాయా టణత్కృత్య శార్ఙ్గం తచ్చ మహద్ధనుః ।
యయౌ రణభువం వేగాత్తాం దదర్శాసురోఽపి సః ॥ 1

కరాళదంష్ట్రానయనాం విద్యుత్పింగశిరోరుహామ్ ।
తాలజంఘాం శూర్పపాదాం దరివక్త్రాం ఘనప్రభామ్ ॥ 2

లోమశాం ప్రలలజ్జిహ్వాం విదీర్ణాస్యాం మహచ్ఛిరామ్ ।
తాం దృష్ట్వా కౌంభకర్ణిః స భీతః ప్రాహ స్ఖలద్గిరా ॥ 3

కా త్వం సమాగతాఽస్యత్ర కిమర్థం యోద్ధుమిచ్ఛసి ।
మమ సర్వం వదస్వ త్వం మదగ్రే మా స్థిరా భవ ॥ 4

యది జీవితుమిచ్ఛాఽస్తి న మే స్త్రీష్వస్తి పౌరుషమ్ ।
అథ సా రామసీతాభ్యాం విమానాన్ముహురీక్షితా ॥ 5

తమువాచ తదా చ్ఛాయా గిరా నర్దరతీ గిరీన్ ।
మూలకాసుర తాం శీతాం చండాం మాం విద్ధి చండికామ్ ॥ 6

యన్నిమిత్తాత్కులం నష్టం తవ లంకా ప్రధర్షితా ।
మత్పక్షపాతినం విప్రం పూర్వం త్వం హతవానసి ॥ 7

తస్యానృణ్యం గమిష్యామి త్వాం హత్వాఽద్య రణాజిరే ।
ఇత్యుక్త్వా చాపమానమ్య పంచబాణైర్జఘాన తమ్ ॥ 8

తతః సోఽపి ధనుర్ధృత్వా ఛాయాం బాణాన్ముమోచ హ ।
తద్యుద్ధం పార్థివాద్యాస్తే జీవితా యే హనూమతా ॥ 9

దదృశుర్వానరాః సర్వే పుష్పకాట్టాలసంస్థితాః ।
సీతయా రఘువీరస్తు కల్పవృక్షతలే స్థితః ॥ 10

**రుక్మమాణిక్యపర్యంకే దాసీభిః పరిజీవితః ।**
**ఉపబర్హణపృష్ఠః స ధృతాధోకోపబర్హణః ॥ 11**

## సీతాదేవి మూలకాసురుని సంహరించుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను ; "అంత ఆ సీతాదేవి మహత్తరమయిన శార్ఙ్గధనుస్సుతో టంకారము చేసి, యుద్ధరంగమునకు బయలుదేరెను. ఆ మూలకాసురుడు ఆమెయొక్క రాకను చూచెను. మహాకరాళములయిన కోరపండ్లుగల ఘోరరూపము దాల్చినదియు, మెరుపువలె మెరయుచుండు తలవెంట్రుకలు గలదియు, తాటి చెట్టువంటి మీగాళ్ళు గలదియు, చాటలవంటి పాదములు గలదియు, గుహవంటి నోరు గలదియు, మేఘమువంటి కాంతిగలదియు, శరీరాద్యంతము రోమములు గలిగినదియు, వ్రేలబడి వెల్గుచుండు నాలుకగలదియు, తెరువబడిన నోరుగలదియు, గొప్పతల గలదియును అయిన ఆ ఛాయాసీతను కుంభకర్ణుని కుమారుడైన మూలకాసురుడు చూసి, భయభ్రాంతుడై ఉలిక్కిపడి, "ఎవతె నీవు వచ్చుచున్నావు? ఏల యుద్ధము చేయనెంచుచున్నావు? నా ఎదుట అన్నిసంగతులు తెలుపుము. కొంతసేపైనను నా ఎదుట నిలువవలదు. ఒకవేళ బ్రతుకవలయునని ఇచ్ఛగలిగియుండిన నాకు స్త్రీలయందు పౌరుషములేదు," అని చెప్పెను. అంత ఆమె; విమానమునుండి శ్రీసీతారాములు పలుమార్లు చూచుచుండగా, ఆ మూలకాసురునితో, "ఓరి మూలకాసురుడా! నీవు 'చండ' అని ఎవరిని సంబోధించితివో, ఆ చండను నేనే అని తెలుసుకో. ఎవతె వలన నీ కులము, లంకయు నశించినదో ఆమెను నేను గానా? నాయెడ పక్షపాతముగా బ్రాహ్మణుని నీవు చంపినవాడవయితివి. ఈ యుద్ధరంగమున నిన్ను సంహరించి, అతనియెడ నానానృణ్యమును సంపాదించెదను," అని తన మాటలచే కొండలల్లాడునట్లు ఆర్భాటముజేయుచు పలికి, ధనస్సునెత్తుకుని 5 బాణములచే మూలకాసురిని కొట్టెను. అంత వాడును ధనుర్ధారియై ఛాయాసీతమీద బాణములను ప్రయోగించెను. అప్పుడు ఆ యుద్ధమును అచ్చట మృతినొంది ఆంజనేయునిచే బ్రతికింపబడిన రాజులందరును పుష్పక విమానమునుండి చూచుచుండిరి. శ్రీరామచంద్రస్వామి సీతాదేవితో కలసి కల్పవృక్ష మూలమున సువర్ణరత్నాలంకృత దివ్యపర్యంకము మీద దాసీజనులు చామర వ్యజనములు వీయుచుండగా దిండ్లనానుకొని, ఆ ఛాయామూలకాసురుల మహాయుద్ధమును అవలోకించుచుండెను.

**యుద్ధం దదర్శ తచ్ఛాయామూలకాసురయోర్మహత్ ।**
**మూలకాసురసంత్యక్తాన్ బాణాంశ్ఛాయా సమాగతాన్ ॥ 12**

**ఛిత్వా స్వబాణజాలైస్తాన్ పునర్బాణాన్ముమోచ సా ।**
**చతుర్భిస్తురగాన్ హత్వా ముకుటం కవచం ధనుః ॥ 13**

సా బిభేద త్రిభిర్బాణైస్తదా పద్భ్యాం మహాసురః ।
గత్వాఽన్యం రథమారుహ్య ఛాయాం యోద్ధుం పునర్యయౌ ॥ 14

తతశ్ఛాయాం ముమోచాసౌ వహ్న్యస్త్రం మూలకాసురః ।
ఛాయా ముమోచ మేఘాస్త్రై తద్వహ్న్యస్త్రం న్యవర్తయత్ ॥ 15

పర్వతాస్త్రం కౌంభకర్ణిస్తతశ్ఛాయాం ముమోచ సః ।
న్యవారయత్తచ్ఛాయా సా పవనాస్త్రేణ పార్వతమ్ ॥ 16

పునర్ముమోచ వేగేన సర్పాస్త్రం మూలకాసురః ।
గారుడాస్త్రేణ తచ్ఛాయా చకార విఫలం క్షణాత్ ॥ 17

ఏవం తత్తుములం యుద్ధం బభూవ దినసప్తకమ్ ।
తదా ఛాయా మహారౌద్రా చండికాఽస్త్రేణ తం రిపుమ్ ॥ 18

హంతుకామా మహాస్త్రం తన్ముమోచ మూలకాసురమ్ ।
తదా చచాల జగతీ మర్యాదామబ్ధయస్తదా ॥ 19

లంఘయామాసూ రజసా వ్యాప్తాశ్చాసంస్తదా దిశః ।
చండికాస్త్రం తు చిచ్ఛేద మూలకాసురసచ్ఛిరః ॥ 20

ఆ ఛాయ మూలకాసురుని నుండి వచ్చిన బాణమును తన శరములచే ఛేదించి, అతని మీద పదునైన బాణాలను ప్రయోగించెను. అప్పుడు ఛాయా ప్రయోగించిన నాలుగు బాణములకు అశ్వములు, ధనస్సు, కిరీట, కవచములు నాశనమైపోగా ఆ సంకటముచే మూలకాసురుడు కాలినడకతో బయలుదేరి వేరు రథమునెక్కి, ఛాయతో పోట్లాడుటకు మరల వచ్చెను. శస్త్రయుద్ధముతో ఉండక, అస్త్ర యుద్ధమునకు ఉపక్రమించి, ఛాయపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. ఛాయ దానికి శాంతిగా మేఘాస్త్రమును ప్రయోగించి ఆ ఆగ్నేయాస్త్రమును నివారించెను. అంత మూలకాసురుడు పర్వతాస్త్రమును ప్రయోగించగా దానినామె వాయవ్యాస్త్రముచే ధ్వంసము చేసెను. పిదప వాడు మిక్కిలి వేగముతో సర్పాస్త్రమును విడిచెను దానిని ఆఛాయ గరుడాస్త్రముచే వ్యర్థముజేసెను. ఇట్లు 7 దినములు మిక్కిలి ఘోరమైన మహాయుద్ధము జరిగినది. అప్పుడు మహారౌద్రయగు ఛాయ మూలకాసురుని చండికాస్త్రముచే సంహరింపనెంచి, ఆ మహా అస్త్రమును మూలకాసురుని నిర్మూలనకై ప్రయోగించెను. అపుడు పుడమి అణిగెను. సముద్రములు పొర్లెను. దుమ్ములేచి దిక్కులను క్రమ్మెను. చండికాస్త్రము వచ్చి మూలకాసురుని తలను కత్తిరించెను.

పపాత కాయో లంకాయాం రాజద్వారి మహచ్ఛిరః ।
హాహాకారో మహానాసీల్లంకాయాం రక్షసాం తదా ॥ 21

ననేదుర్దేవవాద్యాని దేవాశ్చాకాశసంస్థితాః ।
వవర్షుః కుసుమైశ్చాపియాం రామం సీతాం ముహుర్ముహుః ॥ 22

తతో నిర్వర్త్య సా ఛాయా యయౌ సీతాంతికం పునః ।
నత్వా రామం చ సీతాం చ సీతాదహే లయం యయౌ ॥ 23

తదా ననేదుర్వాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ।
తుష్టువుర్మాగధాద్యాశ్చ జగుర్గీతం నటాదయః ॥ 24

తతః సురగణైః సర్వైర్వేధాః శ్రీరాఘవం యయౌ ।
నత్వా రామం చ సీతాం చ తుష్టావ జానకీం ముదా ॥ 25

మూలకాసురుని మొండెము లంకలో పడెను. తలపోయి రాజద్వారమున కూలెను. అపుడు లంకలోని రాక్షసులయొక్క హాహాకారములు మిక్కుటమయ్యె. ఆకాశమున సంచరిస్తున్న దేవతలంతా దేవవాద్యములు మ్రోగించుచూ శ్రీసీతారామచంద్రుల మీద పలుమార్లు పుష్పవర్షమును కురిపించిరి. అంత ఆ 'ఛాయ' యుద్ధరంగమునుండి వెనుకకు తిరిగివచ్చి, శ్రీరామచంద్రస్వామికి సీతాదేవికి నమస్కరించి, జానకీదేహమున లయమొందెను. అప్పుడు మంగళవాద్యములు మ్రోగుచుండినవి. అప్సరసస్త్రీలు ఆడుచూ పాడుచుండిరి. వందిమాగధలు పొగడుచుండిరి. నటాదులు దివ్యమంగళ గీతములు పాడుచుండిరి. పిదప బ్రహ్మదేవుడు సమస్త దేవగణములతో శ్రీరామచంద్రపరబ్రహ్మ సన్నిధానమునకు వచ్చి, రఘునందన స్వామికిని, జానకీదేవికిని మ్రొక్కి, సాక్షాత్ పరదేవతయగు సీతాదేవిని ఇట్లు స్తుతించెను (25)

బ్రహ్మోవాచ
జనకజాత్మజే రాఘవప్రియే
కనకభాసురే భక్తపాలికే ।
దశరథాత్మజప్రాణవల్లభే తవ
పదాంబుదాలిః శిరోऽస్తు మే ॥ 26

మూలకాసుర ప్రాణఘాతకే
రామరక్షితే రామసేవితే ।
రామమోహిని స్యందనస్థితే
త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే ॥ 27

రామమంచకాధిష్ఠితే రమే
రామవీజితే రామలాలితే ।
రమసంస్తుతే రామరంజితే
త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే ॥ 28

లోకపావని శ్రీరజే వరే
భూమికన్యకే లోకపాలికే ।
పద్మలోచనే ధరాత్మజే పరే
త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే ॥ 29

కంజలోచనే నాగగామిని
స్వీయసత్సుఖే రమ్యరూపిణి ।
రుక్మభూషితే మౌక్తికాంకితే
త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే ॥ 30

జలరుహాననే చిత్రవాసిని
త్వమవసి సర్వదా స్వీయసేవకాన్ ।
మునిరిపూన్ సదా దుఃఖ దాయకే
త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే ॥ 31

త్వన్ముఖేక్షణాద్రక్షసాం పతిః
ప్రాప సంక్షయం రామసత్ప్రియే ।
త్వద్దృగీక్షణాల్లజ్జితా మృగీ
త్వత్పదాంబుజాలి శిరోఽస్తు మే ॥ 32

**కుశలవాంబికే జలరుహాననే**
**జలరుహేక్షణే పాపదాహికే ।**
**మధురసుస్వనే నూపురస్వనే**
**త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే ॥ 33**

**ఘ్రాణముత్తమం తే స్మితాననే**
**తేఽధరః శుభో బింబసన్నిభః ।**
**అద్య వై త్వయా మూలకాసురో**
**మారితో రణే తారితా వయమ్ ॥ 34**

**బ్రహ్మణేరితం నవకముత్తమం**
**భాస్కరోదయే పఠతి యః పుమాన్ ।**
**సర్వవాంఛితం లభతి సోఽత్ర నా**
**ప్రాప్నుయాత్సుఖం రాజసన్నిధిమ్ ॥ 35**

## బ్రహ్మదేవుడు దేవతలతోకలసి సీతాదేవిని స్తుతించుట.

“జనకమహారాజునకు కూతురుగా అవతరించి, దశరథనందనుడైన శ్రీరఘురామునికి ప్రాణవల్లభయై సువర్ణదివ్యమంగళాంగియైన నీవు భక్తులను రక్షించుచున్నావమ్మా!

నీ యొక్క పాదపద్మములయందు నా శిరస్సనే తుమ్మెద సంచరించు చుండునుగాక. తల్లీ! రథారూఢవై మూలకాసురుని సంహరించితివి. నీవు శ్రీరామునిచే రక్షింపబడినదానవు, రామునిచేత సేవింపబడిన దానవు, శ్రీరామస్వామిని మోహింపజేసినదానవు, నీ పాదారవిందములలో నా శిరస్సనే తుమ్మెద క్రీడించును గాక.

లోకమును పరిశుద్ధిజేయు మహాలక్ష్మీ! పుట్టుకలేనిదానా! సర్వోత్తమా! భూదేవికి పుత్రికయైన దానవా! కావుననే భూదేవికి పతియైన పద్మనయనుడగు నారాయణునికి ఆత్మజ వంటివైన తల్లీ! నీ యొక్క చరణకమలమున నామస్తకము మధుపమై ఉన్నది. కనకాభరణములచే తను ముక్తాభరణముల చేతను అలంకరింపబడినదియును, మనోహర దివ్య రూపసమన్వితయును, కమలములవంటి కన్నులు గలదియును, గజమువలె గమనము గలదియును, స్వస్వరూపాస్వానందానుభవము గలదియును అగు నీయొక్క చరణాబ్జమున నా శిరోభ్రమరము విహరించును గాక.

తామరసమువంటి కోమలరమణీయ ముఖముగలదై, చిత్రాంబరధారిణియై, నిజసేవకులను

నిరంతరము కాపాడుచున్నావు. మునీంద్రులకు శత్రువులైన దుష్టరాక్షసులకు దుఃఖమును కలుగ జేయుచున్నావు. ఇట్టి నీ చరణములలో భక్తిరసమును ద్రావుచు నా శిరస్సు తామరలోని తుమ్మెదవలె ఆనందముపొందును గాక!.

శ్రీరామచంద్రునియొక్క ప్రేయసీమణీ! నీయొక్క ముఖమున వెడలిన క్రూరదృక్కులవలననే రాక్షస పతియైన మూలకాసురుడు వినాశమునందెను. నీ యొక్క శృంగార కటాక్ష ప్రసరణముచే లేడి సిగ్గు నందెను. ఇట్టి నీ యొక్క పాదములను పద్మములయందు నా శిరస్సను మధుపము మనస్తుష్టి నందునుగాక.

కమల ముఖియును, కమలనయనయును అయిన నీవు కుశలవులకు తల్లివైయున్నావు. సమస్త పాపములను పరిహరించుచున్నావు. నీ కాలిఅందెల సుస్వరముతో కలమధురమయిన నీ యొక్క కంబుకంఠనాదము కమనీయమై ఒప్పుచున్నది. నా శిరస్సు నీ పాదపద్మమునందలి తుమ్మెదలా ఉండునుగాక!

తల్లీ! నీ ముఖారవిందము చిరునవ్వుచే సురుచిరమై ఉన్నది. నీ ఘ్రాణము జగత్ప్రాణమై విరాజించు చున్నది. ఇప్పుడేగదా యుద్ధరంగమునందు మూలకాసురుని నిర్మూలించితివి. మమ్ములందరిని భయభ్రాంతులచే తొలగించి, సంరక్షించితివమ్మా!" అని ఇట్లు బ్రహ్మదేవుడు శ్రీరామమనోహారిణి యైన సీతాదేవిని స్తుతించి మరియును దాని ఫలస్తుతిని శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు. వినుము.

"విష్ణుదాసా! ఏ మనుష్యుడు సూర్యోదయ సమయమున ఈ బ్రహ్మప్రోక్తమగు స్తోత్ర రత్నమును పఠించుచున్నాడో అతడు సమస్త ఇష్టములను పొంది, కడపట శ్రీరామపరబ్రహ్మ సన్నిధానమును పొందును.

**ఇతి స్తుత్వాఽమరైర్బ్రహ్మా వస్త్రాలంకారమండనైః ।**
**సీతాం రామం చ సంపూజ్య రాఘవేణాపి పూజితః ॥ 36**

**ప్రయయౌ రామమామంత్ర్య సత్యలోకం మనోరమమ్ ।**
**తతో విభీషణః ప్రాహ లంకాయాం న త్వయా పురా ॥ 37**

**సమాగతమిదానీం త్వం మాం కృతార్థం కురు ప్రభో ।**
**తథేతి ప్రతినంద్యాథ తద్వాక్యం రఘునందనః ॥ 38**

**విమానేన యయౌ లంకామధ్యే మిత్రగృహం ప్రతి ।**
**తతో విభీషణం రాజ్యే లంకాయాం త్వమ్యషేచయత్ ॥ 39**

**తదా మహోత్సవశ్చాసీల్లంకాయాం పరమాద్భుతః ।**
**తతో విభీషణో రామం సీతాం తాన్ లక్ష్మణాదికాన్ ॥ 40**

**వస్త్రైరాభరణై రత్నైః పూజయామాస సాదరమ్ ।**
**అర్పయామాస సర్వస్వం స్వీయం రామాయ రాక్షసః ॥ 41**

**తదా కపిలవారాహమూర్తి రావణపూజితామ్ ।**
**రామస్తాం రోచయామాస సోఽపి రామాయ తాం దదౌ ॥ 42**

పిదప బ్రహ్మదేవుడు ఇట్లు సీతా పరదేవతను స్తుతించి, శ్రీరామపరబ్రహ్మమునకు నమస్కరించి, ఆ సీతారాముల నిరువురిని వస్త్రాలంకారాదులచే సత్కరించి, శ్రీరామస్వామిచే సత్కరింపబడి రామాజ్ఞను పొంది, సర్వరమణీయమైన సత్యలోకమునకు వెడలెను. (39).

## విభీషణుడు శ్రీసీతారామాదులను సత్కరించుట.

పిదప విభీషణుడు, "మహాప్రభూ! రామచంద్రస్వామీ! మునుపు ఇచ్చటికి వచ్చినపుడు లంకా నగరములోనికి తమరు దయచేయలేదు, ఇప్పుడైనను దయచేసి వచ్చి నన్ను కృతార్థునిజేయుము," అని ప్రార్థింపగా, అట్లే చేయుదునని భక్తదయానిధియైన రఘురాముడు అంగీకరించెను. శ్రీరాముడు అట్లేయని ఆ విభీషణ వాక్యమును ఆనందముతో అంగీకరించి, లంకా మధ్యభాగమునందుండెడు మిత్రుడయిన విభీషణునియొక్క రాజమందిరమునకు ఏతెంచెను. అంత ఆ శ్రీరాముడు లంకారాజ్యమునిచ్చి విభీషణునికి రెండవసారి పట్టాభిషేకమును ఒనరించెను. అత్యద్భుతమైన మహోత్సవము జరిగెను. అంత ఆ విభీషణుడు; శ్రీరామచంద్రస్వామిని, జానకీదేవిని, లక్ష్మణాదులను అందరిని దివ్య వస్త్రములచేతను, సువర్ణ రత్నాభరణములచేతను చక్కగా సత్కరించెను. తన సర్వస్వమును శ్రీరామ సన్నిధానమునకు సమర్పించెను. అప్పుడు శ్రీరాముడు రావణాసురునిచేత సంపూజింపబడిన కపిల వారాహమూర్తిని అపేక్షించెను. దానినికూడా ఆ విభీషణుడు శ్రీరామునికి అర్పించెను. కపిలమహర్షి తన మనస్సునందే మునుపు ఏ మూర్తిని నిర్మించెనో, చిరకాలము ఏ మూర్తిని ఇంద్రుడు పూజించి, సమస్త సంపదలనందెనో అట్టిదానిని రావణుడు ఇంద్రుని జయించినప్పుడు అపహరించి తనఇంటిలో పెట్టుకొనెనో, అట్టి శిలామయమగు వారాహమూర్తిని శ్రీ విభీషణుడు శ్రీరామసన్నిధికి సమర్పించెను.

**మనసా కపిలేనైవ పురా మూర్తిర్వినిర్మితా ।**
**చిరకాలం తమారాధ్య లబ్ధా మఘవతా తు యా ॥ 43**

తం జిత్వా రావణేనైవ సమానీతా నిజాం పురీమ్ ।
యాం సదా పూజయామాస లంకాయాం రావణశ్చిరమ్ ॥ 44

విభీషణేన సా దత్తా రాఘవాయ ధృషన్మయీ ।
తాం మూర్తి స్థాపయామాస విమానే రఘునందనః ॥ 45

తతః సీతాऽథ రామేణ దేవరైర్బాలకైర్ముదా ।
అశోకవనికాం గత్వా శింశిపావృక్షముత్తమమ్ ॥ 46

దర్శయామాస రామాయ యత్ర పూర్వం స్థితా స్వయమ్ ।
తతో వామకరేణైవ రామస్య హి కనిష్ఠికామ్ ॥ 47

ధృత్వా దక్షిణహస్తస్య సీతా బభ్రామ తద్వనమ్ ।
స్నానాసనాదికం పూర్వం యత్ర యత్ర కృతం వనే ॥ 48

రామం నీత్వా తత్ర తత్ర దర్శయామాస జానకీ ।
తతస్తాం త్రిజటాం సీతా వస్త్రైరాభరణాదిభిః ॥ 49

కృత్వాऽతితుష్టాం రామాగ్రే సరమాం వాక్యమబ్రవీత్ ।
అనయా రక్షితా పూర్వం రాక్షసీగ్రహభీతిభిః ॥ 50

మత్తుల్యా మాననీయేయం సర్వదా సరమే త్వయా ।
ఇత్యుక్త్వా సరమాహస్తే త్రిజటాకరమర్పయత్ ॥ 51

తతో వాసస్థల సీతా యయౌ రామేణ సా శనైః ।
ఏవం నికుంభిలాదీని దృష్ట్వా నానాస్థలాని హి ॥ 52

పుష్పకస్థో యయౌ రామో విభీషణ సమన్వితః ।
విభీషణస్య సచివం లంకాయాం సంన్యవేశయత్ ॥ 53

రామః కరే ధనుర్ధృత్వా లంకాయాః పరితస్తదా ।
ప్రదక్షిణోపమం వేగాద్భ్రామయామాస సాదరమ్ ॥ 54

తతో విభీషణం ప్రాహ వచనం రఘునందనః ।
రాక్షసేంద్రం మయా చాపం రక్షార్థం భ్రమితం తవ ॥ 55

**తతో రామో విమానేన యయౌ శీఘ్రం విహాయసా ।**
**విభీషణస్య రక్షార్థం తస్యైవానుమతేన చ ॥ 56**

**మచ్చాపరేఖాఽ ప్యన్యేషాన్ దుఃఖోత్తీర్యా భవిష్యతి ।**
**అముం బాణం మయా దత్తం త్వం గృహాణ విభీషణ ॥ 57**

**మమ నామ్నాంకితం తీక్ష్ణం తవ ప్రాణస్య రక్షకమ్ ।**
**చాపరేఖా బాణహస్తం యేయం త్వాం ధర్షయిష్యతి ॥ 58**

శ్రీరామచంద్రస్వామి వరాహమూర్తి విగ్రహమును తన పుష్పకవిమానమున సంస్థాపించెను. అంత ఆ సీతాదేవి శ్రీరామచంద్ర స్వామియొక్క చిటికెనవ్రేలును పట్టుకొని వినోదవిహారముగా వెడలి, మరదులతోను, పుత్రులతోను అశోకవనమున ప్రవేశించి, శింశుపావృక్షమూలమున తానున్న చోటును చూపించి, ఆ తోటలో అంతట సంచరించి, తానెచ్చటెచ్చట కూర్చుండెనో, స్నానముచేసెనో ఆయా స్థలములనన్నిటిని చూపించుచుండెను. అప్పుడు సీతమ్మ త్రిజటను వస్త్రాభరణములచే సత్కరించి, సంతోషపరచి, శ్రీరాముని ఎదుట సరమను చూచి, "ఓయి సరమా! మునుపు ఈమెయే రాక్షసుల భయముల నుండి రక్షించెను. ఈ త్రిజటా హస్తము నర్పించెను. ఆ పిదప జానకమ్మ తిన్నగా శ్రీరామునితో తన నివాసస్థలమునకు వచ్చి చేరెను. ఇట్లే నికుంభిలాది నానాస్థలములను చూచుచు శ్రీరాముడు విభీషణునితో పుష్పక విమానమునెక్కి వెడలెను. అపుడు విభీషణుడు తనమంత్రికి లంకాపట్టణ బాధ్యతలను అప్పగించి (53), ఆ రామచంద్రస్వామి విమానమునెక్కి గగనమార్గమున శీఘ్రముగా వెడలెను. అప్పుడు విభీషణునియొక్క రాజ్యరక్షణమునకై శ్రీదశరథనందనుడు వానియనుమతిమీదనే లంకకంతటను తన ధనుర్దండమునెత్తి పట్టి ప్రదక్షిణాకారముగా రక్షారేఖనొకదానిని వేసి, అంత విభీషణుని చూచి, "రాక్షసనాయకా! నేనేధనుస్సును నీయొక్క రక్షణకొరకై అంతట త్రిప్పితినో ఆ యొక్క ధనూరేఖ అన్యులకు దుఃఖపరిహారియై ఉన్నది. విభీషణుడా! నేనిచ్చునట్టి ఈ బాణమును నీవు తీసికొమ్ము. ఇది నా యొక్క నామముచే అంకితమైనది. మిక్కిలి తీక్ష్ణమైనది. నీ ప్రాణమునకు రక్షకమైనది. బాణహస్తుడైన నిన్ను ఈ చాపరేఖ ఏమియును చేయదు.

**మద్బాణహస్తం త్వాం కశ్చిన్న రిపుర్ధర్షయిష్యతి ।**
**ఇత్యుక్త్వా తం దదౌ బాణం విభీషణకరే ప్రభుః ॥ 59**

**ప్రణనామ ముదాం రామం బాణహస్తో విభీషణః ।**
**తతో రామో విమానేన పశ్యన్ దేశాన్ మనోరమాన్ ॥ 60**

పూజితో దానమాన్యైశ్చ నృపైః స్వనగరీం యయౌ ।
తదా నినేదుర్వాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ॥ 61

ప్రత్యుజ్జగామ శ్రీరామం యూపకేతుః సనాగరః ।
ప్రాసాదశిఖరారూఢాః పౌరనార్యః సహస్రశః ॥ 62

సీతాం రామం నిరీక్ష్యాథ వవర్షుః పుష్పవృష్టిభిః ।
తతో వివేశ శ్రీరామః సభా తాం పార్థివైః సహ ॥ 63

వివేశ స్వీయగేహం సా జానకీ తుష్టమానసా ।
గేహే కపిలవారాహమూర్తి రామో న్యవేశయత్ ॥ 64

ఏకదా రాఘవస్తుష్టః శత్రుఘ్నాయ హి తాం దదౌ ।
సీతాఽపి సా పురా యాన్యాన్యమాంశ్చ నియమాదికాన్ ॥ 65

సంకల్పయామాస సర్వాంస్తాంశ్చకార యథావిధి ।
ఉద్యాపనాన్యనేకాని సర్వేషాం సాఽకరోన్ముదా ॥ 66

నాయొక్క బాణమును చేతబూనిన నిన్ను ఏ శత్రువును జయించనేరదు," అని చెప్పి, వరరూపముగా ఆ బాణమును విభీషణునికి అనుగ్రహించి యిచ్చెను. విభీషణుడును శ్రీరామముద్రకును, శ్రీరామ బాణమునకును నమస్కరించెను. పిదప శ్రీరామచంద్రస్వామి పుష్పకముమీద బయలుదేరి, నానాదేశ వినోదములను విలోకించుచు దక్షిణ దేశమునందలి రాజులందరిచేతను సత్కారపూజనాదులను అంగీకరించుచు తనరాజధాని అయోధ్యకు చేరెను. అప్పుడు అన్నివాద్యములును మ్రోగినవి. అప్సరస స్త్రీలు ఆడిరి. ఎదుర్కోలుపోయి స్వాగతించుటకై నగరవాసులతో కలసి యూపకేతువు వచ్చెను. మేడలమీదనుండిన వేలకొలది పురాంగనలు శ్రీసీతారామాదులను చూచి మిక్కిలి పరవశించి పుష్ప వర్షములను కురిపించిరి. అంత ఆ శ్రీరాముడు రాజేంద్రులతో కలసి నగరమున ప్రవేశించి, గానసభను అలంకరించెను. (63). శ్రీసీతాదేవియును సంతోషముగ తనమందిరమున ప్రవేశించి తన పరివారమును ఆనందపరచెను. అప్పుడు శ్రీరాముడు కపిలవారాహమూర్తిని తనరామమందిరమున ప్రవేశపరచి, ఒకానొక సమయమునందు సంతసించి, శత్రుఘ్నునికి దానినిచ్చెను. సీతమ్మయును మునుపు తాను ప్రతిజ్ఞ జేసియుండిన ప్రకారము సకలవ్రతాదులను సనియమముగా నెరవేర్చెను. మరియు ఆమె సకలవ్రతములకును ఉద్యాపనములను చేసి, దేవ బ్రాహ్మణులను చక్కగా ఆనందపరచెను.

ఏకదా మునయః సర్వే యమునాతీరవాసినః ।
ఆజగ్మూ రాఘవం ద్రష్టుం భయాల్లవణరక్షసః ॥ **67**

కృత్వాఽగ్రే తు మునిశ్రేష్ఠం భార్గవం చ్యవనం ద్విజాః ।
అసంఖ్యాతాః సశిష్యాస్తే రామాదభయకాంక్షిణః ॥ **68**

తాన్ పూజయిత్వా పరయా భక్త్యా రఘుకులోద్వహః ।
ఉవాచ మధురం వాక్యం హర్షయన్ మునిమండలమ్ ॥ **69**

కరవాణి మునిశ్రేష్ఠాః కిమాగమనకారణమ్ ।
ధన్యోఽస్మి యది యూయం మాం ప్రీత్యా ద్రష్టుమిహాగతాః ॥ **70**

సుదుష్కరం వా యత్కార్యం భవతాం తత్కరోమ్యహమ్ ।
ఆజ్ఞాపయంతు మాం భృత్యం బ్రాహ్మణా దైవతం హి మే ॥ **71**

తచ్ఛ్రుత్వా సహసా హృష్ట శ్చ్యవనో వాక్యమబ్రవీత్ ।
మధునామా మహాదైత్యః పురా రామ కృతే యుగే ॥ **72**

ఆసీదతీవ ధర్మాత్మా దేవబ్రాహ్మణపూజకః ।
తస్మై తుష్టో మహాదేవో దదౌ శూలమనుత్తమమ్ ॥ **73**

తం ప్రాహానేన యం హంసి స తు భస్మీభవిష్యతి ।
రావణస్యానుజా తస్య భార్యా కుంభీనసీ స్మృతా ॥ **74**

తస్యాం తు లవణో నామ రాక్షసో భీమవిక్రమః ।
ఆసీద్దురాత్మా దుర్ధర్షో దేవబ్రాహ్మణహింసకః ॥ **75**

మధుః స తవ హస్తేన మృతః పూర్వం యతస్తదా ।
మధుసూదననామాఽభూన్మధుఘాతాద్రఘూత్తమ ॥ **76**

పీడితా లవణేనాద్య వయం త్వాం శరణం గతాః ।
తచ్ఛ్రుత్వా రాఘవోఽప్యాహ మా భీర్వో మునిపుంగవాః ॥ **77**

## యమునాతీరవాసులు లవణాసురవృత్తాంతమును తెలుపుట.

ఒకసారి యమునాతీర నివాసులగు మునీంద్రులందరును లవణాసురునికి ఎంతో భయపడి భార్గవ, చ్యవన మునులను ముందుపెట్టుకుని, తమతమ శిష్యులతోపాటు శ్రీరామునినుండి అభయ సంరక్షణము పొందదలచి అయోధ్యకు వచ్చిరి. శ్రీరాముడు వారినందరిని పరమభక్తితో పూజించి, మంచిమాటలచే మునిసమాజమును సంతోషపరచుచు, "మునీంద్రులారా! మీరు వచ్చుటకు కారణమేమి? నన్నుచూచుటకై మీరు వచ్చినందున నేను కృతకృత్యుడనైతిని, అది యేపనియైనను సరియే, అది ఎంతకష్టకార్యముగా ఉన్నను దానిని నేను చేసెదను. భృత్యుడగు నాకు మీరు ఆజ్ఞనిప్పించండి, నాకు బ్రాహ్మణులే దైవములు గాదా?" అనెను.

ఆ శ్రీరామవాక్యములు విని సంతసించిన చ్యవనముని త్వరగా రామునితో, "మునుపు కృతయుగమున మధువను మహారాక్షసుడు ఉండెను. వాడు మిగుల ధర్మాత్ముడు, దేవ బ్రాహ్మణ పూజకుడు. వానికి తపస్సంతుష్టినందిన సాంబమూర్తి అసమానమైన శూలాయుధమును వరముగా నిచ్చి, "దీనిచే ఎవనిని సంహరించెదవో వాడు భస్మమైపోవును." అని వరమిచ్చెను. రావణాసురునియొక్క చెల్లెలగు కుంభీనసి యనునది ఆ మధుదైత్యునియొక్క పత్నియైనది. వారిరువురికిని లవణుడు అను పేరుగల మహాదైత్యుడు పుట్టెను. వాడు మిక్కిలి పరాక్రమవంతుడు, దుర్బుద్ధిగలవాడు, దేవతలను బ్రాహ్మణులను హింసించువాడు. ఆ మధువును మునుపు నీవు సంహరించినందువల్లనే మధు సూదనుడను దివ్యనామమునంది లోకమును అనుగ్రహించుచుందువు. రఘురామా! ఆ లవణా సురునివలన మేమందరము పీడింపబడి, వచ్చి నిన్నే శరణుజొచ్చియున్నాము," అని విన్నవించెను. అందుకు శ్రీరాముడు, "మునీంద్రులారా! వానివలన మీకు భయమువలదు. లవణాసురుని మట్టుపెట్టించెదను. మీరు భయమువదలి వెడలండి." అని వారలకు అభయమునిచ్చెను.

**లవణం నాశయిష్యామి గచ్ఛంతు విగతజ్వరాః ।**
**ఇత్యుక్త్వా ప్రాహ రామోఽపి శత్రుఘ్నం సదసి స్థితమ్ ॥ 78**

**అద్య త్వామభిషేక్ష్యామి మధురారాజ్యకారణాత్ ।**
**తద్రామవచనం శ్రుత్వా శత్రుఘ్నో వాక్యమబ్రవీత్ ॥ 79**

**నాంగీకరోమ్యహం రాజ్యం త్వం మాం నిజపదాత్ప్రభో ।**
**న దూరం కురు రాజేంద్ర ప్రార్థయామీతి తే ముహుః ॥ 80**

**తత్తస్య వచనం శ్రుత్వా శత్రుఘ్నస్య రఘూత్తమః ।**
**తథైవ భరతం ప్రాహ న సోఽప్యంగీచకార తత్ ॥ 81**

తతో రామః సుబాహుం చ యూపకేతుం ద్విజైర్ నృపైః ।
అభిషిచ్యాబ్రవీద్వాక్యం శత్రుఘ్నం పురతః స్థితమ్ ॥ 82

దత్వా తస్మై శరం దివ్యం నిజనామాంకితం శుభమ్ ।
అనేనైవ హి బాణేన లవణం లోకకంటకమ్ ॥ 83

హనిష్యసి క్షణాదేవ వృత్రం దేవపతిర్యథా ।
స తు సంపూజ్య తం శూలం గేహే గచ్ఛతి కాననమ్ ॥ 84

భక్షణార్థం హి జంతూనాం ఘాతం కర్తుం సముద్యతః ।
స తు నాయాతి సదనం యావద్వనచరో భవేత్ ॥ 85

తావదేవ పురద్వారి తిష్ఠ త్వం ధృతకార్ముకః ।
యోత్స్యతే స త్వయా క్రుద్ధస్తదా బాణేన ఘాతయ ॥ 86

అనేనైకేన బాణేన క్షణాదేవ మరిష్యతి ।
తం హత్వా లవణం క్రూరం తద్వనే మధుసంజ్ఞితే ॥ 87

నిర్మాయ మధురానామ్నీం నగరీం యమునాతటే ।
తస్యాం స్థాప్య సుబాహుం వై పత్నీభ్యాం బాలకైః సహ ॥ 88

యూపకేతుం చ విదిశానగరే శత్రునిషూదన ।
సంస్థాప్య దయతాభ్యాం చ సైన్యేన బాలకైః సహ ॥ 89

### లవణాసురుని చంపుటకు శత్రుఘ్నుని పంపుట.

సభాసీనుడైన శత్రుఘ్నుని జూచి, రాముడు “ఇప్పుడు మధురా రాజ్యకారణము వలన నిన్ను మధురాపురికి రాజుగా అభిషేకించెదను,” అను దానికి శత్రుఘ్నుడు, “స్వామీ! నీ యొక్క పాదారవింద సన్నిధానమునుండి దూరముగా తొలగింపవలదు. నేను రాజ్యమును అంగీకరించను. పలుమార్లు దీనినే ప్రార్థించుచున్నాను,” అని ప్రార్థించెను. ఆ మాటవిని శ్రీరాముడు అట్లే భరతుని అడిగెను. భరతుడు అట్లే చెప్పెను, రాజ్యమును అంగీకరించలేదు. అంత శ్రీరాముడు బ్రాహ్మణులతోను, రాజులతోను యూపకేతువును, సుబాహును రాజ్యాభిషిక్తులనుజేసి, యెదుట నిలిచియుండెడు శత్రుఘ్నునిజూచి, రాముడు; తన పేరు కలిగిన మంగళప్రదమగు దివ్యబాణము నొకదానిని శత్రుఘ్నుని చేతికిచ్చి, “ఈ దివ్యమైన ఒక్క బాణముచేతనే క్షణమాత్రమున వృత్రాసురుని దేవేంద్రుడు

సంహరించినట్లు లోకకంటకుడైన లవణాసురుని నీవు సంహరించెదవు. ఆ రక్కసుడు ఆ శివానుగ్రహ శూలమును పూజించి, మందిరమునపెట్టి, అరణ్యమునకు పోవును. ఆహారాపేక్షచేత అడవిలో జంతువులను చంపి, తెగతినుటలో యత్నించినపుడు, వాడు అడవినుండి ఇంటికి మరలివచ్చులోపల నీవు వాని ఊరివాకిట ధనుర్ధారివై కాచియుండుము. వాడు కోపము నంది జగడమాడును. అప్పుడీ బాణమును వానిమీద ప్రయోగించుము. ఈ బాణము ఒక్కటియే వానిని సంహరింపగలదు. ఇట్లు క్రూరుడగు ఆ లవణాసురుని సంహరించి మధువనుపేరుగల వానియొక్క వనమునందు యమునా నదీతీరమున మధురయను పట్టణ మొకదానిని సంస్థాపించి, దానిలో సుబాహును, వాని పత్నులతోను, పుత్రులతోను విడిచి, యూపకేతువును విదిశాపట్టణమున సైన్యములతోను, వాని పుత్రులతోను సంస్థాపించి, పిదప నావద్దకు త్వరగారమ్ము" అనెను.

**తతో మమాంతికం యాహి శీఘ్రం శత్రునిషూదన ।**
**అశ్వానాం పంచసాహస్రం రథానాం చ తదర్ధకమ్ ॥ 90**

**గజానాం షట్శతాన్యేవ పత్తీనామయుతత్రయమ్ ।**
**ఆగమిష్యంతి త్వత్పశ్చాదగ్రే సాధయ రాక్షసమ్ ॥ 91**

**ఆగతే త్వయి పశ్చాద్ధి నృపాన్ జేతుం పునస్త్వహమ్ ।**
**గంతుమిచ్ఛామి తస్మాత్త్వం శీఘ్రమాగచ్ఛ మాం ప్రతి ॥ 92**

**ఇత్యుక్త్వా మూర్ధ్న్యవఘ్రాయ శత్రుఘ్నం రఘునందనః ।**
**ప్రేషయామాస తైర్విప్రైరాశీర్భిరభినందితః ॥ 93**

**శత్రుఘ్నోఽపి నమస్కృత్య రామం మధువనం యయౌ ।**
**నినాయ పూజనార్థం తాం మూర్తి సోప్యాత్మనః ప్రియమ్ ॥ 94**

**అగ్రే సంప్రేష్య శత్రుఘ్నం తతః శ్రీరఘునందనః ।**
**సుబాహుయూపకేతూ తౌ స్వస్వస్త్రీభ్యాం చ బాలకైః ॥ 95**

**ప్రేషయామాస సైన్యైశ్చ దాసీదాసైశ్చ గోధనైః ।**
**శత్రుఘ్నోఽపి తథా చక్రే యథా రామేణ శిక్షితః ॥ 96**

**హత్వా తం లవణం వేగాన్మథురామకరోత్పురీమ్ ।**
**స్ఫీతాన్ జనపదాంశ్చక్రే మథురాన్ దానమానతః ॥ 97**

**మధురాయాం సుబాహుం తం స్థాప్య స్త్రీభ్యాం సుతాదిభిః ।**
**స్త్రీభ్యాం పుత్రైర్యూపకేతుం విదిశానగరే తథా ॥ 98**

**సంస్థాప్య సైన్యైః శత్రుఘ్నో మధురాయాం కియద్దినమ్ ।**
**స్థిత్వా సుబాహవే మూర్తిం తదా తుష్టో దదౌ సుఖమ్ ॥ 99**

5,000 గుఱ్ఱములును, 2,500 రథములును, 900 ఏనుగులును, 1000 మంది భటులును నీ వెనుక వచ్చుచున్నారు. మొదట లవణాసురుని మచ్చుమాపుము. నీవు వచ్చినపిదప నేను మరల రాజులను జయించుటకై పోవనెంచియున్నాను. కావున నీవు త్వరగారమ్ము," అని చెప్పి శత్రుఘ్నుని తలపై ముద్దిడి, బ్రాహ్మణాశీర్వాదములతో శ్రీరామచంద్రస్వామి పంపించెను. (93) శత్రుఘ్నుడును శ్రీరాముని నమస్కరించి మధువనమునకు తనతోడ పూజనమునకు తగినదని కపిలవారాహమూర్తిని కూడా తనవెంట తీసుకుని వెడలెను.

## శత్రుఘ్నుడు లవణాసురుని సంహరించుట

శ్రీరాముడు మొదట శత్రుఘ్నుని పంపించి, ఆ పిమ్మట ఆ సుబాహు, యూపకేతువులను వారివారి పత్నులతోను, బాలకులతోను, సైన్యములతోను, దాసదాసీ వర్గములతోను, గోధనముతోను పంపించెను. శత్రుఘ్నుడును శ్రీరామాజ్ఞానుసారముగా అట్లే త్వరగా లవణాసురుని సంహరించి దాన మానాది సన్మానములచే విస్తారవిదేశములను ఏర్పరచి, మధురాపట్టణమున సుబాహువును, అతని పత్నీ పుత్రులతో స్థిరపరచి, అట్లే భార్యాసుతులతోను యూపకేతువును విదిశానగరమున స్థిరపరచి, సేనలతో కొన్నిదినములు మధురలో సుబాహువువద్ద వాసముచేయుచుండి, ఒకరోజు కపిలవారాహమూర్తిని సంతోషముతో అతని పెద్దకుమారునకు ఇచ్చెను.

**అద్యాపి మధురాయాం సా మూర్తిస్తత్రైవ వర్తతే ।**
**శత్రుఘ్నోఽపి తతః సైన్యైః శీఘ్రం రామాంతికం యయౌ ॥ 100**

**సర్వం వృత్తం రాఘవాయ కథయామాస సాదరమ్ ।**
**అథైకదా స భరతః కైకేయీనందనో మహాన్ ॥ 101**

**యుధాజితా మాతులేన హ్యాహూతోఽగాత్ససైనికః ।**
**రామాజ్ఞయా గతస్తత్ర హత్వా గంధర్వనాయకాన్ ॥ 102**

**తిస్రః కోటీః పురే ద్వే తు నివేశ్య రఘునందనః ।**
**పుష్కరం పుష్కరావత్యాం పూర్వమేవాభిషేచితమ్ ॥ 103**

అయోధ్యాయాం రాఘవేణ స్థాపయామాస సేనయా ।
స్త్రీభ్యాం పుత్రైర్దాసదాసీజనాద్యైః పరివేష్టితమ్ ॥ 104

తతో ముహూర్తే భరతస్తక్షం తక్షశిలాహ్వయే ।
నగరే స్థాపయామాస రాఘవేణాభిషేచితమ్ ॥ 105

అయోధ్యాయాం పూర్వమేవ మహామంగళపూర్వకమ్ ।
స్త్రీభ్యాం పుత్రాదిభిస్తక్షస్తస్థౌ తక్ష శిలాహ్వయే ॥ 106

ఉభౌ కుమారౌ సౌమిత్రే గృహీత్వా పశ్చిమాం దిశమ్ ।
గత్వా మల్లాన్వినిర్జిత్య దుష్టాన్సర్వాపకారిణః ॥ 107

పునరాగత్య భరతో రామసేవాపరోఽభవత్ ।
తతః ప్రీతో రఘుశ్రేష్ఠో లక్ష్మణం వాక్యమబ్రవీత్ ॥ 108

ద్వావంగదచిత్రకేతూ మహాసత్వపరాక్రమౌ ।
మయాభిషేచితౌ వీరౌ స్త్రీభ్యాం పుత్రబలైర్యుతౌ ॥ 109

ఇప్పటికిని మధురాపట్టణమున ఆ కపిలవారాహమూర్తి యచ్చటనే గలదు. శత్రుఘ్నుడును త్వరగా వెడలి శ్రీరామ సన్నిధానమును చేరెను. సమస్తవృత్తాంతమును శ్రీరామసన్నిధానమునకు సాదరముగా విన్నవించెను. (100)

## భరత, లక్ష్మణులు వారిపుత్రులకు రాజ్యములనొసగుట

పిదప కైకేయీ పుత్రుడైన మహాత్ముడగు భరతుడు ఒకప్పుడు తన మేనమామయగు యుధాజిత్తు వలన పిలువబడినవాడై సైన్యములతో శ్రీరామాజ్ఞనొంది, వెడలి, అచ్చట గంధర్వనాయకులను సంహరించి, మూడుకోట్ల సేనలను ధ్వంసముచేసి, రెండుపట్టణములను సంస్థాపించి వాటిలో, అయోధ్యయందే శ్రీరామునిచే ఇట్టిదానికి పట్టాభిషిక్తుడైనవాడు వీడని మొదటనే నిర్ణయింపబడియుండిన పుష్కరుని వానిపత్నీ పుత్రులతోను, దాసదాసీవర్గములతోను, సేనలతోను పుష్కరావతీ పట్టణమునందు సంస్థాపించెను. అంత ఆ భరతుడు సుముహూర్తమునందు తక్షశిలా నామక నగరమునందు మునుపు అయోధ్యలోనే శ్రీరామునిచే పట్టాభిషిక్తుడై యున్నవిధముగా పత్నీపుత్ర పరివారసమేతముగా తక్షునికి పట్టముకట్టి నిలిపెను. కావున తక్ష శిలానగరమున, తక్షుడు స్థిరముగా నిలిచెను. మరలా యథాప్రకారముగా వచ్చి భరతుడు శ్రీరామసన్నిధానమునందెను. అంత ఆనందపడుచుండెడు

శ్రీరామచంద్రస్వామి లక్ష్మణుని జూచి, "లక్ష్మణా! నీ ఇరువురి కొడుకులను పశ్చిమదిక్కునకు తీసుకొనిపోయి, సమస్త ప్రాణులకును అపకారము చేయుచుండెడు దుష్టులైన మల్లులను నిగ్రహించి గజ, అశ్వ, ధన, రత్నములను పేర్లుగల అచ్చట రెండుపట్టణములను ఏర్పరచి ధన, కనక సమృద్ధములగు ఆ రెండింటిలో, నా చేత ఇది వరకె అయోధ్యయందు మనోద్దేశానుసారముగా పట్టాభిషిక్తులును, శక్తులును, బలపరాక్రమశాలురును అయిన అంగద, చిత్రకేతువులను వారి భార్య, పుత్రులు, పరివార సమేతముగా సంస్థాపించి త్వరగారమ్ము, బయలుదేరు" అని ఆజ్ఞాపించెను.

**ద్వయోర్ద్వే నగరే కృత్వా గజాశ్వధనరత్నకే ।**
**స్థాపయిత్వా తయోః పుత్రౌ శీఘ్రమాగచ్ఛ మాం పునః ॥ 110**

**రామాజ్ఞాం స పురస్కృత్య గజాశ్వబలవాహనైః ।**
**గత్వా హత్వా రిపూన్ సర్వాన్ గజాశ్వంఽగదనామకః ॥ 111**

**ధనరత్నే చిత్రకేతూ స్థాపయామాస దేహజౌ ।**
**స్వస్వస్త్రీభ్యాం బాలకైశ్చ దాసీదాసైర్బలాన్వితౌ ॥ 112**

**సౌమిత్రిః పునరాగత్య రామసేవాపరోఽభవత్ ।**
**అథ రామః సమాహూయ గణకాన్ పరిపూజ్య చ ॥ 113**

**అవనీం జేతుముద్యుక్తో ముహూర్తం తానపృచ్ఛత ।**
**తతస్తైర్గణకైర్దత్తో ముహూర్తః పరమః శుభః ॥ 114**

**తం శ్రుత్వా తాన్పునః పూజ్య సర్వాన్ రామో వ్యసర్జయత్ ।**
**తతో రామోఽబ్రవీద్వాక్యం లక్ష్మణం పురతః స్థితమ్ ॥ 115**

**అవనిస్థాన్నృపాన్ జేతుం సోఽహం గచ్ఛామి పార్థివైః ।**
**విమానేనైవ గచ్ఛామి సేనాం చోదయ సత్వరమ్ ॥ 116**

**నానాశస్త్రాణి యంత్రాణి వాహనాని సమంతతః ।**
**స్థాపయస్వ విమానేఽద్య శతఘ్న్యః శతశో వరాః ॥ 117**

**ధనధాన్యతృణాదీనాం సంగ్రహం కురు పుష్పకే ।**
**పురీం గోప్తుం సుమంత్రోఽస్తు సైన్యేన పరివేష్టితః ॥ 118**

**ఏవమాజ్ఞాప్య సౌమిత్రిం శ్రీరామో జానకీగృహమ్ ।**
**యయౌ చకార సౌమిత్రిర్యథా రామేణ శిక్షితః ॥ 119**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, రాజ్యవిభాగో నామ, షష్ఠస్సర్గః ॥**

పిదప లక్ష్మణుడు శ్రీరామాజ్ఞను అంగీకరించి, గజ, తురగ, బల, సేనలతో కూడి శత్రువుల నందరిని సంహరించి; గజాశ్వమను పట్టణమున అంగదుడను కుమారునిని, ధనరత్నమను పట్టణమున చిత్రకేతువను పుత్రుని; వానివాని పత్నీ, పుత్ర పరివారములతో సంస్థాపించి, లక్ష్మణుడు యథాప్రకారము శ్రీరామ పాదసేవ చేయుచుండెను. (113)

## శ్రీరాముని జైత్రయాత్రా సన్నాహము

శ్రీరాముడు దైవజ్ఞులను పిలిపించి, వారిని సత్కరించి, భూమండల జైత్రయాత్రకు తగిన సుముహూర్తమును నిర్ణయించి చెప్పవలయునని అడిగెను. అంత ఆ గణకజ్ఞులు సర్వప్రకారముల తోను మంగళప్రదమైన సముహూర్తమును ఏర్పరచి యిచ్చిరి. ఆ సంగతి తెలిసి శ్రీరాముడు మరల వారినందరిని సత్కరించి పంపి, పిదప ఎదుటనుండెడు లక్ష్మణుని జూచి, "భూమిలో గల రాజుల నందరిని జయించుటకై నేనిప్పుడు నాయొక్క సామంత రాజులతో వెడలుచున్నాను. విమానమునందే ప్రయాణించెదను. సేనలను త్వరగా సిద్ధపరుచుము. వివిధ శస్త్రాయుధములను సిద్ధపరుచుము. ఇప్పుడే విమానమునందు వాహనముల నన్నిటిని చక్కపరచి పెట్టుము. వందలకొద్దీ మేలైన ఫిరంగులను సిద్ధముచేయుము. ధనములను, ధాన్యములను, తృణాదులను పుష్పకమునకు చేర్చుము. సేనతో కూడిన సుమంత్రుడు అయోధ్యను రక్షించుచుండు గాక," అని ఇట్లు ఆజ్ఞాపించి, శ్రీరామచంద్రస్వామి సీతాదేవియొక్క అంతఃపుర శృంగార మందిరమునకు వెడలెను. లక్ష్మణ స్వామియును శ్రీరామాజ్ఞాను సారముగా సర్వమును నెరవేర్చి, సర్వసన్నాహములతో సిద్ధుడైయుండెను. (9)

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, పూర్వార్ధములో, రాజ్యవిభాగవర్ణనమనే 6వ సర్గ ముగిసినది.**

# 7వ సర్గ

భరతఖండములో శ్రీరాముని విజయగాథ

శ్రీరామదాసఉవాచ

అథ రామో రహః సీతాం స్వోద్యోగభవదచ్ఛనైః ।
అవనిస్థాన్ నృపాన్ జేతుం పుత్రాభ్యాం బంధుభిర్ నృపైః ॥ 1

తద్రామవచనం శ్రుత్వా జానకీ ప్రాహ లజ్జితా ।
నాహం త్వద్విరహం సోఢుం సమర్థా రఘునందన ॥ 2

త్వయాఽహమవనీం ద్రష్టుం యస్యామి జగతాం ప్రభో ।
తథేత్యుక్త్వా రఘుశ్రేష్ఠో లాలయామాస జానకీమ్ ॥ 3

ఏతస్మిన్నంతరే సర్వా ఊర్మిళాద్యాః స్త్రియశ్చ తాః ।
కుశస్య చ లవస్యాపి పత్న్యః శ్రుత్వాఽవనేర్జయమ్ ॥ 4

కర్తుం రామసముద్యోగం పుత్రాభ్యాం బంధుభిర్నృపైః ।
జానకీం ప్రార్థయామాసుర్యాస్యామోఽద్య త్వయా సహ ॥ 5

స్వస్వకాంతవియోగం చ సోఢుం నైవ క్షమా వయమ్ ।
సీతా తాసాం వచః శ్రుత్వా రాఘవం శ్రావ్య తద్వచః ॥ 6

రామాజ్ఞయా తదా సర్వాస్తోషయంతీ వచోఽబ్రవీత్ ।
అగంతవ్యం మయా సాకం యుష్మాభిర్నిశ్చయేన హి ॥ 7

గచ్ఛధ్వం స్వీయగేహాని సర్వాస్తుష్టా గతజ్వరాః ।
ఏవం సీతావచః శ్రుత్వా తదా తాః కంజలోచనాః ॥ 8

సీతాం నత్వా యయుః సర్వాః సంతుష్టా ముదితాననాః ।
స్వస్వగేహాని వేగేన రుక్మనూపురనిఃస్వనాః ॥ 9

అథ రామస్తు తాం రాత్రిం నినాయ సీతయా సుఖమ్ ।
బ్రాహ్మే ముహూర్తే శ్రుత్వా స వందిగాతం మనోరమమ్ ॥ 10

**రామః ప్రబుద్ధస్తు జవాత్కృతశౌచాదిసత్క్రియః ।**
**స్నాత్వా నిత్యవిధిం కృత్వా కృత్వా శంభోః ప్రపూజనమ్ ॥ 11**

## శ్రీరాములవారి సర్వభూమండల దిగ్విజయయాత్ర

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "అనంతరము శ్రీరామచంద్రుడు రహస్యమున తిన్నగా సీతాదేవితో, "నేను నా పుత్రులను, తమ్ములను వెంటదీసికొని భూమిలోని రాజులనందరిని జయించుటకై వెడలుచున్నాను," అని తన ప్రయత్నమును తెలిపెను. ఆ మాటవిని సీతమ్మ సిగ్గునంది, "నీ యొక్క విరహమును సహించుటకై నేను సమర్థురాలను కాను. మహాప్రభూ! నీ తోడ భూమిని చూచుటకై నేనును బయలుదేరుచున్నాను," అని విన్నవించెను. అందుకట్లేకానిమ్మని శ్రీరాముడు సీతాదేవిని లాలించెను. అంతలోపల ఊర్మిళాది స్త్రీలు, కుశ, లవ పత్నులును శ్రీరాముడిట్లు కుమారులు, సోదరులతో కలసి విజయయాత్ర వెడలుచున్నాడను సంగతిని విని సీతాదేవియొక్క సన్నిధానమునకు ఏతెంచి, "తల్లీ! ఇప్పుడు నీ తోడ మేమును వచ్చుచున్నాము. మా మా పతులను మేము వదలియుండి ఆ విరహమును భరించలేము," అని సంప్రార్థించిరి. జానకీదేవి వారిప్రార్థలను శ్రీరామసన్నిధి తెలిపి, శ్రీరాముని అనుజ్ఞ పొంది, తదాజ్ఞానుసారముగా, "మీరందరును నాతో సంతోషముగా బయలుదేరండి. ఇదియేకదా నిశ్చయము. మనస్సంశయములు లేక మీ యిండ్లకుపొండు," అని ఆజ్ఞాపించెను. ఇట్లు సీతావాక్యము విని, ఆ కమల నయనలందరు చిరునవ్వులతో తృప్తినంది, సీతాదేవికి వందనములర్పించి, వారివారి అంతఃపురములకు శృంగార నడకలతో సంతోషముగా వెడలిరి. అంత ఆ శ్రీరామచంద్రుడు సీతతో సుఖముగా ఆ రాత్రిని గడిపి, బ్రహ్మీముహూర్త మనగా రాత్రియొక్క నాల్గవ యామారంభమున వంది మాగధులయొక్క మనోహర మంగళగీతములు విని, మేల్కొని, త్వరగా శౌచాది కృత్యములను ఆచరించి, స్నానముచేసి, నిత్యకర్మలను నిర్వర్తించి, సాంబమూర్తిని సంపూజించెను,

**కథాం పౌరాణికీం శ్రుత్వా దత్వా దానాన్యనేకశః ।**
**కృత్వోద్యోగవిధానం చ సంపూజ్య గణనాయకమ్ ॥ 12**

**కృత్వాఽఽభ్యుదయికం శ్రాద్ధం ఘృతశ్రాద్ధం సవిస్తరమ్ ।**
**కామధేనుం కల్పవృక్షం పుష్పకం చ సురద్రుమమ్ ॥ 13**

**మణిద్వయం పృథక్పూజ్య సర్వైః కృత్వా తు భోజనమ్ ।**
**ధృత్వా వస్త్రాణి శస్త్రాణి బద్ధ్వా మాతౄః ప్రణమ్య చ ॥ 14**

**యయౌ స శిబికారూఢః పుష్పకం బంధుభిర్నృపైః ।**
**పుత్రాభ్యాం సశివైః సైన్యైః సేవకైర్వాహనాదిభిః ॥ 15**

యానమారురుహుః సర్వాః సీతాద్యాస్తాః స్త్రియః శుభాః ॥ 16

కౌసల్యాద్యా మాతరశ్చ తస్థుర్యానే యథాసుఖమ్ ।
యాత్రాకాండే యథా శిష్య విమానరచనా పురా ॥ 17

తే వర్ణితా మయా తద్వదదునాఽఽసీచ్ఛుభా పునః ।
తదా నినేదుర్వాద్యాని తుష్టువుర్మాగధాదయః ॥ 18

ననృతుర్వారనార్యశ్చ నటా గానం ప్రచక్రిరే ।
అథ రామోఽబ్రవీద్యానం గచ్ఛ పూర్వదిశం ప్రతి ॥ 19

తథేత్యుక్త్వా పుష్పకం తద్యయావాకాశవర్త్మనా ।
నత్వా రామం సుమంత్రోఽపి తస్థౌ పుర్యాం యథాసుఖమ్ ॥ 20

పూర్వదేశే నృపాః సర్వే శ్రుత్వా రామం సమాగతమ్ ।
ప్రత్యుజ్జగ్ముః రాఘవేంద్రం ప్రబద్ధకరసంపుటాః ॥ 21

ప్రణేముస్తే రమానాథం నానోపాయనపాణయః ।
పూజయామాస శ్రీరామం నీత్వా రాజ్యం నిజం నిజమ్ ॥ 22

పురాణకథాశ్రవణముజేసి, అనేక దాన ధర్మములను ఆచరించి, ప్రయాణసన్నాహావసరమున శ్రీమహాగణపతిని పూజించి, నాందీశ్రాద్ధముచేసి, సవిస్తరముగా ఘృతశ్రాద్ధమును చేసి; కామధేనువును, కల్పవృక్షమును, పుష్పకవిమానము, పారిజాతవృక్షమును, చింతామణిని, కౌస్తుభరత్నమును వేర్వేరుగా పూజించి, అందరితో కలసి భోజనములను ఆరగించి, వస్త్రములను అలంకరించుకొని, శస్త్రములను ధరించి, తల్లులకు నమస్కారములుజేసి, పల్లకీమీదనెక్కి; తమ్ములతోను, సామంతరాజులతోను, పుత్రులతోను, మంచిసేనలతోను, సేవకాదులతోను, వాహనాదులతోను పుష్పకవిమానమువద్దకు వెడలెను. సీతాదేవి మొదలయిన సకల స్త్రీలును, కౌసల్య మొదలైన తల్లులును వారివారికి సుఖముగా తోచిన వాహనములను ఎక్కిరి.

విష్ణుదాసా! వినుము; మునుపు యాత్రాకాండలో విమానరచన ఎట్లు చేయడబడినదని నేను వర్ణించి చెప్పితినో అట్లే మరల ఇప్పుడును విమానరచనాసన్నివేశము వినోదకరముగా జరిగెను. అప్పుడు సకల మంగళవాయిద్యములు వాయింపబడెను, వందిమాగదులు స్తోత్రపాఠములచే పొగిడిరి, వారాంగనలాడిరి, నటాదులు గానములుజేసిరి. అంత ఆ శ్రీరామచంద్రుడు అందరితో కలసి పుష్పక

విమానమునెక్కి, పూర్వదిక్కునకు వెడలునట్లు ఆజ్ఞాపించెను. అట్లే అని విమానము గగనమార్గమున పయనించెను. సుమంత్రుడును శ్రీరామస్వామికి నమస్కరించి, అయోధ్యలో యథాసుఖముగా నిలిచెను. (20)

## శ్రీరాములవారి దేశవిజయాభివర్ణనము

పూర్వదేశమునందు రాజులందరును శ్రీరామచంద్రస్వామి దయజేసి వచ్చుచున్నాడను సంగతిని విని, చేతులు జోడించి ఎదురేగివచ్చి, లక్ష్మీపతిస్వామికి నమస్కరించి, వివిధములైన కానుకలనర్పించి, చక్కగాపూజించి, తమకు తాముగానే తమ రాజ్యములనువిడిచి, శ్రీరామునియొక్క ఆజ్ఞానుసారము పుష్పక విమానమునెక్కిరి.

**రామాజ్ఞయా ససైన్యాశ్చ తస్థుర్యానే నృపోత్తమాః ।**
**స్వకోశాదీని రామాయ సమర్ప్య స్థిరమానసాః ॥ 23**

**మాగధాన్ సమతిక్రమ్య విమానేన రఘూత్తమః ।**
**పశ్యనానావిధాన్ దేశాన్ భూరికీర్తేః పురం యయౌ ॥ 24**

**తేనాతిపూజితో రామః శనైర్యానేన దక్షిణమ్ ।**
**యయావబ్ధితటేనైవ ద్రావిడం దేశముత్తమమ్ ॥ 25**

**కృష్ణాతీరప్రదేశాంస్తాన్ పశ్యన్ రామః శనైః శనైః ।**
**కాంతిం యయౌ విమానేన కంబుకంఠోఽపి రాఘవమ్ ॥ 26**

**పూజయామాస విధివత్కోశాద్యైః సుహృదం నిజమ్ ।**
**ఆరవారం మహాదేశం తథా తచ్చోలమండలమ్ ॥ 27**

**సమతిక్రమ్య శ్రీరామస్తత్రస్థైః పూజితో నృపైః ।**
**యయౌ స కేరలాన్ దేశానాంధ్రం కర్ణాటకం యయౌ ॥ 28**

**పూజితో విజయేనాపి విజయాపురవాసినా ।**
**కౌంకణస్థాన్ నృపాన్ జిత్వా మహారాష్ట్రం యయౌ ప్రభుః ॥ 29**

**దుర్గం దేవగిరిం నామ చకార స్వవశం క్షణాత్ ।**
**తథాన్యాన్యపి దుర్గాణి స్వాధీనాన్యకరోద్విభుః ॥ 30**

కృత్వా విరాటదేశం చ దేశాన్ వింధ్యాచలాశ్రితాన్ ।
పశ్యన్ యయౌ స రేవాయాస్తీరేణోంకారమీశ్వరమ్ ॥ 31

మాలవస్థాన్నృపాన్ జిత్వా యయౌ రామః స ఉజ్జయామ్ ।
ఉగ్రబాహుం రణే జిత్వా యయౌ హైహయపత్తనమ్ ॥ 32

జిత్వా ప్రతీపం శ్రీరామః స యయౌ హస్తినాపురమ్ ।
ఏతస్మిన్నంతరే సోమవంశజాస్తే త్రయో నృపాః ॥ 33

ఆ రాజవర్యులందరును తమతమ బొక్కసములు మొదలైనవాటిని శ్రీరామసన్నిధికి సమర్పించి, సుస్థిరమనస్కులయిరి. పిదప శ్రీరాముడు విమానముచే మగధ దేశములనుదాటి వివిధ దేశములను చూచుచు, భూరికీర్తి యొక్క పురమునకు ఏతెంచెను. ఆ భూరికీర్తి మిక్కిలి చక్కగా శ్రీరామచంద్రస్వామిని పూజించిన పిదప, సముద్రతీరము వెంబడి పయనించి దక్షిణదిక్కుకు వెడలి, ఉత్తమమగు ద్రావిడ దేశమునకు వచ్చెను. కృష్ణానదీతీర ప్రదేశములలోని వింతలను చూచుచు, తినతిన్నగా కాంతిపురికి వచ్చెను. అచ్చట కంబుకంఠుడు తన సుహృత్తయిన శ్రీరామమూర్తికి విధిప్రకారముగా తనకున్నదంతా సమర్పించి సత్కరించెను. అంత అరవార దేశమునకును, అటులనే చోళమండలమున ప్రవేశించి, అచ్చటిరాజులచే సత్కరింపబడి; అట్లే కేరళ, ఆంధ్ర, కర్ణాటక దేశములలో వరుసగా ప్రవేశించెను. విజయాపురమున వసించువాడైన విజయుడను వానిచేతను విధివిధానముగా సత్కరింపబడిన శ్రీరామ చంద్రుడు కొంకణదేశస్థులగు రాజులను జయించి, మహారాష్ట్రదేశమున ప్రవేశించెను. అచ్చట దేవగిరియను దుర్గమును క్షణమాత్రమున స్వవశముగా చేసుకొనెను. అట్లే యితరములయిన దుర్గములను స్వాధీనపరచుకొనెను. అంత విరాటదేశమునకుపోయి, వింధ్యపర్వతమును ఆశ్రయించి విషయములను విలోకించుచు రేవానదీ తీరముననే పయనించి, ఓంకారేశ్వర స్వామి సన్నిధికి వచ్చి, మాళవదేశమునందుగల రాజులను జయించి, ఉజ్జయినికి వెడలి, యుద్ధరంగమున ఉగ్రబాహు రాజును జయించెను.

పురూరవాస్తథాఽగచ్ఛచ్ఛాల్పసైన్యేన వై పురాత్ ।
రామేణ సంగరం కర్తుం నానావాహనసంస్థితాః ॥ 34

యుయుర్వవర్షుః శస్త్రాణి పుష్పకస్థం రఘూత్తమమ్ ।
యుద్ధం బభూవ తైః సాకం త్రిదినం రోమహర్షణమ్ ॥ 35

తదాసీద్రక్తపూర్ణా సా జాహ్నవీ పాపనాశినీ ।
చతుర్థే దివసే రామస్తాన్ జిత్వా తత్పురం యయౌ ॥ **36**

సుషేణం వానరాణాం చ వైద్యం వానరసేనయా ।
గజాహ్వయే పురే స్థాప్య తాంస్త్రీన్ సోమాన్వయోద్భవాన్ ॥ **37**

కారాగృహస్థితాన్ కృత్వా సుగ్రీవాద్యై రఘూత్తమః ।
యయౌ స మథురాం ద్రష్టుం సుబాహుపరిపాలితామ్ ॥ **38**

దృష్ట్వా సుబాహుం రాజ్యస్థం విదిశానగరం యయౌ ।
యూపకేతుం తత్ర దృష్ట్వా రాజ్యస్థం తేన వందితః ॥ **39**

కురుక్షేత్రం పుష్కరం చ దృష్ట్వా రామో విహాయసా ।
మరుం చ సమతిక్రమ్య యయౌ గుర్జరముత్తమమ్ ॥ **40**

ప్రభాసం చ తతో గత్వా మల్లదేశం యయౌ తతః ।
గజాశ్వనగరే దృష్ట్వాంగదం రాజ్యపదస్థితమ్ । **41**

ధనరత్నైశ్చిత్రకేతుం దృష్ట్వా రాజ్యపదస్థితమ్ ।
ఆనర్తం స యయౌ రామస్తత్రస్థైః పరిపూజితః ॥ **42**

ప్రయయౌ పుష్కరం ద్రష్టుం రాజ్యస్థం పుష్కరావతీమ్ ।
తతో రామో విమానేన యయౌ తక్షశిలాహ్వయే ॥ **43**

తక్షం దృష్ట్వా పదస్థం తం యయౌ భరతమాతులమ్ ।
యుధాజితా పూజితః స రామో రాజీవలోచనః ॥ **44**

ఉగ్రబాహు రాజును జయించి, హైహయ రాజధానికి వెడలి ప్రతీప రాజును జయించి శ్రీరాముడు హస్తినాపురమునకు వెళ్ళెను. అంతలో చంద్రవంశ సంభవులయిన ముగ్గురు రాజులును, అట్లే పురూరవుడును అల్పసైన్యముతో పట్టణమునుండి వెలువడి శ్రీరామునితో యుద్ధమునకు పూనుకొనిరి. వారుముప్వురును వివిధ వాహనములనెక్కి, పుష్పకమునన్ను శ్రీరామునిమీద శస్త్రవర్షములను కురిపించిరి. ఆ విధముగా మూడుదినములు మిక్కిలి భయంకరమైన యుద్ధము జరిగెను. అప్పుడు

పాపపరిహారిణియైన గంగానది రక్తపూర్ణమై ప్రవహించెను. నాలుగవనాడు శ్రీరాముడు వారిని జయించి ఆ పట్టణమున ప్రవేశించి, వానరులలో వైద్యవర్యుడైన సుషేణుని వానరసైన్యములతో కలసి ఆ పట్టణమున స్థిరపరచి, ఆ చంద్రవంశపు రాజులను ముగ్గురిని కారాగారమునందుంచి, సుగ్రీవాది వీరాగ్రగణ్యులతో సుబాహువుచే పరిపాలింపబడుచుండెను. మధురాపట్టణమును చూచుటకు వెడలి, అచ్చట సుబాహువును చూచి ఆనందించి, విదిశా నగరమునకు వెళ్ళి అచ్చట యూపకేతువును చూచి ఆనందించి, రాజ్యమేలుచుండెడు అతనిచే నమస్కరింపబడి, గగనమార్గమున పయనించి, కురుక్షేత్రమును, పుష్కరమును చూచి, మరుద్దేశము దాటి, గుర్జరదేశమునకు చేరెను. అచ్చటనుండి ప్రభాసమునకు వెళ్ళి ఆ మల్లదేశమున ప్రవేశించి, గజాశ్వనగరమున రాజ్య పరిపాలనము చేయుచుండు అంగదుని చూచి, పుడమినేలుచుండు చిత్రకేతువును ధనరత్న నగరమునందు విచారించి, ఆనర్తదేశమునకు వచ్చి అచ్చటి వారిచే పరిపూజింపబడుచుండెను. పిదప రాజ్యపదవినందిన పుష్కరుని జూచుటకు పుష్కరావతికివచ్చి విమానముపై పయనించి, తక్షశిలాహ్వాయ నగరమున తక్షుని జూచి, పదస్థుడను భరతుని మేనమామయు అయిన యుధాజిత్తును జూచి వానిచే సత్కరింపబడెను.

**యయౌ విహాయసా శీఘ్రం శకదేశం మనోరమమ్ ।**
**జిత్వా యవనదేశస్థాన్నృపాన్ సర్వాన్ రఘూత్తమః ॥ 45**

**పశ్యన్నానావిధాన్ దేశాన్ తామ్రందేశం యయౌతతః ।**
**తతో మాయాపురీం గత్వా కలాపగ్రమమాయయౌ ॥ 46**

**నరనారాయణౌ దృష్ట్వా చోపాస్యా రఘునందనః ।**
**ఉపాసకం నారదం చ వర్షే భారతసంజ్ఞకే ॥ 47**

**తాన్నత్వార్చ్య రఘుశ్రేష్ఠస్తత్రస్థైః పరిపూజితః ।**
**భారతేశం రణే హత్వా తత్పదే స్థాప్య స్వానుగమ్ ॥ 48**

**భారతం పృష్ఠతః కృత్వా పుణ్యదేశం మనోరమమ్ ।**
**యోజనానాం సహస్రైశ్చ నవభిః పరివిస్తృతమ్ ॥ 49**

**అగ్రే దదర్శ శ్రీరామో హిమాలయమహాచలమ్ ।**
**యోజనానాం సహస్రాభ్యాం రమ్యం విపులముత్తమమ్ ॥ 50**

**త్రిసప్తతిసహస్రైశ్చ దీర్ఘః ప్రోక్తస్తు యోజనైః ।**
**తత్ర నానాకౌతుకాని దదర్శ రఘునందనః ।**
**దర్శయామాస వైదేహ్యై విమానస్థో ముదాన్వితః ॥ 51**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, భారతవర్షజయోనామ, సప్తమస్సర్గః ॥**

రాజీవాక్షుడగు శ్రీరాముడు మహావేగముతో ఆకాశమార్గమున పయనించి, మనోహరమైన శకదేశమును జయించి, యవనదేశ గతులగు రాజులందరిని దుమ్ముదులిపి, వివిధ దేశముల వినోదములను విలాసముతో విలోకించుచు, తామ్రదేశమునకువచ్చి, అక్కడినుండి మాయాపురమును ప్రవేశించి, కలాపగ్రామమునకు వెళ్ళెను.

అటుమీద ఉపాస్యులయిన నరనారాయణ మూర్తులను చూచి, తదుపాసకుడైన నారదమహర్షిని చూచి, భారత మనబడు ప్రదేశమున వారికి నమస్కరించి, పూజించి, అచ్చట ఉండెడువారిచే చక్కగా పూజింపబడి, భారతరాజును యుద్ధమున సంహరించి, వాని స్థానమున అతని అనుచరుడగు భరతుని స్థాపించి, వానిని వెంటదీసికొని మనోహరమైన పుణ్యదేశమును ప్రవేశించి, శ్రీరామచంద్రస్వామి 9,000 యోజనములచే మహా విస్తృతమును, 1,000 యోజనములచే విపులమును, 23,000 యోజనములు నిడుపునైన హిమాలయ పర్వతమును విలోకించి, దానిలో వింతలన్నిటిని చక్కగా జూచి, విమానముననే జానకీదేవికిని ఆశ్చర్యకరములైన వింతలను చూపించెను.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, పూర్వార్ధములో, భారతవర్షజయమనే 7వ సర్గ ముగిసినది.**

# 8వ సర్గ

శ్రీరాముని జంబూద్వీప విజయము

శ్రీరామదాస ఉవాచ

అథ హ స కింపురుషం నామ వర్షం నవసహస్రయోజనవిస్తీర్ణం,-
స్వీయానాదిసిద్ధరామమూర్తి, దేవతోపాస్యవిరాజమాన,-
పవనసుతోపాసక, సమధిష్ఠితముపజగామ ॥ 1

తత్ర హ వావ దర్శితనానాకౌతుకస్తద్వర్ష, నృపసమూహపరివేష్టితః,
పుష్పకసమధిష్ఠితో, నవవాద్య స్వరపురస్సరః, పురతోఽనుససార ॥ 2

అథ హేమకూట నామ పర్వతమతికమనీయం,
ద్విసహస్రయోజన, విపులమేకాశీతిసహస్రయోజనదీర్ఘం
నానాధాతువిరాజితం, సమున్నతశిఖరవిరాజమానం
పుష్పకసమధిష్టితో రఘునాథ ఉపజగామ ॥ 3

అథ తృతీయం వర్ష నామ, నవసహస్రయోజనపరిమితం,
నృసింహోపాస్య, ప్రహ్లాదోపాసక, విరాజమానమతికమనీయం
దశరథతనయః సమనుయయౌ ॥ 4

తద్వర్షవాసి నృపవరవృంద, తుములసంగ్రామ సంపాదిత,
జయశ్రీ రిపుకోశాదిపూజిత, నృపదయితారాఽర్తికనీరాజిత,
జనకజాదర్శితమాన, కౌతుకధ్వజపతాకాతోరణ,
ఘంటాకింకిణీవిరాజమానపుష్పకసమధిష్ఠితః,
శ్రీరఘునందన ఉపజగామ ॥ 5

అథ నిషధం నామ పర్వతం ద్విసహస్రయోజనవిపులం
నవతిసహస్రయోజన దీర్ఘమతికమనీయం
స రఘునందనో నయనగోచరం చకార ॥ 6

అథ సువర్ణాద్రి సమంతతశ్చతుర్దిక్షు సమానామానా
మిళావృతం నామ చతుర్థం వర్షం
చతుస్త్రింశత్సహస్రయోజనపరిమితం
స రఘునాయక ఉపజగామ ॥ 7

తత్ర హ వావ మేరోరాశ్రయభూతే మేరోర్దక్షిణదిక్ స్థితే
మేరుమందరపర్వతేఽతివిరాజమానే సమున్నత-
జంబూవృక్షమతివిశాలం జంబూద్వీపాఖ్యసూచకం
సఫలమపూర్వమతికమనీయ స రామచంద్రోఽవని
దుహిత్రే దర్శయమాస ॥ 8

తతో మేరుపశ్చిమతో మేరోరాశ్రయభూతే,
సుపార్శ్వపర్వతే విరాజమాన కదంబవృక్ష మతిసమున్నత
మతివిపులమతికమనీయం పుష్పరంజితం
స రఘునాయకో నేత్రవిషయం చకార ॥ 9

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను; శ్రీరామచంద్రస్వామి 9000 యోజనముల విస్తీర్ణమును, తనయొక్క అనాదియైన సిద్ధరామమూర్తి దేవతలచే గౌరవింపబడుతున్న, అంజనేయ ఉపాసకునిచే అలంకృతమైన, కింపురుష మనబడు రెండవదేశమునకు వెడలెను. అచ్చట అనేక వినోదములను అవలోకించుచు ఆ వర్షమునందలి మహారాజపరివారముచే పరివేష్టితుడగుచు, నవవాద్యములు మ్రోగుచుండగా, పుష్పకవిమానారూఢుడై ముందు ప్రయాణక్రమము ననుసరించెను. అంత నచ్చట హేమకూటమను పేరందినదియును, 2000 యోజనముల విస్తీరమును, 8000 యోజనముల నిడువును, వివిధ ధాతువిరాజితమును తుంగశృంగ సంగతమును అయిన పర్వతమునకు వెడలెను. పిదప హరివర్ష మను పేరుగల 9000 యోజన ప్రమాణముగల శ్రీనృసింహ దేవుడే ఉపాస్యమూర్తిగా కలిగిన, ప్రహ్లాదుడను ఉపాసకునిచే విరాజించుచున్నట్టి, మిక్కిలి మనోహరమగు మూడవవర్షమును దశరథాత్మజుడు వెడలి దర్శనానందమొందెను. శ్రీరాముడు అచ్చటి మహారాజులతో యుద్ధములను చేసి, జయసంపద పొంది, రాజులయొక్క కోశాదివస్తు సమర్పణాదులచే సత్కారమునంది, రాజపత్నులచే హారతులనంది జానకీదేవికి పలువేడుకలను చూపించుచు చిత్రధ్వజ తోరణాది అలంకృత దివ్యవిమానమునెక్కి, ముందుకువెడలెను. అంత 2000 యోజనముల వెడల్పును, 9000 యోజనముల నిడువును కలిగి, మిక్కిలి మనోహరమైన నిషధనామక పర్వతమును శ్రీరాముడు కన్నులపండుగగా జూచెను. (6)

ఆ పిమ్మట మేరువునకు అంతటా నాలుగుదిక్కులలోను సమాన పరిమాణము గల, 34,000 యోజనముల కొలతగల ఇలావృతమను దేశమునకు శ్రీరఘునందన స్వామి చేరెను. అచ్చటనేగదా మేరువునకు ఆశ్రయభూతమయిన మేరువునకు దక్షిణ భాగమునగల విశేషముగా విరాజించుచుండు మేరుమందర పర్వతమునందు జంబూద్వీపమను పేరుకు సూచకమును, ఫలసహితమును, అపూర్వమును, మనోహరమును, అత్యంతోన్నతమును, విశాలముగా విరాజించునట్టి జంబూ వృక్షమును శ్రీరామచంద్రమూర్తి సీతాదేవికి చూపించెను.

అంత ఆ మేరువుకు పశ్చిమాన దానికి ఆశ్రయభూతమయిన సుపార్శ్వపర్వతము నందు ప్రకాశించుచుండెడు అతివిశాలమును, అత్యంతోన్నతమయిన పుష్పవిరాజితమైన కదంబ వృక్షమును జూచెను.

**అథ మేరోరుత్తరతస్తస్యాశ్రయభూతే కుముదనామ్ని పర్వతే,**
**విరాజమానమతిసమున్నతం వటవృక్షమతివిశాల**
**మతిస్థూలం స కౌసల్యానందనో నృపసమూహవిరాజితో**
**జనకజాయై దర్శయామాస ॥ 10**

**అథ మేరుపర్వతస్తస్యాశ్రయభూతే, మందరపర్వతే,**
**విరాజమానమతివిశాలమతిసమున్నతమతిస్థూలం,**
**సహకారవృక్షమతికమనీయం, సుపక్వమధుర ఘటతుల్య**
**ఫలభారవినమ్రం పశ్యన్సరఘువంశ భూషణో జనకజాజానిః ॥ 11**

**తత్రేలావృతే విరాజమానసంకర్షణోపాస్య రుద్రోపాసకం,**
**స రఘునాయకో దయితాసహాయః శిరసా ప్రణనామ ॥ 12**

**తద్వర్షవాసినృపప్రబద్ధకరకమలశిరోవందితపదజలరుహ**
**ద్వంద్వః స రఘునాయకః పూర్వదిశమనుజగామ ॥ 13**

**అథ స గంధమాదనపర్వతం ద్విసహస్రయోజనవిపులం**
**చతుస్త్రింశత్సహస్రయోజనదీర్ఘం నయనగోచరం చకార ॥ 14**

**అథ భద్రాశ్వం నామ పంచమం వర్షమేకత్రింశత్సహస్రయోజన-**
**దీర్ఘం, హయగ్రీవోపాస్యభద్రాశ్వోపాసకసమధిష్ఠితం**
**స రఘునాయక ఉపజగామ ॥ 15**

**తత్ర క్వచిత్సంగ్రామస్తద్వర్షవిరాజమానవృపసమూహేభ్యః**
**క్వచిచ్ఛరణాగతప్రబద్ధకరయుగళావనిపతిభ్యః**
**స్వకరభారాన్లభమానః స జనకజా**
**నిరుపయౌ పరివృత్త్య పశ్చిమాభిముఖః ॥ 16**

**అథ మేరోః పశ్చిమదిక్స్థితం మాల్యవంతం పర్వతం**
**ద్విసహస్రయోజనవిస్తీర్ణం చతుస్త్రింశత్సహస్రయోజనదీర్ఘమతి**
**కమనీయం స జనకజారజ్జమానో నయనగోచరం చకార ॥ 17**

అంత ఆ మేరువునకు ఉత్తరమున ఉన్నటువంటి కుముదము అను పేరుగల పర్వతమునందు జరుగుచుండు మిక్కిలి పొడువుగను విశాలముగను, పెద్దదిగాగ నుండెడి మనోహరమైన వటవృక్షమును కౌసల్యాతనయుడగు శ్రీరామచంద్రుడు రాజపరివారముతో తానుచూచి, జానకీదేవికి చూపించెను.

అంత మేరువునకు తూర్పుభాగమున తదాశ్రయభూతమైన మందరపర్వతమునందు ప్రకాశించు నట్టిదియును, స్థూలముననను, వైశాల్యముననను, ఔన్నత్యముననను నిత్యమనోహరత్వముననను మిక్కిలి శ్రేష్ఠము అయినదియును, మధురములును, సుపక్వములునయి కుండలవంటి పండ్లనుగాచి, ఆ ఫలభారముచే వంగిన తియ్యని మామిడి చెట్టును రఘుకుల తిలకుడగు శ్రీరాముడు చూచి, అచ్చట ఇలావృతమయి విరాజించునట్టి సంకర్షణోపాస్య, రుద్రోపాసకులను శ్రీరాముడు సీతాదేవితో కలసి తలతో మ్రొక్కెను. ఆ వర్షమున వసించువారైన రాజులందరును చేతులు గట్టి మోమునందున చిరునగవు చిందించుచుండగా ఆనందమునందిన చరణకమలములు గల శ్రీరఘురాముడు పూర్వదిక్కునకు వెడలెను.

అంత 2000 యోజనముల వెడల్పును, 3400 యోజనముల నిడువును గల గంధమాధనమను పర్వతమును తన కండ్లతో చూచెను. అంత అచ్చటినుండి వెడలి, 30,000 యోజనముల నిడువును హయగ్రీవోపాస్యుడయిన భద్రాశ్వుడను ఉపాసకునికి ఉనికిపట్టయిన అయిదవదియగు భద్రాశ్వ వర్షములో రఘురాముడు ప్రవేశించెను. అచ్చట ఆ వర్షమునందు విరాజించునట్టి రాజులయొక్క సమూహములతో ఒకచోట యుద్ధమును, మరియొకచోట శరణాగతులై చరణసన్నిధికి వచ్చి మ్రొక్కిన రాజులనుండి వారివారి కానుకలను పొంది, శ్రీ సీతాసహాయుడైన శ్రీరఘురాముడు మరలి పశ్చిమాభిముఖుడుగా వెడలెను. పిదప మేరువునకు పశ్చిమ దిగ్భాగమునందు 2000 యోజనములు వెడల్పుకలిగి, 34,000 యోజనములు నిడువుకలిగి, మిక్కిలి సొగసుగా ప్రకాశించునట్టి మాల్యవంత మను పర్వతమును శ్రీజానకీ హృదయరంజకుడైన శ్రీరాముడు తన కన్నులను వినోదమునకు పాత్రముజేసెను.

తత్పశ్చిమతః కేతుమాలం నామ షష్ఠం వర్షం ఏకత్రింశత్
సహస్రయోజనవిస్తీర్ణం చతుస్త్రింశత్ సహస్రయోజనదీర్ఘం
కామదేవోపాస్య లక్ష్మ్యుపాసికా సమధిష్ఠితమతిమనోహరమ్
స రామచంద్రోఽను జగామ ॥ 18

తద్వర్షనృపసమూహ ముకుటావంతసపరాగపూజిత
చరణారవిందయుగళః స రఘుకులదీపకః
సీతయా పుష్పకస్థోఽతిముదమవాప ॥ 19

అథ మేరోరుత్తరతః స నీలపర్వతం ద్విసహస్రయోజనవిస్తీర్ణం
నవతిసహస్రయోజనదీర్ఘం రఘుకులతిలకో
నయనవిషయం చకార ॥ 20

అథ రమ్యకం నామ సప్తమం వర్షం నవసహస్రయోజన-
పరిమితం మత్స్యోపాస్యమనూపాసకవిమానమధిష్ఠితః
స రఘునందన ఉపజగామ ॥ 21

తత్ర స్థైరవనిపాలైః స్వకోశాదిపూజితః స రఘునాయకః
సీతాం రంజయన్ పురతోఽనుససార ॥ 22

తస్యోత్తరతః శ్వేతపర్వతం ద్విసహస్రయోజన
వీస్తీర్ణమేకాశీతిసహస్రయోజనదీర్ఘమతికమనీయం
స స్వలోచనవిషయం చకార ॥ 23

అథ హిరణ్మయం నామాష్టమం వర్షం నవసహస్రయోజన
పరిమితం కూర్మోపాస్యార్యమోపాసక మధిష్టితమ్
అతికమనీయం స సమనుయయౌ ॥ 24

తద్వర్షవాసి నృపదయితాశిరోభూషణ
మణితేజోదీపిత జానకీచరణారవింద
యుగళ మీక్షమాణః స రఘునందనో ముదమవాప ॥ 25

దానికి పశ్చిమాన 31,000 యోజనములు విస్తీర్ణమును, 43,000 యోజనములు నిడువుకలిగి కామదేవుడే ఉపాస్యమూర్తిగాగల లక్ష్మియను ఉపాసకురాలు గల, మనోహరమైన కేతుమాల అను ఆరవవర్షమును శ్రీరామచంద్రుడు అనుసరించెను. సీతాదేవితో పుష్పకస్థుడై దాశరథి స్వామి ఆ వర్షమునందుగల రాజసమూహముయొక్క కిరీటములలోని అలంకృత పుష్పరాగములచే పరిపూజింప బడిన పాదారవింద ద్వంద్వుడై అమందానందము నందెను.

అటుపిమ్మట మేరుపర్వతమునకు ఉత్తర భాగమున 2000 వేల యోజనముల విస్తీర్ణమును, 90,000 యోజనముల పొడవును అయిన నీలపర్వతమును శ్రీరామచంద్రుడు నేరుగా దర్శించెను. అంత 9000 యోజనముల పరిమాణము గలదియును మత్స్యమూర్తిని ఉపాసించువాడైన మనువను ఉపాసకునిచే ఆశ్రయింపబడినదియు, రమ్యకమను పేరుకలిగిన యేడవ వర్షమునకు వచ్చెను. అచ్చటివారైన రాజులచేత సమర్పింపబడిన కోశాదులుగలవాడై శ్రీరామచంద్రుడు సీతాదేవిని రంజింపజేయుచు ముందుమార్గము ననుసరించెను.

దానికి ఉత్తరమున 2,000 వేల యోజనముల వెడల్పును, 71,000 వేల యోజనముల పొడవును గల మిగుల చక్కనైన శ్వేతపర్వతమును తన చూపుచేతనే పవిత్రముజేసెను. అంత 9000 యోజనముల పరిమాణము గలదియును, కూర్మమును ఉపాసకమూర్తియగు అర్యమయుడు వసించునటువంటి దియును, మిక్కిలి సుందరమైన ఎనిమిదవదైన హిరణ్మయ దేశమును చేరెను.

ఆ హిరణ్మయ వర్షమున నివాసము చేయునటువంటి మహారాజపత్నులయొక్క శిరో భూషణములు రత్నకాంతులచే మెరయుచుండెను. జానకీదేవియొక్క చరణారవిందములను చూచుచు శ్రీరాముడు ఆనందించెను.

**తస్యోత్తరతః శృంగవంతం పర్వతం ద్విసహస్రయోజనవిస్తీర్ణం**
**త్రిసప్తతిసహస్రయోజనదీర్ఘం స రఘునందనో దదర్శ ॥ 26**

**అథోత్తకురువర్షం నవమం నవసహస్రయోజనపరిమితం**
**వరాహోపాస్యభూమ్యుపాసికాసమధిష్ఠితమతిమనోహరం**
**స రామచంద్రస్తమనుయయౌ ॥ 27**

**తద్వర్షచారిరణత్కంపితావయవనృపమహోవతం**
**స మణిముక్తావిరాజితపదజలరుహద్వంద్వః**
**స రఘునాయకో ముదమవాప ॥ 28**

**అథ రామో లవం జంబూద్వీపపతిం కరిష్యామీతి నిశ్చిత్య కియద్దినం తదధికారో విజయం నామ స్వమంత్రిణం స్థాపయామాస ॥ 29**

**ఏతేషాం జంబూద్వీపాంతర్గతవర్షాణాం తథా సర్వద్వీపాంతర్గతవర్షాణాం యాని యాని నామాని తాని ప్రియవ్రతనృపపౌత్రనామసూచితాని సంతి । తేషు యే యే నృపా జాయంతే తే తద్వర్షనామసూచితా ఏవ భవంత్యతః సర్వేషాం పృథక్ నామాని మయాఽత్ర నోచ్యంతే ॥ 30**

**ఏవం జంబూద్వీపమాయామవిస్తరాభ్యాం లక్షయోజనపరిమిత మతికమనీయం సమవర్తులం పుష్కరపత్రోమం నవవర్షమండితం స రఘునాయకః స్వవశం చకార ॥ 31**

**మేరుపర్వతాగ్రే అష్టపుర్యోఽష్టదిక్పాలానాం సంతి । తత్పాలకాః సురాధీశవహ్నియమనిరృతివరుణవాయు కుబేరేశాస్తే సర్వే మమాజ్ఞాం పరిపాలయంత్వితి నిశ్చిత్య స రఘునాయకస్తాన్ ప్రతి జగామ ॥ 32**

దానికి ఉత్తరమున శృంగవంతమను పేరుకలిగి, 2000 యోజనముల విస్తీర్ణమును, 23,000 యోజనములు పొడవును గలదైన పర్వతమును శ్రీరఘురాముడు చూచెను. అంత 9000 యోజనముల పరిమితిగల ఉపాస్యమూర్తియగు వరాహస్వామియును, ఉపాసకమూర్తియగు భూదేవియునుగల మిక్కిలి మనోహరమైన ఉత్తరకురువర్షమును శ్రీరామచంద్రుడు చేరెను.

ఆ వర్షమునందు యుద్ధమున పరాజితులైన కంపితగాత్రులగు వేయారుమంది రాజులయొక్క కిరీటరత్న ముక్తామణులచే ప్రకాశించునట్టి చరణకమలములుగలవాడై రఘునందనుడు ఆనందమందెను. అటుపిమ్మట శ్రీరాముడు జంబూద్వీప పతియైన, మరియు ఉత్తర కురువర్షము నందుగల దీర్ఘబాహువును రణమున సంహరించి, అయోధ్యకు వచ్చి, లవుని జంబూద్వీపపతిగా ఏర్పరచెదనని నిశ్చయించి, కొంతకాలమువరకు ఆ పదవిలో విజయుడను తన మంత్రిని ఉంచెను.

విష్ణుదాసా! వినుము : ఈ జంబూద్వీపనందుగల మరియు ఇట్లే సర్వదీపములలోను గల ప్రదేశములకు ఏయేపేర్లు గలవో అవన్నియును ప్రియవ్రతుడను రాజుయొక్క మనుమల నామములచే సూచించబడినవిగా ఉన్నవి. వానిలో ఏయేరాజులు పుట్టుచుందురో వారు ఆ వర్గముయొక్క నామములచే

సూచింపబడదగిన వారగుదురు. కావుననే ఇచ్చట వేర్వేరుగా ఆ పేర్లను వివరణ చేయలేదు. ఇట్లు ప్రమాణవిస్తరములచే లక్షయోజన పరిమితమయిన, మిక్కిలి కమనీయమును, సమావర్తులాకారమును, తామరాకువలె నుండునదియును, తొమ్మిది ప్రాంతములచే చక్కగా అలంకరింపబడినది అయిన జంబూద్వీపమును శ్రీరామచంద్రుడు తనవశము జేసికొనెను. మేరుపర్వతాగ్రమున దిక్పాలకులు ఎనిమిది మందికి ఎనిమిది పట్టణములుగలవు.

వాటికి పరిపాలకులైన– ఇంద్ర, అగ్ని, యమ, నిరృతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులు– అందరును నా యొక్క ఆజ్ఞను పరిపాలింతురుగాక! అని నిశ్చయించి ఆ రఘురాముడు వారివద్దకు వెడలెను.

**తా అష్టపుర్యః పృథక్ పృథక్ సార్ధద్విసహస్రయోజన**
**పరిమాణే నాయామవిస్తారతో జ్ఞాతవ్యాః ॥ 33**

**మేరులక్షయోజనసమున్నతో, మూర్ధ్ని ద్వాత్రింశత్సహస్రయోజన**
**వితతో మూలే, షోడశసహస్రయోజనవితతశ్చాధః, షోడశ**
**సహస్రయోజనమితో భూమ్యాం, ప్రవిష్టశ్చతురశీతిసహస్ర**
**యోజనమితో భూమ్యాం, బహిర్ధత్తూరపుష్పవద్దృశ్యతే ॥ 34**

**తత్ర మేరుపర్వతాగ్రేఽష్టదిక్పాలపురీణాం మధ్యే బ్రహ్మపురీ**
**దశసహస్రయోజనాయామవిస్తరతో జ్ఞాతవ్యా ॥ 35**

**సర్వే వర్షమర్యాదీభూతాష్టపర్వతా**
**దశసహస్రయోజనసమున్నతాజ్ఞాతవ్యాః ॥ 36**

**వర్షదీర్ఘతా పర్వతసమానా జ్ఞాతవ్యా ॥ 37**

**జంబూద్వీపస్యోపద్వీపానష్టౌ హైక ఉపదిశంతి ॥ 38**

**సగరాత్మజస్థాన్వేషణ ఇమాం మహీం పరితో**
**నిఖనద్భిరుపకల్పితాన్ ॥ 39**

**తద్యథా స్వర్ణప్రస్థః చంద్రశుక్లః ఆవర్తనో రమణకః**
**మందరహరిణః పాంచజన్య సింహలో లంకా చేతి ॥ 40**

**తేషు లంకాం వినా సప్తసు యదా యద్యత్సమీపం**
**తదా తత్ర తత్ర గత్వా తత్రస్థానుపద్వీపపాలకాన్**
**శ్రీరామచంద్రః స్వవశాంశ్చకార ॥ 41**

**భారతేలావృతవర్షాభ్యాం వినా సప్తసు వర్షేష్వసంఖ్యాతా**
**నద్యోగిరయశ్చ సంతి । తేషాం విస్తారం కో వక్తుం క్షమః ॥ 42**

ఆ యెనిమిది పట్టణములును వేర్వేరుగా 2,500 యోజనముల పరిమాణము ఎట్లుచూచినను గలదై విరాజించుచున్నవని గుర్తించవలయును. మేరుపర్వతము లక్షయోజనములు నిడువును, తలలో 32,000 యోజనముల వైశాల్యమును, మూలమున 16,000 యోజనముల విస్తీర్ణమును, క్రింద 19,000 యోజనముల వెడల్పును, భూమిలో ప్రవేశించి 84 యోజనముల పరిమితి గలదియును, భూమికి వెలుపల ఉమ్మెత్తె పూవువలె కనుపడుచున్నది. ఆ మేరు పర్వతాగ్రమున అష్టదిక్పాలకుల పట్టణములకు నడుమన బ్రహ్మపట్టణము 10,000 యోజనములు నిడువు, వెడల్పును గలదై యుండునని తెలుసుకొనవలయును. ప్రాంతములయొక్క ఎల్లలను చూపునట్టి ఎనిమిది పర్వతములు 10,000 యోజనములు ఎత్తులు గలవని తెలియబడదగినవి. ప్రాంతముల దైర్ఘ్యము పర్వత సమానమని తెలియవలెను.

జంబూద్వీపమునకు ఉపద్వీపములు ఎనిమిదిగలవని కొందరు చూపించెదరు. అవి యేవనిన సగరపుత్రులు ఇంద్రునిచే అపహరింపబడిన అశ్వమును వెదకునపుడు ఈ భూమినంతటిని త్రవ్వుసమయాన కల్పింపబడినవి. అవి :- 1. స్వర్ణప్రస్థము, 2. చంద్రశుక్లము, 3. ఆవర్తనము, 4. రమణకము, 5. మందరహరిణము, 6. పాంచజన్యము, 7. సింహళము, 8. లంక అనునవి. వాటిలో లంక తప్ప తక్కిన ద్వీపములకు ఏదేది యెప్పుడెప్పుడు ఎచ్చటికిపోయినపుడు సమీపించినవో అప్పుడప్పుడు వాటిలోని ద్వీపాధిపతులను తనకు స్వాధీనులైయుండునట్లు చేసెను.

భారత ఇలావృతవర్షములు తప్ప తక్కిన యేడువర్షములలోను అసంఖ్యాకములైన నదులును, పర్వతములును గలవు. వాటియొక్క విస్తారమును చెప్పుటకు ఎవరితరము?

**అథేలావృతసంస్థితా ముఖ్యనద్య ఏవోచ్యతే ॥ 43**

**అరుణోదాజంబునదీపయోదధిఘృత మధుగుడాన్నాంబర**
**శయ్యాసనాభరణసంజ్ఞా నదాస్తదా పంచ మధురానద్యస్తథా**
**సీతా౨లకనందాచక్షుర్భద్రేతి మేరోరధశ్చతుర్దిక్షు పతితా**
**జాహ్నవీభేదాశ్చత్వార ఏవమిలావృతనద్యః ॥ 44**

తాసు సీతా పూర్వసముద్రం చక్షుర్భద్రా పశ్చిమసముద్రం
భద్రోత్తరసముద్రమ్ అలకనందాదక్షిణస్యాం
దిశి భారతే వర్షే జలనిధిం ప్రవిశతి ॥ **45**

భారతేఽస్మిన్ వర్షే సరిచ్ఛైలాః సంతి బహవః ॥ **46**

తద్యథా మలయో మంగళప్రస్థో మైనాకః త్రికూటః ఋషభః
కుటకః సహ్యః దేవగిరిః ఋష్యమూకః, శ్రీశైలో, వేంకటో,
మహేంద్రో, వారిధారో, వింధ్యః, శక్తిమానృక్షగిరిః, పారియాత్రో,
ద్రోణశ్చిత్రకూటో, గోవర్ధనో, రైవతకః, కుకుభో, నీలో, గోకాముఖ,
ఇంద్రకీలః, కామగిరిశ్చేత్యన్యే చ శతసహస్రశః శైలాస్తేషాం
నితంబ ప్రభవా నదా నద్యశ్చ సంత్యసంఖ్యాతాః ॥ **47**

చంద్రవశా, తామ్రపర్ణీ, అవటోదా, కృతమాలా, వైహాయసీ, కావేరీ,
వేణీ, పయస్వినీ, శర్కరావర్తా, తుంగభద్రా, కృష్ణా, వేణా, భీమరథీ,
గోదావరీ, నిర్వింధ్యా, తాపీ, మహీ, సురసా, నర్మదా, చర్మణ్వతీ, సింధుః,
శోణశ్చ నదౌ మహానదీ వేదస్మృతిః, ఋషికుల్యా, త్రిసామా, కౌశికీ,
మందాకినీ, యమునా, సరస్వతీ, దృషద్వతీ, గోమతీ, శరయూ,
రోధస్వతీ, సప్తవతీ, సుషోమా, శతద్రు శ్చంద్రభాగా, మరుధన్వా,
వితస్తా, అసిక్నీ, విశ్వేతీ మహానద్యః ॥ **48**

ఏవం శిష్య రఘునాయకో నాయకః సోపద్వీపం
జంబుద్వీపం స్వవశ కృత్వా లక్షయోజనవిస్తీర్ణం
జంబూద్వీపపరిఖోపమం సముల్లంఘ్య పుష్పకస్థః
ప్లక్షం నామ ద్వితీయం ద్వీపం దదర్శ ॥ **49**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, జంబుద్వీపజయో నామ, అష్టమస్సర్గః ॥**

అంత ఇలావృతమునందలి ముఖ్యనదులు చెప్పబడుచున్నవి. అరుణోదకనది, క్షీరనది, ఘృతనది, మధురనది, గుడనది, అన్ననది, అంబరనది, శయ్యానది, ఆసననది, ఆభరణనది. అట్లే నదాలును,

అట్లే మధు ధారానదులయిన సీతానది, అలకానందా, సరిత్తు, చక్షుస్సు, భద్రా, భేదములచే 4 నదులు మేరువుయొక్క క్రిందిభాగమున నాలుగుదిక్కుల యందును పడినవి. జాహ్నవి యగు గంగయొక్క భేదములు నాలుగును ఇట్లు ఇలావృతనదులు చెప్పబడినవి. వాటిలో సీతానది పూర్వసముద్రమును, చక్షుర్నదము పశ్చిమసముద్రమును, భద్రానది ఉత్తరసముద్రమును అలకనందానది దక్షిణదిక్కునందు భారతవర్షమున సముద్రమును ప్రవేశించుచున్నవి. ఈ భారతవర్షమున నదులును, పర్వతములును అనేకములు గలవు.

మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కుటకము, సహ్యము, వేదగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వైకుంఠము, మహేంద్రము, వారిధానము, వింధ్య, శక్తిమంతము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణాద్రి, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కుకుభము, నీలము, గోకాముఖము, ఇంద్రకీలము, కామగిరి ఇట్లే ఇంకయు నూర్లకొలది, వేలకొలది పర్వతములు వాటి పాదములలో పుట్టిన నదములు, నదులును లెక్కలేనన్ని గలవు.

చంద్రవశ, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణానది, వేణీ, భీమరథి, గోదావరి, నిర్వింధ్యా, పయోష్ణీ, తాపి, మహీ, సురసా, నర్మదా, చర్మణ్వతీ, సింధు, అంధోనదము, శోణనది, మహానది, వేదనది, స్మృతినది, ఋషికుల్యానది, త్రిసామానది, కౌశికి, మందాకిని, యమునానది, సరస్వత, దృషద్వతీనది, గోమతి, శరయూనది, రోధస్వతి, సప్తపతి, సుషోమానది, శతద్రు, చంద్రభాగానది, మరుధన్వా, వితస్తానది, అసిక్నీనది, విశ్వానది, మొదలైనవి మహానదులు గలవు.

ఓయి శిష్యుడా! ఇట్లు శ్రీరామచంద్రస్వామి జగచ్చక్రవర్తియై ఉపద్వీపములతో ఉండెడు జంబూద్వీపమును తనవశము జేసికొని, లక్షయోజనముల విస్తీర్ణమైన జంబూద్వీపము యొక్క పరిఖయైయుండెడు లవణార్ణవమను పుష్పకవిమానారూఢుడై లంఘించి, రెండవదైన ప్లక్షద్వీపమును చూచెను.

**శ్రీవాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, పూర్వార్థములో, జంబూద్వీపవిజయమునువర్ణించు 8వ సర్గ ముగిసినది.**

# నవమః సర్గః-9 వ సర్గ

కుశ మొదలగు ఆరుద్వీపముల విజయము

శ్రీరామదాస ఉవాచ

అథ రామో యయౌ శ్రీమాన్ ప్లక్షద్వీపం మనోరమమ్ ।
ద్విలక్షయోజనమితం సప్తవర్షసమన్వితమ్ ॥ 1

ఉపాస్యో యత్ర వై సూర్యో బ్రాహ్మణాశ్చ హ్యుపాసకాః ।
ద్వీపాఖ్యాకృచ్చ యత్రాస్తి ప్లక్షవృక్షో హిరణ్మయః ॥ 2

యథాఽఽరామాద్బహిర్జ్ఞేయాః పరిఖాశ్చ సమంతతః ।
జంబూద్వీపాచ్చ క్షారోదాద్బహిర్ద్వీపస్తథా త్వయమ్ ॥ 3

మేరోః పూర్వదిశాయాం వై తత్ర వర్షం శివాహ్వయమ్ ।
ఆదౌ యయౌ రామచంద్రః క్షణాదేవ విహాయసా ॥ 4

నదీ యత్రారుణా నామ్నీ సర్వపాపప్రణాశినీ ।
తస్యాం స్నాత్వా రఘుశ్రేష్ఠః శీఘ్రం తద్వర్షం యయౌ ॥ 5

తేన వర్షాధిపేనైవ యుద్ధమాసీత్సుదారుణమ్ ।
తం జిత్వా పంచమాసైశ్చ తైశ్చ పార్థివసత్తమైః ॥ 6

పూజితో రఘునాథస్తు వజ్రకూటాచలం యయౌ ।
వజ్రకూటం మహాశ్రేష్ఠం ద్వయోః సాగరయోః స్థితమ్ ॥ 7

పరస్పరం వర్షయోశ్చ సీమాభూతం దదర్శ సః ।
తం గిరిం పృష్ఠతః కృత్వా వర్షం యవయసం యయౌ ॥ 8

నృమ్ణానదీజలే స్నాత్వా యయౌ యవయసేశ్వరమ్ ।
తేన సంపూజితో రామస్తతస్తద్వర్షపార్థివైః ॥ 9

సహితః పుష్పకేనైవముపేంద్రసేనపర్వతమ్ ।
దృష్ట్వా కృత్వా పృష్ఠతస్తం సుభద్రం వర్షమాయయౌ ॥ 10

**ఆంగీరసీనదీతోయే స్నాత్వా స రఘునాయకః ।**
**వర్షాధిపేన కోశైః సంపూజితః పార్థివైః సహ ॥ 11**

**జ్యోతిష్మంతం గిరిం గత్వా తం కృత్వా పృష్ఠతః క్షణాత్ ।**
**శాంతివర్షేఽథ సావిత్రీనదీతోయే విగాహ్య చ ॥ 12**

**తద్వర్షేజ్ఞం నృపం జిత్వా తథా తద్వర్షసంస్థితాన్ ।**
**నృపాన్ జిత్వా క్షణాదేవ సువర్ణపర్వతం యయౌ ॥ 13**

## శ్రీరాములవారియొక్క ఆరుద్వీపముల విజయవర్ణనము

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "పిమ్మట శ్రీరామచంద్రస్వామి రెండులక్షల యోజనముల పరిమితి కలిగినదియు, ఏడు దేశములతో కూడినదియు, సూర్యుని ఉపాసించునట్టి బ్రాహ్మణులు గలదియును, ద్వీప నామమునకు కారణమైన సువర్ణమయమగు ప్లక్ష (జువ్వి) వృక్షముగలదియు అయిన మనోహరమగు ప్లక్షద్వీపమునకు వెడలెను.

ఉద్యానవనమునకు అటువైపు అంతటా అగడ్తలందు అందముగా నుండును. ఈ ద్వీపము జంబూద్వీపమునకును, లవణార్ణవమునకు బయటగలది. మేరువునకు తూర్పు భాగమునందు గల శివాభిధానవర్షమునకు మొదట వెడలి, అచ్చట సర్వపాప ప్రణాశినియై ఉండెడు అరుణ అను మహానదియందు స్నానముచేసి, ఆ దేశాధిపతితో యుద్ధముజేసి, గెలిచి, ఐదు నెలలపాటు ఆ దేశపు రాజు చేతను మరియు అచ్చటి రాజోత్తములచేతను పూజింపబడి, వజ్రకూటాచలమునకు వెళ్ళెను. రాజ్యమునకు దగ్గరగా పొలిమేరుగా ఉండెడు రెండు సాగరములకు నడుమ మహాశ్రేష్ఠమైన ఆ పర్వతమును చూచెను. దానిని వెనుక విడిచి, యవయస దేశమునకు వచ్చెను. అచ్చటి నృమ్ణా నదియందు స్నానముచేసి, యవయస నాథునిచే పూజింపబడి, అచ్చటి రాజులతో కలసి పుష్పకవిమానమున వెడలి, ఉపేంద్రసేన పర్వతమునకు వెళ్ళి, అచ్చటినుండి సుభద్రవర్షమునకు వెళ్ళి, ఆంగీరసి నదియందు స్నానముచేసి, ఆ దేశపు రాజుచే సత్కరింపబడి, అచ్చటిరాజులతో కలసి జ్యోతిష్మంతగిరిని దాటి, శాంతిదేశమున ప్రవేశించి, సావిత్రీనదిలో దిగి ఆ రాజ్యాధిపతిని జయించి, అచ్చటి రాజులను కట్టడిచేసి, సువర్ణపర్వతమునకు వెడలెను.

**తతో గత్వా క్షేమవర్షం సుప్రభాతానదీజలే ।**
**స్నాత్వా రామః క్షేమపేన స్వకోశైః పరిపూజితః ॥ 14**

**హిరణ్యష్ఠీవనామానం గిరిం రమ్యం విలంఘ్య చ ।**
**వర్షేఽమృతే తన్నృపేణ పార్థివైః పరిపూజితః ॥ 15**

ఋతంభరానదీతోయే చకార స్నానమాదరాత్ ।
మేఘమాలం గిరిం త్యక్త్వా పృష్ఠతః పుష్పకేణ హి ॥ 16

వర్షేఽభయే తన్నృపతిం క్షణాజ్జిత్వా రణే ప్రభుః ।
సత్యంభరానదీతోయే స్నాత్వా స రఘుసత్తమః ॥ 17

సుచంద్రాఖ్యం నృపం ప్లక్షద్వీపేశం తీక్ష్ణసంగరైః ।
కృత్వా వై స్వపదాక్రాంతం సమంతాద్ద్వీపపార్థివైః ॥ 18

మణికూటం గిరివరం సమతిక్రమ్య వై క్షణాత్ ।
ఇక్షురసోదనామానం ద్విలక్షయోజనం వరమ్ ॥ 19

తీర్త్వా తం సాగరం భీమం ప్లక్షస్య పరిఖోపమమ్ ।
తథా చ శాల్మలీద్వీపం చతుర్లక్షమితం యయౌ ॥ 20

ద్వీపాఖ్యాకృచ్ఛ యత్రాస్తి శాల్మలీ ద్వీపపాదపః ।
యత్రోపాస్యశ్చసోమోఽస్తి తత్రస్థాతదుపాసకాః ॥ 21

విస్తారద్వీపమానాని దీర్ఘతాయాః స్మృతాని చ ।
తత్ర క్రమేణ వర్షాణి కథ్యంతే పూర్వవన్మయా ॥ 22

మేరోః పూర్వదిగారభ్య సర్వత్ర క్రమ ఉచ్యతే ।
సురోచనం సౌమనస్యం తథా రమణకం శుభమ్ ॥ 23

దేవవర్షం పారిభద్రనామాప్యాయనమనుత్తమమ్ ।
అవిజ్ఞాతం సప్తమం చ సప్త వర్షాణి వై క్రమాత్ ॥ 24

అనూమతీ సినీవాలీ తథైవ చ సరస్వతీ ।
కుహూశ్చ రజనీ నందా రాకా నద్య ప్రకీర్తితాః ॥ 25

శతశృంగో వామదేవో కుందశ్చ కుముదస్తథా ।
పుష్పవర్షః పంచమశ్చ సహస్రశ్రుతిరుత్తమః ॥ 26

అంత క్షేమదేశమున సుప్రభానదిలో మునిగి, క్షేమపతిచే పూజింపబడి, హిరణ్యష్ఠీవమను పేరుగల పర్వతరాజమును చూచి, అమృత దేశమున ఆదేశరాజు చేతను, ఇతర రాజులచేతను పూజింపబడి, ఋతంభరానదియందు స్నానముచేసి, మేఘమాలపర్వతమును దాటి, అభయ దేశమున ఆరాజును జయించి, సత్యంభరానదియందు స్నానముచేసి, ప్లక్షద్వీపమును పాలించుచుండిన సుచంద్రుడను ద్వీపపాలకుని తీవ్రయుద్ధమునందు తన పాదదాసుని జేసికొని, సమస్త రాజులతోను శ్రీరామచంద్రుడు మణికూట పర్వతమును దాటి, రెండులక్షలయోజనముల పరిమితిగల ప్లక్షద్వీపము యొక్క అగడ్తవలె భయంకరమైన ఇక్షుసముద్రమును దాటి, నాలుగు లక్షల యోజనముల శాల్మలి ద్వీపమును చేరెను. ఆ శాల్మలిద్వీపమున తన పేరును దానికి కలుగజేసి, బూరగచెట్టు మహాద్భుతమై ఒప్పియుండును. అచ్చట సోముడు ఉపాస్యమూర్తిగా నుండును. అచ్చటివారందరును సోమోపాసకులై వర్తిల్లుచుందురు. దాని పొడవు, వెడల్పులు విస్తారములై ఉండును. ముందువలె దానియొక్క రాజ్యములు క్రమముగా చెప్పబడుచున్నవి. మేరువునుండి పూర్వము మొదలు దేశములను తెలుసుకొనవలయును. సురోచనము, సౌమనస్యము, రమణకము, దేవవర్షము, పారిభద్రము, ఆప్యాయనము, అవిజ్ఞాతము ఇట్లు 7 దేశములు గలవు. అనుమతీ, సినీవాలీ, సరస్వతీ, కుహూ, రజనీ, నందా, రాకా అని సప్తనదులు ప్రకాశించుచున్నవి. శతశృంగము, వామదేవము, కుందము, కుముదము, పుష్పవర్షము సహస్ర శ్రుతి, స్వరసము అని సప్తపర్వతములు ఒప్పుచున్నవి.

**స్వరసః పర్వతాః సప్త జ్ఞేయాః సీమాసు వై క్రమాత్ ।**
**ఏతేషు సప్తవర్షేషు వర్షపాలాన్ విజిత్య సః ॥ 27**

**జిత్వా ద్వీపేశ్వరం రామః సుబాహుం ముదమాయయౌ ।**
**సురోదం చ చతుర్లక్షమితం తీర్త్వా పయోనిధిమ్ ॥ 28**

**కుశద్వీపమష్టలక్షమితం రామో యయౌ క్షణాత్ ।**
**తత్రోపాస్యో జాతవేదాః సర్వేషాం ద్వీపవాసినామ్ ॥ 29**

**ద్వీపాఖ్యాకృచ్ఛ యత్రాస్తి కుశస్తంభః సురై కృతః ।**
**తత్ర క్రమేణ వర్షాణి కీర్త్యతే సప్త వై మయా ॥ 30**

**వసుం చ వసుదానం చ తథా దృఢరుచిం శుభమ్ ।**
**నాభిగుప్తం తథా సత్యవ్రతం వివిక్తముత్తమమ్ ॥ 31**

**వామదేవం సప్తమం చ వర్షం జ్ఞేయం క్రమేణ హి ।**
**రసకుల్యా మధుకుల్యా మిత్రవిందా నదీ శుభా ॥ 32**

శ్రుతివిందా దేవగర్భా తథా చైవ ఘృతచ్యుతా ।
మంత్రమాలా క్రమేణైవ నద్యః సప్తస్తు వై క్రమాత్ ॥ 33

చతుః శృంగశ్చ కపిలశ్చిత్రకూటో మనోరమః ।
దేవానీక ఊర్ధ్వరోమా ద్రవిణశ్చక్ర ఈరితః ॥ 34

ఏతే సీమాసు వర్షాణాం గిరయః సప్త వై క్రమాత్ ।
ఏతేషు సప్తవర్షేషు సంస్థితాన్ పార్థివోత్తమాన్ ॥ 35

రాఘవః సంగరే జిత్వా లబ్ధ్వా చానుత్తమం యశః ।
కుశద్వీపపతిం జిత్వా మహాసేనం తుతోష సః ॥ 36

అష్టలక్షమితం తీర్త్వా ఘృతోదం సాగరోత్తమమ్ ।
క్రౌంచద్వీపం యయౌ రామః పుష్పకేణాతిభాస్వతా ॥ 37

కుశద్వీపాచ్చ స జ్ఞేయా ద్విగుణో ద్వీప ఉత్తమః ।
ద్వీపాఖ్యాకృచ్చ యత్రాస్తి క్రౌంచనామా గిరిర్మహాన్ ॥ 38

యత్రోపాస్యోఽస్మయో దేవో హరిస్తద్ద్వీపవాసినామ్ ।
తత్రాపి సప్త వర్షాణి కథ్యంతేఽత్ర క్రమేణ హి ॥ 39

ఈ ఏడు దేశములలో శ్రీరామచంద్రస్వామి రాజ్యపాలకులను జయించి, సుబాహువను ద్వీపచక్రేశ్వరుని జయించి సంతోషించెను. పిదప నాలుగులక్షల యోజన ప్రమాణముగల సురార్ణవమును దాటి, క్షణమాత్రమున ఎనిమిది లక్షల కొలతలు గల కుశద్వీపమునకు వెడలెను. ఆ ద్వీపనివాసులందరికిని జాతవేదుడు ఉపాస్యమూర్తి యైయుండెను. అచ్చట ద్వీపనామమును కలిగించినదై దేవస్థాపితమైన కుశస్తంభము విరాజించుచుండును. వసువు, వసుదానము, దృఢరుచి, నాభిగుప్తము, సత్యవ్రతము, వివిక్తము, వామదేవము అని ఏడు రాజ్యములును– రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల– అను ఏడునదులును–చతుశ్శృంగము, కపిలము. చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము, చక్రము అను– ఏడు పర్వతములును, కుశద్వీపమున కుతుకంబునీయుచుండెను. ఇట్టి రాజ్యములలోగల రాజోత్తముల నందరిని శ్రీరామచంద్రుడు రణమున జయించి, అసమానకీర్తిని వహించి, మహాసేనుడను కుశద్వీప చక్రేశ్వరుని గెలిచి సంతసించెను.

అమమం మధురుహం మేఘపృష్ఠం చైవ మనోహరమ్ ।
సుధామానం చ భ్రాజిష్ఠం లోహితార్ణం వనస్పతిమ్ ॥ 40

ఏతాని సప్తవర్షాణి జ్ఞాతవ్యాన్యుత్తమాని హి ।
వర్ధమానో భోజనశ్చ తథోపబర్హణో మహాన్ ॥ 41

నందశ్చ నందనశ్రేష్ఠః సర్వతోభద్ర ఏవ చ ।
శుక్లా సప్తాచలాః ప్రోక్తా సీమాసు పరమాః శుభాః ॥ 42

అమృతా అమృతౌఘా చ తథా చైవార్యకా శుభా ।
తథా తీర్థవతీ రమ్యా వృత్తిరూపవతీ తథా ॥ 43

పవిత్రవతీ సుపుణ్యా వై శుక్లేతి సప్త కీర్తితాః ।
సప్తవర్షేషు నద్యశ్చ స్నానాత్పాతకనాశనాః ॥ 44

ఏతేషు సప్తవర్షేషు పార్థివేభ్యో నిజం ప్రభుః ।
కరభారం పృథగ్లబ్ధ్వా తైః సర్వైః పరిపూజితః ॥ 45

క్రౌంచద్వీపపతిం యుద్ధే జిత్వా తం కంజలోచనమ్ ।
హస్త్యశ్వరథతురగైః కోశాద్యైస్తేన పూజితః ॥ 46

స్తుతో మాగధవర్యైశ్చ నితరాం ముదమాప సః ।
తతస్తీర్త్వా తు క్షీరోదం క్రౌంచద్వీపసమం ముదా ॥ 47

శాకద్వీపం యయౌ రామో ద్వాత్రింశల్లక్షసంమితమ్ ।
ద్వీపాఖ్యాకృచ్చ యత్రాస్తి శాకవృక్షోఽతిరంజనః ॥ 48

యత్రోపాస్యో వాయురూపీ హరిస్తద్ద్వీపవాసినామ్ ।
తత్రాపి సప్త వర్షాణి కథ్యంతే పూర్వవన్మయా ॥ 49

పురోజవం నామ వర్షం తథా తచ్చ మనోజవమ్ ।
పవమానం మహచ్ఛ్రేష్ఠం ధూమ్రానీకం మనోరమమ్ ॥ 50

బహురూపం చిత్రరూపం విశ్వాధారం తథా స్మృతమ్ ।
ఏవం సప్తసు వర్షేషు నద్యశ్చాపి బ్రవీమ్యహమ్ ॥ 51

**అనఘా చ తథాఽయుర్దా చోభయసృష్టిరేవ చ ।**
**తథాఽపరాజితా పుణ్యా శుభా పంచపదీ స్మృతా ॥ 52**

అటుపిమ్మట శ్రీరామచంద్రుడు ఎనిమిది లక్షలయోజన పరిమితిగల ఘృతసముద్రమును దాటి– ఆమము, మధురుహము, మేఘపృష్ఠము, సుధామము, భ్రాజిష్ఠము, లోహితార్ణవము, వనస్పతి– అను ఏడు రాజ్యములను– వర్ధమానము, భోజవము, ఉపబర్హణము, మహత్తు, నందము, నందశ్రేష్ఠము, సర్వతోభద్రము అను తెల్లని ఏడు పర్వతములతో కూడిన– అభయా, అమృతౌఘా, ఆర్యకా, తీర్థవతీ, రూపవతీ, పవిత్రవతీ, శుక్లా అను పేర్లుగల ఏడు నదులు గలదియును; ద్వీపనామమునకు కారణమై గొప్ప క్రౌంచపర్వతముగలదియును, ఆ ద్వీప వాసులకు మంగళకరుడై ఆపోమయుడగు శ్రీహరి వసించునట్టిదియును అగు క్రౌంచద్వీపమును ప్రవేశించెను. అచ్చటి మహాపుణ్యనదులలో స్నానముచేసి, దాని సప్తవర్షములలోను వర్షాధిపతులను జయించి, కప్పములను అంగీకరించి, కంజలోచనుడను పేరుగల క్రౌంచద్వీప చక్రేశ్వరుని జయించి, అతనిచే చక్కగా సత్కృతుడై, వందిమాగధ వందనీయుడై సంతసమునందెను.

అటుపిమ్మట శ్రీరామచంద్రుడు క్రౌంచద్వీపముతో సమానమైన క్షీరార్ణవమును దాటి, 32 లక్షల యోజన సమానమగు శాకద్వీపమును చేరి, అచ్చట ద్వీపనామమునకు సార్థకనామధేయమైన శాక వృక్షమును, తద్ద్వీపవాసులకు ఉపాస్యుడైన వాయురూపుడగు శ్రీహరిని– పురోజవము, మనోజవము, పవమానము ధూమ్రానీకము, చిత్రరూపము, బహురూపము, విశ్వాధారము అను సప్తవర్ణములను– అనఘా, ఆయుర్దా, ఉభయసృష్టి, అపరాజితా, పంచనదులను దాటెను.

**సహస్రశ్రుతిరన్యా సా ప్రోక్తా నిజధృతిస్తథా ।**
**ఏవం సప్తసు వర్షేషు సప్తనద్యః శుభావహాః ॥ 53**

**ఉరుశృంగో బలభద్రస్తథాన్యః శతకేసరః ।**
**సహస్రస్రోతోఽన్యః ప్రోక్తో దేవపాలో మహానసః ॥ 54**

**ఈశానాః పర్వతాః సప్త సీమాస్వేతే ప్రకీర్తితాః ।**
**ఏవం సప్తసు వర్షేషు తత్ర తత్ర నృపోత్తమైః ॥ 55**

**పూజితో రఘునాథః స శాకద్వీపపతిం రణే ।**
**సుందరాఖ్యం నృపం యుద్ధే సప్తాహోభిర్మహాబలమ్ ॥ 56**

**జిత్వా సంపూజితస్తేన వాదయామాస దుందుభీమ్ ।**
**తీర్త్వా తం దధిమండోదం ద్వాత్రింశల్లక్షసంమితమ్ ॥ 57**

చతుఃషష్టిలక్షమితం పుష్కరద్వీపమాయయౌ ।
మేఖలావత్తస్య మధ్యే పర్వతం కంకణోపమమ్ ॥ 58

మానసోత్తరాచలాఖ్యం తం దదర్శ రఘూద్వహః ।
ద్వే వర్షే తత్ర వై ప్రోక్తే పూర్వం రమణకం శుభమ్ ॥ 59

అపరం తద్ధాతకీత్యాఖ్యాతం తే కంకణోపమమ్ ।
తద్వర్షపౌ నృపౌ జిత్వా తతో ద్వీపేశ్వరం శుభమ్ ॥ 60

ఉత్తరాంగాహ్వయం రామః పరాం ముదమవాప సః ।
దదర్శ పుష్కరం తత్ర ద్వీపాఖ్యాకారకం వరమ్ ॥ 61

కమలాసనస్య యజ్జ్ఞేయం బ్రహ్మణః పరమాసనమ్ ।
తత్ర కర్మమయం లింగం బ్రహ్మలింగం జనోఽర్చయత్ ॥ 62

వర్షయోర్బహులా నద్యః పాపనిష్కృంతనక్షమాః ।
దశసహస్రమానేన ప్రాంశుర్జ్ఞేయః స పర్వతః ॥ 63

తస్మిన్ గిరౌ పూర్వభాగే పురీ మఘవతః శుభా ।
దేవధానీతి నామ్నా సా మనోజ్ఞా జ్వలనప్రభా ॥ 64

గిరౌ తస్మిన్ దక్షిణాస్యాం దిశి సంయమనీ పురీ ।
యమరాజస్య సా జ్ఞేయా మనోజ్ఞా జ్వలనప్రభా ॥ 65

పశ్చిమే వరుణస్యాథ పురీ నిమ్లోచనీ స్మృతా ।
ఉత్తరస్యాం తు కౌబేరీ పురీ ఖ్యాతా విభావరీ ॥ 66

సహస్రశ్రుతి, నిజధృతి- అను ఏడు మహానదులను- ఉరుశృంగము, బలభద్రము, సితకేసరము, సహస్రస్రోతము, దేవపాలము, మహాసనము, ఈశానము అను- ఏడు పర్వతములను చూచి, ఆయా రాజ్యములలోని రాజోత్తములచే సత్కరింపబడి, సుందరుడను శాకద్వీప చక్రేశ్వరునితో 7 దినములు మహాఘోరయుద్ధముచేసి, జయించి, వానిచే సత్కరింపబడి, నిజదుందుభులను మ్రోగింపజేసెను. 32 లక్షల ప్రమాణముగల పెరుగు, మీగడ సముద్రమును అతిక్రమించి, 64 లక్షల యోజన ప్రమాణము గల పుష్కరద్వీపమునకు వెళ్ళెను. దాని నడుమ కంకణాకారముతో వడ్డాణములవలే

వెలుగొందు మానసోత్తరాచలమను పేరుకలిగిన పర్వతరాజమును చూచెను. ఆ ద్వీపమున కంకణముల వంటివి రెండుద్వీపములు గలవు. మొదటిది రమణకము, మరియొకటి ధాతకియనునది. ఆ వర్షాధిపతులను శ్రీరాముడు జయించి, ఉదరాంగుడను పుష్కరద్వీప చక్రేశ్వరుని జయించి సంతోషపడెను. ద్వీపనామమునిచ్చిన మహాపుష్కరమును చూచెను. ఈ పుష్కరమే కమలాసనుడగు బ్రహ్మకు ఆసనమయినది. అచ్చట కర్మమయ లింగమయిన బ్రహ్మలింగమును అర్చించెను. ఆ రెండు వర్షములలో దురితపరిహారక సమర్థములయిన మహానదులు అనేకములు గలవు. 10,000 యోజనముల ప్రమాణముచే ఆ పర్వతము ఎత్తుగా ఉత్తమోత్తమమై ఉండును. ఆ పర్వతమునందు దేవధానియను పేరుగలది ఇంద్రుని పట్టణము ఒకటి పూర్వభాగమున గలదు. అది అగ్నివలె తేజస్సంపన్నమై మనోజ్ఞమయినది. అట్లే దక్షిణదిక్కునందు యమునియొక్క రాజధానియైన తేజస్సుందరమగు 'సంయమని' అను పట్టణము గలదు. అట్లే పశ్చిమమున వరుణునియొక్క 'నిమ్లోచని' అను పట్టణము విరాజించుచున్నది. ఉత్తరమున కుబేరుని యొక్క 'విభావరి' అను పట్టణము ప్రకాశించును. వేర్వేరు పట్టణములివి.

**భిన్నాః పుర్యస్త్విమా జ్ఞేయా మేరుస్థాభ్యః శుభావహాః ।**
**యథా నృపస్య స్థానాని హ్యనేకాని తథా త్విమాః ॥ 67**

**సర్వే సీమాపర్వతాస్తే విస్తీర్ణాశ్చ పృథక్ స్మృతాః ।**
**ద్విసహస్రయోజనైశ్చ ప్రోచ్యతాం తే వదామ్యహమ్ ॥ 68**

**సర్వేషాం దశసహస్రైర్యోజనైః ప్రోచ్యతేరితా ।**
**తతస్తీర్త్వా తు శుద్ధోదం పుష్కరద్వీపసంమితమ్ ॥ 69**

**సీతాయాః కౌతుకార్థం హి స జగామ రఘూత్తమః ।**
**ఉద్ధారార్థం స్వావలోకాత్ తత్రస్థానాం నృణామపి ॥ 70**

**తతోఽగ్రే భూమిం సార్ధసప్తలక్షోత్తరసార్ధకోటి పరిమితామ్**
**క్వచిత్ ప్రాణిసహితాం రఘునందనో దదర్శ ॥ 71**

**తైః సర్వభూమినివాసిభిః సంపూజితో**
**రఘునందనో మైథిలీ రంజనార్థమగ్రే జగామ ॥ 72**

**సైకచత్వారింశత్సహస్రసప్తలక్షోత్తరం సార్ధకోటి యోజనపరిమితం**
**మేరుమానసోత్తరాచలయోరంతరాలే మానం జ్ఞాతవ్యమ్ ॥ 73**

**తతోఽగ్రే ఆదర్శతలోపమాం కాంచనీం భూమిం,**
**దేవైరష్ఠితాంచైకోనచత్వారింశల్లక్షోత్తరకోట్యష్ట పరిమితాం దృష్ట్వా,**
**దేవైః సంపూజితః శ్రీరామచంద్రో ముదమవాప ॥ 74**

**తతోఽగ్రే లోకాలోకపర్వతం సార్ధద్వాదశకోటి పరిమితం**
**విస్తీర్ణోచ్ఛ్రతయా భూమిప్రాకారోపమం కేనాప్య-**
**విలంఘ్య స రఘునందనో దదర్శ ॥ 75**

**యస్మిన్నష్టదిక్షు ద్విరదపతయః ఋషభః పుండరీకః**
**పుష్కరచూడః కుముదో వామనః పుష్పదంతోఽపరాజితః**
**సుప్రతీక ఇత్యష్టౌ దిగ్గజాః సకలలోకస్థితిహేతవః ॥ 76**

ఆ పట్టణములు మేరువునందు గల వాటికన్నను సుందరములు. అవి రాజులకెట్లు అనేక పట్టణములుగా ఉండునో అట్లే దేవతలకు విహారస్థానములవి. ఆ ప్రదేశములన్నియు వేర్వేరుగా రెండువేల యోజన పరిమాణము గలవి. అన్నిటికిని పదివేల కొలత చెప్పబడినది. పుష్కరద్వీపముతో సమానమైన కొలతగల శుద్ధోదక సముద్రమును దాటి, శ్రీరాముడు అచ్చటి వారిని కూడా తన దర్శనముచే పవిత్రులను జేయనెంచెను. ఆ తరువాత 1,57,50,000 యోజన పరిమితమయిన అచ్చటచ్చట కొన్నికొన్ని చోట్లలో ప్రాణిహితమగు భూమిని చూచెను. వారందరిచేతను సత్కరింపబడిన శ్రీరామచంద్రస్వామి శ్రీజానకీ దేవిని రంజింపజేయుచు ముందుకు వెడలెను. ఆ వెనుక మేరు మానసోత్తరాచలముల మధ్యాంతరాళముతో సమమైన 1,57,41,000 యోజనములను అతిక్రమించి, 4,39,00,000 ప్రమాణముగల అద్దమువలె నునుపైన సకల దేవావాసభూమియగు కాంచనభూమిని చూచి, అచ్చటి వారిచే చక్కగా పూజింపబడిన శ్రీరామచంద్రుడు సంతోషమందెను. అంత అచ్చటినుండి వెడలి, ఎవనిచేతను అతిక్రమించుటకు అలవిగాని వైశాల్య ఔన్నత్యములచే సమముగా 12,50,00,000 యోజన ప్రమాణమైన భూమికి ప్రాకారమనదగు లోకాలోక పర్వతమును అవలోకించెను. దానిలో గజరాజములు ఎనిమిది దిక్కులయందును- ఋషభము, పుండరీకము, పుష్కరచూడము, కుముదము, వామనము, పుష్పదంతము, అపరాజితము, సుప్రతీకము- అను పేర్లు గల అష్టగజములు సకలలోకస్థితికి కారణములై ఉండును.

**తస్మిన్నేవ గిరివరే భగవాన్ పరమమహాపురుషో**
**మహావిభూతిః సకలలోకహితాయ ఆస్తే ॥ 77**

తతః పరస్తాద్యోగేశ్వరగతిం విశుద్ధాముదాహరంతి ॥ 78

ఏవం పంచాశత్కోటిగుణితో భూగోళకో జ్ఞేయః । 79

ఏవం పంచవింశతికోటిమితాం భూమిం లోకాలోకమధ్యవర్తినీం
స రఘునందనః స్వవశాం కృత్వాఽఽకాశపథా పరివర్త్య
సర్వాన్ ద్వీపాన్ పూర్వవత్పశ్యన్ జంబూద్వీపే
భారతవర్షమధ్యగతాం స్వాం రాజధానీమయోధ్యాం
సప్తద్వీపనృపపరివేష్టితోఽనుయయౌ ॥ 80

తతో రామోఽయోధ్యానికటం గత్వా దూతైః
స్వాగమనం సుమంత్రం సూచయామాస ॥ 81

సమాయాతం రామచంద్రం శ్రుత్వా స మంత్రిసత్తమః ।
అయోధ్యాం భూమయామాస పతాకాధ్వజతోరణైః ॥ 82

వారణేంద్రం పురస్కృత్య పౌరైర్జానపదైః సహ ।
ప్రత్యుద్గమ్య రామచంద్రం నత్వాఽయోధ్యాం నినాయసః ॥ 83

తదా నినేదుర్వాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ।
తుష్టువుర్మాగధాద్యాశ్చ నటా గానం ప్రచక్రిరే ॥ 84

రామాగమనమాకర్ణ్య పౌరనార్యః సుభూషితాః ।
ప్రాసాదశిఖరారూఢా వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 85

రాజద్వారం విమానేన శనైః స రఘునందనః ।
గృహ్ణన్ పౌరోపాయనాని స్త్రీభిర్నీరాజితః పథి ॥ 86

యయౌ చానాదవరుహ్య సభాయాం నిజ ఆసనే ।
తస్థౌ సమంతతః సర్వైర్నృపైశ్చ పరివేష్టితః ॥ 87

తతః స్థలాని సర్వేషాం వస్తుమాజ్ఞాప్య లక్ష్మణమ్ ।
దధిశ్రాద్ధాది సంపాద్య కృతకార్య మమన్యత ॥ 88

ఆత్మానం సకలాన్ పృథ్వీ స్థితాన్ జిత్వా సముద్ధతాన్ ।
తతస్తైః సప్తద్వీపస్థైః పార్థివైః పరిపూజితః ॥ 89

ఆ లోకాలోక పర్వతమునందే మహాత్ముడును మహామహిముడును అగు భగవంతుడు సమస్త భువన హితార్థము వసించుచున్నాడు. అటుపిమ్మట విశుద్ధమను యోగేశ్వర మార్గము ఉదాహరింప బడుచున్నది.

ఇట్లు పంచాశత్కోటి యోజనాత్మకమయినది భూగోళమని తెలుసుకొనవలయును. ఇట్లు లోకాలోక పర్వతమందలి 25 కోట్ల యోజనముల కొలతగల భూమిని శ్రీరామచంద్రస్వామి తన వశము చేసుకొని, గగనమార్గమున వెనుకకు దిరిగి, ముందువలెనె సమస్తద్వీపములను చూచి, జంబూద్వీపమున భారతవర్ష మధ్యగతమగు తన రాజధానియగు అయోధ్యకు సప్తద్వీపరాజులచేతను పరివేష్టితుడై వచ్చెను. అంత ఆ స్వామి అయోధ్యా సమీపమునకు వచ్చి, తన రాకను దూతలచే సుమంత్రునికి చెప్పిపంపెను.

శ్రీరామభద్రస్వామి దిగ్విజయయాత్రజేసి, వచ్చుచున్నాడను సంగతిని విని, సుమంత్రుడు చిత్రధ్వజ పతాక తోరణాదులచే అయోధ్యరాజధానిని అలంకరింపజేసెను, మరియు సుమంత్రుడు భద్రగజము ముందు నడుచుచుండగా, పురజనులతో ఎదుర్కోలుపోయి, శ్రీరామచంద్రస్వామికి నమస్కరించి, రాజధానికి అమోఘ మర్యాదలతో స్వాగతించి తీసుకొని వచ్చెను. మంగళవాయిద్యములు మ్రోగుచుండెను. అప్సరసలు ఆడిరి, మాగదాదులు పొగిడిరి. నటులు నృత్యములు జరిపిరి. శ్రీరాముని రాకతెలిసి పౌరకాంతలు చక్కగా అలంకరించుకుని ఎత్తైన భవనముల మీదకు ఎక్కి, శ్రీరామచంద్ర స్వామి మీద పుష్పవర్షములు కురిపించిరి. శ్రీరఘునందనుడు మార్గమునందు ఊరివారల హారతులను అందుకొనుచు, పౌరులు ఇచ్చిన కానుకలను ఆనందముతో అంగీకరించుచు, తిన్నగా వచ్చి విమానమునుండి రాజద్వారమున దిగి, పల్లకీలో వచ్చి సభలో దివ్యసింహాసనమును అలంకరించెను. అంతట ఎల్లరు రాజులును సుఖాసీనులైరి. పిదప శ్రీసీతాపతి సరససల్లాపానంతరము అందరికిని తత్తదుచిత స్థానములు అమర్చునట్లు లక్ష్మణుని ఆజ్ఞాపించి, దధిశ్రాద్ధాది శుభకర్మలను ఒనర్చి, ఇట్లు మదోన్మత్తులయిన సప్తద్వీపాధి పతులను నిగ్రహించినందువలన తనను కృతకృత్యునిగా ఎంచెను.

**రామః స్వభ్రాతరం విప్రైర్ భరతం భరతాధిపమ్ ।**
**చకార పార్థివైర్యుక్తో లక్ష్మణానుమతేన సః ॥ 90**

**ఆదావేవ వసిష్ఠేన హ్యుక్తం భరతనామ తత్ ।**
**విచింత్యేదం భావి వృత్తం జాతకర్మణి నిశ్చితమ్ ॥ 91**

**పూర్వమాజ్ఞాపితం స్వీయసేవకం భారతస్య చ ।**
**రక్షణే తం రామచంద్రః కార్యాంతర మకల్పయత్ ॥ 92**

జంబూద్వీపపతిం రామశ్చకార స్వసుతం లవమ్ ।
లవోఽపి విజయం స్వీయసచివం చాకరోన్ముదా ॥ **93**

నవస్వపి చ వర్షేషు యాతాయాతం పునః పునః ।
చకార విజయేనైవ పునః కార్యార్థమాదరాత్ ॥ **94**

శత్రుఘ్నో యౌవరాజ్యే స్వే భరతేనాభిషేచితః ।
యౌవరాజ్యపదే స్వీయ కృత్వా రామః కుశం సుతమ్ ॥ **95**

చకార లక్ష్మణం ముఖ్యం సచివేషు సుమంత్రిణమ్ ।
సప్తద్వీపపతిః శ్రీమాన్ స్వయమాసీద్రఘూత్తమః ॥ **96**

స్వస్వకార్యేషు సర్వే తే హ్యాసన్ తత్పరమానసాః ।
తతః సర్వాన్ నృపాన్ పూజ్య దదావాజ్ఞాం రఘూద్వహః ॥ **97**

తతస్తే రాఘవం నత్వా యయుః స్వం స్వం స్థలం ముదా ।
తతో భారతవర్షస్య పరామర్శం సదా ముదా ॥ **98**

చకార భరతః శ్రీమాన్ భారతాధిపతిః ప్రభుః ।
జంబుద్వీపపరామర్శం స చకార లవస్తథా ॥ **99**

సప్తద్వీపపరామర్శం రామచంద్రః కుశేన చ ।
లక్ష్మణేన సహైవాపి స్వయమేవాకరోత్ప్రభుః ॥ **100**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, ఆనందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే పూర్వార్ధే, కుశాది షట్ద్వీప విజయదర్శనం నామ, నవమః సర్గః ॥**

సప్తద్వీపపతులు కరసమర్పణాదులచే శ్రీరామచంద్రస్వామిని సత్కరించి సేవించిరి. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణునియొక్క అనుమతిమీద భారతాధిపునిగా భరతుని నియమించెను. ఇందువల్లనే మునుపే అతనికి వసిష్ఠమహాముని భరత అను పేరుపెట్టెను. ఇట్లు భవిష్యద్విజ్ఞానముచే రవికుల జులకు జాతకర్మాది సంస్కారములనొనర్చి, వసిష్ఠులేగదా భగవత్పాదవాచ్యులై పూజ్యులైయుందురు.

శ్రీరామస్వామి మొదటనే భరతుని తనసేవకునిగా అంగీకరించియున్నందున అతనికి కార్యాంతరమును కల్పించెను. నిజపుత్రుడగు లవుని జంబూద్వీపాధిపతిగా జేసెను. లవుడు తన స్థానమున విజయుడను తన మంత్రిని నియోగించి, తాను శ్రీరామచరణ సేవయందు వర్తించెను. తొమ్మిది ప్రాంతములలో పలుమార్లు కార్యార్థమై విజయునితో కలసి సంచారముచేసెను. భరతుడు తన యౌవనరాజ్యపదవిలో శత్రుఘ్నుని నియోగించెను. శ్రీరాముడు తనయొక్క యౌవరాజ్యపదమునందు కుశుడు అను తన కుమారుని స్థాపించి, లక్ష్మణుని మంత్రులలో ముఖ్యునిగా జేసెను. సుమంత్రుని ప్రధానునిజేసెను. శ్రీరామచంద్రుడు తాను సప్తద్వీపాధిపతియై విరాజిల్లుచుండగా అందరును వారివారి కార్యములలో నిమగ్నమై ప్రవర్తించిరి. అంత రాజులనందరిని రామభద్రుడు సత్కరించి, వారివారి రాజ్యములకు పోవుటకు అనుజ్ఞనిచ్చెను. వారందరును అట్లే శ్రీరాముని చరణారవిందములకు నమస్కరించి, సంతోషముతో తమతమ నివాసస్థలములకు వెళ్ళిరి. పిదప క్రమముగా భరతుడు భారతవర్షమును పలుమారు పరామర్శించుచుండెను. లవుడు జంబూద్వీపమును విచారించుకొనుచుండెను. తానే కుశునితోను, లక్ష్మణునితోను వెడలి సప్తద్వీప యోగక్షేమములను విచారించుచుండెను.

**శ్రీవాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలోని, పూర్వార్థములో, కుశ మొదలగు ఆరుద్వీపముల విజయమును వర్ణించు 9వ సర్గ ముగిసినది.**

# దశమః సర్గః-10వ సర్గ

యతి, శూద్ర, గృధ్ర శిక్షణము.

శ్రీరామదాస ఉవాచ

ఏకదా రాఘవః సారమేయదీర్ఘరవం ముహుః ।
రాజద్వారాద్బహిః శ్రుత్వా సభాస్థో దూతమబ్రవీత్ ॥ 1

కథం దీర్ఘస్వరేణైవ శ్వాఽద్య క్రోశతి పశ్యతామ్ ।
తథేతి రామదూతోఽపి గత్వా రాజసభాబహిః ॥ 2

న్యవారయత్సారమేయం రాజద్వారత్స్వధర్షణైః ।
రామం నత్వాఽబ్రవీద్వాక్యం తూష్ణీం శ్వ క్రోశతి ప్రభో ॥ 3

మయా నివారితో దూరం గతః స రావణాంతక ।
తతో ద్వితీయదివసే తచ్ఛబ్దాన్ రాఘవోఽశృణోత్ ॥ 4

దూతేన పూర్వవచ్చాపి సారమేయో నివారితః ।
తతస్తృతీయే దివసే తద్రావానశృణోత్ప్రభుః ॥ 5

తదాతిచకితః ప్రాహ లక్ష్మణం పురతః స్థితమ్ ।
శ్వాఽయం దినత్రయం బంధో కథం క్రోశతి సంతతమ్ ॥ 6

కిం దుఃఖం సారమేయాయ ప్రష్టవ్యం మత్పురస్త్వయా ।
తథేతి లక్ష్మణో దూతానబ్రవీత్సంభ్రమాన్వితః ॥ 7

సభామాకారణీయః శ్వా యుష్మాభిస్త్వద్య సాదరమ్ ।
తథేతి రామదూతాస్తే సారమేయం వచోఽబ్రువన్ ॥ 8

ఆకారితోఽసి రామేణ త్వమేహి రాఘవాంతికమ్ ।
త్వద్దైవం ఫలితం చాద్య పూర్వపుణ్యోదయేన హి ॥ 9

రామదూతవచః శ్రుత్వా తుష్టః శ్వా తాన్వచోఽబ్రవీత్ ।
దేవగృహే యజ్ఞవాటహోమశాలాసు వై తథా ॥ 10

**బృందావనే సభాయాం చ మఠే పార్థివసద్గృహే ।**
**గోష్ఠే పుణ్యస్థలే పుణ్యే తీర్థే దేవాలయేఽపి చ ॥ 11**

**పాకస్థానే రతిస్థానే స్నానసంధ్యాస్థలాదిషు ।**
**గంతుం నార్హా వయం పాపయోనిస్థా వాచ్యతాం ప్రభుః ॥ 12**

**తతస్తే విస్మయావిష్టాస్తద్వాక్యం రామమబ్రువన్ ।**
**రాఘవస్తద్వచః శ్రుత్వా విహస్య సంభ్రమేణ చ ॥ 13**

## శ్రీరాములవారు కుక్కను విచారించి యతిని శిక్షించుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "అంత ఒకప్పుడు శ్రీరామచంద్రస్వామి సభాసీనుడై ఉండగా రాజద్వారమునకు వెలుపల ఒక కుక్క మొరుగుచుండుటను విని, దూతను పిలిచి, "ఏమిది? మిగుల గొప్పగా కుక్క మొరుగుచున్నది చూడుము" అని ఆజ్ఞాపించెను. ఆ దూత అట్లేయని వెడలి, తన ఆర్భాటములచే దానిని అదిలించి వెడలగొట్టి పంపి, శ్రీరామసన్నిధికి వచ్చి, "స్వామీ! అదియేదో ఊరకే మొరుగుచుండినది అదిలించగా పారిపోయెను," అని విన్నవించెను. అంత ఆ మరునాడును మరల శ్రీరాముడు ఆ కుక్క మొరుగును వినెను. అప్పుడును ముందురోజు వలెనే అది దూతునిచే నివారింపబడె. అంత ఆ మరునాడును శ్రీరాముడు కుక్క మొరుగుట విని చకితుడై ఎదుటనుండిన లక్ష్మణుని జూచి, "తమ్ముడా! ఈ కుక్క మూడుదినములుగా ఏల మొరుగుచున్నది? నా ఎదుట ఆ కుక్కయొక్క దుఃఖము ఏమిటో విచారింపుము," అని చెప్పగా; లక్ష్మణుడు అట్లేయని దూతలతో, "మీరు వెడలి ఆ కుక్కను సభలోనికి తీసుకొని రావలయును," అని ఆజ్ఞాపించెను. రామదూతలు అట్లే అని వెళ్ళి ఆ కుక్కతో, "నిన్ను సభలోనికి తీసుకువచ్చునట్లు శ్రీరామచంద్రస్వామి ఆజ్ఞయైనది. నీయొక్క పూర్వపుణ్యమువలన నీ అదృష్టము నేడు ఫలించినది," అని చెప్పగా, ఆ కుక్క సంతోషించి, వారితో, "విష్ణుమందిరములోనికి, యజ్ఞవాటికవద్దకు, హోమశాలసమీపముకు, బృందావనము వద్దకు, రాజసభలోనికి, రాజమందిరమువద్దకు, మఠములోనికి, గోష్ఠమువద్దకు, పుణ్యస్థలములవద్దకు, పుణ్యతీర్థముల వద్దకు, దేవాలయములోనికి, పాకశాలలోనికి, రతిస్థానమువద్దకు, స్నాన సంధ్యాచరణ ప్రదేశముల వద్దకు- పాపిష్ఠులగు మేము వచ్చుటకు అర్హులము కాము. ఈ సంగతిని ప్రభు సన్నిధానమునకు తెలియజేయండి," అని చెప్పగా అందుకు దూతలు ఆశ్చర్యపడి, ఆ మాటను శ్రీరామసన్నిధికి నివేదించిరి.

**తతస్తే విస్మయావిష్టాస్తద్వాక్యం రామమబ్రువన్ ।**
**రాఘవస్తద్వచః శ్రుత్వా విహస్య సంభ్రమేణ చ ॥ 13**

ఆనీయతాం పాదుకే మే త్వితి దూతాన్ వచోఽబ్రవీత్ ।
తతస్తైరర్పితే దివ్యే పాదుకే కృత్య పాదయోః ॥ 14

రత్నదండం కరే ధృత్వా శనైః సర్వైః సమన్వితః ।
ముద్రికారత్నహారేణ మణిద్వయవిరాజితః ॥ 15

ముకుటేనావతంసేన కేయూరాభ్యాం సమన్వితః ।
నూపురాభ్యాం కంకణాభ్యాం కుండలాభ్యాం సుశోభితః ॥ 16

పదకైః శృంఖలాభిశ్చ వరవస్త్రైర్విరాజితః ।
రాజద్వారాద్బహిర్దేశే సారమేయాంతికం యయౌ ॥ 17

కృత్వా దండం స్వకక్షేఽథ కించిద్వక్రః స్థితః ప్రభుః ।
కృత్వా వామజాన్వధో స్వాం జంఘాం రామః స దక్షిణామ్ ॥ 18

అబ్రవీత్సారమేయం తం కించిత్కృత్వా స్మితాననమ్ ।
మదగ్రే వద కిం దుఃఖం సారమేయ తవాస్తి యత్ ॥ 19

మద్రాజ్యే సహసా మాఽస్తు దుఃఖం కేషాం కదాపి చ ।
ఇతి రామగిరం శ్రుత్వా సారమేయః పునః పునః ॥ 20

నమస్కృత్వా రాఘవేంద్రం ఛిన్నపాదోఽబ్రవీన్ముదా ।
మదర్థం శ్రమితోఽస్యత్ర చిరం జీవ దయానిధే ॥ 21

నిరపరాధో యతినా గ్రాహ్ణఽత్రాహం ప్రతాడితః ।
భిన్నపాదోఽస్మి రాజేంద్ర త్వామద్య శరణం గతః ॥ 22

తద్వాక్యం రాఘవః శ్రుత్వాఽఽకారయామాస దండినమ్ ।
రామాజ్ఞయా యతిశ్చాపి విహ్వలో రాఘవం యయౌ ॥ 23

దృష్ట్వా యతిం తం శ్రీరామస్తదా వచనమబ్రవీత్ ।
స్వామిన్ కిమర్థం యుష్మాభిశ్ఛిన్నః పాదోఽస్య వై శునః ॥ 24

తద్రామవచనం శ్రుత్వా యతిః ప్రాహ రఘూత్తమమ్ ।
భిక్షార్థం భ్రామతో మార్గే భిక్షాన్నం స్పర్శితం మమ ॥ 25

శ్రీరాఘవుడు అందరిలో ఆ మాటను విని, నవ్వి, మిక్కిలి ఆశ్చర్యముతో పాదుకలివ్వండని చెప్పగా, దూతలందించిన రత్నపాదుకలను తొడిగిన శ్రీరాముడు; రత్నదండమును చేతబూని, తిన్నగా అందరితోకలసి వెడలెను. ముద్ర ఉంగరములు, రత్నహారములు, కౌస్తుభ చింతామణులు, కిరీట కుండలాంగద, కంకణమంజీరాదులు, మణిపథకములు, దివ్యదుకూలములు విరాజించుచుండగా ఆ రామచంద్రప్రభువు రాజద్వారమునకు వెలుపల శునకుని సమీపమునకు వచ్చెను.

ఎడమ మీగాలును వంచి, త్ర్యశ్వీభూతవల్గితాంగుడై దండమును చంకన దాచి కుక్కను చూచి, చిరునవ్వు చిందిస్తూ.. "ఓ సారమేయమా! నా ఎదుట చెప్పుము, నీకేమి దుఃఖము వచ్చినది? నా రాజ్యమున ఎవరికి ఎప్పటికిని దుఃఖమనునది ఉండకూడదు." అని చెప్పగా, ఇట్టి రామవాక్యమునువిని, ఆ శునకము అడుగడుగునను నమస్కరించుచు కాలువిరిగినదై ఇట్లనెను, "కరుణానిధి యగు శ్రీరామచంద్రప్రభూ! ఇచ్చట నా కొరకు నీవు ఎంతో శ్రమపడితివి. బహుకాలము చల్లగా ఉండవల యును స్వామీ! నిరపరాధుడైన నన్ను ఒకయతి కాలుపై రాతితో కొట్టెను. అది తగిలి నా యీ కాలు విరుగగా కుంటిదాననైతిని. మహాప్రభూ! నీ వద్దకే శరణాగతితో వచ్చియున్నాను," అని మొరపెట్టెను. అంత ఆ శ్రీరాముడు యతిని పిలిపించెను. ఆ భిక్షకుడు శ్రీరామాజ్ఞచే కలతనంది శ్రీరాముని సన్నిధికి వచ్చెను. శ్రీరామచంద్రస్వామి అతనికి నమస్కరించి, "స్వామీ! మీరు ఏల ఈ శునకముయొక్క పాదమును విరుగగొట్టితిరి?" అని అడిగెను. అందుకతడు, "నేను భిక్షకొరకై దారిలో సంచరించునపుడు నా యొక్క భిక్షాన్నమును ఇది స్పృశించినది.

**శునాఽనేన రాఘవేంద్ర మధ్యాహ్నే క్షుధితస్య చ ।**
**మయాఽతః క్రోధచిత్తేన శునేఽస్మై హ్యపరాధినే ॥ 26**

**ధర్షితుం చోపలః క్షిప్తస్తేన భిన్నం పదం శునః ।**
**తద్యతేర్వచనం శ్రుత్వా పునస్తం ప్రాహ రాఘవః ॥ 27**

**జ్ఞానహీనః పశుశ్చాయం భక్ష్యం స్వీయం నిరీక్ష్య చ ।**
**స్పర్శితస్త్వాం తస్య దోషో నైవాహం వేద్మ్యహం యతే ॥ 28**

**త్వమేవాస్యస్యాపరాధీ తద్దండం సోఢుమర్హసి ।**
**ఇత్యుక్త్వా సారమేయం తం రాఘవో వాక్యమబ్రవీత్ ॥ 29**

**యతిశ్చాయం తేఽపరాధీ తవ హస్తేఽర్పితో మయా ।**
**యం త్వమిచ్ఛసి వై కర్తుం మస్మై దండం సుఖం కురు ॥ 30**

తద్రామవచనం శ్రుత్వా సారమేయోఽబ్రవీత్ ప్రభుః ।
శివాలయాధిపత్యే చ స్థాపనీయో యతిః ప్రభో ॥ 31

తథేతి రామచంద్రోఽపి శిబికాయాం నివేశ్య తమ్ ।
స్రగ్వస్త్రచందనాద్యైశ్చ సంపూజ్యాథ యతిం ముదా ॥ 32

వాద్యఘోషైర్నృత్యైనాద్యైరుత్సవైశ్చ శివాలయమ్ ।
నీత్వా శివాలయస్యాధిపత్యే సంస్థాపయత్ప్రభుః ॥ 33

తదాఽజ్ఞానాద్యతిర్దైవం ఫలితం చేత్యమన్యత ।
తతో రామో జనైర్యుక్తః స్వాం సభాం సంవివేశ హ ॥ 34

తత్సర్వం కౌతుకం దృష్ట్వా పౌరాః ప్రోచూ రఘూత్తమమ్ ।
కథం శునాఽద్య యతయే శిక్షేదృక్సాధితా ప్రభో ॥ 35

అన్నార్థం భ్రమతస్తస్య యతేర్దత్తం పదం మహత్ ।
తేనాతిసౌఖ్యం సంజాతం యతయే శిక్షితం న తత్ ॥ 36

శ్రీరామస్వామీ! మధ్యాహ్నకాలమున ఆకలిగొన్న నేను కోపముతో తప్పుచేసితిని. దీనిని వెరపించుచు ఒకరాయితో కొట్టితిని. అది తగిలి కాలువిరిగినది కాబోలు," అని యథార్థము పల్కెను. దానిమీద శ్రీరామభద్రుడు, "ఈ కుక్క జ్ఞానములేని పశుజాతి. తనయాహారమునుచూచి తాకెను. కావున నీదోషము దానిదని నేనొప్పను. నీవే ఈ అపరాధముగలవాడై ఉందువు. కావున నా శిక్షను వహించుటకు తగియున్నావు," అని చెప్పి; శునకమును చూచి, "ఈ యతి నీ విషయమై అపరాధమును ఆచరించినవాడు. కావున వీనినిబట్టి నీకప్పగించితిని. ఏమిశిక్ష వేయవలయునని నీకుతోచునో దానిని సంతోషముగా చేయుము," అనెను. అప్పుడా కుక్క, "శ్రీరామమహాప్రభూ! అట్లయిన ఈ యతిని శివాలయ ధర్మాధికారిత్వము నందు సంస్థాపింపుము," అని ప్రార్థించెను. అంత ఆ సీతాకాంతుడు అట్లే కానిమ్మని ఆ యతిని పల్లకిలో కూర్చుండబెట్టి, పుష్ప గంధాదులచే సత్కరించి, వాద్యఘోషాది సమస్త వైభవములతో శివాలయమునకు పంపించి, తదాధిపత్యమునందు సంస్థాపించెను. అప్పుడా యతి అజ్ఞానమువలన, తన అదృష్టము ఫలించినదని ఆనందించెను. అంత ఆ రామచంద్రుడు జనులతోడ తిరిగి తన సభామందిరమునకు వచ్చెను. ఊరివారందరును ఈ వినోదమును చూచి, శ్రీరామసన్నిధానమున, "స్వామీ! ఏమి శునకమిట్లు ఆ యతికి శిక్ష విధించెను, అన్నమునకై నానాపాట్లుపడుచు దిమ్మతిరుగుచుండిన యతికి గొప్ప పదవి చిక్కెను. అతనికి అత్యంత సుఖస్థితిగల్గె. అది యతికి శిక్షనిచ్చినట్లుకాదు కదా!" అనగా.....

తత్పౌరవచనం శ్రుత్వా రాఘవస్తాన్ వచోఽబ్రవీత్ ।
ప్రష్టవ్యః శ్వా తు యుష్మాభిర్వః సందేహం హరిష్యతి ॥ 37

తథేతి సారమేయం తం పప్రచ్ఛుర్నాగరాశ్చ తత్ ।
తాన్ప్రోవాచ సారమేయః శృణుధ్వం యన్మయోచ్యతే ॥ 38

కృషిసంజాతధాన్యౌఘఖలసమ్మానకారిణః ।
శివాలయమఠారామదానగ్రామాధికారిణః ॥ 39

అనాథస్త్రీబాలవిత్తహారిణః క్రూరనిఃస్వనాః ।
గోవిప్రశివవిత్తస్య హారిణోఽన్యాయకారిణః ॥ 40

నృపగేహే ప్రవిష్టానాం యాచకానాం నివారిణః ।
పరద్రవ్యాపహర్తారః ప్రాయశ్చిత్తాధికారిణః ॥ 41

విప్రభోజనద్రవ్యస్య హోమద్రవ్యస్య హారిణః ।
బహుద్రవ్యాపహర్తారశ్చైతే సర్వేఽన్యజన్మని ॥ 42

గచ్ఛంతి వై శునో యోనిం సత్యమేతద్వచో మమ ।
మయా మఠాధిపత్యాచ్చ లబ్ధా యోనిః శునః స్వయమ్ ॥ 43

అతో మయాఽద్య యతయే శిక్షితుం పదమర్పితమ్ ।
ఇతి తద్వాక్యమాకర్ణ్య నాగరాశ్ఛిన్నసంశయాః ॥ 44

తే యయుః స్వీయగేహాని యయౌ శ్వాపి నిజస్థలమ్ ।
దేహాంతే స యతిర్జాతః శునో యోనౌ స్వకిల్బిషాత్ ॥ 45

ఆ పౌరజన వాక్యములను విని దాశరథి స్వామి, "ఈ సంగతినిగురించి మీరు ఆ శునకమునే అడగండి. అది మీ సందేహమును నివృత్తిచేయగలదు," అని చెప్పి పంపెను. అట్లేయని నగరవాసులు ఆ శునకమును అడిగిరి. అందుకా కుక్క, "ఓ పురజనులారా! నేను చెప్పెడుదానిని వినుడు– వ్యవసాయంలో పండివచ్చిన ధాన్యపురాసులను కొలిచేవారు, శివాలయ ధర్మాధికారులు, మఠాధికారులు, తోటలను విచారించు కొనువారు, దానధర్మాధికారులు, గ్రామాధికారులు, దిక్కులేని స్త్రీ, బాల, ద్రవ్యములను అపహరించినవారు క్రూరవాక్కులను చెప్పుచుండువారు, గో భరణమును, బ్రాహ్మణ ద్రవ్యమును, శివవిత్తమును అపహరించినవారు, అన్యాయ ప్రవర్తకులు, రాజమందిరము

లలో ప్రవేశించు యాచకులను అడ్డగించువారు, పరస్వత్వములను అపహరించువారు, పాపులకని ప్రాయశ్చిత్తములను విధించువారు, బ్రాహ్మణ భోజన వస్తువులను, హోమద్రవ్యములను దొంగిలించు వారు, బహుద్రవ్యాపహారకులు- అను వీరందరును రాగల జన్మమునందు తప్పక శునక యోనిని ఆశ్రయించెదరు. నా యొక్క వాక్యము మిక్కిలి సత్యమయినది. నేను పూర్వ జన్మమున మఠాధికారిగా నుండి తానుగా ఈ శునక జన్మమును అనుభవించుచున్నాను. అందువలననే ఇప్పుడు యతికి శివాలయ అధికార పదవినిచ్చితిని," అని ఆ శునకము చెప్పగా నాగరికులు సంశయ నివృత్తులై తమతమ నెలవులకు జనిరి. ఆ కుక్కయును తన తావుకు వెడలెను.

**ఆప స శ్వా శుభాం ముక్తిం భుక్త్వాదౌ స్వీయకిల్బిషమ్ ।**
**న జ్ఞేయోఽయం యతిః శిష్య సాకేతేఽత్ర మృతస్త్వితి ॥ 46**

**స్థలాంతరే మృతశ్చాయం గతః కార్యార్థమాత్మనః ।**
**అయోధ్యాయాం మృతానాం చ పునర్జన్మ న విద్యతే ॥ 47**

**క్వ యతిః సారమేయత్వం క్వ స శ్వా క్వ గతిశ్చ సా ।**
**గహనా కర్మణశ్చాత్ర గతిర్జ్ఞేయా మహాత్మభిః ॥ 48**

**క్వ యతిః సారమేయః క్వ న్యాయశ్చేత్థం రమాపతేః ।**
**ఆసీత్సత్యః సదైవాత్ర నాన్యాయస్తన్ముఖేక్షణాత్ ॥ 49**

**అథైకదా తు సాకేతవాసినో భూసురస్య చ ।**
**పంచత్వం పంచవర్షీయః పుత్రః ప్రాప్తః శిశుః ప్రియః ॥ 50**

**తదా విప్రః సపత్నీకస్తత్రేతమరుణోదయే ।**
**రాజద్వారం సమానీయ రురోదోచ్చైః స్వరైర్ముహుః ॥ 51**

**అబ్రవీత్ పుత్రశోకేన వ్యథితః క్రోధసంయుతః ।**
**సీతామాలింగ్య రాజ్యేన కథం త్వం నిద్రితోఽసి హి ॥ 52**

**త్వద్రాజ్యేఽధర్మతః కస్య మృతో మే బాలకః ప్రియః ।**
**త్వత్తోఽధర్మోఽథవాన్యాచ్చ జాతోఽధర్మో న వేద్మ్యహమ్ ॥ 53**

**నృపే పాపిని మ్రియంతే నరా అల్పాయుషః శ్రుతమ్ ।**
**యస్య రాజ్యే జనైః సర్వైః యోఽధర్మః క్రియతే భువి ॥ 54**

**సోఽపి జ్ఞేయో నృపస్యైవ యతస్తేషాం న శిక్షితమ్ ।**
**అతస్తేఽధర్మిణో రాజ్ఞో రాజ్యే మేఽయం శిశుర్మృతః ॥ 55**

**ఉపాయం చింతయస్వాస్య జీవనేఽద్య జవాన్నృప ।**
**నోచేదావాం చితిం చారోహావస్తనయేన హి ॥ 56**

దేహమునకు వృద్ధాప్యము వచ్చిన తరువాత మరణించిన ఆ యతి తన పాపబలముచే శునక యోనియందు జన్మమెత్తెను. ఆ కుక్క యేమో మొదట తన పాపమును తాను అనుభవించి చివరకు ముక్తినందెను.

శిష్యుడగు విష్ణుదాసా! వినుము. కడకు ఆ యతి అయోధ్యలో మరణము చెందలేదు. ఏదో తన కార్యవశమున వేరేప్రాంతమునకు వెడలినపుడు అచ్చట మరణించెను. అయోధ్యలో మరణమునందిన వారికి మరల జన్మబాధలేదు. ఈ సన్యాసి ఎంతటివాడు? ఆ కుక్క ఎంతటిది? దానికి కలిగిన మేలైనగతి ఎంతటిది? ఇచ్చట కర్మమార్గము మిక్కిలి గహనమైనదని ఎరుగవలయును. ఆ యతి ఎచ్చట? ఆ కుక్క ఎచ్చట? లక్ష్మీపతియొక్క న్యాయము చూతమా ఈ లాంటిది. ఆ శ్రీసీతారామచంద్ర స్వామి యొక్క ముఖమున అన్యాయవచనములు దొర్లవు. వచ్చుమాటలన్నియును సత్యపరిపూతములే. (49)

## శూద్రుని శిక్షించి, మరణించిన బ్రాహ్మణ బాలకులను బ్రతికించుట

ఒకసారి అయోధ్యా పట్టణములో నివసించుచున్న ఒక బ్రాహ్మణునియొక్క ఐదు సంవత్సరముల కుమారుడు కాలగతిచెందెను. ఆ బాలకుడన్న ఆ బ్రాహ్మణునికి ఎంతో ప్రీతి. అప్పుడా విప్రుడు తన సతితోడ ఆ మృతబాలక శరీరమును, అరుణోదయ సమయమున తీసికొనివచ్చి, రాజద్వారమున పెట్టికొని పుత్రశోకమును ఓర్వజాలక గొప్పగా ఏడవసాగెను. "రాజేంద్రా! రామప్రభూ! సీతను హత్తుకొని నీ వట్లు సుఖముగా నిద్రించుచున్నావు? నీ రాజ్యమునందు ఎవనియొక్క అధర్మమువలన నా యొక్క ప్రియమైన బాలకుడు మృతుడయ్యె? అట్లుకాక పోయిన, నీ యొక్క అధర్మమువలననా? వేరే యేమైనను అధర్మము జనించినదా? నేనెఱుగను. రాజు పాపిష్ఠియైయుండగా ప్రజలు అల్పాయుష్కులై పోవుచుందురు. రాజ్యమునందు జనులలో ఎవరు అధర్మము చేసినా అది రాజునకే సంభవించును. ఎందువల్లననిన వానిని శిక్షించి, ధర్మమార్గమునందు నిలబెట్టని పాపము రాజునెత్తిమీద ఉన్నది. కావున ధర్మాత్ముడుగాని పాపియొక్క రాజ్యమునందు నా చిన్నవాడు మరణమునందెను. ఓయి రాజా! ఈ విషయమునందు ఉపాయమును ఆలోచించి వీడు బ్రతుకునట్లుచేయుము. అట్లుచేయవా ఈ చిన్నవానితోపాటు మేమిరువురము చితినెక్కి దేహములను త్యజించెదము.

స్మర వృత్తం శ్రావణస్య హేతోర్యజ్జనకాయ తే ।
జాతం శాపాదికం పూర్వం తద్వదత్రాపి తే భవేత్ ॥ 57

తతో విప్రప్రియా ప్రాహ సీతాం ప్రోచ్చస్వరేణ హి ।
కథం త్వం పతిమాలింగ్య నిద్రితాఽసి సుఖం శుభే ॥ 58

త్వమప్యసి పుత్రవతీ మే దుఃఖం చాత్మనః కురు ।
ఉపాయం కారయస్వాద్య భర్త్రాఽస్య జీవనే శిశోః ॥ 59

ఇతి తద్దంపతీవాక్యం శ్రుత్వా సర్వే పురౌకసః ।
అసస్రువ్యగ్రచిత్తాస్తే ప్రేతమావార్య సంస్థితాః ॥ 60

సీతారామావపి తయోర్వాక్యం శ్రుత్వాఽతివిహ్వలౌ ।
వినిర్గతౌ రతిశాలాబహిస్తద్దుఃఖదుఃఖితౌ ॥ 61

నివార్య బందిగీతాని రాజద్వారం తయోః పురః ।
వేగేన జగ్మతుః పద్భిః సీతారామౌ గతశ్రియౌ ॥ 62

దృష్ట్వా సీతాం చ రామం చ తౌ శోక చక్రతుర్ముహుః ।
తావాశ్వాస్య రామచంద్రస్తదాఽఽహ గద్గదాక్షరః ॥ 63

మా శోకం కురుతశ్చోభౌ మద్గిరం శృణుతస్త్వితి ।
కృత్వోపాయం హి యువయోః పుత్రం సంజీవయామ్యహమ్ ॥ 64

న జీవితశ్చేద్యువయోః పుత్రస్తర్హ్యర్పయే కుశమ్ ।
గిరం సత్యాభిమాం చోభౌ పశ్యతస్త్విహ మేఽద్య హి ॥ 65

తతః సీతా విప్రపత్నీమాశ్వాస్యాహ గిరం శుభామ్ ।
రామేణ తే ప్రతిజ్ఞాతం కుశదానేన భామిని ॥ 66

అహమప్యద్య తే వచ్మి తవ దుఃఖస్య శాంతయే ।
న జీవితశ్చేద్రామేణ మయాఽయం త్వచ్ఛిశుః ప్రియః ॥ 67

రామచంద్రా! స్మరింపుము. నీ తండ్రికి శ్రావణుని కారణమువలన మునుపు శాపాధికమెట్లు సంభవించినది? అట్లే యిచ్చటను నీకగును," అని పుత్రశోకముచే క్రుద్ధుడైన బ్రాహ్మణుడు

నోటికివచ్చినట్లు వాగుచుండగా అతని పత్ని, "ఓసి సీతమ్మా! నీవెట్లు నీ భర్తతో సుఖముగా నిద్రించుచున్నావు? నీవునూ బిడ్డలు కన్నదానవేకదే, నా యొక్క దుఃఖమును నీకు కలుగజేసికొనకుము. నీ మగనితో ఆలోచించి, ఈ చిన్నవాడు బ్రతుకుటకు తగిన సదుపాయమును నిర్ణయించుము," అని మొరపెట్టెను. అట్టి ఆ దంపతుల గోల విని ఊరివారందరును భయభ్రాంతచిత్తులై వచ్చి, ఆ బాలక ప్రేతమును చుట్టు బారుకొని నిలిచిరి. అపుడు శ్రీసీతారాములు వీరి మొరలను విని, విహ్వలచిత్తులై లేచి, రతిశాలను విడిచి బయటికి వచ్చి, వందిమాగధుల మంగళగీతములను నివారించి, వీరి దుఃఖముచేత తామును దుఃఖించువారలై కాలినడకతో ఆ రాజద్వారమువద్దకు వచ్చిరి. త్వరగావచ్చి ఆ దంపతులును, బాలుని శవమును చూచి తేజోరహితులైరి. శ్రీసీతారాములను చూచిన ఆ బ్రాహ్మణ దంపతులు పెద్దగా రోదనముచేసిరి. శ్రీరామచంద్రస్వామి వారినప్పుడు సమాధాన పరచుచు, గద్గదస్వరముతో, "మీరిరువురును నా సామర్థ్యమునిట్లు వినుడు. ఏదో సదుపాయముచేసి, మీ పుత్రునిని బ్రతికించి యిచ్చెదను. మీ కొడుకు బ్రతుకకపోయెనో నా కొడుకగు కుశునిని మీకు సమర్పించెదను. నా యొక్క ఈ మాటను సత్యమని నమ్మవలయును." అని అభయమిచ్చెను.

అంత ఆ సీతమ్మ బ్రాహ్మణపత్నిని చూచి, సమాధానమును చెప్పుచూ, "అమ్మా! నీవు ఏడవకుము. మీ సమాధానమునకై శ్రీరామచంద్రస్వామి ప్రతిజ్ఞచేసెను గదా. నేను కూడా నీ యొక్క దుఃఖశాంతికై చెప్పెదను వినుము.

**తర్హి త్వద్దుఃఖశాంత్యర్థమర్పయేఽహం లవం ప్రియమ్ ।**
**తాభ్యాం కుశలవాభ్యాం త్వం పుత్రదుఃఖం త్యజిష్యసి ॥ 68**

**భజిష్యసి త్వం మత్సౌఖ్యమతః శోకం కురుష్వ మా ।**
**తతః ప్రాహ ద్విజం రామస్త్వం పల్యాఽత్ర స్థిరో భవ ॥ 69**

**మా కురుష్వ ముహుః ఖేదం త్వత్పుత్రం జీవయామ్యహమ్ ।**
**ఇత్యుక్త్వా లక్ష్మణేనైవ తైలద్రోణ్యాం శవం శిశోః ॥ 70**

**నిధాయ కృమిదుర్గంధ స్ఫురణస్యప్రశాంతయే ।**
**స్వయం స్నాత్వా నిత్యవిధిం చాకరోత్ఖిన్నమానసః ॥ 71**

**తతః సభాసంస్థితః సన్ వసిష్ఠం ప్రాహ రాఘవః ।**
**రాజ్యం శాసతి ధర్మేణ తత్రాఽయం వై శిశుః కథమ్ ॥ 72**

**బాల్యత్వే పంచతాం ప్రాప్తస్తత్రోపాయం విచింత్యతామ్ ।**
**ఇతి యావద్గురుం రామః ప్రోవాచ తావదంబరాత్ ॥ 73**

**నారదః ప్రయయౌ వీణాం రణయన్ తత్సభాం జవాత్ ।**
**ప్రత్యుద్గమ్యాఽథ తం రామః పరిపూజ్య యథావిధి ॥ 74**

**సంశ్రావ్య సకలం వృత్తం పునః పప్రచ్ఛ తం మునిమ్ ।**
**త్వయోపాయోఽత్ర వక్తవ్యః శిశోశ్చాస్య ప్రజీవనే ॥ 75**

**పుత్రాభ్యాం హి ప్రతిజ్ఞాతం ద్విజాయ సీతయా మయా ।**
**కిమర్థం మమ రాజ్యేఽధో మృతస్త్వీదృక్నవేద్మ్యహమ్ ॥ 76**

**తద్రామవచనం శ్రుత్వా రాఘవం ప్రాహ నారదః ।**
**రామ త్వద్విషయేఽధర్మం న కోఽప్యాచరతే జనః ॥ 77**

"నీ కొడుకు బ్రతుకకపోయెనా నా యొక్క లవునిని కూడా నీకెచ్చెదనమ్మా! ఆ కుశలవులవలన నీవు పుత్రశోకమును విడువగలవు. నా యొక్క సౌఖ్యమును నీవు అనుభవింపగలవు, దుఃఖపడకుము." అని సీతమ్మ మంగళవాక్యములను పలికెను. అంత ఆ శ్రీరాముడు, "ఓ బ్రాహ్మణా! నీవు నీ పల్లెను విడిచి ఇచ్చటనే స్థిరముగా ఉండుము. మరల నీవు దుఃఖింపకుము. నీ పుత్రుని బ్రతికించి ఇచ్చెదను." అని చెప్పి లక్ష్మణునిచేతనే ఆ బాల శిశువును పురుగులుపడి, దుర్గంధము కలుగకుండుటకై నూనె పాత్రలో పదిలపరచి, తాను ఖిన్నమనస్కుడై నిత్యకర్మాచరణమునొనరించెను. అంత ఆ రఘురాముడు సభాసీనుడై వసిష్ఠులవారితో, "నేను ధర్మముగా రాజ్యమును ఏలుచుండునపుడు ఎట్లు ఈ బ్రాహ్మణబాలకుడు మృతిచెందెను? ఇందుకు తగిన సదుపాయము నాలోచింపుడు," అని గురుసన్నిధికి విన్నవించుచుండగా; గగనపథమునుండి నారదమహర్షి వీణాగానవినోదపరుడై ఏతెంచెను. అప్పుడు శ్రీరామస్వామి వారిని స్వాగతించి విధివిధానముగా ఆరాధించి, సమస్త వృత్తాంతమును విస్తారముగా విచారించి, పిదప, "మునీంద్రా! ఈ చిన్నవాడు బ్రతుకుటకు నీవు తగిన సదుపాయమును చెప్పవలయును. ఈ బ్రాహ్మణునికి పుత్రుడు బ్రతుకకపోయిన నా బిడ్డలగు కుశలవులు నిరువురిని ఇచ్చునట్లు సీతాదేవియును, నేను ప్రతిజ్ఞచేసి యున్నాము.

**భూమ్యాం సర్వత్ర ద్రష్టవ్యం త్వయా గత్వాఽద్య మద్గిరా ।**
**యద్యప్యహం విజానామి భూమ్యాం వృత్తం చ జానతః ॥ 78**

తథాపి జనశిక్షార్థం త్వామేవ ప్రేషయామ్యహమ్ ।
త్వం దృష్ట్వాఽధర్మనిరతం జనం శిక్షయ సాదరమ్ ॥ 79

అధర్మోచ్ఛేదనేనాయం జీవయిష్యతి వై శిశుః ।
తథేతి రాఘవోఽప్యుక్త్వా విసర్జ్య నారదం మునిమ్ ॥ 80

సీతయా నాగరైః సర్వైర్భ్రాతృభిర్గురుణా సహ ।
పుత్రాభ్యాం మంత్రిభిర్యుక్తః పుష్పకం చారురోహ సః ॥ 81

ఏతస్మిన్నంతరేఽగ్రేఽభూన్మహాన్కోలాహలస్తదా ।
తం శ్రుత్వా చకితో రామః స దదర్శ సమంతతః ॥ 82

తావద్దదర్శ పురతః పౌరైః సంవేష్టితాం స్త్రియమ్ ।
శవమప్యపరం శృంగబేరతశ్చ సమాగతమ్ ॥ 83

రామం దృష్ట్వా పుష్పకస్థం రుదతీ బ్రాహ్మణీ పురః ।
దీర్ఘస్వరేణ ప్రోవాచ హస్తాభ్యాం హృది తాడ్య సా ॥ 84

రామ రామ మహాబాహో తే రాజ్యే గతభర్తృకా ।
అహం జాతాఽస్మి త్వద్దోషాన్మాం దృష్ట్వా త్వం న లజ్జసే ॥ 85

మద్భర్తారం జీవయైనం నోచేచ్ఛాపం దదామి తే ।
ఇతి తస్యా వచః శ్రుత్వా రాఘవః ఖిన్నమానసః ॥ 86

అబ్రవీన్మధురం వాక్యం బ్రాహ్మణీం తోషయన్ముహుః ।
క్రోధం శమయ రంభోరు తే భర్తారం ప్రజీవయే ॥ 87

అస్యైవ హేతోర్గచ్ఛామి త్వం మద్గేహే సుఖం వస ।
ఇత్యుక్త్వాఽఽశ్వాస్య తాం రామస్తచ్ఛవంచాపిపూర్వవత్ ॥ 88

తైలద్రోణ్యాం స్థాపయిత్వా సుమంత్రం వాక్యమబ్రవీత్ ।
ఆగమిష్యామ్యహం యావత్తావత్కస్యాపి నో శవమ్ ॥ 89

ఇట్లేల బాలుడు మృతినందెను. దీనికారణమును నేనెఱుగను," అని అడుగగా, ఆ మునీంద్రుడు ఈ మాటలను విని, "శ్రీరామచంద్రప్రభూ! నీ విషయమునందు లోకులెవ్వరును అధర్మమును ఆచరించజాలరు, నా మాటమీదుగా నీవే భూమియందంతట సంచరించి చూడవలయును. భూ వృత్తాంతమును సర్వమును జ్ఞానశక్తిచే నేనెరుగదునుగాని, లోకశిక్షకై నిన్నేపంపెదను. నీవు అధర్మపరుడగు వానిని చూచి శిక్షింపుము. అధర్మమును నిగ్రహించుటవలన ఈ బిడ్డను బ్రతికింప గలవు," అని ప్రేరేపించెను. అంత అట్లేయని శ్రీరామచంద్రస్వామి నారదాదులను వదలి, సీతతోను, పుత్రాదులతోను, నగరవాసులతోను, మంత్రులతోను పుష్పకమునెక్కెను. అంతలో ఆవేళకు అచ్చట గొప్పకోలాహలమొకటి కలిగినది. చకితుడైన శ్రీరామచంద్రస్వామి అంతట అదియేమని చూచెను. అప్పుడు శృంగబేరపురమునుండి ఒక శవమును మోసికొని లోకులు గుంపుగూడి చుట్టుబారి రాగా, రోదనధ్వనితోడ వచ్చుచున్న బ్రాహ్మణస్త్రీ కనబడెను. ఆ స్త్రీ పుష్పకమునందున్న శ్రీరాముని జూచి, లభాయి దిభాయిలకారంభించి, లబలబ మొత్తుకొనుచు, "మహానుభావుడా! శూరాగ్రేసరుడైన రామప్రభూ! నీ దోషమువలన నేను భర్తను కోల్పోయి విధవనైతిని. నన్నుజూచి నీవేల సిగ్గుపడలేదు. నా భర్తను బ్రతికింపుము. లేదా ఇదిగో శాపమునిచ్చెదను," అని గోలచేయగా, విని శ్రీరామభద్రుడు ఖిన్నమానసుడై ఆ బ్రాహ్మణస్త్రీని సమాధానపరచుచు తిన్నగా, "అమ్మా! దుఃఖాక్రోశము నందవలదు. నీ మగనిని బ్రతికించెదను. ఈ కార్యమునకే ప్రయాణము చేయుచున్నాను. నా యింటిలో సుఖముగా ఉండుము," అని మధురవాక్యములను పలికి, ఆ శవమును కూడా తైలభాండమునందు పెట్టించి, సుమంత్రునితో, "నేను వచ్చునంతవరకు శ్రీకాశీపట్టణములోకూడా ఏయొక్క శవమును దహించకూడదు.

**త్వయా వహ్నిర్జ్వాలనీయం రక్షణీయం ప్రయత్నతః ।**
**సర్వానపి త్వయా భూమ్యాం శ్రావ్యం దుందుభినిఃస్వనైః ॥ 90**

**త కస్యాపి శవం దగ్ధం క్వాపి కార్యం జనైస్త్వితి ।**
**తథేతి రాఘవం చోక్త్వా దూతైః సంశ్రావ్య తద్వచః ॥ 91**

**సుమంత్రః సకలాన్ భూస్థాన్ సాకేతే న్యవసత్సుఖమ్ ।**
**రామోఽపి పుష్పకేనైవ పశ్చిమాం చోత్తరాం దిశమ్ ॥ 92**

**పూర్వామపి శనైః పశ్యన్ దక్షిణాభిముఖో యయౌ ।**
**ఏతస్మిన్నంతరేఽయోధ్యాపుర్యాం పంచ శవాని హి ॥ 93**

సమానీతాని తైలస్య ద్రోణ్యాం తాన్యపి పూర్వవత్ ।
సుమంత్రః స్థాపయామాస శ్రీరామస్యాజ్ఞయాఽఽదరాత్ ॥ 94

తేషు పంచశవేష్వేవ చైకం మధుపురి స్థితమ్ ।
క్షత్రియస్య చ తత్‌జ్ఞేయం సమానీతం సుహృజ్జనైః ॥ 95

ప్రయాగస్థం ద్వితీయం చ శవం వైశ్యస్య తత్ స్మృతమ్ ।
పూర్వే వయసి పంచత్వాత్సమానీతం హి తజ్జనైః ॥ 96

హస్తినాపురసంస్థం తత్తృతీయం శవమీరితమ్ ।
తైలకారస్య తత్‌జ్ఞేయం సమానీతం హి తజ్జనైః ॥ 97

శవం చతుర్థం తత్‌జ్ఞేయం హరిద్వారస్థితం ద్విజ ।
లోహకారస్నుషాయాశ్చ సమానీతం హి తజ్జనైః ॥ 98

ఉజ్జయినీస్థం పంచమం చ శవ జ్ఞేయం మహామతే ।
చర్మకారదుహితాయాః సమానీతం హి తజ్జనైః ॥ 99

ఏవం పంచ శవాన్యాసన్ పూర్వం ద్వే బ్రాహ్మణస్య చ ।
సప్తాయోధ్యాపురీమధ్యే శవాన్యేవం స్థితాని హి ॥ 100

రామోఽపి దండకం పశ్యన్ స బిభ్రామ సమంతతః ।
యయౌ వింధ్యాచలం ధీమాన్ రేవావారిపరిప్లుతమ్ ॥ 101

సుమంత్రా! నీవు శవములను రక్షించుచుండుము. దుందుభి నాదములచే భూమిలోని ఆర్త ధ్వనులనన్నిటిని వినవలయును. ఎవని శవమును ఎచ్చటను కాల్పింపకూడదు," అని ఆజ్ఞాపించగా, అట్లేయని దూతలవలన ఆ మాటను విని, భూమిపై సంగతుల నన్నింటిని తెలుసుకొనుచు అయోధ్యలో నుండెను. శ్రీరామచంద్రస్వామి పుష్పకముమీద తూర్పు, పడమర, ఉత్తరములను తిన్నగా సంచరించి చూచి, దక్షిణాభిముఖముగా వెడలెను. అంతలో ఇచ్చటి అయోధ్యలో ఐదు శవములు తీసుకుని రాబడినవి. సుమంత్రుడు శ్రీరామాజ్ఞానుసారముగా వాటిని తైల భాండములలో పదిలముగా ఉంచెను. ఆ ఐదు శవములలో ఒకటి మధుపురమునందున్నట్టి క్షత్రియునిది. దాని నచ్చటివారు తీసుకునివచ్చిరి. మరియొకటి పూర్వవయస్సులోనే మరణించుటచేత ప్రయాగ క్షేత్రమునుండి తేబడిన వైశ్యునిది. దానివారు దానినిదెచ్చిరి. మూడవ శవము హస్తినాపురము నందుండునది. అది గానుగనుండి నూనెను తీయువానిదిగా గుర్తించబడినది. తదభిమానులు దానినిదెచ్చిరి. నాలుగవ

శవము హరిద్వారములోనిది. అది చక్మకారుని కోడలిది. దానిని చర్మకారులు దెచ్చిరి. ఇట్లు 5 శవములు చేరినవి. మొదటివి 2 బ్రాహ్మణ శవములు, ఇట్లు అయోధ్యాపట్టణ మధ్యభాగమున 7 శవములు పడెను. శ్రీరాముడు దండకారణ్యమును అవలోకించుచు, అంతట సంచరించెను.

**తత్ర వృక్షే లంబమానం ధూమం పాతుమధోముఖమ్ ।**
**శూద్రం నిరీక్ష్యస్వర్గేచ్ఛం తం హంతుం సముపస్థితః ॥ 102**

**తదా తం రాఘవః ప్రాహ భో శూద్ర శృణు మద్వచః ।**
**బ్రాహ్మణాదిత్రిభిర్వర్ణైస్తపః కార్యం న చేతరైః ॥ 103**

**శూద్రైశ్చ ద్విజశుశ్రూషా సదా కార్యాఽతిభక్తితః ।**
**ద్విజకృత్యం త్వయా చాత్ర కృతం పాపాత్మనా జడ ॥ 104**

**ఇదానీం త్వాం హనిష్యామి జీవయిష్యామి తాన్మృతాన్ ।**
**తుష్టోఽహం త్వాం త్వత్తపసా వరం వరయ వాంఛితమ్ ॥ 105**

**ఇతి రామవచః శ్రుత్వాఽధోముఖో రామపాదజః ।**
**ఉవాచ భయభీతః సన్నత్వా రామం ముహుర్ముహుః ॥ 106**

**రామ రావణదర్పఘ్న యది తుష్టోఽసి మాం ప్రభో ।**
**తర్హి తే వరయామ్యద్య యేన శూద్రగతిర్భవేత్ ॥ 107**

**మమాపి యేన కీర్తిః స్యాత్తం వరం దాతుమర్హసి ।**
**ఇతి శూద్రవచః శ్రుత్వా రామస్తుష్టోఽబ్రవీద్వచః ॥ 108**

**మమ రామేతి యన్నామ తచ్ఛూద్రైః సర్వదైవ హి ।**
**జపనీయం కీర్తనీయం చింతనీయం ముహుర్ముహుః ॥ 109**

**భవిష్యతి గతిస్తేషామనేన మత్పరో భవ ।**
**తవానేనోపకారేణ కీర్తిః శూద్రేషు వై భవేత్ ॥ 110**

**ఇతి రామవరం శ్రుత్వా పునః శూద్రోఽబ్రవీద్వచః ।**
**శూద్రాః కలౌ మందధియో భవిష్యంతి రఘూత్తమ ॥ 111**

**వ్యగ్రచిత్తా భవిష్యంతి కృషికర్మాదిభిః ప్రభో ।**
**తదా తేషాం కుతో బుద్ధిర్జపాదిషు భవిష్యతి ॥ 112**

**అతస్తదనురూపోఽద్య వరో దేయో విచార్య చ ।**
**తత్తస్య వచనం శ్రుత్వా రామస్తుష్టోఽబ్రవీత్ పునః ॥ 113**

**పరవందనకాలేషు రామరామేతి సర్వదా ।**
**శూద్రా వదంతు సర్వత్ర తేన తేషాం గతిర్భవేత్ ॥ 114**

శ్రీరాముడు భూమిపై సంచరిస్తూ రేవానదిజలములతో చుట్టబడిన వింధ్యాచలమునకు వచ్చునపుడు, ఒక వృక్షమున వ్రేలాడి ధూమ్రపానమునకై అధోముఖుడై యుండు శూద్రునిజూచి, స్వర్గేచ్ఛగలవానిని సంహరించుటకు ఉద్యమించెను. మరి ఆ శూద్రునిజూచి, "ఓరి శూద్రుడా! నా మాట వినుము. బ్రాహ్మణుడు మొదలుగాగల మూడు వర్ణములవారు తపస్సును చేయవచ్చును. తక్కినవారు చేయరాదు. శూద్రులు ద్విజసేవను నిరంతరము మిక్కిలి భక్తితో చేయతగినది. ఓరి మూఢుడా! ఇప్పుడిచ్చట పాపియగు నీవు బ్రాహ్మణకృత్యము నాచరించుచున్నావు. ఇప్పుడు నిన్ను సంహరించుచున్నాను. అక్కడ ఎవరు మృతిచెందియున్నారో వారిని బ్రతికించెదను. నీ తపస్సువలన నేను తృప్తుడనయితిని. కావలసిన వరము వేడుము," అనిన రామవాక్యములను విని అథోముఖుడై రామపదజుడు భయభ్రాంతుడగుచు పలుమార్లు నమస్కరించి, రావణగర్వ హరణుడగు రామా! నీవు నా యెడ సంతోషించినవాడవైతే నేను వరమును వేడుచున్నాను. శూద్రులకు దేనివలన గతిగలుగునో, నాకును కీర్తి సంభవించునో అట్టివరము నిప్పింపుము," అని ప్రార్థించెను. అందుకు శ్రీరాముడు సంతసించి నా యొక్క "రామ" అను నామమును నిరంతరము జపించవలయును, సంకీర్తన చేయవలయును, ధ్యానము చేయవలెను. అందువలన వారికి గతికాగలదు. నా చరణమునుండి పుట్టినవాడవా! నీకును ఈ ఉపకారమును శూద్రులకు కలుగజేసినందుచేత వారిలో కీర్తిగలుగుచుండును," అని చెప్పగా ఆ శ్రీరామవరమును విని శూద్రుడు, "రఘునాథా కలియుగమున శూద్రులు బుద్ధిన్యూనత గలవారగు చున్నారు. కృషికర్మాదులచే వ్యగ్రచిత్తులగుదురు. అప్పుడు వారికి జపాదులలో ఎట్లు బుద్ధికలుగును. కావున దానికి అనుగుణముగా వరమును అనుగ్రహింపవలయును," అని శూద్రుడు ప్రార్థింపగా, సంతుష్టుడైన శ్రీరాముడు, శూద్రులు పరులకు నమస్కరించునపుడు 'రామ' 'రామ' యని నిరంతరముగ అంతట చెప్పవలయును.

**తవాపీయం మహాకీర్తిః స్మరిష్యంతి మదంఘ్రిజాః ।**
**త్వం మయా నిహతస్త్వద్య వైకుంఠం ప్రతి యాస్యతి ॥ 115**

పునర్యయాచే శ్రీరామం వరమన్యం స్వకారణాత్ ।
అస్మిన్ శైలే సదా తిష్ఠ సీతాలక్ష్మణసంయుతః ॥ **116**

అంశతస్తే పూర్వమేవ దర్శనం మమ యే నరాః ।
కరిష్యంతి తతః పశ్చాద్యే నరాస్తవ దర్శనమ్ ॥ **117**

కుర్వంతి సహితం భక్త్యా మోక్షమేవ వ్రజంతి తే ।
మద్దర్శనం వినా మర్త్యాస్త్వాం పశ్యంత్యవిచారతః ॥ **118**

తేషాముద్ధరణం రామ కురు మద్వచనం ప్రభో ।
తథోవాచ తదా రామో భక్తిం తస్మై దదౌ హరిః ॥ **119**

ఇతి కృత్వా సుసంతుష్టం హత్వా శూద్రం రఘూత్తమః ।
జీవయామాస విప్రాదీన్ సప్త సాకేతసంస్థితాన్ ॥ **120**

తదారభ్యాత్ర శూద్రైస్తు విష్ణుదాసావనీతలే ।
పరదండనకాలేషు రామరామేతి కీర్త్యతే ॥ **121**

తం హత్వా రఘువీరః స పరివర్త్య ముదాన్వితః ।
సీతాం నానాకౌతుకాని దర్శయాన్ స్వపురీం యయౌ ॥ **122**

ఏతస్మిన్నంతరే మార్గే గృధ్రోలూకౌ నిరీక్షితౌ ।
వివదమానౌ రామేణ చాత్మానం ద్రష్టుమాగతౌ ॥ **123**

తావువాచ రఘుశ్రేష్ఠః కిమర్థం హి యువాముభౌ ।
వివదమానౌ సంప్రాప్తౌ మాం బ్రూతస్త్వద్య విస్తరాత్ ॥ **124**

తద్రామవచనం శ్రుత్వా తదోలూకోఽబ్రవీత్ ప్రభుమ్ ।
మయా పూర్వం కృతం రామ నగోపరి గృహం వనే ॥ **125**

తత్కాలేన మయా త్యక్తం తత్ర గృధ్రోఽస్తి సంస్థితః ।
నానేన దీయతే మహ్యం మమ గేహం రఘూత్తమ ॥ **126**

నీకును కీర్తికరమని నా పాదపద్మములనుండి ఉద్భవించిన శూద్రులు స్మరించుచున్నారు. నీవు నా చేత చంపబడి వైకుంఠమునకు వెళ్ళగలవు.” అని శ్రీరాముడు అనుగ్రహించెను. ఆ శూద్రుడు తన కొరకు మరియొక వరమును కోరుతూ, స్వామీ! ఈ పర్వతమున సీతాలక్ష్మణ సమేతుడవై నీవు నీ అంశచే సాన్నిధ్యమునంది యుండుము. ఇచ్చట మొదట నన్నుచూచి, పిదప నీ దర్శనమునెవరు చేయుదురో ఆ మానవులు తప్పక ముక్తినందుదురుగాక. విచారించుకొనక యే మానవులు నా దర్శనము లేక నిన్ను దర్శించెదరో వారి యుద్ధరణము నీదిగాకున్నది,” అని ప్రార్థించెను. అట్లేకానిమ్మని శ్రీరామచంద్రస్వామి అతనికి పరమభక్తిని అనుగ్రహించెను. ఇట్లు ఆ శూద్రునిని సంతోషపరచి రామస్వామి వానిని సంహరించి, అయోధ్యలో ఉండిన బ్రాహ్మణుడు మొదలైన ఏడుమందిని బ్రతికించెను. ఓయి విష్ణుదాసా! అది మొదలు అవనీతలమున శూద్రులందరును పరులకు నమస్కరించునపుడు 'రామ రామ' యని కీర్తించుచున్నారు. వానినిట్లు శిక్షించి శ్రీరఘునందనుడు సంతోషముతో వెనుకకు తిరిగి సీతాదేవికి వివిధ వినోదములు చూపుచు అయోధ్యా రాజధానికి వచ్చెను. (122)

## శ్రీరాముడు గద్దను శిక్షించుట

శ్రీ సీతారాములవారు అయోధ్యకు తిరిగి వచ్చునప్పుడా మార్గమున ఒక గ్రద్ద–ఒక గుడ్లగూబ యును పరస్పర వివాదము చేయుచు శ్రీరామపరమాత్మ వద్దకు చేరినవి. అప్పుడు శ్రీరాముడు, “మీరిరువురును ఏల కలహించుచు నా వద్దకు వచ్చితిరి? సవిస్తరముగా ఆ సంగతిని చెప్పవలయును,” అనగా. వాటిలో గుడ్లగూబ ఇట్లనెను. “శ్రీరామా! మునుపు నేనీచెట్టుమీద నొక గూడు కట్టుకొంటిని. తరువాత కార్యాంతర వశమున నేను దానిని వదిలిపోతిని. తిరిగి వచ్చిచూచితే అచ్చట ఈ గద్దవచ్చి వశించుచున్నది. ఇప్పుడిది నా గూటిని నాకు విడువదు,” అని చెప్పెను.

**తదులూకవచః శ్రుత్వా గృధ్రమాహ రఘూద్వహః ।**
**కిమర్థం దీయతే నాస్య త్వయా గృధ్ర గృహం వద ॥ 127**

**తదా గృధ్రోఽబ్రవీద్వాక్యం రాఘవం దీర్ఘనిః స్వనః ।**
**మయా పూర్వం కృతం రామ నగోపరి గృహం వనే ॥ 128**

**తత్కాలేన మయా త్యక్తం తదోలూకః కియద్దినమ్ ।**
**స్థితస్తేనాపి తత్త్యక్తం తత్రాహం సంస్థితః పునః ॥ 129**

**వృథాఽహం స్పర్ధతే రామ మత్వా గేహం మమేతి చ ।**
**మాఽధర్మం కురు రాజేంద్ర త్వద్వంశేఽభూన్న పాతకీ ॥ 130**

తావువాచ రఘుశ్రేష్ఠో యువాభ్యాం హి యదా గృహమ్ ।
కృతం తస్యాత్ర కః సాక్షీ తదా తౌ నేతి చోచతుః ॥ 131

విమానస్థాంస్తదా సర్వాన్ రాఘవః ప్రాహ సస్మితః ।
ఇదమప్యద్య సంప్రాప్తం దుర్ఘటం మాం పురస్త్విహ ॥ 132

కథం న్యాయోఽత్ర వై కార్యః కస్మై గేహం ప్రదీయతామ్ ।
తద్రామవచనం శ్రుత్వాఽఽ సన్సర్వేఽతివిస్మితాః ॥ 133

తదోలూకం విభుః ప్రాహ కృతం గేహం త్వయా కదా ।
ఉలూకః ప్రాహ భూశ్చేయం యదా జాతా తదా కృతమ్ ॥ 134

తదులూకవచః శ్రుత్వా గృధ్రం రామోఽవలోకయత్ ।
గృధ్రః ప్రాహ యదా చేయ మహానీరేఽవనిస్తదా ॥ 135

చూతవృక్షే కృతం విద్ధి పురా గేహం మయా విభో ।
తద్గృధ్రవచనం శ్రుత్వా తదా తం ప్రాహ రాఘవః ॥ 136

గుడ్లగూబ మాటలు విన్న శ్రీరాముడు గద్దతో, "నీవు ఏల గూబ యింటిని దానికి వదలలేదు?" అని అడిగెను. అంత ఆ గద్ద నిట్టూర్పు విడుచుచు, "స్వామీ! నేనే ఈ చెట్టుమీద మునుపు గూడు గట్టితిని. అటుమీద కొంతకాలము నేను ఇచ్చట లేనప్పుడు ఆ గూబ ఈ గూటిలో ఉండి, ఈ గూడును వదలి, పోయి, వచ్చినది. గనుక నేను నాగూటిలో దూరి మరల సుఖముగా ఉన్నాను. శ్రీరామా! ఇది వ్యర్థముగా తగవులాడుచున్నది. ఇంతమాత్రముచేతనే ఇది నా గూటిని తన దనుకొనినది. రాజేంద్రుడా! అధర్మముగా నన్ను శిక్షింపవలదు. నీవంశమునందు నీవు పాపికావలదు," అని చెప్పెను. వాటిని చూచిన, శ్రీరాముడు, "మీరెప్పుడీ ఇంటిని కట్టితిరో దానిని చూచినవాడెవ్వడైనను సాక్షిగలడా?" అని అడిగెను. అందు సాక్షులు ఎవ్వరును లేరు," అని చెప్పగా, విమానములోని వారితో, "ఏమిది ఒక పీకులాట వచ్చిచేరినది. ఈ ఇంటి నెవరికియ్యవలె? మంచి దుర్ఘట విషయము ఒకటి బాగుగా ఏర్పడినది." అని నవ్వుచు పలికెను. అంత వారందరును అత్యాశ్చర్యమునంది ఊరకయుండిరి. అపుడు శ్రీరాముడు, గుడ్లగూబతో "నీవు ఈ గూటిని ఎప్పుడు కట్టితివి," అని అడుగుగా. అందుకు గూబ, "ఈ పుడమి పుట్టినపుడు కట్టితి"నని సమాధానము నిచ్చెను. అంత శ్రీరాముడు గద్దను కూడా అట్లేఅడిగెను. అపుడు గ్రద్ద "ఎప్పుడీ భూమియే లేక మహాప్రళయ జలమున మునిగియుండెనో అప్పుడీ మామిడిచెట్టుమీద నేనిట్లు కట్టితి"ననెను.

కథం వినాఽఽశ్రయేణాసీన్మహానీరే నగస్తదా ।
నోక్తోఽక్షయవటః సోఽపి చూతవృక్షస్త్వయా స్మృతః ॥ 137

తస్మాద్వృథా త్వయా గృధ్ర స్పర్ధ్యతేఽనేన నిశ్చితమ్ ।
మయాఽద్య తవ వాక్యేన ధిక్ త్వాం దుష్టపతత్రిణమ్ ॥ 138

ఇత్యుక్త్వా రాఘవో దూతైస్తం గృధ్రం పర్వతోపరి ।
త్రిశూలాగ్రేషు చారోప్య ప్రేషయామాస స్వం పదమ్ ॥ 139

ధన్యః స గృధ్రో విజ్ఞేయో రామాగ్రే యస్య వై మృతిః ।
అభూత్తద్దర్శనమపి యస్య దేహవిసర్జనే ॥ 140

దత్వా గేహములూకాయ యయౌ రామో నిజాం పురీమ్ ।
వివేశ నగరీం నృత్యవాద్యగీతపురస్సరమ్ ॥ 141

శిశుం విప్రం క్షత్రియం చ వైశ్యం చాపి చతుర్థకమ్ ।
తైలకారం పంచమం చ లోహకారన్నుషాం తథా ॥ 142

చర్మకారదుహితరం సప్తైతాన్హి సుజీవితాన్ ।
దృష్ట్వా రామః సమాయాతానాత్మానం ద్రష్టుమాదరాత్ ॥ 143

తుతోష నితరాం పత్న్యా తైః సర్వైః సంస్థితో ముహుః ।
తతః సంపూజ్యః తాన్ సర్వాన్ విససర్జ రఘూద్వహః ॥ 144

తదా మహోత్సవశ్చాసీదయోధ్యాయాం సమంతతః ।
ఏవం నానాచరిత్రాణి చకార రఘునందనః ॥ 145

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, యతి, శూద్ర, గృధ్ర శిక్షోపకరణం నామ, దశమస్సర్గః ॥**

అంత ఆ రఘుపతి, "ఓయి గ్రద్దా! యే ఆధారము లేకుండా నీటిలో ఈ మామిడి వృక్షమెట్లుండును? కానిమ్ము. అక్షయవటమునైనను స్మరించకపోతివి. మామిడిచెట్టును తలంచితివి. కావున నీవే వ్యర్థముగా ఇట్లు పోరాడుచున్నావని తెలిసినది. నేనిప్పుడు నిన్ను చెడ్డపక్షిగా ఎంచి ధిక్కరించితిని," అని చెప్పి ఆ

గద్దను కొండమీద త్రిశూలము కొనమీద ఎక్కించి, నిజపరమపదము ననుగ్రహించెను. శ్రీరాముని ఎదుట మృతినందుటచేత ఆ గ్రద్ధ ధన్యాత్మయని ఎరుగవలయును. మరి దేహావసానమున దానికి ఆత్మసాక్షాత్కారము కలిగె. అంత ఆ శ్రీరామచంద్రస్వామి గుడ్లగూబకు ఆ ఇల్లునిచ్చి నిజనగరికి వెళ్ళెను. మంగళవాయిద్య పురస్సరముగా ఊరులో ప్రవేశించెను- బ్రాహ్మణపుత్రుని, బ్రాహ్మణుని, క్షత్రియుని, వైశ్యునిని, గానుగవానిని, చర్మకారుని కోడలిని, గోదారిదాని కూతురు- అను ఈ ఏడుగురుని బ్రతికినవారినిగా జూచి, తననుచూడవచ్చిన వారినందరిని సంతోషపరచి, వారందరి చేతను కీర్తింపబడి, సీతాదేవితో పరమానందమునందెను. అప్పుడు అయోధ్యాపట్టణ మంతటా మహోత్సవములు జరిగెను. ఇట్లే శ్రీరామచంద్రస్వామి వివిధవిచిత్రములను చూపెను.

**శ్రీవాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలోని, పూర్వార్థములో, యతిని, శూద్రుని, గ్రద్దను శిక్షించు 10వ సర్గ ముగిసినది.**

# ఏకాదశః సర్గః-11వ సర్గ

ద్విజకన్యా వరదానం

శ్రీరామదాస ఉవాచ

అథైకదా రామచంద్రో మృగయార్థం వనం యయౌ ।
సీతయా బంధుభిః సైన్యైర్హస్త్యశ్వరథపత్తిభిః ॥ 1

పశ్యన్ వనాని సర్వాణి మృగయా రసికో భృశమ్ ।
కౌతూహలసమావిష్ట ఆఖేటవ్యూహసంవృతః ॥ 2

ఉపానద్గూఢపాదశ్చ నీలోష్ణీషీ హరిచ్ఛదః ।
నీలగోధాంగుళిత్రాణో ధనుష్పాణిః శరీ నృపః ॥ 3

అశ్వారూఢః ఖడ్గచర్మధారీ భూపైః పదాతిభిః ।
వేష్టితః కవచీ రామో వివేశ గహనం వనమ్ ॥ 4

సీతయా జాలరంధ్రైశ్చ వారం వారం నిరీక్షితః ।
స రామో బంధువర్గైశ్చ పుత్రాభ్యాం నృపసత్తమైః ॥ 5

క్రీడాం తదాఽకరోత్తత్ర కుంజేషు మృగయన్ మృగాన్ ।
హన్యతాం హన్యతామేషో మృగో వేగాత్పలాయతే ॥ 6

ఇతి జల్పన్ స్వభృత్యేషు స్వయముత్పత్య హంతి చ ।
గాంధారేషు చ రమ్యేషు వనేషు విపులేషు చ ॥ 7

ఉల్లంఘితమహాస్రోతా యువా పంచాస్యవిక్రమః ।
ఇతస్తతః పునర్యాతి క్వచిత్పశ్యన్ వనస్థలీమ్ ॥ 8

విటపోడ్డీనసంత్రస్త లీనకేకికులాకులామ్ ।
హరిణీగణసంత్రస్తాం ధావంఛాపదదిఙ్ముఖామ్ ॥ 9

క్వచిత్ఫేరవఫూత్కారఝిల్లీరావవిభీషితామ్ ।
ఖడ్గాయుధైః క్వచిల్లక్ష్మీం దధానామివ దంతినామ్ ॥ 10

క్వచిత్కోటరసంవిష్టశుకాం నాదవినాదినీమ్ ।
మృగారిపదముద్రాభిర్ముద్రితాం చ క్వచిత్ క్వచిత్ ॥ 11

శార్దూలనఖనిర్భిన్నరోహిద్రక్తారుణాం క్వచిత్ ।
పీవరస్తనభారార్తసుస్నిగ్ధమహిషీగణైః ॥ 12

అవరోధాజిరక్షోణిం సూచయంతీమివ క్వచిత్ ।
క్వచిద్వృక్షఘనచ్ఛాయాం వనపుష్పసుగంధినీమ్ ॥ 13

క్వచిల్లతాగృహద్వార భూమండలసతోరణామ్ ।
అర్ధనిః సుతనిర్మోకనాగభీమమహద్బిలామ్ ॥ 14

వృత్తాస్యాజగరైర్వ్యాప్తాం క్వచిన్నిర్ముక్తసర్పిణీమ్ ।
క్వచిద్దావానలజ్వాలాశిఖావ్యాప్తమహీరుహామ్ ॥ 15

## శ్రీరాములవారు వేటాడబోవుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "ఆ తరువాత ఒకసారి శ్రీరామచంద్రుడు వేటాడుటకు వనమునకు వెడలనెంచి, మృగయా రసికుడగుటచే, అత్యంత కౌతూహలముతో, పాదములను కప్పియుంచు పాదరక్షలను తొడిగి, నల్లయుష్ణీషమను తలతొడుగు వేసుకొని, పచ్చని పచ్చడముకప్పికొని, ఉడుముతోలుతో చేసిన వ్రేళ్ళ తొడుగులను తొడిగి, ధనుర్బాణములను ధరించి, ఖడ్గచర్మములను అందుకొని, పదాతి సైన్యముల తోను, సామంతరాజవర్గముతోను గుఱ్ఱమునెక్కి, దేవిని, తమ్ములను, చతురంగములను వేటకాండ్ర గుంపులను వెంటతీసుకొని ప్రయాణముచేసి, మహాగహనారణ్యమున ప్రవేశించెను.

సీతాదేవి జల్లెడ తెరలలోనుండి అడుగడుగునకును విలోకించుచుండగా, విలాసమునందిన శ్రీరామచంద్రస్వామి తమ్ములతోను, కొడుకులతోను, సామంత రాజులతోను పొదలలో మృగములను వెదకుచు విహరించెను. కొట్టండి, కొట్టండి, యిదిగో మృగము వేగముగా పారిపోవుచున్నది. అని తన సేవకులకు చెప్పుచూ, తానూ తటాలున పోయి ఆ మృగమును సంహరించుచు, సింహపరాక్రముడై శ్రీరామచంద్రుడు గాంధారములను విస్తారములైన రమ్యవనములలో గొప్ప ప్రవాహములను దాటుచు అచ్చటచ్చట వనస్థలములను విలోకించెను.

ఈ లవణ స్థలి ఎట్టిదనిన :– చెదరి, ఎగిరి, వెరచి, దాగుచుండు నెమళ్ళు గల్గి వ్యాకులమైనదియు, వెరచి పఱుగెత్తునట్టి లేళ్ళుగలదియు, పరుగెత్తుచుండు హింసజంతువులచే వ్యాప్తమైనది, కొంతవడి

నక్కలయొక్క భయంకరనాదములచే భీషణమును, కొంతవడి గజసంపదనందినట్లు రాతియేనుగుల గుమి గల్గినదియును, కొంతవడి చెట్ల తొఱ్ఱలలో కోలాహలమునందిన చిలుకలచే వెలయు నదియును, కొన్నికొన్ని చోట్లలో పులియడుగులచే పుంజితమును, సింహపాదాంకితములచే భీకరమును, పెద్దపులులగోళ్ళచే చీల్చబడిన మృగముల రక్తముచే ఎఱ్ఱబారిన కొన్ని ప్రదేశములు కలిగినదియు. బలిసిన పొదుగులను మోయజాలక చేపు విడుచుచుండు ఎనుములచే, అంతఃపుర చర్మమయ భూమిని కొన్నిచోట్లలో చూపునదియును, కొన్ని తావులలో వన్యపుష్ప పరిమళముతోడ నిండునీడలనిచ్చు నట్టిదియును, కొన్ని ప్రదేశములలో పొదరిండ్లవాకిళ్ళకు తుమ్మెదల తోరణములుగలదియును, సగము పొరవిడిచిన పాములచే భయంకరమైన పుట్టలుగలదియును, ఘోర కొండచిలవలచే వ్యాప్తమును, కొన్నిచోట్లలో దావాగ్ని నిర్దగ్ధవృక్షములు గలదియును,....

**జ్వలన్నికుంజనిర్గచ్ఛ ద్వృక్వ్యాఘ్రత్రసద్భటామ్ ।**
**వ్యముంచస్తు శునాం యూథం శశకేషు క్వచిత్ క్వచిత్ ॥ 16**

**పల్వలేషు చ విశ్రాంతః పునర్యాతి వనాంతరమ్ ।**
**తతో మధ్యాహ్నసమయే నివాసం సరసస్తటే ॥ 17**

**కారయామాస సేనాయాః సీతాయాశ్చ రఘూత్తమః ।**
**స్వయం ముదాఽకరోత్క్రీడామాఖేటవ్యూహసంవృతః ॥ 18**

**దుద్రావ మృగపృష్ఠేషు ముక్త్వా బాణం జఘాన తాన్ ।**
**ఏవం ఖేలతి రాజేంద్రే వ్యాధవర్గే చ వై ద్విజ ॥ 19**

**తత్ర కోలాహలత్రస్తః పంచాస్యో నిర్గతో వనాత్ ।**
**స కేసరీ మహావేగస్తీక్ష్ణదంష్ట్రో భయావహః ॥ 20**

**స్ఫురద్వేగసమాక్రాంత దుర్గమార్గమహీతలః ।**
**కదాచిద్గగనారూఢః కదాచిద్భూమిగశ్చలః ॥ 21**

**న రథాల్లక్ష్యతాం యాతి ధన్వినాం పృష్ఠగామినామ్ ।**
**క్వచిద్దృష్టిపథం యాతి దర్శనాగోచరః క్వచిత్ ॥ 22**

**వక్రస్రోతోఽతిగంభీరం కంటకిద్రుమసంకులమ్ ।**
**వృకవ్యాఘ్రసమాకీర్ణం పర్వతైశ్చ భయంకరమ్ ॥ 23**

**ప్రవిష్టో విజనారణ్యం రామస్తస్య పదానుగః ।**
**దూరాద్దూరం తతో గత్వా దేశాద్దేశం చ నిర్జనమ్ ॥ 24**

**ఏకాకీ హయమారూఢో వివేశ గిరిగహ్వరమ్ ।**
**సర్వే వ్యాధాశ్చ దూతాశ్చ లక్ష్మణాద్యాశ్చ బంధవః ॥ 25**

**రామదర్శనసంభ్రాంతా బభ్రముస్త ఇతస్తతః ।**
**అథ రామః కేసరిణం జఘాన సితపత్రిణా ॥ 26**

మందుచుందు పొదలనుండి వెలువడివచ్చు తోడేళ్ళను, పులులను వెరపించుచుండు భటులు గలదియును అగు అరణ్యమున ఒకచోట కుందేళ్ళమీద వేటకుక్కలను వదలగా అవి వేటాడుచుండినవి. అప్పుడు నీటికాలువలవద్ద కొంత కొంత విశ్రమించి ఇతర వనములకు వెళ్ళుచుండిరి. అంత ఆ శ్రీరామచంద్రుడు మధ్యాహ్న సమయమున సరోవరతీరమున సేనలను నిలిపి, సీతాదేవితో కొంత విశ్రాంతి పొంది, సంతోషముతో వేటగాండ్రతో జేరి క్రీడనమునకారంభించెను. అపుడు రామచంద్రుడు బాణప్రయోగముజేసి మృగములను వెంబడించి పోవుచుండగా, వ్యాఘ్రవర్గము పరుగెత్తుచుండగా అచ్చట గొప్ప కోలాహలముచే దిగ్భ్రమమైన సింహమొకటి వనమున వెలువడి గోర్లనే ఆయుధములుగా కలిగి మిక్కిలి భయంకరమై తన వేగముచే దుర్గమమార్గములను ధ్వంసముచేయుచు, వెంబడివచ్చు ధనుర్ధారులకు భూమిమీద జూచిన గగనమున, గగనమునజూచిన భూమిమీద అట్లే దృగ్గోచరముకాగ క్షణమున మరల నగుపడుచు ఇట్లు మహా విక్రమముతోపోయి ఘోరతరమైన విజనారణ్యమున ప్రవేశించెను. శ్రీరాముడు దానియడుగులను గుర్తించుచూ, గుఱ్ఱమునెక్కి ఒక్కడే వెంబడించి అనేక దుర్గకాంతారములను అధిగమించి, బహుదూరము పోయెను. శ్రీరాముని పోబడి నెఱుగక సేనలును లక్ష్మణాది వీరదూతలును, బోయవాండ్రును సంభ్రాంతులై యిటునటు వెదకుచుండిరి. అంతనప్పుడు శ్రీరాముడు బాణప్రయోగముచే సింహమును సంహరించెను. (26)

**తతః స దివ్యరూపేణ నత్వా ప్రాహ రఘూత్తమమ్ ।**
**పురా విద్యాధరశ్చాహం మయా భుక్తా పతివ్రతా ॥ 27**

**మునిపత్నీ హఠేనైవ తయా శప్తస్త్వహం క్రుధా ।**
**సింహవన్నిగ్రహో యస్మాత్త్వయా మయి కృతోఽద్య హి ॥ 28**

**అతస్త్వం మద్గిరా సింహో భవాద్యైవ మహావనే ।**
**తదా మయా ప్రార్థితా సా పునర్మామాహ రాఘవ ॥ 29**

చిరాద్రామ శరస్పర్శాచ్ఛాపాన్ముక్తిర్భవేత్తవ ।
అతోఽద్య త్వచ్ఛరస్పర్శాచ్ఛాపాన్ముక్తశ్చిరాదహమ్ ॥ **30**

ఇత్యుక్త్వా రామమామంత్ర్యం స స్వర్గం ప్రయయౌ ముదా ।
తతః స రామచంద్రోఽపి తురగస్థో ముదాన్వితః ॥ **31**

తత్ర తస్థౌ క్షణం యావత్తావత్తద్గిరిగహ్వరే ।
గుహాద్వారి శిలామేకాం దదర్శ యోజనాయతామ్ ॥ **32**

మహతీం తాం శిలాం దృష్ట్వా రామో విస్మితమానసః ।
ధనుష్కోట్యాఽక్షిపద్దూరం గుహాయాం సంవివేశ హ ॥ **33**

కియద్దూరం తతో గత్వాఽగ్రే ప్రకాశం దదర్శ సః ।
తత్ర ద్రోణ్యాం పర్వతస్య తపస్యంత్యః స్త్రియః ప్రభుః ॥ **34**

దదర్శ రామశ్చత్వారః కించిదంతరసంస్థితాః ।
అస్థిచర్మావశిష్టైశ్చ దేహైర్దృగ్గోచరీకృతాః ॥ **35**

శ్వాసైః సంజీవితాశ్చేతి జ్ఞాతవాంస్తా రఘూత్తమః । **36**

నిజరూపాణి చత్వారి కృత్వాదౌ తత్పురః స్థితః ।
అబ్రవీన్మధురం వాక్యం భిన్నరూపేణ తాః పృథక్ ॥ **37**

## శ్రీరామునివలన విద్యాధరుడు శాపవిముక్తినందుట

పిదప ఆ సింహము దివ్యరూపము పొంది, శ్రీరామునికి నమస్కరించి, "స్వామీ! నేను మునుపొక విద్యాధరుడను. నేనొక పతివ్రతను అనుభవించితిని. ఆమె మునిపత్ని గాన బలాత్కరించిన నన్ను కోపముతో, "సింహమువలె నీవు హింసించితివి గాన ఘోరారణ్యమున నీవొక సింహమైపో" మ్మని శపించెను. నేను పశ్చాత్తప్తుడనై వేడుకొంటిని. ఆమె దయగల్గి 'శ్రీరాముని శరస్పర్శచే శాపముక్తి నందు'మని నన్ను అనుగ్రహించెను. కావున నీ బాణస్పర్శ వలన ముక్తుడనైతిని," అని విన్నవించి, సంతోషముతో స్వర్గమునకు పోయెను...(31)

## శ్రీరాముడు నలుగురు బ్రాహ్మణస్త్రీలకు వరములనిచ్చుట

గుట్టమును ఎక్కిన శ్రీరామచంద్రస్వామి అచ్చట కొంతసేపు నిలచి, ఎదుట నొక గుహద్వారమును, అచ్చట మిక్కిలి విస్తారమైన బండరాతిని జూచి, ఆశ్చర్యముతో, ఆ ద్వారమునకు అడ్డుగా ఉన్న మహాశిలను తన వింటి మొనచేత దూరమునకు త్రోసెను. మరియూ ఆ గుహలో ప్రవేశించి

కొంతదూరము పోయెను. అంతనచ్చట ఎదుట గొప్ప వెలుగుకనబడెను. అచ్చట రెండుపర్వతముల సందులో ఒకరి సమీపమున ఒకరు కూర్చుని తపస్సుచేయుచుండువారును; కేవలం ఎముకలు, చర్మము మిగిలినటువంటి నలుగురు స్త్రీలను చూచెను. వారు ఊపిరివలన బ్రతికియున్నారని గ్రహించెను. అప్పుడు శ్రీరాముడు తాను నాలుగు రూపములను ధరించి వేర్వేరుగా వారిఎదుట నిలచి, “ఓ మగువలారా! మీకు కావలసిన వరములను వేడుకొనుడు.

వరయధ్వం వరాన్నార్యః ప్రసన్నోఽహం రఘూత్తమః ।
తతస్తా రామసంస్పర్శాన్ మాంసరక్తాదిధాతుభిః ॥ 38

పూరితాని శరీరాణి దదృశుర్నయజేర్నిజైః ।
శ్రుత్వా తద్రామవాక్యం తాస్తదా స్వపురతోఽక్షిభిః ॥ 39

నార్యో విలోకయామాసుః సర్వాః శ్రీరఘునాయకాన్ ।
కోటిసూర్యప్రతీకాశాంశ్చాపబాణాసిధారిణః ॥ 40

హయారూఢాన్నృవేషేణ సర్వాసాం పురతః స్థితాన్ ।
చతుర్మూర్తీశ్చైకరూపాస్తా దృష్ట్వా కంజలోచనాః ॥ 41

అతివిస్మయమాపన్నాస్తదోచుస్తాన్ పృథక్ పృథక్ ।
కే యూయం వాజిసంస్థా హి కుతః సర్వే సమాగతాః ॥ 42

యూయం దేవా దానవా వా గమ్యతే క్వాధునా పురః ।
అస్మాకం కథ్యతాం సర్వం కిమర్థం భాషితా వయమ్ ॥ 43

అస్మాకం దుఃశరీరాణి కమనీయాని వై కథమ్ ।
జాతాన్యద్యమహాదైత్యో దుందుభిః సోఽస్తి వా మృతః ॥ 44

ఇతి తాసాం వచః శ్రుత్వా రాఘవస్తా వచోఽబ్రవీత్ ।
అహం చతుర్భిర్దేవైశ్చ రామస్త్వేకో న సంశయః ॥ 45

సప్తద్వీపపతిః శ్రీమాన్ సూర్యవంశసముద్భవః ।
మృగయార్థం సమాయాతః కేసరీ నిహతో వనే ॥ 46

ధనుష్కోట్యా శిలాం త్యక్త్వా యుష్మదంతికమాగతః ।
స్వకరస్పర్శమాత్రేణ శరీరాణి శుభాని హి ॥ 47

**మయా కృతాని యుష్మాకం వాలినా దుందుభిర్హతః ।**
**స మయా నిహతో వాలీ రావణస్యాంతకారిణా ॥ 48**

**సంభాషితా వరాన్ దాతుం యూయం సర్వా మయాఽద్య హి ।**
**నాగ్రేఽస్తి మమ కార్యం హి పరివర్త్య పురీం వ్రజే ॥ 49**

నేను ప్రసన్నుడైన శ్రీరాముడిని,” అని తియ్యని పలుకులను పలికి, వారిని స్పృశించెను. అప్పుడు వారు రామస్పర్శచే రక్త మాంసములతో కూడిన దృఢ పుష్ట శరీరములను పొంది, ముందువలె తమ తమ నిజ స్వరూపములను పొంది, శ్రీరామవాక్యములను చెవులారా విని, తమఎదుట నలుగురు ఒకే రూపము కలిగిన దివ్య మానవులు నాలుగు గుఱ్ఱములమీద నెక్కి నిలచియుండెడు విచిత్రమును చూచి, విస్మయమొంది, వేర్వేరుగా అందరును, “మీరెవరు? ఎందుకు గుఱ్ఱములను ఎక్కి యున్నారు? అందరు ఇచ్చటికి ఎలవచ్చితిరి? మీరు దేవతలా? రాక్షసులా? ఇక్కడినుండి ఎచ్చటికి పోవుచున్నారు? మాకన్ని సంగతులు చెప్పండి? ఏల మమ్ములను మాటలాడించితిరి? కృశించిన మా శరీరములను మనోహరముగ ఎట్లయ్యె? దుందుభియను మహారాక్షసుడు కలడా? లేడా? అని ఇట్లు అడిగిన ఆ నలుగురు స్త్రీలతో, శ్రీరాముడు, “గౌరవనీయులారా! శ్రీరాముడనైన నేనొక్కడనే నాలుగురూపములు ధరించితిని. ఇందుకు సందేహము వద్దు. సూర్యవంశమున జనించి, సప్తద్వీపపాలకులకుడైన నేను వేటాడుటకు ఈ వనమునకు వచ్చి, ఇచ్చట నొక సింహమును సంహరించి, వింటి మొనచే గుహద్వార శిలను పెకలించి మీవద్దకు వచ్చితిని. నేనే మీ దేహములనన్నిటికి ఇట్టి దివ్యాకృతులను అనుగ్రహించి ఇచ్చితిని. దుందుభి వాలిచే సంహరింపబడినాడు, రావణాంతకుడనైన నేను వాలిని చంపితిని. మీకు వరములనిచ్చుటకై మాటలాడించితిని. నా పని ఏమియును లేదు. వెనుకకు దిరిగి నా నగరికి పోవుచున్నాను. మీరడిగిన సంగతి ఇది.”

**యత్పృష్టం తన్మయా చోక్తం కా యూయం కథ్యతాం మమ ।**
**కిమర్థం దుందుభిః పృష్టః కా వాంఛా వ్రియతాం వరాన్ ॥ 50**

**తద్రామవచనం శ్రుత్వా దుందుభిర్నిహతస్త్వితి ।**
**శిలా నిష్కాసితా చాపి సర్వాస్తుష్టిపరా యయుః ॥ 51**

**ఊచుః సర్వాస్తదా రామమానందోత్ఫుల్లలోచనాః ।**
**వయం బ్రాహ్మణపుత్ర్యశ్చ చత్వారస్త్వథ షోడశ ॥ 52**

**సహస్రాణి నృపాణాం చ వైశ్యానాం కన్యకాః పురా ।**
**సమానీతా బలాదేవ తేన దుందుభినా ప్రభో ॥ 53**

లక్షస్త్రీభిర్వివాహాంశ్చ సర్వానేకదినే త్వహమ్ ।
కరోమీతి మన్యమానః స్త్రీరత్నాని జహార సః ॥ 54

యాని యాని జహార స్త్రీరత్నాని రఘునందన ।
అస్యాం ద్రోణ్యాం స్థాప్య తాని దత్వా ద్వారి శిలావరామ్ ॥ 55

అచలాం త్వద్వినాన్యైశ్చ స్త్రీః సమానేతుమాదరాత్ ।
పునశ్చిరం గతో దైత్యో వయమత్రైవ సంస్థితాః ॥ 56

వర్తంతేఽగ్రే నృపాణాం చ వైశ్యానాం బాలికాః ప్రభో ।
వాయుపర్ణాశనాః సర్వాః శ్రీవిష్ణ్వర్పితమానసాః ॥ 57

తత్తాసాం వచనం శ్రుత్వా భిన్నరూపైః పునః ప్రభుః ।
తా ఉవాచ స్త్రియః సోహం విష్ణురేవ న సంశయః ॥ 58

తద్రామవచనం శ్రుత్వా పునస్తా రామమబ్రువన్ ।
దర్శయస్వ నిజం విష్ణురూపం చేత్సత్యవాగసి ॥ 59

తతస్తా దర్శయామాస విష్ణురూపం నిజం ప్రభుః ।
తాని చత్వారి రూపాణి పరావర్త్య రఘూత్తమః ॥ 60

తతస్తాః పురతో విష్ణుం దృష్ట్వా నేముః స్వమస్తకైః ।
తతో విష్ణుః స తాః ప్రాహ వః సందేహో గతో న వా ॥ 61

తా ఊచుర్దర్శనాత్తేఽద్య భవక్లేశా గతా హి నః ।
కియాంస్తు తత్ర సందేహస్త్వజ్ఞానజనితః ప్రభో ॥ 62

ఇక మీరెవరు? దుందుభినేల యడిగితిరి? మీ కోర్కెలను కోరండి," అని శ్రీరాముడు ప్రసన్నుడై పలికెను. దుందుభి మృతినొందెననీ, శిల భేదింపబడెనని విని ఎంతో సంతోషముపొంది, ఆ నలుగురును, "మేము నలుగురము బ్రాహ్మణపుత్రికలము. మహాప్రభూ! 16 వేలమందిని క్షత్రియ కన్యకలను, వైశ్యకన్యకలను కూడా ఆ దుందుభి పట్టితెచ్చెను. నేను ఏకకాలమున నొకనాడు లక్ష్యకన్యకలను పెండ్లాడవలయునని స్త్రీలను చెరపట్టసాగి దొరికిన వారిని పట్టితెచ్చి ఈ పర్వత ద్రోణిలో పడద్రోసి వాకిట నొక పెద్ద రాతిని అడ్డముగా పెట్టిపోవుచుండును. ఇట్లుపోయి చాలారోజులైనది. మరల రానేలేదు. మేమిట్లే తపించుచున్నాము. ఇకముందు ఆ 16 వేలమంది క్షత్రియ, వైశ్యాంగనలు వాయుభక్షకురాండ్రై శ్రీవిష్ణువును ధ్యానించుచు పడియున్నాము," అనిరి. ఆ

నలుగురు కన్యలు శ్రీరామునితో, "నీవు శ్రీరామునివి అయినచో నీ విష్ణుస్వరూపమును చూపింపుము. అపుడే నీవు సత్యవచనుడవగుదువు," అని పలుకగా, అట్లే అని శ్రీరాముడు శ్రీవిష్ణుస్వరూపుడుగా వారికి ప్రత్యక్షమై నిలచెను. అంత ఆ నలుగురు కన్యలు, శిరసా సాష్టాంగ నమస్కారములు ఆచరించిరి. అపుడు విష్ణువు "ఇప్పుడైనను మీకు సందేహము పోయినదా? లేదా?'' అని అడిగెను. అందుకు వారు స్వామీ! నీ దర్శనమువలన మా జన్మ దుఃఖములన్నియును తొలగినవి. ఇక అజ్ఞానమువలన గలిగిన సందేహమనునది ఎంతటిది?" అని వేడిరి. అంత అప్పుడే శ్రీవిష్ణురూపాలు శ్రీరాముని ఆకారములుగా మారెను.

**తతః పునః క్షణాద్రామో రూపం తా దర్శయన్ముదా ।**
**ఏకమేవ హి సర్వాసాం మధ్యే జనకజాపతిః ॥ 63**

**తతో రామోఽబ్రవీత్తాః స వరం వరయతామితి ।**
**తా ఊచుః కామబాణేన పీడితా రాఘవం ముదా ॥ 64**

**భవ భర్తా త్వమేవాద్య గాంధర్వవిధినా వనే ।**
**అస్మాభిస్త్వం కురుష్వాత్ర సుఖం క్రీడాం చిరం ప్రభో ॥ 65**

**తతో నయ పురీం స్వీయాం నస్త్వం మాఽన్యద్విచింతయ ।**
**తత్తాసాం వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్ ॥ 66**

**ఏకపత్నీవ్రతం మేఽస్తి న వాక్య మమ వై మృషా ।**
**తతస్తా విహ్వలా భూత్వా నిపేతుర్జగదీతలే ॥ 67**

**పునస్తాః ప్రాహ రామః స శృణుధ్వం వచనం మమ ।**
**ద్వాపరే కృష్ణరూపేణ యూయం క్రీడాం భజిష్యథ ॥ 68**

**మిత్రావిందా నగ్నజితీ భద్రాఽన్యా లక్ష్మణాహ్వయా ।**
**ఏవం నామాని యుష్మాకం భవిష్యతి తదా మయా ॥ 69**

**భవిష్యతి వివాహోశ్చ సర్వాసాం నాత్ర సంశయః ।**
**తదా నానావిధాన్ భోగాన్ భజధ్వం వై మయా సహ ॥ 70**

**తద్రామవచనం శ్రుత్వా కించిత్తుష్టమనాః స్త్రియః ।**
**రామం ప్రోచుః పునర్వాక్యం త్వమగ్రే గంతుమర్హసి ॥ 71**

**తాభిః శనైస్తతో రామో యయౌ తురగసంస్థితః ।**
**యోజనోపరి తాః సర్వాః సహస్ర షోడశాః శుభాః ॥ 72**

**దదర్శ గండకీతీరే వృక్షఖండే రఘూద్వహః ।**
**నిమీలితదృశః శుష్కాస్తపసా దగ్ధయౌవనాః ॥ 73**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, పూర్వార్ధే, ద్విజకన్యాచతుష్టయవరదానం నామ, ఏకాదశస్సర్గః ॥**

ఆ నలుగురి కన్యలనడుమ ఒక్కడే శ్రీరాముడుగా కనపడెను. శ్రీరాముడు వారితో, "మీకు కావలసిన వరమును వేడు"దని అనుగ్రహించెను. వారప్పుడు కామబాణప్రపీడితలై శ్రీరామస్వామిని చూచి, "స్వామీ! నీవు మాకు ఈ వనమున గాంధర్వ వివాహవిధి నవలంబించి పతియై ఆనంద పరుచుము. చిరకాలము మాతో సుఖక్రీడలను అనుభవింపుము. పిదప మీ ఊరికి పొమ్ము. మా విషయమై వేరొకయోచన చేయవలదు," అని వేడుకొనిరి. అప్పుడు శ్రీరాముడు వారితో, "నేను ఏకపత్నీవ్రతమును అవలంబించి ఉన్నాను. నా మాట ఎన్నటికిని తప్పదు," అనగా, ఆ మాటలను విని వారు మూర్ఛితులైరి. మరల వారిని చూచి, శ్రీరాముడు, "నారీమణులారా! నా మాట వినుడు, ద్వాపరయుగమున నేను శ్రీకృష్ణరూపముతో మీకు సుఖక్రీడలను అందించెదను. మీకు– మిత్రవింద, నగ్నజితి, మద్ర, లక్షణ– అని నలుగురికిని నాలుగు పేర్లు కలిగియుండును. మీ అందరితో నాకు వివాహమగును. సందేహములేదు. అప్పుడు నా తోడ వివిధ భోగములనంది వినోదించెదరు," అని చెప్పగా; శ్రీరాముని వచనముచే ఆప్యాయత స్వాంతలయినవారు, "శ్రీరామా! ఇక నీవు ఇట్లే ముందుకుపోయిన మావంటి వారిని చూడగలవ"ని చెప్పిరి. అంత ఆ శ్రీరామచంద్రుడు గుఱ్ఱమును ఎక్కి తిన్నగా వారితో పయనించి, ఒక ఆమడకావల గండకీతీరమున చెట్లను ఆశ్రయించి, నిమీలిత కన్నులు కలిగి, ఎండిన శరీరములతో, తపస్సు చేయుచున్న యౌవనవతులు 16 వేలమందిని చూచెను.

**శ్రీవాల్మీకిమహర్షిచే నూరుకోట్ల శ్లోకములుగారచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలోని పూర్వార్ధములో, ద్విజకన్యావరదానమనే 11వ సర్గ ముగిసినది.**

# ద్వాదశః సర్గః-12వ సర్గ

పదహారువేలమంది కన్యలకు వరదానము.

శ్రీరామదాస ఉవాచ

అథ రామః శనైః సర్వాః స్పృష్ట్వా నిజకరేణ తాః ।
కృత్వా తారుణ్యపూరౌఘపూరితాః ప్రాహ సాదరమ్ ॥ 1

పూర్వవత్సకలం వృత్తం సర్వాః సంశ్రావ్య విస్తరాత్ ।
వరం వరయతాం శీఘ్రమిత్యుక్త్వా చ రఘూత్తమః ॥ 2

హతం తం దుందుభిం శ్రుత్వా హర్షోత్ఫుల్లాననాః స్త్రియః ।
పూర్వవద్విష్ణురూపాణి సహస్రాణి హి షోడశ ॥ 3

సందర్శితాని రామేణ తావంతి చ స్థితాని హి ।
రామరూపాణి తా దృష్ట్వా జ్ఞాత్వా విష్ణుం పరాత్పరమ్ ॥ 4

తం వరాన్వరయామాసుస్త్వన్నో భర్తాం భవ ప్రభో ।
తతో రామముఖాత్శ్రుత్వా చైకపత్నీవ్రతస్థితమ్ ॥ 5

పరస్పరం తాః సంమంత్ర్య ప్రోచుః సర్వా మృగీదృశః ।
మయా వృతస్త్వయా చాయం త్వయా వృతస్తథా మయా ॥ 6

ఏవం తాసు చ సర్వాసు వదంతీషు రఘూత్తమః ।
శ్రుత్వా తద్వచనం శిష్య తదా చిత్తేఽవిచారయత్ ॥ 7

ఇమా వదంతి కిం సర్వా మాం శ్రుత్వాఽపి వ్రతస్థితమ్ ।
బలాత్కారేణ మాం భోక్తుం మంత్రయంతి పరస్పరమ్ ॥ 8

బ్రహ్మరుద్రమఘవాదయః
సురా యే చ సిద్ధమునయః పురాతనాః ।
తేఽపి యోగబలినో విమోహితా
లీలయా తదబలాభిరద్భుతమ్ ॥ 9

యోషితాం నయనతీక్ష్ణసాయకైః
భ్రూలతాసుదృఢచాపనిర్గతైః ।
ధన్వినా మకరకేతునా హతః
కస్య నో పతితో మనోమృగః ॥ **10**

తావదేవ దృఢచిత్తతా నృణాం
తావదేవ గణనా కులస్య చ ।
తావదేవ తపసః ప్రగల్భతా
తావదేవ నియమవ్రతాదయః ॥ **11**

యావదేవ వనితోత్సవాసవైర్న
మాద్యతి ద్రుతమదేన పూరుషః ।
మోహయంతు మదయంతు రాగిణం
యోషితః స్వచరితైర్మనోహరైః ॥ **12**

## శ్రీరాముడు పదహారువేలమంది స్త్రీలకు వరములనిచ్చుట

శ్రీరామదాసు ఇట్లుపలికెను, "పదహారువేలమంది కన్యలను చూచిన శ్రీరామచంద్రస్వామి తిన్నగా తన చేతితో వారినందరిని స్పృశించి, దివ్యసుందర తారుణ్యలీలా గాత్రలనుజేసి, వారికి మునుపటివలెనే తనయొక్క సమస్త వృత్తాంతమును వినిపించి, కావలసిన వరమును వేడుమని ప్రసన్నుడయ్యెను. ఆ కాంతామణులును దుందుభి మృతిచెందెనను మంచి వార్తనువిని అమృతమును త్రావిన వారి వలె సంతోషితులైన ఆ 16,000 మంది కన్యలు, పదహారువేల శ్రీవిష్ణురూపములను ఏకకాలమున దర్శించి, మరల శ్రీ రామరూపములను చూచి విస్మయము చెంది, శ్రీమన్నారాయణ పరబ్రహ్మమే శ్రీరామచంద్రస్వామి యని మదిలోనమ్మి నీవే మా పతివై యుండమని వరమును వేడిరి. శ్రీరాముడు ఏకపత్నీ వ్రతస్థుడను సంగతిని తెలిసి ఆ సుందరాంగనలు తమలో తాము ఒకరికొకరు, "ఇతడు నాచే వరింపబడియుండగా నీ చేతను వరింపబడెనా? నీ వెట్లు వరించితివో నేనూ అట్లే వరించితిని," అని వివాదము పడుచుండిరి.

వినుము విష్ణుదాసా! ఇట్లుండగా శ్రీరామచంద్రుడు తనమనసున ఇట్లు విచారించెను. నన్ను వీరు ఏకపత్నీ వ్రతస్థుడను సంగతిని తెలిసిన వారయినను బలాత్కారముతో నన్ను అనుభవింప వలయునని పరస్పరముగా ఆలోచించుచున్నారు. బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలును, పురాతను

లైన సిద్ధులు, మునులుకూడా వినోదముగా అబలలకు చిక్కి మోహాక్రాంతులై తమ యోగబలమును చెడగొట్టుకొనిరి. ఏమియాశ్చర్యము! స్త్రీలయొక్క కనుబొమ్మలను దృఢములయిన ధనస్సులనుండి వారియొక్క చూపులను పదునైన బాణములను ప్రయోగించునట్టి ధనుర్ధారియైన మన్మథునిచే కొట్టబడిన మనస్సను మృగము ఎవనిదైననేమి ఈ భూమిపై పడకుండా ఉండునా? అంగనలు మనోహరము లయిన తమ చరిత్రచే మోహమును పుట్టింతురు, మదమును పుట్టింతురు.

పురుషుడు ఎంతవరకు వనితావిలాస ఉత్సవము, మద్యపాన ఉత్సవములచే మదము నందకుండనో అంతవరకే- నరులకు దృఢచిత్తమనునది, అంతవరకే సత్కులప్రాశస్త్యము, మరియు తపః ప్రావీణ్యత. వ్రతాది నియమములన్నియు అంతవరకే.

**మోహయంతి మదయంతి మామిమా**
**ధర్మరక్షణపరం హి కైర్గుణైః ।**
**మాంసరక్తమలమూత్రపూరితే**
**యోషితాం వపుషి నిర్గుణేఽశుచౌ ॥ 13**

**కామినస్తు పరికల్ప్య చారు**
**తామారభంతి సువిమూఢచేతసః ।**
**దారుణః పరికీర్తితాఽంగనా**
**సన్నిధిర్విమలబుద్ధివర్తిభిః ॥ 14**

**యావదేవ న సమీపమాగతా**
**స్తావదేవ హి వ్రజామ్యదృశ్యతామ్ ।**
**తర్హి మే వ్రతమిద సునిర్మలం**
**నాన్యథా కథమహం కరోమ్యహమ్ ॥ 15**

**అథవా కిం కరిష్యంతి మామేకదయితాప్రియమ్ ।**
**ఇతి నిశ్చిత్య శ్రీరామస్తత్ర తూష్ణీం స్థిరోఽభవత్ ॥ 16**

**ఏతస్మిన్నంతరే సర్వాస్తాస్తం ప్రోచుర్నృపోత్తమమ్ ।**
**వృతస్త్వం నూనమస్మాభిర్నాత్ర కార్యా విచారణా ॥ 17**

ఏకపత్నీవ్రతం కిం తే పార్థివస్య రఘూత్తమ ।
అస్తి చేత్పూర్ణతాం ప్రాప్తం తత్ఫలం భోక్తుమహర్హసి ॥ 18

ఇత్యుక్త్వా తాస్తదా సర్వా గత్వా తత్సన్నిధిం జవాత్ ।
సవ్యాపసవ్యబంధేన భుజపాశాన్ ప్రచక్రిరే ॥ 19

తద్దృష్ట్వా రాఘవః ప్రాహ శృణుధ్వం వచనం మమ ।
యుష్మాభిరుచ్యతే భద్రమనుకూలం ప్రియం వచః ॥ 20

వ్రతినస్తన్న యోగ్యం మే మా ఖేదం గంతుమర్హథ ।
ఆకర్ణ్య రామవాక్యాని తమూచుస్తాః సమంతతః ॥ 21

సకామధ్వనినోత్కంఠాః కోకిలా ఇవ మాధవే ।
షోడశసహస్రస్త్రియ ఊచుః
ధర్మాదర్థోర్థతః కామః కామాద్ధర్మఫలోదయః ॥ 22

ఇత్యేవ నిశ్చయం శాస్త్రే వర్ణయంతి విపశ్చితః ।
స కామో వ్రతబాహుల్యాత్పురస్తే సముపస్థితః ॥ 23

సేవ్యతాం వివిధైర్భోగైః స్వర్గభూమిరియం తతః ।
శ్రుత్వా తద్వచన తాసాం రామస్తాః ప్రాహ సస్మితః ॥ 24

ధర్మరక్షణ పరాయణుడనైన నన్ను ఈస్త్రీలు ఏగుణములచేత మోహపరచి, మదము పుట్టించుచున్నారు? మల, మూత్ర, మాంస, రక్తపూరితమగు గుణహీనమైన నారీ దేహమునందు కాముకులు, విమూఢభ్రాంతచిత్తులై, మనోహరత్వమును కల్పించుకొని విహరించుచున్నారు. నిర్మలబుద్ధులై వర్తించువారివలన వనితాసాన్నిధ్యము మిక్కిలి దారుణమైనదని భావింపబడుచున్నది గదా? వీరు నా సమీపమునకు వచ్చునంతలోపల నేను అదృశ్యుడనగుదును. అట్లుకాకపోయిన నేనెట్లు ఈ నిర్మలమయిన సువ్రతమును సఫలము చేసికొందును? అటుగాకున్న ఏకవనితా ప్రియుడగు నన్ను వీరేమి చేయగలరు? అని ఇట్లు నిశ్చయించి, శ్రీరాముడు అచ్చటనే స్థిరముగా నిలచెను. అంతలో అందరును శ్రీరాముని జూచి, "నీవు మాచే వరింపబడితివి, ఇది నిశ్చయము. ఇచ్చట కారణము విచారింపవలదు. శ్రీరామా! రాజగు నీకు ఏకపత్నీ వ్రతమనగా ఎట్టిది? దీనివలన ఫలమేమి?

ఒకవేళ ఏకపత్నీవ్రతము కలిగియుండినా అది పూర్ణమయినది. దాని ఫలమును అనుభవించుటకు తగినవాడవై యుందువు," అని మందలించుచు, ఆ మందయానలు త్వరగా ఆ పరబ్రహ్మముయొక్క సన్నిధానమునకు వచ్చి, సవ్యాపసవ్య బంధనక్రమమున తమ భుజపాశములను ప్రయోగించిరి. దానిని చూచి శ్రీరామభద్రుడు, "ఏకపత్నీవ్రతముగల నాకు ఇది తగదు. మీరు దుఃఖింప వలదు. సుఖముగా వెడలండి," అని తెలివి జెప్పెను. అంత ఆ పదహారువేలమంది స్త్రీలును వసంత సమయములోని కోయిలలవలె కామధ్వనితో ఉత్కంఠ చిత్తలై, "స్వామీ! ధర్మమునుండి అర్థము, అర్థమునుండి కామము, కామమువలననే ధర్మఫలోదయము. ఇట్లని శాస్త్రనిర్ణయమును విద్వాంసులు వర్ణించుచున్నారు. ఆ కామము వ్రతబాహుళ్యమువలన నీ ఎదుట ప్రాప్తించినది. అంత ఇదియే స్వర్గభూమిగా ఉన్నది. నానాభోగములచే దీనిని అనుభవింపుము," అని ప్రార్థించిరి.

**వరాన్ దాస్యామి యుష్మాకం నాన్యం శ్రోష్యామి కించన ।**
**ఇత్యుక్తాః పునరూచుస్తాః కిం త్వం వదసి రాఘవ ॥ 25**

**దివ్యౌషధం బ్రహ్మధియో రసాయనం**
**సిద్ధిర్నిధిః సాధుకులా వరాంగనాః ।**
**మంత్రస్తథా హ్యన్నజలే చ ధర్మతో**
**నేమే నిషేధ్యాః సుధియా సమాగతాః ॥ 26**

**కార్యం తు దైవాద్యది సిద్ధిమాగతం**
**తస్మిన్నుపేక్షాం న చ యాంతి నీతిగాః ।**
**యస్మాదుపేక్షా న పునః ఫలప్రదా**
**తస్మాన్న దీర్ఘీకరణం ప్రశస్యతే ॥ 27**

**సాంద్రానురాగాః కులజన్మనిర్మలాః**
**స్నేహార్ద్రచిత్తాః సుగిరః స్వయంవరాః ।**
**కన్యాః సురూపాః పరిపూర్ణయౌవనా**
**ధన్యా లభంతేఽత్ర నరాస్తు నేతరే ॥ 28**

**క్వ వయం భూరిసౌందర్యాః క్వైకపత్నీవ్రతం తవ ।**
**తస్మాదస్మాదిదానీం త్వం మా నిరాకర్తు మహర్షసి ॥ 29**

**గాంధర్వేణ వివాహేన నాన్యథా నోఽస్తు జీవితమ్ ।**
**శ్రుత్వా వాక్యం తు తత్తాసాం రాఘవః ప్రాహ తాః పునః ॥ 30**

**భో మృగాక్ష్యః కథం త్యాజ్యో ధర్మో ధర్మవిచక్షణైః ।**
**ధర్మశ్చార్థశ్చ కామశ్చ మోక్షశ్చైతచ్చతుష్టయమ్ ॥ 31**

**యథోక్తం సఫలం జ్ఞేయం విపరీతం తు నిష్ఫలమ్ ।**
**తస్మాన్మయోక్తం యత్ పూర్వమేకపత్నీవ్రతం నిజమ్ ॥ 32**

ఆ స్త్రీల మాటలకు, రామభద్రుడు నవ్వుచు, "మీకు వరముల నిచ్చెదను, అంతకు మించి మరేదేనిని వినను," అని చెప్పినను, అయ్యంగనలు మరల, "నీ వేమందువు రామచంద్రా! మహౌషధము, బ్రహ్మప్రజ్ఞ, రసాయనము, సిద్ధినిక్షేపము, మంచివిద్య, ఉత్తమవిద్య, మంత్రము, అన్నము, ఉదకము- ఇవి ధర్మముతో వచ్చినట్లయిన వివేకియగువాడు వాటిని విడువరాదు. దైవవశమున సిద్ధించిన కార్యమునందు నీతిమంతులు ఎన్నటికిని ఉపేక్షనందజాలరు. యేయుపేక్షచే మరల ఫలప్రాప్తి కలుగకపోవునో, అట్టి ఉపేక్ష కూడదు. ఉత్తమ వంశమున జన్మించినవారు, పవిత్రమైనవారు, నిండు ప్రేమగల వారును, మెత్తని హృదయము గలవారును, మంచి రూపవంతులును, వాక్చాతుర్యము గలవారును, నిండుప్రాయము గలవారును అగు కన్యకలు తాము కావలసివచ్చినపుడు అట్టివారిని ధన్యాత్ములగు నరులు పొందగలరు. ఇతరులకు శక్యమా? సుందరాంగా! ఈ నీ సౌందర్యమెచ్చటకి? ఈ ఏకపత్నీ వ్రతమెచ్చట? కావున మమ్ము నీవు నిరాకరించకూడదు. గాంధర్వ వివాహము చేతనే మమ్ము కృతార్థులను చేయుము. లేదా మేము బ్రతకము," అని వేడిరి. మందయానల మృదు వచనములను వినిన శ్రీరామచంద్రుడు, "లేడికన్నుల వంటి కన్నులుగల అమ్మాయిలారా! ధర్మాత్ములు ధర్మమునెట్లు త్యజించెదరు? ధర్మ, అర్థ, కామ, మోక్షములను నాలుగు పురుషార్థములును శాస్త్రములలో చెప్పబడినట్లు ప్రవర్తించినచో జీవితము సఫలమగును. లేనిచో నిష్ఫలము. కావున....

**అస్మిన్ జన్మని తన్నాహం త్యక్తుమిచ్ఛామి భోః స్త్రియః ।**
**ఏవం శ్రుత్వాఽఽశయం తస్య తాః సమీక్ష్య పరస్పరమ్ ॥ 33**

**కరాత్కరాన్ ప్రముచ్యాస్య జగురాంఘ్రిం తదాఽబలాః ।**
**అన్యోన్యమంఘ్రిం రామస్య భుజౌ తు జగ్రుహుశ్చ తాః ॥ 34**

**ఏవం తాభిర్వేష్టమానమాత్మానం వీక్ష్య రాఘవః ।**
**అంతర్ధానమగాత్తత్ర తాసాం మధ్యే క్షణాత్ ప్రభుః ॥ 35**

కిం కుర్వంతి త్విమాః సర్వా హ్యంతర్ధానం గతే మయి ।
ఏవం తాసాం కౌతుకం హి గుప్తరూపో దదర్శ సః ॥ 36

అదృష్ట్వా రాఘవం సర్వాస్తాః క్షణాత్ప్రమదోత్తమాః ।
దృష్ట్వా తదద్భుతం కర్మ విస్మయావిష్టమానసాః ॥ 37

విత్రస్తహృదయాః సర్వాః కురంగ్య ఇవ కాతరాః ।
సంభ్రాంతనయనా దీనా ఇత్యూచుస్తాః పరస్పరమ్ ॥ 38

వ్యాప్తం చ హృదం తాసాం తదైవ విరహాగ్నినా ।
జ్వలజ్జ్వాలానలేనైవ సుస్నిగ్ధం సార్ద్రకాననమ్ ॥ 39

త్యజేంద్ర జాలికాం మాయాం కాంత దర్శయ సత్వరమ్ ।
స్వాత్మానం నర్మణా యుక్తం ప్రాగ్గ్రాసే మక్షికాఽపతత్ ॥ 40

హా కష్టం దర్శితః కస్మాద్ధాత్రా కిం రచితం త్విదమ్ ।
జ్ఞాతం మహత్తమం తాపం దాతుం నస్త్వం సమాగతః ॥ 41

కచ్చిత్తే నిర్దయం చేతః కచ్చిదస్మాన్ పరీక్షసి ।
కచ్చిత్ దృష్టోఽసి హే కాంత కచ్చిన్మృష్ణాసి నో మనః ॥ 42

కచ్చిన్నో ప్రత్యయోఽస్మాసు కచ్చిదస్మాసు నో రతిః ।
కచ్చిద్వినోదయసి న కచ్చిన్మాయావిశారదః ॥ 43

నేను మొదటనే చెప్పినట్లు నా యొక్క ఏకపత్నీవ్రతమును ఈ జన్మమున విడువను," అని చెప్పిన శ్రీరాముని వచనమును విని, ఆ స్త్రీలందరును ఒకరిని ఒకరు చూచికొని, ఒకరిచేతినొకరు వదిలి, త్వరగా అందరును ఏకకాలమున శ్రీరామచంద్రుని ఆక్రమించిరి. ఇట్లు వారిచే చుట్టుకొనబడిన తన దేహమును జూచి, రఘునాథుడు వారి నడుమ క్షణమాత్రమున అంతర్ధానమునందెను. "నన్నెరుగక వీరేమి చేయుదురో చూతమని" గుప్తరూపుడై పరికించుచుండెను. (36)

## శ్రీరామవిరహముచే స్త్రీలు విలపించుట

శ్రీరామచంద్రుడు అదృశ్యుడగుటతో ఆ అద్భుతానికి, ఆశ్చర్యపడిన లేడిపిల్లలవలె ఆ స్త్రీలు సంభ్రాంత కన్నులు కలిగి విహ్వల హృదయులై; ప్రజ్వలించు దావాగ్ని కారడవిని పరివేష్టించినట్లు వారి హృదయాలలో విరహాగ్ని వ్యాపించుచుండగా, పరస్పరం ఇట్లు చెప్పుకొనిరి. (39) "మనోహరా!

ఈ ఇంద్రజాలమగు మాయను వదలుము. మొదటి ముద్దలోనే ఈగ పడినట్లు మాకు ఏమి చేటుగల్గె? అయ్యో దైవమా! ఈ కష్టమును ఏమని మాకు కలిగించితివి? ఇట్టిగొప్ప సంకటమును మాకు కలిగింపవచ్చితివని మేమెరుగమే. ఒకవేళ మామీద దయలేదా? మమ్మేమైనా పరీక్షించెదవా ఏమి? కాంతుడా నీకేమైనా కష్టమొచ్చెనా? మా మనసును ఏమైనా అపహరించెదవా? మాయందు నమ్మకములేదా? మాయందు ప్రీతిలేదా? అటుగాకున్న మమ్ములను వినోదపరచెదవా? అటుగాక ఇది నీ మోసపు నేర్పరితనమా?

**కచ్చిచ్చిత్తే ప్రవేష్టుం త్వం వేత్సి విజ్ఞానలాఘవమ్ ।**
**కచ్చిద్వినాపరాధం హి త్వమస్మాసు ప్రకుప్యసి ॥ 44**

**కచ్చిద్దుఃఖం న జానాసి పరేషాం విప్రలంభజమ్ ।**
**త్వద్దర్శనం వినా నూనం హృదయేశ్వర సాంప్రతమ్ ॥ 45**

**న జీవామోఽథ జీవామః పునస్త్వద్దర్శనాశయా ।**
**అస్మాంస్తత్ర నయ త్వం హి యత్ర నాథ గతో హ్యసి ॥ 46**

**సర్వథా దర్శనం దేహి కారుణ్యం భజ సర్వథా ।**
**పర్యంతం న హి పశ్యంతి కస్యచిత్సజ్జనా జనాః ॥ 47**

**ఇత్థం విలప్య తాః సర్వాః ప్రతీక్ష్య చ బహుక్షణమ్ ।**
**రామం ద్రష్టుం వనే సర్వా బభ్రముస్తా ఇతస్తతః ॥ 48**

**వృక్షాన్ వనేచరాన్ రామో దృష్టోఽస్మాకం పతిర్న వా ।**
**ఏవం సర్వాంస్తు పప్రచ్ఛు రామవిశ్లేషసజ్వరాః ॥ 49**

**రే రే పిప్పల వృక్షాణామధిపస్త్వం బ్రవీహి నః ।**
**రామో దృష్టోఽథ వా నైవ వయం త్వాం శరణం గతాః ॥ 50**

**భో భో తులసి నో నాథస్త్వయా రామో నిరీక్షితః ।**
**వద శాఖామృగ త్వం నో వనే రామో నిరీక్షితః ॥ 51**

**త్వం కోకిల సదా శబ్దాన్ కరోషి పరమాన్ శుభాన్ ।**
**వదాద్య జానకీకాంతస్త్వయాఽరణ్యే నిరీక్షితః ॥ 52**

**భో కదంబ వదస్వ త్వం తవ పృచ్ఛామహే వయమ్ ।**
**దీననాథో రమానాథః సీతానాథస్త్వయేక్షితః ॥ 53**

**పిక త్వముత్తరం దేహి సదా శబ్దాన్ కరోషి హి ।**
**పతిర్నః శ్రీపతిః సీతాపతిర్దృష్టోఽథవా న వా ॥ 54**

**భో వారణ మదోన్మత్త నృవారణసమః ప్రభుః ।**
**సప్తద్వీపపతిః శ్రీమాన్ రామోఽరణ్యే నిరీక్షితః ॥ 55**

శ్రీరామా! నీవు మామనసున ప్రవేశించుటకు విజ్ఞానలాఘవము నెరిగెదవా? మాయందు అపరాధము లేకయే కోపగించెదవా ఏమి? పరులయొక్క విరహదుఃఖమును నీ వెఱుగవు కాబోలు? ప్రాణనాథా! ఇపుడు నిన్నుచూడక మేము బ్రతుకనేరము. బ్రతికితిమా మరల నిన్ను చూడవలయునను కుతూహలముచేతనే. నీ వెచ్చటికి పోతివో మమ్మును అచ్చటికి గొనిపొమ్ము. సర్వప్రకారములతోను మాకు దర్శనమిమ్ము. అన్ని విధములతోను దయజెందుము. ఎవనియొక్క కష్టమునైనను సుజనులగువారు చివరవరకు చూడరు కదా? అని ఇట్లు ప్రలాపించుచు, పలుమారు నిరీక్షించి శ్రీరామచంద్రస్వామిని చూచుటకై వనమున అందరు అటునిటు పరిభ్రమించిరి. శ్రీరామ విరహజ్వర విహ్వలితాంగులగు విలాసినులు వృక్షములను, జంతువులను చూచి, "మా పతియగు శ్రీరామచంద్రుని మీరు చూచితిరా," అని మాటలాడించిరి. ఓ అశ్వత్థవృక్షమా! నీవు వృక్షరాజుగానున్నావు నిన్నే మేము శరణుజొచ్చితిమి శ్రీరామచంద్రస్వామిని చూచితివా? లేదా, ఓ తులసీ! ఓయి కోయిలా! నీ వెల్లప్పుడును అరణ్యమున మధురనాదములను ఒనర్చెదవు. ఇపుడు శ్రీజానకీవల్లభస్వామిని చూచితివా? ఏమి, చెప్పుము. ఓ నీపవృక్షమా నిన్నడుగు చున్నాము నీవైనా జెప్పుము. లక్ష్మీనాథుడైనను అనాథనాథుడగు జానకీనాథుని జూచితివా? ఓ నెమలీ! నీవు ఉత్తరమిమ్ము. సంతతము ధ్వనించుచుందువు. నీకు మా మా పతియను సీతాపతి కనుబడెనా? లేదా? మదోన్మత్తుడగు గజరాజా! సప్తద్వీపపతియైన రాజేంద్రుడగు రాఘవేంద్రుని జూచితివా?

**శుక నః కథయాఽద్య త్వం ప్రభుర్దృష్టోఽథ వా న వా ।**
**వద పుణ్యే సరిత్ శ్రేష్ఠే కిం తూష్ణీం సంస్థితాఽధునా ॥ 56**

**నః ప్రభుః సప్తద్వీపానాం ప్రభురత్ర నిరీక్షితః ।**
**భో వాయో కథయాద్య త్వం సీతారామో నిరీక్షితః ॥ 57**

శ్రీరామదాస ఉవాచ

ఏవం తా రామవిశ్లేషసంభ్రాంతాః శుశుచుర్వనే ।
తతస్తా గండకీతీరం గత్వా గీతం ప్రచక్రిరే ॥ **58**

స్త్రియ ఊచుః

కిం ప్రభో త్వయా జానకీ యదా
తేన రక్షాసాఽరణ్యమధ్యతః ।
స్వస్థలం హృతా గౌతమీతటాత్
తత్కృతే త్వయా నైవ శోచిషమ్ ॥**(1)** **59**

త్వద్వియోగతస్తప్తమానసాః
సర్వతో వనే శోకమాగతాః ।
ఏకదా ప్రభో దేహి దర్శనం
దేహి నో వరాన్ మాఽస్తు వై రతిః ॥**(2)** **60**

నో వాంఛామో రాఘవ త్వత్తో రతిమద్య
యద్వద్దత్తం భూసురజాభ్యో వరదానమ్ ।
తద్వన్నస్త్వం పూరయ కామాన్వరదానైః
వాంఛామస్తే సేవనమగ్ర్యే జననేఽపి ॥ **(3)** **61**

అస్మాభిర్యచ్చంచలభావాదపరాద్ధం
తత్సర్వం త్వం మా స్మర పూర్వం కరుణాతః ।
నః ప్రాణాస్తే దర్శనహేతోస్తనుమధ్యే
తిష్ఠంతి త్వాం పదపల్లవయాచ్ఞా క్రియతేఽద్య ॥ **(4)** **62**

భో భో రాఘవ మా రుష్ట త్వం
క్రోధం మా భజ దాసీష్వద్య ।
పర్యంతం న హి పశ్యంతీత్థం
వాంఛామో న హి త్వత్తః కామమ్ ॥ **(5)** **63**

దేహి త్వం నిజదర్శనలాభం
జన్మన్యగ్రేఽర్పయ వరదానమ్ ।
పాహి త్వం శరణం హ్యుపయాతాః
సర్వాస్త్రారయ నః ప్రణమామః ॥ (6) **64**

రామ త్వం కిం నిర్దయహృదయస్త్వసి
నః కిం నాయాత్యద్య స్త్రీజనకరుణా హృదయే తే ।
ఇత్థం క్రోధం త్వత్పదయుగళే పతితాసు
కర్తుం విష్ణో నార్హసి వరదో భవ నోఽద్య ॥ (7) **65**

బాలే దీనే స్త్రీజనవిమలే తనయే స్వే
నో కుర్వన్తీర్థం బహువిమలా మతిమంతః ।
క్రూరం క్రోధం త్వం త్యజ వరదో భవ నోఽద్య
వారం వారం కరకమలైస్త్వాం ప్రణమామః ॥ (8) **66**

హే నాథ రాఘవ రమేశ్వర రావణారే
సీతాపతే రిపునిషూదన కంజనేత్ర ।
త్వం దేహి రామ నిజదర్శనమద్య విష్ణో
దుఃఖార్ణవాత్పరతటం నయ కామినీర్నః ॥ (9) **67**

త్వత్పాదపద్మవరసేవనమర్థయామో
జన్మాంతరే కురు దయాం కరుణాసముద్ర ।
నోచేత్త్వద్య విరహాన్నిజజీవితాని
త్యక్ష్యామ ఏవ నియతం సహసాఽద్య నద్యామ్ ॥ (10) **68**

శ్రీరామదాస ఉవాచ

నారీగీతం రాఘవశ్చాపి శ్రుత్వా
ప్రత్యక్షోఽభూత్కామినీనామథాగ్రే ।
దృష్ట్వా రామం తాః స్త్రియశ్చాతితుష్టాః
ప్రోత్ఫుల్లాస్యాస్తం ప్రణేముః శిరోభిః ॥ (11) **69**

నారీగీతం మానవశ్చాపి శ్రుత్వా
సర్వాన్ కామాన్ ప్రాప్నుయాన్నిశ్చయేన ।
తస్మాదేతత్సర్వదా కీర్తనీయం
శ్లోకార్కీయం ప్రాపతం ఛందచిత్రమ్ ॥ (12) 70

ఓ చిలుకా! నీవిపుడు చెప్పుము, మా ప్రభువును దర్శించితివా? లేదా? ఓయి పవిత్రమగు మహానదీ! నీవిప్పుడేల ఊరకే ఉన్నావు? మా ప్రభువగు సప్తద్వీపాధిపతి కనబడలేదా? ఓయి వాయూ! చెప్పుమిప్పుడు. సీతారామస్వామి నెఱుగవా? ఇట్లు వారందరును శ్రీరామవిరహ విభ్రాంతలై వనమున విలపించుచు అంత గండకీతీరమునకు వెడలి గీతమునారంభించిరి.

## శ్రీరామప్రార్థనారూప నారీగీతము.

శ్రీరామప్రభూ! గౌతమీతీరమునుండి రావణుడు సీతాదేవిని అపహరించి లంకకు గొనిపోయిన సమయమునందు నీవు వ్యసనమునందినవాడవుకావా? మహాప్రభూ! నీ విరహమువలన మేమందరము తప్తహృదయలై, చింతాక్రాంతలై యున్నాము. ఒకసారి మా కన్నులకగుపడి వరములనిమ్ము. మాకు రతివలదు. ఇప్పుడు నీవలన సంగమ సుఖమును కోరము. బ్రాహ్మణస్త్రీలకు ఎట్లు వరముల నిచ్చితివో అట్లే మాకోరికలను పూర్తిజేయుము. రాగల జన్మమునందు మేము నిన్ను సేవింపవలయునని ప్రార్థించెదము. చపలలగు మేము ఈవరకు చాపల్యమువలన చేసిన అపరాధమునంతటిని నీవు దయచే స్మరింపకుము. మా ప్రాణములు నీ దర్శన కాంక్షచేతనే ఈ దేహములయందున్నవి. నిన్ను గురించి మా చే నీ పాదధూళి యాచన చేయబడుచున్నది. స్వామీ! నీ యొక్క దాసీజనులగు మా మీద కోపమునందవలదు. కడవరకు ఇట్లే చూడరుగదా? నీవలన కామసుఖము నిప్పుడు మేము అపేక్షించము. ఇప్పుడు నీదర్శనమిమ్ము. జన్మాంతరమున వరదానమునిమ్ము, కావుము. ప్రభూ! నిన్నే శరణంటిమి, కడతేర్చుము. నమస్కరించుచున్నాము. ఓయి రామా! మా యెడ నీవు దయలేని వాడవయితివేమి? ఇప్పుడు అబలలపై నీకు దయగలుగలేదా? వ్యాపకుడగు పరమాత్మా! నీపాదారవిందములపై పడియుండు మమ్మునేల క్రుద్ధుడవై సంకటపరచెదవు. వరదుడవగుము. మిక్కిలి నిర్మలులగు మతిమంతులు– బిడ్డలయందును, దీనులయందును, ఉత్తమాంగనలయందును, తమ కొడుకులయందును– ఇట్లు వర్తించజాలరు. భయంకరమగు కోపమును వదలుము. వరదుడ వగుము. పలుమార్లు చేతులెత్తి నమస్కరించెదము. హే జగన్నాథా! మన్నాథా! రమానాథా! సీతానాథా! రావణారీ! రాజీవాక్షా! శ్రీరామచంద్రప్రభూ! నీ దర్శనమునిచ్చి దుఃఖసముద్రమునుండి కడదేర్చుము స్వామీ! దయానిధీ నీ చరణారవింద భజనమును మాత్రమే కోరుచున్నాము. జన్మాంతరమునందు

కరుణింపుము. అట్లుగాకున్న మాయీ ప్రాణములను నీ విరహమువలన ఇప్పుడే సాహసించి త్యజించెదము.

అని ఇట్లు గీతముపాడిన భక్తురాండ్రగు స్త్రీలకు శ్రీరామచంద్రస్వామి ఆ క్షణమే ప్రత్యక్షమయ్యె. అంత ఆ కాంతామణులు పరమానంద ముకుంద దివ్యవిగ్రహమును చూచి, విప్పారిన కన్నులు గలవారై, సంతోషముతో తలలు వంచి నమస్కరించిరి. ఈ నారీగీత మనబడు 12 శ్లోకములను వినిన మానవునికి సమస్త కోరికలు తీరును. కావున ఈ ఛందోవిచిత్రమగు గీతము నిత్యము సంకీర్తనీయమై ఉండును. (70)

**అథ రామో దదౌ తాభ్యో వరాంస్తాస్తోషయన్ ప్రభుః ।**
**యూయం శృణుధ్వం భో నార్యః పురా వ్యాసాగ్రతో మయా ॥ 71**

**బహుస్త్రీహేతునా రుక్మమూర్తయః షోడశార్పితాః ।**
**తాసాం దానేన సంతుష్టాస్తే విప్రా మాం తదాఽబ్రువన్ ॥ 72**

**ఫలం సహస్రగుణితం తవాస్తు రఘునందన ।**
**అతస్తత్ఫలతశ్చాహం ద్వాపరే కృష్ణరూపధృక్ ॥ 73**

**కరోమి పాణిగ్రహణం యుష్మాకం ద్వారికాపురి ।**
**యూయం నానానృపాణాం చ భవధ్వం బాలికాస్తదా ॥ 74**

**భౌమాసురస్తదాఽయం వై దుందుభిస్తు భవిష్యతి ।**
**భౌమాసురశ్చ యుష్మాకం పూర్వవత్స హరిష్యతి ॥ 75**

**తదా సర్వా మోచయామి హత్వా తం జగతీసుతమ్ ।**
**తతో మయా సుఖేనైవ క్రీడధ్వం హి యథారుచి ॥ 76**

**ఏవం తా రామవాక్యం తత్ శ్రుత్వా ప్రముదితాననాః ।**
**ఆనందోత్ఫుల్లనయనాః సుఖమాపుర్వరాంగనాః ॥ 77**

**ఏతస్మిన్నంతరే రామం పశ్యంతో లక్ష్మణాదయః ।**
**శనైస్తత్రాయయుస్తత్ర పదాంకితపథా ప్రభుమ్ ॥ 78**

**షోడశస్త్రీసహస్రాణాం మధ్యే దృష్ట్వా రఘూత్తమమ్ ।**
**పరం విస్మయమాపుస్తే ప్రణేముర్జగదీశ్వరమ్ ॥ 79**

శ్రుత్వా రామముఖాత్సర్వం యథావృత్తం సవిస్తరమ్ ।
సర్వే సంతుష్టమనసస్తస్థుః శ్రీరాఘవాగ్రతః ॥ 80

తతో రామాజ్ఞయా దూతాః శతశోఽథ సహస్రశః ।
వాహనాన్యానయామాసుః సేనావాసస్థలాన్ముదా ॥ 80

తేషు తాః స్త్రీః సుసంస్థాప్య వాహనేషు రఘూత్తమః ।
శనైః సేనానివాసే స యయౌ సీతాంతికే ప్రభుః ॥ 81

తతస్తా జానకీం నేముః సీతాం వృత్త రఘూత్తమః ।
యథా వృత్తం తథా సర్వం కథయామాస కౌతుకాత్ ॥ 82

## శ్రీరాముడు నారీమణులకు వరమిచ్చుట

అంత ఆ రామచంద్రస్వామి వారితో, "నారీమణులారా! వినుడు. మునుపు వ్యాసులయెదుట నేను బహుస్త్రీ సుఖాపేక్షచే 16 బంగారు స్త్రీ ప్రతిమలను దానముచేసితిని. అందుచే ఆనందించిన విప్రులు వేయింతలుగా నీకు ఫలము కలుగునని నాకు వరములనిచ్చిరి. అందువలననే నేను ద్వాపర యుగమునందు శ్రీకృష్ణుడుగా అవతరించి మిమ్మును పెండ్లాడెదను. మీరలు అనేకరాజులకు కూతుండ్రుగా పుట్టవలయును. ఈ దుందుభి అప్పుడు భూగర్భమున నరకాసురుడై జన్మించి, ఇప్పటి వలెనే మిమ్మును అపహరించి చేర్చిపెట్టును. అప్పుడు వానిని జంపి మీతో సుఖముగానుందును. మీరును వివాహరించెదరు గాక," అని వరమునిచ్చెను. అంత ఆ కాంతల కన్నులు ఆనందముతోనిండినవి, వారు సుఖమునుపొందిరి. (77)

## శ్రీరాముడు 16,000 మంది స్త్రీలను తన శిబిరమునకు తెచ్చుట

అంతలో అచ్చటికి లక్ష్మణాదులు శ్రీరాముని గుఱ్ఱముయొక్క కాలిగుర్తులను గమనిస్తూ వచ్చిచేరి, పదహారువేలమంది స్త్రీలతో చుట్టబడియున్న శ్రీరాముని దర్శించి, అద్భుత లీలాశ్చర్యమునంది, జగన్నాథ స్వామికి అందరును ప్రణామములు చేసిరి. మరి వారు శ్రీరామ ముఖారవిందమునుండి సమస్త వృత్తాంతమును సవిస్తరముగా విని సంతుష్టస్వాంతులైరి. అంత ఆ రామప్రభువు సేనా నివేశ స్థలమునకు దూతలను పంపి నూర్లకొలదిగా, వేలకొలదిగా వాహనములను తెప్పించి, వాటిపై ఆ కాంతామణులను అందరిని ఎక్కుమని, వారలతోడ సేనానివాసమునందలి శ్రీజానకీదేవియొక్క సన్నిధికి వచ్చెను. ఆ స్త్రీలందరును సీతాదేవికి నమస్కరించిరి. శ్రీరాముడు వినోదముగా సతీమణికి సకల సమాచారములను తెలిపెను.

తతస్తాః పూజయామాస వస్త్రాభరణైరసౌ ।
తతో రామః స కాసారం సేనావాసస్థలాంతికే ॥ 84

దదర్శ సుమహచ్ఛ్రేష్ఠం స్పర్ధయంతమపాం పతిమ్ ।
ఘనపాదపమధ్యస్థం సుతీర్థసలిలంశుభమ్ ॥ 85

విశాలం వికచాంభోజమధుమత్తమధువ్రతమ్ ।
పద్మినీపత్రసంయుక్తం ఛన్నం మరకతైరివ ॥ 86

స్వచ్ఛందముచ్ఛలన్మత్స్యం స్వచ్ఛం సాధుమనో యథా ।
చలజ్జలచరోద్భిన్న వీచిరాజివిరాజితమ్ ॥ 87

అంతర్గ్రాహగణక్రూరం ఖలానామివ మానసమ్ ।
క్వచిచ్ఛైవాలదుర్గమ్యం కృపణస్యేవ మందిరమ్ ॥ 88

నానావిహంగసర్వార్తిం శమయంతం దివానిశమ్ ।
ఉదారమివ సర్వస్వైరాపన్నార్తిహరం మహత్ ॥ 89

తర్పయంతం హిమాంభోమిః శ్వాపదాన్ స్వపితానివ ।
హరంతం సర్వసంతాపం హిమాంశుమివ చాహ్నికమ్ ॥ 90

తం దృష్ట్వాఽభూత్సుసంతుష్టః సీతయా రఘునందనః ।
తత్ర స్నాత్వా సుఖం రామః కృతమాధ్యాహ్నికక్రియః ॥ 91

భుక్త్వా బంధుజనైః సర్వైరాఖేటగణసంవృతః ।
ఉవాస సరసస్తీరే రమ్యాః సంకథయన్కథాః ॥ 92

తతః శరాసనే బాణం కృత్వా రాత్రౌ స్థితాస్తరౌ ।
వ్యాధాః సంధానమాస్థాయ రురుధుః కకుభాం పథః ॥ 93

ఏవం స్థితేషు వీరేషు వనే విస్తార్య వాగురాః ।
నిశార్ధే నిర్గతం యూథం సూకరాణాం సరస్తటే ॥ 94

చరిత్వా సరసీకందాన్ పపాత వ్యాధసంకులే ।
రాజ్ఞా విద్ధాస్తదా క్రోడా వ్యాధైశ్చ బహవో హతాః ॥ 95

**క్షణేనైవ వరాహాస్తే విద్ధాః పేతుర్మహీతలే ।**
**తాన్హత్వా తుములం నాదం చక్రుర్వ్యాధాః సుదర్పితాః ॥ 96**

**ధావంతోఽపి ముదా తత్ర మిలితా యత్ర భూపతిః ।**
**తానాదాయ భటైర్భూపః సేనావాసం యయౌ పునః ॥ 97**

అపుడు జానకమ్మ ఆ పదహారువేలమంది స్త్రీలను వస్త్రాలంకారములచే సత్కరించెను. అప్పుడా సేన బసచేస్తున్న సమీపస్థలం సముద్రమంతటి విశాలముగాను, గంభీరముగాను ఉన్నది. దట్టమైన, ఎత్తైన వృక్షములతో అలరారుతున్నది. నీటి ప్రవాహములచే రమ్యముగా ఉన్నది. వికసించిన పుష్పములు, వానిపై తేనెటీగల సంచారము చూచుటకు ఎంతో మనోహరముగా ఉండెను. తామర తీగలచేతను, ఏనుగులచేత నిండిన సరస్సులు గలవు. ఆ సరస్సులు సత్పురుషుల మనస్సువలె నిర్మలముగా ఉండెను. విహరించు జలచరములచే చేయబడిన తరంగాలు హృదయ మనోహరముగా ఉండెను. దుష్టుల హృదయములవలె సరస్సులో క్రూర మొసళ్ళుగలవు. ఆ సరోవరాలలో లుబ్ధుల వంటి మనస్సువలె నాచుచే నీరు కప్పబడియుండెను. అక్కడి సరస్సులలో రాత్రింబగళ్ళు రకరకాల పక్షులు సంచరించుచుండెను. అక్కడి సరోవరాలు; తన పితరులవలె పులి మొదలగు క్రూర మృగములకు తన నీటిచే సంతృప్తి పరచుచుండెను. అక్కడ చంద్రునివలె సకలజనావళికి ఆహ్లాదాన్ని పంచే గొప్ప మడుగు నొకదానిని శ్రీరామచంద్రస్వామి విలోకించెను. అంత ఆ స్వామి సంతసముతో సతీమణితోడ ఆ సరసులో స్నానముచేసి, మాధ్యాహ్నిక క్రియాదులను ఆచరించి, బంధుజనులతోడ భుజించి, వేటగాండ్రతోడ సరోవర తీరమున కూర్చుని వేడుక కథలను మాటలాడు చుండెను. అంత ఆ రాత్రియందు శ్రీరాముడు ధనుర్బాణములను బట్టి, మహా వృక్షమునెక్కి నిలిచెను. బోయవాండ్రు దిక్ మార్గములను ఆక్రమించిరి. ఇట్లు వీరులందరును వనమున వలలను విసిరి యుండగా మధ్య రాత్రిలో సరోవరతీరమున పందులమంద ఒకటి దుంపలను తింటూ వచ్చి, వలకు చిక్కెను. రాజును, వేటగాండ్రును ఆ వరాహములను వేటాడి, వాటితోడ తమ సేనావాసములకు జేరిరి.

**ఏవం సప్తదినాన్యేవ స్థిత్వా రామో వనే సుఖమ్ ।**
**భుక్త్వా నానావిధాన్ భోగాన్ సీతయా స్వపురీం యయౌ ॥ 98**

**తతో విప్రాన్ నృపాన్ వైశ్యాన్ సమాహూయ రఘూత్తమః ।**
**యా యస్య దుహితా నారీ యా యస్య పుత్రపుత్రికా ॥ 99**

తస్మై తస్మై దదౌ తాం తామేవం సర్వా వ్యసర్జయత్ ।
వస్త్రాలంకారభూషాద్యైః శోభయిత్వా పృథక్ పృథక్ ॥ 100

తే విప్రాద్యాః పునర్జ్ఞాతా మేనిరే నిజబాలికాః ।
తతః స్వం స్వం పురం నీత్వా నృపా వైశ్యాః ప్రభోర్గిరా ॥ 101

నృపపుత్రైర్ వైశ్యపుత్రైః తాసాం చక్రుః సుమంగళమ్ ।
రామప్రసాదాత్తాః ప్రాపుః పతిసంగసుఖం స్త్రియః ॥ 102

తాశ్చాపి ద్విజపుత్ర్యస్తు పితౄణామేవ సద్మసు ।
నిన్యుః స్వీయాయుషం తత్ర వ్రతచర్యాదిభిః సుఖమ్ ॥ 103

వివాహకాలాతిక్రమణాన్న తా ఉద్వాహితా ద్విజైః ।
జన్మాంతరేణ తా సర్వాః కృష్ణ పత్నీః కరిష్యతి ॥ 104

అథ రామః సుబాహోశ్చ పుత్రస్య మధురాం పురీమ్ ।
వివాహార్థం సీతాయా స పౌరైర్జానపదైర్యయౌ ॥ 105

తత్ర వైవాహికం కర్మ సంపాద్య రఘునందనః ।
తస్థౌ తత్ర కియత్కాలం మధురాయాం యథాసుఖమ్ ॥ 107

ఏకదా జానకీవాక్యాత్కాళింద్యాః సైకతే శుభే ।
నిశాయాం హేమపర్యంకే సుఖం సుష్వాప రాఘవః ॥ 108

ఏతస్మిన్నంతరే దాసీర్దాసాన్ దృష్ట్వా వినిద్రితాన్ ।
స్త్రీరూపేణాథ కాళిందీ రామాంఘ్రిం సంస్పృశచ్ఛనైః ॥ 109

ఇట్లు 7 దినములు వినోదముగా మృగయావినోదముచే ఆనందించి, సీతాదేవితో సమస్త భోగములను అనుభవించి, తన రాజధానికి వచ్చెను. (98)

## నారీమణులను వారివారి పుట్టినిండ్లకు పంపుట

పిదప శ్రీరామచంద్రస్వామి బ్రాహ్మణులను, రాజులను, వైశ్యులను వరుసగా అందరిని పిలిపించి, ఆ స్త్రీలందరిని ఎవని కూతురో, ఎవని మనుమరాలో, అట్లు వారివారిని వారివారికి అప్పగించి, అందరిని ఇండ్లకు పంపెను. వస్త్రాలంకార భూషణాదులచే అలంకరింపబడిన తమ బిడ్డలను

మరల కనినట్లు స్వీకరించిన ఆ బ్రాహ్మణాదులు సంతుష్టులయిరి. అంత ఆ రాజులును, వైశ్యులును శ్రీరామాజ్ఞానుసారముగా తమ బిడ్డలను రాజపుత్రులకును, వైశ్యపుత్రులకును ఇచ్చి వివాహములను చేసిరి. ఆ స్త్రీలు రామాజ్ఞచే పతిసంగమ సుఖమునంది ఆనందించిరి. బ్రాహ్మణ కన్యకలు మాత్రము వివాహకాల మతిక్రమించి పోయినందువలననే బ్రాహ్మణవటులచేతను పెండ్లాడబడక, బ్రహ్మచర్య వ్రతాదులతోనే తమ తండ్రులయిండ్లలోనే వసించి, జన్మాంతరమున కృష్ణపత్నులగుదుమని ఆనందించుచు సద్గతినందిరి.

## శ్రీరాముడు కాళిందిచే వరింపబడుట

పిదప ఒకసారి రఘునాథుడు సుబాహువుయొక్క కొడుకు పెండ్లికై మధురాపట్టణమునకు సీతాదేవితో కలసి బయలుదేరెను. వారిని పట్టణప్రజలు, గ్రామణీకులు అనుసరించిరి. మధురాపురిలో వివాహము ముగిసిన పిదప సీతారాములు కొంతకాలము అచ్చటనే వినోదముగా ఉండిరి.

ఒకనాటి రాత్రి కాళిందీ నదీతీరమున ఇసుకనేలపై సీతాదేవి సంతోషముకొరకు బంగారు పట్టెమంచముపై సుఖముగా పవ్వళించియుండెను. ఆ వేళలో 'కాళిందీదేవి' స్త్రీ రూపముతో అచ్చటికి వచ్చి, దాసదాసీ జనులందరును నిద్రించుట చూచి, తిన్నగా శ్రీరాముని పాదపద్మములను తాకెను.

**తతో రామః ప్రబుద్ధోఽభూద్దదర్శ పురతః స్థితామ్ ।**
**సూర్యస్య తనయాం పుణ్యాం కాళిందీం కంజలోచనామ్ ॥ 110**

**దివ్యాలంకారవస్త్రాఢ్యాం దివ్యనూపురగర్జితామ్ ।**
**నీలోత్పలదళశ్యామాం హేమకుంభపయోధరామ్ ॥ 111**

**స్మితాననాం సురంభోరు కింకిణీజాలమాలికామ్ ।**
**కేయూరకుండలాఢ్యాం తాం ప్రోత్తుంగజఘనాం వరామ్ ॥ 112**

**తాం తాదృశీం ప్రభుర్దృష్ట్వా క్షణం తూష్ణీం వ్యచింతయత్ ।**
**ధన్యో విధాతా యేనేయం కాళిందీ రచితా పురా ॥ 113**

**ఇత్యాశ్చర్యమనా భూత్వా తత్సౌందర్య విలోకయత్ ।**
**అథ రామః స తాం ప్రాహ వదాగమనకారణమ్ ॥ 114**

**సా ప్రాహ తం విలజ్జంతీ సర్వం త్వం వేత్సి రాఘవ ।**
**తతో రామోఽబ్రవీద్వాక్యం చైకపత్నీవ్రతం మమ ॥ 115**

ఇహ జన్మని కాళిందీ త్వం యాహి స్వస్థలం జవాత్ ।
యావత్సీతా ప్రబుద్ధా న జాతేయ తావదేవ హి ॥ 116

సా రామవాక్శరేణైవ భిన్నమర్మస్థలా భువి ।
మూర్ఛామవాప తత్రైవ తాం దృష్ట్వా సోఽబ్రవీత్పునః ॥ 117

ఉత్తిష్ఠోత్తిష్ఠ కాళిందీ శృణు త్వం వచనం మమ ।
ద్వాపరే కృష్ణరూపేణ త్వాం కరిష్యామ్యహం స్త్రియమ్ ॥ 118

వివాహేనైవ గచ్ఛాద్య తదా భోక్ష్యసి మత్సుఖమ్ ।
ఇతి శ్రుత్వా రామవాక్యం కించిత్తుష్టమనా నదీ ॥ 119

నత్వా రామం యయౌ తూష్ణీం రామధ్యానపరాఽభవత్ ।
తతో రామోఽపి సైన్యేన సీతయా స్వపురీం యయౌ ॥ 120

ఏవం సాకేతనగరే రామః స్త్రీబంధుదేహజైః ।
చరితాన్యకరోన్నానా పాపఘ్నాని శ్రవాదినా ॥ 121

ఇతి శ్రీమచ్ఛతకోటిరామచరితాంతర్గతే, ఆనందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే రాజ్యకాండే, పూర్వార్ధే, షోడశసహస్రాధిక కాళింద్యాది పంచస్త్రీవరదానం నామ, ద్వాదశస్సర్గః ॥

**రాజ్యకాండ పూర్వార్ధం సమ్పూర్ణమ్ ॥**

అంత ఆ సీతాకాంతుడు ప్రబుద్ధుడై, ఎదుటనుండెడు దివ్యమోహనాంగియును, సుందర సుకుమారగాత్రియును, దివ్యాలంకార వస్త్రాభరణమండితయును, సూర్యపుత్రియును, హసన్ముఖియు అగు కాళిందీదేవిని చూచి, కొంతసేపు ఊరకే చింతించి, ఆహా! ఇట్టి మనోహరాకృతిని సృజించినందుచే బ్రహ్మదేవుడు ధన్యుడని తత్ సౌందర్యమును ఊహించి, ఏమి వచ్చితి? వని ఆమెను విచారించెను. అందుకామె లజ్జావినమ్రముఖియై శృంగార లీలతో, "రామచంద్రా! సర్వజ్ఞుడు గాన అంతటిని నీవే తెలిసియున్నావు." అని విన్నవించెను. అందుకు శ్రీరాముడు, "కాళిందీ! నాకు ఏకపత్నీవ్రతము గలదు. నీవీ జన్మమున స్వస్థలమునకు పొమ్ము. సీత మేల్కొనునంతలో ఇచ్చటినుండి పొమ్ము," అని

నిరాకరించెను. అంత ఆ కాంత శ్రీరాముని వాగ్బాణముచే నొచ్చుకొని మూర్ఛనొందెను. దయానిధియగు రాముడు వెంటనే, “లెమ్ము! లెమ్ము! కాళిందీ! నా మాట వినుము. ద్వాపర యుగములో శ్రీకృష్ణరూపముతో నిన్ను నేను పత్నిగా అంగీకరించెదను. అపుడు నా వలన సుఖించెదవు” అని వరమిచ్చెను. అంత ఆమె శ్రీరామధ్యానపరాయణయై కించిత్సంతుష్టినంది నదీరూపమున లీనమయ్యె. అంత ఆ శ్రీరామచంద్రస్వామి సీతాదేవితో సపరివారుడై అయోధ్యకు వచ్చెను. ఇట్లు శ్రీరాముడు వినినంత మాత్రాననే జనుల కష్టాలను తొలగించునట్టి మనోహర చరిత్రములననేకముగా అయోధ్యలో నుండి యాచరించుచుండెను.

**శ్రీవాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలోని పూర్వార్ధములో, పదహారువేలమంది కన్యలకంటే ఎక్కువగాను, కాళిందీ మొదలగు ఐదుమంది బ్రాహ్మణకన్యలకు వరములనిచ్చే 12వ సర్గ ముగిసినది.**

**రాజ్యకాండలో పూర్వార్ధము ముగిసినది.**
**12వ సర్గ ముగిసినది.**

## రాజ్యకాండములో పూర్వార్ధము ముగిసినది.

## రాజ్యకాండ ఉత్తరార్ధము

| సర్గ | శ్లోకాలు |
|---|---|
| 13 | 137 |
| 14 | 178 |
| 15 | 86 |
| 16 | 101 |
| 17 | 114 |
| 18 | 102 |
| 19 | 141 |
| 20 | 118 |
| 21 | 89 |
| 22 | 101 |
| 23 | 68 |
| 24 | 152 |
| **12 సర్గలు,** | **శ్లోకాలు–1,387** |

## రాజ్యకాండయొక్క సర్గ, శ్లోక వివరములు

| | | |
|---|---|---|
| పూర్వార్ధము | 12 సర్గలు | 1,252 శ్లోకాలు |
| ఉత్తరార్ధము | 12 సర్గలు | 1,387 శ్లోకాలు |
| **మొత్తము** | **24 సర్గలు** | **2,639 శ్లోకాలు** |

# త్రయోదశః సర్గః-13వ సర్గ

హాస్యమోక్షణము

శ్రీరామదాస ఉవాచ

అథైకదా రమాజానిః సహృద్భిః సదసి స్థితః ।
వీజితస్చామరేణైవ లక్ష్మణేనాతిశోభితః ॥ 1

ఏతస్మిన్నంతరే తత్ర పౌరః కశ్చిత్సభాస్థితః ।
వారాంగనానాం నృత్యాది దృష్ట్వా హాస్యం చకార సః ॥ 2

తద్ధాస్యం రాఘవః శ్రుత్వా సస్మార పూర్వచేష్టితమ్ ।
లంకాయాం యుద్ధసమయే రావణస్య శిరాంసి ఖాత్ ॥ 3

రామబాణాన్మృతిం లబ్ధ్వాఽస్మాభిశ్చేతి విహస్య చ ।
శ్రీరామం వందనం కర్తుం పతంతి స్మ ప్రభుం పునః ॥ 4

## శ్రీరామాజ్ఞ ధిక్కరణ మహిమ, హాస్యనిషేధము

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, అంత ఒకానొకసారి శ్రీరామచంద్రస్వామి సమస్త పరివారముతో రాజ సభలో కొలువుదీరి ఉండగా అపుడు లక్ష్మణుడు వింజామరలతో వీయుచుండెను. ఇట్లుండగా ఆ సభలో సుఖముగా కూర్చునియున్న నాగరికుడొకడు నాట్యముచేయుచున్న నర్తకీమణులయొక్క భారమైన స్తనములను జూచుచు నవ్వసాగెను. అది గమనించిన రామభద్రుడు మునుపటి తన వృత్తమును స్మరించెను.

తేషాం విక్రలతాం దృష్ట్వా దంతాదీనాం రఘూత్తమః ।
మామత్తుం హి పునర్యాంతి శిరాంస్యేతాని ఖాదితి ॥ 5

రామో భీత్యా పునస్తాని ఖే శిరాంస్యక్షిపచ్ఛరైః ।
ఏకోత్తరశతాన్యేవ వారం వారం త్వరాన్వితః ॥ 6

తద్వృత్తం రాఘవః స్మృత్వా కిం దశాస్యస్య వై శిరః ।
సమాగతం సభామధ్యేఽత్రేతి పార్శ్వేవ్యలోకయత్ ॥ 7

మాయావినో రాక్షసాశ్చ సంత్యత్రేతి విచింత్య చ ।
ఏవం యదా యదా హాస్యం స శుశ్రావ రఘూత్తమః ॥ 8

తదా తదా పూర్వవృత్తం స్మృత్వా పార్శ్వే వ్యలోకయత్ ।
తతో రామః క్షణం చిత్తే చింతయామాస సాదరమ్ ॥ 9

యదా యదా శ్రూయతేఽత్ర హాస్యం కేనాపి యత్కృతమ్ ।
తదా తదా దశాస్యస్య శిరోహాస్యం స్మరామ్యహమ్ ॥ 10

మాయావినో రాక్షసాస్తే మాం విస్మార్య పునశ్చిరాత్ ।
మామత్తుమత్ర యాస్యంతి త్వితి మత్వా స్వచేతసి ॥ 11

అన్యచ్చ నిందితం హాస్యం నీతిశాస్త్రేషు సర్వదా ।
అతో హాస్యం వర్జయామి సర్వేషాం భూనివాసినామ్ ॥ 12

ఇతి నిశ్చిత్య హృదయే లక్ష్మణం వాక్యమబ్రవీత్ ।
దుందుభిం ఘోషయస్వాద్య పుర్యాం రాష్ట్రేఽవనీతలే ॥ 13

స్మితాననో నరః కశ్చిన్నారీ వాఽథ సుహృచ్చ వా ।
సీతా వా తనయో బంధుః స మే దండ్యో భవేదితి ॥ 14

తథేతి రామవాక్యాత్స ఘోషయామాస దుందుభిమ్ ।
పౌరా జానపదాః సర్వే శ్రుత్వా శిక్షాధ్వనిం ప్రభోః ॥ 15

రామదండభయాత్ సర్వే న చక్రుస్తే స్మితాననమ్ ।
వారాంగనానృత్యగీతే నటగీతప్రవర్తనే ॥ 16

స్త్రీభిః సుహృద్భిర్మిత్రైశ్చ వినోదానుత్సవాన్ వరాన్ ।
మాంగళ్యాని చ కర్మాణి హాస్యకారీణి నాచరన్ ॥ 17

వంశస్తంభకలాభిశ్చ కౌతుకాని హి యాని చ ।
తూర్యఘోషాదిమాంగళ్యకర్మాణి వివిధాః కథాః ॥ 18

సాంవత్సరోత్సవాన్ సర్వాన్ యాత్రాయజ్ఞోత్సవాన్ శుభాన్ ।
కౌతుకానుత్సవాంశ్చైవ వివాహాదిషు కర్మసు ॥ 19

ఆ హాస్యమేమనిన- లంకలో యుద్ధసమయమున రావణాసురునియొక్క తలలు ఆహా! శ్రీరామబాణముచే మాకు సద్బుద్ధికలిగినదని రామపాదారవిందములపైపడి నమస్కరింపవలయునని నవ్వుచూ పైనుండి పడుచుండెను. వాటియొక్క దంతముల కరాళత్వమును జూచి, శ్రీరాముడు నవ్వుచూ ఆకాశమునుండి నన్ను తినవలెనని వచ్చుచున్నది అను భీతిచే బాణములను ప్రయోగించి, పలుమార్లు 101 తలలను పడగొట్టెను- ఆ వృత్తాంతమును స్మరించి, శ్రీరాముడు ఏమి! రావణుని తలలు సభామధ్యమునకు వచ్చినవా? అని యిటు అటు చూచి, లేదే! మోసగాళ్ళగు రాక్షసులు ఈ సభలోనున్నారా? అని యిట్లు ఎప్పుడెప్పుడు ఏ హాస్యమును ఎవరు చేసినను వినినమాత్రమున ఈ రావణ శిరోహాస్యమును స్మరించుచు, దిక్కులను చూచుచు వచ్చి, కడపట, "ఎవరేమి హాస్యముచేసినను నాకిది జ్ఞప్తికిరాకమానదు. ఈ నిమిత్తముచే మాయావులగు రాక్షసులు ప్రవేశించుట కనబడక, ఆకాశమబ్బును మరియు నీతిశాస్త్రమున హాస్యము నిందితము." అని మదిలో చింతించి, లక్ష్మణుని వైపు చూచి, "తమ్ముడా! ఈ నగరములో, దేశమున, ఈ భూమండలమునను, యే మానవుడైనను, యే స్త్రీ యైనను, తుదకు మిత్రుడుగాని, సీతగాని, తమ్ములుగాని ఎవరైననేమి హాస్యమాడిరా తప్పక దండింపబడుదురు. అని దండోరా వేయించి అంతటా నా యాజ్ఞను ప్రకటింపుము," అని ఆజ్ఞాపించెను. అట్లేయని లక్ష్మణుడు అంతట చాటింపుజేసెను.

ఆహా! ఏమిచెప్పవచ్చును. లోకులందరును ప్రభువుయొక్క ఆజ్ఞను విని, రాజదండన భీతిచే ఎవ్వరును నవ్వుముఖమునే చూడకపోయిరి. నట, విట, గాయక వ్యూహాలలోను, వినోద హాస్య మహోత్సవ ప్రక్రియలలోను ఎచ్చటను ఎవరి మోమునను నవ్వునది శూన్యమాయెను. వివాహాది మంగళోత్సవములను, యజ్ఞ దేవతోత్సవాదులను, వినోదవార్తా ప్రసంగ సల్లాపాదులను అంతటిని అందరును మానిరి.

**వార్తాశ్చిత్రకథాశ్చాపి న చక్రుశ్చ కదా జనాః ।**
**యయౌ నావశ్యకాత్కార్యాద్వినా సదసి కః ప్రభుః ॥ 20**

**పురాణనీతిహాసాంశ్చ న పఠంతి స్మ కేచన ।**
**గర్భాధానే పుత్రజన్మనామకర్మాదిషూత్సవాన్ ॥ 21**

**పౌరా జానపదాః సర్వే సప్తద్వీపనివాసినః ।**
**ఏతాని హాస్యకారీణి నానాకర్మాణి భూతలే ॥ 22**

**రహస్యపి న చక్రుస్తే రామదండభయాత్ కదా ।**
**ఏవమాసీద్వర్షమేకం తదా భూమ్యాం కదాపి హి ॥ 23**

స్మితాననం కస్య నాసీన్న చక్రుర్మండనాదికమ్ ।
తదోత్సాహదేవతాశ్చ నానాకర్మాంగదేవతాః ॥ 24

ఇంద్రాయ కథయామాసుస్తద్వృత్తం జగతీభవమ్ ।
ఇంద్రాదీనాం సురాణాం చ కర్మాంగపూజనాది హి ॥ 25

నాసీద్యదా జగత్యాం హి తదేంద్రోఽకథయద్విధిమ్ ।
తదా సురాన్ విధిః ప్రాహ న రామాగ్రే బలం హి నః ॥ 26

నైవోపదేష్టుం యోగ్యాః స మమాపి జనకస్తు యః ।
యుక్త్యా కార్యం సాధయామి యేన వోఽద్య హితం భవేత్ ॥ 27

ఇత్యాశ్వాస్య సురాన్ సర్వాన్ విధిర్భూమండలం యయౌ ।
అయోధ్యాయాశ్చ సీమాయాం దృష్ట్వా వేధాః సుపిప్పలమ్ ॥ 28

స్వయం వివేశ తన్మధ్యే దృష్ట్వా పాంథాన్ జహాస సః ।
ఏతస్మిన్నంతరే కశ్చిత్కాష్ఠభారవహః పుమాన్ ॥ 29

శ్రుత్వాపిప్పలహాస్యం తత్తేన దీర్ఘం జహాస సః ।
తతః స భారవాహశ్చ యయౌ హట్టే ప్రభోః పురీమ్ ॥ 30

కాష్ఠభారవిక్రయార్థం తత్ర స్మృత్వా స్మితం హృది ।
చలపత్రస్య సోఽత్యుచ్చైర్నసమర్థో నిరోధితుమ్ ॥ 31

భారవాహస్య హాస్యం తద్రాజదూతోఽథ శుశ్రువే ।
రాజదూతో జహాసోచ్చైర్న సమర్థో నిరోధితుమ్ ॥ 32

యేదైనా పురాణ, ఇతిహాస శ్రవణ సమయమున ఏమైనా నవ్వువచ్చునో యేమో అని జనులు పురాణ ఇతిహాసాది కార్యక్రమాలకు దూరముగా ఉండిపోయిరి. చిట్టచివరకు గుట్టుగానైనను ఎవరును హాస్యమాడలేకపోయిరి. శ్రీరామాజ్ఞాబలమేమనదగును. ఇట్లొక సంవత్సరము గతించెను. అంత అప్పుడప్పుడు ఎవడును ఒక దేవతా మంటపమును కూడా నిర్మింపలేదు. ఎవ్వరూ ఏమి ఉత్సవాలనే చేయకపోయిరి.

## బ్రహ్మదేవుడు అశ్వత్థములో ప్రవేశించి నవ్వును ఆరంభించుట.

ఎవ్వరి ముఖములోను నవ్వుకానరాకపోయెను. కలలోకూడా నవ్వు దూరమాయెను. అంత కర్మాంగదేవతలును, ఉత్సాహదేవతలును లోకమున కలిగిన వృత్తాంతమును ఇంద్రునికి తెలియజేసిరి. ఇంద్రాది దేవతలకు కర్మాంగపూజలేకపోయినందున అపుడు ఇంద్రుడు బ్రహ్మకు మొరపెట్టెను. అంత ఆ బ్రహ్మ, “సురులారా! మనశక్తులు శ్రీరామపరబ్రహ్మ ఎదుట సాగవు. అతడు నాకు తండ్రిగాన నేనతినికి ఉపదేశించుటకు తగను. కావున మీకందరికిని హితమగునట్లు యుక్తిగా కార్యమును నిర్వహించెదను,” అని సమాధానముజెప్పి, తాను భూమండలమునకు వచ్చి, అయోధ్యా రాజధాని యొక్క పొలిమేరయందు రావిచెట్టును చూచి, దానిలో తాను ప్రవేశించి బాటసారులను నవ్వింప బూనెను.

ఇట్టి అవసరమున ఒకడు వంటచెరుకుల మోపును మోసుకుని ఆ బాటలోవచ్చుచు, ఈ అశ్వత్థ (రావి) వృక్షంనుండి వచ్చు నవ్వును విని, తాను గట్టిగా నవ్వెను. ఇట్లు నవ్వుచునే వంటచెరకుల విక్రయమునకై శ్రీరామస్వామియొక్క పురములోని అంగడివీధిలో ప్రవేశించి, రావియాకుల చలనమును స్మరించి, అట్టహాసమును జేసెను. అంతవానిని రాజభటుడు చూచి, తనకును పట్టరాని నవ్వురాగా ఆపలేక గట్టిగా నవ్వెను.

**రాజదూతః సభాం గత్వా భారవాహస్య యత్ స్మితమ్ ।**
**హృది స్మృత్వా జహాసోచ్చైస్తచ్ఛ్రుత్వా తే సభాసదః ॥ 33**

**సభాయాం జహసుః సర్వే తచ్ఛ్రుత్వా రాఘవోఽపి సః ।**
**ఉచ్చైర్జహాస సదసి వరసింహాసనే స్థితః ॥ 34**

**రామో విచారయామాస కిమర్థం హసితం మయా ।**
**యన్నిమిత్తం సదా దండం పౌరాన్ జానపదాన్నిజాన్ ॥ 35**

**అహం కరోమి సోఽద్యాహం సభాయాం హసితః కథమ్ ।**
**దండయిష్యతి మాం కోఽద్య కిం మాం పౌరా వదంతి హి ॥ 36**

**అస్మాకమేవ శిక్షాఽస్తి సర్వదా రాఘవస్య సా ।**
**స కథం హసితశ్చాద్య సర్వేషాం పురతః స్ఫుటమ్ ॥ 37**

**శిక్షాం కరిష్యతి విభోః కోఽస్య త్వితి వదంతి తే ।**
**మానయిష్యంతి నాతస్తే మమాగ్రే శిక్షితం భువి ॥ 38**

**మమైతన్న వ్రతం యోగ్యమితి రామస్త్వమన్యత ।**
**పునర్జహాస శ్రీరామస్తన్నిరోద్ధుం న స క్షమః ॥ 39**

**తతో రామోఽబ్రవీత్పౌరాన్ సభాస్థాన్స స్మితాననః ।**
**కిమర్థం హసితా యూయం యేభ్యో హాస్యం మమాపి హి ॥ 40**

**సమాగతం సభామధ్యే పౌరాః ప్రోచుర్ నృపోత్తమమ్ ।**
**దృష్ట్వా త్వద్దూతహాస్యం హి తేనాస్మాకం సమాగతమ్ ॥ 41**

**తత్ పౌరవచనం శ్రుత్వా దూతమాహ రఘూత్తమః ।**
**త్వయా కిమర్థం హసితం సోఽబ్రవీద్రఘునందనమ్ ॥ 42**

**భారవాహస్య హాస్యం తత్ స్మృత్వా ప్రహసితం మయా ।**
**తద్దూతవచనం శ్రుత్వా భారవాహహం తదా ప్రభుః ॥ 43**

**దూతైరానీయ సదసి తమాహ రఘునందనః ।**
**మా భీతిం భజ మత్తస్త్వం సత్యం బ్రూహి మమాగ్రతః ॥ 44**

## కట్టెలమోపువాడు నవ్వి లోకులను నవ్వించి గోలయగుట.

ఇట్టి బంట్రోతు సభకువచ్చి అచ్చట కట్టెలవాని నవ్వును స్మరించి గట్టిగా నవ్వెను. అపుడు ఆ సభలో ఉన్నవారందరూ నవ్విరి. సింహాసనాసీనుడైన శ్రీరాముడును అందరి నవ్వును చూచి తాను కూడా నవ్వి, "నేనేల నవ్వితిని? నేను ఎందుకై నగర, గ్రామ ప్రజలను శిక్షించెదనని విధించితినో అట్టి హాస్యమును ఇప్పుడు నేనే చేసితినే, ఇదియెట్లు? ఎవడిప్పుడు నన్నుదండించును? నన్ను పురజనులేమందురు? శ్రీరామునియొక్క శిక్షయంతయును మనలకేకదా? అందరి ఎదుట స్పష్టముగా అతడిప్పుడు అట్లు నవ్వెను? ఎవడీప్రభువునకు శిక్షవేయగలడు? అని వారు చెప్పుచున్నారే; కావున నా ఎదుట శిక్షింపబడినను వారు గౌరవింపరు. ఈ వ్రతము నాకు యోగ్యముకాదు," అని శ్రీరామస్వామి తలంచుచు మరల నిలుపనేరక నవ్వెను మరియు అంత ఆ శ్రీరామచంద్రస్వామి నవ్వుముఖము గలవాడై పౌరులగు సభాసదులను చూచి, "ఎవరినుండి నాకు కూడా నవ్వుకలిగెనో అట్టిమీరు ఏల నవ్వితిరి?" అని అడిగెను. అందుకు వారు, "మీ దూతయొక్క నవ్వును చూచి మేము నవ్వితి"మనిరి.

**హట్టే కిమర్థం హసితం త్వయాఽద్య కథయస్వ మామ్ ।**
**స భారవాహశ్చకితః శుష్కకంఠోష్ఠతాలుకః ॥ 45**

వేపమానః స్ఖలద్వాచా రాఘవం వాక్యమబ్రవీత్ ।
అయోధ్యాయాశ్చ సీమాయామశ్వత్థస్య మయాఽద్య హి ॥ 46

దృష్ట్వా ప్రహసితం రాజన్ హట్టే హాస్యం తథా కృతమ్ ।
తదపూర్వం తద్గిరం స ప్రభుః శ్రుత్వా సువిస్మితః ॥ 47

దూతానువాచ శ్రీరామస్త్వనేన సహ వేగతః ।
యూయం గత్వాఽద్య ద్రష్టవ్యం కిం సత్యం కథ్యతే న వా ॥ 48

అనేన భారవాహేన తే తథేతి త్వరాన్వితాః ।
గత్వాఽశ్వత్థసమీపం హి దదృశుస్తే స్మితం ముహుః ॥ 49

తదాశ్చర్యాచ్చ తే దూతాః ప్రహసంతేఽతివేగతః ।
అశ్వత్థహసితం రామం గత్వా సర్వే న్యవేదయన్ ॥ 50

తద్దూతవచనం శ్రుత్వా రాఘవశ్చాతివిస్మితః ।
రాజ్యే మమైతద్దుశ్చిహ్నం మే శిక్షాం లోప్తుముద్యతమ్ ॥ 51

ఇతి నిశ్చిత్య మనసి దూతాంశ్చాజ్ఞాపయత్తదా ।
ఛిద్యతాం చలపత్రః స మమాజ్ఞాభంగకారకః ॥ 52

తద్రామవచనాదేవ శతశోఽథ సహస్రశః ।
కుఠారపాణయః శీఘ్రమశ్వత్థం దుద్రువుస్తదా ॥ 53

హాస్యమానం నగం దృష్ట్వా తే సర్వేఽతీవ విస్మితాః ।
కుఠారైస్తం తదా ఛేత్తుముద్యతా రాఘవాజ్ఞయా ॥ 54

తాంశ్ఛేత్తుకామాన్ సకలాన్ ప్రాప్తాన్ స్వనికటం విధిః ।
దూతాన్సంతాడయామాసోపలైరశ్వత్థనిర్గతైః ॥ 55

ఉపలైశ్ఛిన్నభిన్నాంగాస్తే దూతా లోహితాంకితాః ।
కోలాహలం ప్రకుర్వంతో రామం వృత్తం న్యవేదయన్ ॥ 56

తతోఽతివిస్మితో రామః పునర్దూతాన్ సహస్రశః ।
ప్రేషయామాస తం ఛేత్తుం ధనుర్బాణాసిధారిణః ॥ 57

అంత ఆ రఘునాథుడు, "నీవేల నవ్వితి" వని బంటునడిగెను. అందుకు వాడు, "కట్టెలమోపువాని నవ్వును తలంచి నవ్వితి" ననెను. అంత ఆ రాజభటులనంపి వానిని పిలిపించి, "ఓరీ, నీవు భయపడకు రా! నా ఎదుట నిజము చెప్పుము. బజారులో ఏల నవ్వితివి ఇప్పుడు చెప్పుము" అని అభయమిచ్చెను. అందుకు వాడు గొంతు ఎండిపోగా, వెరచుచు, నోటతడిలేక తపించుచు, మాటాడనేరక తుదకు, "అయోధ్య యొక్క పొలిమేర లోని అశ్వత్థ వృక్షము యొక్క హాస్యమును చూచివచ్చి అంగడివీధిలో నేను అట్లే నవ్వితిని," అని విన్నవించెను. అంత ఆ రాముడు భటులకు, "వీనితోడపోయి యథార్థమును తెలిసికొని రండని" ఆజ్ఞాపించెను. వారును అట్లే అని వెడలి అశ్వత్థ వృక్షముయొక్క నవ్వును చూచి, ఆ యాశ్చర్యవృత్తాంతమును శ్రీరామసన్నిధికి విన్నవించిరి. అపుడు శ్రీరాముడు తనమదిని, "ఇది ఏమి రాజ్యము నా యొక్క శిక్షను లోపింపజేయునట్టి దుష్టలక్షణము ఒకటి పుట్టినది," అని ఆలోచించి, "నా యొక్క ఆజ్ఞా భంగమునకు కారణమైన కదిలే రావిచెట్టు ఆకు గల అశ్వత్థ(రావి)వృక్షమును కొట్టివేయండి," అని ఆజ్ఞాపించెను. (52)

## శ్రీరాముడు అశ్వత్థమును ఖండించుటకు ఆజ్ఞాపించుట.

అంత వందలకొద్ది పనివారు గొడ్డళ్ళు చేతబూనిన శ్రీరామాజ్ఞను నెరవేర్చుటకు పఱుగెత్తిరి. నవ్వుచున్న రావి(అశ్వత్థ)వృక్షమును చూచి, అందరూ ఆశ్చర్యపడిరి, గొడ్డండ్లతో దానిని నరుకుటకు ప్రయత్నించిరి. అప్పుడు వారినందరిని బ్రహ్మదేవుడు అశ్వత్థవృక్షము నుండి రాళ్ళతో కొట్టెను. ఆ రాళ్ళదెబ్బలకు గాయాలపాలైన దూతలు కోలాహలముతో వచ్చి శ్రీరామసన్నిధికి ఆ సంగతిని విన్నవించిరి.

**తేఽపి గత్వా నగం తేన తాడితా ఉపలైర్దృఢమ్ ।**
**ఛిన్నాంగా రాఘవం వేగాత్ సర్వం వృత్తం న్యవేదయన్ ॥ 58**

**తతో రామోఽతిసంకృద్ధః సుమంత్రం సేనయా యుతమ్ ।**
**ప్రేషయామాస తం వృక్షం ఛేత్తుం బుద్ధిపురస్సరమ్ ॥ 59**

**సుమంత్రో రాఘవం నత్వా సేనయా తం నగం యయౌ ।**
**తావదశ్వత్థపాషాణైరగ్రే గంతుం న స క్షమః ॥ 60**

**తతో రాఘవభీత్యా స శనైః సైన్యేన తత్పురః ।**
**యయౌ తావన్నగోద్భూతైః పాషాణైస్తాడితోఽపతత్ ॥ 61**

సుమంత్రం పతితం దృష్ట్వా హాహాకారో మహానభూత్ ।
అయోధ్యాయాం చ సర్వత్ర తదద్భుతమివాభవత్ ॥ **62**

సుమంత్రం పతితం శ్రుత్వా పుత్రాభ్యాం రఘునందనః ।
సైన్యేన ప్రేషయామాస శత్రుఘ్నం తం నగం పునః ॥ **63**

తతస్తత్కౌతుకం శ్రుత్వా పౌరనార్యః సహస్రశః ।
ప్రాసాదశిఖరారూఢా ఊర్ధ్వాస్యాస్తం వ్యలోకయన్ ॥ **64**

తర్జన్యా దర్శయామాసుః సోఽశ్వత్థశ్చేతి తా మిథః ।
వామహస్తం భ్రువోః స్థాప్య రవిదీప్తీర్న్యవారయన్ ॥ **65**

కుంచితానలకాన్నేత్రపతితాన్ కరపల్లవైః ।
స్త్రియో నివార్య ప్రాసాదగోపురాట్టాలసంస్థితాః ॥ **66**

నిద్రాసంభ్రాంతనయనాశ్చాన్యోన్యం దర్శయన్నగమ్ ।
ఏవం తన్నగరం సర్వం చకితం చాభవత్తదా ॥ **67**

శత్రుఘ్నోఽథ పురాద్యావత్ సైన్యేన నిర్గతో బహిః ।
తావత్తద్రథవాహాశ్చ సంస్థితా ఏవ తే పథి ॥ **68**

తాడితా అపి సూతేన నోత్తస్థుస్తురగోత్తమాః ।
కుశస్యాథ లవస్యాపి రథవాహాస్తథైవ చ ॥ **69**

అపుడు ఎంతో ఆశ్చర్యమునందిన శ్రీరామచంద్రస్వామి మరల వేలకొలదిగా ధనుర్బాణములను, ఖడ్గము చేతబూనిన శూరభటులను చెట్టుకొట్టుటకు పంపెను. వారును వెళ్ళి తీవ్రమైన రాతి దెబ్బలను తిని గాయాలపాలై తిరిగివచ్చి, శ్రీరామసన్నిధికి ఆసంగతిని మొరపెట్టిరి. పిదప శ్రీరాముడు మిగుల క్రుద్ధుడై సైన్యమునిచ్చి సుమంత్రుని ఆ వృక్షమును కత్తిరింప పంపెను. సుమంత్రుడును శ్రీరామాజ్ఞచే ఆ వృక్షమువద్దకు వెళ్ళి అశ్వత్థ వృక్షము నుండి వచ్చు రాళ్ళదెబ్బలుతిని, ముందుకు అడుగిడ లేకపోయినను, రాముని భీతిచే నేరుగా ఆ రావిచెట్టు ఎదుటకు సైన్యముతో చేరెను. అప్పుడా రావిచెట్టు రాళ్ళచే దెబ్బతిని పడిపోయెను.

నేలపై పడిన ఆ అశ్వత్థ వృక్షమును చూచి గొప్ప కోలాహలముపుట్టెను. అయోధ్య అంతటా అది ఒక అద్భుతముగా ఏర్పడెను. శ్రీరాముడు సుమంత్రుని పతనమును విని పుత్రునితో కలసి

సైన్యముతో సహా శత్రుఘ్నుని పంపెను. అంత ఆ కౌతుకమును విని ఊరిలోని స్త్రీలు వేలకొలది మేడలమీద తలలు పైకెత్తి చూచుచుండిరి. అందరును నొసట నెడమచేతులను ఎండకడ్డముపెట్టి, కుడిచేతి జుట్టును వ్రేళ్ళనెత్తిచూపి ఇదిగో ఈ అశ్వత్థమని పరస్పరము చెప్పుచు కన్నులమీద జారుచుండు ముంగురులను కరపల్లవములచే సవరించుచు, సంభ్రాంతనేత్రలై ఆ చెట్టును చూచుచుండిరి. ఇట్లు నగరమంతయును నగభీతిచే అల్లకల్లోలమయ్యె. శత్రుఘ్న, లవ, కుశుల యొక్క రథములు దారిలో పోవుచుండగా విధిమహిమ ఎంతటిదో సారథులందరును అట్లే నిలిచిరి. వారు రథాశ్వములను వెండి, బంగారు దండములుగల కొరడాలతో కొట్టినను నేలగూలిన గుఱ్ఱములు లేచి పరుగెత్తవయ్యె. శ్రీరాముడీసంగతిని విని చింతనందెను.

**తాడితా రుక్మదండైశ్చ నోత్తస్థుః పథి సంస్థితాః ।**
**ఆశ్చర్యేణాథ తద్వృత్తం రాఘవాయ న్యవేదయన్ ॥ 70**

**రామోఽపి శ్రుత్వా చకితస్తదా చిత్తేఽవిచారయత్ ।**
**విచారః కరణీయోఽత్ర హ్యవిచారోఽద్య నోచితః ॥ 71**

**అస్త్యత్ర కారణం కించిత్ ప్రష్టవ్యోఽద్య పురోహితః ।**
**జానన్నపి రమానాథః స్వయం సర్వం తథాపి సః ॥ 72**

**మానుషం భావమాశ్రిత్య పురోహితమథాహ్వయత్ ।**
**సోపి రామాజ్ఞయాం శీఘ్రం తాం సభాం ప్రయయౌ గురుః ॥ 73**

**ప్రత్యుద్గమ్య గురుం రామో దదావాసనముత్తమమ్ ।**
**తతః సంపూజ్య విధివత్ సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 74**

**తచ్ఛ్రుత్వా రాఘవం ప్రాహ వసిష్ఠో మునిసత్తమః ।**
**వాల్మీకిస్త్వద్య ప్రష్టవ్యో యేన తే చరితం కృతమ్ ॥ 75**

**తద్గురోర్వచనం శ్రుత్వా వాల్మీకిం స సమాహ్వయత్ ।**
**సోఽపి రామాజ్ఞయా శీఘ్రం యయౌ శ్రీరాఘవం ప్రతి ॥ 76**

**ప్రత్యుద్గమ్య మునిం రామో దదావాసనముత్తమమ్ ।**
**నత్వా సంపూజ్య విధివత్ సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 77**

**తతో విహస్య వాల్మీకిః ప్రోవాచ రఘునందనమ్ ।**
**సర్వం వేత్సి భవాన్ రామ కిమర్థం మాం తు పృచ్ఛసి ॥ 78**

**త్వం వేత్ పృచ్ఛసి రామాత్ర మానుషం భావమాశ్రితః ।**
**తర్హి తే కథయామ్యద్య శృణుష్వ రఘునందన ॥ 79**

**త్వయాఽత్ర వర్జితం హాస్యం త్వద్భియా సకలైర్జనైః ।**
**హాస్యకారీణి కర్మాణి సంత్యక్తాన్యవనీతలే ॥ 80**

**వివాహాదిసముత్సాహాః కథావార్తాదికౌతుకమ్ ।**
**మంగళోత్సాహగీతాని నృత్యం యజ్ఞాదిసత్క్రియాః ॥ 81**

## శ్రీరాముడు అశ్వత్థవృక్ష మహిమను విచారించుట.

అపుడు శ్రీరాముడు, "ఇచ్చట విచారింపవలసియున్నది. అవిచారప్రవర్తన ఇచట తగదు. ఏదో దీనికి కారణముండును. పురోహితులవారితో విచారింపవలయును," అని ఇట్లు పరిభావించి, సర్వజ్ఞుడగు లక్ష్మీపతి సర్వము ఎఱిగినవాడైనను లీలామానుషత్వమును అవలంబించి, పురోహితుల వారిని పిలిపించెను. వారును త్వరగా సభాసదనమునకు దయచేసిరి. శ్రీరాముడు గురువులవారికి ఎదురుబోయి దివ్యాసనమును అర్పించి, విధివిధానముతో అర్చించి, సమస్తమును విజ్ఞాపించెను. వసిష్ఠులవారు సర్వమును విని, "రామా! నీ చరిత్రను వర్ణించిన శ్రీవాల్మీకిమునిని అడుగవలయును," అని ఆనతిచ్చిరి. శ్రీరామచంద్రుడు అట్లేయని గురువచనానుసారముగా వాల్మీకి మునిని పిలిపించెను. అతడును వేగమేవచ్చెను. శ్రీరాముడు ఆ మహర్షికి ఎదురేగి, నమస్కరించి, ఆసనమర్పించి, సేవలుచేసి, యథాక్రమముగా సత్కరించి, సంగతినంతటిని విజ్ఞాపించెను. అంత ఆ వాల్మీకిముని నవ్వి శ్రీరామభద్రునితో ఇట్లనెను, "శ్రీరఘునందనా! శ్రీరామా! నీవు సర్వజ్ఞుడవు. ఏలనన్నెడగెదవు? ఇదియొక మానుషలీలయని ఇట్లు విచారించెదవు. కానిమ్ము, అట్లయిన జెప్పెదను వినుము. నీవు హాస్యమనుదానిని విడిచితివి. నీ భీతిచే సమస్తలోకులును హాస్యకరములగు కర్మలను వదలిరి. భూమండలమున పెండ్లి మొదలైన వేడుక పనులును, కథలు, సుద్దులు మొదలగు వేడుకలును, శుభకరోత్సాహకరములగు ఆట పాటలును, నృత్యము, యజ్ఞయాగాది సత్క్రియలును,

**యాత్రాః సంవత్సరోత్సాహాస్త్యక్తా ఏవావనీతలే ।**
**యద్యత్కర్మ తోషకారి హాస్యకారి చ తన్నరైః ॥ 82**

ఏకసంవత్సరం నాత్ర క్రియతే రఘునందన ।
ఉత్సాహదేవతాః సర్వాస్తథా కర్మాంగదేవతాః ॥ 83

ఇంద్రాదిలోకపాలాశ్చ దృష్ట్వా స్వీయ ప్రపూజనమ్ ।
లుప్తం భూమ్యాం తతో రామ తద్వృత్తం కథయన్విధిమ్ ॥ 84

తతో విధిశ్చ తచ్ఛ్రుత్వాఽసమర్థస్త్వాం నివేదితుమ్ ।
త్వయి కుంఠితసామర్థ్యః సోఽశ్వత్థే సంప్రవేశితః ॥ 85

హితార్థం నిర్జరాణాం చ సోఽద్య తిష్ఠతి పిప్పలే ।
ప్రక్షిపత్యుపలాన్ రామ ఛేత్తుకామాన్ సమాగతాన్ ॥ 86

తన్మునేర్వచనం శ్రుత్వా రాఘవః క్రోధమాయయౌ ।
అహమేవాద్య గచ్ఛామి సారం పశ్యామి బ్రహ్మణః ॥ 87

కథం నామ రఘుశ్రేష్ఠః స్వశిక్షాం పరివర్తయేత్ ।
ఇత్యుక్త్వాజ్ఞాపయామాస స్వీయాం సేనాం తదా ప్రభుః ॥ 88

తతస్తం బోధయామాస వాల్మీకిర్మునిసత్తమః ।
క్రోధం త్యజ రఘుశ్రేష్ఠ శ్రుణుష్వ వచనం మమ ।
సచ్చిదానందరామస్త్వమానందచరితం తవ ॥ 89

మయాఽస్తి వర్ణితం రామ తత్ కించిత్పుత్రయోర్ముఖాత్ ।
త్వయాఽపి యజ్ఞసమయే శ్రుతం గంగాతటే పురా ॥ 90

యస్య సంశ్రవణాదేవానందరూపో భవేన్నరః ।
హాస్యం వర్జయసి త్వం చేత్తర్హి తే చరిత త్విదమ్ ॥ 91

న జనాః కీర్తయిష్యంతి సుఖరూపం స్మితం వినా ।
అన్యత్ కించిత్ ప్రవక్ష్యామి ప్రభో వృత్తం తవాగ్రతః ॥ 92

శతకోటిమితం తేఽత్ర చరితం యన్మయా కృతమ్ ।
పురా త్వయా వివిక్తం యత్ సర్వత్ర రఘునందన ॥ 93

వినోదప్రయాణములును, సాంవత్సరికోత్సవములును నిలిచిపోయినవి. యేయే సంతసము నిచ్చునట్టి హాస్యకర్మలుగలవో అవన్నియును నిలిచిపోయినవి. ఇట్లొక సంవత్సరము గడువగా ఉత్సాహదేవతలు, కర్మాంగదేవతలు, ఇంద్రాది లోకపాలకులకును భూతలమున జరుగుచుండిన సత్కారములు లోపించినవని బ్రహ్మసన్నిధిలో మొరలిడిరి. అంత ఆ బ్రహ్మ ఈ విషయమును విని, తమరికి చెప్పుటకు అసమర్థుడై ధైర్యములేక ఆ అశ్వత్థమున ప్రవేశించెను. దేవతలకుమేలుచేయ నెంచి ఇప్పుడును రావిచెట్టున ఉన్నాడు. ఆ చెట్టును నరకవచ్చినవారందరిని రాళ్ళచే కొట్టుచున్నాడు." అనిన వాల్మీకిముని వాక్యములను విని, శ్రీరామచంద్రుడు కోపగించి, "ఇప్పుడు నేనే వెడలుదును. బ్రహ్మయొక్క బలమును పరికించెదను. ఎట్లు తానే శ్రీరాముని నిజాజ్ఞను మార్చగలడు?" అని చెప్పి ఆగ్రహముతో రథమును గొనిరమ్మని ఆజ్ఞాపించెను. అపుడు శ్రీవాల్మీకి మునీంద్రుడు ఇట్లు ప్రార్థించెను.

"రఘువీరా! కోపమును మానుము, నామాట ఆలకింపుము. నీవు సచ్చిదానంద స్వరూపుడవు. నీ యొక్క చరిత్రము ఆనందమయము. అది కొంచెము నీ కొడుకుల ముఖమునుండి నాచే వర్ణింపబడినది. మునుపు గంగాతీరమున యజ్ఞవాటికలో దానిని నీవు వింటివి. యే నీ చరిత్రమును ఆశ్రయించుటచేత నరుడు ఆనందస్వరూపుడు అగునో, అట్టి నీ దివ్యచరితమునకు ముఖ్యమైన హాస్యమును ఇట్లు నిరాకరించితే లోకులు దానిని కీర్తించరు. నవ్వులేకపోయినచో ఇక సుఖ స్వరూపమెక్కడిది? వేరొకసంగతిని నీ ఎదుట విన్నవించెదను. నీ చరితమును శతకోటి పరిమితముగా నేను చెప్పినపుడు మునుపు నీవు అంతట దానిని విభజించితివి.(93)

**భాగాద్భారతవర్షాంతర్గతాద్రామాయణాత్ ప్రభో ।**
**సారం సారం ప్రగృహ్యాథ యద్యద్గమ్యం మనోరమమ్ ॥ 94**

**కథానకం తేన తేన వ్యాసేన మునినాఽత్ర హి ।**
**అష్టాదశ పురాణాని తథోపపురాణాని చ ॥ 95**

**కృతాన్యన్యోఽపి మునయః షట్శాస్త్రాదీన్యనేకశః ।**
**అగ్రే సర్వే కరిష్యతి సారం రమ్యం ప్రగృహ్య చ ॥ 96**

**తతోఽగ్రే శోకరూపం చ యత్త్వయా దండకే వనే ।**
**చతుర్దశవత్సరైశ్చ కైకేయీదుష్టభావతః ॥ 97**

**కృతం చరిత్రం సీతాయా విరహాది చ రాఘవ ।**
**తత్ కించిచ్ఛేషభూతం హి చతుర్వింశత్సహస్రకమ్ ॥ 98**

తావన్మాత్రం వదిష్యంతి మద్వాల్మీకేః కృతం త్వితి ।
తత్సర్వం సకలం జ్ఞాత్వా భావి వృత్తం రఘూత్తమ ॥ 99

శోకస్తదుపయోగశ్చ పూర్వమేవ మయేరితః ।
యుద్ధం ప్రభాతే శ్రోతవ్యం శోకశ్చైవాపరాహ్ణకే ॥ 100

రతిర్నిశాయాం శ్రోతవ్యాఽఽనందరామాయణం సదా ।
యుద్ధం జ్ఞేయం భారతం హి రతిర్భాగవతం స్మృతమ్ ॥ 101

శేషభూతం చతుర్వింశత్సహస్రం శోక ఉచ్యతే ।
తవ భావివరేణైతదానందచరితం తవ ॥ 102

శతకోటిమితం పూర్వం యన్మయైవ వినిర్మితమ్ ।
నవకాండమితం రమ్యం యద్ద్వాదశసహస్రకమ్ ॥ 103

నవోత్తరశతం సర్వం క్వచిత్ స్థాస్యతి భూతలే ।
తవ భావివరాద్రామ న కోఽపి ప్యేతాం మనోరమామ్ ॥ 104

అష్టోత్తరశతైః సర్గైర్నిర్మితాం మేరుణాన్వితామ్ ।
తవ కీర్తనమాలాం నో ఖండయిష్యతి భూతలే ॥ 105

నవకాండయుతం రమ్యం దృష్ట్వా త్వత్తుష్టిహేతవే ।
ఏతద్ధి రక్షయిష్యంతి యావచ్చంద్రాదివాకరౌ ॥ 106

యదా తత్ ఖండితం పూర్వం వ్యాసేన మునినా తవ ।
శతకోటిమితం రామచరితం యాన్మయా కృతమ్ ॥ 107

తదాకించిద్దితం దృష్ట్వాఽహం తూష్ణీమేవ సంస్థితః ।
భవిష్యంతి కలౌ మందమతయోఽల్పాయుషో నరాః ॥ 108

## శ్రీమదానందరామాయణమును అభివర్ణించి, వరమును వేడుట.

భారతవర్షాంతమగు భాగమునుండి సారతరములగు మనోహరములయిన కథానకములను సంగ్రహించి 18 పురాణములుగాను, 18 ఉపపురాణములుగాను వేదవ్యాసునిచే రచియింపబడినవి. ఇతరములును ఇకమీద సారవిషయములను గ్రహించి, షట్(ఆరు)శాస్త్రములు మొదలైనవాటిని అనేక

గ్రంథములను రచియించెదరు. అంత ఇక ముందు కైకేయియొక్క దుష్టభావముచే 14 సంవత్సరములలో దండకవనమున జరిగిన సీతావిరహాది ప్రయుక్తమగు నీ చరిత్రమును శ్లోకరూపముగా ఏదిగలదో అది 24 వేల శ్లోకములతో, నాచేత రచింపబడిన శ్రీమద్రామాయణ వర్ణనగా ఉన్నదానిని మాత్రము శ్రీమద్వాల్మీకి కృతమని లోకులు విశ్వసించెదరు. ఇట్లు భవిష్యత్ విషయమునంతటిని నేను దర్శించి, అందుకు యోగ్యమగు శోకచరిత్రమును మునుపే నాచే చెప్పబడెను.

ఈ ఆనందరామాయణమును– యుద్ధసమయమున, ప్రొద్దునపూటను, శోకము కలిగినపుడును, మధ్యాహ్న సమయమునను, రాత్రిపూటను, రతిసమయాన – చదువవలయును. ఆనందరామాయణము ఎల్లప్పుడును పఠనీయము. యుద్ధమనగా భారతము, రతియనగా భాగవతము. మిగిలిన 24 వేల శ్లోక గ్రంథమగు రామాయణము శోకమనబడును. మునుపటి నూరుకోట్ల శ్లోకముల (శతకోటి) వర్ణనమున, ఈ ఆనందరామాయణము 12 వేల శ్లోకముల గ్రంథముగా నాచే నిర్మింపబడినది, 109 సర్గలచే, 9 కాండలుగా గల ఈ ఆనందరామాయణము నీ యొక్క భవిష్యద్వర్ణనముచేత ఆనంద చరిత్ర అనబడి భూమండలమున కొంతకాలము నిలిచియుండును.

**న సమర్థా మమ గ్రంథం త్విమం శ్రోతుం కదాపి హి ।**
**అతో వ్యాసేన మునినా మత్కావ్యం యత్పృథక్ కృతమ్ ॥ 109**

**తత్సమ్యగిత్యహం మత్వా పరాం తుష్టిం గతః ప్రభో ।**
**అతస్త్వాం ప్రార్థయామ్యద్య నవకాండమితం త్విదమ్ ॥ 110**

**ఆనందరామచరితం న విరూపాయ రాఘవ ।**
**వర్జయిష్యసి చేద్ధాస్యం తదా దుఃఖమయం ప్రభో ॥ 111**

**భవిష్యతి శేషవద్ధి చైతచ్చాపి మనోహరమ్ ।**
**అతస్తే కథయామ్యద్య యేన తే శిక్షితం భువి ॥ 112**

**భవిష్యతి మృషా నైవ యేన తుష్టాస్తు దేవతాః ।**
**భవిష్యంతి జనాశ్చాపి సత్యా మత్కవితా భవేత్ ॥ 113**

**జనా హసంతు సర్వత్ర దంతానాం దర్శనం వినా ।**
**అస్యమాచ్ఛాద్య వస్త్రేణ కదా కౌతుకదర్శనాత్ ॥ 114**

**హాస్యం లక్ష్మీసూచకం హి హసితం సౌఖ్యదాయకమ్ ।**
**మాంగళ్యం హసితం చైతద్ధాస్యాచ్ఛ్రేష్ఠం న కించన ॥ 115**

నారీ స్మితాననా యస్మిన్ గేహే తన్మందిరం స్మృతమ్ ।
లక్ష్మ్యాఽపి స్థీయతే తత్ర నిశ్చలం రఘునందన ॥ 116

స ఏవ పురుషో ధన్యో యస్య స్యాచ్చ స్మితాననమ్ ।
స ఏవ పురుషో నింద్యో యస్యాస్యం క్రోధసంయుతమ్ ॥ 117

ప్రమదా నిందితా సాపి యస్యాః క్రోధయుతం ముఖమ్ ।
గర్వాయంత్యతిహాస్యం హి సర్వదా తే మునీశ్వరాః ॥ 118

అతస్త్వాం ప్రార్థయామ్యేతన్మానయ త్వం వచో మమ ।
న కరోతి విధిర్గర్వం త్వాం తాత వేత్తి రాఘవ ॥ 119

ఆనయిష్యామి శరణం తవాహం చతురాననమ్ ।
ఏవం వాల్మీకివచనమంగీకృత్య రఘూత్తమః ॥ 120

ఏవమస్త్వితి తం ప్రాహ మునిం తద్వాక్యగౌరవాత్ ।
తద్రామవచనం శ్రుత్వా వాల్మీకిస్తుష్టమానసః ॥ 121

శిష్యం సంప్రేష్య బ్రహ్మాణమానయామాస పిప్పలాత్ ।
అశ్వాః సర్వే సముత్తస్థుర్యయుస్తే నగరీంప్రతి ॥ 122

శ్రీరామా! నీ వరముచే మేరుపర్వతము వలె 108 సర్గలుగల నీయొక్క కీర్తనమాలచే ఒప్పుచుండు మనోహరమగు ఈ ఆనందరామాయణమును ఎవ్వడును ఖండింపలేడు. ఆ చంద్రార్కముగా తొమ్మిది కాండములతో కూడిన ఈ ఆనందరామాయణమును రక్షించుచుందురుగదా? నేను మునుపు శతకోటి రామచరితమును చెప్పినపుడు వ్యాసుడు ఎప్పుడు ఖండించివేసెనో, అప్పుడు అల్పాయుష్యము గలవారును మందమతులునయిన నరులు కలిలో గల్గుచుందురు. ఈ నాయొక్క గ్రంథమును సమగ్రముగా వారు చూడజాలరు, వినజాలరు. కావున వ్యాసుడు ఖండించినది మిగుల మంచిదైనది," అని సంతసించుచు ఊరకేయుంటిని. దేవా! కావున ఈ తొమ్మిదికాండలుగ వెలియుచుండెడు ఈ ఆనందరామాయణము వ్యర్థముకాకూడదు. ప్రభూ! నీవు హాస్యమును వదిలితివా అప్పుడంతయును దుఃఖస్వరూపమగును. ఈ మనోహర చరిత్రయు మిగిలిన 24 వేల శ్లోకముల గ్రంథమువలె ఏడుపుగా నుండును. కావున నేనిపుడు చెప్పెదను. భూమండలమున నీ యొక్క శిక్షయును వ్యర్థము కాకూడదు. దేవతలును, జనులును మిగుల సంతోషించవలయును. నాయొక్క కవిత సత్యము కావలయును.

అది ఎట్లనిన- లోకులందరును అంతట పళ్ళుకనబడునట్లు నవ్వుచుందురుగాక. ఎప్పుడైనను వేడుకలనుజూచినపుడు, అట్టహాసమువచ్చిన నోటికి వస్త్రమును కప్పినవ్వుదురుగాక. హాస్యమనునది లక్ష్మీసూచకము. సుఖకరమైనది. మంగళప్రదము. ఇంతకన్నను గొప్పది మరియొకటి లేదు.

నగుమోముగల నారీమణియుండెడు ఇల్లే సుందరమందిరమనబడును. రఘునాథా! అచ్చట లక్ష్మికూడా నివాసమందియుండును. ఎవడు నవ్వుముఖముతో ఉండునో ఆ పురుషుడే ధన్యుడు. ఎవనిముఖము కోపమందియుండునో వాడే దూష్యుడగును. ఎవతెముఖము చిటపటలాడుచుండునో ఆమె నిందితురాలైయున్నది. ఎల్లప్పుడును ఆ మునీంద్రులందరును అతిహాస్యమును నిందించు చుందురుగదా? కావున ఓ రామభద్రా! నా వచనములను మన్నింపుము. రామా! బ్రహ్మ గర్వించిన వాడు గాడు. నిన్ను తన తండ్రిగా ఎంచియున్నాడు. నీకు శరణాగతుడగు బ్రహ్మదేవుని పిలుపించె దను స్వామీ! అని వినయముతో విన్నవించిన వాల్మీకి వాక్యములను విని గౌరవముతో అట్లే కానిమ్మని అంగీకరించెను. ఆ అంగీకారమును విని మునీంద్రుడు ఆనందించి (120) శిష్యుని పంపి అశ్వత్థమునుండి బ్రహ్మదేవుని పిలిపించెను.

**యయౌ సైన్యేన శత్రుఘ్నో రామపార్శ్వే స్థితోఽభవత్ ।**
**రామపుత్రౌ సమాయాతౌ పితురగ్రే నిషేదతుః ॥ 123**

**రామాజ్ఞయా భారవాహస్తతో దూతైర్విసర్జితః ।**
**కృతేంద్రేణ సుధావృష్టిః సుమంత్రాద్యాః సుజీవితాః ॥ 124**

**సుమంత్రాద్యా రామదూతాస్తత్క్షణం రాఘవం యయుః ।**
**నత్వా రామం సుమంత్రః స రామపార్శ్వే స్థితోఽభవత్ ॥ 125**

**తతః సురైర్యయావిద్రః శ్రీరామం ప్రణనామ సః ।**
**రామం నత్వాఽబ్రవీద్బ్రహ్మా మయా యదపరాధితమ్ ॥ 126**

**తత్క్షమస్వ రఘుశ్రేష్ఠ త్వత్బాల్యాః సర్వదా వయమ్ ।**
**పురాఽస్మాకం హితార్థం హి త్వయా రామావనీతలే ॥ 127**

**అవతారాశ్చ బహవో ధృతా నో రిపవో హతాః ।**
**శంఖాసురో వేదహర్తా మత్స్యరూపేణ దారితః ॥ 128**

తథాఽస్మాకం సుధాం దాతుం మజ్జంతం మందరాచలమ్ ।
దృష్ట్వా స కూర్మరూపేణ త్వయా పృష్ఠే ధృతో గిరిః ॥ 129

మత్పృథ్వీతి స్పర్ధమానం హిరణ్యాక్షం నిహత్య చ ।
త్వయా వారాహరూపేణ జలాత్పృథ్వీ సముద్ధృతా ॥ 130

ప్రహ్లాదవచనాత్ స్తంభాదావిర్భూయ త్వయా పురా ।
నారసింహస్వరూపేణ హిరణ్యకశిపుర్హతః ॥ 131

తథా రాజ్యం హృతం దృష్ట్వా పురా తు మఘవస్త్వయా ।
బలిర్వామనరూపేణ పాతాళే వినివేశితః ॥ 132

నృపైరధర్మనిరతైర్దృష్ట్వా వ్యాప్తాం భువం పురా ।
త్వయైకవింశద్వారం హి జామదగ్న్యస్వరూపిణా ॥ 133

పితుర్వైరం పురస్కృత్య నిఃక్షత్రీ పృథివీ కృతా ।
దశాస్యకుంభకర్ణౌ తౌ రామరూపేణ రాక్షసౌ ॥ 134

పత్నీవైరం పురస్కృత్య త్వయా దుష్టౌ హతావిహ ।
ఉద్ధారితౌ తౌ స్వగణౌ ద్వివారం దేవశాపతః ॥ 135

ఏకవారం పునస్త్వగ్రే త్వం తావేవోద్ధరిష్యసి ।
తద్బ్రహ్మవచనం శ్రుత్వా వసిష్ఠో మునిసత్తమః ॥ 136

సర్వం జానన్నపి జనాజ్ఞాతుం పప్రచ్ఛ తం విధిమ్ । 137

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, రామహాస్యప్రతిరోధో నామ, త్రయోదశస్సర్గః ॥

## బ్రహ్మదేవుడు అశ్వత్థమునుండి వచ్చి శ్రీరాముని స్తుతించుట.

నేలకూలియున్న గుఱ్ఱములు లేచి పట్టణమును ప్రవేశించెను. సైన్యముతో శత్రుఘ్నుడు వచ్చి శ్రీరామసన్నిధిలో నిలిచెను. కుశలవులు వచ్చి తండ్రిని సేవించుచుండిరి. శ్రీరామాజ్ఞచే కట్టలు కొట్టువాడు దూతలనుండి విడిపింపబడెను. ఇంద్రునిచే అమృతవర్షము కురిపింపబడెను.

సుమంత్రాదులు బ్రతికిరి. సుమంత్రాది రామదూతలు, తక్షుడును శ్రీరామసన్నిధికి వచ్చిరి. సుమంత్రుడు శ్రీరామునికి నమస్కరించి ప్రక్కన కూర్చుండెను.

అంత ఇంద్రాదులు దేవతలతోడవచ్చి శ్రీరామునికి నమస్కరించిరి. బ్రహ్మదేవుడు శ్రీరామచంద్ర స్వామిని జూచి, "స్వామీ! నా అపరాధమును క్షమింపుము. మేమందరము నీచే పాలింపబడ తగినవారము. శ్రీరామా! భూమండలమున మునుపు మాయొక్క హితముకొరకు అనేక అవతారములను అలంకరించితివి. మా శత్రువులు నశించిరి. నీవు మత్స్యరూపమునంది వేదములనపహరించిన శంఖాసురుని సంహరించితివి. అట్లే మాకు అమృతమునిచ్చుటకై మునుగుచుండెడు మందరాచల మునుచూచి నీవు కూర్మరూపమునంది వీపుమీద పర్వతమును ధరించితివి. వరాహరూపము ధరించి, ఈ పుడమి నాదియని అపహరించిన హిరణ్యాక్షుని చంపి భూమిని ఉద్ధరించితివి. ప్రహ్లాదవచనముచే స్తంభమునుండి మునుపు నీవు నరసింహాకృతినంది అవతరించి, హిరణ్యకశిపువును సంహరించితివి. ఇంద్రరాజ్యము బలిచక్రవర్తిచే అపహరింపబడినపుడు వామనుడై అవతరించి బలిని పాతాళమునకు అణగద్రొక్కితివి. అధర్మనిరతులయిన రాజులచే ఈ భూమి నిండియుండగా పరశురామ అవతారముచే 21 మార్లు దుష్టరాజులను దుమ్ముదులిపితివి. రావణ, కుంభకర్ణులను రాక్షసులను స్త్రీవైరముచే నీవే సంహరించి ఆ దుష్టనాశనముచే నీ స్వగుణములను రెండుమార్లు దేవశాపమునుండి ఉద్ధరించితివి. ఒకమారిప్పుడైనది. ఇంకొకమారు వారినే ఉద్ధరించెదవు," అని స్తుతించుచుండు బ్రహ్మవచనములను విని వసిష్ఠముని సర్వము ఎరిగినవాడైనను లోకశిక్షణకై శ్రీరాముని ఇట్లు ప్రశ్నించెను.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, శ్రీరాముని హాస్యనిరోధమును వర్ణించు, 13వ సర్గ ముగిసినది.**

# చతుర్థః సర్గః-14వ సర్గ

వాల్మీకి జననము, మంత్రవర్ణనము

శ్రీరామదాస ఉవాచ

కౌ గణౌ దేవశప్తౌ తౌ కథముద్ధారితౌ వద ।
పురా ద్వివారం రామేణాగ్రే కథం చోద్ధరిష్యతి ॥ 1

తద్వసిష్ఠవచః శ్రుత్వా విధిః ప్రాహ విహస్య తమ్ ।
సర్వం వేత్సి భవాన్ లోకాన్ జ్ఞాపితుం మాం హి పృచ్ఛసి ॥ 2

తదా వదామ్యహం సర్వం గణయోః శాపకారణమ్ ।
ఏకదాఽయం మహావిష్ణుర్వైకుంఠే రమయా రహః ॥ 3

సంస్థితశ్చ తదా ద్వారి విష్ణుం ద్రష్టుం సురోత్తమౌ ।
తావశ్వినీకుమారౌ హి సమాజగ్మతురాదరాత్ ॥ 4

సమాగతౌ దేవవైద్యౌ తౌ దృష్ట్వా ద్వారరక్షకౌ ।
జయవిజయ నామానౌ తయోరగ్రే ప్రజగ్మతుః ॥ 5

తాభ్యాం వైద్యౌ తదా ప్రోక్తౌ విష్ణుస్తిష్ఠతి వై రహః ।
నాయం కాలో దర్శనస్య తచ్ఛ్రుత్వా ప్రోచతుః సురౌ ॥ 6

అధునా ద్రష్టుమిచ్ఛావో విష్ణుం కథయతాం గణౌ ।
ద్వార్యావయోరాగమనం యువాం శృణుత చేరితమ్ ॥ 7

తత్తయోర్వచనం శ్రుత్వా తౌ పునః ప్రోచతుర్గణౌ ।
న గచ్ఛావో మహావిష్ణుమావం లక్ష్మ్యా రహః స్థితమ్ ॥ 8

ఏవం త్రివారం తాభ్యాం తౌ ప్రోక్తౌ నేత్యూచతుర్గణౌ ।
తదాఽశ్వినీకుమారౌ తౌ ప్రోచతుః క్రోధమూర్ఛితౌ ॥ 9

ఆవయోర్వచనం నైవ యువాభ్యాం హి శ్రుతం గణౌ ।
యతస్త్రివారం తస్మాద్ధి యువాం జన్మత్రయం భువి ॥ 10

లభయశ్చ న సందేహస్తచ్ఛ్రుత్వా వచనం తయోః ।
గణావపి తయోః శాపం దదతుర్దేవవైద్యయోః ॥ **11**

వినాపరాధతః శాపో యస్మాద్దత్తస్తు చావయోః ।
ఏకవారం యువాం చాపి జన్మాతశ్చస్తు వై భువి ॥ **12**

ఏవం పరస్పరం శాపం లబ్ధ్వా హాహేతి చుక్రుశుః ।
తదా కోలాహలశ్చాసీదాహ్వాయామాస తాన్ హరిః ॥ **13**

తతస్తత్సకలం వృత్తం ప్రోచుస్తే జగదీశ్వరమ్ ।
చత్వారస్తే మహావిష్ణుం ప్రార్థయామాసురాదరాత్ ॥ **14**

యేన శీఘ్రం విముక్తిః స్యాత్తన్నో వద మహేశ్వర ।
తతః ప్రోవాచ తాన్ విష్ణుర్ముక్తిః శీఘ్రం శుభా౽త్ర హి ॥ **15**

## జయ, విజయుల శాప వృత్తాంతము.

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "దేవశాపమునందిన గణదేవతలెవరు? ఎట్లుద్ధరింపబడిరి, చెప్పుము" అనిన వసిష్ఠుని వచనమును విని బ్రహ్మదేవుడు ఇట్లు చెప్పెను, "మునీంద్రా! నీకంతయు తెలియును. అయినా లోకమునకు వెల్లడిచేయుటకు అడుగుచున్నావు. చెప్పెదను వినుము, ఒకప్పుడు శ్రీరామచంద్ర పరబ్రహ్మమూర్తియై ఉండెడు విష్ణుభట్టారకుడు వైకుంఠమున లక్ష్మీదేవితో ఏకాంతముగా ఉండెను. అప్పుడు వైకుంఠ ద్వారదేశమునకు శ్రీవిష్ణు దర్శనార్థమై అశ్వినీదేవతలు ఇరువురును ప్రీతితో వచ్చిరి. అచ్చట ద్వారపాలకులుగా ఉండిన జయ, విజయులు అను వారు ఇరువురును శ్రీమహావిష్ణు దర్శనమునకు వెళ్ళుచున్న అశ్వినీకుమారులనుజూచి, "ఇప్పుడు స్వామి ఏకాంతముగా ఉన్నారు, మీరు లోపల దర్శించుటకిది సమయము కాదు," అని అడ్డుజేసిరి. అందుకు అశ్వినీదేవతలు, "శ్రీమన్నారాయణస్వామిని మేము ఇపుడే చూడదలచాము. మీరు వెళ్ళి మా రాకను స్వామికి తెలియజేయుడు," అని ఆజ్ఞాపించిరి. అందుకు ఆ జయ, విజయులు, "మేమిచ్చటనుండి పోజాలము, లక్ష్మీనారాయణులు ఏకాంతముగా ఉన్నారు," అని చెప్పిరి, అదేవిధముగా మూడుసార్లు అశ్వినీదేవతల మాటలు జయ, విజయులు వినలేదు. అంత ఆ దేవవైద్యులు కోపముతో, "మా మాటను మీరు ముమ్మాటికిని విననందున మీరిరువురును మూడు సార్లు జన్మముల నెత్తవలయును," అని శపించిరి. అప్పుడా జయ, విజయులును, "మా అపరాధము లేనప్పటికీ మీరు మాకు శాపమిచ్చినందున మీరూ ఒకమారు జన్మనొందుదురుగాక," అని శపించిరి. ఇట్లు పరస్పరము శాపములనంది, హాహాయని ఆక్రోశపడిరి. దానితో అక్కడ పెద్ద కోలాహలము జరుగగా అందరిని విష్ణుమూర్తి పిలిపించెను.

అప్పుడు అశ్వినీ దేవతలు; జయ, విజయులు వీరు నలుగురును సమస్త వృత్తాంతమును స్వామి సన్నిధికి విన్నవించి, "త్వరగా ఈశాపవిముక్తి కలుగునట్లు దయచేయు" మని ప్రార్థించిరి.

మయి భక్త్యా విరోధిన్యా జాయతే నాత్ర సంశయః ।
సప్తజన్మాంతరేణైవ మద్భక్త్యా జాయతే గతిః ॥ 16

యుష్మాకం రోచతే యా సా భక్తిః కార్యాఽవనీతలే ।
తద్విష్ణోర్వచనం శ్రుత్వా తే ప్రోచుర్జగతీశ్వరమ్ ॥ 17

నోఽస్తు భక్త్యా విరోధిన్యా శీఘ్రం తే దర్శనం పునః ।
తథేత్యుక్త్వా రమానాథస్తాన్ సర్వాన్ స వ్యసర్జయత్ ॥ 18

తే జన్మాని తతః ప్రాపుర్జగత్యాం మునిసత్తమ ।
జయో జాతో హిరణ్యాక్షో హిరణ్యకశిపుస్తథా ॥ 19

జాతోఽత్ర విజయః పూర్వం తౌ హతౌ విష్ణునా పురా ।
వారాహరూపిణాఽనేన హిరణ్యాక్షో విదారితః ॥ 20

నారసింహస్వరూపేణ హిరణ్యకశిపుర్హతః ।
తతః పునర్జన్మ తౌ హి ద్వితీయం ప్రాపతుర్భువి ॥ 21

జయో జాతో రావణోఽత్రకుంభకర్ణస్తథాఽపరః ।
జాతో విజయనామా హి రామేణానేన తౌ హతౌ ॥ 22

తావశ్వినీకుమారౌ హి ఏక ఐరావణః స్మృతః ।
మైరావణశ్చ త్వపరం ఏవం తౌ జనితావధః ॥ 23

పాతాళే వరదానాచ్చ రామహస్తాన్మృతిం గతౌ ।
అగ్రే జయః శిశుపాలో భవిష్యతి న సంశయః ॥ 24

విజయో దంతవక్త్రశ్చ భవిష్యత్యవనీతలే ।
ద్వాపరే కృష్ణరూపేణ శిశుపాలం హరిః స్వయమ్ ॥ 25

వధిష్యతి దంతవక్త్రం తథైవ మునిసత్తమ ।
ఏవం జన్మత్రయం శాపాద్భక్త్యా తౌ భగవద్గణౌ ॥ 26

**జయవిజయనామానౌ పూర్వవత్ స్థాస్యతః శుభౌ ।**
**ద్వారదేశేఽస్య వై విష్ణోర్వైకుంఠే దుఃఖవర్జితే ॥ 27**

**తావశ్వినౌ దేవవైద్యౌ పూర్వవద్దివి తౌ స్థితౌ ।**
**ఏవం మునే త్వయా పృష్టం తన్మయా పరివర్ణితమ్ ॥ 28**

వారి ప్రార్థనను విన్న విష్ణుమూర్తి, "మంగళమగు ముక్తి నాపై భక్తివలనను, విరోధమువల్లనూ కలుగును. నాపై భక్తిచే ఏడు జన్మలనెత్తిన తరువాత మళ్ళీ ఇక్కడికి రాగలరు. మీకిది ఇష్టమైనచో భూమిపై భక్తిభావముతో జన్మించుడు," అని అనుగ్రహించెను. ఆమాట వినిన వారు, "స్వామీ! మాకు భక్తివలదు, విరోధముతోనే త్వరగావచ్చి మరల నీదర్శనము నందునట్లు అనుగ్రహింపుము," అని ప్రార్థించిరి. అంతనట్లే కానిమ్మని, విష్ణుమూర్తి వారికి ఆజ్ఞనిచ్చి, అందరిని పంపెను. మునీంద్రా! వారు జన్మములందిరి.

జయుడు హిరణ్యాక్షుడయ్యె, విజయుడు హిరణ్యకశిపుడయ్యె. ఈ రాముడు వరాహావతారముచే హిరణ్యాక్షుని సంహరించె. నారసింహలీలచే హిరణ్యకశిపుని సంహరించె. మరల రెండవ జన్మలో భూమిపై ఆ జయ, విజయులు-రావణ, కుంభకర్ణులుగా అవతరించిరి. ఈ రామభద్రుడే వారిని సంహరించి లోకమును ఉద్ధరించెను.

ఆ అశ్వినీదేవతలు ఐరావణ, మైరావణులుగా పాతాళమున అవతరించి వరదానమువలన నీ రామహస్తమునుండి సంహరింపబడిరి. ఇకమీదట జయుడు శిశుపాలుడనువాడుగా పుట్టును. విజయుడే దంతవక్త్రుడగును. మునీంద్రా! ద్వాపరయుగమున ఈ రాముడే శ్రీకృష్ణుడుగా అవతరించి శిశుపాల, దంతవక్త్రులను సంహరించుచున్నాడు. ఇట్లు శాపముచే భగవంతుని గణదేవతలయిన జయ, విజయులు మూడుసార్లు జన్మదుఃఖమునంది యథాపూర్వముగా దుఃఖములేని వైకుంఠమునందెదరు. అంత ఈ అశ్వినీ దేవతలు మునుపటివలె స్వర్గగతులయిరి. మునీంద్రా! నీ వడిగిన శాపవృత్తాంతమును చెప్పితిని.

**భగవద్గణయోః శాపకారణం చ పురాతనమ్ ।**
**ఏవం రాఘవ చాగ్రే త్వం ద్వాపరే పరమే శుభే ॥ 29**

**జరాసంధాదివీరైశ్చ కంసాద్యైరపి భూతలమ్ ।**
**ఖిన్నం దృష్ట్వాఽత్రావతీర్య కృష్ణరూపేణ లీలయా ॥ 30**

**సర్వాన్హత్వా తోషయుక్తం కరిష్యసి మహీతలమ్ ।**
**తాన్ బౌద్ధాన్బుద్ధరూపేణ కలావగ్రే విజేష్యసి ॥ 31**

వర్ణసంకరమాలక్ష్య కలేరతే రఘూత్తమ ।
కల్కిరూపేణ సకలాన్సంహరిష్యసి లీలయా ॥ 32

ఏవం దశావతారాశ్చ తథాన్యేఽపి సహస్రశః ।
త్వయా హితార్థమస్మాకం ధృతాశ్చాగ్రే ధరిష్యసి ॥ 33

శ్రీరామదాస ఉవాచ

ఏవం స్తువంతం బ్రహ్మాణం సమాలింగ్య రఘూత్తమః ।
సంనివేశ్యాసనే ప్రాహ త్వదర్థం చ మునేర్గిరా ॥ 34

హాస్యమాజ్ఞాపితం కించిజ్జనాః కుర్వంతు తే సుఖమ్ ।
యథా వాల్మీకినా ప్రోక్తం తథా మా విస్తరోస్తు వై ॥ 35

తద్రామవచనం శ్రుత్వా తదా దుష్టః సురాదయః ।
పప్రచ్ఛ చ వాల్మీకిం సభాయాం రఘునందనః ॥ 36

మమావతారతః పూర్వం త్వయా మచ్చరితం కృతమ్ ।
కథం జ్ఞాతం త్వయా పూర్వం కేన త్వాముపదేశితమ్ ॥ 37

పూర్వజన్మని కస్త్వం హి కిం పుణ్యం హి త్వయా కృతమ్ ।
తత్సర్వం విస్తరేణైవ కథయస్వాద్య మాం ప్రతి ॥ 38

తద్రామవచనం శ్రుత్వా వాల్మీకిర్మునిపుంగవః ।
సభాయాం రాఘవం సర్వం వక్తుం సముపచక్రమే ॥ 39

వాల్మీకిరువాచ

సమ్యక్ పృష్టం త్వయా రామ సావధానమనాః శృణు ।
రామ త్వన్నామమహిమా వర్ణ్యతే కేన వా కథమ్ ॥ 40

“రఘునాథా! ముందు నీవు పరమమంగళమగు ద్వాపరయుగమున జరాసంధ, కంసాది వీరులచే భూమండలము కలతనొందుట చూచి, ‘కృష్ణ’ నామముతో లీలామానుష దివ్యావతారము పొంది, దుష్టులనందరిని సంహరించి, ధరణీమండలమును సంతోషపరచెదవు. కలియుగమున ‘బుద్ధ’ రూపముచే బౌద్ధులందరిని జయించెదవు. కలియుగము అంతమున వర్ణసాంకర్యమును చూచి ‘కల్కి’ రూపముచే అందరిని లీలతో సంహరించెదవు. ఇట్లు దశ(పది)అవతారములనే గాక మా

శ్రేయస్సుకై వేలకొలది అవతారములను నీవు ధరించావు. ఇకమీదను అనేక అవతారములను ధరించెదవు.” అని స్తుతించుచుండెను.

శ్రీరాముడు బ్రహ్మదేవుని తన హృదయమునకు హత్తుకుని, పీఠమున కూర్చుండబెట్టి “నీ కొరకై వాల్మీకిమునియొక్క వాక్యగౌరవముచేత కొంచెము హాస్యమును లోకులు చేయునట్లు ఆజ్ఞనిచ్చి అంగీకరించితివి. అయిన వాల్మీకి వచనానుసారముగా విస్తారముకాకూడదు,” అని యనుగ్రహించగా, శ్రీరామవాక్యమును విని దేవతలానందించిరి. (35)

## వాల్మీకిముని మూడుజన్మల వివరములు

అంత ఆ సభయందు శ్రీరాముడు వాల్మీకి మునీంద్రునిజూచి, “మహర్షీ! నా అవతారమునకు మునుపే నీచే నా చరిత్ర రచియింపబడినది. మునుపే దానిని నీ వెట్లు దర్శించితివి? ఎవరిచే నీకు ఉపదేశింపబడినది? నీవు పూర్వజన్మమున ఎవ్వరు? నీవేమి పుణ్యకర్మమును ఆచరించితివి? నాకు ఆ సంగతులన్నిటిని విస్తరించి చెప్పుము,” అని ప్రశ్నించగా, అందుకు వాల్మీకి తన వృత్తాంతమును ఇట్లు చెప్ప బూనెను, “శ్రీరామచంద్రస్వామీ! చక్కగా అడిగితివి. సావధాన మనస్సుతో వినుము. ఏ నీ మహిమచే బ్రహ్మర్షిత్వమును వహించితినో అట్టి నీ నామమహిమను వర్ణింప ఎవరితరము?

**యత్ప్రభావాదహం రామ బ్రహ్మర్షిత్వమవాప్తవాన్ ।**
**శృణు రాఘవ మత్తస్త్వం కథాం మే పూర్వజన్మనః ॥ 41**

**పంపాతీరే ద్విజః కశ్చిశ్ఛంఖో నామ మహాయశాః ।**
**గురోః సిద్ధిం గతశ్చాగాన్నదీం గోదావరీం ప్రతి ॥ 42**

**తీర్త్వా భీమరథీం పుణ్యాం కాంతారే కంటకావిలే ।**
**నిర్జలే విజనే ఘోరే వైశాఖే తాపకర్షితః ॥ 43**

**వనం చోపవివేశాసౌ మధ్యాహ్నసమయే ద్విజః ।**
**తదా కశ్చిద్దురాచారీ వ్యాధశ్చాపశరః శఠః ॥ 44**

**నిర్ఘృణః సర్వభూతేషు కాలాంతక ఇవాపరః ।**
**తం కుండలధరం విప్రం దీక్షితం భాస్కరోపమమ్ ॥ 45**

**ఖడ్గేన భీషయిత్వా తు జగ్రాహ కుండలాదికమ్ ।**
**ఉపానహౌ తచ్ఛత్రం చ వస్త్రాణి చ కమండలుమ్ ॥**
**పశ్చాద్ధిత్వాఽథ తం విప్రం గచ్ఛేత్యాహ స మూఢధీః ॥ 46**

తథా స గచ్ఛన్పథి శర్కరావిలే
సూర్యాంశుతప్తే జనవర్జితే ఖరే ।
సంతప్తపాదస్తృణగోపితే స్థలే
క్వచిచ్చ వస్త్రోపరి సంస్థితోఽభవత్ ॥ 47

స వై ద్రుతం తాపతప్తోఽపి తిష్ఠన్
హాహేతి వాదీ ప్రజగామ విప్రః ।
దృష్ట్వా మునిం తం బహుఖిన్నమానసం
మధ్యం గతే పూష్ణి యదాఽతితీవ్రే ॥ 48

వ్యాధస్య జాతా మతిరీదృశీ వై
తస్మైదదామీతి చ పాదరక్షే ।
స్వీయేన ధర్మేణ తు తస్కరేణ
వనే గృహీతం సకలం చ తన్మే ॥ 49

చౌర్యేణ చ స్వధర్మేణ యద్గృహీత వనాంతరే ।
తదీయమేవ తత్సర్వం వ్యాధానాం ధర్మనిర్ణయః ॥ 50

తస్మాదపానహౌ దాస్యే ముహుర్దుఃఖాపనుత్తయే ।
తేన శ్రేయో భవేద్యచ్చ తద్భవేన్మమ పాపినః ॥ 51

అయిన, నాద్వారానే నా పూర్వజన్మవృత్తాంతమును వినుము. “శంఖుడను సత్కీర్తిగల ఒక బ్రాహ్మణుడు తన గురువువలన సిద్ధిపొందినవాడై గోదావరి నదికి వెడలనెంచి, భీమరథీనదిని దాటి ముండ్లచే నిండినట్టి నీళ్ళులేని, నరులులేని, భయంకరమగు అరణ్యమును ప్రవేశించి, వైశాఖమాసమున ఆ వేడిమిని ఓర్వలేక మధ్యాహ్నమున ఆ వనమున విశ్రాంతికై కూర్చుండెను. అప్పుడు దురాచార పరుడును, శఠుడును, దయాహీనుడును అయిన బోయవాడు ఒకడు సకలభూతములకును కాలాంతకుడై వచ్చి, అచ్చట కూర్చుండియుండెడు సూర్యునివలె వెలుగుచున్నట్టి, కుండలాకృతుడగు బ్రాహ్మణుని జూచి, ఖడ్గము చూపి భయపెట్టి, కుండలాదికమును, పాదరక్షలను, ఛత్రమును, వస్త్రములను, కమండలువును, సర్వమును అపహరించి, ఆ బ్రాహ్మణునిని పొమ్మని ఆ మూఢుడగు కిరాతకుడు ధిక్కరించెను. అట్లే అని ఆ విప్రుడు దారిలోపోవుచు, నిర్మానుషమును, ఘోరమును, ఎండలచే మండునదియు అగు ఇసుకనేలలో కాళ్ళుకాలి కొంత దూరము గడ్డిమీదను, కొన్నిచోట్లలో వస్త్రముమీదను నిలుచుచు, ఆ మండుతున్న ఎండకు హాహాకారముజేయుచు వెడలెను. అప్పుడత్యంత

దుఃఖితుడై మధ్యాహ్నమున మండిపోవుచుండు ఆ శంఖుడను బ్రాహ్మణుని జూచి ఆ బోయవానికి మనస్సు కరిగి, “ఆహా! ఈ బ్రాహ్మణుని సర్వస్వమును నా ధర్మమగు దొంగతనముచే అపహరించితిని. అడవిలో స్వధర్మమగు దొంగతనముచే ఏది సంపాదించినను అది అంతయూ వానిదేయని ధర్మము. కావున ఈ బ్రాహ్మణునికి నేను దుఃఖశాంతి కొరకై పాదరక్షలను దానముగా ఇచ్చెదను. అందువలన కలుగు పుణ్యము ఈ పాపియగు నాకు కలుగును గాక.

జీర్ణా చోపానహావేతౌ హ్యాఖోస్తశ్చ పదోర్మమ ।
న చాభ్యామస్తి మే కార్యం తస్మాత్తస్మై దదామ్యహమ్ ॥ **52**

ఇతి నిశ్చిత్య మనసి తూర్ణం గత్వా దదౌ చ తౌ ।
శర్కరాతప్తపాదాయ ద్విజవర్యాయ సీదతే ॥ **53**

ఉపానహౌ గృహీత్వాఽసౌ నిర్వృత్తిం చ పరాం యయౌ ।
సుఖా భవేతి తం ప్రాహ శంఖస్తం పునరబ్రవీత్ ॥ **54**

పూర్వపుణ్యేన తే జాతా శుభా బుద్ధిర్వనేచర ।
యయా బుద్ధ్యాఽద్య వైశాఖే త్వయా దత్తావుపానహౌ ॥ **55**

ఇతి తద్వచనం శ్రుత్వా శంఖం వ్యాధోఽబ్రవీద్వచః ।
కిం మయాఽఽచరితం పూర్వం తత్సర్వం వక్తుమర్హసి ॥ **56**

శంఖ ఉవాచ

ఆతపో బాధతే ఘోరో నాత్ర చ్ఛాయా న వై జలమ్ ।
తస్మాత్ స్థలాంతరం గత్వా యత్ర ఛాయాంబు వర్తతే ॥ **57**

తత్ర గత్వా జలం పీత్వా సుచ్ఛాయాం చ సమాశ్రితః ।
తతస్తే సుకృతం పూర్వం సవిస్తారం వదామ్యహమ్ ॥ **58**

ఇత్యుక్తో మునినా తేన వ్యాధః ప్రాహ కృతాంజలిః ।
ఇతోఽవిదూరే సలిలం వర్తతే చ సరోవరే ॥ **59**

కపిత్థాస్తత్ర వై సంతి ఫలభారేణ పీడితాః ।
గచ్ఛావస్తత్ర సంతుష్టిర్భవితా నాత్ర సంశయః ॥ **60**

వ్యాధేనైవం సమాదిష్టస్తేన సాక యయౌ మునిః ।
కియద్దూరం తతో గత్వా దదర్శాగ్ర్యం సరోవరమ్ ॥ 61

స్నాత్వా మధ్యాహ్నవేలాయా తస్మిన్సరసి నిర్మలే ।
వాససీ పరిధాయాథ కృత్వా మాధ్యాహ్నికీః క్రియాః ॥ 62

దేవపూజాం తథా కృత్వా ఫలమూలమతంద్రితః ।
వ్యాధోపనీతం సుస్వాదు కపిత్థం శ్రమహారి చ ॥ 63

భుక్త్వా సుఖం జలం పీత్వా సుచ్ఛాయాం చ సమాశ్రితః ।
సుఖోపవిష్టస్తం ప్రాహ పూర్వపుణ్యం వదామి తే ॥ 64

శాకలే నగరే పూర్వం ద్విజస్త్వం వేదపారగః ।
స్తంభో నామ మహాపాపీ తథా శ్రీవత్సగోత్రజః ॥ 65

తవేశా గణికా కాచిత్తదాఽఽసీత్సంగదోషతః ।
త్యక్తనిత్యక్రియో నిత్యం శూద్రవన్మూర్ఖమార్గగః ॥ 66

శూన్యాచారస్య మూఢస్య పరిత్యక్తక్రియస్య చ ।
బ్రాహ్మణీ తే తదాఽన్యాసీద్భార్యా కాంతిమయీ తథా ॥ 67

సా త్వాం పర్యచరత్సుభ్రూః సవేశ్యం బ్రాహ్మణాధమమ్ ।
ఉభయోః క్షాలయంతీ చ పాదౌ త్వత్ప్రియకామ్యయా ॥ 68

మరియు ఈ చెప్పులు పాతవి. వీటివలన నాకేమి ఫలము? నాకాళ్ళకు మంచివి గలవు. ఈ బ్రాహ్మణునికి లేవు, కావున నేను వీటినిచ్చుచున్నాను," అని మదిలో ఆలోచించి త్వరగావెడలి, ఆ శంఖునికి వాని పాత చెప్పులను వానికి ఇచ్చెను. అంత ఆ శంఖుడు వాటిని స్వీకరించి, ఎంతో సంతోషపడి, ఆ వ్యాధుని "సుఖియగు" మని ఆశీర్వదించి, ఇట్లనెను, "ఓయి కిరాత్ముడా! పూర్వజన్మము నందలి పుణ్యబలముచేత నీకిట్టి బుద్ధిపుట్టినది, కావుననే ఈ వైశాఖమాసమున ఇట్టివేళలో చెప్పులనిచ్చితివి." అనిన శంఖవచనమును విని, వ్యాధుడు, "స్వామీ! నేను మునుపేమిజేసితినో సెలవిండు" అని అడిగెను. అందుకు శంఖుడు, ఓరీ! ఎండమెండై మండించుచున్నది చెట్లనీడయును, మంచినీళ్ళును గలచోటు ఎచ్చటగలదో చూపుము. అచ్చటికిబోయి నీరుద్రావి నీడలో విశ్రాంతి నందుచు నీ సంగతిని చెప్పెదను," అనిన అప్పుడు; కిరాతుడు, "మునీంద్రా! ఇచ్చటికి సమీపముననే దివ్యసరోవరము ఒకటి కలదు. అచ్చట వెలగచెట్లు పండి ఫలములను మోయజాల కున్నవి.

అచ్చుటికిపోదము. తప్పక సంతసము కాగలదు," అని చేతులు కట్టి విన్నవించి తిన్నగా ఆ మునిని అచ్చటకు తీసుకొనిపోయెను. అంత ఎదుట కనిపించిన సరోవరమునుజూచి, శంఖుడు ఆ నిర్మల జలమున స్నానముజేసి, బట్టలను ఉతికి మడిగట్టుకుని మాధ్యాహ్నిక నిత్యకర్మను ఆచరించి, దేవతార్చనను ఒనరించెను. అప్పటికి ఆ బోయవాడు తెచ్చియిచ్చిన తియ్యని వెలగపండ్లను కమ్మగా తిని, నీరుద్రావి, నెమ్మదిగా ఒక వృక్షమూలమున నీడలో గూర్చుని, నీ పూర్వపుణ్యమును చెప్పెదను వినుము అని ఇట్లనెను, (68)

**ఉభయోరప్యధః శేతే ఉభయోర్వచనే రతా ।**
**వేశ్యయా వార్యమాణాఽపి హితకార్యే తయోః స్థితా ॥ 69**

**ఏవం శుశ్రూషయంత్యా హి భర్తారం వేశ్యయా సహ ।**
**జగాహ సుమహాన్కాలో దుఃఖితాయా మహీతలే ॥ 70**

**అపరస్మిన్ దినేభర్తా మాహిష్యం మూలకాన్వితమ్ ।**
**అభక్షయత్క్షుద్రకర్మా నిష్పావాంస్తిలమిశ్రితాన్ ॥ 71**

**తమపథ్యమశిత్వా తు వమంశ్చైవ వ్యరోచయత్ ।**
**అపథ్యాద్దారుణో రోగో వ్యజాయత భగందరః ॥ 72**

**స దహ్యమానో రోగేణ దివారాత్రం తు భూరిశః ।**
**యావదాస్తే గృహే విత్తం తావద్వేశ్యా చ సంస్థితా ॥ 73**

**గృహీత్వా సకలం విత్తం పశ్చాన్నోవాస మందిరే ।**
**అన్యస్య పార్శ్వమాసాద్య తస్థౌఘోరాఽతినిర్ఘృణా ॥ 74**

**తతః స దీనవచనో వ్యాధిబాధాసుపీడితః ।**
**ఉక్తవాన్ సురుదన్ భార్యాం రుజా వ్యాకులమానసః ॥ 75**

**పరిపాలయ మాం దేవి వేశ్యాసక్తం సునిష్ఠురమ్ ।**
**న మయోపకృతం కించిత్తవ సుందరి పావని ॥ 76**

**యో భార్యాం ప్రణతాం పాపో నానుమన్యేత మూఢధీః ।**
**స షండో భవతీత్యత్ర దశ జన్మాని సప్త చ ॥ 77**

**దివారాత్రం మహాభాగే నిందితః సాధుభిర్జ్ఞనైః ।**
**పాపయోనిమవాప్స్యామి త్వాం సాధ్వీమవమన్య వై ॥ 78**

**అహం క్రోధేన దగ్ధోఽస్మి సదా నిష్ఠురభాషణః ।**
**ఏవం బ్రువాణం భర్తారం కృతాంజలిపుటాఽబ్రవీత్ ॥ 79**

**న దైన్యం భవతా కార్యం న వ్రీడా కాంత మాం ప్రతి ।**
**న చాపి త్వయి మే క్రోధో వర్తతే సుమనాగపి ॥ 80**

## వ్యాధుని పూర్వజన్మవృత్తాంతము

పూర్వజన్మమున నీవు శాకలనగరమున శ్రీవత్సగోత్రమునందు శంఖుడను వేదజ్ఞుడగు బ్రాహ్మణుడవై, మహాపాపివై యుంటివి. దుస్సాంగత్యదోషము వలన నీకు ప్రియురాలైన వేశ్య ఒకతె ఉండె. దానితో గలసిమెలసి, సమస్తకర్మలనువదలి భ్రష్టాచారుడవై, పరమమూఢునిగా ఉండెడు నీకు; కాంతిమతి అను సుగుణవతియగు బ్రాహ్మణస్త్రీ ఒకతె యిల్లాలైయుండె. ఆ సతి ఈ వ్యభిచారిణి తోడ భ్రష్టబ్రాహ్మణుడవగు నిన్ను సేవించుచు, నీ ప్రీతికొరకై మీ ఇరువురి కాళ్ళను కడుగుచు, మీ మాటలను అనుసరించి నడుచుచు, మీ కాళ్ళక్రింద శయనించుచు ఆ వేశ్యపడుచు వలదనినను వదలక మీ సేవజేయుచుండెను. దుఃఖించునట్టి ఆ గృహిణికిని ఇట్లే బహుకాలము మీ సేవలోనే గడచినది. క్షుద్రుడగు అతడు ఒకనాడు ముల్లంగి దుంపలతో బట్టి పెరుగును, నువ్వులతోడ అనుములను తెగ తినెను. అంత ఆ అపథ్యసేవనచేత వాంతులు విరేచనములు కలిగి, కొంతకాలమునకు భగందర రోగము సంభవించినది. ఆ రోగముచే ఎల్లప్పుడు తీపులు తీసికొనుచు తపించుచుండెను. ఇంటిలోగల సామానులన్నీ ఆ వేశ్యకు స్వాధీనమైయుండె. ఆ వెలయాలు వాటినన్నిటిని అపహరించి, పొరుగింటికి జని అచ్చట మరియొకనితోడ రమించుచు ఉండసాగెను. ఈ భ్రష్టుడు అపుడు నిష్కరుణయును భయంకరియునయిన ఆ వేశ్యనుజూచి, తలంపుగూలి, వ్యాధిబాధచే సంబాధితుడై, లబోదిబోమని ఏడ్చుచు, "నిర్దోషురాలగు ఓ సతీమణీ! మహాపాపియగు నేను నీకు ఇసుమంతయు ఉపకారము చేసినవాడను కాను, అట్టి వేశ్యాసక్తుడనగు, నిష్ఠురుడనగు నన్ను నీవు పరిరక్షింపుము.

**పురా కృతాని పాపాని దుఃఖాని హి భవంతి హి ।**
**తాని యః క్షమతే సాధ్వీపురుషో వా స ఉత్తమః ॥ 81**

**యన్మయా పాపయా పాపం కృతం వై పూర్వజన్మని ।**
**తద్భుంజంత్యా న మే దుఃఖం న విషాదః కథంచన ॥ 82**

**ఇత్యేవముక్త్వా భర్తారం సా సుభ్రూరన్వపాలయత్ ।**
**ఆనీయ జనకాద్విత్తం బంధుభ్యో వరవర్ణినీ ॥ 83**

క్షీరోదవాసినం విష్ణు భర్తుర్దేహే వ్యచింతయత్ ।
శోధయంతీ దివారాత్రౌ పురీషం మూత్రమేవ చ ॥ **84**

నఖేన కర్షతీ భర్తుః కృమీందేహాచ్ఛనైః శనైః ।
న సా స్వపితి రాత్రౌ తు దివా వా వరవర్ణినీ ॥ **85**

భర్తుర్దుఃఖేన సంతప్తా దుఃఖితేదమథాబ్రవీత్ ।
దేవాశ్చ పాంతు భర్తారం పితరో యే చ విశ్రుతాః ॥ **86**

కుర్వంతు రోగహీనం మే భర్తారం హతకల్మషమ్ ।
చండికాయై ప్రదాస్యామి రక్తం మాంసం ముఖోద్భవమ్ ॥ **87**

సుష్ట్వన్నం మహిషోపేతం భర్తురారోగ్యహేతవే ।
మోదకానపి దాస్యామి విఘ్నేశాయ మహాత్మనే ॥ **88**

మందవారే కరిష్యామి సదైవాహముపోషణమ్ ।
నోపభోక్ష్యామి మధురం నోపభోక్ష్యామి వై ఘృతమ్ ॥ **89**

ప్రణతయగు ప్రేయసీమణినెవ్వడు; పాపాత్ముడు, మూఢుడై ధిక్కరించునో వాడు 17 జన్మలు నపుంసకుడై నశించునని గలదు. పగలు, రాత్రి సత్పురుషులచే నేను నిందితుడైతిని. నిన్ను అవమతి జేసి నేను దుష్ట యోనులలో జన్మించెదను. నేను క్రూరవాక్కులను వచించుచు క్రోధముచే దహింప బడితిని." అని వగచుచుండెడు పతినిజూచి పతివ్రతయగు కాంతిమయి చేతులు ముకుళించి, "నీవేల దీనుడగుదువు? నాకై సిగ్గుపడవలదు. ఇసుమంతైనను నీ మీద నాకు క్రోధములేదు. వారివారి పూర్వజన్మ కర్మఫలములను వారువారు అనుభవించెదరు. పురుషుడైనను, స్త్రీయైనను కలిగిన కర్మఫల కష్టములను సహించుటయే ఉత్తమము. నేను జన్మాంతరమున చేసిన పాపమునకు తగిన ఫలము ఇప్పుడనుభవించి దుఃఖించెదనని దృఢనిశ్చయము గలదుగాన, చింతగాని దుఃఖముగాని నీ విషయమై నాకు కలుగలేదు." అని సమాధానోక్తులచే ఓదార్చుచు, పుట్టినింటినుండి, చుట్టరికము వారినుండి తెచ్చిన ద్రవ్యములతో పతికి సేవజేయుచు, క్షీరసాగరనిలయుడయిన శ్రీమన్నారాయణుని ఆ పతియందు పరిభావించుచు, అతని మలమూత్రములను చక్కగా కడిగి, అతని దుర్గంధపు పుండులోని పురుగులను గోళ్ళతో, వ్రేళ్ళతో, పుల్లలతో తిన్నగా తీసి, శుద్ధిజేయుచు పగలు రాత్రి నిద్ర నెరుగక సేవించుచు, పతి దుఃఖములచే పరితపించుచుండెను, మరియు ఆ పతిని దేవతలు బ్రోచుచుందురుగాక! నిష్పాపు డగు నా పతిని రోగహీనునిజేసి పితృదేవతలు రక్షించెదరుగాక! నా మగడు బాగైతే చండికాదేవికి ముఖమునుండి రక్తమాంసములనెత్తి యర్పించెదను. ఆరోగ్యసిద్ధికై ఎనుముతోడ అన్నబలిని

అర్పింతును. మహాత్ముడగు విఘ్నేశ్వరునికి మోదకములను చేసి పెట్టెదను. శనివారమునాడు నేను తప్పక ఉపవాస వ్రతమును ఆచరించెదను. తీపి తినను, నెయ్యివేసికొనను.

తైలాభ్యంగవిహీనాఽహం సదా స్థాస్యామి భూతలే ।
జీవత్వయం రోగహీనో భర్తా మే శరదాం శతమ్ ॥ 90

ఏవం సా వ్యాహరద్దేవీ వాసరే వాసరే గతే ।
తదా చాగాన్మునిః కశ్చిన్మహాత్మా దేవలాహ్వయః ॥ 91

వైశాఖమాసే ధర్మార్తః స యయౌ తస్య వై గృహే ।
తదా తే భార్యయా చోక్తం వైద్యోఽయం గృహమాగతః ॥ 92

తేన తే రోగహానిః స్యాత్తస్యాతిథ్యం కరోమ్యహమ్ ।
యదాజ్ఞాపయసి త్వం మాం నోచేన్నైవ కరోమ్యహమ్ ॥ 93

జ్ఞాత్వా త్వాం ఘర్మవిముఖం భిషగ్వ్యాజేన వంచితమ్ ।
తస్యాతిథ్యం తు వై కర్తుం దత్తాఽఽజ్ఞా వై పురా త్వయా ॥ 94

తస్య పత్నీ తదా తుష్టా పూజయామాస సా మునిమ్ ।
పాదావనేజనం కృత్వా తజ్జలం మూర్ధ్ని తేఽవహత్ ॥ 95

పాతుం తుభ్యం దదౌ తీర్థం త్వాముక్త్వా భేషజం త్వితి ।
పానకం చ దదౌ తస్మై ఘర్మార్తాయ మహాత్మనే ॥ 96

దివ్యాన్నైర్భోజయామాస సుసంఘవ్యజనే దదౌ ।
త్వయాఽనుమోదితా సాయం ఘర్మతాపం న్యవారయత్ ॥ 97

స ప్రాతరుదితే సూర్యే మునిర్గ్రామాంతరం యయౌ ।
అథ చాల్పేన కాలేన సన్నిపాతోఽభవత్తవ ॥ 98

త్రికటుం ముఖ ఆధాత్సా భర్తాంగులిమఖండయత్ ।
కఫేన దంతపఙ్క్తిభ్యాం మీలితాభ్యాం దృఢ తదా ॥ 99

తే వక్త్రేంఽగులిఖండం తత్ స్థితమేవాతికోమలమ్ ।
ఖండయిత్వాంగులిం తస్యాః పంచత్వం త్వం గతః పురా ॥ 100

**శయ్యాయాం సుమనోజ్ఞాయాం స్మరంస్తాం పుంశ్చలీం హృది ।**
**మృతం విజ్ఞాయ భర్తారం భార్యా కాంతిమయీ తవ ॥ 101**

**విక్రీత్వా వలయే స్వే త్వాం గృహీత్వా చందనం బహు ।**
**చక్రే చితిం తేన సాధ్వీ మధ్యా కృత్వా పతిం తదా ॥ 102**

**సమాలింగ్య భుజాభ్యాం తే పాదౌ చాశ్లిష్య పాదయోః ।**
**ముఖే ముఖం నిజం కృత్వా హృదయే హృదయం తథా ॥ 103**

తైలాభ్యంగమును యావజ్జీవము ఈశ్వరప్రీణనముగ వదలి పతియారోగ్యమును కోరుచున్నాను. ఈ పతి నూరేండ్లు చల్లగా రోగములేకుండా ఉండిన చాలును. ఇట్లు దినదినమునా ప్రార్థించుచుండగా ఒకప్పుడు దేవలుడను ముని వైశాఖమాసపు చెమట నోర్వనేరక వానిఇంటికి వచ్చెను. అప్పుడు కాంతిమయి పతితో, "వైద్యుడింటికి వచ్చెను. వానివలన నీ రోగము నశించునేమో, కావున నీవాజ్ఞాపించినచో వానికి ఆతిథ్యమునిచ్చెదను. ఆజ్ఞ ఇవ్వకున్నట్లైతే ఎన్నడునుచేయను." అనెను. ధర్మ విముఖుడగు నీవు వైద్యుడను నెపముతో ఆతిథ్యము ఇచ్చునట్లు నీ వామెకు ఆజ్ఞాపించితివి. నీ పత్ని అట్లే అని సంతోషించి, అతనిని పూజించి, కాళ్ళుకడిగి, ఆ నీళ్ళను నీమీద జల్లి, నీకు మందని తత్తీర్థమును త్రాగుటకిచ్చి, ఆ మహాత్ముడగు దేవలమునికి పానకమునిచ్చి, మృష్టాన్న భోజనము పెట్టి, గంధమును, వ్యజనమును అర్పించి, నీ అనుమతిమీదనే ఆయాసమును పరిహరింప జేసెను. ఆ ముని తెల్లవారగనే ఇతర గ్రామమునకు వెడలెను. అంత నీకు కొంతకాలము లోపలనే సన్నిపాతము సంభవించినది. అప్పుడామె శొంఠి, పిప్పలి, మిరియాలు, ఏలకులు, ఆకుపత్రికము, లవంగములు వీటి కషాయమును నీ నోరు తెరచి పోయునపుడు నీవు కఫాక్రాంతమైన పలువరసచే ఆమెయొక్క వ్రేలును కొరికితివి. కోమలమైన ఆమె వ్రేలితునక గొంతులో చిక్కికొని పాన్పుమీద ఆ వేశ్యను మదిలో స్మరించుచు చచ్చితివి. నీ మరణము నెరిగి సతియగు 'కాంతిమయి' తన కంకణములను అమ్మి, ఆ సొమ్ముచే శ్రీగంధపు చెక్కలను తెప్పించి, చితిపేర్చి, దానిమీద నడుమ ఆ శవమును పెట్టి, సరిగా దానిపై తాను పరుండి పతితో అంగాంగ సంగమునంది, శ్రీరామధ్యానపరాయణయై తనతోడ పతిని దహింపజేసెను.

**గుహ్యే కృత్వా తు గుహ్యం స్వమేవం సా రామమానసా ।**
**దాహయామాస కల్యాణీ భర్తుర్దేహం రుజాన్వితమ్ ॥**
**ఆత్మనా సహ తన్వంగీ జ్వలితే జాతవేదసి । 104**

ఏవం వరా సా లలనా పతివ్రతా
దందహ్యమానే సుసమిద్ధవహ్నౌ ।
విముచ్య దేహం సహసా జగామ
పతిం నమస్కృత్య మురారిలోకమ్ ॥ 105

త్వమంతకాలే గణికేచ్ఛయా హి
దేహం త్యక్త్వా త్యక్తకర్మా దురాత్మా ।
వ్యాధజన్మ ప్రాపితం ఘోరధర్మే
హింసాసక్తః సర్వదోద్వేగకారీ ॥ 106

దత్తా త్వయా పానకమర్పితుం వై
మాసేఽనుజ్ఞా మాధవే సద్ద్విజాయ ।
భిషగ్వ్యాజాత్తేన జాతా సుబుద్ధిః
ధర్మం కర్తుం పాదరక్షేఽర్పితే యే ॥ 107

ఘృతం మూర్ధ్నా పాదశౌచావశేషం
జలం మునేః సర్వపాపాపహారి ।
తేనైవ తే సంగతిర్మే వనేఽస్మిన్
జాతా శ్రోతుం స్వీయపుణ్యం మతిశ్చ ॥ 108

ముఖే కృత్వాంగులిం యస్మాన్మృతః పూర్వభవాంతరే ।
తస్మాదత్ర వనే మాంసాంహారస్తేఽభూద్వనేచర ॥ 109

వేశ్యా సా భిల్లినీ జాతా భార్యా యా తవ వర్తతే ।
శయ్యాయాం మరణాత్తేఽత్ర శయనం భువి సర్వదా ॥ 110

ఇతి తే సర్వమాఖ్యాతం పూర్వజన్మని యత్కృతమ్ ।
తత్కర్మ పుణ్యం పాపం చ దృష్టం దివ్యేన చక్షుషా ॥ 111

అతః పరం భావి వృత్తం శృణు తేఽహం వదామి వై ।
కృణుర్నామ మునిస్త్వగ్రే కస్మింశ్చిచ్చ సరోవరే ॥ 112

**కరిష్యతి తపస్తీవ్రం చాన్నవ్యాపారవర్జితః ।**
**పశ్చాత్తపోవిరామాంతే తన్నేత్రాభ్యాం బహిః స్రుతమ్ ॥ 113**

**వీర్యం దృష్ట్వోరగీ కాచిత్ స్వయం స్ఖలితమంజసా ।**
**గ్రహీష్యతి ఋతోః కాలే తస్మాత్తత్పుణ్యతస్తదా ॥ 114**

**కిరాతాః పాలయిష్యంతి కిరాతస్త్వం భవిష్యసి ।**
**ఉపానహావర్పితేఽద్య యస్మాత్తత్పుణ్యతస్తదా ॥ 115**

అగ్ని ప్రజ్వలించుచుండగా ఆ కాంతిమయి సాహసించి దేహమును త్యజించి, పతికి నమస్కరించి విష్ణులోకమును పొందెను. దురాత్మయగు నీవు అంతకాలమున వేశ్యను తలంచుచు దేహమును వదలితివి గాన, ఇప్పుడు బోయవాని జన్మమెత్తి ఈ గ్రీష్మమున హింసాసక్తుడవై పీడాకరుడవైతివి. యోగ్య బ్రాహ్మణునికి వైశాఖమాసమున వైద్యనిమిత్తము పానకమిచ్చుటకు అనుజ్ఞ చేయ సద్బుద్ధికలిగినది. నాకు చెప్పులనిచ్చితివి. ఆమునియొక్క దురిత పరిహారమైన పాదోదకమును సేవించినందున ఈ వనమున నాతో నీకు చేరిక కలిగినది. నీపుణ్యమును వినునిట్లు బుద్ధిపుట్టినది. సతియొక్క వ్రేలును కొరికి ముఖమునపెట్టుకుని జన్మాంతరమున ప్రాణము విడిచినందున ఇప్పుడీ వనమున మాంసభక్షుకుడవైతివి. ఓయి కిరాతకుడా! ఇప్పుడు నీకు ఇల్లాలుగా నుండు బోయది ఆ వేశ్యయని ఎంచుము. పాన్పుపై నీకు మరణమయినందున ఎప్పుడును నేలబడి యుందువు." అని ఇట్లు శంఖుడు తన దివ్యజ్ఞానముచే ఎరిగి, పూర్వజన్మమునందు చేసిన పుణ్య, పాపములన్నిటిని నిరూపించి మరియు ఇట్లనియె, "ఇకమీద కాగల ఈ సంగతిని చెప్పుచున్నాను. 'కృణుడు' అను ముని ఒకడు ఇకముందు ఒకానొక సరోవరమున నిరాహారుడై ఘోరతపమును ఆచరించును. అతనియొక్క తపోవిరామ అవసరమున కన్నులనుండి వీర్యము పొంగి కారును. నాగకన్య యొకతె ఆ వీర్యమును తన ఋతుకాలమున భక్షించును. దానియందు నీవు జన్మించెదవు.

**భవిష్యతి సంగతిస్తే వనే సప్త మునీశ్వరైః ।**
**తేషాం ప్రసాదాద్వాల్మీకిర్మునిస్త్వం హి భవిష్యసి ॥ 116**

**యస్త్వం రామకథా దివ్యాం సుప్రబంధైః కరిష్యసి ।**
**వాల్మీకిరువాచ**
**ఇతి వ్యాధం సమాదిశ్య ధర్మాన్వైశాఖజానపి ॥ 117**
**ఉపదిశ్య సవిస్తారం ప్రతస్థే గౌతమీం తదా ।**
**స శంఖః కుండలాద్యైశ్చ తద్దత్తైస్తుష్టమానసః ॥ 118**

వ్యాధోఽపి శంఖవచనాత్తస్మిన్నేవ వనే చిరమ్ ।
వన్యైర్వైశాఖమాసీయాన్ ధర్మాన్ప్రీత్యాఽకరోచ్ఛుభాన్ ॥ 119

వ్యాధజన్మాత్యయే జాతే కృణుః పుత్రస్త్వహం తతః ।
పన్నగీజఠరోద్భూతస్త్వరణ్యే రఘునందన ॥ 120

అహం పురా కిరాతేషు కిరాతైః సహ వర్ధితః ।
జన్మమాత్రం ద్విజత్వం మే శూద్రాచారరతః సదా ॥ 121

శూద్రాయాం బహవః పుత్రాశ్చోత్పన్నా మేఽజితాత్మనః ।
తతశ్చోరైశ్చ సంగమ్య చోరోఽహమభవం పునః ॥ 122

ధనుర్బాణధరో నిత్యం జీవానామంతకోపమః ।
ఏకదా మునయః సప్త దృష్ట్వా మహతి కాననే ॥ 123

స్వతేజసా ప్రకాశంతో జ్వలనార్కసమప్రభాః ।
తానన్వధావం లోభేన తేషాం సర్వపరిచ్ఛదాన్ ॥ 124

గృహీతుకామస్తత్రాహం తిష్ఠతాం తిష్ఠతామితి ।
అబ్రవ మునయోఽపృచ్ఛన్ కిమాయాసి ద్విజాధమ ॥ 125

అహ తానబ్రవం కించిదాదాతు మునిసత్తమాః ।
పుత్రదారాదయః సంతి బహవో మే బుభుక్షితాః ॥ 126

తేషాం సంరక్షణార్థాయ చరామి గిరికాననే ।
తతో మామూచురవ్యగ్రాః పృచ్ఛ గత్వా కుటుంబకమ్ ॥ 127

బోయవారు ఆ బిడ్డను పాలించెదరు. నీవును వ్యాధుడవైపోదువు. ఇపుడు నీవు చెప్పులను అర్పించినందువలన నా పుణ్యబలముచే నీవు వాల్మీకియను మునీంద్రుడవు కాగలవు. నీవే శ్రీరామ చరితమును అభివర్ణించెదవని చెప్పి, వైశాఖమాస ధర్మమును ఉపదేశించి, వాడిచ్చిన కుండలాదికమును స్వీకరించి గౌతమీతీరమునకు వెడలెను. ఆ కిరాతుడును శంఖముని వచనముచే ఆ వనముననే చిరకాలము వైశాఖమాసమున వన్యవస్తువులతోనే, ప్రీతితో అనేక ధర్మములను ఆచరించెను. ఇట్లు బోయవాని జన్మము గతించినవెనుక 'కృణు'వను మునికి పుత్రుడనైతిని. శ్రీరామా! నాగకన్యా గర్భమున జనించినవాడను. జన్మమాత్రముచే బ్రాహ్మణత్వమునందిన నేను వ్యాధులచే పెంచబడి, నిరంతరము

శూద్రాచారములను అవలంబించి, ఒక శూద్ర స్త్రీయందు చాలామంది సంతానమును కంటిని. అంతనట్లే దొంగలతో జేరి దొంగయై దొంగిలించుచుంటిని. నేను ధనుర్బాణములను ధరించి, ప్రాణులకు యమునివలె హింసాసక్తుడనై ఉండగా, మహారణ్యమున ఒకప్పుడు మహామునీంద్రులు ఏడుగురు కనబడిరి. ప్రత్యక్షమైన వెలుగుచుండు వెలుగుల రాజువలె ప్రకాశించు చుండు వారియొక్క పైగుడ్డలను అపహరించవలయునను ఆశచే వెంటనంటి పరుగెత్తుచు, "నిలవండోయి నిలవండో"యని అల్లరి చేసితిని. వారప్పుడు "ఏమివచ్చితివిరా విప్రాధమా" అనిరి. అందుకు నేను, "ఏమైనను గొనిపోవుటకై వచ్చితిని మునీంద్రులారా! నాకు ఇల్లాలు, పిల్లలు మిగులగలరు. వారందరును ఆకలిగొనియున్నారు. వారి రక్షణకై అడవిలోను, కొండలమీదను తిరుగుచున్నాను," అని చెప్పితిని.

**యో యో మయా ప్రతిదినం క్రియతే పాపసంచయః ।**
**యూయ తద్భాగినః కిం వా నేతి నేతి పృథక్ పృథక్ ॥ 128**

**వయం స్థాస్యామహే యావదాగమిష్యసి నిశ్చయాత్ ।**
**యత్పాపం బ్రహ్మహత్యాయాం యత్పాపం మద్యపానతః ॥ 129**

**తేన పాపేన లింపామో యది గచ్ఛామహే వయమ్ ।**
**యత్పాపం హేమచౌర్యేణ గురుదారాగమాచ్చ యత్ ॥ 130**

**తేన పాపేన లింపామో త్వామపృష్ట్వా వనేచర ।**
**చేద్వ్రజామో వయం సర్వే ఇతస్తే పృష్ఠతో బహిః ॥ 131**

**సంసర్గజనితం పాపం బ్రహ్మస్వహరణాచ్చ యత్ ।**
**తేన పాపేన లింపామో యది గచ్ఛామహే వయమ్ ॥ 132**

**ఏవం తచ్ఛపథైర్నానావిధైః ప్రత్యయమాగతః ।**
**తథేత్యుక్త్వా గృహం గత్వా మునిభిర్యదుదీరితమ్ ॥ 133**

**అపృచ్ఛం పుత్రదారాదీంస్తైరుక్తోఽహం రఘూత్తమ ।**
**పాతం తవైవ తత్సర్వం వయం తు ఫలభాగినః ॥ 134**

**తచ్ఛ్రుత్వా జాతనిర్వేదో విచార్య పునరాగతః ।**
**మునయో యత్ర తిష్ఠంతి కరుణాపూర్ణమానసాః ॥ 135**

**మునీనాం దర్శనాదేవ శుద్ధాంతః కరణోఽభవమ్ ।**
**ధనురాది పరిత్యజ్య దండవత్పతితోఽస్మ్యహమ్ ॥ 136**

**రక్షధ్వం మాం మునిశ్రేష్ఠాః పతితం నరకార్ణవే ।**
**ఇత్యగ్రే పతితం దృష్ట్వా మామూచుర్మునిసత్తమాః ॥ 137**

**ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే సఫలః సత్యమాగమః ।**
**ఉపదేక్ష్యామహే తుభ్యం కించిత్తేనైవ మోక్ష్యసే ॥ 138**

అంత ఆ మునీంద్రులు నిర్భయులై, "ఓరీ! నీవు పోయి నీ కుటుంబమున– నేను ప్రతిదినమును ఏయే పాపాములను ఆచరించుచున్నానో వాటినన్నిటిని మీరును భాగార్హులై అనుభవించెదరా? లేదా? అని వేర్వేరుగా అందరిని అడిగిరమ్ము. నిశ్చయముగా నీవు వచ్చువరకు మేమిచ్చటనే ఉండెదము. మేము ఈ స్థలమును విడిచి పోతిమా మాకు బ్రహ్మహత్యాపాపము, మద్యపాన దురితమును, స్వర్ణాపహార పాపమును, గురుతల్ప గమనపాపమును, బ్రాహ్మణుని సొమ్మును దొంగిలించిన పాపమును, పాపులతో కలసితిరిగిన పాపమును పొందగలము," అని ఇట్లు శపథములను జేసి చెప్పిరి. వారి ప్రమాణవచనములచే నేను నమ్మకమునంది, అట్లే అని ఇంటికి వెడలి మునీంద్రులు ఆనతిచ్చినట్లు భార్యా, సంతానమును అందరిని విచారించితిని. వారు ఏకగ్రీవముగా, "పాపము నీ కొకనికే, నీవు తెచ్చిన ప్రయోజనములను మేము అనుభవించెదము," అని చెప్పిరి. అంత నేను కలతచెంది, చింతించి, మరల ఆ కారుణ్యపూర్ణ పుణ్యమూర్తులగు మునీంద్రులుండెడు చోటికి వచ్చితిని. వారి దర్శనమాత్రముచేతనే నిర్మలహృదయుడనయితిని. ధనుర్బాణాదులనన్నిటిని పడవేసితిని. అంతటిని పరిత్యజించితిని. మునీంద్రులారా! ఘోర నరకసాగరమున పడియుండు నన్ను ఉద్ధరించి రక్షింపుడు అని మొరబెట్టి శరణాగతుడనై వారి సన్నిధిలో నిలబడితిని. అప్పుడువారు దయార్ద్రహృదయులై, "లెమ్ము లెమ్ము, నీకు శుభమగుగాక!" సత్యముగా శాస్త్రము సఫలము.

**పరస్పరం సమాలోక్య దుర్వృత్తోఽయం ద్విజాధమః ।**
**ఉపదేశ్య ఏవ సద్భ్వస్తథాపి శరణం గతః ॥ 139**

**రక్షణీయః ప్రయత్నేన మోక్షమార్గోపదేశతః ।**
**ఇత్యుక్త్వా రామ తే నామ వ్యత్యస్తాక్షరపూర్వకమ్ ॥ 140**

**మునయో మాముపదిశుర్మత్కృపాపూర్ణమానసాః ।**
**ఏకాగ్రమనసాఽత్రైవ మరేతి జప సర్వదా ॥ 141**

**ఆగచ్ఛామః పునర్యావత్తావదుక్తం సదా జపః ।**
**ఇత్యుక్త్వా ప్రయయుః సర్వే మునయో దివ్యదర్శనాః ॥ 142**

అహం యథోపదిష్టస్తైస్తథాఽకరవమంజసా ।
జపన్నేకాగ్రమనసా బాహ్యం విస్మృతవానహమ్ ॥ 143

సాక్ష్యార్థం తపసస్తత్ర దండోఽగ్రే స్థాపితో మయా ।
ఏవం బహుమతిథే కాలే గతే నిశ్చలరూపిణః ॥ 144

సర్వసంగవిహీనస్య వల్మీకోఽభూన్మమోపరి ।
దండోఽగ్రే స నగో రమ్యో బభూవ మత్తపోబలాత్ ॥ 145

తతో యుగసహస్రాంతే ఋషయః పునరాగమన్ ।
మామూచుర్నిర్గమస్వేతి తచ్ఛ్రుత్వా తూర్ణముత్థితః ॥ 146

వల్మీకాన్నిర్గతశ్చాహం నీహారాదివ భాస్కరః ।
మమాప్యాహుర్మునిగణా వాల్మీకిస్త్వం మునీశ్వరః ॥ 147

వల్మీకాత్సంభవో యస్మాత్ ద్వితీయం జన్మ తేఽభవత్ ।
ఇత్యుక్త్వా తే యయుర్దివ్యాం గతిం రఘుకులోత్తమ ॥ 148

అహం తే రామనామ్నశ్చ ప్రభావాదీదృశోఽభవమ్ ।
ఏకదా శంభువచసాఽయం విధిః శ్రుతవాంస్తవ ॥ 149

నీకు కొంచెము ఉపదేశించెదము, దానిచే తరించెదవు. అని వారంతా, “వీడు దురాచారములు గల దుష్టుడు, బ్రాహ్మణాధముడు, సాధువులు వీనిని ఉపేక్షింపవలసియున్నది. అయినను శరణాగతుడయ్యె. ఎట్లయినను మోక్షమార్గోపదేశముచే కాపాడవలసినదే,” అని ఆలోచించి, దయాపరిపూర్ణ హృదయులై, “నీవు ఏకాగ్రమానసుడవై మరల మేమిచ్చుటకి వచ్చునంతవరకు నిరంతరము ‘మరా’ అని పఠించుచుండుము,” అని, శ్రీరామా! నీ పేరును వ్యత్యస్తాక్షరముగా నాకు ఉపదేశించిరి. పిదప నేను దివ్యజ్ఞానులగు వారు వెడలిపోయిన తరువాత వారు ఉపదేశించినట్లే త్వరగా జపమునకు ఆరంభించి, ఏకాగ్రచిత్తుడనై అచ్చోట సాక్షికై ఒక కొయ్యను పెట్టి బాహ్యప్రపంచమును మరచి, తపోనిష్ఠుడనైతిని. ఇట్లు బహుకాలము గతించగా నిశ్చలాకారుడగు నామీద ఒక పుట్టపెరిగినది. నా తపోబలమువలన నా దండముపై ఒక వృక్షము పుట్టెను. పిదప వేయి యుగములకు మునీంద్రులు మరలా వచ్చి, నన్నుగురించి, “వెడలి రమ్ము” అని పిలచిరి. అంత నేను వెంటనే మంచులోనుండి వెలువడు వెల్గులరేని చందమున లేచివచ్చితిని. అప్పుడామునీంద్రులు నన్నుజూచి, “నీవు వల్మీకము నుండి పుట్టివచ్చితివి గాన ‘వాల్మీకి’ అను పేరుగల మహర్షివైతివి. ఇది నీకు రెండవ జన్మయైనది,” అని చెప్పి శ్రీరామా! వారు స్వర్గమునకు జనిరి. నేనును ‘రామ’నామ మహిమవలన ఇట్లేర్పడితిని. ఈ బ్రహ్మదేవుడు ఒకప్పుడు మంగళమయమైన కైలాసమున శ్రీసాంబమూర్తివలన దేవతలతో కలసి నీ చరిత్రమును వినెను. అతడు దానిని నారదునకు ఉపదేశించెను.

చరితం వేదవాక్యైశ్చ కైలాసే పరమే శుభే ।
అనేన విధినా తచ్చ కథితం నారదాయ హి ॥ 150

నారదః కథయామాస వేదవాక్యైర్మమాత్ర తత్ ।
తతః క్రౌంచ హతం దృష్ట్వా వ్యాధేన తమసాతటే ॥ 151

శోచంతీం సాంత్వయన్ క్రౌంచీం మమాస్యాన్నిర్గతస్తదా ।
ద్వాత్రింశదక్షరైః ప్రోక్తః శోకః శ్లోకత్వమాగతః ॥ 152

తతోఽపి విధినాఽనేన చరితం తే ప్రవర్ణితమ్ ।
సమాగత్య తు సంక్షేపాదర్పితా మే వరా అపి ॥ 153

తతోఽస్య బ్రహ్మణో వాక్యాత్ కృతవాంశ్చరితం తవ ।
ఆనందదాయకం రమ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥ 154

ఏవం త్వయా యథా పృష్టం తథా సర్వం నివేదితమ్ ।
ఏవం వాల్మీకివాక్యైశ్చ సర్వం జానన్నపి ప్రభుః ॥ 155

పృష్ట్వా శ్రోతుం జనాన్ సర్వాన్ శ్రావయామాస రాఘవః ।
ఏతస్మిన్నంతరే రామం వాక్పతిః ప్రాహ సాదరమ్ ॥ 156

రామ కిం చరితం గేయం తవానందస్వరూపిణః ।
యస్య నామాద్యవర్ణైశ్చ శబ్దమాత్రోఽత్ర గీయతే ॥ 157

లౌకికా వైదికా చాపి అకారాద్యాస్తు షోడశ ।
స్వరాస్తథైవ వర్ణాశ్చ చతుస్త్రింశచ్ఛుభావహాః ॥ 158

కకారాద్యాః క్షకారాంతా మంత్రరూపాః శుభావహాః ।
ఏవం వర్ణాశ్చ పంచాశద్యే కీర్త్యతే నరైర్భువి ॥ 159

తే త్వ న్నామాద్యవర్ణాశ్చ సర్వే జ్ఞేయా రఘూత్తమ ।
తవ నామాద్యవర్ణైశ్చ వ్యాప్తం సర్వం చరాచరమ్ ॥ 160

నారదుడు దైవప్రేరితుడై నాకును ఉపదేశించెను. పిదప తమసానదీ తీరమునందు బోయవాడొకడు క్రౌంచ పక్షిని కొట్టగా ఆడపక్షి ఏడ్చుచుండుటను చూచి, దానికి సమాధానముగా 32 అక్షరములు గల శ్లోకమొకటి చెప్పబడె. శోకరూపమే శ్లోకమయ్యె. అంత ఈ బ్రహ్మదేవుడే ప్రత్యక్షమై వచ్చి నాకు నీ చరిత్రను సంక్షేపముగా అభివర్ణించి ఉపదేశించెను. నాకూ వరములను అనుగ్రహించెను. అంత ఈ బ్రహ్మవచనము ప్రకారముగా ఆనందదాయకమైన శతకోటి (నురుకోట్ల)శ్లోక ప్రవిస్తరమగు శ్రీరామచరితామృతమును అభివర్ణించితిని. శ్రీ రామచంద్రస్వామీ! నీ ఆజ్ఞానుసారముగా ఇట్లు స్వరచితమును నీ సన్నిధిలో నిరూపించితిని.” అనిన వాల్మీకిముని వాక్యములను విని శ్రీరఘురాముడు సర్వజ్ఞమూర్తియై ఉండినను ఇట్లు తెలియనివానివలె అడిగి, వాల్మీకిచరిత్రమును లోకానుగ్రహమునకై చెప్పించెను. (155)

## బ్రహ్మదేవుడు శ్రీరామచంద్రుని అభివర్ణించుట.

అంతలో ఆ సరస్వతీ దేవీ భర్త సాదరముగా, “శ్రీరామా! ఆనందస్వరూపుడవగు నీ చరిత్రమేది? మావంటివారికి గేయమైనది. లోకమున యే శబ్దమును పలికినా అందులో మొదటి, చివరి అక్షరములు అకారాది క్షకారాంతము లయిన 50 వర్ణములలో ఒకటిగాన, ఆ అక్షరములన్నియును నీయొక్క 50 నామములకు ప్రథమాక్షరములుగా ఉండుటనుబట్టి, లౌకిక శబ్దములనైనను, వైదిక శబ్దములనైనను ఎవరేమని చెప్పినను సర్వమును నీ యొక్క మంత్రమైయున్నది.

**చరాచరాణాం సర్వేషాం యాని నామాని తాని తే ।**
**తేషు వర్ణపరత్వేన నామాన్యద్య వదామితే ॥ 161**

**సంక్షేపాచ్చవ పంచాశత్తాని శృణ్వంతు సజ్జనాః ।**
**ఓమనంతానందమయశ్చేష్టపూర్తఫలప్రదః ॥ 162**

**ఈశ్వరశ్చతథోత్కృష్టశ్చోర్ధ్వరేతా ఋతంభరః ।**
**ఋూయుక్తశ్చ ఌశశ్చైవ ౡపకశ్చక ఏవ చ ॥ 163**

**ఐశ్వర్యదశ్చోజదశ్చ తథైవౌదార్యచంజురః ।**
**అంతరాత్మా చార్ధగర్భస్తథైవ కరుణాకరః ॥ 164**

**ఖడ్గీ చ గతిదశ్చైవ ఘనశ్యామస్తథైవ చ ।**
**ఙణనశ్చమితాశేషదుష్కృతశ్చ తథైవ హి ॥ 165**

**ఛత్రీ జగన్మయశ్చైవ ఝుషరూపీ ఞుటేశ్వరః ।**
**టణత్కారిధను ష్ఠానబంధో డమరుసత్కరః ॥ 166**

ధణుల్లునితపాపశ్చ ణకర్ణశ్చతథైవహి ।
తపోరూపస్థవశ్చైవ దక్షో ధన్వీ తథైవచ ॥ 167

నష్టోద్ధరణధీరశ్చ తథైవ పరమేశ్వరః ।
తథా ఫలప్రదశ్చైవ తథా బలివరప్రదః ॥ 168

భగవాన్ మధుఘాతీ చ తథా యజ్ఞఫలప్రదః ।
రఘునాథశ్చ లక్ష్మీశో వరిష్ఠశ్చ తథైవ హి ॥ 169

శరణ్యః షడ్గుణైశ్వర్యసంపన్నశ్చ తథైవ హి ।
సర్వేశ్వరో హయగ్రీవః క్షమీ నామాని తే త్వితి ॥ 170

పంచాశద్వర్ణచిహ్నాని చైభిర్వర్ణైర్జగత్త్రయమ్ ।
వ్యాప్తం శ్రీరామ సర్వత్ర ఘవర్ణేన ఘటః స్మృతః ॥ 171

పవర్ణేన పటో జ్ఞేయస్త్వేవం వర్ణాత్మకం జగత్ ।
ఏకైకస్య చ వర్ణస్య భేదైర్నామాని తే పృథక్ ॥ 172

నాహం సమర్థో వ్యాఖ్యాతుం పంచాస్యోఽపి న చ క్షమః ।
యత్ర శేషః సహస్రాస్యో వర్ణనే కుంఠితస్త్వభూత్ ॥ 173

ఏవం తే మహిమా రామ కోఽత్ర వర్ణయితుం క్షమః ।
తథాపి ధన్యో వాల్మీకిర్యేన తే చరితం కృతమ్ ॥ 174

శతకోటిమితం రామ తవైవ కృపయా ప్రభో ।
శ్రీరామదాస ఉవాచ
ఇత్యుక్త్వా స గురుర్దేవై రాఘవేణాపి పూజితః ॥ 175

పృష్ట్వా రామం యయౌ స్వర్గం సత్యలోకం యయౌ విధిః ।
వాల్మీకిశ్చాపి ప్రయయౌ చిత్రకూట నిజాశ్రమమ్ ॥ 176

తదారభ్య జనాః సర్వే చక్రుర్హాస్యం ముదైవ తే ।
మాంగల్యకర్మాణ్యుత్సాహకర్మాణి జగతీతలే ॥ 177

చక్రుః సర్వే పూర్వవచ్చ నాతిహాస్యం ప్రచక్రిరే ।
స్త్రీభిర్నరాః సుసంతుష్టాః క్రీడాహాస్యాది చక్రిరే ॥ 178

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, వాల్మీకిజన్మ తత్తన్మంత్రవర్ణనం నామ, చతుర్దశస్సర్గః ॥**

సకలాక్షరములును నీయొక్క ఆది అనాది అక్షరములై యున్నవి. నీ నామాది అక్షరములే చరాచర ప్రపంచమును వ్యాపించియున్నవి. వాఙ్మయప్రపంచమున సర్వములు నీ నామములే. అయిన వాటిలో తదక్షర పరత్వముగా నీ 50 దివ్యనామములను సంగ్రహించి చెప్పుచున్నాను. సత్పురుషులు శ్రవణముచే ధన్యులగుదురుగాక! అని యిట్లు బ్రహ్మదేవుడు అక్షరాత్మకుడగు శ్రీరామచంద్రస్వామిని అక్షరనామావళిచే అభివర్ణించెను. ఎట్లనిన......

'ప' అనిన పటము, అనగా వస్త్రము, 'ఘ' అనిన ఘటము అనగా కుండ, యిట్లు నామ ఏక దేశమాత్ర గ్రహణముచే నామగ్రహణము అట్లు అక్షరాత్మకుడగు నిన్ను గ్రహించితే సారస్వతస్వమును వశమగుచుండును. ఇట్లే

జగము వర్ణాత్మకము. ఒక్కొక్కవర్ణముచేతనే పేర్లు వేర్వేరుగా ఎన్నియో అగును. నీ నామ మహిమను వర్ణించుటకు నేను శక్తుడను కాను. పంచముఖుడగు శివుడును, వేయి ముఖములుగల ఆదిశేషుడును శక్తులుగారు. ఇట్టి నీ మహిమను వర్ణింప ఎవరితరము? ఇట్లుండ నీకృపచే నీ చరిత్రమును రచియించి వాల్మీకి ధన్యుడు అని చెప్పి బ్రహ్మదేవ పరివారముతో శ్రీరామునిచే సత్కృతుడై సత్యలోకమునకు వెడలె. వాల్మీకి చిత్రకూటమున తన ఆశ్రమమునకు వెడలె. అది మొదలు లోకులు హాస్యమును ఆరంభించిరి. ఉత్సాహమంగళ కార్యమును ప్రవర్తిల్లె. మందహాసముచే లోకము ఆనందించుచుండెను.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, వాల్మీకిజన్మ మంత్రవర్ణములను తెలుపు 14వ సర్గ ముగిసినది.**

# అక్షరమాలికా నామావళియొక్క అర్థవివరణము

162వ శ్లోకమునుండి, 170వ శ్లోకమువరకు చెప్పబడిన శ్రీరాముని 50 అక్షరమాలికలు.

1. అ **అనంతః**= అంతములేనివాడు
2. ఆ **ఆనందమః**= సత్యసుఖస్వరూపుడు
3. ఇ **ఇష్టాపూర్తిఫలప్రదః**= ఇష్టాపూర్తి కర్మములను ఇచ్చువాడు
4. ఈ **ఈశ్వరః**= సర్వశక్తిస్వరూపుడు
5. ఉ **ఉత్కృష్టః**= సర్వశ్రేష్ఠుడు
6. ఊ **ఊర్ధ్వరేతాః**= జితేంద్రియుడు
7. ఋ **ఋతంభరః**= సత్యమును భరించువాడు.
8. ౠ **ౠముక్తః**= నిర్భయుడు.
9. ఌ **ఌశః**= సర్వవ్యాపకుడు.
10. ౡ **ౡపకః**= స్వార్థకప్రత్యయము.
11. ఏ **ఏకః**= కేవలుడు.
12. ఐ **ఐశ్వర్యదః**= ఈశ్వరత్వమును, సంపదలను ఇచ్చువాడు.
13. ఓ **ఓజోదః**= జ్ఞానప్రదుడు. తేజఃప్రదుడు.
14. ఔ **ఔదార్యబంధురః**= ఉదారత్వముచేత రమ్యుడగువాడు.
15. అం **అంతరాత్మా**= అంతర్యామి.
16. అః **అర్థగర్భః**= సకలవిషయాలు గర్భమునగలవాడు.
17. క **కరుణాకరః**= దయానిధి.
18. ఖ **ఖడ్గీ**= నందకమను ఖడ్గమును ధరించినవాడు.
19. గ **గతిదః**= సద్గతినిచ్చువాడు
20. ఘ **ఘనశ్యామః**= మేఘమువంటి శరీరముగలవాడు.
21. ఙ **ఙపానః**= వేణునాదామృతమును పానముజేసినవాడు.
22. చ **చకితాశేషదుష్కృతః**= పాపములను తొలగించువాడు.
23. ఛ **ఛత్రీ**= ఛత్రముగలవాడు.
24. జ **జగన్మయః**= విశ్వమయుడు.

25. ఝ **ఝషరూపీ**= మత్స్యమూర్తిగా అవతరించినవాడు.
26. ఞ **ఞటేశ్వరః**= నందిని ఎక్కితిరుగువాడు (ఞకారము అనగ బలీవర్దము)
27. ట **టణత్కారిధనుః**= టంకారము చేయబడిన ధనస్సుగలవాడు.
28. ఠ **ఠనబంధః**= మంగళమూర్తి (ఠ+న+బంధః) (ఠ–చంద్రుడు, అగ్ని, శూన్యము), (నః–శరీరము, న–మనోజ్ఞము)
29. డ **డమరుసత్కరః**= డమరుకను చేతబూనినవాడు.
30. ఢ **ఢణుల్లులితపాపః**= ఛప్పున విదిలింపబడిన పాపములుగలవాడు.
31. ణ **ణకర్ణః**= సరోజదళములవంటి చెవులు గలవాడు.
32. త **తపోరూపః**= తపస్స్వరూపుడు.
33. థ **థగః**= కళ్యాణమయుడు.
34. ద **దక్షః**= సమర్థుడు.
35. ధ **ధన్వీ**= శార్ఙ్గమను ధనస్సును ధరించినవాడు.
36. న **నష్టోద్ధరణధీరః**= నశించువారిని ఉద్ధరించుటలో నేర్పరి.
37. ప **పరమేశ్వరః**= సర్వేశ్వరుడు.
38. ఫ **ఫరశురామః**= భార్గవరాముడు.
39. బ **బలివరప్రదః**= బలిచక్రవర్తికి వరములనొసగినవాడు.
40. భ **భగవాన్**= అప్రమేయ మహిమాన్వితుడు.
41. మ **మధుఘాతీ**= మధువను రాక్షసుని సంహరించినవాడు.
42. య **యజ్ఞఫలప్రదః**= యజ్ఞములకు ఫలములనిచ్చువాడు.
43. ర **రఘునాథః**= రఘుకులతిలకుడు.
44. ల **లక్ష్మీశః**= లక్ష్మి మనోహరుడు.
45. వ **వరిష్ఠః**= సర్వశ్రేష్ఠుడు.
46. శ **శరణ్యః**= అందరికి రక్షణనిచ్చువాడు.
47. ష **షడ్గుణఐశ్వర్యసంపన్నః**= సమగ్ర– ఐశ్వర్య, ధర్మ, కీర్తి, సంపద, వైరాగ్య, ఐశ్వర్యములనిచ్చువాడు.
48. స **సర్వేశ్వరః**= చరాచరప్రపంచమునకు ప్రభువు.
49. హ **హయగ్రీవః**= హయగ్రీవ అవతారమున జ్ఞానమును ఉపదేశించినవాడు.
50. క్ష **క్షేమీ**= జగద్రక్షకుడు.

# పంచదశః సర్గః-15వ సర్గ

## రామరాజ్య వర్ణనము

శ్రీరామదాస ఉవాచ

రామరాజ్యే సదానందః సర్వానాసీజ్జనాన్ భువి ।
నాసీత్కుత్రాపి కలహశ్చౌర్యం నిందాభయం తథా ॥ 1

రాజ్యమాసీదసాపత్నం సమృద్ధబలవాహనమ్ ।
ఋషిభిర్ హృష్టపుష్టైశ్చ రమ్యం హాటకభూషణైః ॥ 2

సంజుష్టమిష్టాపూర్తానాం ధర్మాణాం నిత్యకర్తృభిః ।
సదా సంపన్నసస్యం చ సుచిరం క్షేత్రసంకులమ్ ॥ 3

సుదేశం సుప్రజం సుస్థం సుతృణం బహుగోధనమ్ ।
దేవతాయతనానాం చ రాజిభిః పరిరాజితమ్ ॥ 4

సుయూపా యత్ర వై గ్రామాః సుతవిత్తర్ధిరాజితాః ।
సుపుష్పకృత్రిమోద్యానాః సుసదాఫలపాదపాః ॥ 5

సుపద్మానీకకాసారా రాజంతే యత్ర భూమయః ।
సదభా నిమ్నగారాజిర్యత్ర సంతి న మానవాః ॥ 6

కులాన్యేవ కులీనాని న చాన్యాయధనాని చ ।
విభ్రమో యత్ర నారీషు న విద్వత్సు చ కర్హిచిత్ ॥ 7

నద్యః కుటిలగామిన్యో న యత్ర విషయే ప్రజాః ।
తమోయుక్తాః క్షపా యత్ర బహులేషు న మానవాః ॥ 8

రజోయుజః స్త్రియో యత్ర న ధర్మబహులా నరాః ।
ధనైరనంధో యత్రాస్తి జనో నైవ చ భోజనాత్ ॥ 9

అనయస్యాస్పదం యత్ర న చ వై రాజపూరుషః ।
దండః పరశుకుద్దాలవాలవ్యజనరాజిషు ॥ 10

## శ్రీరామ రాజ్యాభివర్ణన

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "శ్రీరామచంద్రుడు రాజ్యపరిపాలన జేయుచున్నపుడు భూమండలమున సమస్త ప్రాణులకును ఎల్లప్పుడూ సంతోషము సంభవించుచుండెను. అప్పుడెన్నడును ఎచ్చటను దొంగతనము, దూషణములు జరగెడివికావు, కలహములు లేవు. (1)

రాజ్యము– నిర్వైరము, సంపూర్ణబలాన్వితము, మహర్షిమనోజ్ఞము, సువర్ణాభరణ సుమంజులము, ఇష్టాపూర్త(సామాజిక, ఆధ్యాత్మిక సేవాకార్యక్రమ)ములు మొదలైన ధర్మములను ఎల్లప్పుడూ ఆచరించు వారిచే సమన్వితము, పొలములు పంటలతో నిండియుండెను. మరియు ఆ రాజ్యము మంచిదేశము, మంచి ప్రజలు గలదిగా, ప్రశాంతిగా ఉండెను. ధాన్యముతో నిండియుండెను, ఆవులమందలచే అమందానందము, దేవాలయముల శోభచే వెలుగొందుచుండెను. (4)

గ్రామాలు ధనవంతులచే విరాజిల్లుచుండెడివి, పూలతోటలచే పూర్ణములయినవి, అన్ని ఋతువు లలో చెట్లు; పూలు పండ్లతో నిండియుండెను.(5) అచ్చటినేలలు పద్మసరోవరముచే ప్రకాశించునవి. నదులలో నీరు సమృద్ధిగా ఉండెను. అచ్చటి మానవులంతా దేవసదృశులై ఉండిరి. (6)

అచ్చటి వంశములే తరతరాల సంతతి పరంపరగలవి. అన్యాయార్జిత విత్తమనునదిలేదు. విలాసరూపమైన విభ్రమము నారీమణులయందు గలదుగాని, భ్రాంతిరూపమయిన విభ్రమము పండితులలో ఒకప్పుడును లేదు (7). కుటిల గమనము, వక్రమార్గావలంబనము నదులలో గలదు గాని దేశప్రజలలో లేదు. ప్రజలు దుర్మార్గులుగారు. తమస్సు అనగా చీకటి. అది కృష్ణపక్ష రాత్రుళ్ళకేగాని మానవులకు గాదు. (8). రజస్సనగా మలినము. అది స్త్రీలకే గాని ధర్మాత్ములకు కాదు. ప్రజలు గర్వమంది రజోగుణవంతులు గారు. అంధస్సనగా గ్రుడ్డితనము, అది ధనముచే అచ్చటివారికిలేదు. అనగా జనులంతా ధనపూర్ణులైయున్నను మత్తులుగారు. అన్నమోయనిన అది బాగుగా గలదు. (9). అనయ మనగా వ్యసనములు. అమంగళము, ఆపదలు అనునవి ఆ రాజ్యమునలేవు. మరి అచ్చట రాజరోగమనగా క్షయమునందిన పురుషుడు లేడు. దండమనగా– గొడ్డలి, గుద్దలి, గొడుగులు, మొదలయినవాటిలో చూడవచ్చునుగాని, దండమనగా అపరాధమువలన కోపమువల కలిగిన శిక్షలేదు.

**ఆతపత్రేషు నాన్యత్ర క్వచిత్ క్రోధాఽపరాజితః ।**
**అన్యత్రాక్షికవృందేభ్యః క్వచిన్న పరిదేవనమ్ ॥** 11

**అక్షికా ఏవ దృశ్యంతే యత్ర పాశైకపాణయః ।**
**జాడ్యవార్తా జలేష్వేవ స్త్రీమధ్యా ఏవ దుర్బలాః ॥** 12

కఠోరహృదయా యత్ర సీమంతిన్యో న మానవాః ।
ఔషధేష్వేవ యత్రాస్తి కుష్ఠయోగో న మానవే ॥ **13**

వేధ్యోఽభ్యంతః సురత్నేషు శూలం మూర్తికరేషు వై ।
కంపః సాత్త్వికభావోత్థో న భయాత్క్వాపి కస్యచిత్ ॥ **14**

సంజ్వరః కామజో యత్ర దారిద్ర్యం కలుషస్య చ ।
దుర్లభత్వం పాతకస్య సుకృతం న చ వస్తునః ॥ **15**

ఇభా ఏవ ప్రమత్తా వై యుద్ధం వీచ్యోర్జలాశయే ।
దానహానిర్గజేష్వేవ ద్రుమేష్వేవ హి కంటకాః ॥ **16**

జనేష్వేవ విహారా వై న కస్యచిదురః స్థలీ ।
బాణేషు గుణవిశ్లేషో బంధోక్తిః పుస్తకే దృఢా ॥ **17**

దండత్యాగః సదైవాస్తి యత్ర పాశుపతే జనే ।
దండవార్తా సదా యత్ర కృతసన్న్యాసకర్మణామ్ ॥ **18**

మార్గణాశ్చాపకేష్వేవ భిక్షుకా బ్రహ్మచారిణః ।
యత్ర క్షపణకా ఏవ దృశ్యంతే మలధారిణః ॥ **19**

ప్రాయో మధువ్రతా ఏవ యత్ర చంచలవృత్తయః ।
ఇత్యాదిగుణవద్దేశే రామో రాజ్యం శశాస సః ॥ **20**

రామరాజ్యములో ఎచ్చటను వ్యసనములులేవు. అచ్చట చేతిలో పాశముధరించినవారు అనగా చేతిలో పాచికలను ధరించినవారు అనుకొనరాదు. వారంతా చేతులలో ఆయుధములను ధరించి యుద్ధశూరులుగా ఉందురు. జాడ్యవార్త జలమునందే గలదు గాని మనుష్యులలో లేదు. దుర్బలమనగా సన్ననిది. అది స్త్రీల నడుములలో గలదే గాని ప్రజలలో లేదు. ప్రజలంతా మిక్కిలి బలిష్ఠులు(12).

సుందరీమణులు కఠినహృదయలనగా సుస్తనలు, నరులు దయాళువులు. కుష్ఠంబనగా చెంగల గోష్ఠకంబను ఔషధ ద్రవ్యమేగాని మానవులలో కుష్ఠురోగ సంబంధములేదు. (13). మధ్యవేధ యనిన రంధ్రరచన అది సద్రత్నములలోనేగాని నడుమ తొందరలు నరులలో లేవు. శూలము బొమ్మల చేతులలోనే గాని శూలరోగము లేదు. కంపమనగా భయము అది ఎవనికిని లేదు మరియు సాత్త్విక భావము గలదు. (14). జ్వరమనునది విరహజన్యముగాని రోగజన్యముకాదు. పాపమునకు

దారిద్ర్యమేగాని ప్రజలలో లేదనిన అందరు ధనికులయిన ధర్మాత్ములు. పుణ్యబలముచే దుర్లభ మనునది దురితమునకే గాని వస్తువులకులేదు. (15) గజములే ప్రమత్తములు ప్రజలు ప్రమత్తులుగారు. పోరు సముద్ర తరంగములలో, అది జనులలో లేదు. దానమనగా మదోదకముయొక్క హాని. అది గజములలోగలదు ధర్మమయిన దానహాని మరి ఎచ్చటను లేదు. కంటకములనగా ముండ్లు చెట్లలోగలవు. కంటకములనబడు ముళ్ళు మాటలు మొదలైనవి తొందరలు లేవు. (16) జనులలో విహారములు గలవు. రామరాజ్యమున హారము ధరించని వారే లేరు. గుణవిశ్లేషమనగా అల్లెత్రాటిని వదలుట. అది బాణములలోనే. జనులు గుణవంతులు. బంధోక్తియనిన కట్టిపెట్టు మనుమాట పుస్తకములలో గాని ప్రజలలో ఎచ్చటను కట్టికొట్టుమను మాటలేదు. (17) స్నేహమనగా తైలమును వర్జించుట. అది పాశుపతజనులలో గాని, చెలిమియను స్నేహమును త్యజించువాడే లేదు. దండమను మాట సన్న్యసించినవారిలో తప్పు తక్కినవారిలో శిక్షయనుమాట లేదు. (18). మార్గణములనగా బాణములు. అవి ధనుస్సులలోనే గాని యాచకులు లేరు. అందరును పొట్టనిండినవారే. (19) చంచలవృత్తియనిన చపలభ్రమణములు. అవి తుమ్మెదలలోనే గాని, చాపల్యస్వభావము ఎవరికిని లేదు. ఇటువంటి సద్గుణములు గల మంచిదేశమున శ్రీరామచంద్రస్వామి రాజ్య పరిపాలనము చేయుచుండెను (20).

**ధర్మేణ రాజా ధర్మజ్ఞః సీతారామః ప్రతాపవాన్ ।**
**చకార రాజ్యం నిర్ద్వంద్వమయోధ్యాయాం సునిశ్చలమ్ ॥ 21**

**విధాయ రాజధానీం తాం విస్తృతాం పరిఖాన్వితామ్ ।**
**ఏకాంచక్రే మహాబుద్ధిః ప్రజా ధర్మేణ పాలయన్ ॥ 22**

**తతాప సూర్య ఇవే స దుర్హృదాం హృది నేత్రయోః ।**
**సోమవత్సుహృదాగాసీన్మానసేషు స్వకేష్వపి ॥ 23**

**అఖండమాఖండలవత్ కోదండం కలయన్ రణే ।**
**పలాయమానైరాలోకి శత్రుసైన్యవలాహకైః ॥ 24**

**స ధర్మరాజవద్రాజా ధర్మాధర్మవివేచకః ।**
**అదండ్యేఽదండయన్నామో దండ్యాంశ్చ పరిదండయన్ ॥ 25**

**పాశీవ పాశయాంచక్రే వైరిచక్రం విదూరగః ।**
**సోఽభూత్పుణ్యజనాధీశో రిపురాక్షసవర్ధనః ॥ 26**

**జగత్ప్రాణసమానశ్చ జగత్త్రాణనతత్పరః ।**
**రాజరాజః స ఏవాభూత్సర్వేషాం ధనదః సతామ్ ॥ 27**

**స ఏవ రుద్రమూర్తిశ్చ ప్రైక్షిష్ట రిపుభీషణే ।**
**విశ్వేదేవాస్తతస్తం తు స్తువంతి చ భజంతి చ ॥ 28**

ఇట్లు ధర్మప్రతాపాన్వితుడగు శ్రీసీతారాముడు ధర్మముతో అయోధ్యను రాజధానిగా ఏర్పరుచుకొని ప్రజలను చక్కగా పరిపాలించుచుండగా; అతడు దుష్టుల హృదయములకు సూర్యునివంటివాడై తపించెను. సత్పురుషులయొక్క, స్వజనులయొక్క మనస్సులలో చంద్రునివంటి వాడైయుండెను. ఇంద్రునివలె రణమున అఖండకోదండమును బూని పగవారిసేనలను మేఘముల వలె పరుగెత్తగా చూచుచుండె. అతడు సమవర్తియగు యమధర్మరాజువలె నిరపరాధులను శిక్షించక సాపరాధులను శిక్షించుచుండె. (25) ఆ శ్రీరాముడు, ఆసన్నశత్రుసమూహమును పాశియగు వరుణునివలె పాశ గతులను జేసి గెల్చుచుండును. శత్రువులగు రాక్షసులను మర్ధించుటచే పుణ్యజనులనిన ధనపతియగు కుబేరుడయ్యె. జగత్తును కాపాడుటలో ఆసక్తుడగుటచే జగమునకు ప్రాణమైన వాయుదేవునికి సమానుడయ్యె, సత్పురుషులందరికిని ధనము ఇచ్చువాడైన శ్రీరాముడే ధనములను ఇచ్చునట్టి రారాజుడయ్యె. ధనదుడు రాజరాజు అను నామములు మాత్రమే కుబేరునికని భావము. అతడే శత్రుభయంకరత్వమున సాక్షాత్ రుద్రుడుగానుండును. అందువలన అతనిని సమస్త దేవతలును స్తుతించుచు భజించుచుందురు.

**అసాధ్యః స హి సాధ్యానాం వసుభ్యో వసునాధికః ।**
**గ్రహాణాం విగ్రహధరో దస్రతోఽజస్రరూపధృక్ ॥ 29**

**మరుద్గణానగణయంస్తుషితాంస్తోషయన్ గుణైః ।**
**సర్వవిద్యాధరో యస్తు సర్వవిద్యాధరేష్వపి ॥ 30**

**అగర్వానేవ గంధర్వాన్యశ్చక్రే నిజగీతిభిః ।**
**రరక్షుర్యక్షరక్షాంసి తద్దుర్గం స్వర్గసోదరమ్ ॥ 31**

**నాగా నాగాంస్తిరశ్చక్రుస్తస్య రాజ్యే బలీయసః ।**
**దనుజా మనుజాకారం కృత్వా తం తు సిషేవిరే ॥ 32**

**జాతా గుహ్యచరా యస్య గుహ్యకాః పరితో నృప ।**
**సంసేవిష్యామహే రాజన్ సురాస్త్వాం స్వస్యవైభవైః ॥ 33**

వయం తతస్త్వద్విషయే సురావాసోఽపి దుర్లభః ।
ఇత్యుక్త్వా రామచంద్రం తే మఘవాద్యాః సిషేవిరే ॥ **34**

అశిక్షయత్ క్షితిపతేరిహ యస్య తురంగమాన్ ।
ఆశుగశ్చాశుగామిత్వం పావమానే పథి స్థితః ॥ **35**

అగజాన్యస్య తు గజాన్నగవర్ష్మసు వర్ష్మణః ।
అజస్రదానినో దృష్ట్వాఽభవన్నన్యేఽపి దానినః ॥ **36**

సదోఽజిరే చ బోద్ధారో యోద్ధారశ్చ రణాజిరే ।
న శాస్త్రైర్వి జతః కశ్చిన్న శాస్త్రైః కేనచిత్ క్వచిత్ ॥ **37**

న నేత్రవిషయే జాతా విషయే యస్య భూభృతః ।
సదా నష్టపదా ద్వేష్యాస్తథా నష్టాపదః ప్రజాః ॥ **38**

కలావానేక ఏవాస్తి త్రిదివేఽపి దివౌకసామ్ ।
తస్య క్షోణిభృతః క్షోణ్యాం జనాః సర్వేకలాలయాః ॥ **39**

ఇతడు సాధ్యనామక దేవతలకు అసాధ్యుడు. వసువనగా బంగారు కలిగియుండుటచే వసుదేవతల కన్న అధికుడు. గ్రహములయొక్క విగ్రహమునందినవాడనిన సర్వగ్రహాధికతేజోయుక్తుడు. అశ్వినీ దేవతలకన్న అధికమయిన సౌందర్యముగలవాడు. మరుద్గణదేవత లితని ఎదుట లక్ష్యభూతులుగారు. స్తుషిత దేవతలను సుగుణములచే సంతోషపరచుచుండును. సమస్తవిద్యాధర దేవతలలోను సకల విద్యలను ధరించినవాడితడు అనబడును. నిజగానమహిమచే గంధర్వుల గర్వమునణగద్రొక్కెను. యక్షరాక్షసులు అతనియొక్క స్వర్గసమానమగు దుర్గమును రక్షించుచుండిరి. నాగులు బలిష్ఠుడగు అతనియొక్క నాగము వలన నాగులను తిరస్కరించిరి. దనుజులు మనుజరూపమునంది అతనిని సేవించిరి. గుహ్యకులను దేవతలు అతనియొక్క మనుష్యులలో గూఢాచారులుగా అవతరించి సేవించిరి. ఇంద్రాది దేవతలందరును, “మహారాజా! నీ విషయమున దేవావాసముకూడా దుర్లభము కావున మేమందరము మా మా వైభవములతోవచ్చి సంసేవించుచున్నాము,” అని చెప్పి భజించు చుందురు. ఆశుగుడనగా వాయుదేవుడు. తనయొక్క ఆశుగామిత్వముననగా త్వరగా సంచరించుటను గగనమార్గమున నిలిచి శ్రీరాముని అశ్వములకు శిక్షనేర్పుచుండును. ఆగమనగా కొండలలో పుట్టినవగుటచే నగజములనబడును. గజములు పర్వతములవంటి దృఢోన్నత దేహములను ధరించినవియై నిరంతము మదోదకమును విడుచుచుండగా, చూచువారగు నితరులును మృగమగు నిదియే గదా అనబడినప్పుడు మనమేల ఊరకుండవలయునని ధర్మ్యములగు దానముల నొసగుచు

దాతలనబడిరి. ఆ శ్రీరామునియొక్క పండితులును, సైనికులును, రంగమునను, యుద్ధ రంగమునను, శాస్త్రములలో ఎచ్చటను ఎవనిచేతను జయింపబడరు. (37)

విద్వేష్యులందరును నష్టపదులనగా కాళ్ళువిరిగినవారలు. అట్లే ప్రజలు నష్టాపదులనగా ఆపదలు లేనివారలు. కావున నష్టపదులనగా విద్వేషులును, అనష్టాపదులగు ప్రజలును శ్రీరామరాష్ట్రమున దృగ్గోచరులు కారు. స్వర్గమున దేవతలలో ఒక్కడే కళావంతుడనిన కాంతిమంతుడు చంద్రుడు గలడు. రామ రాజ్యమున జనులందరును కళావంతులనిన అందరును విజ్ఞానవంతులయి ప్రకాశించు చుందురు.

ఏక ఏవ హి కామోఽస్తి స్వర్గే సోఽప్యంగవర్జితః ।
సాంగోపాంగాశ్చ సర్వేషాం సర్వే కామా హి తద్భువి ॥ 40

తస్యోపవర్తనేఽప్యేకో న శ్రుతో గోత్రభిక్క్వచిత్ ।
స్వర్గే స్వర్గసదామీశో గోత్రభిత్పరికీర్తితః ॥ 41

క్షయీ చ తస్య విషయే కోఽప్యాకర్ణి న కేనచిత్ ।
త్రివిష్టపే క్షపానాథః పక్షే పక్షే క్షయిష్యతే ॥ 42

నాకే నవగ్రహాః సంతి దేశాస్తస్యాఽనవగ్రహాః ।
హిరణ్యగర్భః స్వర్లోకేష్వేక ఏవ ప్రకాశతే ॥ 43

హిరణ్యగర్భాః సర్వేషాం తత్పౌరాణామిహాలయాః ।
సప్తాశ్వ ఏకః స్వర్లోకే నితరాం భాసతేఽంశుమాన్ ॥ 44

సదంశుకాః ప్రతిగృహం బహ్వాశ్చాస్తత్పురౌకసః ।
సదప్సరా యథా స్వర్భూస్తత్పుర్యపి సదప్సరాః ॥ 45

ఏకైవ పద్మా వైకుంఠే గీయతే విష్ణువల్లభా ।
తత్పౌరాణాం గృహేష్వాసఞ్ఛతపద్మా పృథక్ పృథక్ ॥ 46

అనీతయశ్చలద్ధామ న రాజపురుషాః క్వచిత్ ।
గృహే గృహేఽత్ర ధనదా నాక ఏకోఽలంకాపతిః ॥ 47

ఏవం రామో మహాన్ శ్రేష్ఠః శౌండీయగుణశోభనః ।
సౌభాగ్యశోభీ రూపాఢ్యః శౌర్యౌదార్యగుణాన్వితః ॥ 48

**విజితానేకసమరః శ్రీసమర్పితమార్గణః ।**
**సీతారంజితవామాంగః ఉగ్రః పరపురంజయః ॥ 49**

స్వర్గమునందు కాముడొక్కడే కదా? వాడును అంగములేనివాడై అనంగుడనబడె. రామరాజ్యమునునో అందరికి సమస్త కామములును సాంగోపాంగముగ సమగ్రములుగా ఉన్నవి. (40) అతని దేశమున ఎవ్వడును గోత్రమనిన వంశమును నశింపజేయలేదు, స్వర్గమున దేవరాజగు ఇంద్రుడు గోత్రనాశకుడయ్యె. (పర్వతములను ధ్వంసముచేసినవాడు) కావున స్వర్గాతిశయమీ రామ రాజ్యము (41). క్షయము గలవాడనుట రామరాష్ట్రమునలేదు. స్వర్గమున చంద్రుడు 15 దినములకు ఒకసారి క్షయించుచునే ఉండును. (42) స్వర్గమున నవగ్రహములనిన సూర్యాది గ్రహమూర్తులు గలరు. ఇతనిదేశము అనవగ్రహమై ఒప్పుచున్నది. (భూత ప్రేత పిశాచాది నూతనములగు గ్రహచేష్టా దోషాదులు లేనిదని భావము) స్వర్లోకమున హిరణ్యగర్భుడనిన బ్రహ్మయొక్కడే వసించుచున్నాడు. ఈ రామభూపతియొక్క రాజధానియందు గల నాగరికుల ఇండ్లన్నియును హిరణ్యగర్భములనిన బంగారుచే నిండియున్నవి.

ఏడు గుఱ్ఱములుగలవాడగుటచే సప్తాశ్వుడనిన కాంతులు గలవాడగుటచే అంశుమంతుడని చెప్పబడును. సూర్యుడొక్కడును అయోధ్యావాస్తవ్యులందరును అనేక అశ్వములుగలవారు సదంశకులనగా మంచి వస్త్రాలంకారముగలవారు. స్వర్గమెట్లు మేలైన అప్సరస స్త్రీలుగలదగుటచే సదప్సరమనబడునో అట్లే అయోధ్యయును మంచినీరు గల సరోవరములు గలదగుటచే సదప్సరమనబడును. (45) వైకుంఠమున విష్ణుపత్నియైన పద్మమొకతే గలదందురు. అయోధ్యావాసుల ఇండ్లలో నూరేసి పద్మములు గలవు. (పద్మా=లక్ష్మి, పద్మాః= పద్మసంఖ్యాసువర్ణనిధులు) (46). రామ రాజ్యమునందు చలించుచుండు స్థానములుగలవారును, నీతి భ్రష్టులును అగు రాజపురుషులు లేరు. స్వర్గమున 'ధనద' మనబడు కుబేరుడొక్కడే గలడు. ఇచ్చటనో ప్రతిగృహమునను అన్నములను ధనములను ఇచ్చుచుండువారగుటచే అన్నధనులు ఎందరో గలరు. (47) ఇట్లురాజ్యమేలుచుండు శ్రీరామచంద్రస్వామి మహాత్ముడు, సర్వశ్రేష్ఠుడు, సుప్రఖ్యాత సద్గుణవంతుడు. దివ్య సౌందర్య బంధురుడు. శూరత్వము, ఉదారత్వము మొదలైన గుణములు గలవాడు. అనేక యుద్ధములలో గెలిచినవాడు. లక్ష్మీదేవికర్పించిన యాచకులు గలవాడనిన యాచకులను భాగ్యవంతులను జేసినవాడు. తన ఎడమతొడమీద జానకీదేవిగలవాడు. శత్రునిగ్రహమున అత్యంత భయంకరుడు.

**అనేకగుణసంపూర్ణః పూర్ణచంద్రనిభద్యుతిః ।**
**సతతావభృథక్లిన్నమూర్ధజః క్షితిపర్షభః ॥ 50**

ప్రజాపాలనసంపన్నః కోశప్రీణీతభూసురః ।
పార్వతీకాంతచరణయుగళధ్యానతత్పరః ॥ **51**

విశ్వేశ్వరకథాలాపపరిక్షిప్తదినక్షపః ।
సీతాసంక్షాళితపదస్త్రక్రీడాపరితోషితః ॥ **52**

శశాస రాజ్యం ధర్మేణ బంధుపుత్రసమన్వితః ।
రామే శాసతి సాకేతపుర్యాం రాజ్యం సుఖేన వై ॥ **53**

హృశః పుష్టాః ప్రజాః సర్వాః ఫలవంతోఽభవన్నగాః ।
ఆసన్సదా సుకుసుమైర్విన్రమాః సౌఖ్యదా నృణామ్ ॥ **54**

ఏకపత్నీవ్రతాః సర్వే పుమాంసస్తస్య మండలే ।
నారీషు కాచిన్నైవాసీదపతివ్రతధర్మిణీ ॥ **55**

అనధీతో న విప్రోఽభూన్న శూరో నైవ బాహుజః ।
వైశ్యోఽనభిజ్ఞో నైవాసీదర్థోపార్జనకర్మసు ॥ **56**

అనన్యవృత్తయః శూద్రా ద్విజశుశ్రూషణం ప్రతి ।
తస్య రాష్ట్రే సమభవత్సీతారామస్య భూపతేః ॥ **57**

అవిప్లుతబ్రహ్మచర్యాస్తద్రాష్ట్రే బ్రహ్మచారిణః ।
నిత్యం గురుకులాధీనా వేదగ్రహణతత్పరాః ॥ **58**

అన్యేఽనులోమజన్మానః ప్రతిలోమభవా అపి ।
స్వపారంపర్యతో ద్రష్టుం మనాగ్వర్త్మ న తత్యజుః ॥ **59**

శ్రీరాముడు సమస్త సద్గుణసంపూర్ణుడు, పున్నమిచంద్రునివలె వెలుగుచుండును. ఎల్లప్పుడును యాగములను ఆచరించి అవబృథస్నానములచే తడిసిన వెంట్రుకలుగలవాడు. ప్రకృతిరక్షణముచే సంపన్నుడు. దానధర్మములచే బ్రాహ్మణులకు తృప్తినందించినవాడు. శ్రీగౌరీవల్లభ చరణారవింద ములను భక్తితో ధ్యానించువాడు. జగత్పతియగు సాంబశంకరునియొక్క దివ్యాప దానములనుబట్టి, సల్లాపము చేయుటచే, ఉల్లాసమున అహో రాత్రములను గడుపుచుండును. శ్రీసీతాదేవిచే కడగబడిన చరణార విందములు కలిగి ఆ జానకీకాంతతోడ క్రీడించుచు అమందానందము అందియుండును (52).

శ్రీరాముడు సహజ తనుజాదులతోడ రాజ్యమునేలుచుండెను. ఇట్టిరామరాజ్యమున ప్రజలు పుష్టులును, తుష్టులును అయిఉండిరి. సకల వృక్షములును ఫలవంతములుగా ఉండును. అవి పుష్ప ఫలభారములచే వంగినవై మానవులకు సౌఖ్యదాయకములుగా ఉండెను.

రఘుపుంగవుని రాజ్యమున నరులందరును ఏకపత్నీవ్రతమును ఆచరించువారే. నారీమణులలో నొకతెయును పాతివ్రత్యధర్మములను వదలదు. వేదాధ్యయనమును చేయని బ్రాహ్మణుడులేడు. శూరుడుకాని క్షత్రియుడు లేడు. ధనార్జనలో నేర్పరికాని వైశ్యుడులేడు. శూద్రులు ద్విజసేవానిరతులయి అన్యవృత్తిని అవలంబింపకయుందురు. రామరాజ్యమున బ్రహ్మచారులందరును వేదాధ్యయనమును తప్పక చేయుచుందురు. ఎల్లప్పుడును గురుకులమునకు అధీనులై వేదగ్రహణాసక్తులై ఉందురు. (58)

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములవారినుండి వారివారి వర్ణముల స్త్రీలలో క్రమముగా పుట్టినవారు బ్రాహ్మణాది లక్షణసంపన్నులు అనదగుదురు.

బ్రాహ్మణునినుండి– క్షత్రియ స్త్రీయందు మూర్ధావసిక్తుడు, వైశ్యస్త్రీయందు అంబష్టకుడు, శూద్రస్త్రీయందు పారశవుడను నిషాదుడు పుట్టుదురు.

క్షత్రియునినుండి– వైశ్యస్త్రీయందు మాహిష్యజాతి వాడు, శూద్రస్త్రీయందు ఉగ్రుడనువాడును పుట్టును.

వైశ్యునినుండి– శూద్రస్త్రీయందు కరణజాతి పుట్టును. వీరందరును అనులోమజాతివారు.

బ్రాహ్మణ స్త్రీయందు– క్షత్రియపురుషునినుండి సూతజాతి, వైశ్యునినుండి మాగధజాతి, శూద్రునినుండి క్షత్తృజాతి పుట్టును.

వైశ్యస్త్రీయందు– శూద్రుని నుండి అయోగవజాతి పుట్టుచున్నది. ఇవి ప్రతిలోమ జాతులు.

ఈ ప్రతిలోమానుజాతి ప్రభేదములలో సాంకర్యముచేత పుట్టునవి శ్వపాక, పుల్కస, కుక్కుటాది సంకరజాతులనబడుచున్నవి. ఇట్టివారు కూడా శ్రీరామరాజ్యమున తమతమ పరంపరాగత స్థితినెరిగి తన్నీచమార్గమున చూచుటకును ఇచ్చగింపరైరి. (59)

**అనపత్యో న తద్రాష్ట్రే ధనహీనస్తు కోపినః ।**
**విరుద్ధసేవీ నో కశ్చిదకాలమృతిభాండ చ ॥ 60**

**న శఠా నైవ వాచాటా వంచకా నో న హింసకాః ।**
**న పాఖండా నైవ భండా న రండా నైవ శౌండికాః ॥ 61**

శ్రుతిఘోషో హి సర్వత్ర శాస్త్రవాదః పదే పదే ।
సర్వత్ర సుభగాలాపా ముదా మంగళగీతయః ॥ **62**

వీణావేణుప్రవాదాశ్చ మృదంగమధురస్వనాః ।
సోమపానం వినాఽన్యత్ర పానగోష్ఠీ న కర్మగాః ॥ **63**

మాంసాశినః పురోడాశం నైవాన్యత్ర కథంచన ।
న దురోదరిణో యత్రధర్మిణో న చ తస్కరాః ॥ **64**

పుత్రస్య పిత్రోః పదయోః పూజనం దైవపూజనమ్ ।
ఉపవాసో వ్రతం తీర్థ దేవతారాధనం పరమ్ ॥ **65**

నారీణాం భర్తృపదయోః స్వర్చన తద్వచః శ్రుతిః ।
సమర్చయతి సతతం నిజమగ్రజమాదరాత్ ॥ **66**

సమర్చయంతి ముదితా భృత్యాః స్వామిపదాంబుజమ్ ।
హీనవర్ణైరగ్రవర్ణో వర్ణ్యతే గుణగౌరవైః ॥ **67**

వరివస్యంతి భూయోఽపి త్రికాల భూమిదేవతాః ।
సర్వత్ర సర్వే విద్వాంసః సమర్చంతే మనోరథైః ॥ **68**

విద్వద్భిశ్చ తపోనిష్ఠాస్తపోనిష్ఠైర్జితేంద్రియాః ।
జితేంద్రియైఃజ్ఞాననిష్ఠా జ్ఞానిభిః శివలింగినః ॥ **69**

రామరాజ్యమున– బిడ్డలులేనివాడు, ధనములేనివాడు, తప్పుదోవన పోవువాడు, అకాల మరణము గలవాడు, మూర్ఖుడు, అక్కరమాలినవాడు, పలుమాటలవాడు, ధూర్తుడు, హింసించువాడు, జారిణులు, పాషండులు, విధవలు, గర్వులు మొదలైన ఇట్టి దుర్మార్గులు లేరు. అంతటా వేదఘోషము కర్ణానంద ప్రదమై ఒప్పుచుండును. అడుగడుగున శాస్త్రప్రసంగములు వినిపించుచుండును. ఎచ్చట చూచినను భాగ్యవంతుల ఉల్లాస సల్లాపములే. అంతట మంగళసంగీతములు, వేణు వీణా మృదంగాది మంగళ వాద్యములు, మధురస్వరములు వినిపించుచుండును. యజ్ఞీయ కర్మాంగము సోమపానము తప్ప, మద్యపానప్రసక్తి రామరాజ్యమున రాదయ్యె. మాంసాహారము అనునది యజ్ఞీయమగు హోమశేష పురోడాశమునందేగాని ఐచ్ఛికముగా ఎచ్చటను లేదు. జూదగాండ్రు లేరు, అధర్మిష్ఠులు లేరు, దొంగలు లేరు. శ్రీరామరాజ్యమున పుత్రులకు తమ తల్లిదండ్రుల పాదసేవయనునది దేవతారాధనము. పితృపాదసేవయే దైవపూజనము, తల్లిదండ్రుల భజించుటయే ఉపవాసతీర్థ

వ్రతసేవనాదులు. అట్లే స్త్రీలకు మగని పాదములను పూజించుటయే సకల ధర్మాచరణము. పతి వాక్యములను వినుటయే వేదశ్రవణము. నరులు తమతమ అన్నలను సంపూజించుచుందురు. సేవకులు తమ యజమానులను దైవములని భజించుచుందురు. హీనవర్ణమువారు ఉత్తమ వర్ణములవారిని గుణగౌరవాదులచే ప్రశంసించుచుందురు. త్రికాలములలోను పలుమార్లు బ్రాహ్మణులు పూజింపబడుచుందురు. అంతట అందరు విద్వాంసులు. విద్వాంసుల నుండి తపస్సంపన్నులు, తపస్సంపన్నులనుండి జితేంద్రియులు, జితేంద్రియులనుండి జ్ఞాన నిష్ఠులు, జ్ఞాననిష్ఠులనుండి శివలింగులుగా గౌరవింపబడుదురు.

**మంత్రపూతం మహోర్వ్యాం చ విధియుక్తం సుసంస్కృతమ్ ।**
**బాడబానాం ముఖాగ్నౌ చ హూయతేऽహర్నిశం హవిః ॥ 70**

**వాపీకూపతటాకానామారామాణాం పదే పదే ।**
**శుచిభిర్ద్రవ్యసంభారైః కర్తారో యత్ర భూరిశః ॥ 71**

**తద్రాష్ట్రే హృష్టపుష్టాశ్చ దృశ్యంతే సర్వజాతయః ।**
**అనింద్యసేవాసంపన్నా వినా మృగయుసైనికాన్ ॥ 72**

**యస్య రాజ్యే పతాకాసు చంచలా శ్రీర్న రాష్ట్రకే ।**
**ఐరావతోస్త్యేక ఏవ శుభ్రః స్వర్గే గజో మహాన్ ॥ 73**

**చతుర్దంతో రామరాజ్యే తద్వన్నాగాః సహస్రశః ।**
**ఇందుసూర్యావుభావేవ శోభేతే గగనాంగణే ॥ 74**

**రామరాజేऽత్ర నారీణాం సీమంతస్థా అనేకశః ।**
**వృషోऽస్త్యేకః స కైలాసే గీయతే పరమః సితః ॥ 75**

**తద్వద్వృషా రామరాజ్యే కృషికర్మణి యోజితాః ।**
**ఏణోऽస్త్యేకశ్చంద్రలోకే కృష్ణవర్ణో మనోరమః ॥ 76**

**తద్వదత్ర శిశూనాం హి క్రీడార్థం సంత్యనేకశః ।**
**అప్సరాసు వరా స్వర్గే గీయతే సా తిలోత్తమా ॥ 77**

**గేహే గేహే సంతి నార్యః సర్వాస్త్వత్ర తిలోత్తమాః ।**
**రుక్మభూషణభూషాఢ్యా గతినూపురనిఃస్వనాః ॥ 78**

అహోరాత్ర మనగా ఎల్లప్పుడును అత్యుత్తమములగు మంత్రపరిశుద్ధములును, విధివిధాన రచితములును, సుసంస్కృతములైన యజ్ఞద్రవ్యములచే బ్రాహ్మణ సమారాధనలు చక్కగా జరుగు చుండును. బావులు, సరోవరములు, చెరువులు, తోటలు మొదలగువాటి మంగళద్రవ్యసంభారములచే విశేషముగా ఏర్పరుచునట్టి ధర్మప్రభువులు నిండియుందురు మరియు ఆ రామరాజ్యమున అన్ని జాతులవారును సంతృప్తులు, సంతుష్టులు, సంపుష్టులుగా ఉందురు. వేటగాండ్రగు సైనికులు తప్ప తక్కినవారిలో నింద్యసేవాపన్నులగువారు ఎవరును లేరు. రామ రాజ్యము చంచలయిన శ్రీ యనగా కాంతి పతాకములలో ఉండునుగాని, చంచలమైన శ్రీ అనగా సంపద రాజ్యమునలేదు. రాజ్యము సుస్థికసౌభాగ్యము. స్వర్గమున ఐరావతమను ఒక ఏనుగు శుభ్రమయినది గలదు. రామరాజ్యమున అట్టి నాలుగుదంతములు గల తెల్లని ఏనుగులు వేలకొలదిగా వెలయుచుండును. ఆకాశమున సూర్య చంద్రులిరువురే ప్రకాశించెదరు. రామరాజ్యమునగల స్త్రీలయొక్క సీమంతములలో అనేక చంద్ర సూర్యులు ప్రకాశించుచుందురు. కైలాసమున ధవళవృషభము ఒక్కటి గలదు. అట్టివి అనేకములు రామరాష్ట్రమునందు దున్నుచుండును. చంద్రలోకమున కళంకాకృతిచే ఒప్పుచుండు నల్లని లేడియొక్కటి బాగుగా ఉన్నది. ఇచ్చటి బాలురనాడించుటకై అనేక లేడిపిల్లలు గలవు. స్వర్గమునందు అప్సర స్త్రీలలో తిలోత్తమ అనునది సర్వోత్తమయనబడినది గదా! రామరాజ్య పరిపాలనావసరమున ఇంటింటిలో నుండు ఇల్లాండ్రందరును తిలోత్తమలవలె, సువర్ణాభరణములతో అలంకరించుకొని యుందురు.

**సహస్రాక్ష్యోఽస్తేక ఏవ మహాన్స్వర్గే ప్రగీయతే ।**
**రామరాజ్యే చామరాణి సహస్రాక్షీణ్యనేకశః ॥ 79**

**సుధాపానం త్వేకమేవ స్వర్గేస్తి పరమం వరమ్ ।**
**తద్వన్నానారసానాం చ పానమత్ర గృహే గృహే ॥ 80**

**సుధాపానేన సంహృష్టా యథా స్వర్గసురోత్తమాః ।**
**దయితాఽధరపానేన తథాఽత్ర సుఖినో జనాః ॥ 81**

**సాగరేష్వేవ సా దృష్టా మర్యాదా సర్వదా నరైః ।**
**రామరాజ్యేత్ర బాలేషు మర్యాదా సర్వదేక్ష్యతే ॥ 82**

**విచరంతి గజారూఢాః శ్రూయంతే పార్థివాః పురా ।**
**పౌరా జానపదాః సర్వే విచరంత్యత్ర తే గజైః ॥ 83**

పూర్వం శ్రుతం శిశూనాం హి చుంబనం దివసే ముహుః ।
రామరాజ్యేఽనిశం నారీచుంబనాని ముహుర్ముహుః ॥ 84

క్రీడా పరిమళద్రవైః ఫాల్గునే సా శ్రుతా పురా ।
క్రీడాం పరిమళద్రవ్యైః పౌరాశ్చక్రుః సదాఽత్ర తే ॥ 85

ఏవం తద్రామరాజ్యం హి మహామంగళసంయుతమ్ ।
అసీదనుపమేయం చ శ్రవణాన్మంగళప్రదమ్ ॥ 86

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, రామరాజ్యవర్ణనం నామ, పంచదశః సర్గః ॥**

స్వర్గమున ఇంద్రు(సహస్రాక్షు)డొకడు చక్కగా ఉన్నాడందురు గదా? ఈ రామరాజ్యమున చామరములు అన్నియును సహస్రాక్షములే, అవియును లెక్కలేనన్ని గలవు. అనిన వింజామరలు నెమలిరెక్కలతో నిర్మింప బడినవనుట. అమృతపానమునమాత్రమే స్వర్గమునగలదు. రామరాజ్యమున ప్రతిగృహము నను నవరసములు అనుభవింపబడుచుండును. స్వర్గవాసులు సుధాపాన సంతుష్టులయినట్లు రామరాష్ట్ర వాసులు ప్రేయసీబింబాధర పానములచే ఆనందించుచుందురు. మర్యాదయనగా తీరమును అతిక్రమించనివాడు సముద్రుడొక్కడే అనిగదా ప్రసిద్ధము. రామరాజ్యమునగల బాలకులు కూడా మర్యాద ఉల్లంఘించక సత్ప్రవర్తకులై నడుచుకొనుచుండిరి.

రాజులేగదా గజారూఢులై సంచరించువారలు? రామరాజ్యమున ప్రజలందరును ఏనుగులను ఎక్కి కనిపించెదరు. అందరును అంతట నిర్విచారులై శృంగార లీలలందు తేలుచుండిరి. ఎచ్చటనో మునుపు శిశిరవసంతములో పుష్పగంధోత్సవములనందుదురు, ఇచ్చట ప్రజలెల్లప్పుడు సార్వకాలిక పుష్పగంధోత్సవములనంది ఆనందించుచుందురు. ఇట్లు శ్రీరామరాజ్యము అసమానమై నిత్యమంగళముగా ప్రవర్తిల్లుచుండె. ఇది వినినవారికిని సన్మంగళప్రదమై యుండును.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణములో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, రామరాజ్యమును వర్ణించు 15వ సర్గ ముగిసినది.**

# షోడశః సర్గః-16వ సర్గ

రాజనీతి శిక్షణ

శ్రీరామదాస ఉవాచ

ఏకదా రాఘవః శ్రీమాన్ సమాహూయ కుశం లవమ్ ।
లక్ష్మణం భరతం చాపి శత్రుఘ్నం రహసిస్థితః ॥ 1

రాజనీతిం విస్తరేణ శిక్షయామాస సాదరమ్ ।
శృణు వత్స కుశాద్య త్వం యూయం సర్వే లవాదికాః ॥ 2

శృణుతాత్ర స్వస్థచిత్తా రాజనీతిం వదామ్యహమ్ ।
కుశ త్వం పృథివీపాలో భవిష్యసి గతే మయి ॥ 3

వైకుంఠం శృణు తస్మాత్త్వం సావధానమనా భవ ।
అనృతం నైవ వక్తవ్యం నృపేణా చిరజీవినా ॥ 4

నాతికామీ న వై క్రోధీ రాజా స సుఖమర్హతి ।
పరదారరతిస్త్యాజ్యా సర్వథా పార్థివేన హి ॥ 5

సత్యం శౌచం దయా క్షాంతిః ఆర్జవం మధురం వచః ।
ద్విజగోయతిసద్భక్తిః సప్తైతే శుభదా గుణాః ॥ 6

నిద్రాలస్యం మద్యపానం ద్యూతం వారాంగనారతిః ।
అతిక్రీడాఽతిమృగయా సప్త దోషా నృపస్య చ ॥ 7

పుత్రవత్పాలనీయాశ్చ ప్రజా నృపతినా భువి ।
షష్ఠాంశః కరభారశ్చ రాజ్ఞా గ్రాహ్యః సదైవ హి ॥ 8

## శ్రీరామచంద్రుడు కుశునికి రాజనీతిని ఉపదేశించుట.

శ్రీరామదాసు; విష్ణుదాసునికి ఇట్లు చెప్పుచున్నాడు, ఒకప్పుడు శ్రీరఘునందనుడు- కుశుని, లవుని, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను-పిలిపించి రహస్యమున రాజనీతిని ఇట్లు ఉపదేశించెను; నీవు వినుము కుశబాలకా! లవాదులారా! నెమ్మదితో మీరును వినుడు. రాజనీతిని చెప్పుచున్నాను.

కుశుడా! నేను వైకుంఠమునకు వెళ్ళిన తరువాత నీవు భూపాలకుడవు అవుదువు. కావున సావధానచిత్తుడవగుము. దీర్ఘకాలము బ్రతుకగలరాజు అసత్యమునాడరాదు. రాజు మిగుల కాముకుడైనను, మిక్కిలి కోపముగలవాడైనను సుఖమునందదు. పరదారాసక్తిని వదిలివేయాలి. యథార్థమాడుట, పారిశుధ్యము, భూతకారుణ్యము, సహనము, ఋజుత్వము, ప్రియసంభాషణము, గో బ్రాహ్మణ భిక్షువులయందు భక్తియనునవి సప్తగుణములు మంగళప్రదములైన అవి- 1. నిద్రా ళుత, 2. సోమరితనము, 3. మద్యపానము, 4. జూదము, 5. గణికాసక్తి, 6. అతిక్రీడ, 7. మిగుల వేటాడుట- ఇవి సప్తదోషములు. రాజునకు హానినిచ్చునవి. ఇలలో రాజు; ప్రజలను పుత్రునివలె కాపాడవలయును. ఎప్పుడును ఆరవ అంశమునే పన్నుగా అంగీకరింపవలయును.

జ్ఞేయం చారైః సదా వృత్తం పృథివ్యాః పార్థివేన వై ।
పరరాష్ట్రే సదా దూతా నానావేషవిరూపితాః ॥ 9

పంచ పంచాథవా ద్వౌ ద్వౌ ప్రేషణీయా నృపేణ హి ।
న విశ్వసేత్పారకీయజనే దూతే నృపోత్తమః ॥ 10

దండో భేదస్తథా సామ దానం కాలోచితం చరేత్ ।
స్వకార్యం సాధయేద్యుక్త్యా కాలే ప్రాప్తం నృపోత్తమః ॥ 11

మనసా చింతితం కార్యం కథనీయం న కస్యచిత్ ।
కృత్వా కార్యం దర్శనీయం జనాన్మంత్రిజనానపి ॥ 12

మాసే మాసే స్వకోశస్య పరామర్శో నృపోత్తమైః ।
గృహణీయః సర్వదైవ విశ్వసేత్సేవకేషు న ॥ 13

వర్షే వర్షే నగర్యాశ్చ ప్రాకారస్య నృపోత్తమైః ।
పరిఖానాం పరామర్శః కార్యో మంత్రిజనైః సహ ॥ 14

చతుర్మాసేషు సర్వాణాం మార్గాణాం పార్థివోత్తమః ।
పరామర్శః సదా కోష్ఠాగారాదీనాం ప్రకారయేత్ ॥ 15

పక్ష పక్షే వారణానాం తురంగాణాం తథాఽష్టభిః ।
దివసైర్మాసమాత్రేణ వస్త్రాణాం పార్థివోత్తమైః ॥ 16

పరామర్శః సదా కార్యః పికాదీనాం త్రిభిర్దినైః ।
సీమాచారజనానాం చ షణ్మాసైశ్చ నృపోత్తమైః ॥ 17

పరామర్శః సదా కార్యస్తథా జనపదస్య చ ।
మాసే మాసే స్వసైన్యస్య వాపీనామయనేన హి ॥ 18

కార్యః పుష్పవాటికానాం మాసే మాసే నృపోత్తమైః ।
పరామర్శః స్వయం గత్వాఽథ వా మంత్రిజనోత్తమైః ॥ 19

వర్షే వర్షే సముద్యోగః షణ్మాసైరథవా త్రిభిః ।
మాసైర్నృపేణ స్వే రాష్ట్రే కార్యః సైన్యేన యత్నతః ॥ 20

దేవానాం బ్రాహ్మణానాం చ గురూణాం యతినాం తథా ।
అసంతోషో నైవ కార్యః పార్థివేన కదాఽపి హి ॥ 21

రాజు ఎల్లప్పుడూ లోకములో జరుగు సర్వవృత్తాంతమును చారులవలననే తెలుసుకోవలయును. వివిధవేషములను ధరించిన దూతలను ఐదేసిమందిని గాని, ఇద్దరిద్దరిని గాని పరరాష్ట్రములకు పంపుచునే యుండవలయును. పరదేశస్థుడైవచ్చిన దూతనెన్నడును నమ్మవలదు. సామ, దాన, భేద, దండములను కాలోచితముగా ఉపయోగించవలయును. సమయమువచ్చినపుడు తనపనిని తాను సాధించుకొనవలయును. మదినెంచిన పనిని ఎవ్వరికీ చెప్పరాదు. పని జేసి దానిని జనులకును, మంచిమంత్రులకును చెప్పవలయును. ప్రతినెలా ఖజానాను పరామర్శింపవలయును. సేవకులందే విశ్వాసముంచి ఎప్పుడును వర్తింపకుము. ప్రతి సంవత్సరము మంత్రులతో గూడి ఊళ్ళను, కోటలను, కందకములను పరిశీలించునది. నాలుగు నెలలకోమారి సమస్త మార్గములను, ఇండ్లను విచారించు చుండదగును. 15 దినములకు ఒకమారు ఏనుగులను, 8 దినములకు ఒకమారు గుఱ్ఱములను, నెలకు ఒకమారు వస్త్రాది భండారములను, మూడేసి దినములకు ఒకతూరి కోకిలలు మొదలైన పక్షులను, ఎల్లలలో పనిచేయు వారిని ఆరేసినెలలకును, సంతతము దేశక్షేమమును, ప్రతినెలా తన సైన్యములను, ఆరు నెలలకోమారు బావులను, ప్రతినెలా పూదోటలను తానే వెడలి గాని, మంత్రి జనుల నంపిగాని పరామర్శింపవలయును. రాజులు తమసేనలతోను, మంత్రులతోను తమ రాష్ట్రములలో మూడు నెలలకో, ఆరునెలలకో, తుదకు సంవత్సరమునకైనను సంచార సముద్యోగమును ఒనరించవలయును. దేవ, గురు, బ్రాహ్మణ, యతులకు అసంతృప్తి నెన్నడును కలుగజేయరాదు.

ద్రవ్యాదాయం సదా పశ్యేత్స్వవ్యయం తు నిరీక్షయేత్ ।
ఆదాయస్య చతుర్థాంశైర్వ్యయః కార్యో నృపోత్తమైః ॥ 22

తృతీయాంశేన వా కార్యస్త్వర్ధాంశేన కదాపి నః ।
ఇశః కార్యా మంత్రిణశ్చ నాఽతికోపం సమాచరేత్ ॥ 23

నాతిమాన్యా మంత్రిణశ్చ వర్ధనీయాః కదాపి న ।
న విరోధ్యాః కదా రాజ్ఞా దుర్గపాలాస్తథైవ చ ॥ 24

ఆకురాణాం పట్టణానాం దుర్గాణాం గిరివాసినామ్ ।
అరణ్యవాసినాం సింధావుపద్వీపనివాసినామ్ ॥ 25

సింధుతీరస్థితానాం చ నానాదేశనివాసినామ్ ।
వర్షాంతరస్థితానాం చ ద్వీపాంతరనివాసినామ్ ॥ 26

ద్వీపే ద్వీపే పృథగ్వర్షవాసినాం పార్థివోత్తమైః ।
పరామర్శ్యః సదా కార్యశ్చారైః పక్షాంతరేణ హి ॥ 27

పరరాష్ట్రాద్గుప్తరూపైః కాషాయాంబరధారిభిః ।
అవధూతాదివేషైశ్చ తథా కార్పటికోపమైః ॥ 28

వణిగ్రూపధరైర్దూతైః వృత్తం వేద్యం నృపోత్తమైః ।
తత్ర తత్రాధిపాః సర్వేఽబ్దేఽబ్దే కార్యాస్తు నూతనాః ॥ 29

ఏక ఏవ చిరం రాజ్ఞా న స్థాప్యః సేవకః క్వచిత్ ।
పరసైన్యాని వేద్యాని ద్రష్టవ్యం స్వబలం సదా ॥ 30

పరరాష్ట్రగతో దూతః స్వీయరాష్ట్రే విలోకయేత్ ।
ఇష్టశ్చేన్నైవ దండ్యః స పరదూతం న శిక్షయేత్ ॥ 31

పరదూతో మోచనీయః సన్మానేన నృపోత్తమైః ।
స్వసీమారక్షిణో దూతాః శిక్షణీయా ముహుర్ముహుః ॥ 32

పరదూతః కథం ముక్తః స్వీయరాష్ట్రే పురేఽథవా ।
అద్యారభ్య సూక్ష్మదృష్ట్యా ద్రష్టవ్యం చేతి పార్థివైః ॥ 33

ద్రవ్యాదాయమును ఎల్లప్పుడును చూడవలయును. అట్లే సెలవును సమీక్షింపవలయును. ఆదాయములో నాల్గింట ఒకపాలును వెచ్చింప వలయును. మూడింట ఒకపాలునైనను చేయవచ్చును. సగభాగము ఎన్నటికి వెచ్చింపకూడదు. మంత్రులను మంచితనముతో మన్నించుచుండవలయును. వారితో ఎప్పుడును కోపగింపరాదు. వారిని ఎప్పటికీ అత్యంత సత్కారాలతో విఱ్ఱవీగునట్లు చేయనూ కూడదు. అట్లే రాజదుర్గముల ననగా కోటలను కాపాడు వారితో విరోధమును చేసికొనరాదు. రాజులు చారుల మూలకముగా పక్షపక్షమునకు నగర, గ్రామ, దుర్గ, కాంతార ద్వీపాది స్థానములలో ఉండు సమస్త జనులయొక్క యోగక్షేమమును విచారించుచుండవలయును. కాషాయబట్టలు ధరించినవారు, అవధూతాది వేషములోనున్న వారును, వాణిజ్య వర్తక వేషధారులను అగు దూతలనంపి పరదేశములనుండి వృత్తాంతములను ఎరుగవలయును. అచ్చటచ్చట రాజ్యములలో అతిథులు ప్రతి సంవత్సరముననను క్రొత్తవారుగా ఉందురు. కార్యములు క్రొత్తవిగనుండును. రాజు ఎచ్చటైనను ఒకనినే పాలకునిగా ఉంచరాదు. పరబల, నిజబల తారతమ్యమును ఎప్పుడును గమనించు చుండవలయును. పరదేశములనుండి దూత ఎవడైనను వచ్చినచో వానిని జూచి, శిక్షింపక సమ్మానించి విడువవలయును. తనదేశపు సరిహద్దులను కాపలాకాయు భటులను, "ఎట్లు పరదేశస్థుడగు దూత ఇచ్చటికి వచ్చెను? పోనిమ్ము, ఇకమీదట జాగరూకుడై కనిపెట్టియుండు," మని పలుమార్లు శిక్షించుచునే యుండవలయును.

**అగ్రేసరం పార్శ్వగౌ చ పశ్చాద్భాగస్య రక్షకమ్ ।**
**సేనాపతిం మంత్రిణం చ స్వీయం ప్రతినిధిం తథా ॥ 34**

**సూతం చామరహస్తం చ దూతం నికటవర్తినమ్ ।**
**దానమానైస్తోషయేచ్చ సదా రాజ్ఞా సుబుద్ధినా ॥ 35**

**దేశం కాలం బలం కోశం నిజోత్సాహం నృపోత్తమైః ।**
**ఆదౌ బుద్ధ్వా నిరీక్ష్యాథ రిపోశ్చాపి పరీక్షయేత్ ॥ 36**

**నిజమిత్రా నృపాః సర్వే తథా స్వసుహృదో నృపాః ।**
**సుహృదాం సుహృదశ్చాపి మిత్రామిత్రాన్పరీక్షయేత్ ॥ 37**

**నిజమిత్రబలం దృష్ట్వా మిత్రమిత్రబలం తథా ।**
**బలం స్వ సుహృదాం చాపి స్వసుహృత్సుహృదాం బలమ్ ॥ 38**

**ఆదౌ నృపైః పరీక్ష్యాథ రిపోశ్చైవ నిరీక్షయేత్ ।**
**కే స్వీయాః పార్థివా రాష్ట్రే పారకాయ నృపాశ్చ కే ॥ 39**

సుహృదః స్వనృపాణాం చ బలం తేషాం నిరీక్షయేత్ ।
ద్రష్టవ్యా రిపవః స్వీయా రిపూణాం రిపవస్తథా ॥ **40**

దృష్ట్వా రిపూణాం రిపుభిః కార్యా రాజ్ఞా హి మైత్రికీ ।
పరస్య శత్రుః పాల్యో న పాల్యశ్చేత్త పరీక్షయేత్ ॥ **41**

పాల్యం శత్రుబలం దృష్ట్వా శత్రుమిత్రబలం తథా ।
పాల్యం శత్రుసుహృత్సైన్యం దృష్ట్వా పాల్యం సురక్షయేత్ ॥ **42**

పరరాష్ట్రే చారనేత్రైర్నద్యో దుర్గాణి పర్వతాః ।
అరణ్యాని దుష్టమార్గశ్చోరమార్గా జలాశయాః ॥ **43**

జ్ఞాతవ్యాః స్వపురే పూర్వముద్యోగశ్చ తతశ్చరేత్ ।
పరరాష్ట్రేఽపి బుద్ధ్వా హి గంతవ్యం పార్థివైః సుఖమ్ ॥ **44**

యత్రాగ్రే గమనం స్వీయం కేషాం వాచ్యం న తత్కదా ।
పూర్వే గంతుం నిజేచ్ఛా చేన్నిక్షిపేదుత్తరే ధ్వజమ్ ॥ **45**

ఉత్తరాభిముఖః కార్యః సేనావాసో నృపేణ హి ।
అగ్రేసర చోత్తరం హి నృపేణాజ్ఞాప్య సాదరమ్ ॥ **46**

క్రోశార్ధాంతే గతం దృష్ట్వా గచ్ఛేత్పూర్వే స్వయం నృపః ।
ఏవం ధ్వజః కదా యామ్యే పశ్చిమే వా పరాగ్దిశి ॥ **47**

నేర్పరియైన రాజు తనకు ముందు, వెనుక, ఇరువైపుల ఉండెడు రక్షకులను, సేనాపతిని, మంత్రిని, తన ప్రతినిధియగువానిని, సారథిని, చామరధారకునిని, సన్నిహిత భటులను, సన్మాన దానాదులచేత సంతతము సంతోషపరచుచుండవలయును. రాజు తనయొక్క దేశ, కాల, బల కోశాదులను పరీక్షించి శత్రువులయొక్క దేశ, కోశ, కాల్బలములను పరిశీలించి నడుచుకొనవలయును. తన మిత్రులును, సుహృత్తులును అగు రాజులను పరికించి, వారిలో మిత్రులకు మిత్రులెవ్వరు? సుహృత్తులకు సుహృత్తులెవ్వరు? అని పరీక్షించి, మిత్ర బలమును, మిత్రమిత్ర బలమును, సుహృద్బలమును, సుహృత్సుహృత్ బలమును పరీక్షించుకుని, పిదప అట్లే శత్రురాజునకును విచారింపవలయును. స్వీయులెవరు? పరకీయులెవరు? తనవారైన రాజులయొక్క సుహృత్తులయొక్కయు బలమును పరిశీలించి, అట్లే తన శత్రువులెవ్వరు? శత్రువునకు శత్రువులెవ్వరు? అనుదానిని ఎరుగవలయును.

రాజగువాడు తన శత్రువునకు శత్రువులగువారి తోడ స్నేహమును పెంచవలయును. పరుని శత్రువును రక్షింపరాదు. పరీక్షించి వానిని రక్షింపవచ్చును. అట్లే శత్రుబలమును శత్రుమిత్రబలమును చూచి కాపాడునది. శత్రుసుహృత్ సైన్యమును, అట్లే రాజు పరుల రాజ్యములలో చారులను నేత్రములచే నదులను, దుర్గములను, కొండలను, దొంగదోవలను, అడవులను, కాలిబాటలను, నీటి ఉనికిపట్టులను తెలిసికొనవలయును. మొదటనే తన నగరంలో ప్రయత్నము జరిగియుండనగును. పరదేశ సంచారావసరమున రాజునకు మిక్కిలి చాతుర్యము కలిగియుండవలయును. పరరాష్ట్రమున ఇక తాను ఎచ్చటికి వెడలునో ఆ సంగతిని ఎవరికిని చెప్పరాదు. తూర్పుదిక్కునకు ప్రయాణము జరుగవలసియున్న ఉత్తరమున ధ్వజమును పెట్టింపవలయును. ఉత్తరాభిముఖముగా సైన్యమునునిలిపి, సేనాపతికి పూర్వప్రయాణమును తెలిపి, క్రోసెడుదూరము ఉత్తరమునకు పోయిన పిదప తాను తూర్పునకు వెడలనగును.

**పరరాష్ట్రే రోపణీయాశ్చారైర్వృత్తం తు వేదయేత్ ।**
**స్వరాష్ట్రే గమనం యస్యాం దిశి తస్యాం నృపోత్తమైః ॥ 48**

**రోపణీయో ధ్వజః ప్రోచ్చైః సేనావాసస్తథాచరేత్ ।**
**యంత్రాణామాయుధానాం చ వాహనానాం బలస్య చ ॥ 49**

**రాజ్ఞా వృద్ధిః సదా కార్యా కార్యో ధాన్యాదిసంగ్రహః ।**
**రాష్ట్రే దుర్గే పురే స్వీయే పత్తనే నిర్జలే వనే ॥ 50**

**జలాశయాః శుభాః కార్యాః కృత్వా కోశవ్యయం బహు ।**
**ప్రాకారార్థేఽథదుర్గార్థేఽథ జలార్థే యో వ్యయః కృత ॥ 51**

**న జ్ఞేయః స వ్యయో రాజ్ఞా జ్ఞేయం రక్షణమాత్మనః ।**
**ధర్మార్థే యో వ్యయో జాతః సోగ్రే జ్ఞేయస్తు సంగ్రహః ॥ 52**

**ఆపదర్థే ధనం రక్షేద్దారాన్రక్షేద్ధనైరపి ।**
**ఆత్మానం సతతం రక్షేద్దారైరపి ధనైరపి ॥ 53**

**పాదముద్రామితం ద్రవ్యం రాజ్ఞా దాయో నిరీక్షయేత్ ।**
**నావలోక్యం యథాకాలం వ్యయే తత్కోటిసంమితమ్ ॥ 54**

**న సేనారహితం రాజ్ఞా గంతవ్యం స్వపురాద్బహిః ।**
**నైకాకీ విచరేద్గ్రామే నైకాకీ క్వాపి సంవిశేత్ ॥ 55**

**నైకాకీ క్వాపి వై స్థేయం న పద్భ్యాం విచరేద్భుహిః ।**
**న గచ్ఛేత్పరగేహేషు వారం వారం నృపోత్తమః ॥ 56**

**న విశ్వసేద్ద్వారపాలం జలద రజక తథా ।**
**ధౌతవస్త్రాణి బుద్ధ్వా హి నృపః సమ్యక్ పరీక్షయేత్ ॥ 57**

**తాంబూలవీటికా గ్రాహ్యాన్తరా దృష్ట్వా పరార్పితా ।**
**వరదత్తం జలం గ్రాహ్యం రాజ్ఞాఽక్షిభ్యాం విలోక్య చ ॥ 58**

**ఫలాని పరదత్తాని పరీక్షేత్పార్థివోత్తమః ।**
**దూరస్థితైర్నృపైర్భావ్యం న తేషాం నికటే చరేత్ ॥ 59**

అదేవిధముగా పశ్చిమమునకు పోవలసియున్న దక్షిణమున వ్యత్యాసమగు ధ్వజమును చూపించవలయును. అప్పుడప్పుడు చారులవలన వృత్తాంతములను తెలుసుకొనుచుండవలయును. తన రాజ్యమున ఎచ్చుట ఏదిక్కునకు పోవలయునో అచ్చుటనే ధ్వజమును స్థాపించి, సేనలను నిలిపి అట్లే పయనమై వెడలవలయును. తన ఖజానాలోని ద్రవ్యములను విశేషముగా వెచ్చించి యంత్రములను, ఆయుధములను, వాహనములను, సైన్యములను, ధాన్యాది సంగ్రహమును, నగర, గ్రామ, అరణ్య, దుర్గ, పర్వతములలో నీళ్ళులేని తావులలో జలాశయములను వీలయినన్ని ఏర్పాటుచేయవలయును. రాజు జలమునకై, కోటలకై, దుర్గములకై చేయునట్టి వ్యయమును వృథాగా భావించక తన రక్షణ ముఖ్యమని భావింపవలయును. ధర్మార్థమై చేయబడిన వ్యయమును ముందు తెలుసుకొనవలయును. ఆపదకై ధనమును, ఆ ధనముచే పత్నులను రక్షించి, వాటిచే స్వాత్మరక్షణ ఒనరింపదగును. పాద చిహ్నంకితమగు ద్రవ్యమును చూడరాదు. కాలానుగుణముగా చేయు వ్యయమున దానికి కోటింతలయినను లెక్కింపరాదు. వెంట సైన్యము లేకుండా ఊరివెలుపలకు వెడలరాదు. ఒంటరిగా గ్రామమున సంచరింపరాదు. ఒంటరిగా ఎచ్చటను ప్రవేశింపరాదు. ఒంటరిగా ఎచ్చటను కూర్చొనరాదు. కాలినడకతో వెలుపలకు వెడలరాదు.

రాజు పరులఇండ్లకు పలుమార్లు పోరాదు. ద్వారపాలకుని, చాకలివానిని, నీళ్ళవానిని నమ్మరాదు. ఉతికిన బట్టలను చక్కగా పరీక్షింపవలయును. ఇతరులిచ్చిన తాంబూలము, విడియములను, జలములను, ఫలములను పరీక్షించి చక్కగా చూచి స్వీకరింపవలయును. రాజేంద్రుడు రాజులను దగ్గరతీసి మాట్లాడరాదు. వారికి సన్నిహితముగా మెలగరాదు.

**సభాం రాజ్ఞా ప్రగంతవ్యం ద్వివారం త్వేకదాఽథవా ।**
**అర్ధయామం సభామధ్యే స్థేయం రాజ్ఞా న వై చిరమ్ ॥ 60**

స్వద్వేశ నగరాద్రాష్ట్రాద్బహిః కార్యో నృపోత్తమైః ।
పాదౌ ప్రసార్య న స్థేయం సభాయాం నృపసత్తమైః ॥ 61

న బాహుబంధనం జాన్వోః కృత్వా స్థేయం నృపోత్తమైః ।
నాతిస్మితం కదా కార్యం సభాయా పార్థివోత్తమైః ॥ 62

సభాయాం సమలైర్వస్త్రైర్న గంతవ్యం కదా నృపైః ।
గణికా గణకా వైద్యా గాయకా వందినో నటాః ॥ 63

పండితా ధర్మశాస్త్రజ్ఞాస్తార్కికా వైదికా ద్విజాః ।
సదా పాల్యా నృపేణైతే దానమానైరహర్నిశమ్ ॥ 64

న విశ్వవసేన్నాపితాయ తోషయేత్తం ధనాదిభిః ।
ప్రజానాం గౌరవం కార్యం దండయేన్న వృథా ప్రజాః ॥ 65

క్లేశయుక్తాః ప్రజాః సర్వా నైవ కార్యాః కదాచన ।
రాజ్యద్వారిస్థితైర్దూతైః సర్వైః తే పార్థివోత్తమాః ॥ 66

ముక్తకంచుకబంధాశ్చ విముక్తకటిబంధనాః ।
సమ్యగ్దృష్ట్వా న్యస్తశస్త్రాః ప్రేషణీయా నృపోత్తమమ్ ॥ 67

రాజాజ్ఞాయా నృపం నత్వాఽఽసనే చోపవిశేత్క్రమాత్ ।
నృపైర్మాండలికైః సర్వైః స్థాతవ్యం పురతోఽథవా ॥ 68

సంమీల్య హస్తౌ పాదౌ చ రాజన్యస్తవిలోచనైః ।
న హసేద్రాజపురతో న జృంభేన్న క్షువేన్ముహుః ॥ 69

తథా న ష్ఠీవనం కార్యం సర్వైర్మాండలికైర్నృపైః ।
ఆగమే గమనే సర్వైర్వందనీయో నృపో ముహుః ॥ 70

నాత్యుచ్చైః సంవదేద్రాజసాన్నిధ్యే పార్థివేతరైః ।
కంచుకేన వినా రాజ్ఞా సభాయాం నోపసంవిశేత్ ॥ 71

మృగయాయాం వారణేంద్రో నైవ హన్యో నృపోత్తమైః ।
నాంతర్వత్నీ మృగీ రాజ్ఞా హంతవ్యా విపినే కదా ॥ 72

రాజు ఒక్కసమావేశంలో రెండసార్లు సభాప్రవేశము చేయరాదు. గంటసేపుకన్నా అధికముగా బహుకాలము సభాసీనుడై ఉండరాదు. రాజోత్తముడు తనకు అనిష్టుడగువానిని తన నగరమునుండి తుదకు దేశమునుండి వెలివేయవలయును. కాళ్ళుచాపి సభలో కూర్చొనరాదు. చేతులతో మోకాళ్ళను కట్టుకుని కూర్చుండరాదు. సభలో అట్టహాసమనగా మిక్కిలి నవ్వుట తగదు. మలిన వస్త్రములతో సభాప్రవేశము చేయరాదు. పండితులు, ధర్మశాస్త్రవేత్తలు, తార్కికులు, వైదికులగు బ్రాహ్మణులు, వైద్యులు, వందిమాగధులు, గాయకులు, గణికులు, గణకులు మొదలైనవారిని రాజు సంతతము సంరక్షించుచుండవలయును. పొగడ్తలను నమ్మరాదు. వానిని ధనాదులతో సంతోషపరుపనగును. ప్రజలను గౌరవింపవలయును. వ్యర్థముగా వారిని దండింపరాదు. ప్రజలకు దుఃఖము కలుగునట్లు ఎన్నటికిని చేయరాదు. రాజ్యద్వారస్థితులగుదూతలు ఇతర పార్థివులనందరిని చక్కగా పరిశోధించి ఆయుధములను తీసిపెట్టి లోపలికంపవలయును. మాండలిక రాజులు మహారాజ సన్నిధికి వందించి ప్రభువునే చూచుచు ఆసనములమీద, చేతులు కాళ్ళను ముడుచుకొని కూర్చుండవలయును. వారు పలుమారు రాజసన్నిధిలో నవ్వుట, తుమ్ముట, ఆవలించుట మొదలగునవి తగవు. ఎట్లయినను అసహ్యత కలిగింపరాదు. మహారాజు సభకువచ్చునపుడు, పోవునపుడును కూడా అందరిచే నమస్కరింపబడును. ఇతర రాజులు రాజసన్నిధిలో బిగ్గరగా మాటలాడరాదు. చొక్కాయలేక సభను ప్రవేశింపరాదు. రాజు వేటాడువేళలో ఏనుగును చంపరాదు. ఎప్పుడైనను గర్భిణియగు మృగిని వేటాడరాదు.

**న నిద్రితశ్చ హంతవ్యః పిబన్నీరం వనేచరః ।**
**తథా స్వశరణం ప్రాప్తో విశ్వస్తో వా కదాచన ॥ 73**

**క్రీడాసక్తో వనే ప్రాణీ నైవ హన్యో నృపోత్తమైః ।**
**సీమాచారానష్టదిక్షు సంస్థాప్య మృగయాం చరేత్ ॥ 74**

**రాత్రౌ మిత్రేణ సహితస్తూష్ణీమేవ నృపోత్తమః ।**
**ఆత్మానం కంబళేనైవ సమాచ్ఛాద్య బహిశ్చరేత్ ॥ 75**

**పురద్వారస్థితానాం చ హ్యర్గళాది నిరీక్షయేత్ ।**
**జనానాం భాషితం సర్వం శ్రోతవ్యం హి శుభాశుభమ్ ॥ 76**

**ఏవం స్వయం ప్రగంతవ్యమథవా ప్రేషయేద్ధితమ్ ।**
**రాత్రౌ రాత్రౌ పురే బుద్ధ్వా శ్రోతవ్యం సకలేరితమ్ ॥ 77**

న కార్యః కలహో గేహే గృహకృత్యం సభాస్థితైః ।
న వాచ్యమణుమాత్రం హి న తూష్ణీం ష్ఠీవనం చరేత్ ॥ 78

న కండూయేచ్చ శిరో రాజా సభాయాం స్వకరేణ వై ।
శ్రుత్వా రిపూణాముత్కర్షం న త్యజేద్ధైర్యమాత్మనః ॥ 79

పలాయనం న సంగ్రామాద్రాజ్ఞా కార్యం కదాచన ।
న రిపూణాం నిజా పృష్ఠిర్దర్శనీయా కదాచన ॥ 80

నోడుపేన తరేద్రాజా నదీం ముఖ్యాం కదాపి హి ।
సేతుం వినా నదీ రాజ్ఞా నోత్తీర్యా హి కదాచన ॥ 81

నోత్తీర్యా నౌకయా రాజ్ఞా నదీ క్వాపి సుతాదిభిః ।
కార్యా నైవ జలక్రీడా నౌకాయాం స్వసుతైః సహ ॥ 82

న స్థేయం హట్టమధ్యే హి తథా చైవ చతుష్పథే ।
న తాడయేన్నిజాం పత్నీం తథా పుత్రం న తాడయేత్ ॥ 83

స్వముద్రాంకితపత్రేణ వినా కేషాం పురాద్బహిః ।
న నిర్గమః ప్రకర్తవ్యస్తద్వైవాగమనం నృణామ్ ॥ 84

నిద్రించుచుండువాటిని, నీరుద్రావుచుండువాటిని, నమ్మి నీవేగతియని పడినవాటిని, రతి క్రీడలో ఉండెడువాటిని హింసింపరాదు. సీమాచారులనగా నగర కావలివారిని ఎనిమిది దిక్కులలోను స్థాపించి, వేటాడవలయును. రాత్రిపూట ఊరకే మిత్రునితోడ కంబళికప్పికొని (మారువేషముతో)బయట పోవలయును. ఊరికావలివారలవద్దకు పోయి వాకిళ్ళ కీళ్ళను పరీక్షించి జనులచే చెప్పబడు శుభాశుభ వృత్తాంతములను వినవలయును. ఇట్లు తానుగాని, తనవారుగాని ఊరిలో రాత్రివేళ గస్తీ తిరిగి సమస్త సంగతులు తెలుసుకొనవలయును. ఇంటిలో పోరుపెట్టుకొనరాదు. మరి ఇంటిసంగతిని సభాసీనులతో అణుమాత్రమైనను పలుకరాదు. సభలో తన చేతులతో తలగోకికొనరాదు. శత్రువుల ఔన్నత్యమును విని అంతటితో అధైర్యపడరాదు. రాజు మరణమున ఎప్పుడును పరుగెత్తిపోరాదు. శత్రువులకు వీపుచూపరాదు. ఎప్పుడును తెప్పలపై నదులను దాటరాదు. నదిని దాటవలయుననిన సేతువుమీదనుండియే పోవలయును. రాజు ఎచ్చటను పుత్రాదులతోడ ఓడనెక్కి నదిని దాటరాదు. తన కుమారులతోడ నౌకనెక్కి జలక్రీడలాడరాదు. అంగళ్ళబజారునడుమను, నలుదారులు చేరిన చోటను నిలువరాదు. పత్నిని అట్లే పుత్రుని కొట్టరాదు. తన రాజ్య ముద్రాంకిత పత్రమును చూపక ఊరిలోనికి గాని ఊరివెలుపలకుగాని ఎవ్వరును సంచరించరాదని ఆజ్ఞ జారీచేయాలి.

కర్తుమాజ్ఞాపనీయం న ముద్రాపత్రాంకితం వినా ।
నారణ్యే లుంఠనం చోరైః పథి కార్యం నృపోత్తమైః ॥ **85**

న కార్యం ముండనం రాజ్ఞా వినా తీర్థం కదాచన ।
పర్వకాలే గృహే నైవ స్నాతవ్యం పార్థివోత్తమైః ॥ **86**

న పాదేన స్పృశేచ్చాపం న పాదేన శరం స్పృశేత్ ।
నాతిక్రీడేత్సారికాభిర్ద్విజైర్వాదం న వై చరేత్ ॥ **87**

న తిష్ఠేద్ద్వారదేశే వై న స్థాతవ్యం నృపైర్భువి ।
రాజ్ఞా మార్గే న వై స్థేయం న ఖేదం నృపతిర్భజేత్ ॥ **88**

తోయానయనమార్గే హి స్త్రీణాం స్తేయం నృపేణ న ।
ధాన్యం సమర్ఘం కర్తుం వై దండయేద్వ్యవసాయినః ॥ **89**

దృష్ట్వా కించిన్మహార్ఘం తు స్వీయరాష్ట్రే హి భూభృతా ।
న్యూనః కార్యః కరభారః కించిద్దేశసుఖాయ చ ॥ **90**

నాతిశార్ఠ్యం కదా కార్యమౌదార్యం దర్శయేజ్జనాన్ ।
ద్రవ్యం గృహీత్వా రాజ్ఞా హి మోచనీయా న తస్కరాః ॥ **91**

ముఖం దృష్ట్వా న వై కార్యో రాజ్ఞా న్యాయః కదాపి హి ।
న న్యాయశ్చ పరైః కార్యః స్వయమేవ ప్రకారయేత్ ॥ **92**

ఆర్తానాం సకలం వృత్తం శ్రోతవ్యం సాదరం నృపైః ।
ఆర్త ఆకారణీయో హి నికటే కృపయా నృపైః ॥ **93**

ఆత్మానం మానయేన్నైవ వైద్యం చ గణక నటమ్ ।
పండితం వైదికం వీరం గాయకం కృతధర్మిణమ్ ॥ **94**

యజ్ఞో దానం జపో హోమః సంధ్యా ధ్యానం శివార్చనమ్ ।
స్నాన పురాణశ్రవణం భక్త్యా కార్యం నృపోత్తమైః ॥ **95**

**న మాదకం వస్తు సేవ్యం న కృచ్ఛ్రాదికమాచరేత్ ।**
**న యాత్రా స్వపదా కార్యా సప్తద్వీపాధిపేన హి ॥ 96**

**ఫలాహారశ్చ కర్తవ్యో రాజ్ఞా హ్యేకాదశీదినే ।**
**నిర్జలశ్చోపవాసశ్చ న కార్యః పృథివీభృతా ॥ 97**

ఎప్పుడును సరియైన కారణములేక రాజు ముండనము జేసికొనకూడదు. అరణ్యమార్గములలో దొంగలచే అపహరణములను చేయించరాదు. ఉత్తమరాజులు పర్వకాలమున తమ ఇంటిలో స్నానము చేయరాదు. ధనుర్బాణములను కాళ్లతో అంటరాదు. బ్రాహ్మణులతో వాదమాడరాదు. పాచికలాటలో దొంగఎత్తులువేయరాదు. వాకిళ్ళలోను, దారులలోను నిలువరాదు. చింతించుచు ఉండరాదు. స్త్రీలు మంచినీరు తెచ్చునట్టి మార్గములలో రాజు నిలువరాదు. తనరాజ్యమున పదార్థములకు ధరలు పెంచినచో గుర్తెరిగి వాటిని తగ్గించుటకై కాపులను దండింపవలయును. దేశసుఖమునకై పన్నులను తగ్గింపవలయును. మిక్కిలి క్రౌర్యమును ఎప్పుడును చూపరాదు. జనులకు ఔదార్యమును ప్రకటింప నగును. దొంగలవద్ద ధనము లాగికొని, విడిచిపెట్టక వారిని శిక్షింపవలయును. మోముచూచి న్యాయవిమర్శచేయరాదు. తన న్యాయవిచారమును ఇతరులు చేయరాదు, తానేచేయవలయును. ఆదరముతో ఆర్తులగువారి సంగతిని విని, వారిని తనవద్దకు పిలిపించి దయచేయవలయును. తన ఉన్నతికి విఱ్ఱవీగరాదు. పండిత, వైదిక, వీర, గాయక, నట, గణక, ధర్మాజ్ఞాదులను స్వోన్నతితో గర్వించనట్లు పరిక్షింపవలయును. దాన, ధర్మ, సంధ్యా, ధ్యాన, జప, హోమ, యజ్ఞ, దేవార్చనాది సత్కర్మలను భక్తితో ఆదరించుట రాజుకు మంచిది. మదమును కలిగించు వస్తువులను రాజు భుజింపరాదు. కృచ్ఛ్రాది కాయక్లేశ వ్రతములను ఆచరింపరాదు.

**యేన యద్యాచితం రాజ్ఞే భూసురేణార్పయేచ్చ తత్ ।**
**తస్మై విప్రాయ రాజ్ఞా హి నృపా భూసురదేవతాః ॥ 98**

**ఉత్సాహే బంధనాన్మోచ్యా యే యే క్రోధాత్సురక్షితాః ।**
**నిజాజ్ఞాభంగతాం దృష్ట్వా జ్ఞేయం స్వీయం హృతం శిరః ॥ 99**

**స్వీయదూతాపమానో యః స స్వీయశ్చింతయేన్నృపః ।**
**స్వీయదూతస్య సమ్మానో రాజ్ఞా జ్ఞేయః స ఆత్మనః ॥ 100**

**ఏవం కుశ మయా ప్రోక్తా రాజనీతిః స విస్తరా ।**
**దినచర్యా మయా యద్వ్యాక్రియతే త్వం తథా కురు ॥ 101**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, రాజనీతిశిక్షణం నామ, షోడశస్సర్గః ॥**

సప్తద్వీపములను జయించిన రాజు పాదయాత్రచేయరాదు. రాజు ఏకాదశినాడు నిర్జలోపవాసము ఆచరించరాదు. ఫలాహారమును చేయవలయును. ఏ బ్రాహ్మణుడు దేనిని యాచించినను దానిని వానికి ఇచ్చివేయవలయును. రాజులకు బ్రాహ్మణులే దేవతలు. ఉత్సాహసమయమున కోపముచే కారాగారమున ఉన్నవారిని విడిపింపవలదు. రాజు తనయొక్క ఆజ్ఞాభంగమయిన దానిని నిజశిరస్సు పోయినట్లే భావింపవలయును. రాజు తన దూతకు అవమానము సంభవించినను తనకు సంభవించినట్లే భావింపవలయును. వానికి కలిగిన సన్మానమును తన సన్మానముగా ఎంచనగును.

కుశుడా! నీకిట్లు రాజనీతిని ఉపదేశించితిని. నేనిప్పుడిట్లు దినచర్యను అవలంబించినట్లే నీవును దినచర్యను పరిపాలింపుము. (16)

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, రాజనీతిశిక్షణనువర్ణించు 16వ సర్గ ముగిసినది.**

# సప్తదశః సర్గః-17వ సర్గ

హేమ స్వయంవరం

శ్రీరామదాస ఉవాచ

ఏకదా కుశకన్యాయా హేమయాశ్చ స్వయంవరమ్ ।
అయోధ్యాయాం చకారాథ రామశ్చాతిమహోత్సవైః ॥ 1

సమాహూతా నృపాః సర్వే నానాద్వీపాంతరస్థితాః ।
సమాజగ్ముః సువేషాశ్చ సభాయాం తస్థురాసనే ॥ 2

యయుర్దేవాః సగంధర్వా మునయోఽపి సమాయయుః ॥ 3

తదా సభాయామానీతా హేమాలంకారభూషితా ।
ఆరుహ్య శిబికాయాం తు రుక్మమయ్యాం వరాననా ॥ 4

నవరత్నమయీం మాలాం బిభ్రతీ సా స్వయంవరా ।
దదర్శ నృపతీన్సర్వాన్ నృపపుత్రాన్సవిస్తరమ్ ॥ 5

తద్భ్రూచాపవినిర్ముక్తై స్తత్కటాక్షపతత్రిభిః ।
సంభిన్నాస్తే నృపాః సర్వే కే వయం న విదుస్తదా ॥ 6

## హేమ స్వయంవరాభివర్ణన.

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, ఒకప్పుడు శ్రీరామచంద్రస్వామి; కుశుని కూతురైన 'హేమ' అను కన్యారత్నమునకు అయోధ్యా రాజధానిలో స్వయంవరమును ఏర్పాటు చేయించెను. అది ఎట్లనిన; నానాదేశపు రాజులందరిని శ్రీరామప్రభువు పిలిపించెను. వారందరును తమ వైభవములతో వచ్చి, స్వయంవర సభాభవనమున సుఖాసీనులైరి. దేవతలు, విద్యాధరులు, గంధర్వులు, కిన్నరులు, మహర్షులు మొదలైన సమస్త లోకవాసులును ఆ సభాలోకమునకు విచ్చేసిరి. అప్పుడు ఆ సభలో కనకమయమగు పల్లకినెక్కి, దివ్యాలంకార భూషితయగు హేమాంగనామణి నవరత్నమయమగు దివ్యహారమును ధరించి, స్వయంవరార్థమై ప్రవేశించి, సమస్త రాజులను, సకల రాజకుమారులను విలాసముతో వీక్షించెను. ఆమెయొక్క కనుబొమలను వింటినుండి వెడలిన కటాక్షములను బాణముల కఠిన గాయములకు ఆ సభలోనివారంతా తమనుతాము మరచిపోయిరి.

ఏతస్మిన్నంతరే తత్రావంతినాథసుతో మహాన్ ।
చిత్రాంగదో సభాయాశ్చ తాం జహార కుశాత్మజామ్ ॥ **7**

దృష్ట్వా కార్యాంతరవ్యగ్రాన్రామాదీన్వేగవత్తరః ।
మోహనాస్త్రేణ సకలాన్ వీరాన్ కృత్వాతిమోహితాన్ ॥ **8**

రథే నివేశ్య తాం హేమాం హేమాభాం వేగవత్తరః ।
చిత్రాంగదో బహిర్గత్వా క్రోశమాత్రే స్థిరోఽభవత్ ॥ **9**

కిం తూష్ణీం చోరవన్నేయా మయేయం కుశబాలికా ।
ఇతి నిశ్చిత్య మేధావీ తస్థౌ చిత్రాంగదో మహాన్ ॥ **10**

ఏతస్మిన్నంతరే పుర్యాం హాహాకారో మహానభూత్ ।
నీతా హేమా చోగ్రబాహోః పుత్రేణాతిబలీయసా ॥ **11**

నృపాః సర్వే సముత్తస్థుః సభాయాం ఖిన్నమానసాః ।
ఉపసంహరితే తేన మోహనాస్త్రేఽతిసంభ్రమాత్ ॥ **12**

చిత్రాంగదేన యోద్ధుం తే స్వసైన్యైర్నిర్యయుర్ నృపాః ।
బహిః సాకేతనగరాత్ క్రోధాదారక్తలోచనాః ॥ **13**

తూష్ణీమేవోగ్రబాహుః స దదర్శ పుత్రకౌతుకమ్ ।
ఏతస్మిన్నంతరే సర్వే తద్రథం పార్థివోత్తమాః ॥ **14**

సంవేష్ట్య కోటిశః శస్త్రైర్వవర్షుశ్చోగ్రబాహుజమ్ ।
తదా చిత్రాంగదో వీరో వాయవ్యాస్త్రేణ పార్థివాన్ ॥ **15**

గగనే భ్రామయామాస వాహనాద్యైః సమన్వితాన్ ।
తతో రామాజ్ఞయా సప్త లవాద్యా నిర్యయుః పురాత్ ॥ **16**

ఉత్సవార్థం సమాయాతాః స్వస్వరాజ్యాత్తు బాలకాః ।
అంగదాద్యా నిజైః సైన్యైః సలవాః సంగరం యయుః ॥ **17**

తదా బభూవ తుములం యుద్ధం తల్లోమహర్షణమ్ ।
చిత్రాంగదం వవర్షుస్తే నానాశస్త్రాణి రాఘవాః ॥ **18**

**చిత్రాంగదః స్వబాణౌఘైర్భిత్త్వా శస్త్రాణి తాని హి ।**
**నిజబాణైర్యూపకేతుం చకార విరథం క్షణాత్ ॥ 19**

ఆ స్వయంవర సభలో ఇట్లుండగా, ఆసందర్భమున అచ్చట అవంతీ దేశ రాజయిన ఉగ్రబాహు రాజుయొక్క కుమారుడగు చిత్రాంగదుడు శ్రీరామచంద్రాదులందరును కార్యాంతరాసక్తులై ఉండుట గమనించి, మహావేగముతో మిక్కిలి లాఘవముతో మోహనాస్త్రమును ప్రయోగించి, సమస్తవీరులను సమ్మోహితులను జేసి, సభామధ్యమున కుశకన్యకను అపహరించి, తన రథమున గూర్చుండబెట్టుకొని, వెంటనే వెడలి క్రోసెడు దూరముపోయి, "ఊరకే ఏల ఈ కన్యకను దొంగవలె అపహరింపవలెను," అని నిశ్చయించి, తన బాహుప్రతాపమును జూపగోరి సుస్థిరుడై నిలిచెను.

ఇంతలో ఆ పట్టణమున, "బలిష్ఠుడయిన ఉగ్రబాహుపుత్రుడగు చిత్రాంగదుడు మోహనాస్త్రమును ఉపసంహరింపగా రాజులందరును లేచి, ఖిన్నహృదయులై చిత్రాంగదునితో యుద్ధముచేయవలయునని తమతమ సైన్యములను సన్నద్ధము జేసికొని, క్రోధావిష్టులై అయోధ్యకు వెలుపల క్రోసెడుదూరమున వచ్చిచేరిరి. ఉగ్రబాహువు ఊరకె తన పుత్రుని వినోదమును విలోకించుచుండెను. అంతలో అందరు రాజులును చిత్రాంగదుని రథమును చుట్టుముట్టి, కోట్లకొలది బాణములను వర్షించిరి. అపుడు చిత్రాంగదుడు వాయవ్యాస్త్రమును ప్రయోగించి, వారిని వారి వాహనములతోడ గగనమున భ్రమింప జేసెను. అంత శ్రీరామాజ్ఞచేత తమ తమ రాజ్యములనుండి వివాహమహోత్సవమునకై వచ్చియున్న బాలకులగు లవాదులు ఏడుమందియును స్వసైన్యములతో యుద్ధాభిముఖులై వచ్చిరి. అప్పుడు మహాఘోరమైన తుములయుద్ధము ఆరంభమయ్యె. రఘువీరులు చిత్రాంగదునిమీద శస్త్రములను వర్షించిరి. చిత్రాంగదుడు తన శస్త్రములచే వాటినన్నిటిని ఖండించి యూపకేతువును క్షణమాత్రమున రథమునుండి పడద్రోసెను.

**తథా చకార విరథం సుబాహుం పుష్కరం తథా ।**
**తక్షకం చిత్రకేతుం చ హ్యంగదం బలవత్తరః ॥ 20**

**తద్దృష్ట్వా కౌతుకం తస్య జ్ఞాత్వా తత్తపసః ఫలమ్ ।**
**లవశ్చిచ్ఛేద బాణౌఘైస్తద్ధనుర్దివ్యముత్తమమ్ ॥ 21**

**తతో లవః స్వబాణౌఘై రుగ్రబాహుసుతం ముదా ।**
**చకార వ్యాకులం శీఘ్రం తద్దృష్ట్వా లవచేష్టితమ్ ॥ 22**

**ఉగ్రబాహుర్యయౌ యోద్ధుం లవేన వేగవత్తరః ।**
**లవస్తమపి బాణౌఘైశ్చకార విరథం క్షణాత్ ॥ 23**

ఉగ్రబాహుస్తదా వీరోఽన్యే రథే చారురోహ సః ।
వవర్ష నిశితైర్బాణైర్మూర్ఛయామాస తం లవమ్ ॥ **24**

లవం విమూర్ఛితం దృష్ట్వా హాహాకారో మహానభూత్ ।
తదా యయౌ కుశో యోద్ధుముగ్రబాహునృపేణ వై ॥ **25**

కుశమాగతమాజ్ఞాయ హ్యంగదాద్యాస్తదా పునః ।
రథస్థా యుయుధుస్తేన ఉగ్రబాహునృపేణ వై ॥ **26**

పునస్తానంగదాదీంశ్చ చకార విరథాన్ నృపః ।
తదా కుశః స్వబాణౌఘైరుగ్రబాహుం నృపం క్షణాత్ ॥ **27**

చకార విరథం వీరశ్చిచ్ఛేద తస్య కార్ముకమ్ ।
ఉగ్రబాహుస్తదా వ్యగ్రో బభూవ చకితస్తదా ॥ **28**

తం ధృత్వా స కుశస్తోషాద్వాదయామాస దుందుభీమ్ ।
అథోగ్రబాహుం ససుతం నిన్యే శ్రీరామసన్నిధిమ్ ॥ **29**

రామస్తం మోచయామాస మత్వా తం సుహృదం వరమ్ ।
తదా రామో విజయినే కంకణం మునినాఽర్పితమ్ ॥ **30**

దదౌ కుశాయ ప్రీత్యా స పురతః కుంభజన్మనః ।
కుశస్తదాఽతిశుశుభే వరకంకణమండితః ॥ **31**

అదేవిధముగా చిత్రాంగదునిబాణములకు– సుబాహువు, పుష్కరుడు, తక్షుడు, చిత్రకేతువు, అంగదుడును రథమునుండి క్రిందపడిరి. ఇది చిత్రాంగదుని తపోబలమని గ్రహించిన లవుడు చిత్రాంగదునియొక్క మహావేగముగల ధనస్సును ఛేదించెను. ఇట్లు లవుని బాణములచే నిశ్చేష్టితుడై, కలవరపడిన కుమారుని జూచి, ఉగ్రబాహువు లవునితో యుద్ధమునకు సిద్ధపడెను. లవుడు ఉగ్ర బాహువును కూడా క్షణమాత్రమున రథమునుండి పడద్రోసెను. అంత ఉగ్రబాహువు మరొక రథమునెక్కి, నిశిత శస్త్రములచే లవుని మూర్ఛాక్రాంతునిజేసెను. లవుని మూర్ఛనుచూసి అమితముగా హాహాకారము కలిగె. అపుడు కుశుడే ఉగ్రబాహువుతో యుద్ధమునకు వెడలెను. కుశుడే వచ్చుట గ్రహించి, అంగదాదులు మరల యుద్ధమునకు సిద్ధపడిరి. ఉగ్రబాహువు మరల వారినందరిని

రథములనుండి పడగొట్టెను. కుశుని తనయొక్క ఉత్తమ సుహృత్తని ఎంచి, విడిపించెను మరియు అగస్త్యమునీంద్రుని ఎదుట ఆ మునిచే మునుపు తనకర్పింప బడియుండిన కంకణమును విజయము కొరకు వచ్చిన కుశునికి పారితోషికముగా ఇచ్చెను. ఆ కంకణమును అలంకరించుకొని కుశుడు రారాజించెను.

తదా కుశో మునిం ప్రాహ నత్వా తం కుంభసంభవమ్ ।
త్వయా లబ్ధం కుతశ్చేదం కంకణం వద మాం మునే ॥ 32

తత్తస్య వచనం శ్రుత్వాఽగస్తిః ప్రాహ కుశం ముదా ।
పురేంద్రరిపవో వత్స బహవః సాగరేణ హి ॥ 33

కృతాః స్వాంతర్నివాసాశ్చ తదాఽహం నాకపార్థితః ।
కృత్వా స్వచుళుకేఽబ్ధిం తం పీతవాన్ లీలయైవ హి ॥ 34

తతో లుప్తాం ద్వీపయోర్హి మర్యాదాం మధ్యవర్తినీమ్ ।
దృష్ట్వా పునర్నాకపేన ప్రార్థితో హతశత్రుణా ॥ 35

మూత్రవత్సాగరం భీమం సజీవం ముక్తవాహనమ్ ।
తదాఽబ్ధినార్పితం మహ్యం కుశ తత్కంకణం వరమ్ ॥ 36

నానారత్నవిచిత్రం చ రవితేజోవిరాజితమ్ ।
తద్రామాయార్పితం పూర్వం మయా తేన తవార్పితమ్ ॥ 37

తన్మునేర్వచనం శ్రుత్వా కుశస్తం ప్రాహ వై పునః ।
లవస్య జీవనోపాయం వద మామద్య భో మునే ॥ 38

కుశస్య వచనం శ్రుత్వాఽగస్తిస్తం ప్రాహ సాదరమ్ ।
విమూర్ఛితో యదా పూర్వం భరతః పథిపార్థివైః ॥ 39

మూర్ఛితః పతితశ్చాస్తి రణే రిపుశరైర్హతః ।
ముద్గలాశ్రమతో వల్ల్యస్తదాఽఽనీతాః శుభావహాః ॥ 40

సౌమిత్రిణా తదాఽద్య త్వం ముద్గలాశ్రమతః పునః ।
మహౌషధీ సమానీయ జీవయైనం లవం జవాత్ ॥ 41

**అథవా త్వం హనూమంతం ప్రేషయస్వాశ్రమం మునేః ।**
**ఏవం యావచ్చ స మునిః కథయామాస తం కుశమ్ ॥ 42**

**తావత్తద్వచనం శ్రుత్వా మునేర్మారుతినా క్షణాత్ ।**
**సమానీయాశ్రమాద్వల్లీర్ముద్గలస్య తపోనిదేః ॥ 43**

**తాభిస్తం జీవయామాస లవం సైన్యసమన్వితమ్ ।**
**విష్ణుదాస ఉవాచ**
**గురో తస్యైవ చ మునేర్ముద్గలస్యాశ్రమే కథమ్ ॥ 44**

**మృతసంజీవనీవల్ల్యాదికా వల్యోఽత్ర నిర్గతాః ।**
**కథం తా హి సమీపస్థా విస్మృత్య ద్రోణపర్వతమ్ ॥ 45**

అప్పుడు, కుశుడు మునీంద్రునికి నమస్కరించి, “స్వామీ! మీకీ కంకణమెట్లు లభించె,” నని యడిగెను. అగస్త్యుడు ఇట్లనెను, “వినుము బాలకా! మునుపు ఇంద్రశత్రువులగు రాక్షసులనేకులు సముద్రమున నివాసమును కల్పించుకుని, వైరమును సాధించుచుండిరి. అప్పుడు స్వర్గవాసులు నన్ను ప్రార్థింపగా తపోలీలచే ఆ సముద్రమును ఒక గ్రుక్కలో త్రాగివేసితిని. అంత అందలి ద్వీపములు తద్గత రాక్షసులును నశించిన వెనుక మరల ఇంద్రుడు ప్రార్థించగా, సజీవమును, ఘోరమునగు సముద్రునిని మూత్రము వలె విడిచితిని. అప్పుడు సముద్రుడు నాకు సూర్యుని వలె ప్రకాశమును, అమోఘమునగు ఈ కంకణమును అర్పించెను. దానిని నేను శ్రీరామస్వామికి అర్పించితిని. అతడు నీ కొసగెను”. అనిన మునివచనములను విని కుశుడు, “స్వామీ! రణరంగమున బాణపు దెబ్బలకు లవుడు మూర్ఛనంది పడియున్నాడే, అతడు బ్రతుకుటకు ఉపాయము అనుగ్రహింపుడు,” అనిన అందుకాముని, “మునుపు దారిలో భరతుడు రాజులతో మూర్ఛితుడైనప్పుడు లక్ష్మణుడు ముద్గల ఆశ్రమమునుండి మంగళమయములయిన అమృతలతను తెచ్చి బ్రతికించెగదా! త్వరగా వాటిని తెచ్చి ఈ లవుని బ్రతికింపుము. అట్లుగాకున్నా ఈ ఆంజనేయుని ఆ మునీంద్రుని ఆశ్రమమునకు పంపు,” అనెను. అంత అప్పుడీమాటను మునీంద్రుడు చెప్పుచుండగా వినిన మాత్రమున అంజనా తనయుడు వేగముగ వెడలి, ముద్గలాశ్రమమునుండి అమృతలతను తెచ్చి, ససైన్యముగా ఆ లవునిని బ్రతికించెను.

**ప్రేషితోఽఞ్జనిపుత్రః స తేన జాంబవతా పురా ।**
**అముం మత్సంశయం ఛింధి కృపాం కృత్వా మునీశ్వర ॥ 46**

శ్రీరామదాస ఉవాచ

యదా మాతుర్విమోక్షార్థమమృతస్య ఖగాధిపః ।
కలశం స్వముఖే ధృత్వా నాకలోకాత్సమానయత్ ॥ 47

తదా తత్కలశాద్వేగాద్బిందుస్తత్రాపతత్పురా ।
తద్ధేతోర్ముద్గలస్యాపి మునేస్తపఃప్రభావతః ॥ 48

ఆసన్ వల్ల్యశ్చ తత్రైవ హ్యాశ్రమే హి ద్విజోత్తమ ।
నైతా వేద శుభా వల్లీర్జాంబవాన్న వనేచరః ॥ 49

ద్రోణాచలం తతస్తేన ప్రేషితో వాయునందనః ।
ఇతి త్వయా యథా పృష్టం తథా తే వినివేదితమ్ ॥ 50

ఇదానీం శృణు శిష్య త్వం శుభాం తాం ప్రాక్తనీం కథామ్ ।
తతో లవాదికాః సర్వే యయుస్తే స్వపురీం ముదా ॥ 51

నత్వా మునిం చ రామాదీంస్తస్థుః శ్రీరాఘవాగ్రతః ।
తతా మహోత్సవశ్చాసీత్పుర్యాం తల్లవదర్శనాత్ ॥ 52

తతో దృష్ట్వా లవం రామో జీవితం వాయుజేన హి ।
సమాలింగ్య దృఢం ప్రేమ్ణా పరం తోషమవాప సః ॥ 53

తతో రామో వాయుజాయ కంకణే రత్నమండితే ।
దదౌ పరమసంతుష్టస్తాభ్యాం స శుశుభే కపిః ॥ 54

తతో లవాయ శ్రీరామస్స్వపరం కంకణం వరమ్ ।
దదావగస్తినా దత్తం పూర్వం యద్రత్నమండితమ్ ॥ 55

లవస్తేనాతిశుశుభే వరకంకణమండితః ।
లవస్తదా మునిం ప్రాహ నత్వా తం కుంభసంభవమ్ ॥ 56

త్వయా లబ్ధం కుతశ్చేదం కంకణం వద మాం మునే ।
తతస్తద్వచనం శ్రుత్వాఽగస్తిః ప్రాహం లవం ముదా ॥ 57

రామదాసు వచనములను వినిన విష్ణుదాసుడు, "గురూత్తమా! ఆ ముద్గలమునీంద్రుని ఆశ్రమముననే మృతసంజీవిని లతలు ఎట్లు ఉద్భవించెను? మునుపు లంకలో రావణ యుద్ధ అవసరమున జాంబవంతుడు సమీపమున ఉండినను ఈ లతలను మరచి ద్రోణాచలమునకై హనుమంతుని ఏల పంపెను? నా మీద దయచేసి ఈ విషయమును చెప్పి సంశయ నివృత్తిని ఒనరింపుము," అని ప్రార్థింపగా శ్రీరామదాసుడు ఇట్లు చెప్పుచున్నాడు, "గరుత్మంతుడు తన తల్లియగు వినతను కద్రు దాస్యం నుండి తొలగించుటకై స్వర్గమునుండి అమృతకలశమును తెచ్చుచున్నప్పుడు ఆ కలశము నుండి అమృతబిందువొకటి జారి ఆ ముద్గలాశ్రమమున పడెను. అంతనచ్చట మునీంద్రుని తపఃప్రభావముచే సుధాసంయోగమునందిన లతలు పుట్టి, విలసిల్లుచున్నవి. ఈ సంగతిని కపీంద్రుడగు జాంబవంతుడు ఎఱుగడు. కావున ఆంజనేయుని ద్రోణాచలమునకై పంపెను. నీవడిగిన ప్రశ్నకు ఉత్తరము నిచ్చితిని. ఇక నా వెనుకటి కథను నిరూపించెదను వినుము. అంత ఆ లవాదులందరును నిజనగరికి వెడలిరి. ఇట్లువచ్చి సంతోషముతో శ్రీరామునికి, అగస్త్యమునీంద్రునికి నమస్కారములను ఒనర్చి తత్సన్నిధిన నిలిచిరి. అప్పుడా నగరిలో లవదర్శనముచే మిగుల మహోత్సవములు జరిగెను. (52) అంత ఆ శ్రీరామచంద్రస్వామి హనుమంతునిచే లవుడు జీవితుడగుట తెలిసికొని, ఆంజనేయుని మిక్కిలి ప్రేమతో హత్తుకుని ఆనందమునందెను మరియు, వాని దివ్యరత్నాలంకృతములగు కంకణములను పారితోషికముగానిచ్చెను.

**ఏకదా దండకారణ్యేఽహం స్నాతుం హి గతః సరః ।**
**తస్మిన్ స్నాత్వా నిత్యవిధిం కృత్వా తత్ర స్థితః క్షణమ్ ॥ 58**

**ఏతస్మిన్నంతరే తత్ర ఖాత్ స్వర్గీ సముపాగతః ।**
**దివ్యం విమానమారూఢః శతస్త్రీపరివేష్టితః ॥ 59**

**దివ్యమాల్యాంబరధరో దివ్యగంధాదిచర్చితః ।**
**స స్వర్గీ ఖాత్సమాయాతో యావత్తావత్సరోవరాత్ ॥ 60**

**శవం వినిర్గతం శ్రేష్ఠం స్ఫురితం హి భయంకరమ్ ।**
**దుర్గంధసహితం దుష్టం ప్రాప్తం తత్సరసస్తటమ్ ॥ 61**

**అవరుహ్య విమానాగ్ర్యాత్స స్వర్గీ తచ్ఛవం యయౌ ।**
**ఛిత్వా తచ్ఛవమాంసం వై భక్షయామాస సాదరమ్ ॥ 62**

తతః పీత్వా జలం స్వర్గీ విమానం చారురోహ సః ।
నిమగ్నం తచ్ఛవం చాపి పునస్తస్మిన్ సరోవరే ॥ 63

స్వర్గిణం గంతుకామం తం దృష్ట్వాఽహం చాతివిస్మితః ।
అబ్రువం మధురం వాక్యం రే రే దివ్యస్వరూపధృక్ ॥ 64

క్షణం తిష్ఠోత్తరం దేహి కౌతుకం తే మయేక్షితమ్ ।
ఈదృశస్తే శవాహారః కథం స్వర్గనివాసినః ॥ 65

ఇతి మద్వచనం శ్రుత్వా స స్వర్గీ ప్రాహ మాం తదా ।
సమ్యక్ పృష్టం త్వయా బ్రహ్మన్ శృణు సర్వం మయోచ్యతే ॥ 66

సుదేవాఖ్యో హి వైదర్భో నృపతిశ్చాభవత్పురా ।
తత్పుత్రౌ శ్వేతసురథౌ శ్వేతోఽహం పార్థివోఽభవమ్ ॥ 67

నైవ దానం మయా తస్మిన్ జన్మన్యత్ర కృతం కదా ।
స్వీయరాజ్యమదోద్ధాంతః పాపకర్మరతః సదా ॥ 68

## శ్వేతోపాఖ్యానము

వాటిచే వాయుపుత్రుడు రారాజించెను. అంత ఆ రాముడు మునుపు, అగస్త్యమునిచే తనకివ్వబడి యుండిన కంకణమును లవునికి ఇచ్చెను. అతడు ఆ రత్నకంకణమును స్వీకరించి, దానిచే అధిక తేజస్సునంది, అగస్త్యమునికి నమస్కరించి, "స్వామీ! తమరికీ కంకణమెట్లు లభించినది?" అని ప్రశ్నించెను. అందుకు అగస్త్యుడు ఇట్లనెను, "నాయనా! వినుము; ఒకప్పుడు నేను దండకారణ్యమున ఒక సరోవరమునకు వెడలి అచ్చట స్నానముచేసి నిత్యకర్మాదులను నిర్వర్తించి, కొంతసేపు కూర్చుంటిని. అంతలో అంతరిక్షమునుండి ఒక స్వర్గనివాసి దివ్యాలంకృతుడును, దివ్యసుందరుడును దివ్యమైన సుగంధాదులచే పరిమళభరితుడును అయి నూరుమంది దేవాంగనలతో విమానమునెక్కి ఆ సరోవరమునకు విచ్చేసెను. ఆ సమయానికి మిక్కిలి భయంకరమైన శవమొకటి ఆ నీటిలోనుండి వెలువడెను. ఒడ్డునకు వచ్చిన దుర్గంధసహితమగు ఆ దుష్టశవమును చూచి, ఆ వైమానికుడు విమానమునుండి దిగివచ్చి, ఆ శవమును కోసి, ఆ మాంసాదులను మిక్కిలి మక్కువతో తినెను. మరి నీరుద్రావి మరల విమానమునెక్కెను. అంత ఆ శవము నీటిలో మునిగిపోయెను. అప్పుడు నేను విస్మయమునంది గగనమునకు పయనమవుచున్న విమానారూఢునిజూచి, "ఓరీ! దివ్యరూపమునందిన సుందరుడా! ఇచ్చటనే క్షణకాలము నిలువుము, నేనడిగినదానికి సమాధానమిమ్ము. నాచే మిక్కిలి

ఆశ్చర్యముగా చూడబడిన ఇట్టి శవమును ఆహారముగా స్వర్గవాసికి ఎట్లు కలిగినది?” అని మృదువాక్యములచే మధురముగా అడిగితిని. అపుడు నాతో ఆ స్వర్గవాసి ఇట్లనెను, “బాగుగా అడిగితివి బ్రాహ్మణుడా! వినుము, విన్నవించెదను అని చెప్పసాగెను.

మునుపు సుదేవుడను పేరుగల విదర్భరాజు రాజ్యమేలుచుండెను. ఆ రాజుకు శ్వేతుడు, సురథుడు అని ఇరువురు పుత్రులు కలిగిరి. వారిలో శ్వేతుడను నేను రాజునైతిని. అపుడు రాజ్యమదాంధుడనై నేను ఎప్పుడూ పాపకర్మములను ఆచరించుచు నా జన్మమున కొంచమయినను దానధర్మమును ఆచరించకుంటిని.

**తతోఽపుత్రీ త్వహం రాజ్యే కృత్వా తం సురథానుజమ్ ।**
**వార్ధకే తు వనం ప్రాప్తస్తప్తీవ్రం సమాచరమ్ ॥ 69**

**ఏకదా స్నాతుముద్యుక్తో నిమగ్నోఽహం సరోవరే ।**
**తతో మృతో దివం ప్రాప్తస్త్వహం స్వీయతపోబలాత్ ॥ 70**

**తపసశ్చఫలైస్తత్ర మమాసన్ సర్వసంపదః ।**
**అదృశా భక్షితుం కించిన్మయా పృష్టః సురాధిపః ॥ 71**

**వర్తంతే వివిధాస్తత్ర మమ భోగాః సుదుర్లభాః ।**
**కథం నాసీద్భక్షణార్థం కథం మేఽత్ర సుఖం భవేత్ ॥ 72**

**ఇతి మద్వచనం శ్రుత్వా మామింద్రః ప్రాహ సస్మితః ।**
**నైవ దానం త్వయా భూమౌ కృతం రాజ్యమదేన హి ॥ 73**

**అదత్తం లభ్యతే నైవ నృప పుణ్యైః కదేతరైః ।**
**అతస్త్వం ప్రత్యహం గత్వా విమానేన సరోవరమ్ ॥ 74**

**భక్షయస్వ శవం పుష్టం మిష్టాన్నైః ప్రోషితం చ యత్ ।**
**చిరకాలం భవేత్తత్తే క్షయం యాస్యతి నైవ తత్ ॥ 75**

**ఇతీంద్రవచనం శ్రుత్వా స పృష్టశ్చ పునర్మయా ।**
**దివ్యాన్నాని కథం చాహం ప్రాప్నుయాం తద్వదస్వ మామ్ ॥ 76**

**ఇతి మద్వచనం శ్రుత్వా తదేంద్రః ప్రాహ మాం పునః ।**
**అధునా దండకారణ్యం వర్తతే హీనమానుషమ్ ॥ 77**

**వింధ్యవృద్ధినిషేధార్థమగస్తిః సురయాచితః ।**
**యదా యాస్యతి పత్న్యా వై ముక్త్వా కాశీం హి దండకమ్ ॥ 78**

**సరస్యస్మింస్తదా స్నాత్వా స్థితం పశ్యసి తం మునిమ్ ।**
**తదా తస్మై కంకణ స్వం దేహి తోయైః పరిప్లుతమ్ ॥ 79**

**తేన కంకణదానేన దివ్యాన్నః ప్రాప్స్యసే నృప ।**
**ఇతీంద్రవచనం శ్రుత్వా తదారభ్య చిరం మునే ॥ 80**

**అత్రాగత్య శవాహారః క్రియతే వై సదా మయా ।**
**ఏతావత్కాల పర్యంతం నాత్ర కశ్చిన్మయేక్షితః ॥ 81**

పిదప నాకు పుత్రులు లేనందున, నా రాజ్యమును తమ్ముడగు సురథునికి అప్పగించి వార్ధక్యమున వనవాసముచే తపశ్చరణమును ఆరంభించితిని. ఇట్లుండగా ఒకప్పుడు ఈ సరోవరమున దిగి స్నానముచేయుచు, దొరలి పడి చచ్చితిని. నా తపోబలముచే నాకు స్వర్గము లభించినది. అపుడు స్వర్గమున నా తపో ఫలముచే సమస్త సంపదలు కలిగియుండినను తినుటకు ఏమియు లభింపలేదు. అంత నేను దుఃఖించి, ఇంద్రునితో, “దేవేంద్రా! ఇచ్చట దుర్లభములగు నానా భోగములు నాకు కలిగినవి. తినుటకు తిండియొక్కటి తక్కువ. ఎందుకిట్లు? నాకెట్లు సుఖము కలుగును?” అని చెప్పగా, నాతో ఇంద్రుడు నవ్వుచు, “నీవు రాజ్యమదముచే భూమిపై దానధర్మములను చేయలేదు కదా? రాజు తాను దానముచేయని పాపదోషమును ఇతర పుణ్యములచే పోగొట్టుకొనజాలడు. కావున నీవు ప్రతినిత్యము విమానారూఢుడవై సరోవరమునకు పోయి మృష్టాన్నాదులచే పెంచిన నీ శవమును తిని రమ్ము. చిరకాలమిట్లు చేయుచువచ్చినా ఆ శవము నాశనమందదు,” అని ఆజ్ఞాపించగా నేను, “దివ్యాన్నములను నేనెట్లు భక్షింపగలను? ఆసంగతిని చెప్పు” మని దేవేంద్రుని వేడుకొంటిని. అంత ఇంద్రుడు, “ఇపుడు దండకారణ్యము నిర్మానుష్యమై ఉన్నదికదా? అగస్త్యుడు దేవప్రార్థితుడై వింధ్యుని ఔన్నత్యమును తగ్గించుటకై కాశీపట్టణమును విడిచి పత్నితోడ దండకారణ్యమునకు వచ్చుచున్నాడు. ఈ సరోవరమున స్నానముచేసి, కూర్చుండియుండు ఆ మునీంద్రుని నీ వెప్పుడు చూచెదవో అప్పుడు నీటిలోముంచిన నీ కంకణమును అతనికి దానమొసగుము. తత్ఫలముచే నీవు మృష్టాన్నము పొందగలవు.” అని అనుగ్రహింపగా అది మొదలు నేనిచ్చట శవాహారుడవై ఉన్నాను. చిరకాలము నుండి ఇదివరకిచ్చట నేనెవరినీ చూడలేదు.

**మయా దృష్టస్త్వమేవాత్ర వేద్మి త్వాం కుంభసంభవమ్ ।**
**అద్య త్వయా తారితోఽహం దానం స్వీకురు మే త్విదమ్ ॥ 82**

అగస్త్య ఉవాచ

ఇత్థం స్వర్గీ స మాముక్త్వా దదౌ కంకణముజ్జ్వలమ్ ।
మహ్యం సార్ద్ధం తతః స్వర్గం యయౌ స్వర్గీ ముదా యుతః ॥ **83**

తదారభ్య శవం తోయాత్తద్బహిస్తన్న యయౌ కదా ।
దివ్యాన్నాని తు సంప్రాప నాకలోకే యథాసుఖమ్ ॥ **84**

ఇతి యత్కకంకణం లబ్ధం మయా లవ పురా వనే ।
అర్పితం రాఘవాయేదం తేన తచ్చాపి తేఽర్పితమ్ ॥ **85**

శ్రీరామదాస ఉవాచ

ఇత్యగస్త్యవచః శ్రుత్వా లవః పప్రచ్ఛ తం పునః ।
కిమర్థం దండకారణ్యం తద్బభూవ విజనం వద ॥ **86**

అగస్త్య ఉవాచ

ఇక్ష్వాకువంశసంభూతోఽభూన్నృపో వింధ్యదక్షిణే ।
నామ్నా దండకేతి ఖ్యాతః పాపకర్మరతః సదా ॥ **87**

ఏకదా స వనం యాతో మృగయార్థం స్వసేనయా ।
తతో దృష్ట్వా మృగం రాజా మృగపృష్ఠే ప్రదుద్రువే ॥ **88**

ఏకాకీ హయమారూఢో దేశాద్దేశాంతరం యయౌ ।
ఏవం హి గచ్ఛతస్తస్య మృగోఽదృశ్యోఽభవత్తదా ॥ **89**

తతః సోఽతితృషాక్రాంతః ప్రయయౌ వై జలాశయమ్ ।
తత్ర పీత్వా జలం స్వచ్ఛం స రాజా సరసస్తటే ॥ **90**

అజ్ఞాత్వా స్వగురోశ్చేతి భృగోరాశ్రమమాయయౌ ।
తత్ర తాతవిహీనాం తామరజస్కాం భృగోః సుతామ్ ॥ **91**

దృష్ట్వా చంద్రాననాం రాజా సోఽభూత్కామవిమోహితః ।
తతస్తాం ప్రార్థయామాస రత్యర్థం సాఽబ్రవీన్నృపమ్ ॥ **92**

ఇంతకాలమునకు మిమ్మొకరినే చూచితిని. కావున మీరే అగస్త్యముని అని అనుకొనుచున్నాను. నేను మీచే తరింపబడితిని, ఈ దానమును స్వీకరింపుము, అని చెప్పి ఆ స్వర్గవాసి నాకు వెలుగుచుండు ఈ కంకణమును అర్పించి, సంతోషముతో స్వర్గమును చేరెను. అది మొదలు ఎప్పుడును ఆ శవము నీటినుండి వెలువడలేదు. అతడు స్వర్గమున దివ్యాన్నములను యథా సుఖముగా భుజించి ఆనందించెను. ఇట్లు నాకు లభించిన కంకణమును శ్రీరామసన్నిధికి అర్పించితిని. మీ తండ్రి అనుగ్రహించి నీకు ఇచ్చెను. (85)

## దండకారణ్యముయొక్క పూర్వవృత్తాంతము

అగస్త్యుని వచనములను వినిన లవుడు, "స్వామీ! ఈ 'దండకారణ్యము' ఘోర అరణ్యము ఎట్లయినది?" అని అడిగెను. అంత అగస్త్యుడు చెప్పుచున్నాడు; వింధ్య దక్షిణమున ఇక్ష్వాకు వంశ సంభూతుడైన 'దండ'కుడనే విఖ్యాతుడైన రాజొకడు గలడు. అతడు నిరంతరము పాపకర్మరతుడై ఉండెను. అతడొకప్పుడు తన సైన్యముతో వనమునకు వేటాడవెడలెను. అచ్చట అతడు ఒంటరిగా గుఱ్ఱమునెక్కి ఒక మృగమును జూచి, దానిని వెంబడించి తరిమెను. ఇట్లు బహుదూరము పోగా ఆ మృగము అదృశ్యమయ్యె. అపుడు ఆ దండకుడు దప్పికచే డస్సి ఒక సరోవరమును చేరి, నీరుద్రావి ఆ సరోవరతీరమున నిలిచెను. అక్కడ ఒక ఆశ్రమము గలదు. అది తన గురువగు భృగుమునీంద్రుని ఆశ్రమము. ఆ ఆశ్రమములో తండ్రి ఎచ్చటికో వెళ్ళడముతో ఒంటరిగా ఉన్న, రజస్వల కాని భృగు పుత్రియయిన కన్యకామణిని చూచి, దండకుడు కామాక్రాంతుడై మెల్లగా ఆ పిల్లను రతికి రమ్మనెను.

**స్వవశా నృప నైవాహం తాతాధీనాఽస్మి సాంప్రతమ్ ।**
**బహిర్భృగుస్తవ గురుగతస్త్వాం వేద్మ్యహం నృపమ్ ॥ 93**

**యది మామిచ్ఛసి త్వం హి తర్హి తం స్వగురు భృగుమ్ ।**
**ప్రార్థయిత్వా భజ సుఖం మాం పత్నీం త్వం విధాయ చ ॥ 94**

**ఇత్యుక్తోఽపి తయా రాజా దండస్తాం కామపీడితః ।**
**భుక్త్వా సుఖం బలాదేవ జగామ నగరీం నిజామ్ ॥ 95**

**తతోఽరజస్కా సా బాలా దృష్ట్వా తాతం సమాగతమ్ ।**
**శోచంతీ సకలం వృత్తం శ్రావయామాస విహ్వలా ॥ 96**

**తద్వృత్తం స మునిః శ్రుత్వాఽంజలౌ కృత్వాం జలం క్రుధా ।**
**అబ్రవీత్ స్వసుతాం బాలాం సాంత్వయన్ రక్తలోచనః ॥ 97**

**దండేన సహ దండస్య రాజ్యం వై శతయోజనమ్ ।**
**భవత్వద్య క్షణాద్దగ్ధం మద్వాక్యాచ్చ సమంతతః ॥ 98**

**హీనోదకం తథా చాస్తు తథా నరచరాచరమ్ ।**
**ఇతి తచ్ఛాపమాకర్ణ్య తాత సంప్రార్థ్య బాలికా ॥ 99**

**ప్రార్థయామాస శాపస్య సవాఽధిం వినయాన్వితా ।**
**తతో భృగుః సుతామాహ యదా యాస్యతి కుంభజః ॥ 100**

**మునిః కాశ్యాస్త్వముం దేశం తదాఽయం సజలో భవేత్ ।**
**దేశస్తథాఽత్ర వాసం హి కరిష్యంతి మునీశ్వరాః ॥ 101**

**అరణ్యం దండహేతోర్హి జాతం తస్మాత్సదా నరాః ।**
**అముం దేశం వదిష్యంతి దండకారణ్యమేవ హి ॥ 102**

**యదా భవిష్యత్యగ్రేఽత్ర రామాగమనముత్తమమ్ ।**
**భవిష్యంతి తదాఽగ్రేఽత్ర నానాక్షేత్రాణి దండకే ॥ 103**

అంత ఆ కుమారి, "రాజా! నేను స్వతంత్రురాలును కాను. తండ్రికి వశవర్తినియై ఉన్నాను. నీ గురువగు భృగువు బయటపోయి ఉన్నాడు. నిన్ను నేనెఱుగుదును. నీకిట్లు నా యెడ మోహము కలిగిన నా తండ్రియగు నీ గురువును ప్రార్థించి, నన్ను పత్నిని చేసికొని సుఖింపుము," అని ఎంత చెప్పినను వినక ఆ దండకుడు బలాత్కారముగా ఆమెను సంగమించి, సుఖమనుకొని తననగరమునకు వెడలెను. అంత రజస్వలకాని ఆ బాలామణి దుఃఖించుచు, తండ్రిరాగానే జరిగిన విషయమును చెప్పెను. అప్పుడా భృగుముని కన్నులెఱ్ఱబారగా అత్యంత క్రోధావిష్టుడై చేతిలోనికి నీటిని తీసుకుని, తన కూతురిని సమాధానపరచుచు, "ఈ దండకునితో వీని రాజ్యమును నూరామడల వెడల్పు మాత్రమున ఇప్పుడే కాలి భస్మమై పోవునుగాక! ఎచ్చటను నీరులేకపోవును గాక! చరాచరములు, సకల వస్తువులును నశించునుగాక!" అని శపించెను. ఆ శాపమును విని, ఆ బాలిక తండ్రిని మిగుల ప్రార్థించి వినయముతో శాపవిమోచనమును వేడెను. అందుకు భృగుముని, "అగస్త్యుడు కాశీపట్టణము నుండి ఈ ప్రాంతమునకు ఎప్పుడువచ్చునో అప్పుడిది జలసహితమగును. అట్లే ఈ దేశమున మునీంద్రులు వాసముచేయ నారంభించెదరు. ఈ అరణ్యము 'దండ'కుని వలన యేర్పడినందున దీనిని నరులందరును 'దండకారణ్య' మని చెప్పుదురు. శ్రీరామచంద్రస్వామి ఇచ్చట ఎప్పుడు సంచరించునో అప్పుడిది నానా పుణ్యక్షేత్ర తీర్థములచే ప్రకాశించును.

రామప్రసాదాత్ క్షేత్రాణి భవిష్యంతి తతో జనాః ।
రామక్షేత్ర మితి సదా వదిష్యంతి హి దండకమ్ ॥ 104

మునిరామప్రసాదాచ్చ దేశోఽయం పూర్వవత్పునః ।
భవిష్యత్యుత్తమః పుణ్యః సౌఖ్యదశ్చ మనోరమః ॥ 105

దేశేభ్యః సకలేభ్యశ్చ సుపుణ్యం దండకం భవేత్ ।
దండకేన సమో దేశో న భూతో న భవిష్యతి ॥ 106

ఇతి తాం బాలికాముక్త్వా భృగుస్తప్తుం హిమాలయమ్ ।
యయౌ తాం మునయే దత్వా విధినా మునిసంవృతః ॥ 107

భృగోః శాపాచ్చ దండేన దగ్ధం తద్రాజ్యముత్తమమ్ ।
శతయోజనమానం తదభవద్ధి సమంతతః ॥ 108

మద్రామాగనాభ్యాం చ తతః స్వస్థం బభూవ తత్ ।
పూర్వవద్దండకారణ్యం చరాచరసమాకులమ్ ॥ 109

ఇతి త్వయా యథా పృష్టే తథా లవ మయోదితే ।
కంకణస్య దండకస్య విచిత్రే త్వాం కథానకే ॥ 110

శ్రీరామదాస ఉవాచ

ఇత్యగస్తిముఖాత్ శ్రుత్వా లవస్తుష్టోఽభవత్తదా ।
నత్వా మునిం చ శ్రీరామసేవాయాం తత్పరోఽభవత్ ॥ 111

అథ రామశ్చోత్సవేన తస్మై చిత్రాంగదాయ తామ్ ।
హేమాం దదౌ వివాహేన మహామంగళపూర్వకమ్ ॥ 112

పారిబర్హం దదౌ కోటిసంమితం వారణాదికమ్ ।
మహాన్మహోత్సవశ్చాసీదయోధ్యాయాం ప్రభోర్గృహే ॥ 113

తతో విసర్జయామాస చోగ్రబాహుం నృపం ప్రభుః ।
మునయః పార్థివాశ్చాపి యయుః స్వం స్వం స్థలం ప్రతి ॥ 114

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్థే, హేమాస్వయంవరోనామ, సప్తదశస్సర్గః ॥**

శ్రీరాముని ప్రసాదమువలన పుణ్యక్షేత్రములు ఏర్పడుటచే దీనిని రామక్షేత్రమని చెప్పెదరు. శ్రీరామ, మునీంద్రుల అనుగ్రహముచే ఇది మునుపువలె మనోహరమును, పుణ్యప్రదమును, సౌఖ్యప్రదమయిన దేశముగా ఏర్పడును. సమస్తదేశములకును ఈ దండకదేశము సుపవిత్రమనబడును. దండక దేశమునకు సాటియగు దేశము మరియొకటి ఉండదు.” అని అనుగ్రహించిన భృగుముని; తన కూతురుని ఒక మునీంద్రునికిచ్చి వివాహముచేసి, తపస్సుకై హిమాలయమునకు వెడలెను.

భృగుముని శాపకారణముగ దండకుని రాజ్యము నూరు ఆమడలదూరం భస్మమై అరణ్యముగా మారిపోయెను. అది ఇప్పటికిని నేనును, శ్రీరాముడును అచ్చటపోగా మునుపటివలెనె దండకారణ్యము చరాచర సమాకులమై సుస్థితి నందెను. లవుడా! నీవడిగినందున కంకణోపాఖ్యానమును, దండకోపాఖ్యానమును నీకు చెప్పితిని. ఇది విచిత్రము అని అగస్త్యుడు చెప్పగా ఆ లవుడు ఎంతో సంతోషమునంది మునీంద్రునికి నమస్కరించి, శ్రీరామచంద్ర పరబ్రహ్మముయొక్క పాదసేవా పరాయణుడయ్యె. అంత ఆ రఘునందనుడు హేమాంగను అనర్ఘ్యమహోత్సవములతో చిత్రాంగదునకిచ్చి వివాహము చేయించెను. అల్లునకిచ్చిన కోట్యంతరమగు గజాశ్వరథాదులుగల కట్నము అత్యంతాశ్చర్యకరమయ్యె. అయోధ్యానగరమున ఆ ప్రభుమందిరమున సంతోషకరమగు ఉత్సాహములు జరిగెను. అంత ఉగ్ర బాహువు శ్రీరామాజ్ఞను పొంది తన రాజధానికి వెడలెను. మునీంద్రులు మొదలగువారు వారివారి స్థలములకు జేరిరి.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, హేమ స్వయంవరమును వర్ణించు 17వ సర్గ ముగిసినది.**

# అష్టాదశః సర్గః-18వ సర్గ

రామనాథపుర రాజ్యదాన వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథ రామస్త్వయోధ్యాయాం రంజయామాస జానకీమ్ ।
జుగోప మేదినీం కృత్స్నాం సప్తసాగరమేఖలామ్ ॥ 1

రామముద్రాం వినా కస్య సాకేతే శస్త్రధారిణః ।
నైవాసీత్సుప్రవేశశ్చ రామరాజ్యే కదాచన ॥ 2

నైవాసీన్నిర్గమశ్చాపి వినా ముద్రాం కదా బహిః ।
రామముద్రాంకితం పత్రం గృహీత్వా తే నృపోత్తమాః ॥ 3

గమనాగమనే చక్రుర్భూమ్యాం కుత్రాప్యకుంఠితాః ।
రామముద్రాస్వరూపం చ తే వదామి శృణుష్వ తత్ ॥ 4

తిర్యగూర్ధ్వం పంచదశ రక్తా రేఖాః ప్రకల్పయేత్ ।
పీతా ప్రథమికా పంక్తిశ్చతుర్దిక్షు ప్రకారయేత్ ॥ 5

పంక్తిర్ద్వితీయా శుభ్రైవ జ్ఞాతవ్యా చ తథాఽష్టమీ ।
తతశ్చేశదిగారభ్య తృతీయాయాం ప్రకల్పయేత్ ॥ 6

వక్ష్యమాణపదాన్యేవ కృష్ణాని హి సమాచరేత్ ।
ఆరంభశ్చోత్తరస్యాం హి సమాప్తిర్దక్షిణే స్మృతా ॥ 7

పశ్చిమాభిముఖా స్థాప్యా ముదా తత్రాత్మసమ్ముఖా ।
పూర్వాస్యేన సదా స్థేయం తదా కర్త్రీ వినిశ్చయాత్ ॥ 8

ప్రథమం హి ద్వితీయాం చ చతుర్థం షష్ఠసప్తమే ।
అష్టమం నవమం చైవ తథైకాదశముచ్యతే ॥ 9

తమశ్చతుర్థ్యాం పంక్తౌ హి చతుర్థ షష్ఠసప్తమే ।
తథైకాదశమం జ్ఞేయం పంచమాయాః క్రమోఽధునా ॥ 10

ప్రథమం హి ద్వితీయం చ చతుర్థం షష్ఠసప్తమే ।
నవమైకాదశే చాపి షష్ఠాయాశ్చ క్రమోఽధునా ॥ **11**

ప్రథమం హి ద్వితీయం చ చతుర్థం షష్ఠముత్తమమ్ ।
నవమైకాదశే చాఽపి సప్తమీ సకలాఽసితా ॥ **12**

నవమ్యాః ప్రథమం కృష్ణం ద్వితీయం హి చతుర్థకమ్ ।
షష్ఠం హి సప్తమం చాపి నవమం దశమం స్మృతమ్ ॥ **13**

తథైవ ద్వాదశం చాపి దశమ్యాశ్చ క్రమోఽధునా ।
చతుర్థం చ తథా షష్ఠం సప్తమార్కే తథాఽసితే ॥ **14**

ఏకాదశ్యాశ్చ ప్రథమం ద్వితీయం హి చతుర్థకమ్ ।
షష్ఠాష్టనవమాన్యేవ దశమార్కే తథాఽసితే ॥ **15**

ద్వాదశ్యాః ప్రథమం కృష్ణం ద్వితీయం హి చతుర్థకమ్ ।
షష్ఠం చ సప్తమం చాపి హ్యష్టమం నవమం తథా ॥ **16**

దశామార్కే తథా ప్రోక్తా కృష్ణా కృత్స్నా త్రయోదశీ ।
ఏవం బుద్ధ్వా పూరయిత్వా రాజా రామేతి వై స్ఫుటమ్ ॥ **17**

సితవర్ణం రామనామముద్రాయాం హి నిరీక్షయేత్ ।
ఏవం రాముముద్రికాయాః స్వరూపం తే మయోదితమ్ ॥ **18**

## శ్రీరామ సర్వతోభద్రనామక ముద్రాభివర్ణనము

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, “పిదప శ్రీరామచంద్రుడు సీతను సుఖసాగరములో తేలింప జేయుచూ, యేడు సముద్రములచే చుట్టబడిన ఏడు ద్వీపములతో కూడిన సమస్త భూమండలమును పాలించుచుండెను. రామరాజ్యమున ఎప్పుడూ ఎవ్వనికీ శ్రీరామ ముద్రిక లేక అయోధ్యాపట్టణమున అంత తేలికగా ప్రవేశము కలుగదయ్యె. ఒకప్పుడు నగరమునుండి వెలుపలకు పోవలయుననిన ఆ రామముద్ర లేక వీలుగాదు. శ్రీరామ నామ ముద్రను ధరించిన రాజులు నిరాటంకముగా ఎప్పుడైనను అయోధ్యలోనికి వచ్చి, వెళ్ళుతూ ఆనందించుచుండిరి. అట్టి శ్రీరామముద్రా స్వరూపమును చెప్పుచున్నాను వినుము.

విష్ణుదాసా! నిలువుగను, అడ్డముగను 15 రేఖలు గీసినచో, అపుడు 196 గడులుగల చక్రమేర్పడును. దాని లోని 14 గడుల వరుసలలో నాలుగుదిక్కులయందును మొదటిగీత పసుపు రంగుతో గీయవలయును. తూర్పువైపున పై రెండవవరుస శుభ్రముగా ఉండును. అట్లే ఎనిమిదవ వరుసయును శుభ్రముగా ఉండును. ఆ పైన 'రాజారామ' అని దేవనాగరాక్షరము ఏర్పడునట్లు మధ్యభాగమున శుభ్రాక్షరములు ఏర్పరచవలయును. ఇట్లు రామముద్రా స్వరూపమును నీకు చెప్పితిని.

**ఏవం ముద్రాంకితాం రామః శిలాం విప్రేభ్య ఆదరాత్ ।**
**దదౌ సాద్యాపి భూమ్యాం హి రామనాథపురేఽస్తి హి ॥ 19**

**విష్ణుదాస ఉవాచ**

**కిమర్థం భూసురేభ్యశ్చ రాఘవేణ సమర్పితా ।**
**రామనాథపురే పూర్వం స్వీయముద్రాంకితా శిలా ॥ 20**

**తత్సర్వం విస్తరేణైవ కథయస్వాద్య మాం గురో ।**
**ఆశ్చర్యం చ త్వయా ప్రోక్తం శ్రోతుమిచ్ఛామి త్వన్ముఖాత్ ॥ 21**

**శ్రీరామదాస ఉవాచ**

**ఏకదా రాఘవం శ్రుత్వా విప్ర వాంఛిత దాయినమ్ ।**
**హర్షాద్బ్రహ్మపురస్థాస్తే దాక్షిణాత్యా ద్విజోత్తమాః ॥ 22**

**యయుస్తే రాఘవం ద్రష్టుమయోధ్యాయాం ముదాన్వితాః ॥ 23**

**గంధర్వరాజగేహే స భోజనం కర్తుముద్యతః ।**
**స్నాత్వా తత్ర సుహృద్గేహే సీతయా బంధుభిః సుఖమ్ ॥ 24**

**పుత్రాభ్యాం భోజనం కర్తుమాసనే సంస్థితోఽభవత్ ।**
**గంధర్వరాజః శ్రీరామం పూజయామాస సాదరమ్ ॥ 25**

**పరివేషితాని పాత్రాణి సుహృత్స్త్రీభిస్తదా జవాత్ ।**
**దివ్యాన్నైర్మధురైశ్చిత్రైః పక్వాన్నైర్వివిధైరపి ॥ 26**

**ఏతస్మిన్నంతరే విప్రా రామనాథపురస్థితాః ।**
**సుహృద్గేహే గతం రామం శ్రుత్వా తత్ర యయుర్ముదా ॥ 27**

**గంధర్వరాజద్వారస్థైర్దూతైః శ్రీరాఘవాయ హి ।**
**భూసురాణామాగమనం తదా శీఘ్రం నివేదితమ్ ॥ 28**

ఇట్లు 'శ్రీరామ' ముద్రాంకితమయిన శిలను శ్రీరామచంద్రుడు సాదరముగా బ్రాహ్మణులకు దానముచేసెను. అది ఇప్పటికిని భూమిలో రామనాథపురమున ఉన్నదిగదా?" అనిన రామదాసు మాటలు వినుచున్న విష్ణుదాసుడు, "మునుపు శ్రీరాముడు బ్రాహ్మణులకు రామనాథపురమున తన నామ ముద్రాంకిత శిలను ఏల ఇచ్చెను?" ఆ సంగతిని సవిస్తరముగా నిరూపింపుము," అని వేడెను.

ఒకప్పుడు దక్షిణదేశమున బ్రహ్మపురవాస్తవ్యులగు బ్రాహ్మణులందరును శ్రీరాముడు విప్రవాంఛా పరిపూరకుడై ఉన్నాడను సంగతిని విని, వేలకొలది వెడలి అయోధ్యానగరమును చేరిరి. ఆ సమయమున అంతలో శ్రీరాముడు అయోధ్యానగరమున సంతోషముతో గంధర్వరాజ గృహమున భోజనము చేయ ఉద్యమించియుండెను. అచ్చట మిత్రుని మందిరమున శ్రీరాముడు– సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్నసమేతుడై పుత్రులతోడ స్నానముచేసి, భోజనార్థము దివ్యాసనములమీద సుఖాసీనుడై ఉండెను. అప్పుడు మిత్రుడగు గంధర్వరాజు శ్రీరామస్వామిని సాదరముగా పూజించెను. వెండి, బంగారు విస్తర్లలో భక్ష్య, భోజ్య, దివ్యాన్నాదులు అందమైన కన్యలచే వడ్డింపబడె. అంతలో రామనాథ పుర విప్రులు శ్రీరాముడు మిత్రమందిరమున ఉన్నాడను సంగతి ఎరిగి సంతోషముతో అచ్చటికి వచ్చిరి. గంధర్వరాజ ద్వారపాలకులు త్వరగా వెడలి బ్రాహ్మణులు వచ్చి కనిపెట్టియున్నారను సంగతిని శ్రీరాఘవేంద్రుని సన్నిధికి విన్నవించిరి.

**తద్దూతవచనం శ్రుత్వా రాఘవశ్చాతిసంభ్రమాత్ ।**
**ప్రత్యుద్గమ్య స్వయం విప్రాన్ననామ శిరసా ప్రభుః ॥ 29**

**గంధర్వరాజగేహే తాన్నీత్వా దత్వాఽఽసనాని హి ।**
**స్నాతుమాజ్ఞాపయత్సర్వాన్ భోజనార్థం రఘూత్తమః ॥ 30**

**తదా తే మంత్రయామాసుర్విప్రాః సర్వే పరస్పరమ్ ।**
**భోజనాత్పూర్వమేవైనం యాచనీయం స్వవాంఛితమ్ ॥ 31**

**కేచిదూచుస్తదా విప్రా నిర్బంధ చ రఘూత్తమే ।**
**నోపేక్షాఽస్తి సదైవాయం దదాతి ద్విజవాంఛితమ్ ॥ 32**

**వ్రతమేవాస్య రామస్య ద్విజవాంఛితపూరణమ్ ।**
**ఏవం తాన్మంత్ర్యమాణాంశ్చ రామో దృష్ట్వాఽబ్రవీద్వచః ॥ 33**

**జ్ఞాతం మయాఽభిలషితం యుష్మాకం మునిపుంగవాః ।**
**రాజ్యేచ్ఛయా సమాయాతాః కిమర్థం శ్రమితా ద్విజాః ॥ 34**

**కథం న ప్రేషితః శిష్యస్తద్వాక్యేనైవ వై మయా ।**
**వాంఛాఽభవిష్యద్యుష్మాకం పూరితా క్షణమాత్రతః ॥ 35**

**ఏవం తాన్ బ్రాహ్మణానుక్త్వా లక్ష్మణం ప్రాహ రాఘవః ।**
**మయా బ్రహ్మపురాస్యాద్య విప్రేభ్యో రాజ్యమర్పితమ్ ॥ 36**

**శిలాయాం లిఖ మన్నామ దానం దత్తమిదం త్వితి ।**
**తథేతి రామవాక్యేన లక్ష్మణశ్చాతిసంభ్రమాత్ ॥ 37**

దూతలు చెప్పిన మాట వినుచునే మిక్కిలి సంభ్రమముతో ఎదుర్కొలుపోయి, ఆ ద్విజవర్యులకు నమస్కరించెను మరియు వారిని గంధర్వరాజ గృహమున అసన, అర్ఘ్య, పాద్యాదులచే సత్కరించి, మిగుల సంభ్రమముతో అందరిని భోజనార్థము స్నానముచేయుడని వేడెను. అప్పుడు వారందరును, "భోజనమునకు మునుపే మనము మన కోరికను యాచింపవలయు" అని ఆలోచించిరి. మరికొందరు, "శ్రీరామునియందు నిర్బంధముచేయరాదు. ఎప్పటికిని బ్రాహ్మణుల వాంఛితములను పూర్తిచేయుటయే శ్రీరామునియొక్క వ్రతముగానున్నది," అని ఇట్లు వారు పరస్పరమాలోచించుచుండుటను విని శ్రీరామచంద్రుడు వారితో, "బ్రాహ్మణులారా! మీ అభిప్రాయమును ఎఱిగితిని. రాజ్యార్థులై విచ్చేసితిరి. ఇంతయేల శ్రమనందితిరి? ఒక శిష్యునిబంపియుండిన వాని మాటమీదనే క్షణమాత్రమున మీ వాంఛితములు పూర్తిచేయుచుంటినే," అని బ్రాహ్మణులకు జెప్పి, లక్ష్మణుని జూచి, "నేనిప్పుడు బ్రహ్మపురము యొక్క రాజ్యమును బ్రాహ్మణులకిచ్చియున్నాను. ఇట్లు దానమివ్వబడినదని శిలాశాసనము వ్రాసి యిప్పింపుము," అని ఆజ్ఞాపించెను. అంత అతడట్లేయని అంగీకరించి, లక్ష్మణుడు మిక్కిలి సంభ్రమముతో రాతిపనివారిని పిలిపించి, ఇప్పుడే శిలను తీసికొనిరండు అని ఆజ్ఞాపించెను. వారు అట్లే త్వరపడి వెడలిరి. అంతలో బ్రాహ్మణులు శ్రీరామునిజూచి, సంతోషముతో....

**దృషత్కారాన్సమాహూయ శిలామానీయతామితి ।**
**శీఘ్రమాజ్ఞాపయామాస తే జగ్ముర్వేగవత్తరాః ॥ 38**

**ఏతస్మిన్నంతరే విప్రాః ప్రోచుస్తే రాఘవం ముదా ।**
**కృత్వాఽశనం లేఖనీయా శిలా పశ్చాద్రఘూత్తమ ॥ 39**

కిమర్థం క్రియతే రామ త్వరా లేఖనకర్మణి ।
పరివేషితాని పాత్రాణి వయం చాపి క్షుధార్దితాః ॥ 40

తత్తేషాం వచనం శ్రుత్వా ఫలభారాన్విచిత్రితాన్ ।
పురస్తాత్స్థాపయామాస విప్రాణాం వరమాదరాత్ ॥ 41

ఉవాచ మధురం వాక్యం రాఘవః స్మితపూర్వకమ్ ।
ఫలానీమాని భో విప్రా భక్షయధ్వం యథాసుఖమ్ ॥ 42

లేఖయిత్వా శిలాయాం హి యదా ముద్రాం కరోమ్యహమ్ ।
తదాఽశనాదికం కర్మ సర్వమన్యత్కరోమ్యహమ్ ॥ 43

క్షణం విత్తం క్షణం చిత్తం క్షణికం చ స్వజీవితమ్ ।
యమోఽతినిర్ఘృణః సోఽస్తి ధర్మం శీఘ్రమతశ్చరేత్ ॥ 44

శతం విహాయ భోక్తవ్యం సహస్రం స్నానమాచరేత్ ।
క్షణం త్యక్త్వా తు దాతవ్యం కోటిం త్యక్త్వా శివం భజేత్ ॥ 45

కోటివిఘ్నాని గీతాయాం దశకోటీని జాహ్నవీమ్ ।
శతకోటీని జాయంతే దానే విఘ్నాని భూసురాః ॥ 46

అతః కార్యా త్వరా దానే సర్వదా తు నరోత్తమైః ।
నిద్రాయాః పూర్వకాలే తు నిద్రాయాః పరతస్తథా ॥ 47

భోజనాత్పూర్వకాలే తు భోజనాత్పరతస్తథా ।
క్షణే క్షణే మతిర్భిన్నా జాయతేఽత్ర ద్విజోత్తమాః ॥ 48

తస్మాత్కార్యా త్వరా దానే మతిర్యా ప్రథమే క్షణే ।
కృతా క్షణేనాపరే సాఽస్త్యేతదేవ మతం మమ ॥ 49

"భోజనము చేసి, పిదప శిలాశాసనమును వ్రాయించవచ్చును. దానిని వ్రాయుటకేల యింత త్వరపరచెదవు. రామ ప్రభూ! విస్తర్లలో వడ్డించియున్నారు. మేమును ఆకలిగొనియున్నాము," అని ప్రార్థించిరి. అందుకు శ్రీరాముడు ఎంతో ప్రీతితో వారిముందు పక్వఫలములను చాలాసమర్పించెను. మరి మృదుమధుర వాక్యములచే, "స్వాములారా! ఈ ఫలములను సుఖముగా భక్షించండి. శిలా శాసనమును వ్రాయించి దానిలో నా ముద్రను అంకితముజేసి, పిదప భోజనాది కార్యములను ఆచరించెదను.

ధనము క్షణికము, చిత్తము క్షణికము, ఈ బ్రతుకూ క్షణికమే. దయారహితుడైన యముడనువాడు కాచియున్నాడు కావున ధర్మమును త్వరగా ఆచరించవలయును.

నూరు పనులున్నను వదలి మొదట భుజింపవలయును, వేయి పనులున్నను వదలి స్నానము చేయవలయును. మహోత్సవమును విడిచియైనను దానము ఆచరింపదగును. కోటి కార్యములున్నను శివుని భజింపవలయును. లోకమున సద్గీతా శ్రవణమునకు కోటి విఘ్నములు సంభవించుచున్నవి. బ్రాహ్మణులారా! దాన ధర్మమున శతకోటి విఘ్నములు ఉదయించుచున్నవి. కావున నరులు దానసమయమున త్వరపడవలయును.

విప్రవర్యులారా! నిద్రపోవునపుడును, నిద్ర మేల్కొనినపుడును, భోజనమునకు పూర్వమునను, భోజనము తరువాతను ప్రతిక్షణము బుద్ధి మార్పుచెందుచుండును. కావున మొదటిక్షణమున జనించిన బుద్ధి మరుక్షణమున మారిపోవును. అట్లు కాకయుండుటకై తద్వ్యవసాయమున ఉండదగుననునది నా అభిప్రాయము.

**ఏతస్మిన్నంతరే తత్ర దృషత్కారైః శిలా వరా ।**
**సమానీతా గండకీజా నవహస్తా సమంతతః ॥ 50**

**తస్యాంతే లేఖయామాసుః దృషత్కారాః స్ఫుటాక్షరైః ।**
**సూర్యవంశోద్భవేనాథ సప్తద్వీపేశ్వరేణ హి ॥ 51**

**త్రేతాయాం దాశరథినా రామరాజ్ఞా ద్విజోత్తమాన్ ।**
**మయా బ్రహ్మపురస్యైవ రాజ్యదానం కృతం ముదా ॥ 52**

**యావత్తపతి ఖే భానుర్యావదస్త్యత్ర మే కథా ।**
**యావత్ ప్రవర్తతే వాయుస్తావద్దానం మమాస్త్విదమ్ ॥ 53**

**సంమాన్యోఽయంధర్మసేతుర్ద్విజానాం**
**కాలే కాలే పాలనీయోభవద్భిః ।**
**సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్**
**భూయో భూయో యాచతే రామచంద్రః ॥ 54**

**ఏవం విలేఖ్య శ్రీరామః శిలాయాం నిజముద్రికామ్ ।**
**రామనామాంకితాం వాయుపుత్రేణాస్పర్శయత్తదా ॥ 55**

ఆంజనేయస్య భారేణ శిలా జాతా తదంకితా ।
రాజారామేతి తస్యాంతే దదృశుశ్చ స్ఫుటాక్షరమ్ ॥ 56

రామనాథేన యద్దత్తం పురదానం ద్విజోత్తమాన్ ।
రామనాథపురం చేతి తదారభ్య ప్రథాం గతమ్ ॥ 57

తస్య బ్రహ్మపురమితి నామ ప్రాథమికం స్మృతమ్ ।
రామనాథపురం చేతి తస్యైవాఖ్యాఽపరా స్మృతా ॥ 58

శిలాభారమితం ద్రవ్యం దక్షిణార్థం నిధాయ సః ।
తాం శిలాం పూజ్య విప్రేభ్యః శ్రీరామః సీతయా దదౌ ॥ 59

తతోఽబ్రవీద్వాయుపుత్రం భోజనానంతరం త్వయా ।
విమానేన శిలా నేయ రామనాథపురం ద్విజైః ॥ 60

కంబుకంఠం తతః పత్రం లేఖయామాస రాఘవః ।
బ్రాహ్మణానాం త్వయా కార్యం సాహాయ్యం సర్వదేతి వై ॥ 61

తతస్తుష్టా ద్విజాః సర్వే దదురాశీః సహస్రశః ।
చకార భోజనం రామస్తతస్తైః పరివేష్టితః ॥ 62

అంతలో అచ్చటికి గండకీనదియందు పుట్టిన చతురస్రముగల తొమ్మిది మూరల ప్రమాణముగల దివ్యశిలను ఊాతిపనివారు తెచ్చిరి. అందులో స్ఫుటాక్షరములచే, "త్రేతాయుగమున సప్తద్వీప పాలకుడును, సూర్యవంశోద్భవుడును అగు దాశరథి రామరాజు బ్రహ్మపురముయొక్క రాజ్యమును బ్రాహ్మణులకు దానముగావించెను. ఈ నేనిచ్చిన దానము– గాలి వీచుచుండువరకు, నా కథ లోకమున ఉండునంతవరకు, సూర్యుడు ప్రకాశించుచుండునంతవరకును శాశ్వతమై ఉండునుగాక! తత్తత్ కాలములలో వచ్చునట్టి రాజేంద్రులారా! మీరందరును ఈ ధర్మసేతువును పరిపాలించుడు. ఇట్లని రాగల రాజేంద్రులందరిని రామచంద్రరాజు ప్రార్థించుచున్నాడు," అను అర్థమును గల 24 శ్లోకములను శిలాశాసనమున వ్రాయించి, ఆ శిలపై తన ముద్రికను ఆంజనేయునిచే వేయించెను. అది హనుమంతుని స్పర్శచే 'రాజారామ' యని రామముద్రాంకితమయ్యె. రామనాథునిచే ఇవ్వబడిన పట్టణము గాన అది రామనాథపురమని ప్రసిద్ధినందెను. మొదట ఆ పురమును బ్రహ్మపురమనుచుండిరి. పిదప రామనాథపురమని రెండవపేరు వచ్చెను. ఆ శిల అంత బరువుగల సువర్ణమును దక్షిణార్థముగా నెత్తిపెట్టి, ఆ శిలను పూజించి, సీతాదేవితోకలసి శ్రీరాముడు బ్రాహ్మణులకు దానముచేసెను. అంత

ఆ రామచంద్రుడు హనుమంతునితో, "నీవు భోజనమైన వెనుక ఈ శిలను బ్రాహ్మణులతో విమానమున తీసికొనిపోయి రామనాథపురమునకు చేర్చుము," అని ఆజ్ఞాపించి, కంబుకంఠునికి, "నీవు బ్రాహ్మణులకు నిరంతరము సహాయకుడవై ఉండదగును," అని పత్రికను వ్రాయించెను. అంత ఆనందించిన బ్రాహ్మణులు ఎన్నెన్నో ఆశీర్వాదములను పలికిరి. ఆ బ్రాహ్మణులతో శ్రీరాముడు భోజనముచేసెను.

తతః సర్వే విమానేన యయుర్విప్రాః పురం ప్రతి ।
తాన్ పృష్ట్వా మారుతిశ్చాపి విమానేన యయౌ పునః ॥ 63

ఏవం చకార దానాని సప్తద్వీపాంతరేషు హి ।
సహస్రశో రామచంద్రస్తేషాం సంఖ్యా న విద్యతే ॥ 64

రామనాథపురస్థాస్తే విప్రాః కాలాంతరేణ వై ।
దుష్టరాజ్యభయాదగ్రే తాం శిలాం భయవిహ్వలాః ॥ 65

తటాకే ప్రక్షిపిష్యంతి తతః కష్టం భజంతి తే ।
మర్త్తుకాన్ ద్విజాన్ దృష్ట్వా తటాకాన్ మారుతిః పునః ॥ 66

బహిర్నిష్కాస్యతి శిలామగ్రే కాలాంతరేణ హి ।
విష్ణుదాస ఉవాచ
కిం కష్టం భూసురానగ్రే భవిష్యతి స్వజీవితే ॥ 67

యతస్తే త్యక్తుకామాశ్చ భవిష్యంతి వదస్వ తత్ ।
శ్రీరామదాస ఉవాచ
అగ్రే కశ్చిద్దుష్టరాజా భవిష్యత్యవనీతలే ॥ 68

స తాన్నిబధ్య విప్రాంశ్చ తద్రాజ్యహరణేచ్ఛయా ।
వదిష్యతి కలౌ రాజా యుష్మాకం దానమర్పితమ్ ॥ 69

యది రామేణ తద్దానపత్రం మే దృష్టిగోచరమ్ ।
కరణీయం న చేచ్ఛీఘ్రం యావత్కాలం పురోద్భవమ్ ॥ 70

యుష్మాభిర్వసు యద్భుక్తం తత్సర్వం దీయతాం మమ ।
నోచేత్సర్వాన్ వధిష్యామి భూసురాణాం యమస్త్వహమ్ ॥ 71

**తతస్తే బ్రాహ్మణాః సర్వే శ్రుత్వేదం నృపతేర్వచః ।**
**భయభీతా మంత్రయిత్వా నృపం ప్రోచుస్త్వరాన్వితాః ॥ 72**

**మాసేనైకేన పత్రం తే దర్శయిష్యామహే వయమ్ ।**
**తతో ముమోచ తాన్రాజా తేఽపి తూష్ణీం పురం యయుః ॥ 73**

**తటాకస్య తటం భిత్వా ప్రవాహాః శతశస్తతః ।**
**మోచయామాసుః సర్వత్ర నాంతం తస్య జలస్య తే ॥ 74**

రామనాథపుర విప్రులందరును విమానమునెక్కిరి. వారి అనుమతిమీద వాయుపుత్రుడును శిలతోడ విమానము ఎక్కెను. ఇట్లే ఏడు ద్వీపములలోను శ్రీరాముడు వేలకొలదిగా దాన ధర్మములను ఆచరించియున్నాడు. వాటి లెక్కచెప్పుటకు అలవిగాదు. కాలాంతరమున రామనాథపుర వాసులు దుష్టరాజుల భీతివలన ఆ శిలను చెరువులో పడవేయుదురు. అంత వారు కష్టించుచుందురు. ఇక కొంతకాలమునకు చచ్చుచుండు బ్రాహ్మణులను చూచి, ఆంజనేయుడు ఆ శిలను తటాకమునుండి బయటవేయును" అనిన రామదాసు మాటలు విన్న విష్ణుదాసుడు.....

"స్వామీ! విప్రులకేమి కష్టము కలుగును? వారేల చావనెంచెదరు?" అని అడుగగా రామదాసు ఇట్లనెను– ఇక మీద కలిలో ఒక దుష్టరాజు జనించి ఆ బ్రాహ్మణులరాజ్యమును అపహరించనెంచి, వారిని నిర్బంధించి, "రాజు మీకు దానమిచ్చియుండిన యడల ఆ రాముని దాన పత్రమును నాకు చూపండి, అట్లుగాకున్న ఇంత వరకు ఎంతద్రవ్యము ఈ రాజ్యమునుండి మీరు అనుభవించితిరో అంతటిని జమపరచండి. అట్లు చేయక పోతిరా, బ్రాహ్మణులపాలిటి యముడనగు నేను మిమ్ముల నందరిని సంహరించెదను," అని నిగ్రహించెను. అప్పుడామాట విని బ్రాహ్మణులు భయభ్రాంతులై ఆలోచించి, "ఒక నెలలోపల దానపత్రమును తెచ్చి చూపెదము," అని గడవువేడుకొనగా ఆ దుష్టుడు సమ్మతించి, వారు వారి ఊరికిపోయిన పిదప ఆ చెరువుయొక్క నీరు పారుటకు నూరుమార్గములను ఏర్పాటుచేసిరి.

**దదృశుః సకలా విప్రాస్తతస్తే ప్రాణసంకటమ్ ।**
**జ్ఞాత్వా తత్ర నిరాహారా నిషేదుః సరసస్తటే ॥ 75**

**రాఘవం పరమాత్మానం చింతయామాసురాదరాత్ ।**
**ఏవం మాసే త్వతిక్రాంతే వధం జ్ఞాత్వాత్మనో నృపాత్ ॥ 76**

భయాత్ప్రాణాంస్త్యక్తుకామా హాసంస్తస్మిన్ జలాశయే ।
తదా తేషాం స్త్రియః పుత్రాశ్చక్రుః కోలాహలం భృశమ్ ॥ 77

తాన్సర్వాన్ సాంత్వయామాసుర్నానానీత్యుత్తరైఃద్విజాః ॥
స్వయం స్నాత్వా ద్విజాః సర్వేదదుర్దానాన్యనేకశః ॥ 78

చక్రుః ప్రదక్షిణాః సప్త తటాకయోత్తరాననాః ।
ఊచుర్దీర్ఘస్వరేణైవ ప్రబద్ధకరసంపుటాః ॥ 79

హే రామ జానకీకాంత త్వద్దానాదీదృశీ గతిః ।
జాతాఽస్మాకం మృతాన్నస్త్వం సర్వాన్పశ్య రఘూత్తమ ॥ 80

పురోద్భవం తు యద్ద్రవ్యం పూర్వజైర్భుక్తమేవ తత్ ।
ఏతావత్కాలపర్యంతమ్ అస్మాభిశ్చాధునా కుతః ॥ 81

తత్త్వదేయమసంఖ్యాత మతస్త్యక్ష్యామ జీవితమ్ ।
ఇత్యుక్త్వా బ్రాహ్మణాః సర్వే నిమీల్య నయనాని తే ॥ 82

చింతయామాసుః స్వీయేష్టా దేవతాం మరణోత్సుకాః ।
ఏతస్మిన్నంతరే తత్ర దేవాగారే హనూమతః ॥ 83

పాషాణమూర్తేః ప్రకటః సమ్బభూవాంజనీసుతః ।
దీర్ఘస్వరేణ తాన్ ప్రాహ భూసురాన్ సంభ్రమాద్ధరిః ॥ 84

యూయం మా జీవితాన్యద్య త్యజధ్వం బ్రాహ్మణోత్తమాః ।
ఆగతో రాఘవస్యాహం దాసోఽంజనిసముద్భవః ॥ 85

ఇతి తద్వచనం శ్రుత్వా ద్విజాస్తే విస్మయాన్వితాః ।
ఉన్మీల్య నయనాన్యగ్రే దదృశుర్వాయునందనమ్ ॥ 86

దీర్ఘబాహుం మహాఘోరం పింగకేశవిరాజితమ్ ।
జరఠ పర్వతాకారం రామనామప్రభాషిణమ్ ॥ 87

తం దృష్ట్వా తే ద్విజాః సర్వే ప్రణేముర్హృష్టమానసాః ।
కథయామాసుస్తం సర్వం స్వీయం వృత్త సవిస్తరమ్ ॥ 88

అయినను దాని అంతము తెలియరానిదయ్యె. నీరు నిండియుండె. ఈ ప్రాణసంకటమును చూచి, విప్రులందరును మాసాంతమున తమ మరణమని శ్రీరామచంద్ర పరబ్రహ్మను ధ్యానించుచు ఆ తటాక తీరమున నిరాహారులై నిలిచిరి. భయముచే చివరకు ఆ చెరువుననే ప్రాణపరిత్యాగమునకు సర్వసిద్ధులయిరి. అప్పుడు వారి భార్యలు, బిడ్డలు కలతనొంది గందరగోళపడిరి. ఈ బ్రాహ్మణు లందరును వారినందరిని సమాధానపరచి తాము స్నానముచేసి అనేక దానముల నొసగి, ఉత్తరాభి ముఖులై ఆ తటాకమునకు 7 ప్రదక్షిణములు చేసి, చేతులుజోడించి, ఉచ్చైస్స్వరముతో, "జానకీ వల్లభుడవైన శ్రీరామా! నీవిచ్చిన దానమువలన మాకీ దుర్దశవచ్చినది. అన్నములేనివారమైతిమి. అంతటిని నీవే చూడుము. మా పూర్వీకులనుండి మునుపు అనుభవింపబడినది యిప్పుడేల? అదంతయు అసంఖ్యా తపమగుటచే ప్రాణములను పరిత్యజించెదము," అని చెప్పి, అందరును కన్నులుమూసికొని మరణోత్సాహమునంది తమ యిష్టదేవతను చింతించిరి. అంత ఆ వేళకు దేవుని ఇంటనుండిన శిలాప్రతిమనుండి ఆంజనేయుడు ఆవిర్భవించెను.

"ఓ బ్రాహ్మణులారా! ఇప్పుడు మీరు ప్రాణపరిత్యాగమును చేయవలదు. శ్రీరామచంద్రస్వామియొక్క దాసుడనిదిగో హనుమంతుడు వచ్చియున్నాడను," అనిదీర్ఘస్వరముతో పలికిన వాయుపుత్రుని వాక్యమును విని, వారందరును ఎంతో ఆశ్చర్యమునొంది విప్పారిన కన్నులతో అంజనా సుతుని దర్శించిరి. పర్వతాకారుడును కనకకేశాలంకృతుడును, మహాఘోరుడును, మహాభుజుడును అయిన శ్రీరామనామ పారాయణ పరాయణుడగు హనుమంతుని వారు చూచి, విప్రులందరును నమస్కరించి, తమ వృత్తాంతమును విన్నవించుకొనిరి.

**తతః స మారుతిర్వేగాత్సరసస్తాం శిలాం బహిః ।**
**నిష్కాస్య విప్రవర్యైస్తైః శిలాం ధృత్వా స్వయం కపిః ॥ 89**

**జగామ దుష్టరాజానం దర్శయామాస తాం శిలామ్ ।**
**రామముద్రాంకితాం దృష్ట్వా లిపిం రాజాஉతివిస్మితః ॥ 90**

**తం తదా రోపయామాస శూలాగ్రే వాయుజో నృపమ్ ।**
**తస్మిన్నేవ తటాకే హి యత్ర విప్రాః స్థితాః పురాః ॥ 91**

**నృపం మోచయితుం యే యే రాజదూతాః సమాయయుః ।**
**తాన్సర్వాన్ వర్జయామాస పుచ్ఛేనైవ స మారుతిః ॥ 92**

**ద్విజహృత్తాపశమనాద్ధృత్తాపశమనం సరః ।**
**బభూవ నామ్నా తత్పుణ్యం తత్ర శ్రీవాయుసూనునా ॥ 93**

రాజ్యదానేన రామస్యౌదార్యం లోకాన్ప్రదర్శితుమ్ ।
ఉదారరాఘవోశాఖ్యః శమ్భుః సంస్థాపితః శుభః ॥ 94

ఉదారరాఘవశ్చేతి నామ్నా మూర్తిః ప్రతిష్ఠితా ।
స్నానాదినా తత్సరసి నృణాం తాపత్రయం న హి ॥ 95

తతః ప్రాహ పునర్విప్రాన్ హనుమాన్తుష్టమానసాన్ ।
భూమ్యాం కృత్వా గుహాం శ్రేష్ఠా తత్రేయం స్థాప్యతాం శిలా ॥ 96

న భవం వోఽస్తు భో విప్రా యుష్మాకం సన్నిధస్త్వహమ్ ।
సర్వహోఽస్మి న భేతవ్యం స్మరధ్వం రఘునందనమ్ ॥ 97

ఇత్యుక్త్వా గుప్తరూపోఽభూత్స్వియమూర్త్యాం ద్విజాగ్రతః ।
తాం శిలాం స్థాపయామాసుర్భూమ్యామేవాతియత్నతః ॥ 98

తతస్తుష్టా ద్విజాః సర్వే జగ్ముః స్వం స్వం గృహం ప్రతి ।
తదాఽఽరభ్య న కేనాపి తేషాం రాజ్యం హృతం కదా ॥ 99

ఏవం శిష్య మయా ప్రోక్తా కథా భావీ తవాగ్రతః ।
పూర్వమేవ జ్ఞానదృష్ట్యా కౌతుకార్థం సవిస్తరా ॥ 100

అద్యాపి తత్ర తైర్విప్రైస్తద్రాజ్య భుజ్యతే సదా ।
యే యే జాతా నృపా భూమ్యాం రామాజ్ఞాం మానయంతి తే ॥ 101

ఏవం నానా కౌతుకాని రాఘవేణ కృతాని హి ।
పుత్రాభ్యాం సీతయాఽయోధ్యాపుర్యాం బంధుజనైః సహ ॥ 102

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్థే రామనాథపురరాజ్యప్రదానం నామ, అష్టాదశః సర్గః ॥

అపుడు ఆ మారుతి త్వరగా ఆ సరస్సునుండి శిలాశాసనమును తీసి, దానిని మోసికొని ఆ బ్రాహ్మణులతో తానే వెడలి, ఆదుష్టరాజునకు ఆ శిలను చూపించెను. ఆ శిలను చూసి, శ్రీరామ ముద్రాంకితమని తెలిసికొని రాజు ఆశ్చర్యపడెను. పిదప పవమానపుత్రుడు మొదట బ్రాహ్మణులందరును నిలిచియుండిన చెరువులో అచ్చటనే శూలముమీద ఆ రాజును వేయించెను. మరియు ఆ రాజును విడిపించుటకు వచ్చిన రాజదూతలనందరిని తోకతో కొట్టి సంహరించెను.

విప్రులయొక్క హృదయవేదన పరిహారమైనందున ఆ సరస్సు 'హృత్తాపశమనము' అనబడెను. ఆ సరస్సుతీరమునందు తత్పుణ్యమును శ్రీరామ ఔదార్యమును లోకులకు ప్రకటించుటకై 'ఉదార రాఘవేశు'డు అను పేరుతో ఒక శివలింగమును వాయుపుత్రుడు స్థాపించెను. ఉదార రాఘవుడని శ్రీరామ బింబముకూడ అచ్చట ప్రతిష్ఠింపబడెను. ఆ సరస్సున స్నానాదులను ఆచరించుటచేత నరులకు తాపత్రయములు తొలగిపోవును. అపుడు మరల మారుతి మహదానందమునంది విప్రులతో "ఈ శిలను భూమిలో ఒక గుహను చేసి, దానిలో స్థాపించండి. మీ రెందుకు ఎంతమాత్రము భయపడవలదు. సంతతము మీ సన్నిధానమున ఉందును. వెరువక శ్రీరామచంద్ర పరబ్రహ్మమును స్మరించుచుండుడు," అని అనుగ్రహించి, యథాప్రకారముగా నిజబింబమున లీనుడయ్యె.

అంత ఆ విప్రులు అట్లే ఆ శిలను స్థాపించి, అత్యంత ఆనందమునొంది, వారివారి యిండ్లకు వెడలిరి. అదిమొదలు ఎవనిచేత ఎప్పుడును వారి రాజ్యము అపహరింపబడదయ్యె.

శిష్యుడగు విష్ణుదాసా! భవిష్యత్కథను నీకిట్లు మొదటనే జ్ఞానదృష్టిచే గ్రహించి చెప్పితిని. ఇప్పటికి అచ్చట బ్రాహ్మణులు రాజ్యమేలుచున్నారు. ఎప్పుడెప్పుడు ఏయే రాజులు పుట్టినను శ్రీరామాజ్ఞను వారు పాలించుచున్నారు. ఇట్లు శ్రీరాముడు బంధుమిత్రులతోడ వివిధ కౌతుకములను లోకులకు చూపుచుండెను.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, రామనాథపుర రాజ్యదానమును వర్ణించు 18వ సర్గ ముగిసినది.**

# ఏకోనవింశః సర్గః-19వ సర్గ

## శ్రీరాముని దినచర్య వర్ణన

శ్రీరామదాస ఉవాచ

శృణు శిష్య వదామ్యద్య రామరాజ్ఞః శుభావహా ।
దినచర్యా రాజ్యకాలే కృతా లోకాన్ హి శిక్షితుమ్ ॥ 1

ప్రభాతే గాయకైర్గీతైర్బోధితో రఘునందనః ।
నవవాద్యానినాదాంశ్చ సుఖం శుశ్రావ సీతయా ॥ 2

తతో ధ్యాత్వా శివం దేవీం గురుం దశరథం సురాన్ ।
పుణ్యతీర్థాని మాతౄశ్చ దేవతాయతనాని చ ॥ 3

నానాక్షేత్రాణ్యరణ్యాని పర్వతాన్ సాగరాంస్తథా ।
నదాంశ్చైవ నదీః పుణ్యాస్తతః సీతాం దదర్శ సః ॥ 4

ప్రణమంతీం సముత్థాప్య ధృత్వా సీతాకరం ప్రభుః ।
మంచకాదవతీర్యాథ దాసీభిః పరివేష్టితః ॥ 5

బహిః కక్షాం శనైర్గత్వా సంపాద్యావశ్యకం ప్రభుః ।
యయౌ పునః స దాసీభిః క్రీడాశాలాం రఘూత్తమః ॥ 6

కృత్వా శౌచవిధిం రామో దంతశుద్ధిం చకార సః ।
తతః స్నానం కదా గేహే సరయ్వాం వాఽకరోత్ప్రభుః ॥ 7

ఆరుహ్య శిబికాయాం స భూసురైర్యానసంస్థితైః ।
వేష్టితః సరయూం గత్వా యానం ముక్త్వా తటే ప్రభుః ॥ 8

పద్భ్యామేవ శనైర్గత్వా సరయూం ప్రణిపత్య చ ।
సరయ్వాః పురతః స్థాప్య నారికేళం సదక్షిణమ్ ॥ 9

సతాంబూలం పునర్నత్వా స్తుత్వా సమ్యక్ ప్రసాద్య చ ।
స్నాత్వా యథావిధానేన బ్రహ్మఘోషపురస్సరమ్ ॥ 10

# శ్రీరామచంద్రుని దినచర్య వర్ణన

విష్ణుదాసా! వినుము; లోకమునకు ఆదర్శప్రాయమునకై శ్రీరాముడు ఆచరించిన దినచర్యను వర్ణించెదను, అని రామదాసుడు చెప్పుచున్నాడు.

శ్రీరఘునాథుడు ప్రొద్దున గాయకుల దివ్యగీతములను విని, మేల్కొనిన సీతతో నవవాద్యములను ఆకర్ణించుచు సుఖమంది, అంత ఆ సాంబసదాశివస్వామిని, లలితాపరదేవతను హృదయారవిందమున అనుసంధానముజేసి, మహా గురువగు దశరథుని ధ్యానించి, దేవతలను స్మరించి, పుణ్యక్షేత్ర తీర్థనదీ దేవతాదులను భావించి, తల్లులకు మ్రొక్కి, శ్రీజానకీదేవిని అవలోకించి, నమస్కరించుచుండు సతీమణిని ఎత్తి, ఆమెయొక్క కరారవిందమును తన కరకమలములచే పట్టి మంచమునుండి దిగి, దాసీజనులతో వచ్చి ఆవశ్యక శౌచకర్మలను ఆచరించి, ఇంటిలో గాని సరయులోగాని స్నానమాచరించును.

సరయునకు వెళ్ళినపుడు పల్లకినెక్కి నదీతీరమువరకు వచ్చి, అచ్చటనే దిగి, నది లోనికి దిగి, ఫలమును, దక్షిణ తాంబూలమును నదీదేవతకు అర్పించి, నమస్కరించి, విధివిధానముతో స్నానముజేసి, వేదఘోష జరుగుచుండగా ...

**ప్రాతః సంధ్యాం తతః కృత్వా బ్రహ్మయజ్ఞం విధాయచ ।**
**దత్వా దానాన్యనేకాని యయౌ గేహం రథేన హి ॥ 11**

**రుక్మబంధైర్వేష్టితేన రౌప్యరత్నమయేన చ ।**
**సుస్నాతసూతతురగయుక్తేన ధ్వనితేన చ ॥ 12**

**హుత్వా హోమం విధానేన శివం సంపూజ్య సాదరమ్ ।**
**కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీం చ సమర్చయత్ ॥ 13**

**కామధేనుం కల్పవృక్షం పారిజాతం తు పుష్కరమ్ ।**
**చింతామణిం కౌస్తుభం చ పూజ్య సీతాయుతో హరిః ॥ 14**

**మునివృక్షం వటం బిల్వమశ్వత్థం తులసీం తథా ।**
**శమీం పలాశ దూర్వాం చ రాజవృక్షమపూజయత్ ॥ 15**

**భానుం సంపూజ్య తం నత్వా సంపూజ్య ద్వారదేవతామ్ ।**
**గోవృషాశ్వవారణాంశ్చ రథం శస్త్రాణి భూసురాన్ ॥ 16**

కోష్ఠాగారాణి కోశాంశ్చ పాకశాలామపూజయత్ ।
సింహాసనం తథా ఛత్రం చామరే వ్యజనే తథా ॥ 17

సంపూజ్య ముకుటం రామః పూజయామాస మంచకమ్ ।
దీపికాం దర్పణం పూజ్య పుస్తకాదీనపూజయత్ ॥ 18

పునః సంపూజ్య స్వగురు పూర్వం విప్రేషు పూజితమ్ ।
ఉచ్చాసనస్థితం నత్వా కథాం శుశ్రావ తన్ముఖాత్ ॥ 19

పుత్రాభ్యాం బంధుభిః పత్న్యా పండితైః పరివేష్టితః ।
తతః సంప్రార్థితో రామః సీతయా స ముహుర్ముహుః ॥ 20

విప్రాదిభిశ్చోపాహారం చకార స్వస్థమానసః ।
కామధేనూద్భవశ్చాన్నైః కల్పవృక్షసముద్భవైః ॥ 21

మణిద్వయనిర్మితైశ్చ వహ్నౌ సీతాకృతైరపి ।
తతో భుక్త్వా హి తాంబూలం బిభ్రద్వాసాంసి రాఘవః ॥ 22

బద్ధ్వా కటిం దివ్యవస్త్రైః శస్త్రాణ్యపి దధార సః ।
ఏతస్మిన్నంతరే పూర్వం సమాహూతో యయౌ భిషక్ ॥ 23

గణకోఽపి రాఘవేణ ప్రత్యుద్గమ్యాతిమానితౌ ।
నిషేదతూ రాఘవాగ్రే పూజయామాస తౌ ప్రభుః ॥ 24

సరయూతీరమున ప్రాతస్సంధ్యా, బ్రహ్మయజ్ఞాది కర్మలను ఆచరించి, నిత్యదానములను ఇచ్చి, సుస్నాతుడగు సారథి, శుభ్రముగా కడిగి తెచ్చిన రథమును ఎక్కి ఇంటికి వచ్చును. పిదప సీతాసమేతుడై అగ్నిహోత్రకర్మనాచరించి, భక్తితో శంకరుని ఆరాధించి– కౌసల్యా, సుమిత్ర, కైకేయిలను సత్కరించి– కామధేను, కల్పవృక్ష, పారిజాత, చింతామణి, కౌస్తుభములను పూజించి– అతసీ, తులసీ, బిల్వ, వట, అశ్వత్థ, రాజవృక్ష, శమీ, పలాశ, దూర్వలను పూజించి– సూర్యోపాస్తి నొనర్చి, ద్వారదేశమున వాస్తుదేవతను ఆరాధించి– బ్రాహ్మణులను, గజ, రథ, తురగ, శస్త్రాదులను, కోశ కోష్ఠ పాకాదిశాలలను, ఛత్ర, చామర, సింహాసనాది రాజచిహ్నములను, కిరీటాది ఆభరణములను, దీప దర్పణాది మంగళవస్తువులను, పుస్తకరూపిణియగు సరస్వతిని సంపూజించి, ద్విజపూజితుడగు వసిష్ఠమునీంద్రుని

అర్ఘ్యపాద్యాది సత్కారములచే అర్చించి; పత్నీ, పుత్ర, బంధు, పరివార, పండిత పరివేష్టితుడై మునీంద్రునివలన పురాణ శ్రవణముజేసి, పలుమార్లు సీతచే సంప్రార్థితుడై, బ్రాహ్మణులతో కూడి సుఖముగా ఫలాది ఉపహారమును స్వీకరించును. పిదప మణి, కల్పద్రు, కామధేనువు ప్రసాదించి నదియును, సీత అగ్నిపై వండినదియును పక్వాన్నములను భుజించి, తాంబూలమును స్వీకరించి, వస్త్రాది అలంకారమునంది, శస్త్రములను ధరించును. అంతలో వైద్య, దైవజ్ఞులు రాగా ...

**తతో భిషక్ సుఖం స్థిత్వా రాఘవాగ్రే తదాజ్ఞయా ।**
**దదర్శ దక్షిణకరే నాడిం రామస్య సాదరమ్ ॥ 25**

**రత్నముద్రాకంకణాద్యైః శోభితస్యోజ్జ్వలస్య చ ।**
**కరస్యాంగుష్ఠమూలే యా ధమనీ జీవసాక్షిణీ ॥ 26**

**తచ్చేష్టయా సుఖం దుఃఖం జ్ఞాయతే చ భిషగ్వరైః ।**
**అతస్తాం వైద్యవర్యః స సూక్ష్మబుద్ధ్యా వ్యలోకయత్ ॥ 27**

**రామకర్ణే విహస్యాహ రాత్రావాచరితః శ్రమః ।**
**తద్వైద్యవచనం శ్రుత్వాఽకరోద్రామః స్మితాననమ్ ॥ 28**

**తతో వైద్యాయ తాంబూలం దదౌ రామః స దక్షిణమ్ ।**
**తతః స గణకః ప్రాహ విస్తార్య సుస్ఫుటాక్షరమ్ ॥**
**పంచాంగపత్రం చిత్రం చ రాఘవాగ్రే స్థితః స్సుధీః ॥ 29**

**విఘ్నేశ్వరో బ్రహ్మహరీశ్వరాః సురా**
**భానుః శశీ భూమిసుతో బుధః శుభః ।**
**గురుశ్చ శుక్రః శనిరాహుకేతవః**
**సర్వే గ్రహా మంగళదా భవంతు తే ॥ 30**

**లక్ష్మీః స్యాదచలా తిథిశ్రవణతో వాతాత్తథాఽఽయుశ్చిరం**
**నక్షత్రం కృతపాపసంచయహరం యోగో వియోగాపహః ।**
**సర్వాభీష్టకరం తథైవ కరణం పంచాంగమేతత్స్ఫుటం**
**శ్రోతవ్యం ప్రతివాసరే ద్విజముఖాత్ శ్రేయస్కరం సంగ్రహమ్ ॥ 31**

స్వస్తి శ్రీరాఘవాద్యాస్తి తిథిశ్చ దశమీ సితా ।
భానువారః సునక్షత్రం పుష్యాఖ్యం త్వద్య వర్తతే ॥ 32

ఇంద్రయోగో మహానద్య వవాఖ్యం కరణం శుభమ్ ।
కర్కస్థితోఽద్య చంద్రోఽస్తి ద్వితీయస్తే రఘూత్తమ ॥ 33

మాసోఽయం చైత్రమాసోఽస్తి వసంతాఖ్య ఋతుస్త్వయమ్ ।
సుఖం కురుష్వ రాజ్యం తం చిరం తిష్ఠావనీతలే ॥ 34

సర్వేఽపి సుఖినః సంతు సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్దుఃఖమాప్నుయాత్ ॥ 35

ఏవం జ్యోతిర్విదా గీతం పంచాంగం రఘునందనః ।
శ్రుత్వా తం దక్షిణాం దత్వా సతాంబూలాం ననామ సః ॥ 36

తతో రామం యయౌ వేగాన్మాలాకారో మనోహరాన్ ।
రామాగ్రే వంశపాత్రస్థాన్ పుష్పహారాన్న్యవేదయత్ ॥ 37

వారిలో వైద్యుడు శ్రీరామాజ్ఞను పొంది రత్నముద్రాది అంకితమైన కుడిచేతినిపట్టి బొటనవ్రేలు మొదటన ఉండు ధమనియను జీవసాక్షిణియగు నాడిని సూక్ష్మదృష్టితో పరిశీలించి, రాముని చెవిలో నవ్వుచు ఆరోగ్యవిషయము చెప్పును. శ్రీరాముడు ఆ వైద్యునకు దక్షిణసహిత తాంబూలమునిచ్చి పంపుచుండును. ఆ తరువాత గణకుడు వచ్చి, చిత్రతరమగు పంచాంగపు కట్టను విప్పి, శ్రీరామ సన్నిధిలో నిలిచి, గణేశ త్రిమూర్తిదేవతలు, నవగ్రహములు మంగళప్రదులగుదురుగాక! తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను పంచాంగమును వినుటచే క్రమముగా సంపద, ఆయుష్య, దురితపరిహార, సంభోగ మనోరథసిద్ధులు కలుగును. కావున విప్రునిచే దీనిని వినదగును.

శ్రీరామచంద్రునికి మంగళము. స్వామీ! మహాప్రభూ! నేడు వసంత, చైత్ర, శుక్ల, దశమి, భాను వాసర, పుష్యమీనక్షత్ర, ఇంద్రయోగ, భవకరణ పంచాంగ శుద్ధిగలదు. నీకు సంపత్తారలో కర్కాటకమున చంద్రుడున్నాడు. చిరకాలము పుడమిపైన ఉండి రాజ్యమేలుచుండుము.

అందరు సుఖించెదరు గాక! ఎవరును ఆపదనొందవలదు. సర్వులు శుభములనే దర్శించెదరు గాక! ఒక్కడును దుఃఖమందరాదు," అను అర్థముగల శ్లోకములను చదివిన దైవజ్ఞునికి శ్రీరాముడు తాంబూలములనిచ్చి, నమస్కరించి పంపును.

రామస్తాన్ సకలేభ్యశ్చ దత్త్వాఽఽబిభ్రత్స్వయం తతః ।
పుత్రాభ్యామవతం సాంశ్చ నత్వాఽఽభిభ్రత్స్వయం కరే ॥ 38

ఏతస్మిన్నంతరే రామం నాపితః ప్రయయౌ జవాత్ ।
ముకురం దర్శయామాస రుక్మబంధనరంజితమ్ ॥ 39

తత్రాదర్శే దదర్శాథ స్వముఖం రఘునందనః ।
చంద్రోపమం సుస్మితం చ కంజలోచనశోభితమ్ ॥ 40

ఋజుమాసం మాంసలం చ శ్మశ్రుయుక్తం సువర్తులమ్ ।
వరకుండలముక్తానాం వరదీప్త్యాఽఽతి భాసురమ్ ॥ 41

ప్రోచ్చగండస్థలం సుభ్రు త్రివలీబాలమండితమ్ ।
రుక్మరత్నసముద్భూత ముకుటేనాతిశోభితమ్ ॥ 42

ఏవం ముఖం నిరీక్ష్యాథ తుతోష నితరాం ప్రభుః ।
తతో యయౌ ధూపపాణిర్ధూపం స్థాప్య ప్రభోః పురః ॥ 43

నత్వా రామం దూతమధ్యే తస్థివాన్రాఘవాగ్రతః ।
తతో రామః శిబికాయాం స్థిత్వా గేహాద్బహిర్యయౌ ॥ 44

దదర్శ మాగధాదీంశ్చ బహిః కక్షాస్థితాన్ ప్రభుః ।
తతస్తే మాగధా రామం నత్వా దీర్ఘస్వరేణ వై ॥ 45

సూర్యవంశభవాన్సర్వాన్ నృపాన్సంవర్ణయంస్తదా ।
తతస్తే వందినః సర్వే తుష్టువూ రఘునందనమ్ ॥ 46

నానాతత్కృతచారిత్రై రావణాదివధాదికైః ।
తతస్తే చారణా గానం ప్రచక్రుర్ముదితాననాః ॥ 47

నటా వేశ్యాశ్చ ననృతుర్నానావాద్యపురస్సరమ్ ।
అన్యే చక్రుర్వినోదాంశ్చ యైః సంతుష్యేత్స రాఘవః ॥ 48

తతో నినేదుర్వాద్యాని నవవాద్యస్వనా అపి ।
తతస్తృతీయకక్షాయాం దదర్శ నృపనందనః ॥ 49

**వారణేంద్రాంశ్చ తురగాన్ శిబికాశ్చ రథాంస్తథా ।**
**నానాలంకారయుక్తాంశ్చ వరవస్త్రైః సమన్వితాన్ ॥ 50**

**తతశ్చ రథకక్షాయాం నృపాన్పౌరాన్సుహృజ్జనాన్ ।**
**సమాగతాన్ దర్శనార్థం దదర్శ రఘునందనః ॥ 51**

**తతః పంచమకక్షాయాం పుష్పక పుష్పవాటికాః ।**
**దూతాన్దదర్శ శ్రీరామః శస్త్రహస్తాన్ సహస్రశః ॥ 52**

అంత ఆ శ్రీరామసన్నిధికి పూలవాడు వెదురు బుట్టలలో పుష్ప మాలికాదులను తెచ్చి సమర్పించును. శ్రీరాముడు ఆ పూలను అందరికిని ఇచ్చి పుత్రాదులతో తాను అలంకరించికొనును. ఆ తరువాత మరో సేవకుడు వచ్చి నమస్కరించి, బంగారుపిడి కలిగిన అద్దమును చూపును. అందులో శ్రీరాముడు చంద్రుని వంటి కాంతిగల కిరీటముతో అలంకరింపబడి, సులక్షణ లక్షితమునగు తన ముఖమండలమును చూచి సంతసించును. అంతలో ఒక సేవకుడు సాంబ్రాణి ధూపమును తీసుకు వచ్చి ఎదుట నిలుచును. అంత ఆ రాముడు పల్లకిని ఎక్కి మందిరము బయటికి వెడలును. ఇట్లు రెండవ ప్రాకారమునకు రాగానే అచ్చట వందిమాగధులు వచ్చి సూర్యవంశజరాజులను అభివర్ణింతురు. సేవకులు వచ్చి శ్రీరాముని రావణవధాది ఘనకార్యములను చెప్పి పొగడుచుందురు. చారణులు వచ్చి గానమును ఆరంభించెదరు. వివిధవాద్యములతో నటులు, వేశ్యలు నాట్యమాడుదురు. అన్యులు ఇతర వినోదములను ఆచరింతురు. అప్పుడు రాముడు ఆనందించుచుండగా, నవమంగళ వాద్యములు మ్రోగును. అంత ఆ రామచంద్రస్వామి మూడవ ప్రాకారమున చక్కగా అలంకరింపబడిన ఏనుగులను, గుఱ్ఱాలను, శిబికారతాదులను చూచి, నాల్గవ ప్రాకారమున తన దర్శనమునకై నిరీక్షించుచుండు పౌరులను, మిత్రులను, రాజులను పరామర్శించి, ఐదవ ప్రాకారమున పుష్పవాటికలను, పుష్పకవిమానమును, ఆయుధములను ధరించిన వేలకొలది దూతలను కటాక్షించుచు వచ్చి,....

**తతః స షష్ఠవకక్షాయామశ్వారూఢాన్ సహస్రశః ।**
**వీరాన్ దదర్శ శ్రీరామః ప్రబద్ధకరసంపుటాన్ ॥ 53**

**తతః సప్తమకక్షాయాం యయౌ రామః సభాం ప్రతి ।**
**శిబికాయాశ్చావతీర్య శనైః సింహాసనం యయౌ ॥ 54**

సవ్యం కృత్వా నమస్కృత్య సోపానైః స శనైః ప్రభుః ।
సింహాసనమారురోహ వరచ్ఛత్రసుశోభితమ్ ॥ 55

దధార ఛత్రం సౌమిత్రిశ్చామరం భరతస్తదా ।
శత్రుఘ్నో వ్యజనం రమ్యం పాదుకే వాయునందనః ॥ 56

సుగ్రీవో జలపాత్రం చ వరాదర్శం విభీషణః ।
దధార హస్తే తాంబూలపాత్ర స వాలినందనః ॥ 57

వస్త్రకోశం జాంబవాంశ్చ దధార వేగవత్తరః ।
తస్థౌ సింహాసనే రామః స పృష్ఠంకోపబర్హణః ॥ 58

తస్థౌ పృష్ఠే లక్ష్మణశ్చ భరతః సవ్యపార్శ్వకే ।
శత్రుఘ్నోఽసౌ వామపార్శ్వే పురతో వాయునందనః ॥ 59

వాయవ్యకోణే రామస్య సుగ్రీవః సంస్థితోఽభవత్ ।
ఈశాన్యాం రాక్షసేంద్రః స అగ్నేయ్యామంగదః స్థితః ॥ 60

నైఋత్యాం జాంబవాంశ్చాపి పౌరాః సర్వే సమంతతః ।
రాఘవాగ్రే నృపా స్సర్వే స్థితాః సంబద్ధపాణయః ॥ 61

పార్శ్వయోస్తే రాఘవస్య ప్రోచ్చస్థానే మునీశ్వరాః ।
పురతో ననృతుః సర్వే వారవేశ్యాః సహస్రశః ॥ 62

తతో వీరాస్తతో దూతాః సభాయాం సంస్థితాః క్రమాత్ ।
నిషేదుర్మునయః సర్వే రామపుత్రౌ నిషేదతుః ॥ 63

రామమిత్రా నిషేదుస్తే తథా రామాజ్ఞయా నృపాః ।
యే యే ముఖ్యా నిషేదుస్తే తథా పౌరాః సుహృజ్జనాః ॥ 64

ఏభ్యోఽన్యే తే స్థితా ఏవ న నిషేదుః ప్రభోః పురః ।
తేషాం మధ్యే రామచంద్రః శుశుభేఽనుపమస్తదా ॥ 65

సేవకాద్యా న నిషేదుః సుమంత్ర ఏవ తస్థివాన్ ।
ఏవం స్థిత్వా సభాయాం స కృత్వా కార్యాణ్యనేకశః ॥ 66

**నానాకార్యేషు బంధూంశ్చ పుత్రావాజ్ఞాప్య రాఘవః ।**
**దృష్ట్వా నానాకౌతుకాని పూర్వవద్గృహమాయయౌ ॥ 67**

ఆరవప్రాకారమున గుల్మములను ఎక్కిన సైనికులు వేయిమంది వరుసగానిలిచి శ్రీరాములవారికి మ్రొక్కులిడుచుండగా, వారిని శ్రీరాముడు మన్నించి, ఏడవ ప్రాకారమున పల్లకినుండి దిగి, తన సభాభవనమును ప్రవేశించి, తిన్నగా వచ్చి తెల్లని తెరలుగల మండపముల దివ్యసింహాసనమునకు ప్రదక్షిణముగా వచ్చి, నమస్కరించి, మెల్లగా దానిమెట్లను ఎక్కి, రవికుల సింహాసనమును తాను కూర్చుండుటచే అలంకృతముచేసెను. శ్రీరాముడు దివ్య సింహాసనాసీనుడై యుండగా లక్ష్మణుడు వెనుకప్రక్కన ఛత్రమును, భరతుడు కుడిప్రక్కన చామరమును, శత్రుఘ్నుడు ఎడమప్రక్కన విసనకఱ్ఱను, హనుమంతుడు ఎదురుగా పాదుకలను, వాయవ్యమున సుగ్రీవుడు మంచినీటి పాత్రను, విభీషణుడు ఈశాన్యమున అద్దమును, అంగదుడు ఆగ్నేయమున తాంబూలపాత్రను, జాంబవంతుడు నైరుతిదిక్కున వస్త్రపేటికను ధరించి నిలుచునియుందురు. శ్రీరాముని ఎదుట సకల రాజులును చేతులుకట్టుకుని నిలిచియుందురు. ఇరువైపులా మునీంద్రులు సుఖాసీనులగుదురు. నృత్య, వాద్య, వినోదములు జరుగుచుండును. వీరులు, దూతలు, మిత్రులు, పౌరులు మొదలగు వారిలో ముఖ్యులయిన వారందరును వారివారి స్థానములలో సుఖముగా కూర్చునియుండగా, శ్రీరాముడు వారి మధ్యన రాజించుచుండును. సేవకులు ఆజ్ఞలకై ఎదురుచూచుచు నిలిచియుండగా, సుమంత్రుడొక్కడే పెద్దయై ఒప్పుచుండ, శ్రీరాముడు సభలో కర్తవ్యముల నన్నిటిని చక్కగా పరామర్శించి, సముచితములగు వివిధకార్యములలో తమ్ములను, పుత్రులను నియోగించి, కొంతసేపు వినోదములను విలోకించి, మునుపువలె తన మందిరమునకు విచ్చేయును.

**తదా నినేదుర్వాద్యాని గోముఖాదీన్యనేకశః ।**
**శ్రుత్వా వాద్యానినాదాంశ్చ జానకీ సంభ్రమాత్మనః ॥ 68**

**ప్రత్యుద్గమ్య తోయహస్తా తత్ప్రతీక్షాం చకార సా ।**
**రామోఽపి పూర్వవల్లోకాన్సప్తకక్షాస్వనుక్రమాత్ ॥ 69**

**ప్రవిశన్సకలానాజ్ఞాం దదౌ తాంస్తాన్ స్వతోషయత్ ।**
**తతోఽగ్రే బంధుభిర్గేహం పుత్రాభ్యాం సంవివేశ సః ॥ 70**

**దదర్శ జానకీం రామః పీతకౌశేయధారిణీమ్ ।**
**సాఽపి రామం యయౌ సీతా లజ్జయాఽవనతాననా ॥ 71**

వక్రనేత్రకటాక్షైశ్చ మోహయంతీ రఘూత్తమమ్ ।
నానాలంకారసంయుక్తా వరనూపురనిఃస్వనా ॥ **72**

తతో రామో జలం స్పృష్ట్వా ధృత్వా సీతాకరం ముదా ।
లక్ష్మణాదీన్ సంవిసర్జ్య సీతాగేహం వివేశ సః ॥ **73**

బహిర్దృష్టం శ్రుతం వాఽపి యద్యత్కౌతుకముత్తమమ్ ।
తత్సర్వం జానకీం ప్రాహ తోషయామాస తాం ముహుః ॥ **74**

తతః సర్వాన్ సమాహూయ భోజనార్థం సముద్యతః ।
స్నానం కృత్వా స మధ్యాహ్నం కర్మ చక్రే రఘూత్తమః ॥ **75**

తర్పయిత్వా పితౄంశ్చాపి నైవేద్యాన్ శంభవే దదౌ ।
వైశ్వదేవం తతః కృత్వా బలిదానం విధాయ సః ॥ **76**

దత్త్వా భూతబలిం చాపి పితౄంశ్చాపి స్వధేతి చ ।
బహిస్త్యక్త్వా కాకబలిం త్వతిథీన్ పూజ్య సాదరమ్ ॥ **77**

యతీంశ్చ బ్రాహ్మణాన్ పూజ్య హేమపాత్రేషు రాఘవః ।
పరివేష్టితేషు జానక్యా త్రిపదాసు ఘృతేషు చ ॥ **78**

తైః సర్వైర్భోజనం చక్రే స్నుషాభిర్వీజితో ముదా ।
కరశుద్ధిం తతః కృత్వా భుక్త్వా తాంబూలముత్తమమ్ ॥ **79**

దదౌ తేభ్యో దక్షిణాశ్చ విప్రేభ్యో రఘునాయకః ।
గత్వా శతపదం రామో నిద్రాశాలాం యయౌ శనైః ॥ **80**

ఏతస్మిన్నంతరే సీతా భుక్త్వా రామాంతికం యయౌ ।
వీజయామాస శ్రీరామం మంచకస్థం పురఃస్థితా ॥ **81**

చకార నిద్రాం శ్రీరామో మంచకే సీతయా సహ ।
తా దాస్యో వీజయామాసుర్దివ్యాలంకారభూషితాః ॥ **82**

శ్రీరాముని ఆగమన సమయమున మంగళవాద్యములు మ్రోగగా విని, జానకీదేవి జలపాత్రముతో ఎదుర్కోలుగా వచ్చి సంభ్రమమున కనుగొనును. రాముడు సప్తప్రాకారములయందు అందరిని క్రమముగా ఉచితాజ్ఞాదులచే సంతోషపరచి, కుమారులు పాదములను కడుగగా, సీతాదేవి తన చేతిని అందించగా, ఆమె చేతిని స్వీకరించి మందిరములోనికి ప్రవేశించి, వచ్చుచు లక్ష్మణాదులను పంపి, సీతాదేవి అంతఃపురములోనికి వెళ్ళి, కటాక్షములను సంమోహనాస్త్రములు గల జానకీదేవితో సల్లాపోల్లాసమంది, పిదప వారినందరిని మరల పిలిపించి, స్నానమాధ్యాహ్నిక కర్మలను ఆచరించి, పితృతర్పణములను ఒనర్చి, పరమేశ్వరునికి నైవేద్యములనర్పించి, వైశ్వదేవ బలిహరణాదులను నిర్వర్తించి, అతిథులను, యతులను, బ్రాహ్మణులను పూజించి, అందరితో కలసి సీతమ్మ వడ్డించిన బంగారు భోజనపళ్ళెములముందు కూర్చుని, కోడండ్రు వీచుచుండగా ఆనందముతో కమ్మగా భుజించి, లేచి బ్రాహ్మణాదులకు తాంబూల దక్షిణలనిచ్చి, నూరడుగులు నడచి, నిద్రాశాలను ప్రవేశించును. అంతలో సీత భుజించివచ్చి, శ్రీరాముని సేవించును. అంత ఇరువురును దాసీ సేవితులై కొంతసేపు సుఖనిద్ర నంది, మేల్కొని....

**తతః ప్రబుద్ధా సా సీతా ప్రబుద్ధోఽభూద్రమాపతిః ।**
**సారిభిఽ సీతయా క్రీడాం తథా బుద్ధిబలేన హి ॥ 83**

**నానాకృత్రిమసైన్యైశ్చాకరోదన్యైరపి ప్రభుః ।**
**తతో ద్రాక్షామంటపాధో జలయంత్రాదికౌతుకమ్ ॥ 84**

**దృష్ట్వా పక్షికులాన్ సర్వాన్ పంజరస్థాన్ దదర్శ సః ।**
**గత్వా సోపానమార్గేణ ప్రాసాదాగ్రే పురీం నిజామ్ ॥ 85**

**వనరామాన్వితాం దృష్ట్వా హట్టవీథ్యాఽతిరంజితామ్ ।**
**శనైర్యయౌ ప్రభుర్గోష్ఠం నానాధేనూర్దదర్శ సః ॥ 86**

**తాం సంప్రేష్య గృహం సీతాం స్వదాసీపరివేష్టితామ్ ।**
**ద్వారాంతికం యయౌ రామస్తత్ర తే లక్ష్మణాదయః ॥ 87**

**చక్రుః ప్రణామం శ్రీరామం తైః సహైవ శనైః శనైః ।**
**వాజిశాలాం యయౌ రామో దృష్ట్వా తత్ర స వాజినః ॥ 88**

**గజశాలాముష్ట్రశాలాం దృష్ట్వా రామః శనైః శనైః ।**
**దదర్శ శస్త్రశాలాం చ వ్యాఘ్రశాలాం ప్రభుర్యయౌ ॥ 89**

దృష్ట్వాఽథ శిబికాశాలాం మహిషీయాం విలోక్యచ ।
మహిషీ ర్వృషశాలాం చ రథశాలాం దదర్శ సః ॥ 90

ఆరుహ్య స్యందనే రామః శనైః సర్వైర్బహిర్యయౌ ।
సప్తకక్షాః సముల్లంఘ్య తత్రస్థైః పూర్వవజ్జనైః ॥ 91

సర్వైర్యుక్తశ్చాష్టమాం తాం శ్రేష్ఠాం కక్షాం దదర్శ సః ।
తత్ర యంత్రాణి శ్రేష్ఠాని శతఘ్నీః శకటస్థితాః ॥ 92

తృణకాష్ఠాదిసద్మాని దూతస్థానాన్యపశ్యత ।
తతో నవమకక్షాయాం దదర్శః రఘునందనః ॥ 93

శస్త్రపాణీన్ వారణస్థాన్ తురగస్థాననేకశః ।
రక్షయంతి హి యే సర్వే స్వీయం గేహం త్వహర్నిశమ్ ॥ 94

ఏవం స నవకక్షాశ్చ సముల్లంఘ్య రఘూత్తమః ।
బహిః స సద్మనో దృష్ట్వా పరిఖాః సజలా నవ ॥ 95

శనైః పశ్యన్నయోద్యాం తాం రాజమార్గే ముదాన్వితః ।
శీఘ్రం యయౌ పురద్వారం దదర్శ ద్వారరక్షకాన్ ॥ 96

నవకక్షాస్త్వయోధ్యాయాః సముల్లంఘ్య శనైః ప్రభుః ।
పరిఖాశ్చ నవాపశ్యత్తోయవహ్న్యాది పూరితాః ॥ 97

తతో నానావనారామ కౌతుకాని రఘూత్తమః ।
పశ్యన్స బంధుపుత్రైశ్చ సరయ్వాస్తీరమాయయౌ ॥ 98

తత్ర స్థిత్వా సునౌకాయాం క్రీడాం కృత్వా కియత్క్షణమ్ ।
నద్యాస్తటే సభాయాం స తస్థౌ సైన్యయుతః ప్రభుః ॥ 99

తత్రాపి వారవేశ్యానాం పశ్యన్నృత్యాని రాఘవః ।
కియత్కాలమతిక్రమ్య యయౌ శీఘ్రం తతః పురీమ్ ॥ 100

తతః శనైః సభాం గత్వా పూర్వోక్తైశ్చోపచారకైః ।
లక్ష్మణాద్యైః సేవితశ్చ తస్థౌ సింహాసనోపరి ॥ 101

**తతః కృత్వా హ్యనేకాని నానాకార్యాణి రాఘవః ।**
**ఆజ్ఞాప్య బంధుపుత్రాంశ్చ పూర్వవత్స గృహం యయౌ ॥ 102**

**సాయంకాలే తతః సంధ్యాం కృత్వా హుత్వా యథావిధి ।**
**గంధాద్యైరుపచారైశ్చ శివం సంపూజ్య భక్తితః ॥ 103**

**కృత్వోపహారం విప్రైశ్చ పుత్రాభ్యాం బంధుభిః సహ ।**
**శిబికాయాం పునః స్థిత్వా దేవతాయతనేషు చ ॥ 104**

కొంతసేపు సీతతో పాచికలాడి, అచ్చటనుండి వెడలి ద్రాక్షపందిళ్ళలో జలయంత్రాది వినోదములను చూచి, పంజరములలోనుండు వివిధపక్షులను చూచి, అంతఃపురమెక్కి ఊరి అంగళ్ళవీధి నవలోకించి, పశువుల శాలకు వెళ్ళి అచ్చట పశువులనన్నిటిని చూచి, పిదప శ్రీరాముడు సీతను అంతఃపురమునకు పంపును. అప్పటికి లక్ష్మణాదులు వచ్చి మ్రొక్కి నిలువగా, వారితోడ ఏనుగుల, గుఱ్ఱముల శాలలను పరామర్శించి, రథశాలకు వెళ్ళి రథమునెక్కి, తిన్నగా ఏడు ప్రాకారములను దాటి, ఎనిమిదవ ప్రాకారమున ఫిరంగులు మొదలగు సేనాసామాగ్రులను చూసుకొని, తొమ్మిదవ ప్రాకారమున ఆయుధములను ధరించి, ఏనుగు, గుఱ్ఱములను ఎక్కిన సైనికులు ముందు నడవగా తనమందిర రక్షకులను పరామర్శించి, యిట్లు వచ్చి రాజ భవనమునకు వెలుపల నీళ్ళు నిండిన తొమ్మిది కందకములను దాటి, అయోధ్యలో రాజమార్గమున వైభవముగా వచ్చి, ఊరివాకిట పురరక్షకులను విచారించి, తిన్నగా సరయూ తీరమునకుపోయి, అచ్చట అందరితోడ ఓడనెక్కి జలక్రీడను అనుభవించి, రోజువలె సభకు విచ్చేసి దివ్య సింహాసనమును అలంకరించి, రాజ్య న్యాయ విషయములను పరిశీలించి, అందరిని పంపించి వేసి, తాను సాయం సంధ్యోపాసన శివపూజాదులను జరిపి, రాత్రి బంధు, పుత్ర, మిత్రాది పరివారముతో కలసి ఉపహారములను స్వీకరించి, పల్లకినెక్కి, దేవాలయములకు విచ్చేయును.

**సాకేతస్థేషు శ్రీరామో గత్వా నత్వా శివాదికాన్ ।**
**నానావిధాన్ దేవసంఘాన్ ఫలైః పుష్పైరపూజయత్ ॥ 105**

**దేవాలయేషు సర్వేషు సురాణాం తేషు రాఘవః ।**
**శృణ్వన్నానాకీర్తనాని వారస్త్రీనర్తనాన్యపి ॥ 106**

**పశ్యన్నానాకౌతుకాని పరాం ముదమవాప సః ।**
**వాహనారూఢదేవానామపశ్యత్కౌతుకాని చ ॥ 107**

తతో యయౌ బ్రాహ్మణేన హట్టమార్గేణ రాఘవః ।
రత్నదీపప్రకాశైశ్చ వివేశ నిజమందిరమ్ ॥ 108

తతో నానాకథాభిశ్చ వార్తాభిః పుత్రబంధుభిః ।
సార్థయామాం నిశాం నీత్వా రతిగేహే వివేశ సః ॥ 109

ఏతస్మిన్నంతరే తత్ర సీతాఽగ్రే రతిమందిరే ।
పుష్పశయ్యాది సంపాద్య తత్ప్రతీక్షాం చకార సా ॥ 110

తావదాయాంతమాలోక్య సహసోత్థాయ జానకీ ।
ధృత్వా హస్తే రాఘవేంద్రం రతిశాలాం నినాయ సా ॥ 111

సర్వా విసర్జ్య దాసీశ్చ ముక్తాజాలాన్యనేకశః ।
సమంతతో విముచ్యాథ తస్థౌ రామః స మంచకే ॥ 112

తతస్తాం మైథిలీం ధృత్వా మంచకే సంన్యవేశయత్ ।
నానా క్రీడాం విధాయాథ తస్థౌ రామః స మంచకే ॥ 113

తతస్తుష్టం రమానాథం జానకీ లజ్జితాఽబ్రవీత్ ।
రామ రాజీవపత్రాక్ష కించిత్పృచ్ఛామి మే వద ॥ 114

కుశజన్మానంతరం హి కథం గర్భో మయా న వై ।
ధార్యతే కారణం తస్య కిమస్తి తద్వదస్వ మామ్ ॥ 115

తత్సీతావచనం శ్రుత్వా సస్మితం ప్రాహ రాఘవః ।
హే సీతే కంజనయనే సమ్యక్ పృష్టం త్వయా మమ ॥ 116

తత్సర్వం తే వదామ్యద్య తచ్ఛృణుష్వ సుమధ్యమే ।
కిమర్థం చ బహూన్ పుత్రాంస్త్వత్ర త్వం వాంఛసి ప్రియే ॥ 117

సద్వంశే బహవః పుత్రా న యోగ్యాస్తత్ర వై భువి ।
కదైకస్య దురాచారాత్కులస్య లాంఛనం భవేత్ ॥ 118

అతఏవ మమేచ్ఛా న బహుపుత్రేషు మైథిలి ।
మదిచ్ఛయా త్వయా గర్భో ధార్యతే న కదాచన ॥ 119

**పుత్రస్త్వేకః ప్రతీక్ష్యో హి యః కులం భూషయేద్గుణైః ।**
**కిం జాతా బహవః పుత్రా దుష్టాస్తే కృమయో యథా ॥ 120**

**ద్వావేవాస్తాం కదాచిచ్చ యథా నేత్రే భుజౌ యథా ।**
**యథా తౌ శశిసూర్యౌ చ యథాఽహం లక్ష్మణస్తథా ॥ 121**

దేవాలయములోని ఉత్సవాదులను, నృత్త గీత వాద్య వినోదములను విలోకించి, వచ్చి కొంతసేపు తన పరివారముతో గోష్ఠీసుఖమంది, పదిగడియలయిన వెనుక అంతఃపురమున ప్రవేశించును. అచ్చటి జానకీదేవి దివ్యాలంకృతయై రతిశాలలో పూలపాన్పు నలంకరించియుండ, అచ్చట శ్రీరాముడు సీతాసమేతుడై సంసారసౌఖ్య సాగరమున దేలుచుండును. ఇట్లు దేశ, కాల, స్థితిని అనుసరించి దినచర్యలతో లోకయాత్రను అభినయించుచు శ్రీరామచంద్రుడు లీలామానుష విగ్రహుడై ఉండెను.

ఒకరాత్రి సీతమ్మ సుఖకేళిలో తేలి సిగ్గుపడుతూ, శ్రీరామునితో, "ప్రాణవల్లభా! అనుజ్ఞనిచ్చిన నేనొకటి అడిగెదను. కుశుడు జన్మించిన వెనుక నాకెందుకు గర్భము కలుగలేదు? దీనికి కారణమును అనుగ్రహింపుము," అని వేడగా, అందుకు శ్రీరాముడు, "దేవీ! బాగుగా అడిగితివి. చెప్పెదను వినుము, నీవు ఎందుకు వేలమంది పుత్రులను కోరెదవు? కాంతా! సత్కులమునందు అనేకమంది పుత్రులు పుట్టుట తగదు. ఒకానొకప్పుడు ఎవ్వడైనా దూరాచారుడైతే కులమునకు చెడ్డపేరు వచ్చును. కావున నేను ఎక్కువమంది కుమారులను కోరుకొనలేదు. నా యిచ్ఛలేక నీ కెప్పుడును గర్భము కలుగదు. కులమునకు పేరు తెచ్చు కుమారుని ఒకని కొరకే ఎదురుచూడవలయును. క్రిములవలె దుష్టపుత్రులెందరు పుట్టిన ఏమిప్రయోజనము? ఒకవేళ దేహమునకు రెండుకన్నుల వలె, రెండుభుజముల వలె, సూర్య చంద్రుల వలె, నేను లక్ష్మణుడున్నట్లు ఇద్దరు కుమారులు పుట్టినను బాగుగా ఉండును అనుకున్నాను.

**తవాపి జాతౌ ద్వౌ పుత్రౌ మాఽగ్రేఽతు సంతతిస్త్వతః ।**
**తతః ప్రాహ పునః సీతా న జాతా దుహితా మమ ॥ 122**

**ఏకాఽపి కారణం తత్ర కిమస్తి తద్వదస్వ మామ్ ।**
**తత్సీతావచనం శ్రుత్వా జానకీం ప్రాహ రాఘవః ॥ 123**

**త్వత్కన్యా చ మయా కస్మై దేయాఽత్ర జగతీతలే ।**
**మత్సమానో నృపః కోఽస్తి సప్తద్వీపపతిర్మహాన్ ॥ 124**

యస్య పత్న్యై త్వయా కార్యం శిరసా నమనం తదా ।
కో వరోఽస్తి జగత్యాం హి నృపస్య తనయో మహాన్ ॥ 125

ప్రక్షాళనీయౌ చరణౌ వివాహే యస్య వై మయా ।
అతఏవ మమేచ్ఛాఽభూత్కన్యాయామపి నో ప్రియే ॥ 126

కుశాదీనాం తు యాః కన్యాస్తాస్తే కిం నైవ బాలికాః ।
కిం యౌవనమదాత్సీతే మోహం ప్రాప్తాఽసి భూతలే ॥ 127

ఆత్మానం విస్మృతాఽస్యద్య త్రైలోక్యజననీమితి ।
యదత్ర విశ్వే స్త్రీరూపం దృశ్యతే తత్తవాంశజన్ ॥ 128

పౌరుషం దృశ్యతే యచ్చ తచ్చ సర్వం మమాంశజమ్ ।
అత్ర స్త్రీపురుషా యే చ తే పుత్రదుహితాస్తవ ॥ 139

ఏష్టవ్యా బహవః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్ ।
ఇతి తద్వనం సీతే సామాన్యం విద్ధి నో పరమ్ ॥ 130

ఏకః స తనయో ధన్యః కుల యస్తారయేన్నిజమ్ ।
కృమితుల్యాశ్చ తే పుత్రాః శతశో దుష్టమార్గగాః ॥ 131

నీకు లవ, కుశ లిరువురు పుట్టియున్నారు. కావున ఇక సంతతివలదు,” అని పలుకగా అందుకు జానకీదేవి, “ఒక కన్యక కూడా కలుగలేదే కారణమెట్టిదో?” అని మరలా అడిగెను. దానికి శ్రీరాముడు, “నీకు కన్యక కలిగిన దానిని ఎవరికిచ్చెదను? అట్టి రాజపుత్రుడెవడుగలడు? కావున కన్యకయందును నాకు కోరిక కలుగలేదు. కుశాది కుమారులయొక్క కన్యకలందరును నీ కన్యకలు కారా ఏమి? దేవీ! నీవేమి యౌవనమదముచే మోహాక్రాంతవైయుందువు? ముల్లోకములకు తల్లిననే సంగతిని మరచితివి. లోకమాతయగు మంగళదేవతయని పేర్కొనియుందువు. నా తోడ నీవు నిత్యానపాయిన గావే? స్వస్వరూపాను సంధానమందక ఒడలు మరచి యుండదగునా? జగమున పురుషులందరును నా అంశ, స్త్రీలందరును నీ అంశ, ఇచ్చట స్త్రీ పురుషులందరును నీ యొక్క పుత్రీ పుత్రులు కాదా? చాలామంది పుత్రులు గలుగవలె, అందులో ఒక్కడైనను గయలో పిండమును అర్పింపకపోవునా అనే వచనము సామాన్యమేగాని శ్రేష్ఠమైనదికాదు. తన వంశము నుద్ధరించు కొడుకొక్కడే చాలును, క్రిములవంటి దుర్మార్గావలంబులగు కుమార్లు నూరుమంది ఏల? అను వచనమే మేలైనది. దేవీ! నీకు బహుపుత్రుల నివ్వకయుండుట మరియొక కారణము గలదు. వినోదముగా వినుము.

ఇతి యద్వచనం సీతే వరిష్ఠం తత్స్మృతం బుధైః ।
అన్యత్తే కారణం వచ్మి యస్మాత్తే బహవః సుతాః ॥ 132

మయా నైవార్పితాస్త్వత్ర తచ్ఛృణుష్వ శుచిస్మితే ।
వినోదాత్తే వదామ్యద్య మాఽన్యథా కురు మద్వచః ॥ 133

బహుపుత్రైశ్చ నారీణాం తారుణ్య స్థాస్యతే న హి ।
మత్వేతి తవ తారుణ్యచ్ఛేదినీ బహుసంతతిః ॥ 134

న మయాఽత్రార్పితా సీతే గుహ్యం విద్ధీతి మే ప్రియే ।
యదీచ్ఛాఽస్తి బహూనాం తే తనయానాం విదేహజే ॥ 135

తర్హి తే ద్వాపరే కృష్ణరూపేణ ద్వారకాపురి ।
దశ పుత్రాన్ ప్రదాస్యామి తదా తేషాం సుఖం భజ ॥ 136

కన్యామపి తదైకా తేఽహం దాస్యామి న సంశయః ।
తదా తే బహుపుత్రైశ్చ తారుణ్యం స్థాస్యతే న హి ॥ 137

అతః స్త్రీణాం సహస్రాణి షోడశైకశతం పునః ।
తథా ముఖ్యాస్త్వష్ట నార్యస్త్వయా సహ కరోమ్యహమ్ ॥ 138

తదా బహూనాం పుత్రాణాం స్నుషాణాం త్వం సుఖం భజ ।
అహం చాపి బహుస్త్రీణాం తదా సౌఖ్యం భజామి వై ॥ 139

ఇతి రామవచః శ్రుత్వా తదా సీతా స్మితాననా ।
రాఘవం హర్షితా ప్రాహ వాక్చాతుర్యం కుతః ప్రభో ॥ 140

ఏతల్లబ్ధం త్వయా రామ యేన రంజయసీహ మామ్ ।
ఏవం ప్రోక్తా మయా శిష్య దినచర్యారమాపతేః ॥ 141

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, రాజ్యకాండే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, రామదినచర్యావర్ణనం నామ, ఏకోనవింశః సర్గః ॥

సీతా! ఎక్కువగా బిడ్డలు పుడితే యువతులకు యౌవనము నశించును. కావున నీ తారుణ్య లోభముచే ఇట్లు చేసితిని. ఇది మిక్కిలి రహస్యము. నీకట్లు పుత్రబాహుళ్యమున ఇచ్ఛ గలిగినచో ద్వాపరయుగమున కృష్ణుడై అవతరించి రుక్మిణియగు నీకు 10మంది పుత్రులును ఒక కన్యకనుకూడ ఇచ్చెదను. ఆ బిడ్డలతో సంసారిక సుఖకేళిలో దేలుచు ఆనందించుచుండుము. అప్పుడు నీ ప్రాయము త్వరగా పోవును. అయినా నాకేమి తొందరలేదు. ఎట్లందువో, 16,000 మంది కామినీమణులు కావలసినట్లు కాచియుందురు. పైగా నీతోడ అష్టమహిషులుందురు. నీవప్పుడు సంతాన బాహుళ్యముయొక్క సౌఖ్యమును అనుభవింపుము. నేను బహుస్త్రీ సౌఖ్యమును అనుభవించెదను," అనిన శ్రీరామ వాక్యములను విని సీతమ్మ నవ్వుచు, "స్వామీ! మన్నాథా! ఈ వాక్చాతుర్యమెట్లుగల్గె? ఇట్లు సరసమాడి నన్ను రంజింపజేసెదవు అని మెల్లగా ఉల్లాస సల్లాపములు చేయుచు, ఇరువురును అర్ధరాత్రిన ఒకరినొకరు హత్తుకుని సుఖనిద్రనుపొంది మేల్కొనిరి.

విష్ణుదాసా! శ్రీరాముని దినచర్యను ఇట్లు వర్ణించితిని.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలోని రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, శ్రీరాముని దినచర్యను వర్ణించు 19వ సర్గ ముగిసినది.**

# వింశః సర్గః-20వ సర్గ

## శ్రీరాముని అవతార వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథైకదా వసిష్ఠం హి ప్రభాతే చాబ్రవీల్లవః ।
కించిత్తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం వద మునీశ్వర ॥ 1

సర్వం యద్యపి జానామి వాల్మీకేశ్చ ప్రసాదతః ।
తథాపి లోకాన్సకలాన్ జ్ఞాతుం పృచ్ఛామి తేఽద్య హి ॥ 2

యదాఽస్మాభిర్నిశాయాం హి సర్వైర్నిద్రా విధీయతే ।
తదా సంశ్రూయతే కర్ణే భస్త్రవత్కస్య వై ధ్వనిః ॥ 3

అముం మత్సంశయం ఛింది పరం కౌతూహలం గురో ।
లవస్యేతి వచః శ్రుత్వా వసిష్ఠస్తమథాబ్రవీత్ ॥ 4

బహ్వ్యశ్చ బ్రహ్మహత్యాశ్చ రావణేన కృతాః పురా ।
యేన దేహేన సోఽద్యాపి లంకాయాం జ్వలతే లవ ॥ 5

రావణో రామహస్తేన వధాన్ముక్తిం గతః క్షణాత్ ।
రామచింతనపుణ్యేన వైరబుద్ధ్యా కృతేన చ ॥ 6

ఆత్మనః సకలం పాపం తేన దగ్ధం పురైవ హి ।
దేహేన న కృతం తస్య దేవానాం నమనం పురా ॥ 7

సంమార్జనాదికం కర్మ దేవాగారేఽపి నో కృతమ్ ।
న కృతా తీర్థయాత్రా హి తేన దేహేన భక్తితః ॥ 8

న దేహేన న నిష్కామం తపశ్చర్యావ్రతం కృతమ్ ।
న దేహః శ్రమితస్తస్య శీతోష్ణసహనాదిభిః ॥ 9

ఏతాదృశస్తస్య దేహో బహుబ్రాహ్మణ హింసకః ।
లంకాయాం జ్వలతేఽద్యాపి నిశాయాం శ్రూయతేఽత్ర సః ॥ 10

**జ్వాలానాం భస్త్రవచ్ఛబ్దో యః పృష్టో మాం త్వయా లవ ।**
**జనశబ్దాద్దినే నైవ శ్రూయతేఽత్ర జనైః సదా ॥ 11**

**చితాయాం తస్య చాద్యాపి వాయుపుత్రేణ ప్రత్యహమ్ ।**
**కాష్ఠభారశతం నీత్వా లంకాయాం క్షిప్యతే ముహుః ॥ 12**

## రావణకాష్ఠము

శ్రీరామదాసు ఇచ్లు చెప్పుచున్నాడు, "అనంతరము ఒకరోజు ప్రొద్దున లవుడు వసిష్ఠులవారికి నమస్కరించి, "స్వామీ! నేడొక సంగతి అడుగుచున్నాను. దాని తత్త్వమును బోధింపుము. వాల్మీకి మునీంద్రుని అనుగ్రహము చేత అంతటిని తెలిసికొనియున్నాను, అయినను సమస్తజనులకు తెలుపుటకై ఇపుడు మిమ్ము వేడుచున్నాను. ఏమనిన; మనమందరము రాత్రి నిద్రపోవు సమయాన కొలిమితిత్తి యూదినట్లు ఒకనాదము వినవచ్చుచున్నది. ఆ ధ్వని దేనిది? తమరినుండి వినగోరితిని," అనిన. ఆ లవుని పలుకులను విని వసిష్ఠుడు ఇట్లనెను.

"లవుడా! మునుపు అనేక బ్రహ్మహత్యలనుజేసిన రావణునియొక్క దేహము లంకలో ఇప్పటికిని జ్వలించుచున్నది. శ్రీరామునిచే చంపబడినందున రావణుడు తత్క్షణమే ముక్తినొందెను. శత్రుత్వబుద్ధితోనైనను శ్రీరాముని ధ్యానించినందున వాని పాపములన్నీ నశించినవిగదా! అయినా వానిదేహము ఒకసారైనా దేవతలకు మ్రొక్కలేదు. దేవాలయములలో సంమార్జనాది సేవలను ఆచరించలేదు. భక్తితో తీర్థయాత్రలను చేయలేదు. ఒక్కతపమును గాని, వ్రతమును గాని చేయలేదు. శీతలమును, ఉష్ణమును సమముగ భావించి ఆ దేహము శ్రమించినది కాదు. అట్టి బ్రాహ్మణ హింసక మయిన దుర్దేహము ఇప్పటికిని లంకలో మండుచున్నది. ఆ మంటలయొక్క శబ్దమే కొలిమితిత్తి యూదినట్లు రాత్రి వినబడుచున్నది. అది లోకుల కోలాహలములచే పగలు వినబడదు. అట్టి రావణుని చితిలో ప్రతిదినము ఆంజనేయుడు నూరు కట్టెలను తీసికొనిపోయి వేయుచున్నాడు.

**యదా తత్పాపశాంతిః స్యాత్తదా భస్మీభవిష్యతి ।**
**అన్యత్తే కారణం వచ్మి తచ్ఛృణుష్వ శిశో లవ ॥ 13**

**దేహాంతే రావణేనాపి రామాయ యాచితో వరః ।**
**వరేణ యేన లోకానాం స్మరణం మే భవిష్యతి ॥ 14**

**స త్వయా మే వరో దేయస్తచ్ఛ్రుత్వా రాఘవోఽబ్రవీత్ ।**
**త్వద్దేహజ్వలిని జ్వాలాశబ్దః సర్వే జనా భువి ॥ 15**

శ్రోష్యంతి సప్తద్వీపేషు తేన తే స్మరణం సదా ।
భవిష్యతి హి సర్వేషాం బ్రహ్మాండాంతర్నివాసినామ్ ॥ 16

ఏవం శ్రుత్వా దశాస్యః స వరం రామే లయం యయౌ ।
ఏవం యచ్చ త్వయా పృష్టం తత్సర్వం కథితం మయా ॥ 17

గురోరితి వచః శ్రుత్వా తం నత్వా స లవోఽపి చ ।
స్వగేహం గతసందేహః ప్రయయౌ శిబికాస్థితః ॥ 18

ఏకదా బంధుభిర్గేహే పుత్రాభ్యాం సీతయా సహ ।
మునిభిర్గురుణా రామః సంస్థితః ప్రాహహర్షితః ॥ 19

శ్రీరామచంద్ర ఉవాచ

శృణ్వంతు మునయః సర్వే సర్వే శృణ్వంతు బంధవః ।
పుత్రౌ సీతా మంత్రిణశ్చ సర్వాః శృణ్వంతు మాతరః ॥ 20

యథా మయాఽవతారేఽస్మిన్ సుఖం భుక్తం హి సీతయా ।
న తథాఽన్యేషు సర్వేషు హ్యవతారేషు వై కదా ॥ 21

అవతారాస్తు బహవః శతశోఽత్ర మయా ధృతాః ।
నానాకార్యాణి వై కర్తుం తేషాం సంఖ్యా న విద్యతే ॥ 22

సప్తావతారాస్తేష్వేవ శ్రేష్ఠాస్త్వత్ర మయా ధృతాః ।
ఈదృశం న సుఖం తేషు కదా భుక్తం మయా భువి ॥ 23

శంఖాసురో మహాదైత్యః పూర్వం జాతో మహోదధౌ ।
యేన వేదా హతాః సర్వే సత్యలోకాత్ కృతే యుగే ॥ 24

తదర్థం మత్స్యరూపేణ హ్యవతారో మయా ధృతః ।
తం హత్వా క్షణమాత్రేణ విష్ణురూపం మయా ధృతమ్ ॥ 25

రావణుని పాపము నశించిన తరువాత వాని కాష్ఠము భస్మమగును. మరియొక కారణమును వినుము. రావణుడు మరణించునపుడు శ్రీరాముని జూచి, "స్వామీ! లోకాలలో నా స్మరణ కలుగునట్లు వరమిమ్ము," అని వేడెను. అందుకు రాముడు, "నీ దేహము దహింపబడుచుండగా ఆ జ్వాలలయొక్క

శబ్దము సప్త ద్వీపములయందును వినబడుచుండును. అందువలన ఈ జగమున నీ యొక్క స్మరణమగును," అని వరమిచ్చెను. అపుడు రావణుడు ముక్తుడయ్యె. ఇది నీ వడిగిన సంగతి. అనిన వసిష్ఠ వచనములచే లవుడు ఆనందించి, మునికి నమస్కరించి, తనమందిరమునకేగెను. (18)

## శ్రీరాముడు తన అవతార విశేషములను అభివర్ణించుట

ఒకసారి శ్రీరామచంద్రస్వామి తన మందిరమున పరివారముతో కూడి; తమ్ములను, పుత్రులను, సీతాదేవిని, మునీంద్రులను, వసిష్ఠమునీంద్రుని సల్లాపోల్లాసములతో ఆనందపరచుచు, గోష్ఠీసుఖం పొందినప్పుడు ఇట్లు చెప్పుచున్నాడు, "తమ్ములారా! మునీంద్రులారా! మంత్రులారా! తల్లులారా! బిడ్డలారా! దేవీ! అందరును వినుడు. సీతాదేవితో కలసి ఈ యవతారమున నేను సుఖించినట్లు మరి యే అవతారమునందును ఎప్పుడును సుఖమందలేదు. వివిధములగు లోకకల్యాణ కార్యములను నెరవేర్చుటకై నేను వందలకొలది అవతారములను ఎత్తితిని. వాటికి లెక్కలేదు. వాటిలో ఏడు అవతారములు మిక్కిలి శ్రేష్ఠమైనవి. వానిలో కూడ ఇట్టిసుఖమును అనుభవింపలేదు. మునుపు కృత యుగమున శంఖాసురుడు పుట్టి సత్యలోకమునుండి వేదములను అపహరించి సముద్రమున దాగి యుండెను. నేను మత్స్యరూపముతో క్షణమాత్రమున వానిని సంహరించి విష్ణురూపమును పొందితిని.

**కిం సుఖం ఝషజాత్యాం హి తిర్యగ్యోన్యపి గర్హితా ।**
**అతస్తస్మిన్నవతారే న స్థితం హి చిరం మయా ॥ 26**

**తతః సముద్రమథనే మజ్జంతం మందరాచలమ్ ।**
**దృష్ట్వా ధృత్వా కూర్మరూపం స్వపృష్ఠే పర్వతో ధృతః ॥ 27**

**తచ్చాపి గర్హితం రూపం మత్వా నైవ చిరం ధృతమ్ ।**
**కిం వారిచరజాత్యాం హి సుఖం తత్ర భవేజ్జలే ॥ 28**

**తతో దృష్ట్వా సాగరే హి మజ్జంతీం పృథివీం మయా ।**
**క్రోడరూపం మహద్ధృత్వా దంష్ట్రాయామవనిర్ధృతా ॥ 29**

**మమ పృథ్వీతి సంస్పర్ధా హిరణ్యాక్షో మయా హతః ।**
**కిం సుఖం పశుయోన్యాం హి గర్హితాయాం భవేజ్జలే ॥ 30**

**అత్మస్తస్మింశ్చావతారే న లబ్ధం హి సుఖం మయా ।**
**ప్రహ్లాదవచనాత్ స్తంభాన్నారసింహస్వరూపధృక్ ॥ 31**

అవతీర్ణస్త్వహం భూమ్యాం హిరణ్యకశిపుః క్షణాత్ ।
మయా తదా హతః క్రోధాత్తద్రూపమతిభాస్వరమ్ ॥ 32

యద్భయాన్నికటం కోఽపి ప్రహ్లాదాచ్చ వినాఽపరః ।
న మానవః స్థితో భూమ్యాం తత్ర వార్తా సుఖస్య కా ॥ 33

తదాఽతిక్రోధరూపేణ సింహయోన్యాం తు కిం సుఖమ్ ।
మయాఽనుభూతం విపులం సుఖేచ్ఛాతృప్తిమాప చ ॥ 34

తతో బలేర్మోహనార్థం ఖర్వరూపం తు వామనమ్ ।
ధృత్వా కృత్వా త్రిపాద్యాంచ భూమేః పాతాళగః కృతః ॥ 35

తత్ర కిం మునిదేహేన వనే సౌఖ్యం భవేన్మమ ।
న యత్రాస్తి యథాయోగ్యం దేహమప్యతిసుందరమ్ ॥ 36

తత్ర కా సుఖవార్తాఽస్తి భూమ్యాం మే బ్రహ్మచారిణః ।
అతస్తదైవ సహసా నాకలోకం గతం మయా ॥ 37

పునర్విప్రాద్భవేనైవ జామదగ్న్యస్వరూపిణా ।
ఏకవింశతివారం హి నిఃక్షత్రా పృథివీ కృతా ॥ 38

సహస్రార్జుననామా స మహావీరో హతస్తదా ।
తచ్చాపి క్రోధసంయుక్తం మునిరూపం మయా ధృతమ్ ॥ 39

మత్స్యజాతిలో ఏమి సుఖము గలదు? తిర్యగ్యోని మిక్కిలి నింద్యమైనది. అని ఆ అవతారమునందు చిరకాలము నిలువనైతిని. అంత సముద్రమథనావసరమున మునిగి పోవుచుండిన మందర పర్వతమును చూచి, కూర్మ(తాబేలు)రూపముతో అవతరించి, మందరపర్వతమును మోసితిని. అదియును నింద్యమైన రూపమని ఎంచి, చిరకాలము ఆ రూపములో ఉండలేదు. జలమున జలచరమై ఉండుటలో సుఖము ఏమున్నది? పిదప సముద్రమున మునుగుచుండిన భూమిని ఉద్ధరించుటకై వరాహ రూపముతో అవతరించి, నా కోరపంటిమీద ఈ పుడ(భూ)మిని ఎత్తి, భూమి నాదియని వచ్చిన హిరణ్యాక్షుని సంహరించితిని. అప్పుడును ఈ పశుజాతిలో ఏమి సుఖమని నింద్యమగు ఆ రూపమును వదలితిని. అటుమీద ప్రహ్లాదుడు అను భక్తుని మొరవిని స్తంభమున నృసింహ స్వరూపముతో అవతరించి క్షణమాత్రమున హిరణ్యకశిపుని సంహరించితిని. పురుగుకూడ తిరుగాడనట్టి మిక్కిలి భయంకరమగు నా రూపమునకు ఎదుట ప్రహ్లాదుడు తప్ప తక్కిన మానవుడెవడును నిలువడయ్యె. సింహజన్మము

నందలి క్రోధరూపముచే ఏమి సుఖము అనుభవించితిని? కావున నాయొక్క సుఖేచ్ఛకు తృప్తి గలగలేదు. ఆ తరువాత బలిని నిగ్రహించుటకై సంమోహనమగు పొట్టి శరీరముగల వామనుడను బ్రాహ్మణ వటువుగా అవతరించితిని. మూడడుగుల భూమిని యాచించి, వానిని భూమినుండి పాతాళమునకు త్రొక్కితిని. వనవాసియగు మునిరూపమున నాకేమి సౌఖ్యముగలదు? దేహముకూడ మిక్కిలి సుందరము కాదయ్యె. బ్రహ్మచారికి సుఖమేమిగలదు? అంత నేను త్వరగా స్వర్గమునకు వెడలి, ఉపేంద్రుడనైతిని. అనంతరము బ్రాహ్మణజన్మనెత్తి, పరశురాముడనబడి వేయిచేతులు గల కార్తవీర్యార్జునుడనే మహాపరాక్రమ శాలిని చంపి, 21మార్లు భూమిని క్షత్రియరహితమగునట్లు దుష్టులనణగద్రొక్కితిని. కోపాటోపమునందిన మునిరూపము అవలంబించితిని.....

సుఖవార్తా మునీనాం హి కా తత్ర వనచారిణామ్ ।
జ్ఞాత్వేత్థం జన్మనా తేన తపశ్చర్యా మయా కృతా ॥ **40**

కిం సుఖం తపతస్తత్ర వనే మే జాతముత్తమమ్ ।
ఏవం షడ్ వై ధృతాః పూర్వమవతారా మయా భువి ॥ **41**

న జాతా సుఖవార్తాఽపి తత్ర క్వాపి మునీశ్వరాః ।
ద్వాపరేఽగ్రే కృష్ణరూపం గోకులేఽత్ర కరోమ్యహమ్ ॥ **42**

నేదృశం తత్ర భోక్ష్యామి సుఖం శృణుత విస్తరాత్ ।
కారాగృహస్థితిః పిత్రోర్జన్మాదావేవ మే భవేత్ ॥ **43**

మాతాపితృవిహీనశ్చ తదా స్థాస్యామి శైశవే ।
పారకీయే నందగేహే వృద్ధిం గచ్ఛామి గోకులే ॥ **44**

గోపవేషస్య కిం సౌఖ్యం గోపృష్ఠే భ్రామతో మమ ।
స్త్రీగోనాగాశ్వపక్ష్యాది బహూంస్తత్ర నిహన్మ్యహమ్ ॥ **45**

దేవపత్నీవరాత్కుర్యాం పరస్త్రీగమనాదికమ్ ।
నానాచౌర్యాది దుష్కర్మ కృత్వాఽహం గోకులే తతః ॥ **46**

మధురాయాం హనిష్యామి సగజం కంసమాతులమ్ ।
తత్ర దాస్యా రతిం కుర్యాం నైష్ఠుర్యం గోపికాదిషు ॥ **47**

మద్భక్తా గోపికాః సర్వా రామో బంధుర్భజిష్యతి ।
అన్యచ్చ కాలయవనభయాన్మే హి పరాభవః । **48**

వనచారులగు మునులకు సుఖమనుట ఎట్టిది? కావున ఆజన్మమున తపోవ్రతమును ఆరంభించిని. తపమాచరించునపుడు సౌఖ్యము ఎట్లుకలుగును? ఇట్లు భువిలో నా అవతారములను ఆరింటిని అనుభవించితిని. మునులారా! వాటిలో ఎచ్చటను నాకు సుఖమనునది తోచలేదు. ఇకముందు ద్వాపరయుగమున గోకులమున కృష్ణరూపమునందెదను. ఈ రామావతారమువంటి సుఖము ఎచ్చటను అనుభవింపను. విస్తారముగా వినుడు.

కృష్ణావతారమున నా జన్మకు మొదటనే నా తల్లిదండ్రులకు కారాగారవాసము. చిన్నతనమున తల్లిదండ్రులను వదలి పరునిదైన నందగోపుని యింటిలో వసించెదను. ఆవుదూడల తోకప్రక్కన నడుచుచుండు గొల్లపిల్లవాని వేషమున ఏమిసుఖము గలదు? స్త్రీ, ఎద్దు, గుఱ్ఱము, పక్షి మొదలగువాటిని సంహరించుట, అనేకములగు దొంగతనము మొదలగు దుష్కర్మలను గోకులమున ఆచరించి, మధురానగరమున మహాగజముతోడ, మేనమామయగు కంసుని సంహరించెదను. అచ్చట దాసితో కలయిక. గోపస్త్రీలతో నిష్ఠురతనందెదను. నాతోడ సుఖించిన గోపికలందరిని అన్నయగు బలరాముడు అనుభవించుచున్నాడు మరియు అచ్చట కాలయవనుని భయమువలన నాకు పరాజయము కలుగును.

న పరాభవతో దుఃఖం కించిదస్తి జగత్త్రయే ।
తతోఽహం స్వస్థలం త్యక్త్వా తటాకే సాగరస్య చ ॥ 49

స్థాస్యామి స్వల్పకాలం హి చిరకాలం న మే స్థితిః ।
న స్థలం మధ్యదేశే హి న రాజ్యం మే భవిష్యతి ॥ 50

వినా రాజ్యేన కిం సౌఖ్యం పరాజ్ఞావశవర్తినః ।
ఛత్రాదిరాజ్యభోగాశ్చ తస్మిన్ జన్మని మే న హి ॥ 51

బహుస్త్రీణామేకదేహస్తదాఽయం మే భవిష్యతి ।
తదా కాసాం సుఖం దేయం దుఃఖం కాసాం తదా మయా ॥ 52

ఏవం సదా వ్యగ్రచిత్తస్తాసాం రంజనకర్మణి ।
తత్ర కా సుఖవార్తాఽస్తి నిశాయాం భ్రమతో మమ ॥ 53

ఘటికాయాం చ షట్త్రింశత్పంచశతగృహాణి హి ।
పర్యటన్నుపృష్టవింశత్ స్త్రీగేహాని తదా మమ ॥ 54

శేషాణి గంతుం నైవాస్తి కాలో భానురుదేష్యతి ।
త్రింశద్ఘటీమయీ రాత్రిస్త్వేవం మే సా గమిష్యతి ॥ 55

తదా మే భ్రమతో రాత్రౌ కుతో నిద్రా కుతః సుఖమ్ ।
యదా భవేన్నిశావృద్ధిః కించిన్నిద్రాం తదాఽఽప్నుయామ్ ॥ 56

యస్యేచ్ఛాఽస్త్యత్ర దుఃఖం హి భోక్తుం తేన నరేణ హి ।
కర్తవ్యా బహవః పత్న్యో ద్రష్టవ్యం తత్ఫలం తతః ॥ 57

ఏవం భవేన్న మే సౌఖ్యం ద్వాపరే కృష్ణజన్మని ।
భవిష్యత్యవతారస్య సమాప్తిర్విప్రశాపతః ॥ 58

తతో దైత్యాన్యజ్ఞకర్మసక్తాన్ దృష్ట్వా పునస్త్వహమ్ ।
కలావగ్రే బుద్ధరూపం ధరిష్యామ్యతిమోహనమ్ ॥ 59

నిజవాక్యైర్మతిస్తేషాం దైత్యానాం యజ్ఞకర్మతః ।
పరివర్త్య కియత్కాలం స్థాస్యామి జగతీతలే ॥ 60

తదాఽహం మౌనమాశ్రిత్య మలినః కేశలుంచకః ।
యుగాదిజీవధారీ చ సర్వేషాముపదేశకృత్ ॥ 61

అహింసనవ్రతం సర్వాన్ దర్శయిష్యామ్యహం జనాన్ ।
తజ్జన్మన్యతిదుఃఖం మే కేశయూకామలాదినా ॥ 62

ముల్లోకములలో అపజయమువంటి దుఃఖము గలదా? కావున నేను నానివాసమును విడిచి, సముద్ర తటాకమున కొంతకాలమే నివసించెదను. బహుకాలము బ్రతికియుండను. భూమధ్యమున నాకు తావులేదు, నాకు రాజ్యములేదు, పరుని ఆజ్ఞకు లోబడునట్టి రాజ్యము లేని సుఖమనగా ఎట్టిది? ఛత్రాది రాజ్యభోగములు ఆ జన్మమున నాకు లేవు. అనేక స్త్రీలకు నా యొక్క దేహమొక్కటి యగుటచే ఎవరికి సుఖమునిత్తును? ఎవరికి దుఃఖము నిచ్చెదను? ఇట్లు వారిని రంజింపజేయుటలో కలతనొంది యుందును. రాత్రి తిరుగుచుండు నాకు సుఖమెట్లు కలుగును? ఒక గడియలో 53వ ఇండ్లవంతున సంచరించి వచ్చుచున్నను తెల్లవారు నప్పటికి 28 ఇండ్లు నిలిచిపోవును. కాలముచాలదు. 30గడియల రాత్రి నాకిట్లు గతించిపోవుచుండును. ఇట్లు సంచరించు వారికి నిద్రఎచ్చట? సుఖమెచ్చట? రాత్రి వచ్చినప్పుడెప్పుడో కొంచెము నిద్రించెదను. ఇచ్చటనే దుఃఖింపవలయునను ఆశ ఎవనికి గలదో వాడు బహుస్త్రీల ననుభవింపదగును. దాని ఫలమున పిదప చూడదగినది. ఇట్లు ద్వాపరమున కృష్ణావతారమున సంభవించుచున్నది. ముందటి అవతారమునకై దీనికి పరిసమాప్తికూడ శాపమువలన కలుగును. అంతమీద నేను యజ్ఞకర్మ నిరతులయిన రాక్షసులను చూచి, మరల కలియుగ

ఆరంభమునందు మిగుల మోహకరమున బుద్ధావతారమును అవలంబించెదను. నా వాక్యముచే దైత్యులందరికిని యజ్ఞకర్మలను తప్పించి, ఈ జగమున కొంతకాలము ఉందును. అప్పుడు నేను మాటలాడని మౌనవ్రతమును అవలంబించి, మలినుండును, కేశలుండును యుగాది జీవధారియునై అందరికి ఉపదేశకుడు అగుచుందును. లోకులందరికిని అహింస వ్రతమును ఉపదేశించెదను. ఆ జన్మమునను నాకు కేశయూకా (పేను) మలాదులచే దుఃఖముగానే ఉండును.

తతోఽగ్రేహం ధరిష్యామి కల్కిరూపం మహత్కలేః ।
అంతే దృష్ట్వా జనానాం చ సర్వత్ర వర్ణసంకరమ్ ॥ 63

భూత్వాఽత్ర విప్రదేహేన ఖడ్గధారీ హయస్థితః ।
సంహారం క్షణమాత్రేణ దుష్టానాం హి కరోమ్యహమ్ ॥ 64

సోఽవతారో నాతిచిరం మమ స్థాస్యతి భూతలే ।
న తత్రసుఖలేశోఽపి మే భవిష్యతి భూసురాః ॥ 65

ప్రవర్తయిష్యతి పునస్తతోఽగ్రే తత్ కృతం యుగమ్ ।
పూర్వవచ్చ పునస్తత్ర హ్యవతారాన్కరోమ్యహమ్ ॥ 66

ఏవం నవావతారేషు న భుక్తం హి సుఖం మయా ।
అతస్త్వస్మిన్నవతారే సుఖం భుక్తం యథేచ్ఛయా ॥ 67

నానేన సదృశః కశ్చిదవతారోఽవనీతలే ।
పూర్వం భూతో మమాగ్రేఽపి న భవిష్యతి వై కదా ॥ 68

సప్తలోకాధిపత్యం చ నారీ సీతా చ వర్తతే ।
యాత్రేమౌ బాలకౌ పుత్రౌ మహావీరౌ ధనుర్ధరౌ ॥ 69

యత్ర త్వేతే బంధవశ్చ త్రైలోక్యజయినః శుభాః ।
కామధేన్వాదిరత్నాని సప్త యత్ర మమాంతికే ॥ 70

సాక్షాదయం వేదరూపో వసిష్ఠస్త్వస్తి మే గురుః ।
ఆర్యావర్తే పుణ్యదేశేఽయోధ్యాయాం వసతిర్మమ ॥ 71

రాజ్యభోగాదిభోగానాం భోక్తాఽహం త్వత్ర నోఽపరః ।
యత్ర సత్యవ్రతం మేఽస్తి యత్రైకదయితావ్రతమ్ ॥ 72

**యత్రైకేనైవ బాణేన మయా బాల్యాదికా హతాః ।**
**యత్రైకైవ హి సీతాయా మమ శయ్యా న చాపరా ॥ 73**

**యత్రాప్రతిహతాజ్ఞా మే త్రైలోక్యే హి మునీశ్వరాః ।**
**యత్ర యానం పుష్పకం తు యత్ర దూతోఽఞ్జనీసుతః ॥ 74**

అటుపిమ్మట గొప్పదగు కలికాలమున అంతట ఏర్పడు వర్ణసాంకర్యమును చూసి, కల్కిరూపమును ధరించుచున్నాను. విప్రదేహముతో అవతరించి, ఖడ్గమును ధరించి, గుఱ్ఱమునెక్కి క్షణమాత్రమున దుష్టులనందరిని సంహరించెదను. ఆ అవతారముననను చిరకాలము భూమిపైఉండను. బ్రాహ్మణులారా! నాకచ్చటను కొంచెము కూడా సుఖము లేదు. అటుమీద తిన్నగా కృతయుగము ప్రారంభమగును. నేనును మునుపటివలె అవతారములను పొందెదను. ఇట్లు తొమ్మిది అవతారములలోను సుఖమును అనుభవింక పోతిని. కావున ఈ రామావతారమున యథేచ్ఛముగా సుఖమును అనుభవించుచున్నాను. దీనితో సమానమయిన అవతారము మరొక్కటిలేదు. ఇంతకు మునుపు లేదు, ఇకమీదను లేదు. ఎన్నటికిని లేదు. ఎందువలనందురేమో? వినుడు నేను సప్తద్వీపపతిగా ఉన్నాను. జానకీదేవి ప్రియురాలిగా ఉన్నది. పుత్రులు మహావీరులైన ధనుర్ధారులు. ముల్లోకములను జయింప కలిగిన మంగళమూర్తులగు ముప్పురు తమ్ములు గలరు. కామధేనువు మొదలైన ఏడు వస్తువులు సర్వోత్తమములై ఉన్నవి. ప్రత్యక్షవేదస్వరూపుడగు వసిష్ఠుడు గురువుగా ఉన్నాడు. పుణ్యదేశమగు ఆర్యావర్త మధ్యమున అయోధ్యయందు వసించుచున్నాను. నా వలె రాజ్యభోగములను అనుభవించు వాడొకడును లేడు. ఏకపత్నీవ్రతము సత్యవ్రతముగా చక్కగా కుదిరియున్నది. వాలిమొదలగు వారిని ఒక్క బాణముచేతనే సంహరించితిని. సీతయొక్క పాన్పుతప్ప మఱియొకటి లేదు. ముల్లోకములలోను నాయాజ్ఞకు తిరుగులేదు. మునీంద్రులారా! నా వాహనము పుష్పకము. దూతయో ఆంజనేయుడు. నావద్ద సుగ్రీవ, విభీషణులు మిత్రులై తిరుగుచున్నారు.

**సుగ్రీవ రాక్షసేంద్రౌ చ యత్ర మిత్రే మమాంతికే ।**
**కోదండసదృశం చాపం యత్ర మేఽరినిషూదనమ్ ॥ 75**

**సూర్యవంశే యత్ర జన్మ జాతో దశరథో వరః ।**
**కౌసల్యా యత్ర జననీ యత్రాహం స్వవశః సదా ॥ 76**

**సుమేధాసదృశీ యత్ర మే శ్వశ్రూః స్నేహవర్ధినీ ।**
**సుదేహః శ్వశురో యత్ర విద్యాదో యత్ర గాధిజః ॥ 77**

లక్ష్మణో యత్ర మే మంత్రీ సరయూర్యత్ర మే నదీ ।
పార్శ్వగా హ్యంగదాద్యాశ్చ చతుర్దంతో గజో మహాన్ ॥ **78**

ద్విజేచ్ఛాపూరణం యత్ర వ్రతం మేఽకుంఠితం సదా ।
ఇదం వైకుంఠసదృశం గృహం యత్రాతిభాసురమ్ ॥ **79**

చింతామణిరలంకారో హృదయే యత్ర వర్తతే ।
ఏకాదశ సహస్రాణి వర్షాణ్యాయుశ్చిరం మమ ॥ **80**

అనమ్రం మే శిరశ్ఛేదం కేషామప్యవనీభృతామ్ ।
ఏవం మయా సుఖం భుక్తమిహ జన్మని భూసురాః ॥ **81**

నాల్పా వాప్యుర్వరితాఽస్తి సుఖేచ్ఛా మమ భూతలే ।
అతఏవావతారోఽయం పూర్ణరూపాన్మయా ధృతః ॥ **82**

భూతభావ్యవతారా యే తేఽంశాదేవ మయా ధృతాః ।
యద్గతం తు వనే పూర్వం సీతయా బంధునా మయా ॥ **83**

తచ్చ లోకోపదేశార్థం భూభారహరణాయ చ ।
జనోపదేశః కీదృక్ స కృతస్తం ప్రవదామ్యహమ్ ॥ **84**

పితుర్వచో మాననీయం యద్యప్యతిశ్రమప్రదమ్ ।
పుత్రైరిత్యుపదేశార్థం మయా వాక్యం పితుః కృతమ్ ॥ **85**

న తదా కిం మృషా కర్తుం పితుర్వాక్యం బలం మయి ।
తథాపి లోకశిక్షార్థం తద్వాక్యం పాలితం మయా ॥ **86**

న హంతవ్యా మయా క్రోధాద్దుష్టా కిం కైకయీ తదా ।
తథా సా మంథరా చాపి మే రాజ్యే విఘ్నకారిణీ ॥ **87**

శత్రువులను నిర్మూలించు నా విల్లు నాలుగు మూరల మాత్రము. సూర్యకులమున పుట్టుక. పూజ్యుడగు దశరథుడు తండ్రి, కౌసల్యాదేవి తల్లి, నేనో మిక్కిలి స్వతంత్రుడను. అత్తగారు మిక్కిలి ప్రీతిగలిగి సుమేధ వంటిది. మామగారు జనకుడు. విశ్వామిత్రముని విద్యను ఉపదేశించిన గురుడు. లక్ష్మణుడు మంత్రిగా ఉన్నాడు. నా యొక్క నది సరయు. అంగదాదులు పరివారము. నాలుగు దంతములు గల ఏనుగు గలదు. బ్రాహ్మణులను తృప్తిపరచుటయే ప్రధాన వ్రతముగా కలిగియున్నాను.

ఈ ఇల్లు వైకుంఠమైయున్నది. నా ఎదమీద అలంకారరత్నము చింతామణిగదా! చిరకాలము 11 వేల ఏండ్లు నాకు ఆయుష్షు గలదు. ఏ రాజునకును నేను తలవంచినవాడను గాను. ఇట్లు ఈ జన్మమున సుఖమును అనుభవించితిని. భూతలమున సుఖేచ్ఛ కొంచమైనను ఇక కలుగదయ్యె. కావున ఈ అవతారము పూర్ణరూపముతో వచ్చినది. గతించినవి, మరి కలుగబోవు అవతారములు అన్నియును నా అంశవలననే ధరింపబడియున్నవి. సీతా, లక్ష్మణులతోడ నేను వనమున ఆచరించిన వన్నియును భూభారమును పరిహరించుటకును, తత్త్వజ్ఞులకు ఉపదేశించుటకును నటనగా అయినవి. అవి ఎట్లనిన చెప్పెదను వినుడు (84) .....

తండ్రిమాట వినుట పుత్రులకు కష్టతరమైయున్నను ముఖ్యమైయుండుననుట ఉపదేశించుటకై నేను పితృవాక్యమును పాలించితిని. తండ్రివాక్యమును వ్యర్థపరచుటకు బలము లేదా ఏమి? కలదు, అయిన ఇందుకై యిట్లు చేసితిని. దుష్టురాలయిన కైకేయిని నేనప్పుడు చంపకూడదా ఏమి? నా రాజ్యమునకు విఘ్నము నొనర్చిన మంథరను కూడా అట్లే చంపదగును కదా?

**కిం తదా కుంఠితా శక్తిః కైకేయీమంథరావధే ।**
**స్త్రీహత్యా నైవ కర్తవ్యా చేతి సర్వాన్సుశిక్షితమ్ ॥ 88**

**సాపత్నమాతృవాక్యం తు పాలనీయం స్వమాతృవత్ ।**
**స్వసుఖార్థం వధోఽన్యస్య న కర్తవ్యో జనైరితి ॥ 89**

**ఉపదేష్టుం మయా నైవ కైకేయీమంథరే హతే ।**
**న బంధుహింసా కర్తవ్యా పరరాజ్యం న కాంక్షయేత్ ॥ 90**

**అహముపదిశన్నిత్యం జనాన్బంధుర్హతో న మే ।**
**మృతే పితర్యపి హృతం న తద్రాజ్యం బలాన్మయా ॥ 91**

**రాజ్యాసక్తా నరా భూమ్యాం భోగాసక్తా భవంతు న ।**
**ఉపదేష్టుం జనానిత్థమహం పూర్వం వనం గతః ॥ 92**

**మాతృపితృసుహృత్పుత్రస్నేహాసక్తిం న కారయేత్ ।**
**ఇత్థం మయోపదిశతా త్యక్తః స్నేహస్తదా ద్విజాః ॥ 93**

**సుఖం దుఃఖం సమం జ్ఞేయం సుఖం హర్షో న మానయేత్ ।**
**శోకః కార్యో విపత్తౌ న చేతి లోకాన్ ప్రదర్శితమ్ ॥ 94**

**రాజ్యసౌఖ్యం మయా త్యక్త్వా భుక్తాః క్లేశాస్తదా వనే ।**
**కామాదీనాం రిపూణాం చ దుష్టానాం హి వధో భువి ॥ 95**

**జనైః కార్యం సదా చేతి హ్యుపదేష్టుం మయా వనే ।**
**బహవో నిహతాస్తత్ర రాక్షసా మునిహింసకాః ॥ 96**

**స్త్రీసంగః సర్వదా త్యాజ్యస్త్వేకాకీ చ తపశ్చరేత్ ।**
**నాసక్తం నిజచిత్తం హి స్త్రీషు కార్యం నరైః కదా ॥ 97**

**ఇత్థం మయోపదిశతా సీతాయాశ్చ తదా వనే ।**
**వియోగో దర్శితో లోకాన్ మత్తో భిన్నా న జానకీ ॥ 98**

**కదాపి జాయతే విప్రాః సత్యం చేదం బ్రవీమ్యహమ్ ।**
**ఆర్తస్య రక్షణం కార్యం కార్యో దుష్టస్య నిగ్రహః ॥ 99**

అప్పుడు వారిని నిగ్రహించుటలో శక్తి లోపమైనదా? లేదు. స్త్రీహత్యను ఎవరును చేయరాదని శిక్షించుటకై వదలితిని. మరియు "సవతితల్లి మాటను తనతల్లిమాటవలె పాలింపనగును. తన సుఖమునకై పరులను వధింపరాదు," అనుట ఉపదేశించువాడవై కైకేయీ, మంథరలను చంపలేదు. "బంధుహింస ఎవనికీ తగదు. పరరాజ్యమును అపేక్షింపరాదు," అని ఉపదేశించుచు, తమ్ముని నేను నిగ్రహించలేదు. తండ్రిపోయిన పిదపకూడా బలాత్కారముగా నా రాజ్యమును అపహరింపలేదు. "రాజ్యమేలు రాజులు భోగాపేక్ష గలవారై ఉండరాదు," అని జనులకు ఉపదేశించుచు నేను మునుపు వనమునకు వెడలితిని. "తల్లి, తండ్రి, చెలికాడు, కొడుకు అను లేనిపోని ఆశలను పెట్టుకొని సంసారమున దుఃఖితుడు కారాదు," అను అర్థమును సూచించి అన్నిటియందు అభిమానమును వదలితిని. బ్రాహ్మణులారా! సుఖదుఃఖములను సమముగా నెంచనగును. సుఖమున సంతోషమును, విపత్తునందు దుఃఖమును పొందరాదు," అని ఉపదేశించుచు రాజ్యభోగములను వదలి వనక్లేశములను అనుభవించితిని. "కామ, క్రోధాది దుష్టులను నిగ్రహింపవలయును," అను ఉపదేశమును ఇచ్చుచు అరణ్యమున దుష్టరాక్షసులను సంహరించితిని. స్త్రీ సంగమము వదలవలయును. ఒంటరిగా తపస్సు చేయవలయును. స్త్రీలపై దృష్టిపెట్టరాదు," అను అర్థమును ఉపదేశించుటకై అడవిలో సీతా వియోగమును అనుభవించునట్లు ఉంటిని. నన్నెప్పుడును సీత విడిచియుండలేదు. ఈ మాట సత్యము. "ఆర్తులగువారిని రక్షించుటయును, దుష్టులగువారిని శిక్షించుటయును కర్తవ్యమై యున్నది," (99)

మయోపదిశతా చేత్థం జనాన్సుగ్రీవరాక్షసౌ ।
రక్షితౌ నిహతౌ వాలిరావణావితరే హతాః ॥ 100

కీర్తిః కార్యా జనేష్వత్ర మయోపదిశతా త్వితి ।
పాషాణాస్తారితా నీరే కామాకాశగతిర్న మే ॥ 101

యద్యపి శుద్ధే స్వే చిత్తే విరుద్ధం చ జనేషు యత్ ।
త్యక్తవ్యం తత్ప్రియం చాపి మయోపదిశతా త్వితి ॥ 102

జనానపాపాన్ జ్ఞాత్వాఽపి లంకాయాం దివ్యదానతః ।
లోకాపవాదభీత్యా సా పురా త్యక్తాఽత్ర జానకీ ॥ 103

స్వయమేవాత్ర యత్త్యక్తం శుద్ధం జ్ఞాత్వా హి తత్పునః ।
అంగీకార్యం జనైర్బుద్ధ్వా మయోపదిశతా త్వితి ॥ 104

జనానంగీకృతా సీతా పురా త్యక్తా మయా శుభా ।
ఏకపత్నీవ్రతాదీని రాజకర్మాణ్యనేకశః ॥ 105

అశ్వమేధాదియజ్ఞాశ్చ సదాచారో జపస్తతః ।
స్నానసంధ్యాదికం యద్యన్మయాఽత్ర క్రియతే సదా ॥ 106

తత్సర్వ జనశిక్షార్థం ముక్తసంగస్య కిం మమ ।
కర్మాతీతస్య భో విప్రాః సదానందస్వరూపిణః ॥ 107

అహం సదాఽఽనందమయః సుఖాత్మా సుఖదో నృణామ్ ।
అవతారపరత్వేన సుఖం దుఃఖం మయాఽకథి ॥ 108

కర్తవ్యమును తెలుపుటకే సుగ్రీవ, విభీషణులను కాపాడి, వాలి రావణులను వధించితిని, "లోకమున అసాధ్యకార్యమును చేసి కీర్తిని నిలుపవలయును," అని ఉపదేశించుటకే నీటిలో ఱాళ్ళను తేలునట్లు సేతువును కట్టించితిని. ఆకాశగమన మహిమ నాకు లేదా ఏమి? "తమ మనసున ఇది మంచిదని తోచినను లోకవిరుద్ధమగు దానిని విడువదగును," అను నీతిని ఉపదేశించుచు ఈ జానకీదేవి నిత్యపరిశుద్ధురాలని తెలిసినా జనాపవాదమునకు వెఱచి, లోకమునకు బోధించుటకు సీతను పరిత్యజించితిని. లంకలో యజ్ఞవాటికలో ప్రమాణాదులచే అంగీకరించితిని. "తాను దోషయుక్తమని పరిత్యజించినప్పటి నిర్దుష్టమని తెలిసిన పిదప మరల తానంగీకరించి సమ్మానింప దగును," అను

నీతిని ఉపదేశించుటకై విడువబడిన సీతను మఱల అంగీకరించితిని. ఈ ఏకపత్నీ వ్రతాది నియమములు, అనేకములగు రాజ్యకర్మలు, అశ్వమేధాది యజ్ఞయాగములు, సదాచారములు, జప తపములు, స్నాన సంధ్యాది నిత్యకర్మలు, మొదలగు వీటినన్నిటిని నేను లోకులు ఇట్లేచేసి కృతార్థులు అగుచుందురు గాక అని ఆచరించుచున్నాను. ఇంతేకాని ముక్తసంగుడును, కర్మాతీతుడును, నిత్యానంద రూపుడును అగు నాకు ఇవి ఏల? ఎల్లప్పుడును ఆనందమయుడను, నేను సుఖాత్మయై నరులకు సుఖమునిచ్చువాడను. అయిన నా అవతారములనుబట్టి సుఖదుఃఖములు నాయందు కల్పనగా చెప్పబడుచున్నవి. మీ ఎదుట చెప్పినదంతయు వినోదకరముగా ఉండనీయని చెప్పితిని. ఇందులో సంశయము లేదు. (109)

**యదత్ర భవతామగ్రే కౌతుకార్థం న సంశయః ।**
**ఉపాసకానాం తోషార్థమవతారః స్వయం మయా ॥ 109**

**విశేషగుణవానుక్తః సంతి సర్వే సమా మమ ।**
**సమ్యగ్బుద్ధ్యా విచారాచ్చ వరిష్ఠః సకలేష్వయమ్ ॥ 110**

**ద్వావతారౌ జలచరౌ తథా వనచరౌ చ ద్వౌ ।**
**ద్వౌ తౌ చ వల్కలధరౌ ఏకో వైశ్యశ్చ గౌపకః ॥ 111**

**ఏకస్తు మలినశ్చాపి పరశ్చ క్షణికస్తథా ।**
**ఏవం భూతా భవిష్యాశ్చావతారాస్తోషదా న మే ॥ 112**

**అయం సర్వవిశిష్టోఽత్ర హ్యుపాసకజనప్రియః ।**
**అవతారస్త్వహం వేద్మి సేవలాన్మంగళప్రదః ॥ 113**

**చరిత్రాణ్యతిరమ్యాణి పాతకఘ్నాని వై మయా ।**
**కృతాన్యస్మిన్నవతారే శ్రవణాన్ముక్తిదాని హి ॥ 114**

**సదా జనా భజంత్యత్ర హ్యవతారమముం మమ ।**
**భక్తా యేఽస్యావతారస్య తే మేఽతీవ ప్రియాః సదా ॥ 115**

**ఏవం సర్వమిదం విప్రా ఆనందేన మయోదితమ్ ।**
**దోషమారోపయంత్యస్మిన్నవతారేఽపి యే జనాః ॥ 116**

**తే మద్ద్వేష్యా నరకేషు పతంతి సహ పూర్వజైః ।**
**శ్రీరామదాస ఉవాచ**
**ఏవముక్త్వా రామచంద్రః సంపూజ్య హి మునీశ్వరాన్ । 117**

**విసృజ్య సకలాన్ సీతాం రంజయామాస రాఘవః ॥**
**ఏవం శిష్య మయా ప్రోక్త మవతారప్రవణనమ్ ॥ 118**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, అవతారవర్ణనం నామ, వింశః సర్గః ॥**

భక్తితో నన్ను భజించునట్టి భక్తులయొక్క సంతోషము కొరకు నేనట్లు విశేష గుణుడని తెలిపితిని. నా కన్నియు సమానములుగా ఉన్నవి. దీనిని చక్కగా విచారించిన అంతట అన్నియు ఒక్కటియే. రెండవతారములు జలచరములు. రెండు నా రుచి, రంగు కలిగినట్టివి. ఒకటి గొల్లపిల్లగానిది. ఇక రెండు వనచరములు. మరియొకటి మలినము. ఇంకొకటి క్షణికము. ఇట్లు భూత భవిష్యత్ అవతారములు నాకు ఆనందకరములు కావు. ఇయ్యది అవతారములు సర్వవిధములతోను భక్తజన ప్రియమైనది. ఈ అవతారమును సేవించుటచేత మంగళము కలుగును. నా యొక్క చరిత్రలు పాప పరిహారకములును, మనోహరమును అయి ఉండును. వీటిని వినుటచేత ముక్తిలభించును.(113)

భక్తులెవరు ఈ అవతారమునెల్లప్పుడును భజించుచుందురో వారు నాకు మిక్కిలి ప్రియులుగా ఉందురు. బ్రాహ్మణులారా! మీకు నేను ఆనందమున సంగతులను అభివర్ణించితిని. ఈ అవతారమున ఎవరు దోషములు ఆరోపించుచున్నారో వారు నాకు ద్వేషులై ఉందురు. వారు వారి తాతముత్తాతలు మొదలగువారితోడ నరకమునపడుదురు. అని శ్రీరామచంద్రస్వామి అనుగ్రహించి నిజమహిమను అభివర్ణించి చెప్పి మునీంద్రులను సత్కరించి, అందరిని వారివారి స్థానములకు పంపించి, మంగళ దేవతయగు జానకీదేవిని రంజింపజేయుచుండెనని విష్ణుదాసునికి శ్రీరామదాసుడు చెప్పి, మరియును శిష్యుడా! అవతారవర్ణనమిట్లు చెప్పబడెను. ఇక వినుమని చెప్పుచున్నాడు. (20)

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణములో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, శ్రీరాముని అవతారమును వర్ణించు 20వ సర్గ ముగిసినది.**

# ఏకవింశః సర్గః-21వ సర్గ

## శ్రీరాముడు రెండు దేహములను ధరించుట

శ్రీరామదాస ఉవాచ

ఏకదా జానకీం ద్రష్టుం సప్తద్వీపాంతరస్త్రియః ।
మునీనాం పార్థివానాం చ సుహృదాం వ్యవసాయినామ్ ॥ 1

సామాన్యక్షత్రియాణాం చ వైశ్యానాం చ సహస్రశః ।
చైత్రస్నానమిషేణైవ యయుర్వాహనసంస్థితాః ॥ 2

దృష్ట్వా సమాగతాస్తాశ్చ జానకీ గజగామినా ।
ప్రత్యుద్గమ్యానయామాస స్త్రీశాలామతిసాదరాత్ ॥ 3

పూజయామాస తాః సర్వా నానాలంకారభూషణైః ।
తాః సర్వా పూజయామాసుః సీతాం సింహాసనస్థితామ్ ॥ 4

దివ్యాలంకారవస్త్రాద్యైర్నానాదేశోద్భవైర్వరైః ।
పరివార్య తతః సీతాం తస్థుః సర్వాః స్త్రియశ్చ తాః ॥ 5

శ్రుత్వా సీతాముఖాద్రామచరిత్రాణి సహస్రశః ।
తాస్తుష్టాః శ్రోతుముద్యుక్తాస్తత్పాణిగ్రహణం శుభమ్ ॥ 6

స్మితాస్యాస్తాః స్త్రియః సర్వాస్తదా ప్రోచుర్విదేహజామ్ ।
త్వత్పాణిగ్రహణోత్సాహం శ్రోతుం వాంఛామహే వయమ్ ॥ 7

తత్సర్వం విస్తరేణాద్య వక్తుమర్హసి జానకి ।
ఇతి తాసాం వచః శ్రుత్వా లజ్జయా జానకీ తదా ॥ 8

స్వాం సఖీం నోదయామాస తులసీం రుక్మభూషితామ్ ।
తులస్యువాచ
శృణుధ్వం సకలా నార్యః పాణిగ్రహణముత్తమమ్ ॥ 9

**జానక్యాః కథయామ్యద్య మహామంగళదాయకమ్ ।**
**వస్తోషార్థం హి సంతోషాచ్ఛ్రవణాత్పుణ్యవర్ధనమ్ ॥ 10**

**సాకేతాద్రఘునందనేన స మునిర్భ్రాత్రా యుతేనాశ్రమం**
**స్వం గత్వా వినిహత్య రాక్షసబలం తేనైవ యజ్ఞం నిజమ్ ।**
**సంపాద్యాశు రథస్థితశ్చ మిథిలామార్గే హరేరంఘ్రిణః**
**సంస్పర్శాద్గతకల్మషాం సమకరోద్భార్యాం మునేర్గాధిజః ॥ 11**

**గత్వాగాధిజసంయుతశ్చ మిథిలాం భ్రాతా సభాసంస్థిత**
**శ్చాపాధః పతితం నిరీక్ష్య చ రిపుం స్వీయం మునేరాజ్ఞయా ।**
**తం గత్వా గిరిజేశ్వరస్య చ ధనుః కృత్వా త్రిఖండం క్షణాత్**
**సీతాహస్తవిసర్జితాం నిజగళే మాలాం దధౌ రాఘవః ॥ 12**

## సప్తద్వీప స్త్రీలు సీతను సేవించుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, ‘‘ఒకసారి శ్రీ జానకీదేవిని సందర్శింపవలయునని సప్తద్వీపములయందుండు స్త్రీలు, మునిపత్నులు, రాజపత్నులు, చాతుర్వర్ణ్యమువారును నిశ్చయించి, చైత్రస్నాన నిమిత్తముగా వాహనములనెక్కి, వేలకొలదిగా వెడలివచ్చిరి. సీతమ్మ వారిని చూచి ఎదుర్కోలు పోయి తీసికొనివచ్చి, వివిధాలంకారము లచే సత్కరించెను. వారందరును సింహాసనమున కూర్చుండి యుండెడు సీతాదేవిని వివిధ దేశములకు చెందిన నానాలంకార వస్త్రములచేతను, నగలచేతను పూజించిరి. అపుడు సీతాదేవి చుట్టూ కూర్చునియున్న వనితామణులు సీతాదేవి ముఖమునుండి శ్రీరామచంద్రుని దివ్యచర్యలను వీనులారా వినుచు, సీతాకళ్యాణ మహోత్సవమును మిగుల కీర్తించుచు, చిరునవ్వు నవ్వుచు, “తల్లీ! నీ యొక్క పాణిగ్రహణ మహోత్సవమును వినగోరుచున్నాము. దయజేసి చెప్పు”మని అడిగిరి. ఆ నారీమణుల మాటవిని సీతమ్మ సిగ్గునంది, తన సఖియగు తులసియను దానిని ప్రేరేపించెను. అంత ఆ తులసి చెప్పుచున్నది.(9)

## తులసి జానకీవివాహమును అభివర్ణించుట.

విలాసినులారా! విశ్వమంగళప్రదమైన విదేహపుత్రియొక్క వివాహమహోత్సవమును వినుడు. ఇది మీకు పుణ్యమును, లెక్కలేనంత సంతోషమును ఇచ్చును. విశ్వామిత్ర ముని అయోధ్యనుండి లక్ష్మణునితో శ్రీరామచంద్రస్వామిని తన ఆశ్రమమునకు తీసికొనివచ్చి, శ్రీరామునిచే రాక్షసబలమును నశింపజేసి, తన యజ్ఞమును నెరవేర్చుకుని, రథమునెక్కి మిథిలకు పోవుచు దారిలో శ్రీరామ పాదస్పర్శచే

మునిపత్నియగు అహల్య కష్టములను తొలగించి, శాపముక్తిని కలిగించెను. అంత శ్రీరాముడు విశ్వామిత్రునితోను, లక్ష్మణునితోను జనకుని సభలో ప్రవేశించి అచ్చట మునీంద్రుని ఆజ్ఞప్రకారము, నమస్కరించి, శివుని చాపమును మూడుతునకలుగా విరిచి, జానకీదేవి తన కరకమలములచే అర్పించిన దివ్య పుష్పమాలికను కంఠాలంకారముగా అంది రాముడు రాజించెను.

**బంధూనాం చ నిజం విధాయ మిథిలాపుర్యాం వివాహాన్ శుభాన్**
**పితృభ్యాం సహ భార్యయా రఘుపతీ రాజ్ఞా౽తిసంపూజితః ।**
**త్యక్త్వా తాం మిథిలాం యయౌ నిజపురీం మార్గే క్రుధా తిష్ఠతో**
**దుర్దర్పం జమదగ్నిజస్య ధనుషా సోపాహరల్లీలయా ॥ 13**

**ఏవం నార్యశ్చ సీతాయా వివాహః కథితో మయా ।**
**యుష్మాభిః కౌతుకాత్ పృష్టో యః సర్వమంగళప్రదః ॥ 14**

**శ్రీరామదాస ఉవాచ**
**ఏవం స్త్రియశ్చ తాః శ్రుత్వా పరమాం ముదమాప్నుయుః ।**
**తతస్తాః పూజయామాసుః పునః సీతాం ముదాన్వితాః ॥ 15**

**సీతాయా పూజితాః సర్వాస్తాం నత్వామంత్ర్య జానకీమ్ ।**
**చైత్రస్నానం సమాప్యాథ జగ్ముః స్వం స్వం స్థలం ప్రతి ॥ 16**

**అథైకదా గురోరాస్యాద్రామాగ్రే సంస్థితో లవః ।**
**శృణ్వన్పురాణం పప్రచ్ఛ శ్రోతుం సర్వాన్ జనాన్ గురుమ్ ॥ 17**

**గురో తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం వద మునీశ్వర ।**
**పుస్తకేషు చ సర్వత్ర పత్రే పత్రే పృథక్ పృథక్ ॥ 18**

**ఏకత్ర లిఖ్యతే శ్రీతి రామేత్యేకత్ర లిఖ్యతే ।**
**కిమర్థం మానవైస్తచ్చ తత్సర్వం కథయస్వ మాత్ ॥ 19**

**ఇతి తద్వచనం శ్రుత్వా గురుస్తం వాక్యమబ్రవీత్ ।**
**వసిష్ఠ ఉవాచ**
**సమ్యక్ పృష్టం త్వయా వత్స లోకసందేహహృత్పరమ్ ॥ 20**

**శ్రీరామచరితం పూర్వం వ్యాసేన మునినా పృథక్ ।**
**అష్టాదశ పురాణాని తథోపపురాణాని చ ॥ 21**

**కృతాన్యన్యైశ్చ మునిభిః షట్శస్త్రాదీన్యనేకశః ।**
**శ్రీరామచరితాదేవ శ్లోకమాత్రమపీహ యత్ ॥ 22**

**సర్వమస్తీస్తి తద్బోద్ధుమాదావేకత్ర శ్రీతి చ ।**
**విలిఖ్యైకత్ర రామేతి తన్మధ్యే పరిలిఖ్యతే ॥ 23**

పిదప శ్రీరాముడు తనకు, తమ్ములకును మిథిలలో మహోత్సవముగా వివాహములు జరిగిన తరువాత, జనకునిచే గౌరవింపబడి; తలిదండ్రులతోను, పత్నితోను బయలుదేరి, మిథిలాపురమును వదలి వచ్చుచు, మార్గమున కోపముతో నిలచియున్న పరశురామునియొక్క దుర్వారగర్వమును ధనుర్వినోదమున తన లీలచే నివారించెను. పణతులారా! శ్రీ సీతారాముల వివాహము ఇట్లు వర్ణించితిని. తులసీ సల్లాపముచే ఉల్లాసమందిన ఇల్లాండ్రందరును తులసిని శ్లాఘించి, జానకీదేవిని పూజించి, పలుమార్లు నమస్కరించి ఆమెచే ఆదరింపబడి, సెలవుతీసుకుని, చైత్రస్నానాదులను నేరవేర్చుకొని వారివారి స్థలములకు వెళ్ళిరి. (16)

## శ్రీ అని, రామ అని ఎందుకు వ్రాయాలి?

పురాణశ్రవణముచేయుచుండిన లవుడు లోకులకు తెలుపుటకు, "స్వామీ! పుస్తకములను లిఖించు వారు పత్రపత్రముననను 'శ్రీ' యని ఒకచోటు 'రామ' యని మరియొకచోటును వ్రాయుచున్నారు కదా? ఇది ఎందుకు? దీనితత్త్వమును నిరూపింపుడు," అనినందుకు వసిష్ఠులవారు చెప్పుచున్నారు.

లవబాలకా! లోకమునకు సందేహనివృత్తి చేయు విషయమును చక్కగా అడిగితివి, చెప్పెదను వినుము. పూర్వము వ్యాసమునిచే వేర్వేరుగా అష్టాదశ పురాణములు, ఉపపురాణములు వ్రాయబడినవి. మరియు ఇతరులచేత అనేకముగా షట్శాస్త్రాది గ్రంథములు చెప్పబడినవి.

శ్లోకమాత్రమగు ఏదైనను శ్రీరామచరిత్రమునుండి కలిగినదను అర్థమును తెలుపుటకై మొదట నొకచోట 'శ్రీ' యని మరియొకచోట 'రామ' అని వ్రాయబడును.

**అనయా సంజ్ఞయా సర్వే జ్ఞాస్యంత్వగ్రే జనా భువి ।**
**శ్రీరామ మధ్యే లిఖితం శ్రీరామచరితాదిదమ్ ॥ 24**

కృతమస్తి పృథక్ భిన్నం పురా వ్యాసాదిభిస్త్వితి ।
ఏతస్మాత్కారణాద్బాల సూచనార్థం విలిఖ్యతే ॥ 25

శ్రీరామేతి పృథక్ పత్రే సర్వత్ర జగతీతలే ।
అన్యత్తే కారణం వచ్మి తచ్ఛృణుష్వ శిశో లవ ॥ 26

అశుద్ధం లిఖితం యచ్చాజ్ఞానతో భ్రాంతితోఽపి హి ।
పత్రం తచ్చాతిశుద్ధం హి భవత్విితి మనీషయా ॥ 27

శ్రీరామేతి చ సర్వత్ర పత్రే పత్రే విలిఖ్యతే ।
యదకితం శ్రీరామేతి నామ్నా పత్రం తు లేఖకైః ॥ 28

జ్ఞేయం తచ్చాపి శుద్ధం హి గతదోషస్తు లేఖకః ।
భవత్యత్ర జగత్యాం హి సత్యం లవ వదామ్యహమ్ ॥ 29

ఇతి శ్రుత్వా గురోర్వాక్యం వసిష్ఠం ప్రణిపత్య చ ।
లవః స గతసందేహస్తూష్ణీమాసీన్ముదాన్వితాః ॥ 30

ఏకదా రఘునాథస్తు మంచకోపరి సంస్థితః ।
ముఖాత్తాంబూలస్య రసం ప్రథమం దోషకారకమ్ ॥ 31

త్యక్తుకామో న దదర్శ పాత్రం నిష్ఠీవనస్య సః ।
తస్యాంతికే స్థితా దాసీ నామ్నా వై సుగుణేతి చ ॥ 32

తాదృశం రామమాలోక్యం పాత్రం దూరం విలోక్య చ ।
కృత్వా పాత్రం స్వహస్తాభ్యామంజలావేవ తద్రసమ్ ॥ 33

రామేణ ముక్తమాస్యాచ్చ జగ్రాహ వేగవత్తదా ।
తతః సా ప్రాశనం రామోచ్ఛిష్టం దాసీ చకార తత్ ॥ 34

మహాప్రసాదం తం మత్వా దైవాల్లబ్ధం విచింత్య చ ।
తదాఽతితుష్టః శ్రీరామస్తస్యై తత్కర్మణాఽబ్రవీత్ ॥ 35

వరయస్వ వరం దాసీ యత్తే మనసి వర్తతే ।
తద్రామవచనం శ్రుత్వా దాసీ ప్రాహ రఘూత్తమమ్ ॥ 36

దీనివలన ముందరివారందరును ఎరుగుదురని ఇట్లు లిఖించుట సత్‌సాంప్రదాయమై ఉన్నది. అంతట లోకమున వేరుపత్రములలో నడుమ 'శ్రీరామ' అని కూడా లిఖింపబడును మరియు తప్పులు వ్రాయబడిన పత్రమున ఒప్పులనంది ఉండుగాక అనియును 'శ్రీరామ' అని పత్ర పత్రమునను వ్రాయు సంప్రదాయము గలదు. కావు శ్రీరామాంకిత పత్రము మిక్కిలి శుద్ధమైనదనిన వసిష్ఠ వచనముచేత లవుడు సంతసించి ఊరకే ఉండెను. (30)

## సుగుణ అను దాసి రాధయగుట

ఒకసారి శ్రీరాముడు మంచముమీద కూర్చుని, తాంబూలము వేసికొనుచు మొదట వచ్చునట్టి దోషకరమగు తమ్మను ఉమ్మివేయుటకు ఉమ్మి పాత్రము కొరకు చూచెను. అంత అచ్చట సేవించు చుండిన 'సుగుణ' యనుదాసి పాత్రము దూరమున్నదని యింగితమెరిగి చేతులుజోడించి తన దోసిడిలో ఆ తాంబూలరసమును పట్టెను. అంతతో ఊరుకున్నదా? లేదు. శ్రీరాముని ఎంగిలియనక దైవికముగా తనకు లభించిన మహాప్రసాదమని నమ్మి దానిని త్రాగెను. దాని భక్తికృత్యమును చూచి శ్రీరామస్వామి మిగుల ఆనందించి, "ఓసీ, దాసీ! నీవు మనస్సునకు తోచిన వరమును వేడుము," అని అనుగ్రహింపగా ఆమె,....

**ఏకపత్నీవ్రతం తేఽస్తి సాంప్రతం త్విహ జన్మని ।**
**జన్మాంతరే త్వయా సంగం వాంఛామి రఘునాయక ॥ 37**

**తత్తస్యా వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్ ।**
**యదాఽగ్రే కృష్ణరూపేణ గోకులేఽవతరామ్యహమ్ ॥ 38**

**తదా రాధేతి నామ్నీ త్వం గోపికాసు భవిష్యసి ।**
**తదా మయా చిరం క్రీడాం త్వం భోక్ష్యసి న సంశయః ॥ 39**

**తదా మమాతి ప్రీతా త్వం గోపికాసు భవిష్యసి ।**
**ఇతి దాసీ రామచంద్రాద్వరం లబ్ధ్వా తుతోష సా ॥ 40**

**అన్యచ్ఛృణు విష్ణుదాస రామచంద్రకథానకమ్ ।**
**యత్రోచ్యతే మయా తేఽగ్రే మహత్కౌతుకకారకమ్ ॥ 41**

**ఏకదా రాఘవః శ్రీమాన్ సభాయామాసనోపరి ।**
**సంస్థితో బంధుభిః పుత్రైర్మంత్రిభిః పురవాసిభిః ॥ 42**

ఏతస్మిన్నంతరే కశ్చిద్బ్రహ్మచారీ సమాయయౌ ।
యువా దండధరః శ్రేష్ఠః కమండులుకరః శుచిః ॥ 43

ఏణకృష్ణాజినధరః కాషాయవసనో వ్రతి ।
తం దృష్ట్వా రాఘవః శ్రీమానవతీర్య వరాసనాత్ ॥ 44

ప్రత్యుద్గమ్యాథ తం నత్వాఽఽసనే సముపవేశ్య చ ।
పూజయామాస విధినా ధేనుమగ్రే నివేద్య చ ॥ 45

తతః సంపూజితం విప్రం రాఘవో వాక్యమబ్రవీత్ ।
అద్య ధన్యోఽస్మ్యహం విప్ర యతస్తే దర్శనం మమ ॥ 46

కార్యమాజ్ఞాప్యతాం కించిద్యదర్థం భవతాఽఽగతమ్ ।
తద్రాఘవవచః శ్రుత్వా బ్రహ్మచారీ వచోఽబ్రవీత్ ॥ 47

వాల్మీకినా ప్రేషితోఽహం యస్మాత్తచ్ఛృణు రాఘవ ।
యష్టుకామో మహాయజ్ఞం స వాల్మీకిర్మహామునిః ॥ 48

త్వామాకారయితుం మాం త్వన్నికటం వగవత్తరమ్ ।
ప్రేషితవానతస్త్వం హి సీతయా బంధుభిః సహ ॥ 49

ప్రస్థాన కురు రాజేంద్ర ముహూర్తస్త్వద్య వర్తతే ।
ఏవం వదతి శ్రీరామం భూసురే సదసి స్థితే ॥ 50

"స్వామీ! తమకు ఏకపత్నీవ్రతముగలదు. ఈ జన్మమున నాకేమి ఫలము. జన్మాంతరమున నీతో సంగమమును కోరియున్నాను," అని వరమడిగెను. అందుకు రాముడు, "గో కులమున నేను శ్రీకృష్ణుడుగా అవతరించెదను. అప్పుడు నీవు **'రాధ'** అను పేరుగల గోపపత్నియై ఉండుము, అప్పుడు నాతో చిరకాలము సుఖింతువు, సందేహింపకుము. అప్పుడు నీవే గోపికలలో మిక్కిలి ప్రియురాలవగుదువు," అని అనుగ్రహింపగా ఆ దాసి వరమునంది ఆనందించెను. (40)

## శ్రీరాముడు రెండురూపములను ధరించుట

వినుము విష్ణుదాసా! శ్రీరామునియొక్క వింతయగు విశేష వృత్తాంతమును చెప్పుచున్నాను. ఏమనిన– ఒకప్పుడు శ్రీరామచంద్రస్వామి సమస్త పరివారముతో సింహాసనము అధిష్ఠించి ఉండగా అటుగా దండ, కమండులు, కష్ణాజిన, మౌంజి, మేఖల లు కలిగి తేజస్వియై ఉండు బ్రాహ్మణ వటు

ఒక్కడు అక్కడికి వచ్చెను. శ్రీమంతుడగు రాముడు వానిని జూచి, దిగి ఎదుటబోయి, నమస్కరించి తీసికొనివచ్చి, సముచితాసనమున కూర్చుండబెట్టి, సత్కరించి, విశ్రాంతినందిన విప్రవటువుతో, "నేను ధన్యుడనయితిని. మిక్కిలిశ్రమనంది వచ్చితిరి. ఎందుకై వచ్చితిరో ఆసంగతిని ఆజ్ఞాపింపుడు," అని అడిగెను. అందుకా విప్రుడు, "ప్రభువరా! శ్రీవాల్మీకి మునీంద్రునివద్ద నుండి వచ్చితిని. వారు నన్ను పంపిరి. ఎందుకనిన ఆ మునీంద్రులు గొప్పయజ్ఞమును ఆరంభించియున్నారు. దానికి మిమ్ములను పిలిచికొనిపోవుటకై వచ్చితిని. నేడే సుముహూర్తముగాన సమస్త పరివారముతోడ వెడలుము రాజేంద్రా!" అని చెప్పుచుండగా....

**సమాయాయౌ బ్రహ్మచారీ ద్వితీయో గాధిజాశ్రమాత్ ।**
**తం దృష్ట్వా పూర్వవద్రామః ప్రత్యుద్గమ్య ద్విజోత్తమమ్ ॥ 51**

**ఆసనేఽన్యే చోపవేశ్య పూజయామాస సాదరమ్ ।**
**తతస్తత్పురతః స్థిత్వా తం పప్రచ్ఛ రఘూత్తమః ॥ 52**

**యదర్థం శ్రమితోఽసి త్వం తన్మయాజ్ఞాప్యతాం మునే ।**
**తద్రామవచనం శ్రుత్వా బ్రహ్మచారీ వచోఽబ్రవీత్ ॥ 53**

**రామ త్వాం గాధిజేనాహం ప్రేషితోఽస్మి జవేన హి ।**
**యష్టుకామో మహాయజ్ఞం విశ్వామిత్రోఽస్తి రాఘవ ॥ 54**

**త్వం తేనాకారితశ్చాసి ప్రస్థానం కురు సత్వరమ్ ।**
**బ్రహ్మచారిణోస్తద్వాక్యముభయోః స రఘూత్తమః ॥ 55**

**శ్రుత్వా విహస్య ప్రోవాచ ద్విజాభ్యాం వై తథేతి చ ।**
**తదాశ్చర్యం జనాః ప్రాపుః ప్రోచుస్తే తు పరస్పరమ్ ॥ 56**

**కథమద్యోభయోః సాకం రామో గచ్ఛతి తన్మఖౌ ।**
**కేచిదూచూ రాఘవాయ కిమశక్యం తథాఽత్ర హి ॥ 57**

**యథా స్త్రీణాం వనే పూర్వం కథాఽస్మాకం హి దర్శనమ్ ।**
**యయా గతోఽస్తి లంకాయాః పురా భరతదర్శనే ॥ 58**

**భిన్నరూపేణ రామేణ సర్వేషామర్పితం పృథక్ ।**
**తద్వదత్రాపి ద్వివిధా భూత్వా గత్వా చ తన్మఖౌ ॥ 59**

**కిమాశ్చర్యమిదం చాద్య కిమశక్యం పరాత్మని ।**
**ఏవం వదత్సు పౌరేషు లక్ష్మణం ప్రాహ రాఘవః ॥ 60**

**అద్యైవాహం గమిష్యామి భోజనానంతరం బహిః ।**
**వాసోగేహాని నేయాని బహిః సేనాం ప్రచోదయ ॥ 61**

**ఆజ్ఞాపనీయం వాద్యానాం ధ్వనిం కర్తుం హి సేవకాన్ ।**
**తద్రామవచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః ॥ 62**

అదే సమయానికి విశ్వామిత్రాశ్రమమునుండి ఇంకొక బ్రహ్మచారి వచ్చేసెను. శ్రీరాముడు ఆ బ్రహ్మచారిని కూడా మునుపటి వలె గౌరవించి, సత్కారములచే పూజించి, "ఎందుకింత శ్రమనంది వచ్చుట? నేనేమి చేయవలయును? ఆజ్ఞాపింపదగును?" అని అడిగెను. అందుకతడు, "రామప్రభూ! విశ్వామిత్ర మునీంద్రుడు మహాయజ్ఞమును ఆరంభించి త్వరగా మిమ్ములనందరిని పిలచికొని రమ్మని నన్ను పంపినందున వచ్చితిని. వేగమే వెడలుదము," అని చెప్పగా ఆ బ్రహ్మచారులిరువురియొక్క వచనములను విని వినోదముగా నవ్వుచు వారితో, "అట్లే కాని"మ్మని ఉత్తరమిచ్చెను. అపుడు జనులు ఒకరికొకరు ఇట్లు మాట్లాడుకొనుచు ఆశ్చర్యపడిరి. వీరిరువురితోడ శ్రీరాముడు ఎట్లు రెండు యజ్ఞములకు పోవును? అని కొందరు, శ్రీరామునికి ఏమి తక్కువ? ఎట్లు కావలసినను చేయునని కొందరు, వనమున స్త్రీలకు అనేక రూపములు కనపడలేదా? అట్లే ఇప్పుడు మనకును కనుబడునని కొందరు, మునుపు లంకనుండి వచ్చెనే అప్పటి భరతదర్శనమున భిన్నరూపుడగు రాముడు అందరిని ఒప్పించినట్లే ఇప్పుడును అని కొందరును, ఇదియేమి ఆశ్చర్యము? పరమాత్మకు శక్యం కానిదేమున్నది? అని కొందరు పలుకుచుండిరి. ఇట్లుండగా శ్రీరాముడు లక్ష్మణునితో, "నేడే భోజనానంతరము ప్రయాణము కావలసినది. సేనలు సిద్ధమగునట్లు ఆజ్ఞాపింపుము. మంగళవాద్యములు మ్రోగుగాక!" అని ఆజ్ఞాపించెను. అట్లే లక్ష్మణుడు సేనాపతి మొదలగువారిని ఆజ్ఞాపింపగా పటగృహము (షామియానా)లు వెలువడినవి. ఊరిలో అంతట ప్రస్థాన మంగళ వాద్యములు మ్రోగినవి.

**కారయామాస వాద్యానాం ధ్వనిం దూతైశ్చ సంభ్రమాత్ ।**
**సైన్యం ప్రచోదయామాస బహిర్వాసోగృహాణ్యపి ॥ 63**

**నేతుమాజ్ఞాపయామాసుర్దూతాస్తే నిన్యురాదరాత్ ।**
**తతో రామోఽపి విప్రాభ్యాం గృహం గత్వా విదేహజామ్ ॥ 64**

సర్వం వృత్తం నివేద్యాథ కృత్వా విప్రైర్హి భోజనమ్ ।
సీతాం చ కరిణీపృష్ఠే బంధునాఽఽరోహయత్ ప్రభుః ॥ **65**

పుష్పకే పౌరనారీశ్చ కరిణీషూర్మిలాదికాః ।
సమారోహయచ్ఛ్రీరామః స్వయం తస్థౌ గజోపరి ॥ **66**

లక్ష్మణాద్యా గజేష్వేవ తే సమారురుహుస్తదా ।
నినేదుశ్చాథ వాద్యాని ననృతుర్వారయోషితః ॥ **67**

తుష్టువుర్మాగధాద్యాశ్చ ప్రజగుః సుస్వరం నటాః ।
ఏవం సమాయయౌ రామస్తదా వాసోగృహాణి సః ॥ **68**

తాం రాత్రిం సమతిక్రమ్య ప్రభాతే రఘునందనః ।
స్నాత్వా నిత్యవిధిం కృత్వా గజారూఢోఽభవత్పునః ॥ **69**

క్రోశద్వయం తతో గత్వాఽగ్రే ద్వౌ మార్గౌ నిరీక్ష్య చ ।
ససైన్యే ద్వే నిజే దేహే చకార రఘునందనః ॥ **70**

తదా ద్వయోర్మార్గయోశ్చ ససైన్యౌ సీతయా యుతౌ ।
పుత్రాభ్యాం బంధుభిర్యుక్తౌ ద్వౌ రామౌ సకలా జనాః ॥ **71**

దదృశుః పుష్పకే ద్వే చ ద్వౌ జాతౌ బ్రహ్మచారిణౌ ।
వాల్మీకీయో బ్రహ్మచారీ త్వేకః స స్వం గురుం యయౌ ॥ **72**

విశ్వామిత్రాధ్వరం చాన్యః శ్రీరామేణ ముదా యయౌ ।
గాధిజేయో బ్రహ్మచారీ త్వేకః స స్వం గురుం యయౌ ॥ **73**

వాల్మీకేరధ్వరం చాన్యః శ్రీరామేణ యయౌ ముదా ।
ఏవం తే సారమేయాంతాః సర్వేదేహద్వయాని హి ॥ **74**

సేనలు సర్వసన్నద్ధములయ్యె. సేవక పరివారము సముచిత కార్యదక్షమైయొప్పె. అంత ఆ రఘువీరుడు సీతాంతఃపురమునకు వచ్చి, ఈ సంగతిని చెప్పి, ఆమెతో భుజించి వెడలెను. సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి మొదలగు రాజకాంతలు ఏనుగులమీదను, పౌరనారులు పుష్పకమునను,

తాను, లక్ష్మణాదులు కూడా అందరును ఏనుగులమీదను ఎక్కి పోవునపుడు నృత్త గీత వాద్య వినోదములు జరిగెను. వందిమాగధులు పొగడిరి. ఇట్లు కొంతదూరము వచ్చి పటగృహాము (షామియానా)లలో ఆ రాత్రి వసించి, ప్రొద్దున లేచి శ్రీరాముడు స్నానముజేసి, నిత్యకర్మానంతరమున రెండు క్రోసులు యథాపూర్వముగా ప్రయాణమై వచ్చి అచ్చట రెండు మార్గములను గమనించి, తన సైన్య పరివారము సమస్తమును రెండేసి రూపముల నందునట్లు నిజమాయాశక్తి జూపించెను. అంత ఆ రెండు మార్గములలో శ్రీరాముడు సకలసైన్య పరివారముతో సీతాయుతుడై వెడలెను. రెండు పుష్పకములు రెండుదారులలో వెడలె. ఆ బ్రహ్మచారులు కూడా రెండురూపములు పొందిరి. ఆ యిరువురును ఇచ్చటికి, అచ్చటికిని కూడా వెడలిరి. ఇట్లే శ్రీరాముడు మొదలు సేనలో ఉండెడు కుక్కపిల్లవరకు అంతట అందరును రెండురూపములు పొందిరి. పిదప సీతారాములు వాల్మీకి మరియు విశ్వామిత్ర ఆశ్రమములకు, రెంటికిని సపరివారముగా పోయి ఆ మునీంద్రుల ప్రత్యుద్గమనాది సకల సత్కారపూర్వములను పొంది, వారి యజ్ఞములు పరిపూర్ణమగు నంతవరకు అచ్చట వసించుచుండిరి. యజ్ఞములు ముగిసిన తరువాత తిరిగి అయోధ్యకు ఆ బ్రహ్మచారులతోడ వచ్చిరి.

**నిజాని దదృశుస్తత్ర విస్మయావిష్టమానసాః ।**
**ఏవం తౌ రఘువీరౌ హి తయోర్మున్యోస్తదాశ్రమే ॥ 75**

**ససైన్యౌ సీతయా యుక్తౌ బంధుపుత్రసమన్వితౌ ।**
**జగ్మతుర్ద్వౌ మునిభ్యాం హి ప్రత్యుద్గమ్యాతిపూజితౌ ॥ 76**

**తయోర్యాగౌ విధాయాథ పరిపూర్ణౌ పునః పురీమ్ ।**
**సమాజగ్మతుః శ్రీరామౌ ససైన్యౌ పూర్వవన్ముదా ॥ 77**

**యత్ర ద్వే నిజదేహే వై కృతే తత్ర రఘూత్తమౌ ।**
**సమాగత్య పునశ్చైకం నిజదేహం చకార సః ॥ 78**

**వాల్మీకీయో బ్రహ్మచారీ విశ్వామిత్రద్విజస్తథా ।**
**భిన్నదేహే త్వేకరూపం భజతస్తౌ తదా ద్విజౌ ॥ 79**

**ససైన్యం పుష్పకం చాపి బభూవైకం తు పూర్వవత్ ।**
**తతః శ్రీరామచంద్రః స వివేశ నగరీం నిజామ్ ॥ 80**

తదా నినేదుర్వాద్యాని ననృతుర్వారయోషితః ।
పౌరనార్యో విమానస్థా వవర్షుః పుష్పవృష్టిభిః ॥ **81**

తుష్టువుర్మాగధాద్యాశ్చ ప్రజగుస్తే నటాదయః ।
ఏవం నానాకౌతుకాని పశ్యన్మార్గే శనైః శనైః ॥ **82**

యయౌ నిజగృహం రామః సభాయాం సవివేశ హ ।
సీతాఽపి నిజగేహం సా సంవివేశోర్మిలాదిభిః ॥ **83**

ఏవం భూసుర రామేణ కౌతుకాని మహాంతి చ ।
అమానుషాణి యాన్యత్ర కృతాని చ సహస్రశః ॥ **84**

వాల్మీకినా విస్తరేణ వర్ణితాని హి కృత్స్నశః ।
సారం సారం మయా తేభ్యః సంగృహ్యాథ కథానకమ్ ॥ **85**

తవాగ్రే కథ్యతే శిష్య సంక్షేపేణాజ్ఞయా ప్రభోః ।
త్వం ధన్యోఽపి యదర్థం చ రామేణాజ్ఞాపితస్త్వరమ్ ॥ **86**

వక్తుం స్వచరితం పుణ్యం రమ్యమానందదాయకమ్ ।
వాల్మీకిశ్చాపి ధన్యః స భావి సంవాదమావయోః ॥ **87**

యః పూర్వం విరచితవాన్ స్వీయకాలేఽత్ర భూతవత్ ।
తథా రామస్య చరితం పూర్వం రామావతారతః ॥ **88**

ఏవం సంవర్ణితం కృత్స్నం గోప్యం యచ్చ కృతం రహః ।
న వాల్మీకోపమః కశ్చిత్కవిర్భూతో భవిష్యతి ॥ **89**

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, దేహద్వయాకరణం నామ, ఏకవింశస్సర్గః ॥

వాల్మీకి, విశ్వామిత్ర మహర్షుల ఆశ్రమములనుండి తిరిగి వచ్చునప్పుడు మునుపెచ్చట రెండు రూపములు అయ్యెనో తిరిగి వచ్చునప్పుడు అచ్చటనే ఎంతో ఆశ్చర్యకరముగ ఏకరూపము సిద్ధించె. పుష్పకము ఒకటయ్యె. సైన్యము ఒక్కటయ్యె. అంతయు ఒకటిగా ఎంతయో వింత కలిగె. అంత ఆ రామచంద్రస్వామి తన రాజధానిని ప్రవేశించి ఊరి ఉత్సవములను తిలకించుచు వచ్చి, రాజమందిరమును తన ఆగమనముచే అలంకరించెను. సీతమ్మయును తన అంతఃపురమునకు వెడలెను.

విష్ణుదాసా! ఇట్లు రామునిచే మానవాతీత కృత్యములు అనేకములు చూపబడినవి. వాటినన్నిటిని వాల్మీకిముని అభివర్ణించి ఉన్నాడు. వాటిలోని సారాంశములను గ్రహించి సంగ్రహముగా ప్రభువుయొక్క ఆజ్ఞప్రకారము చెప్పుచున్నాను. ఎప్పుడు శ్రీరామాజ్ఞనంది చెప్పుచున్నానో అప్పుడు నీవేధన్యుడవు. శ్రీరాముడు ఆనందదాయక తనచరిత్రమును అభివర్ణించుటకు నాకు అనుజ్ఞ ఇచ్చియున్నాడు. మనయొక్క ఇప్పటి సంవాదమును మునుపె తనకాలమున గతవిషయమును వలె విరచించెను. కావున ఆ ముని ధన్యుడు. అట్లే రామావతారమునకు మునుపు ఆచరిత్రను సమగ్రముగా అభివర్ణించి రహస్యముగా పెట్టిన వాల్మీకితో సాటియైన కవి మరియొక్కడు లేడు.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్య కాండలో, ఉత్తరార్ధములో, శ్రీరాముని రెండు రూపములను వర్ణించు 21వ సర్గ ముగిసినది.**

# ద్వావింశః సర్గః-22వ సర్గ

## సీతాదేవి తులసీపత్రమును అతికించుట

శ్రీరామదాస ఉవాచ

ఇదానీం రామచంద్రస్య లీలాకౌతుకముత్తమమ్ ।
అన్యద్రమ్యం వర్ణ్యతే హి మయా తచ్ఛృణు సాదరమ్ ॥ 1

ఏకదా రాఘవస్తస్థౌ సభాయామాసనోపరి ।
బంధుభిర్మంత్రివర్గైశ్చ పౌరైర్జానపదైః సహ ॥ 2

పుత్రాభ్యాం చ సుహృద్భిశ్చ మిత్రైర్మంత్రిజనైః సహ ।
ఏతస్మిన్నంతరే భూరికీర్తినా సుహృదా చరైః ॥ 3

ద్రాక్షాఫలాదిభిః పూర్ణాస్తయా పుష్పైః సుపూజితాః ।
కరండికాః ప్రేషితాశ్చ రాఘవార్థం సహస్రశః ॥ 4

తాః సర్వా రాఘవో దృష్ట్వా ప్రేషయామాస జానకీమ్ ।
యుక్తా సఖీభిః సీతా సా క్రీడాశాలాస్థితా ముదా ॥ 5

దృష్ట్వా కరండికాః సర్వాస్త్వేకాముద్ఘాటయత్తదా ।
తస్యాం తామరసాన్యేన దృష్ట్వా రమ్యాణి జానకీ ॥ 6

కరేణాదాయ పద్మం చ రాఘవాయార్పణం వినా ।
సా తత్సుగంధం జగ్రాహ వారం వారం ముదాన్వితా ॥ 7

కరండికా పూర్వవచ్చ సమాచ్ఛాద్య విదేహజా ।
స్థాపయామాస గేహేషు సర్వాస్తాశ్చ కరండికాః ॥ 8

తద్వృత్తం రామచంద్రోఽపి సర్వం జ్ఞాత్వా సభాస్థితః ।
చిత్తే విచారయామాస వారం వారం ముదాన్వితః ॥ 9

సీతయేదం కృతం కర్మ యోగ్యం భువి స్మృతం న హి ।
యన్మయా పతినాఽభుక్తో పద్మమాస్వాదితం తయా ॥ 10

అగ్రేఽష్వేవం స్త్రియః సర్వాః కరిష్యంత్యంత్ర వై భువి ।
సీతాదర్శితమార్గేణ తస్మాచ్ఛిక్షాం కరోమ్యహమ్ ॥ 11

ఏవం మనసి నిశ్చిత్య తతః స రఘునందనః ।
తూష్ణీమేవ గృహం గత్వా పూర్వవజ్జానకీం ముదా ॥ 12

రంజయామాస వివిధైర్నానాక్రీడాదికౌతుకైః ।
సీతాఽపి పేటికాః సర్వా రాఘవాగ్రే సహస్రశః ॥ 13

ఆనీయ దర్శయామాస ఫలపుష్పాదిపూరితాః ।
రామోఽపి దృష్ట్వా తాః సర్వాః సముద్ఘాట్య పృథక్ పృథక్ ॥ 14

ప్రేషయామాస బంధూనాం గేహేషు దశ పంచ చ ।
ఫలాదీనాం పేటికాశ్చ నానాచిత్రవిచిత్రితాః ॥ 15

## శ్రీ సీతారాములకు శ్రుతకీర్తి పుష్పఫలాదులను పంపుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, “ఓ విష్ణుదాసా! వినుము. ఇప్పుడు శ్రీరామునియొక్క లీలావినోదకరమగు రమ్య చరితమును అభివర్ణించెదను.

ఒకసారి శ్రీరాముడు బంధు, మిత్ర, పుత్ర, మంత్రి, జానపదాది సకల పరివారముతో సభలో సుఖాసీనుడై ఉండగా, శ్రుతకీర్తియను మిత్రుడు కమలాది పుష్పములచే, ద్రాక్షాది ఫలములతో నిండిన పెట్టెలను వేలకొలదిగా భటులచేత ఇచ్చి పంపెను. వారు తెచ్చి శ్రీరామసన్నిధిలో అర్పించిరి. శ్రీరాముడు చూచి, వాటినన్నిటిని సీతవద్దకు పంపెను. చెలులతో క్రీడాగారమునందు ఉండిన జానకీదేవి ఆ పెట్టెలను చూసి, ఒకటి తెరిచెను. అందులో మనోహరములైన పుష్పములు కనబడినవి. అప్పుడు సీత వాటిలో ఒక తామరపూవును తీసుకుని పలుమార్లు వేడుకతో ఆఘ్రాణించెను. పిదప ఆపెట్టెను అట్లే మూసిపెట్టి పెట్టెలనన్నింటిని గదిలో పదిలపరచెను. సభాసీనుడగు శ్రీరాముడు ఆ సంగతిని తన జ్ఞానదృష్టితో తెలిసికొని, పలుమార్లు తన మదిని, “పతి అనుభవింపక మునుపు ఏ వస్తువును సతి అనుభవింపరాదు. ఇట్లుండ సీత చేసిన పని తగదు. నేను అనుభవింపకమునుపే తామరను వాసన చూసెను. దీనిని చూచి ఇకమీదను స్త్రీలు ఈ పద్ధతిని పాటించెదరు. కావున దీనికి తగిన శిక్ష వేసెదను,” అని ఆలోచించి అంత ఏమియు ఎఱుగనివాడై ఎప్పటివలెనే అంతఃపురమునకు వచ్చెను. యథాప్రకారము సీతతోడ వివిధవినోద క్రీడలనంది ఆనందించుచుండెను. జానకీదేవి శ్రుతకీర్తి

పంపిన ఆ పెట్టెలను తెప్పించి శ్రీరాముని ఎదుట పెట్టగా, అతడు వాటిని వారివారికి తగినట్లు తమ్ములకు, తల్లులకు, పుత్రులకు, మిత్రులకు, మంత్రులకు, మునులకు, పౌరులకు, సేవక దాస్యాది పరివారమునకును 10-5-8 ఇట్లు పంపించెను.

**మాతౄణాం సకలానాం చ గృహేష్వపి తథా పునః ।**
**పుత్రయోః సుహృదాం చాపి మంత్రిణాం చ గురోస్తథా ॥ 16**

**పౌరాణాం చాపి గేహేషు సేవకానాం గృహేష్వపి ।**
**దాసీభ్యశ్చ శుభా దత్త్వా పేటికాః సప్త పంచ చ ॥ 17**

**సీతాయై శతశో దత్త్వా ముదా తాభ్యో రఘూత్తమః ।**
**ఫలాని దశ పంచాష్ట స్వయం భుక్త్వా తతః పరమ్ ॥ 18**

**పద్మాదీని సుపుష్పాణి విభజ్య పూర్వవత్పునః ।**
**సీతాయై శతశో దత్త్వా స్వయమంగీచకార సః ॥ 19**

**అజ్ఞాత ఇవ తద్వృత్తం గోపయామాస చేతసి ।**
**అథైకదా జనకజా హరిదిన్యాముపోషణమ్ ॥ 20**

**కృత్వాఽపరే దినే స్నాత్వా యయౌ వృందావనాంతికమ్ ।**
**తులసీం పూజయిత్వా తాం సా చకార ప్రదక్షిణాః ॥ 21**

**ఏతస్మిన్నంతరే సీతా నిరాహారా శ్రమాన్వితా ।**
**త్యక్త్వా ప్రదక్షిణామార్గం కించిదేవ చచాల సా ॥ 22**

**చలితాయాశ్చ సీతాయాః పల్లవేన హి వాససః ।**
**పత్రమేకం తులస్యాశ్చ పపాత భువి వై తదా ॥ 23**

**తత్పత్రం జానకీ దృష్ట్వా ద్వాదశ్యాం త్రుటితం శుభమ్ ।**
**జ్ఞాత్వాఽధర్మః కృతశ్చేతి భయభీతాఽభవత్తదా ॥ 24**

**తతః సా తత్కరేణైవ గృహీత్వా పత్రముత్తమమ్ ।**
**నత్వా బృందావనే సీతా చిక్షేప పరమాదరాత్ ॥ 25**

**తతః ప్రదక్షిణాః కృత్వా ప్రార్థయిత్వా ముహుర్ముహుః ।**
**తులసీం సా యయౌ గేహం రంజయామాస రాఘవమ్ ॥ 26**

**ఏతస్మిన్నంతరే తత్ర నారదశ్చ సమాయయౌ ।**
**వీణావాద్యస్వనేనైవ కుర్వన్కీర్తనముత్తమమ్ ॥ 27**

**పాలయ మాం దీనమితి రాఘవేతి పునః పునః ।**
**పాలయ మాం దీనమితి మనుం పంచదశాక్షరమ్ ॥ 28**

**కీర్తయామాస స మునిర్వారం వారం ముదాన్వితః ।**
**కలంకంఠస్వరేణైవ మహాపాతకనాశనమ్ ॥ 29**

**పాలయ మాం దీనం రాఘవ పాలయ మాం దీనమ్ ॥**

**ఇతి మంత్రః ।**

**తం మునిం రాఘవో దృష్ట్వా ప్రత్యుద్గమ్యాథ భక్తితః ।**
**నత్వాఽఽసనే సన్నివేశ్య పూజయామాస సాదరమ్ ॥ 30**

సీతమ్మకు 106 పెట్టెలనిచ్చి, తానుకూడా ఒక పెట్టెనుండి పది పండ్రెండు ఫలములను తీసుకుని భక్షించి, పిదప పుష్పములను అట్లే ఇచ్చి, సీతతోడ తాను కూడా స్వీకరించెను. ఆ సంగతిని తెలియనివానివలె మనస్సునందు నిలిపియుండె. అంత ఒక ఏకాదశియందు జానకీదేవి ఉపవాస వ్రతమును ఆచరించి, మరునాడు స్నానముజేసి, బృందావనము వద్దకు వెడలి, తులసీదేవికి ప్రదక్షిణము చేయునపుడు, ఉపవాసముచే బడలికగాయున్నందున అక్కడనే తిన్నగా చుట్టుతిరిగెను. అట్లు చలించుటలో ఆమె వస్త్రము తగిలి ఆ చెట్టులోని ఒక పత్రము తెగి నేలపైబడెను. అంత ఆమె, “శుభదినమగు ద్వాదశియందు తులసీపత్రము చెట్టును వీడుట మిక్కిలి అధర్మమయ్యె” అని మక్కువతో అక్కడనే ఆ యాకునెత్తి మ్రొక్కులిడి, తులసీదేవిని ప్రార్థించి అంతఃపురమునకు వెడలి రామునితో రంజించుచుండెను. అప్పుడు నారద మునీంద్రుడు **“పాలయమాం దీనం రాఘవ! పాలయమాం దీనమ్”** అను 15 అక్షరముల శ్రీరామమంత్రమును గానము చేయుచు వచ్చెను. దురితపరిహారకమగు గానమును వినిన శ్రీరాముడు; ఆ మునీంద్రుని రాక తెలిసికొని భక్తితో స్వాగతించి, నమస్కరించి, ఆసనమున కూర్చుండబెట్టెను.

తతః ప్రక్షాల్య తత్పాదౌ సీతయా రఘునందనః ।
ధేనుం నివేద్య గంధాద్యైః పూజ్య తం మునిపుంగవమ్ ॥ 31

హేమపాత్రం భోజనార్థం మునేరగ్రే నివేశ్య చ ।
పరివేషణార్థం శ్రీరామస్త్వరయామాస జానకీమ్ ॥ 32

సీతాఽపి కామధేనుత్యవరాన్నాని విగృహ్యసా ।
హేమపాత్రే యయౌ వేగాత్పాత్రేషు పరివేషణమ్ ॥ 33

కర్తుం కంకణమంజీరకింకిణీనూపురస్వనా ।
తాం దృష్ట్వా నారదః సీతాం ప్రాహ శ్రీరాఘవం తదా ॥ 34

రామ రాజీవపత్రాక్ష నాహం సీతాసమర్పితైః ।
దివ్యాన్నైరశనం చాద్య కరిష్యామి రఘూత్తమ ॥ 35

తన్మునేర్వచనం శ్రుత్వా సీతాఽఽసీచ్చకితా తదా ।
అజ్ఞాత ఇవ రామోఽపి సంభ్రమేణ మునిం తదా ॥ 36

పప్రచ్ఛ కారణం వ్యగ్రః సర్వకర్తా స్వయం ప్రభుః ।
కిం కారణం వద మునే కిమర్థమనయాఽర్పితైః ॥ 37

అన్నైస్త్వం భోజనం నాద్య కరోషి మునిపుంగవ ।
ఇతి రామవచః శ్రుత్వా నారదో వాక్యమబ్రవీత్ ॥ 38

నారద ఉవాచ

సీతయాఽద్య కృతం పాపం కిం త్వం వేత్సి న వై ప్రభో ।
యది త్వం నైవ జానాసి తర్హి శృణు వదామి తే ॥ 39

ద్వాదశ్యాం తులసీపత్రమనయాఽద్య నికృంతితమ్ ।
యద్యసత్యం తర్హి పశ్య గత్వా వృందావనే ప్రభో ॥ 40

సంక్రమేషు చతుర్దశ్యో ర్ద్వాదశ్యోః పాతపర్వసు ।
తులసీం న హరేత్సంధ్యోర్ భృగ్వంగారాపరాహ్ణకే ॥ 41

నష్టే సూర్యేందుగ్రహణే ప్రసూతిమరణే తథా ।
తులసీ యే నికృతంతి తే ఛిందతి హరేః శిరః ॥ **42**

ద్వాదశ్యాం తులసీపత్రం ధాత్రీపత్రం తు కార్తికే ।
లునాతి యో నరో గచ్ఛేన్నిరయానతిగర్హితాన్ ॥ **43**

అకాలే తులసీపత్రం ఛేదయంత్యః స్త్రియః పుమాన్ ।
పత్రమేకం బ్రహ్మహత్యాసమమాహుర్మనీషిణః ॥ **44**

ఏవం తు వచనం సర్వైర్మునిభిర్హి ప్రకీర్త్యతే ।
పురుషాణామయం దోషస్తత్ర స్త్రీణాం కథాఽత్ర కా ॥ **45**

సీతతో కలసి శ్రీరాముడు నారదమునీంద్రునికి పాదప్రక్షాళనముచేసి, మధుపర్క, గంధాదులచే పూజించి, బంగారు పళ్ళెము పెట్టి వడ్డించుటకు సీతను త్వరపరచెను. ఆమెయును కంకణ మంజీర కింకిణీ కలనాదములతో కామధేనువు ప్రసాదించిన దివ్యాన్నములను తీసికొని వచ్చెను. ఆమెను జూచి నారదుడు రామునితో, "సీతమ్మ వడ్డించినట్లయిన నేను భుజించను," అనెను. అంత ఆ జానకీదేవి అప్పుడు తొట్రుపాటుపడెను. రాముడును సర్వజ్ఞుడై స్వయంప్రభువు అయినను తెలియని వానివలె సంభ్రాంతితో మునిని జూచి, "మునీంద్రా! ఎందుకిప్పుడు భుజించవు? కారణము చెప్పుము," అని అడిగెను. అందుకు మునీంద్రుడు, "రఘునాథా! నీ వెరుగవా? చెప్పెదను వినుము. ద్వాదశినాడు తులసీపత్రమును ఈమె ఛేదించినది కావున ఈమె పాపాత్మురాలు అయ్యె. ప్రత్యక్షముగా నీవు పోయి బృందావనమున విలోకింపుము యథార్థము తెలియును.

సూర్యసంక్రమణ కాలములోను, చతుర్దశియందును, ద్వాదశియందును, పర్వకాలములలోను, వ్యతీపాతాది ఘోరకాలములలోను, సూర్య చంద్ర గ్రహణములలోను, మంగళవారముననను, శుక్రవారము నను, సంధ్యలలోను, మిట్టమధ్యాహ్నముననను, జాత అశౌచములలోను తులసిని త్రుంచువారు విష్ణుమూర్తి తలను నరికినట్లుగా చెప్పబడినది.

ద్వాదశినాడు తులసిని, కార్తీకమాసమున ఉసిరికను కత్తిరించినవాడు నరకమును పొందును. స్త్రీ పురుషులెవరైనను అకాలమున తులసీపత్రము నొకదానిని త్రుంచిన వారి పాపము బ్రహ్మహత్యతో సమమైనదని శాస్త్రములు చెప్పుచున్నవి.

ఏతన్నిమిత్తం శ్రీరామ సీతయా పరివేషితైః ।
పరాన్నైర్భోజనం నాద్య కరిష్యామి వ్రతస్థితః ॥ **46**

తన్మునేర్వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ తం పునః ।
మునే త్వమేవ సీతాం మే పూతాం కర్తుమిహార్హసి ॥ **47**

వరదానం వ్రతం వాఽపి యేన పూతా భవేత్ క్షణాత్ ।
త్వామహం ప్రార్థయామ్యద్య స్వీయం పల్లవముత్తమమ్ ॥ **48**

ప్రసార్య శిరసా చాపి నమస్కృత్య పునః పునః ।
తద్రామవచనం శ్రుత్వా నారదో వాక్యమబ్రవీత్ ॥ **49**

బ్రహ్మహత్యాదిపాపానాం నిష్కృత్యర్థం మునీశ్వరైః ।
ప్రాయశ్చిత్తాని చోక్తాని సంతి నానావిధాని చ ॥ **50**

ద్వాదశ్యాం తులసీపత్రచ్ఛేదనాఘప్రశాంతయే ।
ప్రాయశ్చిత్తం మయా నైవ దృష్టం రాఘవసత్తమ ॥ **51**

ఉపాయస్త్వేక ఏవాత్ర వర్తతే రఘునందన ।
పాతివ్రతబలాత్సీతా పత్రం తత్తులసీం పునః ॥ **52**

యోజయిష్యతి మేఽగ్రేఽద్య తర్హి పూతా భవిష్యతి ।
క్షణాదేవ న సందేహః సత్యమేవ వచో మమ ॥ **53**

తన్మునేర్వచనం శ్రుత్వా రామః సీతాం వ్యలోకయత్ ।
తదా సీతాఽబ్రవీద్వాక్యం శృణు బ్రహ్మసుతోత్తమ ॥ **54**

అద్యాహం యోజయిష్యామి పత్రం తత్తులసీం పునః ।
పాతివ్రత్యబలేనైవ తవాగ్రే పశ్య కౌతుకమ్ ॥ **55**

ఇత్యుక్త్వా జానకీ దేవీ తత్పాత్రమన్నపూరితమ్ ।
పాకస్థానే పునర్నీత్వా స్థాపయామాస వేగతః ॥ **56**

తతో వృందావనం సీతా యయౌ నూపురనిస్స్వనా ।
నారదో రామచంద్రాద్యా యయుర్వృందావనం ప్రతి ॥ **57**

**తదా తా ఊర్మిళాద్యాశ్చ చంపికాద్యాః స్త్రియో యయుః ।**
**లక్ష్మణాద్యా బంధవశ్చ కుశశ్చాథ లవస్తథా ॥ 58**

**తేషాం మధ్యగతా సీతా తదా వృందావనస్థితా ।**
**నత్వా తాం తులసీం భక్త్యా ప్రాహ వాక్యం సఖీయుతా ॥ 59**

ఈమె దోషము చేసినది గాన నా వ్రతలోపమగుటచే ఈమె వడ్డించితే నేను భుజించను," అని చెప్పెను. అంత ఆ రామభద్రుడు, "స్వామీ! మీరే దీనికి తగిన ప్రాయశ్చిత్తమును విధించి దానమిప్పించియో, వ్రతము చేయించియో, ఎట్లో నా సతిని పరిశుద్ధురాలిని చేసి రక్షింపుము," అని పాదములమీదపడి ప్రార్థించెను. అపుడు నారదుడు, "మునీంద్రులు బ్రహ్మహత్యాది సమస్త పాపములకును తగిన ప్రాయశ్చిత్తములను చెప్పియున్నారు. ఈ పాపమునకేమియును లేదు. అయిన నాకొకటి తోచుచున్నది. ఈమె పాతివ్రత్య మహిమచే ఆ తులసీ పత్రమును మరల చెట్టుకు అతుకునట్లు చేసితే చాలు ఇదియే ఇందుకు తగిన యుక్తి," అని ఆనతిచ్చెను. అంత ఆ సీతమ్మ, "బ్రహ్మపుత్రా! చూడు ఇదిగో ఇప్పుడే నా పాతివ్రత్య ప్రభావముచే నీవు చెప్పినట్లు చేసెదను," అని చెప్పి వడ్డన పాత్రలను వంటయింటిలో పెట్టి, బృందావనమువద్దకు వచ్చెను. నారదుడు శ్రీరాముడు మొదలగు వారును వచ్చిరి. ఊర్మిళా, చంపికాది స్త్రీలు, లక్ష్మణ లవకుశాది పురుషులు వచ్చిరి. అప్పుడు సఖులతో ఉండు సీతమ్మ భక్తితో తులసిమొక్కకు నమస్కరించి, ఇట్లనెను....

**భో భో తులసి మద్వాక్యం శృణుష్వాద్య సుశోభనే ।**
**పాతివ్రత్యబల పూర్ణం మయి యద్యస్తి పావనమ్ ॥ 60**

**తర్హ్యస్య తవ పత్రస్య త్వయి సంధిర్భవిష్యతి ।**
**ఏవముక్త్వా జానకీ సా యావత్పశ్యతి వై పురః ॥ 61**

**తావత్పత్రం తులస్యాం తత్సంధిం నైవ గతం తదా ।**
**తదా విషణ్ణా సా సీతా బభూవ చకితాఽపి చ ॥ 62**

**తదా దేవాః సగంధర్వా యక్షా నాగాః సకిన్నరాః ।**
**గుహ్యకా ఋషయః సర్వే తద్ద్రష్టుం కౌతుకం యయుః ॥ 63**

**తతః సీతాం విషణ్ణాం తాం దృష్ట్వా స నారదో మునిః ।**
**ఏకాంతే జానకీం నీత్వా బోధయామాస సాదరమ్ ॥ 64**

శృణ్వత్ర కారణం సీతే సర్వం త్వాం ప్రవదామ్యహమ్ ।
పతివ్రతాభిర్నారీభిర్వినా స్వపతినా ముదా ॥ **65**

పుష్పాదీనాం సుగంధోఽపి నావఘ్రాహ్యః కదాచన ।
సోఽత్రావఘ్రాహితః పూర్వం ముదా తామరసస్య చ ॥ **66**

తద్బుద్ధ్వా రామచంద్రేణ మయేయం రచితాఽద్య హి ।
తదిచ్ఛయా తులస్యాశ్చ తత్పత్రం పతితం భువి ॥ **67**

త్వద్వస్త్రపల్లవాగ్రేణ శిక్షాం కర్తుం తవాత్ర హి ।
రామస్యాంతర్గతం జ్ఞాత్వా దోషారోపః కృతస్త్వయి ॥ **68**

మయా సీతే క్షమస్వాద్య మా క్రోధం భజ మాం ప్రతి ।
నారీణాముపకారార్థం తేన త్వామద్య శిక్షితమ్ ॥ **69**

నోచేత్త్వద్దర్శితపథా స్త్రియః సర్వాః పతిం వినా ।
ఏవమేవాచరిష్యంతి నానాభోగాన్ముదాన్వితాః ॥ **70**

ఇదానీం శృణు మద్వాక్యం యేన శ్రీరాఘవాగ్రతః ।
పత్రస్య చ తులస్యాశ్చ దృఢా సంధిర్భవిష్యతి ॥ **71**

బృందావనే పునర్గత్వా త్వం బ్రూహి యన్మయోచ్యతే ।
వినా పద్మసుగంధస్యావఘ్రాణాద్యది రక్షితమ్ ॥ **72**

పాతివ్రత్యం మయాస్త్వత్ర తర్హ్యేతత్తులసీదళమ్ ।
తులస్యాం సంధిమాప్నోతు నోచేన్నాప్నోతు వై త్వియమ్ ॥ **73**

అనేన వచనేనాద్య తత్పత్రం సంధిమాప్నుయాత్ ।
తులస్యాః క్షణమాత్రేణ పూర్వవచ్చ భవిష్యతి ॥ **74**

“ఓ తులసీదేవీ! మంగళాంగీ! నామాట వినుము. పరిశుద్ధమగు పాతివ్రత్యము నాయందు నిండియుండిన ఈ పత్రము మరల ఎప్పటివలె అగును గాక!” అని ప్రతిజ్ఞను పలికెను. అందరు పరికించుచుండగా ఆ పత్రము చెట్టునకు అతుకుకొనలేదు. అంత సీతాదేవ మోము వెలవెల పోయి

వ్యాకులమయ్యె. ఈ వినోదమును చూచుటకై దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, నాగ, గుహ్యక, ఋషులు, మొదలగువారందరును వచ్చిరి. అంత నారదుడు చింతాక్రాంతయగు సీతతో రహస్యమున, "ఇందుకు కారణము చెప్పెదను వినుము. పతివ్రతయగు స్త్రీకి పతిని వదలి పుష్పగంధాదులనైనను వాసన చూచుట కూడా తగదు. నీవు తామరను ఆఘ్రాణించితివి. అందుమీద రామునిమాయ ఇట్లు ప్రవర్తిల్లు చున్నది. అతని మాయచేతనే నీ చీర కొంగు తగిలి పత్రము పడినట్లు కనిపించినది. స్త్రీలకు బుద్ధి గరపుటకై నిన్ను శిక్షించుటలో ఇట్లుచేసెను. శ్రీరాముని అంతరంగము ఎరిగి నేనిట్లు నీయందు దోషమును ఆరోపించితిని. క్షమింపుము. నాయెడ కోపింపకుము. రాముడు నిన్ను శిక్షింపకపోయిన ఇట్లే భోగాసక్తిచే స్త్రీలందరును పతిని విడనాడి భోగములనందుచుందురు. కావున ఇప్పుడు నామాట వినుము. మరల బృందావనము వద్దకుపోయి, ప్రార్థించి, "తులసీ! పతికి సమర్పింపక మునుపే పద్మపరిమళమును ఆఘ్రాణించుట తప్ప పాతివ్రత్యమును క్రమముగా పాలించిన దాననైయుండిన ఈ తులసీ పత్రము చెట్టునకు అంటుకొను గాక! అని ప్రతిజ్ఞచేయుము. వెంటనే ఆపత్రమట్లే చేరిపోవును. కావున అచ్చటికి వెడలుము. చింతింపవలదు," అని సమాధానపరచెను.(74)

**అతస్త్వం యాహి తులసీం విషాదం భజ మా రమే ।**
**ఇత్యుక్త్వా సీతయా శీఘ్రం తులసీం నారదో యయౌ ॥ 75**

**సీతాఽపి తులసీం నత్వా శృణ్వత్సు సకలేష్వపి ।**
**సమూహేషు మునీనాం చ దేవాదీనాం వచోఽబ్రవీత్ ॥ 76**

**వినా పద్మసుగంధస్యావఘ్రాణాద్యది రక్షితమ్ ।**
**పాతివ్రత్యం మయాఽస్త్వత్ర తర్హ్యేతత్తులసీదళమ్ ॥ 77**

**తులస్యాః సంధిమాప్నోతు నోచేన్నాప్నోతు వై త్విదమ్ ।**
**ఏవం వదతి జానక్యా వాక్యే పత్రం క్షణేన తత్ ॥ 78**

**ప్రాప్తం సంధిం పూర్వవచ్చ పశ్యత్సు సకలేష్వపి ।**
**తదా నినేదుర్వాద్యాని దేవానాం రాఘవస్య చ ॥ 79**

**దేవనార్యో విమానాగ్రే సంస్థితాః పుష్పవృష్టిభిః ।**
**వవర్షుర్జానకీం రామం విప్రా ఊచుర్జయస్వనాన్ ॥ 80**

**తదా సీతాం సమాలింగ్య రాఘవో ముదితాననామ్ ।**
**ఆహ తుష్టమనాః శ్రీమాన్ వసనాహారభూషితః ॥ 81**

హే సీతే కంజనయనే మునీనామపి మోహిని ।
నేదం మయా శిక్షితం తే సర్వస్త్రీణాం సుశిక్షితమ్ ॥ 82

ధర్మసంస్థాపనార్థాయ సాధూనాం పాలనాయచ ।
దుష్టానాం చ వినాశాయ మయేదం రూపమాశ్రితమ్ ॥ 83

పాతివ్రత్యం సదా స్త్రీభిః పాలనీయం ధియేతి చ ।
మయా తే శిక్షితం సీతే మా విషాదం భజ ప్రియే ॥ 84

ఇత్యాశ్వాస్య ముహు సీతాం కృత్వా తామతిహర్షితామ్ ।
విసర్జయిత్వా శ్రీరామః సురాదీన్సమపూజయత్ ॥ 85

తతః సర్వాన్నారదాదీన్ జానకీ పరివేషణమ్ ।
వేగాచ్చకార ముదితా స్వేదబింద్వంకితాననా ॥ 86

తతః సర్వే నారదాద్యాశ్చక్రుర్భోజనముత్తమమ్ ।
తతో భుక్త్వాఽథ తాంబూలం రామం తుష్టావ నారదః ॥ 87

నారదుడు సీతాదేవిని పిలచికొని బృందావనమువద్దకు మరల వచ్చెను. పిదప వైదేహి, శ్రీతులసికి నమస్కరించి దేవర్షి నరబృందము చూచుచుండ, "పద్మాఘ్రాణముతప్ప, పాతివ్రత్యమును పాలించి యున్నచో ఈ తులసీపత్రము చెట్టుకు అతుక్కొను గాక!" అని ప్రతిజ్ఞచేసెను. అంత ఆ తులసీ పత్రము తులసీమొక్కకు అతుక్కొనెను. దేవతలు పొగడిరి. దేవకాంతలు సీతారాములమీద పూలవాన కురిపించిరి. అందరును జయజయమని కోలాహలముజేసిరి. అపుడు రామచంద్రస్వామి చిరునగవు మోముతో ఉన్న సీతమ్మను ఆలింగించి, "జలజాక్షియగు జానకీదేవి! ఇదినిన్ను శిక్షించుటకాదు, సామాన్యముగా స్త్రీలనందరికిని తెలివి కలుగుటకై చేసినట్లు భావింపుము. ధర్మమును స్థాపించి, దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించుటకేగదా నాచే ఇట్టిరూపము ధరింపబడినది. పణతులిట్లు పాతివ్రత్యమును పాలింపవలయుననుటకై ఇట్లు చేసితిని. నీవు చింతింపకుము," అని సమాధానపరచి పంపించి, సురాదులనందరిని సత్కరించెను. జానకీ దేవి నారదాదులకు వడ్డించెను. వెంటనే అందరును దివ్యభోజనమును ఆరగించిరి. అంత అప్పుడు తాంబూలమునంది నారదముని ఇట్లు నారాయణుడగు శ్రీరామబ్రహ్మమును స్తుతించెను.(87)

## శ్రీ నారదమునికృత పాపఘ్నశ్లోక నవకము.

శ్రీనారద ఉవాచ

శ్రీరామం మునివిశ్రామం జనసద్ధామం హృదయారామం
సీతారంజనసత్యసనాతన రాజారామం ఘనశ్యామ ।
నారీసంస్తుతకాలిందీనతనిద్రాప్రార్థితభూపాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 88

నానారాక్షసహన్తారం శరధర్తారం జనతాధారం
వాలీమర్దనసాగరబంధననానాకౌతుకకర్తారమ్ ।
పౌరానందనారీతోషకస్తూరీయుతసద్బాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 89

శ్రీకాంతం జగతీకాంతం స్తుతసద్భక్తం బహుసద్భక్తం
సద్భక్తహృదయేప్సితపూరకపద్మాక్షం నృపజాకాంతమ్ ।
పృథ్వీజాపతివిశ్వామిత్రసువిధాదర్శితసచ్ఛీలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 90

సీతారంజితవిశ్వేశం ధరపృథ్వీశం సురలోకేశం
గ్రావోద్ధారణ రావణమర్దనతద్భ్రాతృకృతలంకేశమ్ ।
కిష్కింధాకృతసుగ్రీవం ప్లవగవృందాధిపసత్పాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 91

శ్రీనాథం జగతాం నాథం జగతీనాథం నృపతీనాథం
భూదేవాసురనిర్జరపన్నగగంధర్వాదికసన్నాథమ్ ।
కోదండధృతతూణీరాన్వితసంగ్రామో కృతభూపాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 92

రామేశం జగతామీశం జంబూద్వీపేశ నతలోకేశం
వాల్మీకీకృతసంస్తవహర్షితసీతాలాలితవాగీశమ్ ।
పృథ్వీశ హృతభూభారం నతయోగీంద్రం జగతీపాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 93

చిద్రూపం జితసద్భూపం నతసద్దిక్పం నతసద్భూపం
సప్తద్వీపజవర్షజకామినిసన్నీరాజితపృథ్వీపమ్ ।
నానాపార్థివనామోపాయన సమ్యక్తోషితసద్భూపం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 94

సంసేవ్యం మునిభిర్గేయం కవిభిః స్తవ్యం హృది సంధార్యం
నానాపండితతర్కపురాణజవాక్యాదికృతసత్కావ్యమ్ ।
సాకేతస్థితకౌసల్యాసుతగంధాద్యంకితసద్బాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 95

భూపాలం ఘనసన్నీలం నృపసద్బాలం కలిసంకాలం
సీతాజానివరోత్పలలోచనమంత్రీమోచితతత్కాలమ్ ।
శ్రీసీతాకృతపద్మాస్వాదనసమ్యక్శిక్షితతత్కాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 96

హే రాజన్ నవభిః శ్లోకైర్భువి పాపఘ్నం నవకం రమ్యం మే
బుద్ధ్వా కృతముత్తమనూతనమేతద్రాఘవ మర్త్యానామ్ ।
స్త్రీపౌత్రాన్నాదికక్షేమప్రదమస్మాత్సద్వరదశ్చాలం
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్ ॥ 97

శ్రీరామదాస ఉవాచ

ఏవం స్తుత్వా రమానాథం రాఘవం భక్తవత్సలమ్ ।
ప్రణమ్యాజ్ఞాం ప్రభోః ప్రాప్య ప్రయయౌ నారదో ముదా ॥ 98

అమరా మునయః సర్వే జగ్ముస్తే స్వస్థలాని వై ।
ఏవం శ్రీరామచంద్రేణ నరరూపధరేణ చ ॥ 99

కౌతుకాని విచిత్రాణి కృతాని జగతీతలే ।
కస్తాన్యత్ర క్షమో వక్తుం విస్తరేణ ద్విజోత్తమ ॥ 100

తేషు యద్యద్రాఘవేణ స్మారితం త్విహ వై మమ ।
తత్తత్ప్రకథ్యతే శిష్య తవాగ్రే రాఘవాజ్ఞయా ॥ 101

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, సీతయా తులసీపత్రసంధిర్నామ ద్వావింశః సర్గః ॥**

## నారదమహర్షి కృత రామబ్రహ్మ స్తోత్రము.

లోకమునకు తేజస్స్వరూపుడవు, మనసునకు ఆనందమును ఇచ్చువాడవు, మునులకు విశ్రాంతి స్వరూపుడవు, రాజులందరిలో రమ్యుడవు, మేఘనీలగాత్రుడవు, దేవస్త్రీ యమునా నిద్రాదులచే సంస్తుతుడవు, జానకీరమణుడవు, సత్యస్వరూపుడవు, పురాణ పురుషుడవు, తాలములను (తాటిచెట్లను) కత్తిరించిన వాడవు ఐన శ్రీరామమూర్తీ! నీకు శిరస్సువంచి మ్రొక్కుచున్నాను. (88)

(సప్తతాళ వృక్షములను ఛేదించుటను ప్రతిపద్యాంతమునను చెప్పుటచే సప్తవ్యసన నివారకుడని భావము మీద వర్ణన అనదగును)

శరమును ధరించి, జనులను రక్షించువాడవై, సకల రాక్షసులను సంహరించి, వాలి సంహార సముద్రసేతు నిర్మాణాది కౌతుకములను చూపి, లోకానందకరముగ కస్తూరీ తిలకాది అలంకారము నంది ఏడు తాటిచెట్లను ఒక్కబాణముతో కూల్చిన శ్రీరామా! నీకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను.(89)

లక్ష్మీపతియు, లోకపతియునై, సత్పురుషులయిన భక్తులను స్తుతించుచు, స్తుతినందుచు ఉండువాడవైన, కోరికలను తీర్చు కమలనయనుడవైన, రారాజనబడి, కౌశికమునియొక్క విద్యలయందు నేర్పును చూపినవాడవైన, ఏడు తాటిచెట్లను ఒక్కబాణముతో కూల్చినడవైన శ్రీరామా! నీకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను. (90)

సమస్తలోకపాలకుడును, అహల్యనుద్ధరించినవాడును, రావణుని వధించి విభీషణునికి రాజ్యమిచ్చినవాడును, సుగ్రీవునికి రాజ్యాభిషేకము చేసినవాడును, ఏడు తాటిచెట్లను ఒక్కబాణముతో కూల్చినడవైన శ్రీరామా! నీకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను. (91)

జగత్పతియై, దేవగంధర్వాది పాలకుడై, ధనుర్ధారియగుటచే కోదండరామమూర్తి అనబడిన వాడై ఏడు తాటిచెట్లను ఒక్కబాణముతో కూల్చిన శ్రీరామా! నీకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను.(92)

విశ్వేశ్వరుడగుటచే రామేశ్వరుడై, బుద్ధ్యంతర్యామియగుటచే లోకవంద్యుడై, వాల్మీకియొక్క సారస్వత సంపత్స్వరూపుడై, దుష్టనిగ్రహముచే జగత్పరిపాలకుడైన ఏడు తాటిచెట్లను ఒక్కబాణముతో కూల్చిన శ్రీరామా! నీకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను. (93)

జ్ఞానస్వరూపుడు, దిక్పతివందితుడు, దుష్టనృపనిగ్రాహకుడు, సద్రాజపూజితుడు, సమస్త భువన సుందరీ నీరాజిత చరణారవిందుడు, రాజేంద్రసమర్పిత కరాదానానందితుడును అగు సద్రాజరత్న మయిన శ్రీరామా! నీకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. (94)

మహర్షి సేవితుడు, కవీంద్రస్తుతుడు, మునీంద్రభావితుడు, సకలశాస్త్రకావ్య వర్ణితుడు అయిన అయోధ్యావాసియగు కౌసల్యాసుతుడు శ్రీరామా! నీకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను.(95)

దురితపరిహారకుడు, నృపబాలకాకారుడు, మేఘశ్యామలుడు, కువలయాక్షుడు, మంత్ర స్వరూపుడు, కాలనిగ్రాహకుడయిన, రాజరాజేంద్రుడగు, శ్రీరామా! నీవు సీతాపద్మాఘ్రాణ నిమిత్తమున పాతివ్రత్య ధర్మమును చూపిన తాలభేదనుడవగు నీకు మ్రొక్కెదను....(96)

శ్రీరామా! నీకు నమస్కరించెదను. నీయొక్క వరరూపమగు అనుగ్రహముచేతనే దురితహర మగుటచే పాపఘ్నమను ఈ శ్లోకనవకము నాచే ఇప్పుడే నిర్మింపబడినది. ఇది లోకులకు పారాయణాదులలో పుత్ర పౌత్రాది సంపదలతో యోగ క్షేమములనిచ్చి రక్షించుచుండునుగాక! ఇది నీ వరము. (10)

అని ఇట్లు స్తుతించి, నమస్కరించి, రామానుజ్ఞనంది, నారదుడు ఆనందముతో వెడలెను. దేవతలు వెడలిరి. శ్రీరాముడిట్లు లీలామానుష రూపముతో అనేక వినోదములను చూపుచుండె. వాటిని విస్తరించి వర్ణించుటకు ఎవనితరము? శ్రీరామాజ్ఞచే వాటిలో అతని ప్రేరణచేత జ్ఞాపకము వచ్చుచుండు వాటిని నీకు అభివర్ణించి చెప్పుచున్నాను.

వినుము విష్ణుదాసా! అని శ్రీ రామదాసు మరల ఇట్లు సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మయగు శ్రీరామునియొక్క దివ్య కథలను నిరూపించుచున్నాడు.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణములో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, సీతాదేవి-తులసీపత్రసంధిని వర్ణించు 22వ సర్గ ముగిసినది.**

# త్రయోవింశః సర్గః-23వ సర్గ

ఆనందరామాయణ మహిమ

శ్రీరామదాస ఉవాచ

అథ రామః స వైదేహ్యా బంధుభిస్తనయాదిభిః ।
చకార రాజ్యం ధర్మేణ లోకవంద్యపదాంభుజః ॥ 1

ఏతస్మిన్నంతరేఽయోధ్యాపుర్యాః శ్రీరఘునాయకమ్ ।
నత్వైకదాఽబ్రవీద్దూతో హే రామ కంజలోచన ॥ 2

కరోమి తవ సేవాం న తపశ్చర్యాం కరోమ్యహమ్ ।
దదస్వాజ్ఞాం మమ త్వం హి గచ్ఛామి నిజమందిరమ్ ॥ 3

తథేతి రాఘవేణోక్తః స యయౌ నిజమందిరమ్ ।
తత్ర గత్వా శుచిర్భూత్వాఽఽనందరామాయణం శుభమ్ ॥ 4

పఠిత్వా నవరాత్రం తు తతస్తూర్ణం బహిర్యయౌ ।
ఏతస్మిన్నంతరే ఏకదేశే పౌరా మృతం నృపమ్ ॥ 5

దృష్ట్వా తస్య సుతం బాలం జ్ఞాత్వా కర్తుం హి మంత్రిణమ్ ।
చక్రుస్తే నిశ్చయం తత్ర కేచిదూచురయం శుభః ॥ 6

కేచిదూచురయం నైవ కార్యో మంత్రీ ఖలస్త్వయమ్ ।
ఏవం వివదమానాస్తే చక్రుర్వై నిశ్చయం తదా ॥ 7

కరిణీ నిజశుండాగ్ర మాలయా యం వరిష్యతి ।
సోఽస్తు మంత్రీ నిశ్చయేన తతస్తాం కరిణీం వరైః ॥ 8

వస్త్రాలంకారభూషాద్యైః శోభయామాసురాదరాత్ ।
తచ్ఛుండాయాం రత్నమాలాం దత్త్వా తాం ముముచుస్తదా ॥ 9

తతస్తే నవవాద్యాని వాదయామాసురాదరాత్ ।
తదా సా కరిణీ గ్రామాద్బహిస్తూర్ణం యయౌ శనైః ॥ 10

అయోధ్యాయాః పథాఽయోధ్యాం యయౌ దేశాన్ విలంఘ్యసా ।
తత్పృష్ఠే సకలాః పౌరా నానావాహనసంస్థితాః ॥ 11

యయుస్తూర్ణం కౌతుకేన కోటిశో ముదితాననాః ।
తతః సా కరిణీ గత్వాఽయోధ్యాం హట్టస్థితం తదా ॥ 12

తం దూతం వరయామాస యేన పారాయణం కృతమ్ ।
ఆనందరామచరితస్యాహో తత్కౌతుకం మహత్ ॥ 13

బభూవ సకలాన్ లోకాన్ తతస్తం మాలయాంకితమ్ ।
కరిణ్యా మంత్రిణం చక్రుస్తే పౌరా యే సమాగతాః ॥ 14

తం నిన్యుః కరిణీసంస్థం పత్నీపుత్రసమన్వితమ్ ।
స్వదేశే మంత్రిణం చక్రుస్తదద్భుతమివాభవత్ ॥ 15

## శ్రీమత్ ఆనందరామాయణ పఠనముచే దూత మంత్రియగుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, “శ్రీరామచంద్రస్వామి ఇట్లు సమస్త పరివారముతో సకల సౌభాగ్యములతో సమగ్రసంపదతో సంపూర్ణ ఐశ్వర్యముతో అఖండరాజ్య పరిపాలనము చేయుచూ ఆనందించుచండగా...

ఒకానొకసారి దూత ఒకడువచ్చి, “స్వామీ! నేనిక ఇట్లు కొలువులో ఉండను. సెలవియ్యండి పోయెదను,” అని ప్రార్థించి, శ్రీరామాజ్ఞనొంది ఇంటికి వచ్చి, తొమ్మిది రాత్రులలో ఆనంద రామాయణ పారాయణ వ్రతమును ఆచరించి, బజారుకు వెడలెను. అంతలో ఒకదేశమున రాజు మృతినొందగా అచ్చటి ప్రజలు రాజపుత్రుడు బాలుడగుటచే మంత్రిని రాజ్యపట్టమునకు ఆలోచించిరి. అపుడు కొందరు ఇతడు తగునని, మరికొందరు అతడు అనర్హుడని వివాదపడిరి. అంత అందరును, “పట్టపు ఏనుగు చేతికి పుష్పమాలికను ఇచ్చి పంపుదము. అది ఎవనిమెడలో వేయునో వాడు తగును” అని నిశ్చయించిరి. అట్లేదానిని అలంకరించి పూజించి, పుష్పరత్నమాలికను దానిచేత ఇచ్చి పంపిరి. మంగళ నవవాద్యములు మ్రోగెను. అంత ఆ భద్రగజము పలుదేశములను అతిక్రమించి, తిన్నగా అయోధ్యకు ఏతెంచి, అంగడి బజారులో వచ్చుచున్న ఆ దూతుని కంఠమున అలంకరించెను. అచ్చటి పౌరులు దాని వెంటనే నడుచుచు ఆ వింతను చూచి ఆశ్చర్యమందిరి. ఈ దూత పత్నీపుత్ర పరివారముతోసహ ఆ ఏనుగుమీద ఎక్కించుకుని వారి దేశమునకు పోయి, వానికి మంత్రిపట్టము నిచ్చిరి. అది లోకమునకు అత్యద్భుతమయ్యెను. (15)

తతః పరస్పరం శ్రుత్వా రాజదూతాః సహస్రశః ।
నానాదేశేషు సర్వత్ర సాకేతేఽపి తదా ముదా ॥ 16

రాజసేవాం పరిత్యజ్య జగ్ముస్తే స్వగృహాణి హి ।
తతః సర్వే స్వగృహేష్వానందరామాయణస్య చ ॥ 17

కేచిత్పారాయణం చక్రుః కేచిత్తచ్ఛ్రవణం ముదా
కేచిత్తత్పఠనం వాఽపి కేచిచ్చక్రుశ్చ కీర్తనమ్ ॥ 18

కేచిచ్చక్రుశ్చ వ్యాఖ్యానమేవం తన్నిష్ఠ మానసాః ।
బభూవుః సకలా దూతాః కోటిశో జగతీతలే ॥ 19

తదా కేన ధనం లబ్ధం కేన లబ్ధం మహద్ధనమ్ ।
కేన రాజపదం లబ్ధం కేన లబ్ధ గృహం వరమ్ ॥ 20

కేన గ్రామాధికారశ్చ కేన లబ్ధా కృషిర్వరా ।
కేన వృత్తిః శుభా లబ్ధా కేన స్వర్గో మనోరమః ॥ 21

కేన లబ్ధం తు పాతాళం కైర్లోకా వివిధాః శుభాః ।
లబ్ధం కైశ్చిత్సూర్యపదం లబ్ధం స్వర్గం మనోహరమ్ ॥ 22

కేచిదింద్రపదం ప్రాపుః కేచిదగ్నిపురం గతాః ।
కేచిత్తే ధర్మరాజస్య లోకం వా నిర్ఋతేరపి ॥ 23

వరుణస్యాథ వాయోశ్చ కుబేరస్యేశ్వరస్య చ ।
లోకాన్ జగ్ముస్తదా దూతాస్తదద్భుతమివాభవత్ ॥ 24

కేచిజ్జగ్ముశ్చంద్రలోకం కేచిద్ధ్రువపదం గతాః ।
కేచిత్తే బ్రహ్మలోకం చ వైకుంఠం చాపి కేచన ॥ 25

ఏవం యథా యస్య పుణ్యం దూతస్యాన్యజనస్య చ ।
ఆనందరామచరితపాఠశ్రవణసంభవమ్ ॥ 26

తథా తస్య గతిర్జ్ఞాతా సద్య ఏవావనీతలే ।
తదా కోఽపి న కస్యాసీద్దూతో దేశాంతరేష్వపి ॥ 27

త్యక్త్వా సేవాం సమస్తాశ్చ రాఘవస్యాపి తే గతాః ।
రామం పృష్ట్వా గతాః కేచిదపృష్ట్వైవా గతాః పరే ॥ **28**

ఏవం సర్వత్ర దేశేషు దూతాభావోఽభవత్తదా ।
ఏకదా రాఘవం ద్రష్టుం గంతుం సర్వే నృపోత్తమాః ॥ **29**

సైన్యాన్యాకారయామాసుః స్వీయాని తు పృథక్ పృథక్ ।
తదా కుత్రాపి సైన్యాని దదృశుర్న నృపోత్తమాః ॥ **30**

ఆః కిమేతదితి ప్రోక్త్వా స్వసుహృద్భిః సుతాదిభిః ।
యయుస్తే రాఘవం ద్రష్టుం విస్మయావిష్టమానసాః ॥ **31**

తానాగతాన్ నృపాన్ జ్ఞాత్వా తాన్పురో గంతుమాదరాత్ ।
ఆకారయత్స్వసైన్యానం న తదా ప్రాప లక్ష్మణః ॥ **32**

## యమలోకము కళావిహీనమగుట.

ఆ దూత సంగతి తెలిసి ఆ వృత్తాంతమును వేలకొలది దూతలు ఒకరికొకరు చెప్పుకొని, వివిధ దేశములలోను, అయోధ్యయందు కూడా రాజసేవలు మానుకుని తమ నివాసములకు వెళ్ళి- కొందరు పారాయణముచేసి, కొందరు పురాణము విని, కొందరు పఠించి, కొందరు కీర్తించి, కొందరు అర్థవిచారముచేసి- ఇట్లు నిరంతరము ఆనందరామాయణమనే ఆనందసాగరములో మునిగిరి. ఇట్లు లోకమున అసంఖ్యాకముగా ప్రజలు ఆనందరామాసక్తులై ఉండునపుడు, ఎవనికి సంపదవచ్చె? ఎవడు రాజ్యమునేలె? ఎవడు గృహములనందె? ఎవడు గ్రామాధికారి అయ్యె? మంచికాపెవ్వడయ్యె? సుఖజీవనమెవనికయ్యె? స్వర్గమునకు ఎవ్వడు వెడలె? ఏయే లోకములకు ఎవరెవరు వెళ్ళిరి అని చెప్పుటకు అలవి కాలేదు. కొందరు సూర్య, చంద్ర లోకములకు వెళ్ళిరి. కొందరు సత్యలోక, వైకుంఠ, కైలాసములకు కూడా పోవుచుండిరి. ఇట్లు వారువారు చేసికొనిన పుణ్యానుగుణముగా సద్గతులనందుచుండిరి. లోకమున ఎచ్చటను సేవకుడు దొరకలేదు.

శ్రీరామసన్నిధిలోని కొందరు అనుమతి తీసుకుని, కొందరు అనుమతిలేకయే ఆనందరామాయణ సాధనకు వెళ్ళిరి. ఇట్లు లోకమున దూతలకు కొరత ఏర్పడెను. అంత ఒకప్పుడు సామంతరాజులు శ్రీరామదర్శనమును కోరి సైన్యములను పిలుపింపగా ఎచ్చటనున్నవి? మొదలేలేదు. అంత అందరును మొఱ్ఱోయని విస్మయభ్రాంతులై శ్రీరామ దర్శనమునకు పత్నీ పుత్రులతో విచ్చేసిరి. శ్రీరాముడు సైన్యవిషయమై లక్ష్మణుని విచారించగా అతడు “సైన్యము శూన్యమయ్యె”ను అనెను. అందుకు రాముడు

ఆశ్చర్యపోయి, బంధుమిత్రులను పంపి వారిని రప్పించెను. వారును వచ్చి, శ్రీరామునికి నమస్కరించి, సభలో సుఖాసీనులైరి.

తతో నివేదయామాస తద్వృత్తం రాఘవాయ సః ।
తచ్ఛ్రుత్వా రాఘవోఽప్యాసీద్విస్మయావిష్టమానసః ॥ 33

సుహృజ్జనైర్యుతం బంధుం లక్ష్మణం ప్రేష్య పార్థివాన్ ।
స్వపురీమానయామాస తే నేమూ రఘునాయకమ్ ॥ 34

తతస్తే తస్థుః సదసి సేనావృత్తం న్యవేదయన్ ।
రామోఽపి కథయామాస స్వసేనావృత్తమాదరాత్ ॥ 35

తదా విహస్య శ్రీరామః సమాహూయ నిజం గురుమ్ ।
పృష్టవాన్మమ సైన్యాని నృపాణాం చాపి వై గురో ॥ 36

కిం జాతాని క్వ వై సంతి తద్వదస్వ సవిస్తరమ్ ।
తద్రామవచనం శ్రుత్వా కృత్వా ధ్యానం క్షణం గురుః ॥ 37

తదా ప్రాహ సభామధ్యే విహస్య రఘునందనమ్ ।
రామ రామ మహాబాహో సర్వం వేత్సి త్వమేవ హి ॥ 38

యది పృచ్ఛసి మాం రామ తర్హి సర్వం వదామ్యహమ్ ।
శతకోటిమితం రామచరితం తవ పావనమ్ ॥ 39

వాల్మీకినా కృతం పూర్వం తన్మధ్యే రఘునందన ।
ఆనందరామచరితం నవకాండసమన్వితమ్ ॥ 40

తస్య శ్రవణపాఠాద్యైః సర్వసైన్యేషు యే నరాః ।
తే గతాస్త్వత్పదం కేచిత్కేచిల్లోకాంతరాదిషు ॥ 41

న సంతి భువి సైన్యాని సత్యం రామ వచో మమ ।
నవకాండమితం తచ్చ రమ్యమానందదాయకమ్ ॥ 42

తస్యైతచ్ఛ్రవణాద్వృద్ధి ఫలం రఘుకులోద్భవ ।
యేన తే హీనజాతిస్థా దూతాశ్చ ముక్తిగామినః ॥ 43

**సారకాండశ్రవాదేవ సంసారాన్ముచ్యతే నరః ।**
**యాత్రాకాండేన యాత్రాణాం లభ్యతే మానవైః ఫలమ్ ॥ 44**

**యాగకాండేన యజ్ఞానాం లభ్యతే ఫలముత్తమమ్ ।**
**విలాసకాండశ్రవణాదప్సరోభిర్విమోదతే ॥ 45**

**జన్మకాండేన చాప్నోతి నరః పుత్రాదిసంతతిమ్ ।**
**వివాహకాండశ్రవణాద్భువి రమ్యాం స్త్రియం లభేత్ ॥ 46**

**రాజ్యకాండేన రాజ్యం హి మానవైర్భువి లభ్యతే ।**
**కాండం మనోహర శ్రుత్వా లభ్యతే మానసేప్సితమ్ ॥ 47**

విచ్చేసిన రాజులు తమ సంగతిని విన్నవింపగా, శ్రీరాముడు వారికి తనసేనల సంగతిని తెలిపి, చిరునవ్వు నవ్వుచు వసిష్ఠులవారిని ఆహ్వానించి, "స్వామీ! ఏమి సంగతి? సేనలెచ్చట మాయమయ్యె? సెలవియ్యండి," అని అడిగెను. అందుకు వారు నవ్వుచు, "శ్రీరామా! నీవు సర్వజ్ఞుడవు, తెలియదా? చెప్పెద వినుము. వాల్మీకి ముని నీ దివ్య చరితమును శతకోటి ప్రవిస్తరముగా అభివర్ణించెను కదా? అందులో ఆనంద రామాయణము పరమపావనము. దానిని సకల సేవకులు పఠించి కృతార్థులు అగుచుందురు. కొందరు నీ పరమపదమును పొందిరి. కొందరు పుణ్యలోకములను జేరిరి. భూమిపై సైనికులే లేరు. తొమ్మిది కాండలతో కూడిన ఆనందరామాయణమును పఠించి, హీన వర్ణమువారగు దూతలు కూడా ముక్తులగుచుందురు. తొమ్మిది కాండలకు శ్రవణ ఫలము ఇట్లున్నది–

సారకాండ పఠనముచే సంసారభయము తొలగును. యాత్రాకాండపఠనముచే తీర్థయాత్రాఫలము లభించును. యాగకాండమువలన యజ్ఞఫలము కలుగును, విలాసకాండమువలన అప్సరస స్త్రీ విలాసలాభము కలుగును, జన్మకాండమువలన పుత్రప్రాప్తికలుగును, వివాహకాండమువలన కాంతారత్న లాభము కలుగును, రాజ్యకాండముచే ప్రభుత్వమును, మనోహరకాండముచే మనోరథ సిద్ధియును కలుగును. (47)

**పూర్ణకాండశ్రవాదేవ తే పూర్ణస్య పదం లభేత్ ।**
**సర్వం తన్మానవైః శ్రుత్వాఽఽనందరామాయణం భువి ॥ 48**

**సచ్చిదానందరూపే తే లీనో భవతి మానవః ।**
**ఏవం రామ త్వయా పృష్టం తత్సర్వం కథితం మయా ॥ 49**

**యదగ్రేఽత్ర చికీర్షా తే తత్కురుష్వ రఘూత్తమ ।**
**ఇతి రామం వసిష్ఠస్తు యావత్ప్రాహ నృపాగ్రతః ॥ 50**

తావద్భూమ్యాం హి కిం జాతం తచ్ఛృణుష్వ సవిస్తరమ్ ।
గతిం శ్రుత్వా తు దేవానాం నానాదేశేషు యే నరాః ॥ 51

తేఽపి సర్వే తదానందరామాయణశ్రవాదిభిః ।
నానావిమానసంస్థాస్తే యయుః స్వర్లోకముత్తమమ్ ॥ 52

శూన్యం దృష్ట్వా నిజం లోకం యమో విధిసమన్వితః ।
కైలాసే శంకరం నత్వా సర్వం వృత్త న్యవేదయత్ ॥ 53

శివః శ్రుత్వా విహస్యాథ యమేన కేన దుర్గయా ।
యయౌ స వృషభారూఢః సాకేతం వేష్టితోఽమరైః ॥ 54

శివమాగతమాజ్ఞాయ ప్రత్యుద్గమ్య రఘూద్వహః ।
సింహాసనే శివం దేవ్యా నివేశ్య పూజనం వ్యధాత్ ॥ 55

ససీతే బ్రహ్మణశ్చాపి సురాణాం చ యమస్య చ ।
ఏతస్మిన్నంతరే బ్రహ్మా రాఘవం ప్రాహ వై తదా ॥ 56

రామ రాజీవపత్రాక్ష యమం పశ్య నిరుద్యమమ్ ।
శూన్యా సంయమనీ జాతాఽనందరామాయణశ్రవాత్ ॥ 57

శూన్యోజాతోఽస్తిభూలోకః  ఖేఽవకాశో న దృశ్యతే ।
సర్వేషాం తత్ర వై వస్తుమగ్రే కించిద్విచారయ ॥ 58

ఇతి తస్య వచః శ్రుత్వా సమాహూయ రఘూత్తమః ।
శత్రుఘ్నం ప్రేష్య వాల్మీకి తస్మై వృత్తం న్యవేదయత్ ॥ 59

సోఽపి శ్రుత్వా విహస్యాథ రాఘవం వాక్యమబ్రవీత్ ।
యేన మత్కవితానాశో న భవిష్యతి వై భువి ॥ 60

తథా సుఖం చ సర్వేషాం తేన తత్కురు రాఘవ ।
తథేతి రాఘవశ్చోక్త్వా తదా వచనమబ్రవీత్ ॥ 61

పూర్ణకాండముచే నీ యొక్క పూర్ణఫలమును కలుగుచున్నది. ఇట్టిదానిని విని అందరును సచ్చిదానందాత్మకమగు నీ రూపము నందు లీనులైయున్నారు. ఇక ఏమిచేయవలయునో చేయుము," అని చెప్పెను. అప్పటికి నానాలోకములకు వెళ్ళిన నరులందరును వివిధములగు దేవతలయొక్క పుణ్యలోకములకు వెడలిరి. యమపట్టణము పాడుపడెను. అంత యముడు చింతించి, సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మతో మొరపెట్టెను. అపుడు బ్రహ్మ, యమునితో కలసి కైలాసమునకు వెళ్ళి శివునితో అన్నిసంగతులు విన్నవించెను. (53)

## ఆనందరామాయణ మహిమ

అంత ఆ పరమేశ్వరుడు పార్వతితోను, పరివారముతోను నందివాహనమెక్కి శ్రీరాముని సభకు వచ్చెను. రాముడును రాజశేఖరుని రాక తెలిసికొని, ఎదురేగి స్వాగతించి, తన సింహాసనముపై పార్వతీ పరమేశ్వరులను పూజించి, అట్లే బ్రహ్మాది దేవతలను సత్కరించెను. అపుడు చతుర్ముఖుడు రామునితో ఇట్లనెను.

**సప్తజన్మార్జితం పుణ్యం మమార్చనసముద్భవమ్ ।**
**యస్య స్యాత్తస్య చానందరామాయణకథారుచిః ॥ 62**

**భవిష్యతి న సర్వేషాం భవత్వత్ర కదాచన ।**
**ఇతి రామవచః శ్రుత్వా సర్వే సంతుష్టమానసాః ॥ 63**

**యయుః స్వం స్వం పదం దేవాః స్వం స్వం దేశ నృపా యయుః ।**
**తదారభ్య విష్ణుదాస శతకోటిమితే శుభే ॥ 64**

**రామాయణే శివేనోక్తమానందాఖ్యమిదం శుభమ్ ।**
**రామాయణ క్వచిత్కుత్ర కశ్చిద్వేత్స్యతి మానవః ॥ 65**

**న భూమ్యాం సకలా లోకా వేత్స్యంతి ద్వాపరే కలౌ ।**
**సప్తజన్మార్జితం పుణ్యం తేషాం వేత్స్యంతి తే నరాః ॥ 66**

**తద్రామవచనాద్భూమ్యాం బభూవ పూర్వవత్తదా ।**
**నాభూత్కస్య కదా మేఘాఽఽనందరామాయణం ప్రతి ॥ 67**

**సహస్రేషు నరః కశ్చిత్సప్తజన్మసు పుణ్యవాన్ ।**
**ఆనందరామచరితం వేద స్తోత్రం న చాపరః ॥ 68**

**ఇతి శ్రీశతకోటిరామచరిత్రాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, ఆనందరామాయణమహిమావర్ణనం నామ త్రయోవింశః సర్గః ॥**

"రాజీవాక్షుడగు రామచంద్రస్వామీ! ఈ యముడు పనిలేక తడబడుచున్నాడు. అందరును విమానమెక్కి పుణ్యలోకములకు వెళ్ళుటలో ఆకాశమున ఖాళీలేదయ్యె. పునరావృత్తిరహిత శాశ్వత ముక్తులగుటచే భూమి శూన్యమవుతున్నది. ఏమి చేయునది," అని అడిగెను. అందుకు నవ్వి, శ్రీరాముడు శత్రుఘ్నునిపంపి, వాల్మీకిని పిలిపించి, "మునీంద్రా! ఈ సమాచారమునకు ఏమి సెలవిచ్చెదరు," అని అడిగెను. అందులకు వాల్మీకి ముని, "మహాప్రభూ! నాయొక్క కవిత్వమునకు నాశనములేనట్లు, నీ మనసుకు యుక్తమని తోచినట్లు, నిగ్రహానుగ్రహములను ఒనరించుటకు సర్వశక్తుడవగుదువు," అనెను.

అంత అట్లేఅని శ్రీరామచంద్రస్వామి, "ఏడు జన్మలలో ఎవడు నన్ను ఆరాధించిన పుణ్యమును ఆర్జించి పెట్టునో అతనికి ఒక్కనికే నాయొక్క ఆనందరామాయణ చరిత్రమున అభిరుచి కలుగునుగాక! తక్కిన వారికి ఒకప్పుడును కలుగనేరదు," అని వరమిచ్చెను. అంత అందరు ఆనందించి, ఆనంద రామునికి నమస్కరించి వారి ఆజ్ఞనంది వారివారి లోకములకు వెళ్ళిరి. కావున

ఓయి విష్ణుదాసా! శతకోటి ప్రవిస్తరమగు రామచరితమున ఈ ఆనందరామాయణము అత్యంత ఆనందప్రదమని శ్రీసాంబసదాశివస్వామి లోకమునకు అనుగ్రహించెను. కలి ద్వాపరములలో ఈ సంగతిని ఎవరును ఎరుగరు. గత ఏడుజన్మలలో పుణ్యము ఆర్జించి యున్నవారికే ఈ ఆనంద రామాయణముపట్ల అభిరుచి కలుగును కాని ఇతరులకు కాదు. ఆనందరామాయణము పఠించిన చోట తప్పక మేఘములు వర్షించును. వేయిమందికి ఒక్కడు ఆనందరామ భక్తుడై దీనిని పఠించును.

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణంలో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, ఆనందరామాయణ మాహాత్మ్యమును వర్ణించు 23వ సర్గ ముగిసినది.**

# చతుర్వింశః సర్గః-24వ సర్గ

శ్రీరాముడు యముని శిక్షించుట, వైకుంఠమునకు వెళ్ళుట.

శ్రీరామదాస ఉవాచ

ఏకదా సంస్థితం రామం సభాయాం సేవకోఽబ్రవీత్ ।
రాజరాజ మహారాజ రవివంశైకమండన ॥ **1**

సుమంత్రస్తేఽతివృద్ధః స మంత్రీ నాకం గతః ప్రభో ।
తత్పుత్ర్యస్తేన గంతుం త్వామాజ్ఞాం పృచ్ఛంతి రాఘవ ॥ **2**

తద్దూతవచనం శ్రుత్వా చకితః ఖిన్నమానసః ।
శీఘ్రం సుమంత్రగేహే న యయౌ యానేన రాఘవః ॥ **3**

సుమంత్రజన్మపట్టే తస్యాయుః సంఖ్యాం దదర్శ సః ।
జన్మకాలాత్సహస్రాణి నవ నవశతాని చ ॥ **4**

నవనవతివర్షాణి మాసాస్త్వేకాదశైవ హి ।
ఏకవింశద్దినాశ్చాతిక్రాంతాః సేషా దినా నవ ॥ **5**

జ్ఞాత్వేత్థం రామచంద్రః స తదా ప్రాహ గురుం ప్రతి ।
కృతే యుగే తు లక్షాయుః సహస్ర ద్వాపరే స్మృతమ్ ॥ **6**

శతవర్షం కలౌ ప్రోక్తం సహస్రాణి దశైవ చ ।
త్రేతాయాం కథితం చాయుస్తన్మద్రాజ్యే మృషా కృతమ్ ॥ **7**

యమేన మామవజ్ఞాయ మద్దండం లబ్ధుమిచ్ఛతా ।
దినాని నవ శేషాణి సతి మే మంత్రిణః కథమ్ ॥ **8**

యమేన నీతస్త్వద్యైవ యమం బద్ధ్వా నయామ్యహమ్ ।
సుమంత్రం జీవయామ్యద్య పశ్య మే త్వం పరాక్రమమ్ ॥ **9**

ఇత్యుక్త్వా గరుడారూఢః కోదండం కలయన్ కరే ।
వేగేన రఘునాథః స యయౌ సంయమనీం పురీమ్ ॥ **10**

తావన్మార్గే సుమంత్రం తం పాశబద్ధం యమానుగః ।
గచ్ఛంతం రాఘవో దృష్ట్వా తాన్సర్వాన్ తాడయన్ముహుః ॥ 11

సుమంత్ర మోచయామాస లింగరూపధరం ప్రభుః ।
తదా తే రాఘవం ప్రోచుశ్చాపరాద్ధం తవాద్య కిమ్ ॥ 12

అస్మాభిశ్చేదృశో దండో యతోఽస్మాకం కృతస్త్వయా ।
తదా తాన్రాఘవః ప్రాహ దినాన్యాయుర్నవాస్య హి ॥ 13

వర్తంతే శేషభూతాని కథమద్యైవ నీయతే ।
భవిష్యన్తి దివాన్యగ్రే యదా నవ యమానుగాః ॥ 14

తదాఽఽనేయః సుఖేనాయం న నిషేధం కరోమ్యహమ్ ।
ఇతి రామవచః శ్రుత్వా తమూచుస్తే యమానుగాః ॥ 15

## శ్రీరాముడు యమదూతలనుండి సుమంత్రుని విడిపించుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, “ఒకానొకసారి శ్రీరాముడు సభాసీనుడై ఉండగా, ఆ సభకు సేవకుడు వచ్చి మ్రొక్కి, “రవివంశ రత్నమగు రామరాజా! వృద్ధుడును మీ మంత్రియు అయిన ‘సుమంత్రుడు’ స్వర్గమునకేగెను. అతని భార్యలు సహగమనమునకై మీ అనుజ్ఞ అడుగుచున్నారు.” అని విన్నవించెను. అంత ఆ రామభద్రుడు చింతాక్రాంతుడై, వెంటనే సుమంత్రుని యింటికి వెడలి, అతని జాతకరాశిని తెప్పించి, అందులో ఇప్పటికి 9,999 సంవత్సరములు, 11 నెలలు, 21 దినములు గతించినవి. పదివేలకు 9 దినములు కొరవగా ఉన్నదని గుర్తించెను. పిదప వసిష్ఠులవారితో, “గురూత్తమా! కృతయుగమున 1,00,000 సంవత్సరములు. త్రేతా యుగమున 10,000 సంవత్సరములు. ద్వాపరయుగమున 1000 సంవత్సరములు, కలిలో 100 సం. ఆయుఃపరిమితి అని తెలిసియుండ అది నా రాజ్యమున అసత్యమయ్యె. యముడు నన్ను లక్ష్యపెట్టక, 9 దినములు మిగిలి ఉండగనే సుమంత్రునికి మరణమునిచ్చె. కావున ఆ యమునిని పట్టి తెచ్చెదను. సుమంత్రుని బ్రతికింతును. చూడు పౌరుషమును,” అని చెప్పి వెంటనే కోదండపాణియై సంయమనీ పురికి వెడలి, దారిలో సుమంత్రుని సూక్ష్మదేహమును తీసికొనిపోవుచున్న యమదూతలను చూసి, బాణములతో కొట్టి సుమంత్రుని విడిపించెను. అప్పుడు యమదూతలు, “స్వామీ! మీకు మేమేమి

తప్పుచేసితిమి? మమ్మునేల దండించితివి?" అని అడిగిరి. అందుకు శ్రీరాముడు, "ఓరి దూతలారా! వీనికి ఆయుష్షు ఇంకా 9 దినములు మిగిలియుండగా మీరేల వీనిని పట్టితిరి? తొమ్మిదిరోజులయిన నేనిట్లు అడ్డగించనుగదా," అని ఊరడించగా, వారు....

**అపూర్వమభవజ్జన్మ సుమంత్రస్యాస్య రాఘవ ।**
**మాతుర్యోన్యా బహిశ్చాస్య ముఖం హస్తౌ వినిర్గతౌ ॥ 16**

**పూర్వం తతో౽స్య దశమే దివసే దైవయోగతః ।**
**ఉదారాదీన్యధో౽ంగాని పదాంతాని శనైః శనైః ॥ 17**

**వినిర్గతాని శ్రీరామ సుమంత్రై రక్షితో బుధైః ।**
**యస్మాజ్జన్మన్యయం తస్మాత్సుమంత్రాఖ్యా౽స్య సార్పితా ॥ 18**

**అతః పూర్వదినారభ్య సంఖ్యయా౽౽యుః ప్రపూరితమ్ ।**
**అస్య తు తద్దినారభ్య సంఖ్యయా దివసా నవ ॥ 19**

**శేషభూతాశ్చ భవతా కీర్త్యంతే యే రఘూత్తమాః ।**
**అతో౽స్మాకం నాపరాధః సందిగ్ధం జన్మ చాస్య హి ॥ 20**

**పృథా౽యం నీయతే రామ వృథా శిక్షా౽పి నః కృతా ।**
**ఇతి తేషాం వచః శ్రుత్వా రామః ప్రాహ యమానుగాన్ ॥ 21**

**అస్యసోంత్యదినో జ్ఞేయో౽ప్రథమో హి యమానుగాః ।**
**యస్మిన్ దినే సుప్రసూతిరభవచ్చాస్యమాతృకాత్ ॥ 22**

**ఉత్సాహదివసో జ్ఞేయః స ఏవ జాతకం తథా ।**
**తస్మిన్నేవ దినే౽స్యాత్ర కృతం పిత్రా ద్విజోత్తమైః ॥ 23**

**జ్యోతిర్విదా జన్మపత్రే స ఏవ లిఖితో దినః ।**
**అతః శేషదినాః సత్యం జ్ఞేయాస్తస్యాయుషో నవ ॥ 24**

**అతో యుష్మాభిర్గంతవ్యం నేయో౽యం దశమే దినే ।**
**పునరాగత్య సాన్నిధ్యాన్మే నిషేధం కరోమి న ॥ 25**

**ఇతి రామవచః శ్రుత్వా తూష్ణీమేవ యమానుగాః ।**
**సాశ్రునేత్రాశ్చ భిన్నాంగా యమరాజం శనైర్యయుః ॥ 26**

**రామోऽపి వరివర్త్యాథ యయౌ స్వనగరీం ప్రతి ।**
**స్త్రీభిర్నీరాజితో మార్గే వివేశ మంత్రిణో గృహమ్ ॥ 27**

**తావత్సర్వాన్ప్రముదితాన్సుమంత్రేణ సమన్వితాన్ ।**
**దదర్శ రామచంద్రః స తావద్దృష్ట్వా రఘూత్తమమ్ ॥ 28**

**ప్రణనామ సుమంత్రః స పూజయామాస రాఘవమ్ ।**
**తతో రామో యయౌ గేహం సర్వే ప్రముదితాననాః ॥ 29**

"స్వామీ! రఘునాథా! ఈ సుమంత్రునియొక్క జన్మ మిక్కిలి అపూర్వమైనది. ఇతడు పుట్టినపుడు చేతులు, తల వెలువడి, పిదప పదియవరోజున భాగ్యవశమున తక్కిన అంగములు వెలువడి జన్మించెను. అపుడు పండితులు ఇతనిని మంచి మంత్రములచే రక్షించినందున ఇతనికి 'సుమంత్రు' డని పేరు కలిగనది. కావున వీని జన్మమున మాతప్పేమిగలదు? అని పలికిరి. అందుకు రాముడు, "మీరు చెప్పిన సమగ్రజన్మదినమే అతడు పుట్టినదినము. అది మొదలుకొనియే ఆయుష్షును గణింప వలయును. జ్యోతిర్విజ్ఞులు అట్లే చెప్పెదరు. సంపూర్ణ జన్మదినమే ఉత్సాహదినము. కావున ఇక తొమ్మిది రోజులాయుష్షున్నది. గనుక మీరు వెళ్ళి మరల పదియవనాడు వచ్చి తీసుకొని పొండు. అప్పుడు నేను వచ్చి నిషేధించను," అని ఆజ్ఞాపింపగా అంత వారు ఒడలు విరిగి కన్నీరు మున్నీరై పారుచుండగా ఊరకే యముని నగరమైన సంయమికి వెళ్ళిరి. (26)

## చచ్చి బ్రతికిన సుమంత్రుడు దాన ధర్మములను ఆచరించుట

పిదప శ్రీరామచంద్రస్వామి సుమంత్రునితో పౌరనారుల నీరాజనములనంది నగరవాసుల ఉత్సవములతో వచ్చి సుమంత్రుని ఇంటికి వెళ్ళెను. అచ్చట స్థూలదేహము కదలడము గమనించిన ఇంటివారు సంతోషసాగర నిమగ్నులైరి. తన పరివారముతో వచ్చిన శ్రీరామస్వామికి నమస్కరించి పూజించిరి. పూజితుడైన శ్రీరాముడు అక్కడినుండి తన మందిరమునకు వెడలెను. ఇచట అందరును ఆనంద విందులయిరి.

**దినాని నవ శేషాయుర్జ్ఞాత్వా దానాదికం సుధీః ।**
**చకార ప్రత్యహం భక్త్యా సుమంత్రో రాఘవాజ్ఞయా ॥ 30**

అథ తే యమదూతాశ్చ సాశ్రునేత్రాః సమాగతాః ।
ఉష్ణీషాణి కరైః క్రోధాదాస్ఫాల్య భువి చాబ్రువన్ ॥ **31**

కథం కరోష్యధికారం తవాజ్ఞాకారిణాం త్విమామ్ ।
దృష్ట్వాఽవస్థాం న లజ్జా తే జాయతే హృదయే మమ ॥ **32**

తాద్యాస్మాకం రాఘవేణ సుమంత్రో మోచితః పథి ।
దినాని నవ శేషాయుః పూర్త్యర్థమధునా వయమ్ ॥ **33**

దేహత్యాగం జలే కుర్మో న జీవిష్యామ భో యమ ।
తద్దూతవచనం శ్రుత్వా ప్రజజ్వాల యమస్తదా ॥ **34**

ప్రాహ దూతానద్య రామం బద్ధ్వా దండం కరోమ్యహమ్ ।
చోదనీయాని సైన్యాని దేవేంద్రం సూచయామ్యహమ్ ॥ **35**

ఇత్యుక్త్వా త్వరితో గత్వా వృత్తమింద్రం న్యవేదయత్ ।
పునరింద్ర యమః ప్రాహ సాహాయ్యం క్రియతాం మమ ॥ **36**

తత్తస్య వచనం శ్రుత్వా దేవేంద్రో యమమబ్రవీత్ ।
కిం భ్రాంతోఽసి యమాద్య త్వం విష్ణునా ప్రోద్ధుమిచ్ఛసి ॥ **37**

గచ్ఛ తూష్ణీం సంయమనీం రామస్య కిం కరిష్యసి ।
తద్భియా హి పురా దత్తౌ మయా తౌ సురపాదపౌ ॥ **38**

ఏవం తద్వచనం శ్రుత్వా వహ్నిలోకం యయౌ యమః ।
అగ్నినా భాషితస్త్వేవం నిర్ఋతిం వరుణం తథా ॥ **39**

వాయుం కుబేరమీశానం రవిం చంద్రం బుధం గురుమ్ ।
శుక్రం శనైశ్చరం రాహుం కేతుం భూమిసుతం ధ్రువమ్ ॥ **40**

ప్రార్థయామాస యుద్ధాయ సాహాయ్యం క్రియతామితి ।
ఉత్తరాణీంద్రవత్సర్వే దదుర్భ్రాంతం యమం హి తే ॥ **41**

**తతో గత్వా విధిం చాపి పాతాళాంతరవాసిభిః ।**
**సప్తద్వీపవాసినశ్చ యమః సంప్రార్థయన్నృపాన్ ॥ 42**

**తే౽పృచ్ఛన్న కరిష్యామః సాహాయ్యం రాఘవాగ్రతః ।**
**తతః క్రోధసమావిష్టః స్వసైన్యేన సమన్వితః ॥ 43**

సుమంత్రుడు తన ఆయుః పరిమితి ఇక తొమ్మిదిరోజులున్నదని గ్రహించి, వాటిలో శ్రీరామాజ్ఞ ప్రకారముగా పుణ్యలోక పాదకములైన దాన ధర్మములను ఆచరించుచుండెను. (30)

## యముడు అయోధ్యమీద దండెత్తుట.

అచ్చట యమదూతలు ఏడ్చుచు, యమసన్నిధానమున తలపాగాలు పారవేసి, ఇదిఏమి పాడుపని? నీ అధికారము బ్రద్దలయ్యె. తొమ్మిది దినములు ఆయుష్షు ఉన్నదని శ్రీరాముడు మమ్ము చావమోది, సుమంత్రుని పట్టుకెళ్ళెను. ఇదిచూచి మీకు సిగ్గుగా లేదా? మేము బ్రతుకనేరము. కుయ్యో మొఱ్ఱో," అనిరి. యముడు వీరి మొఱను ఆలకించి, మండిపడి, "మీరు ఊరడింపు పొందండి. ఇదిగో నేడు రాముని బంధించి శిక్షించెదను. సైన్యములు సిద్ధమగుగాక. ఇంద్రుని కొంచెము సహాయము కోరెదను" అని సమాధానపరచి, వారిని పంపి, తిన్నగా పోయి దేవేంద్రునికి ఈ సంగతి తెలిపెను. అందుకు ఇంద్రుడు, "ఓరి వెఱ్ఱివాడా! ఏమి భ్రాంతుడవైతివా? విష్ణుమూర్తితోడనా యుద్ధముచేయనెంచెదవు? బాగుగానున్నది. శ్రీరామునిచే నీవేమి చేయగలవు? తిన్నగా పొమ్ము పొమ్ము. ఆ రామునికి వెఱచిగదా నేను కల్పవృక్షములను అర్పించితిని," అని బుద్ధిచెప్పెను. అంత ఊరక యుండక యముడు నాకు యుద్ధసహాయకులుగా రండని అగ్నిమొదలగు దిక్పాలకులను, నవగ్రహ అధిపతులను, ధ్రువుని, బ్రహ్మను చివరకు సప్తద్వీపగత మహారాజులనందరిని ప్రార్థించెను. అందరు ఇంద్రునివలె శ్రీరాముని జోలికి పోవలదని యముని మాటలను ఆదరింపలేదు.

**రామేణ సంగరం కర్తుమయోధ్యాం స యమో యయౌ ।**
**స్వగణైః సహ వేగేన మహామహిషసంస్థితః ॥ 44**

**అయోధ్యాం వేష్టయామాస నవద్వారవిరాజితామ్ ।**
**నవప్రాకారసహితాం శతఘ్నీయంత్రసంయుతామ్ ॥ 45**

**నవభిః పరిఖాభిశ్చ సమంతాత్పరివేష్టితామ్ ।**
**దృఢరత్నకపాటాఢ్యాం రత్నభిత్తివిరాజితామ్ ॥ 46**

సరయూవేష్టితాం రమ్యాం రవికోటిసమప్రభామ్ ।
నానాప్రాసాదవృందైశ్చ పతాకాధ్వజశోభితామ్ ॥ **47**

యమేనం వేష్టితాం దృష్ట్వా పురీం రామో మహామనాః ।
లవమాజ్ఞాపయామాస గచ్ఛ యోద్ధుం యమేన హి ॥ **48**

లవస్తథా రథారూఢో దుందుభీనాం మహాస్వనైః ।
అయోధ్యాయా బహిర్గత్వా చకార సంగరం మహత్ ॥ **49**

తదా లవశరాఘాతఛిన్నదేహా యమానుగాః ।
నిపేతుః క్షణమాత్రేణ కోటిశో రణభూమిషు ॥ **50**

తాన్సర్వాన్నిహతాన్ దృష్ట్వా యమో మహిషసంస్థితః ।
చకార తుములం యుద్ధం లవేన క్రోధభాసురః ॥ **51**

స్వబాణౌఘైర్యమః శీఘ్రం రథం సూతం బలం ధనుః ।
కవచం ముకుటం చాపి చిచ్ఛేద స లవస్య చ ॥ **52**

తదా లవశ్చాతిక్రుద్ధః స్వసైన్యేన స్థితః పునః ।
చకార సంగరం ఘోరం యమేనాతిభయంకరమ్ ॥ **53**

తదాఽమరా విమానస్థా దదృశుర్యుద్ధకౌతుకమ్ ।
తతో లవః స్వబాణౌఘైర్మహిషం మూర్ఛితం భువి ॥ **54**

కృత్వా తం తాడయామాస శతబాణైర్యమం జవాత్ ।
తతో యమోఽప్యతిక్రుద్ధో యమదండం ముమోచ తమ్ ॥ **55**

తం దండం మోచితం దృష్ట్వా బ్రహ్మాస్త్రం సందధే లవః ।
బ్రహ్మాస్త్రమాగతం దృష్ట్వా యమదండో న్యవర్తత ॥ **56**

తదా యమోఽతి వికలః పలాయనపరోఽభవత్ ।
బ్రహ్మాస్త్రం తస్య పృష్ఠే తద్యయౌ కాలానలప్రభమ్ ॥ **57**

పిదప యముడు విపరీత క్రోధముతో తానే తనసైన్యముతో మహామహిషారూఢుడై వెడలి, నవప్రాకారములచే, నవద్వారములచే, నవరత్నకవాటములచే రంజించుచు శతఘ్న్యాది యంత్రములు కలిగి అభేద్యమై సరయూ ఆవృతమై ఒప్పుచుండెడి కోటిసూర్య ప్రకాశమానమగు అయోధ్యా పట్టణమును ముట్టడించెను. (47)

## లవుడు యముడిని తరుముట

అంత శ్రీరామభద్రస్వామి యముడు అయోధ్యను ఆక్రమించుట తెలిసికొని, యమునితో రణక్రీడను ఆచరించుటకై లవుని ఆజ్ఞాపించెను. అంత అతడు అట్లే అని రథమును ఎక్కి, రణ దుందుభులు మ్రోగుచుండగా, ఊరివెలుపల వచ్చి, యమునితో ఘోరయుద్ధమును ఆరంభించెను. లవుని అమ్ముల దెబ్బలకు ఓర్వజాలక యముని సైనికులు నేలికూలిరి. ఇట్లు యముని సైన్యమంతా సర్వనాశనమయ్యె. యముడు కపటోపాయముతో ద్వంద్వ యుద్ధమును ఆరంభించెను. లవుని దెబ్బలచే మరికొంత కోపమెక్కి, తీక్ష్ణబాణములను ప్రయోగించి లవునియొక్క సారథిని చంపి, కవచ ముకుట ధనూ రథబలములను నిర్మూలనము చేసెను. దానికి లవుడు ఆక్రోశావేశమునంది, మరియొక రథమునెక్కి యమునితో దారుణ యుద్ధమును చేసెను. అప్పుడు గగనమున ఈ విచిత్రమును వైమానికులు చూచుచుండిరి. లవుడు యముని దన్నపోతును మూర్ఛనొందించి, తీక్ష్ణబాణములచే పడగొట్టగా, యముడు ఆ దెబ్బలకు ఓర్వలేక యమదండమునే ప్రయోగించెను. లవుడు తిరుగులేని యమదండమును చూచి జంకక బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. అది యమదండమును మ్రింగి వెంబడింపగా యముడు వికలుడై పలాయనవ్రతమును ఆరంభించెను. (57)

**తదా దృష్ట్వా రవిః శీఘ్రం స్వీయాం భిన్నాం ప్రకల్ప్య చ ।**
**రథే మూర్తిం యయౌ వేగాత్ ప్రార్థయామాస తం లవమ్ ॥ 58**

**రే రే బాల యమం త్రాహి చోపసంహారయాద్య హి ।**
**త్వయోత్పృష్టం బ్రహ్మాస్త్రః త్వమేవాస్త్రవిదాం వరః ॥ 59**

**త్వం మే వంశసముద్భూతస్త్వయం మే తనయో యమః ।**
**కథం స్వపూర్వజం త్వద్య త్వం యమం హంతుమిచ్ఛసి ॥ 60**

**చేదేకో మూర్ఛతాం యాతః సర్వే మూర్ఛా భవంతి నః ।**
**శత్రుం రణాత్పరిభ్రష్టం వీరాస్తం రక్షయంతి హి ॥ 61**

ఇత్యాదినానావచనైః ప్రార్థితో రవిణా యదా ।
తదా లవోఽపి సంహారం చకారాస్త్రస్య బ్రహ్మణః ॥ 62

తతో లవం పురస్కృత్య యమేన తపనః పురీమ్ ।
వివేశ రఘునాథస్య దర్శనార్థం ముదాన్వితః ॥ 63

తదా ఖే దేవవాద్యాని నేదుః కుసుమవృష్టిభిః ।
లవం వవర్షురమరా ననృతుశ్చాప్సరోగణాః ॥ 64

పౌరనార్యో లవం మార్గే వవర్షుః పుష్పవృష్టిభిః ।
గోపురాట్టాల సంస్థాశ్చ దదృశుస్త ముహుర్ముహుః ॥ 65

నేదుర్నానాసువాద్యాని ననృతుర్వారయోషితః ।
తుష్టువుర్మాగధాద్యాశ్చ జగుగంధర్వకిన్నరాః ॥ 66

ఏవం నానాసముత్సాహైః స్త్రీభిర్నీరాజితః పథి ।
యయౌ స విజయీ బాలః ప్రణనామ రఘూత్తమమ్ ॥ 67

రవిమాగతమాజ్ఞాయ ప్రత్యుద్గమ్యరఘూత్తమః ।
నత్వా రవిం కరే ధృత్వా సభాయాం సవివేశ హ ॥ 68

తతః సింహాసనే భానుం నివేశ్య స్వీయపూర్వజమ్ ।
పూజయామాస శ్రీరామః షోడశైరుపచారకైః ॥ 69

తదాఽబ్రవీద్రవిం రామః సభాయాం పురతః స్థితః ।
పూర్వజస్త్వం క్షమస్వాద్య యల్లవేనాపరాధితమ్ ॥ 70

## సూర్యుడు బ్రహ్మాస్త్రమును త్రిప్పిపంపుట

యముడు పలాయించగా, సూర్యుడు త్వరపడి రెండుమూర్తులుగా మారి, ఒక మూర్తిని తన విధిలో నిలిపి, మఱియొక మూర్తి రథమునెక్కి త్వరగా లవునివద్దకు వచ్చి, "నాయనా! యమునిని రక్షింపుము. నీవు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమును ఉపసంహరింపుము. నీవే సమస్తాస్త్రముల నెరిగిన

ధీరుడవు. నీవు నా అంశమున జన్మించినవాడవు. ఈ యముడు నా పుత్రుడు. నీకు అన్నలాంటివాడు. వానిని నీవెట్లు చంపనెంచెదవు? ఒకడు మూర్ఖుడైనను ఇంకొకడు సమహీతుడు కాక అందరును మూర్ఖులు కాదగునా? ఉత్తములు రణమున శత్రువునైనను పరుగెత్తివానిని రక్షించెదరు," అని మధుర వచనములచే ప్రార్థించెను. అంత లవుడు అట్లేయని బ్రహ్మాస్త్రమును ఉపసంహరించెను. పిదప శ్రీసూర్యదేవుడు యమునిని వెంటదీసుకుని లవునితోడ శ్రీరామసన్నిధికి వచ్చెను. గగనమున ఖేచరులు పుష్పవర్షమును వర్షించిరి. నవవాద్యములు మ్రోగె. అందరు ఈ వింతను దర్శించిరి. గంధర్వులు గానముచేసిరి. లవునిమీద పురస్త్రీలు పూలవాన కురిపించిరి. ఇట్లు లవుడు విజయియై నగర స్త్రీల నీరాజనములు అందుచు వచ్చి, తండ్రియొక్క పాదారవిందములకు ప్రణమించె. (67) అప్పుడు శ్రీరాముడు సూర్యునిరాక తెలిసి, తానే ఎదురేగి, తమ కులపితామహుడగు భానువును స్వాగతించి చేయిపట్టుకుని తన దివ్య సింహాసనమున కూర్చుండబెట్టి, షోడశోపచారములచే పూజించి, "నీవు మాకులపతివి. లవుడు చేసిన అపరాధమును క్షమింపుము," అని ప్రార్థించెను.

**తదాఽబ్రవీద్రవిం రామః సభాయాం పురతః స్థితః ।**
**పూర్వజస్త్వం క్షమస్వాద్య యల్లవేనాపరాధితమ్ ॥ 70**

**తద్రామవచనం శ్రుత్వా రామం ప్రాహ రవిస్తదా ।**
**త్వన్నాభికమలాద్బ్రహ్మా సముద్భూతో రఘూత్తమ ॥ 71**

**మరీచ్యాద్యా విధేః పుత్రా మరీచేః కశ్యపః సుతః ।**
**కశ్యపాచ్చ మమోత్పత్తిః పౌత్రపౌత్రస్త్వహం తవ ॥ 72**

**క్షమస్వ మమపుత్రేణ యద్యమేనాపరాధితమ్ ।**
**ఏవం సంప్రార్థ శ్రీరామం చాసనే సన్న్యవేశయత్ ॥ 73**

**యమేన కారయామాస రఘునాథాయ వందనమ్ ।**
**తదా సమాయయుర్దేవా నేముః సర్వేరఘూత్తమమ్ ॥ 74**

**రామోఽపి సకలాదేవాన్పూజయామాస సాదరమ్ ।**
**తతో రామాజ్ఞయా చేంద్రః సుధావృష్ట్యా రణే మృతాన్ ॥ 75**

శీఘ్రముత్థాపయామాస సర్వాన్ వీరాన్ సవాహనైః ।
తతో రామో యమం ప్రాహ యావద్రాజ్యం కరోమ్యహమ్ ॥ **76**

తావత్త్వయా తు పూర్ణాయుర్నరో నేయో న చేతరః ।
తద్రామవచనం శ్రుత్వా తథేత్యాహ యమస్తదా ॥ **77**

తతః ప్రాప్తే సుదశమే దినే స్త్రీభిర్విగాహ్య సః ।
సుమంత్రో రాఘవం నత్వా తదగ్రే జీవితం జహౌ ॥ **78**

తతః స దివ్యదేహాభిః స్వస్త్రీభిర్దివ్యదేహధృక్ ॥ **79**

సుమంత్రః పూజితః సర్వైర్విమానే సంస్థితో బభౌ ।
రామాగ్రే మరణాదేవ సురైః సర్వత్ర వేష్టితః ॥ **80**

## శ్రీరాముడు సూర్యదేవుని సన్మానించి, యముడిని ఆజ్ఞాపించుట.

అందుకు సూర్యుడు, "రఘునాథా! నీయొక్క నాభికమలమునుండి చతుర్ముఖబ్రహ్మ వెలువడె. మరీచ్యాది నవబ్రహ్మలు అతనినుండి ఉద్భవించిరి. ఆ మరీచియొక్క పుత్రుడు కశ్యపుడు, అతని కొడుకును నేను. కావున నేను నీ మనుమని మనుమడుగా ఉన్నాను. ఈ యముడు నా పుత్రుడు. ఇతడు చేసిన తప్పును మన్నించి రక్షింపుము," అని సంప్రార్థించి తన ఆసనమున కూర్చుండెను. అపుడు యమునిచే శ్రీరామునికి నమస్కారము చేయించెను. అపుడు దేవతలందరూ వచ్చి శ్రీరామునికి నమస్కరించిరి. శ్రీరాముడును అందరిని తగురీతిగా సత్కరించెను. అపుడింద్రుడు శ్రీరామాజ్ఞచే అమృతవర్షమును వర్షించి, రణరంగమున మృతులపై సర్వసైనికులను వారివారి వాహనాదులతో బ్రతికించెను. అంత ఆ రామప్రభువు యమునితో, "నేను రాజ్యమేలుచుండునంత వరకు అందరికిని పూర్ణాయుష్షు కలిగియుండవలయును. ఎవనినైనను ఆయువు తీరిన పిమ్మటనే నీవు గ్రహింప దగును," అని ఆజ్ఞాపించెను. యముడు అట్లే అని అంగీకరించెను. (77)

## సుమంత్రుడు వైకుంఠమునకు పోవుట

పిదప పదియవరోజు రాగానే సుమంత్రుడు పత్నులతో స్నానముచేసి, శ్రీరామునికి నమస్కరించి, వారి సన్నిధిలో తన జీవితమును విడిచెను. అప్పుడే సుమంత్రుని పత్నికూడ పతిపరాయణయై ప్రాణములను విడిచెను. అందరు పొగడుచుండగా దేవకాంతలచే సన్మానింపబడి ఆ సుమంత్రుడు తన భార్యతో దివ్యదేహమును పొంది, విమానమునెక్కి విరాజించెను.

తతః పృష్ట్వా రవీ రామం యమేన స్వస్థలం యయౌ ।
యయౌ సుమంత్రః స్వస్త్రీభిర్వైకుంఠం నిర్జరా దివమ్ ॥ 81

రామః సుమంత్రపుత్రేణ తత్క్రియాది సుమంతునా ।
కారయిత్వా యథాశాస్త్రం తత్పదే తం న్యవేశయత్ ॥ 82

తతో రామో లక్ష్మణేన పృథివ్యాం ఘోషయన్ముహుః ।
గజన్యస్తాం దుందుభిం స్వాం పతాకాధ్వజశోభితామ్ ॥ 83

తథేతి లక్ష్మణశ్చాపి దూతానాజ్ఞాపయత్తదా ।
దూతాస్తేఽథ గజారూఢాః సప్తద్వీపాంతరేషు హి ॥ 84

రామాజ్ఞాం శ్రావయామాసుర్జనాన్దుందుభినిఃస్వనైః ।
అపూర్ణాయుర్మృతః కశ్చిన్నేతవ్యో రాఘవం ప్రతి ॥ 85

పౌరాణికాః స్థాపనీయా గేహే గ్రామే పృథక్ పృథక్ ।
నిత్యనైమిత్తికం కర్మ న త్యాజ్యం వై కదాచన ॥ 86

నావమాన్యా భూసురాశ్చ ద్వేషః కార్యో న కస్యచిత్ ।
హవ్యం కవ్యం సదా దేయం దండనీయాశ్చ తస్కరాః ॥ 87

శాసనీయా దురాచారతత్పరా యే జనా భువి ।
వందనీయా సదా మాతా వందనీయః సదా పితా ॥ 88

పూజనీయాః సదా దేవాః కార్యో ధర్మో నిరంతరమ్ ।
చైత్రస్నానం సదా కార్యమయోధ్యాయామథాపి వా ॥ 89

రామతీర్థేషు సర్వత్ర కార్యా ధర్మా విశేషతః ।
ద్వారకాం వై సదా గత్వా కార్యం వైశాఖమజ్జనమ్ ॥ 90

ఊర్జే కాశ్యాం పంజనపదే స్నాతవ్యం విధిపూర్వకమ్ ।
గత్వా ప్రయాగం ప్రత్యబ్దం కర్తవ్యం మాఘమజ్జనమ్ ॥ 91

**చాతుర్మాస్యవ్రతాదీని కర్తవ్యాని వ్రతాని హి ।**
**ప్రత్యంగణేషు తులసీ పూజనీయా హి సర్వదా ॥ 92**

ఆహా! సుమంత్రుడు, శ్రీరామసాన్నిధ్యమున మరణించుటచే దేవతలతో సమానముగా వెడలెను. అంత ఆ సూర్యదేవుడు యమునివద్ద శలవుతీసుకుని, శ్రీరామాజ్ఞనంది తనలోకమునకు వెళ్ళెను. సుమంత్రుడు తన భార్యతో వైకుంఠమునకు వెళ్ళెను. దేవతలు స్వర్గమునకు వెళ్ళిరి. శ్రీరాముడు సుమంత్రునికి అతని కుమారుడగు 'సుమంతు'నిచే ఉత్తరక్రియలు చేయించెను, సుమంతునే, తన తండ్రి స్థానములో మంత్రిగా నియమించెను. (82)

## శ్రీరాముడు ధర్మములను దండోరా వేయించుట

పిమ్మట శ్రీరాముడు లక్ష్మణునితో, "ఏనుగులమీద దుందుభులు వేయించి, సప్తద్వీపములలోను నా ఆజ్ఞ ఇట్లు పాటింపజేయు"మని చెప్పగా, అతడు దూతలను ఆజ్ఞాపించెను. అట్లేయని వారు ఏనుగులనెక్కి సప్తద్వీపములలో దుందుభినాదములతోడ శ్రీరామాజ్ఞను ఇట్లు వేయించిరి.

"పూర్ణాయుష్షునిండక మృతులైన వారిని శ్రీరాముని సన్నిధానమునకు తీసికొనిరావలయును. ఇండ్లలోను, గ్రామమునను వేర్వేరుగా పౌరాణికులను ఏర్పరుపవలయును. సంధ్యావందన శ్రాద్ధాది నిత్యకర్మలను, గర్భాదానాది నైమిత్తిక కర్మలను తప్పక చేయవలయును. ఎవనితో ఎవ్వడును ద్వేషింపరాదు. బ్రాహ్మణులను అవమానింపకూడదు. దేవతలను, పితృవులను హోమాదులచే తృప్తి పరుపవలయును. దొంగలను దండించవలయును. చెడు నడవడికలను అవి గలవారిని కూడా శిక్షింపవలయును. తల్లిదండ్రులకు ఎల్లప్పుడూ నమస్కరింపవలయును. వేదములు నిరంతరముగా పూజ్యములైనవి. ఎల్లప్పుడూ ధర్మమును ఆచరింపవలయును. అయోధ్యయందు, రామతీర్థములందు చైత్రస్నానమును చేయవలయును. ఎప్పుడూ ధర్మమును పాటించాలి. ద్వారకలో వైశాఖ స్నానమును, 5 నదులు గల కాశీక్షేత్రమున కార్తీకస్నానమును, ప్రయాగయందు మాఘస్నానమును పుణ్యప్రదము లైనవి గాన వాటిని ఆచరింపవలయును. చాతుర్మాస్యవ్రతము మొదలగు వ్రతములను ఆచరించండి. ఇంటింటను తులసిని పూజింపుడు.

**న నిరాకరణీయోఽత్ర త్వతిథిశ్చ కదాచన ।**
**న విప్రయాచ్నా కర్తవ్యా మృషా క్వాపి కదాచన ॥ 93**

యదీచ్ఛేత్స తతో దేయం సర్వస్వం బ్రాహ్మణాయ వై ।
గృహే గృహే క్వచిన్నైవ కలహం తు సమాచరేత్ ॥ 94

సదా గురుర్వందనీయః కర్తవ్యం శ్రవణం ముదా ।
ప్రాతః స్నానం సదా కార్యం హోతవ్యా విధినాఽగ్నయః ॥ 95

కార్యో జపః శంకరస్య ధ్యేయో నిత్యం మహేశ్వరః ।
ఏకాంతే హి తపః కార్యం ద్వాభ్యామధ్యయనం తదా ॥ 96

త్రిభిర్గీతాని కార్యాణి చతుర్భిర్విచరేత్పథి ।
పరదారరతిస్త్యాజ్యా నావలోక్యాఽన్యకామినీ ॥ 97

పరలక్ష్మ్యాః స్పృహా కార్యా న నరైశ్చ కదాచన ।
తీర్థం వినా పుణ్యకాలే న స్నాతవ్యం గృహేష్వపి ॥ 98

న ద్వేష్యా గణకా వైద్యాస్తే పోష్యాశ్చ పరే పురే ।
న వేశ్యాగమనం కార్యం న దాసీం స్పృహయేత్ హృది ॥ 99

నిత్యకర్మ యథాకాలే కర్తవ్యం సర్వదా నరైః ।
నావమాన్యా హి గురవః పరనిందాం న కారయేత్ ॥ 100

జలాశయా వనే కార్యా రోపణీయా నగాః పథి ।
ధర్మశాలా పృథక్కార్యాం న నగ్నాం వీక్షయేద్వధూమ్ ॥ 101

అన్నసత్రాణి కార్యాణి పురే గ్రామే వనే తథా ।
ప్రకుర్వంతు వనే రక్షాం మార్గస్థానాం వనేచరాః ॥ 102

భయం మాఽస్తు వనే క్వాపి నిశాయాం మార్గగామినామ్ ।
వైశ్యేభ్యస్తు కరో గ్రాహ్యో నేతరేషాం కదాచన ॥ 103

పాదయోః పాదుకే ధృత్వా తీర్థం దేవం గురుం ప్రతి ।
గోష్ఠం వృందావనం హోమశాలాం గచ్ఛేన్న సర్వదా ॥ 104

**పారాయణాని గ్రంథానాం వేదానాం చ సదా నరైః ।**
**కర్తవ్యాని తు నిష్కామం మాసకార్యాణి కారయేత్ ॥ 105**

**యతయో వందనీయశ్చ భోజనీయా గృహే గృహే ।**
**యతయే కమండలవః కౌపీనం పాదుకాం స్తథా ॥ 106**

అతిథిని ఎన్నటికీ నిరాకరించకూడదు. యాచించిన బ్రాహ్మణుని ఆశను ఎప్పటికైనను వ్యర్థ పరచకూడదు. ఇవ్వదగిన విప్రునికి దాతలు సర్వస్వమును ఈయదగును. ఇంటిలోగాని, ఊరిలోగాని ఎవరును కలహింపరాదు. గురువు ఎప్పుడును పూజ్యుడైయుండును. గురువాక్యము పాటించ వలయును. ప్రొద్దున స్నానముచేసి విధిగా అగ్నులను ఆరాధింపవలయును. సంతతము ధ్యాన మగ్నుడైయుండు మహేశ్వరుని యొక్క శివపంచాక్షరీ జపము నిత్యము చేయవలయును.

ఒంటరిగా తపమును ఆచరింపవలయును. ఇరువురుగాచేరి అధ్యయనము చేయవలయును. ముగ్గురుచేరి పాడవలయును. నలుగురుచేరి మార్గప్రయాణము చేయనగును. పరకాంతలను చూడరాదు, వారిని చింతింపరాదు. పరసతులను ఆశింపరాదు. పుణ్యకాలములలో తీర్థములను వదలి ఇండ్లలో స్నానము చేయరాదు. వైద్యులను, గణకులను ద్వేషింపరాదు. పురమున వారిని పోషింపవలయును. వ్యభిచారము కూడదు. దాసీలోలుడు కారాదు. కాలోచితముగా నిత్యకర్మలను ఆచరింపవలయును. గురువులను అవమానింపరాదు. పరనిందచేయరాదు. తోటలలో జలాధారములను కల్పించునది. దారులలో రెండువైపులా వృక్షవాటికలను పెంచవలయును. వేరుగా ధర్మశాలలను స్థాపించునది. నగ్నముగా స్నానముచేయరాదు. గ్రామములలో, పట్టణములలో, అరణ్యములలో అన్నసత్రములను స్థాపింపవలయును. వనచరులు, మార్గవాసులకు వనమున ఆవాసము ఏర్పాటుచేయనగును. రాత్రి ప్రయాణీకులు నిర్భయముగా ఉండవలయును. వైశ్యుల నుండియే పన్ను కానుకలను అంగీకరింపవలయును, ఇతురులది కూడదు. కాళ్ళకు జోళ్ళుతొడిగి గురు, దేవ, తీర్థ, బృందావన, హోమశాలాది పూజ్యస్థలములకు పోకూడదు. వేదాది గ్రంథ పారాయణమును నిష్కామముగా చేయనగును. ప్రతిగృహమున యతులు పూజ్యులై యుందురు. వారిని సత్కరింపవలయును. యతులకు కమండలు, కౌపీన, పాదుకలనిచ్చి ఆదరింపవలయును.

**వంశదండాః సదా దేయాః సదా తోష్యాః సుభాషణైః ।**
**న ఖేదయేద్వృథాం స్వీయాం దినే నిద్రాం న కారయేత్ ॥ 107**

హరిదిన్యాం న భోక్తవ్యముపోష్యా చ చతుర్దశీ ।
కృష్ణపక్షభవా తస్యాం రాత్రౌ కార్యం శివార్చనమ్ ॥ 108

నానామహోత్సవాద్యైశ్చ యథావిధిపురః సరమ్ ।
అష్టమీ కృష్ణపక్షస్య సదోపోష్యా శుభా తిథిః ॥ 109

దేవాలయేషు కర్తవ్యా బలయో భక్తిపూర్వకాః ।
నానాపక్వాన్ననైవేద్యాన్దేవేభ్యశ్చ సమర్పయేత్ ॥ 110

ధేనుదానం వాజిదానం గజదానం ప్రకారయేత్ ।
భూసురేభ్యః ప్రదేయాని గృహదానాని సాదరమ్ ॥ 111

గేహే గేహే సదాకార్యం ధేనువిప్రప్రపూజనమ్ ।
వసంతే చందనం దేయం ఛత్రాణి వ్యజనానిచ ॥ 112

పానకం జలకుంభాశ్చ కార్యం పాదావనేజనమ్ ।
దధి తక్రం హి జంబీర దేయం విప్రేభ్య ఆదరాత్ ॥ 113

కార్తికే దీపదానాని రాత్రౌ జాగరణాని చ ।
తులసీసేవనం ధాత్రీచ్ఛాయామాశ్రిత్య భోజనమ్ ॥ 114

గీతనృత్యాదికరణం విష్ణోరగ్రే నిరంతరమ్ ।
త్రిపురారేః సమీపే హి పౌర్ణిమాయాం హి కార్తికే ॥ 115

కరణీయో మహోదాహో ఘృతాక్తవర్తికాదిభిః ।
మాఘే దేయాని కాష్ఠాని కంబలాశ్చిత్రకాస్తథా ॥ 116

చైత్రే తాంబూలదానం చ తథా రంభాఫలాని చ ।
ఉర్వారుకాని దేయాని చందనం దధితక్రకమ్ ॥ 117

ఆదర్శదాన కస్తూరీదానం జాతీఫలస్యచ ।
ఏలాకర్పూరదానాని మధుమాసి ప్రకారయేత్ ॥ 118

పదాగ్రజం న స్పృశేచ్చ న పాదం ఘర్షయేత్పదా ।
ద్వాభ్యాం కరాభ్యాం కండూతిం మస్తకస్య న కారయేత్ ॥ **119**

కులవధువును దుఃఖపెట్టరాదు, పగలు నిద్రపోరాదు, ఏకాదశినాడు ఉపవసింపవలయును. కృష్ణచతుర్దశినాడు ఉపవాసముచేసి, రాత్రి శివుని పూజించి, వివిధ ఉత్సవములచే ఆరాధించునది. కృష్ణాష్టమియును అట్లే నక్తవ్రత దినమైయుండు దేవాలయములలో బలిదానములు భక్తితో జరుపవలయును. దేవతలకు వివిధ పక్వాన్నాదులను నివేదింపవలయును. గజ, అశ్వ, మహిష, గో, భూ, గృహాది దానములను విప్రులకిచ్చి కృతార్థులు కావలయును. ప్రతిఇంటిలోను గో, బ్రాహ్మణులను పూజింప వలయును. వసంతఋతువున– చందనము, ఛత్రము, విసనకఱ్ఱ, ఉద కుంభము, పానకము, మజ్జిగ మొదలగు పానీయములు దానముచేయవలయును. కార్తీకమున దీపదానమిచ్చి, రాత్రి జాగర వ్రతము ఆచరింపవలయును. తులసీ సేవనము, ధాత్రీ హవన భోజనాదులును కర్తవ్యములు. శంకరనారాయణుల సన్నిధానములలో నృత్త, గీత, వాద్య, వినోదములను, పౌర్ణమినాడు జ్వాలాతోరణాది మహోత్సవములను చేయవలయును. మాఘమున కంబళాకాష్ఠాదులను, చైత్రమున శృంగోరోప భోగములను, అప్యాన వస్తువులను దానము చేయ వలయును. కాలిగోళ్ళనంటరాదు. కాలితో కాలిని తోమరాదు. రెండు చేతులతో తలగోకికొనరాదు.

దాతవ్యః కరభారో హి వినా విప్రైర్ నృపాయ హి ।
నోపేక్షణీయో రాజ్ఞశ్చ జనైర్దండః కదాచన ॥ **120**

మాననీయాశ్చ శ్వశురాః పోష్యాః పాల్యాః సదైవ హి ।
సుహృదస్తోషణీయాశ్చ మిత్రే కోపం న కారయేత్ ॥ **121**

న కర్తవ్యో రిపూణాం చ విశ్వాసశ్చ కదాచన ।
కార్పణ్యం నైవ కర్తవ్యం దానకర్మసు సర్వదా ॥ **122**

న ద్యూతేన కదా కార్యా క్రీడా దారిద్ర్యసూచినీ ।
న శ్రోతవ్యా కదా వార్తా మద్యానాం చ నరోత్తమైః ॥ **123**

తీర్థయాత్రా సదా కార్యా కృచ్ఛ్రకాది సమాచరేత్ ।
కార్యం లింగార్చనం నిత్యం కోటిలింగాని శ్రావణే ॥ **124**

కర్తవ్యాని నరైర్భక్త్యా సదైవాపి చ కారయేత్ ।
లఘురుద్రాన్మహారుద్రానతిరుద్రాన్సమాచరేత్ ॥ **125**

దానాని పుస్తకానాం చ కర్తవ్యాని నిరంతరమ్ ।
కీర్తనాని చ కార్యాణి దేవాగారేషు వా గృహే ॥ **126**

సాధూనాం పూజనం కార్యం నమస్కార్యః సదా రవిః ।
గ్రామే గ్రామే వాయుపుత్రప్రతిమాః సర్వదా పృథక్ ॥ **127**

సిందూరాక్తాశ్చ తైలాక్తాః పూజనీయా నిరంతరమ్ ।
చతుర్థ్యాం గణరాజస్య పూజనాని ప్రకారయేత్ ॥ **128**

అర్పయేద్గణరాజాయ మోదకాన్పూర్ణపూరితాన్ ।
పంచ ఖాద్యాని సిందూరదూర్వాదీన్యర్పయేత్సదా ॥ **129**

సదాఽఽత్మచర్చా కర్తవ్యా స్తోత్రపాఠాన్ప్రకారయేత్ ।
గీతాయాః పఠనం కార్యం వేదానధ్యాపయేత్సదా ॥ **130**

సదైవ శాంతిసూక్తాని పుణ్యసూక్తాన్యనేకశః ।
పుణ్యం పురుషసూక్తం చ శ్రీసూక్తాదీని వై పఠేత్ ॥ **131**

సదా ధర్మే మతిః కార్యా కార్యో ధర్మస్య సంగ్రహః ।
దుష్టబుద్ధిః సదా త్యాజ్యా పాతకం పరిమార్జయేత్ ॥ **132**

జ్ఞాతవ్యం చపలం చాయుః క్రూరా జ్ఞేయో యమో మహాన్ ।
దారుణా నారకీ పీడా స్మర్తవ్యా హృది సర్వదా ॥ **133**

బ్రాహ్మణేతరులు క్షత్రియాదులను అర్చింపవలయును. లోకులెప్పుడూ రాజ్యమును, దండనమును ఉపేక్షింపరాదు. అత్తమామలు పూజ్యులును, పోషింపదగినవారును, పాలనీయులై ఉందురు. సుహృదులు సంతోషించతగినవారు. మిత్రునితో కోపగింపరాదు. ఎన్నటికి శత్రువును నమ్మవలదు. దాన ధర్మములలో కృపణత్వము కూడదు. దరిద్ర సూచకమైన ద్యూతక్రీడ ఎల్లప్పుడును తగదు. త్రాగుబోతుల చెలిమి తగదు. నరులు తీర్థయాత్రలను, కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్త కర్మలను

నిత్యలింగార్చనమును శ్రావణ కోటిలింగార్చనను చేయునది, మరి చేయించునది. లఘు రుద్ర, మహారుద్ర, అతిరుద్రము మొదలగు విధానములచే పరమేశ్వరుని ఆరాధింపవలయును. పుస్తకదానము పుణ్యసాదకము. ఇంటిలోగాని దేవాలయములలోగాని కీర్తనములు చేయవలయును. సత్పురుషులను పూజింపవలయును. సూర్యనమస్కారము అత్యంతముఖ్యము. గ్రామములలో అంతట ఆంజనేయ ప్రతిమలను సిందూర తైలముపూసి పూజించునది. చవితినాడు గణపతిపూజను శ్రేయస్కరముగా ఆచరింపుడు. సంతతము శారీరక మీమాంసయను అధ్యాత్మ శాస్త్రమును చర్చించి, మననముచేసుకొనుచుండవలయును. వేదములను చెప్పించి, గీతలను పఠించునది. గణపతికి కుడుము మొదలగు పంచ నైవేద్యములను అర్పించి, గరికతో పూజింపవలయును. పుణ్యకరములును, శాంతికరములును, శ్రేయస్కరములయిన శ్రీసూక్త, పురుషసూక్తాది సూక్తములను పఠించి ధన్యులు కావలయును. నిరంతరముగా అందరును ధర్మసంగ్రాహకులై, ధర్మపరాయణులై ఉండవలయును. దుష్టబుద్ధిని వదిలి కష్టములను దూరముగా తొలగించుకొనవలయును. ఆయుష్షు చంచలమనియు, యముడు క్రూరుడనియు, నరకదుఃఖము భయంకరమనియు సదా గుర్తుంచుకొనవలయును.

**గతస్తాతో మృతా మాతా గతశ్చ ప్రపితామహః ।**
**పితామహో గతశ్చేతి గమనం స్వం నిరీక్షయేత్ ॥ 134**

**గతం యథాఽత్ర బాలత్వం తారుణ్యం చ గతం యథా ।**
**తథా గచ్ఛతి వార్ధక్యం స్మరధ్వం యమశాసనమ్ ॥ 135**

**గతా దంతా గతే నేత్రే శ్లథా జాతా త్వగత్ర హి ।**
**కృష్ణకేశాః సితా జాతా మృత్యుర్జ్ఞేయః పురఃస్థితః ॥ 136**

**దానే విలంబో నో కార్యః కార్యం చిత్తం సునిర్మలమ్ ।**
**తుషవచ్చ ధనం దేయం మా కార్పణ్యాత్ ప్రరక్షయేత్ ॥ 137**

**ఏవం శ్రీరామదూతాస్తే సప్తద్వీపాంతరస్థితాన్ ।**
**శ్రావయిత్వా రాఘవాజ్ఞాం మహాదుందుభినిఃస్వనైః ॥ 138**

**అయోధ్యాం స్వాం యయుః సర్వే రామం వృత్తం న్యవేదయన్ ।**
**సంశ్రావితా తవాస్మాభిశ్చాజ్ఞా సర్వాన్ జనాన్ముహుః ॥ 139**

సప్తద్వీపేషు సర్వత్ర దుందుభీనాం మహాస్వనైః ।
తత్తేషాం వచనం శ్రుత్వా రామస్తుౖష్టోభవత్తదా ॥ **140**

ఏవ రామేణ భూమ్యాం హి చరిత్రాణి మహాంతి చ ।
ఆచరితాన్యనేకాని కస్త్వాన్యత్ర వదిష్యతి ॥ **141**

ఏవం శిష్య మయా ప్రోక్తం రాజ్యకాండం మనోరమమ్ ।
చతుర్వింశత్సుసర్గైశ్చ మహామంగళకారకమ్ ॥ **142**

రాజ్యకాండం నృపా యత్ర పఠంతి భక్తితత్పరాః ।
న తే రాజ్యాయత్పరిభ్రష్టా భవంతి హి కదాచన ॥ **143**

రాజ్యకాండం మహాపుణ్యం మహామాంగల్యదాయకమ్ ।
యే శృణ్వంతి నరా భూమ్యాం తే మాంగల్యం భజంతి హి ॥ **144**

ఏకైకవర్ధితైః సర్గైరేకైకేన క్షయేన చ ।
సప్తచత్వారింశద్దినైరనుష్ఠానం సుసిద్ధిదమ్ ॥ **145**

చిన్నతనము గతించె, యౌవ్వనము మాయమయ్యె, ముసలితనము ముగియుచు వచ్చెనని యమశిక్షను స్మరించుడు. తాత ముత్తాతలు, తల్లి యవ్వలు గతించిరి. తానుకూడా అట్లేగదా! పండ్లూడినవి, కండ్లుకానరావు, దేహము గళితమయ్యె, వెంట్రుకలు తెల్లబారె, మృత్యువొకటి ముందు నిలిచియున్నదని దాన ధర్మములతో సావకాశము చేయవలదు. మనస్సును నిర్మలముగా పెట్టుకొనుడు. పొట్టును చల్లినట్లు ధనమునియ్యవలయును." ఇట్లు శ్రీరామాజ్ఞను చాటించి, దూతలు మరలి అయోధ్యకు వచ్చి, శ్రీరామసన్నిధానమున, "స్వామీ! మీ యాజ్ఞప్రకారము సప్తద్వీపములలో అంతట దుందుభి నాదములతో చాటించితిమి," అని విన్నవించిరి. అది విని శ్రీరామచంద్రస్వామి పరమానంద భరితుడయ్యె. ఇట్లే వినుము...(140)

విష్ణుదాసా! శ్రీరాముడు పలువేడుకలను చూపించుచుండె. వాటిని వర్ణించుటకు ఎవనితరము. మనోహరమగు రాజ్యకాండమును ఇట్లు 24 సర్గలుగా వర్ణించి చెప్పితిని. ఇది మిక్కిలి మంగళప్రదము. రాజులు రాజ్యకాండమును భక్తితో పఠించితే ఎన్నటికిని రాజ్యచ్యుతి నందరు. ఇది మిక్కిలి మంగళప్రదము. పుణ్యప్రదము. దీనిని విన్నవారు శుభమునందెదరు. 24 వర్గమనగా 576 సర్గలగునట్లు 24 సర్గలుగల రాజ్యకాండము 24 మార్లు పారాయణము (24×24=576)అనగా ఏకోత్తర వృద్ధిక్షయముగా 47 దినములు విధిప్రకారముగా పఠించితే సర్వసిద్ధిదము.

ఆధిపత్యం నరాః ప్రాప్య రాజ్యకాండం పఠంతి యే ।
ఆధిపత్యాత్పరిభ్రష్టా న భవంతి కదాచన ॥ **146**

రాజ్యకాండం పఠిత్వా తు రణే వాదే జయో భవేత్ ।
శరణం శత్రవః శీఘ్రం యాస్యత్యేతచ్ఛ్రవాదినా ॥ **147**

ఆనందరామాయణమధ్యసంస్థం
యే రాజ్యకాండం మనుజాః పఠన్తి ।
రాజ్యచ్యుతా రాజ్యపదం లభన్తే
భవన్తి భ్రష్టా న తు తే పదస్థాః ॥ **148**

ఆనందరామాయణమేతదుత్తమం
తత్రాపి కాండేషు విచిత్రముత్తమమ్ ।
శ్రీరాజ్యకాండం పరమం సుసౌఖ్యదం
సదాऽతిభక్త్యా శ్రవణీయమాదరాత్ ॥ **149**

రాజ్యస్థితైర్వా వ్యవసాయతత్పరైః
సదైవ మేతచ్ఛ్రవణీయమాదరాత్ ।
ఉత్సాహకాలే వ్రతబంధమంగళే
వివాహకాలే పఠనీయముత్తమమ్ ॥ **150**

శ్రీరాజ్యకాండం శ్రుతిసౌఖ్యదాయకం
పుణ్యేషు కాలేషు పఠంతి యే నరాః ।
లభంతి సౌఖ్యాన్యతిమంగళాని
తే గచ్ఛంతి విష్ణోర్వరయానగాః పదమ్ ॥ **151**

పుణ్యం పవిత్రం పరమం విచిత్రం
శ్రీరామచంద్రస్య కథానకం సదా ।
భక్త్యా మునీనామపి మంగళప్రదం
శ్రోతవ్యమేతత్పఠనీయమాదరాత్ ॥ **152**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, రాజ్యకాండే, ఉత్తరార్ధే, ఉమామహేశ్వరసంవాదే తథా రామదాసవిష్ణుదాససంవాదే, యమశిక్షాకరణం సుమంత్రవైకుంఠారోహణం ప్రజోపదేశకరణం నామ చతుర్వింశః సర్గః ॥**

ఈ రాజ్యకాండను పఠించినవారు అధికారభ్రష్టులు కారు. రాజ్యకాండమును పఠించితే రణమున, వాదమున తప్పక జయమగును. అట్లు పఠించినవారికి శత్రువులు శరణాగతులగుదురు. ఆనందరామాయణమధ్యమున ఉండెడు రాజ్యకాండము రాజ్యమే మొదలగు ఏ అధికారములనుండి యైనను భ్రష్టులైనవారు పఠించితే మరల తమ అధికారమునంది ఆనందింపగలరు. ఈ ఆనంద రామాయణము ఉత్తమము. ఇందు రాజ్యకాండము సర్వోత్తమము, సుఖదము. వివాహాది మహోత్సవ కాలములలో ఇది పఠనీయము. ఇది విన్నవారిని ఇహపర సౌఖ్యములనిచ్చి రక్షించు చుండును. పరమ పవిత్రము, పరమమంగళము. సకలసౌఖ్యదము. సదా ఆదరణీయము. మరి రమణీయము.

ఇట్లు ఆనందరామాయణమున రాజ్యకాండ ఉత్తరార్ధము ముగిసినది

**శ్రీ వాల్మీకిమహర్షిచే నూరుకోట్లశ్లోకములుగా రచింపబడిన ఆనందరామాయణములో, రాజ్యకాండలో, ఉత్తరార్ధములో, ఉమామహేశ్వర సంవాదము అలాగే రామదాసు, విష్ణుదాసుల సంవాదరూపమైన యముని శిక్షించుట, సుమంత్రుడు వైకుంఠమునకు వెళ్ళుట అనే 24వ సర్గ ముగిసినది.**

## రాజ్యకాండము ముగిసినది.

# 8. మనోహర కాండ

| సర్గ. | శ్లోకాలు | సర్గ. | శ్లోకాలు |
|---|---|---|---|
| 1. | 104 | 10. | 167 |
| 2. | 155 | 11. | 296 |
| 3. | 249 | 12. | 107 |
| 4. | 309 | 13. | 088 |
| 5. | 377 | 14. | 103 |
| 6. | 241 | 15. | 183 |
| 7. | 132 | 16. | 065 |
| 8. | 127 | 17. | 115 |
| 9. | 193 | 18. | 053 |

**మొత్తం 18 సర్గలు, 3,364 శ్లోకాలు**



# ప్రథమః సర్గః-1వ సర్గ

## లఘురామాయణము

విష్ణుదాస ఉవాచ

గురో తే ప్రష్టుమిచ్ఛామి యత్తత్త్వం వక్తుమర్హసి ।
వేదవాక్యైః పురా ప్రోక్తం నారదేన మహాత్మనా ॥ 1

రామాయణం వాల్మీకయే సంక్షేపాచ్చేతి తేఽకథి ।
తావదేవార్థమాదాయ శ్లోకరూపం వదస్వ మామ్ ॥ 2

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయా వత్స సావధానమనాః శృణు ।
యత్పృష్టం చ త్వయా సర్వం తద్వదామి తవాగ్రతః ॥ 3

నారదాద్వేదవాక్యైశ్చ యథా వాల్మీకినా శ్రుతమ్ ।
తావదేవార్థమాదాయ తేన వాల్మీకినా పురా ॥ 4

శతశ్లోకమితం రామచరితం పాపనాశనమ్ ।
శతకోటిమితాయాం స్వకవితాయాం మనోరమమ్ ॥ 5

ఆదావేవోక్తమేవాస్మి తత్తవాగ్రే వదామ్యహమ్ ।
శతకోటిమితం రమ్యం లఘురామాయణాహ్వయమ్ ॥ 6

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥ 7

వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥ 8

యః పిబన్సతతం రామచరితామృతసాగరమ్ ।
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతసమకల్మషమ్ ॥ 9

## మనోహరకాండ ప్రారంభమున మంగళాచరణము.

విష్ణుదాసు అడుగుచున్నాడు, "గురూత్తమా! నాకు తత్త్వోపదేశము చేయుచున్నావు కావున అడిగెదను. మునుపు నారదముని వాల్మీకికి వేదవాక్యములతో సంక్షేపరామాయణమును ఉపదేశించెనని చెప్పితివే, శ్లోకరూపమగు దానిని నాకు బోధింపుము." అనగా, రామదాసు ఉపదేశించుచున్నాడు.

"బాగుగా అడిగితివి, వినుము! శతకోటిరామాయణమునకు ఆధారమయిన శతశ్లోక రామాయణము ను పాపనాశనమని మొదటనే చెప్పితిని. అట్టి రమ్యమగు లఘురామాయణమును నీకిపుడు చెప్పుచున్నాను(6)

రామ రామ యనీ యింపైన మధురాక్షరములను పలుకుచు, కవిత్వమను కొమ్మనెక్కిన వాల్మీకి అను కోకిలకు నమస్కరించెదను. (7) కవితయను వనమున సంచరించు వాల్మీకిమునియను సింహముయొక్క రామకథయను నాదమును వినిన ఎవడు పరమపదమునొందడు? (8) శ్రీరామ చరిత్ర అను అమృతాబ్ధిని ఎప్పుడూ పానముచేయుచు, తృప్తినందక యుండెడు ఆ మునికి మ్రొక్కెదను.

గోష్పదీకృతవారీశం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్ ॥ 10

అంజనానందనం వీరం జానకీ శోకనాశనమ్ ।
కపీశమక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥ 11

ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలం
యః శోకవహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలిరాంజనేయమ్ ॥ 12

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం మనసా స్మరామి ॥ 13

రామాయ రామభద్రాయ రామచంద్రాయవేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥ 14

జితం భగవతా తేన హరిణా లోకధారిణా ।
అనేన విశ్వరూపేణ నిర్గుణేన గుణాత్మనా ॥ **15**

ఇతి మంగళాచరణమ్ ॥

తపః స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్ ॥ **1**

కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్కశ్చ వీర్యవాన్ ।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥ **2**

చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।
విద్వాన్కః కః సమర్థశ్చ కశ్చైకః ప్రియదర్శనః ॥ **3**

ఆత్మవాన్కో జితక్రోధో ద్యుతిమాన్కోఽనసూయకః ।
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే ॥ **4**

ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే ।
మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతుమేవంవిధం నరమ్ ॥ **5**

సముద్రమను గోవుయొక్క అడుగును దాటినట్లు లంఘించి, రక్కసులను దోమలను నలిపినట్లు దుమ్ముదులిపి, రామకథయను హారమునకు రత్నమువలె వొప్పుచుండు మారుతికి మ్రొక్కెదను. (10) అంజనాదేవికి ఆనందమునిచ్చు తనయుడును, సీతాదుఃఖమును పరిహరించినవాడును, కపీంద్రుడును, అక్షకుమారుని సంహరించినవాడును, లంకాభయంకరుడునగు వానికి నమస్కరించెదను. (11) వేడుకతో సముద్రమును దాటి, సీతయొక్క దుఃఖాగ్ని చేతనే లంకను కాల్చినట్టి ఆంజనేయస్వామికి అంజలిబద్ధుడనై నమస్కరించెదను (12). మనోమారుతములను మీరిన మహా వేగముగల్గి, జితేంద్రియుడై, మనీషివర్యుడై, కపిబృందా దారకుడైన శ్రీరాముని ప్రియదూతయగు ఆంజనేయుని అనుసంధానముచేసెదను. (13). సర్వలోకశరణ్యుడగు శ్రీరామచంద్ర పరబ్రహ్మమూర్తికి నమస్కారము (14). సత్వ రజస్తమోగుణములలో జిక్కనందుచే నిర్గుణుడై, సచ్చిదానందాత్మ కుండగుటచే గుణాత్మయై, జగత్స్వరూపుడై లోకములను ధరించువాడైయుండు, షడ్గుణైశ్వర్య సంపన్నుడగు హరిచే జీతంబీ చరాచర సర్వప్రపంచమును ధరించి వానికి నమస్కరిస్తున్నాను. (15).

## సంక్షేపముగా శ్రీరామకథావర్ణన

కృఛ్ర చాంద్రాయణాది నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానముగల వాల్మీకిముని కర్మ బ్రహ్మ ప్రతిపాదకములైన వేద వేదాంతములను అధ్యయనము చేయుటలో మిక్కిలి మక్కువగల్గి బ్రహ్మవిద్వరుడయిన నారదమహర్షిని ఇట్లడిగెను (1). "ఈభూతలమున ఇప్పుడు సద్గుణవంతుడును, సర్వనిగ్రాహక శక్తిగలవాడును, ధర్మములను ఎఱిగినవాడును, పరోపకారమును తెలిసినవాడును. యథార్థము నెన్నటికిని విడువనివాడును, సఫలసంకల్పుడును, ధైర్యముగలవాడును, అరిషట్ వర్గములను జయించినవాడును, కాంతిమంతుడును, గుణములయందు దోషారోపము చేయునట్టి అసూయ అను దుర్గుణములేనివాడును, కోపగించినమాత్రమున దేవతలుగూడ దిగ్భ్రాంతులగునట్టి పరాక్రమ వంతుడును, కులక్రమాగత సదాచారముగలవాడును, సమస్త ప్రాణుల విషయమై హితబుద్ధిగల వాడును, సర్వజ్ఞుడును, అసాధారణ కార్యదక్షుడును, సదా చిరునవ్వుతో దర్శనమిచ్చువాడును అగు వాడెవ్వడు? అట్టి మహానుభావుని గురించి వినుటకై కుతూహలము నందితిని. మునీంద్రా! అట్టివానిని గురించి తెలుపుటకు నీవే సమర్థుడవు (5)

**శ్రుత్వా చైతత్త్రిలోకజ్ఞో వాల్మీకేర్నారదో వచః ।**
**శ్రూయతామిత్యుపామన్త్ర్య ప్రహృష్టో వాక్యమబ్రవీత్ ॥ 6**

**బహవో దుర్లభాశ్చైతే యే త్వయా కీర్తితా గుణాః ।**
**మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం నరాః ॥ 7**

**ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః ।**
**నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ ॥ 8**

**బుద్ధిమాన్నీతిమాన్వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః ।**
**విపులాంసో మహాబాహుః కమ్బుగ్రీవో మహాహనుః ॥ 9**

**మహోరస్కో మహేష్వాసో గూఢజత్రురరిన్దమః ।**
**ఆజానుబాహుః సుశిరాః సులలాటః సువిక్రమః ॥ 10**

**సమః సమవిభక్తాఙ్గః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్ ।**
**పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః ॥ 11**

ధర్మజ్ఞః సత్యసన్ధశ్చ ప్రజానాం చ హితే రతః ।
యశస్వీ జ్ఞాన సమ్పన్నః శుచిర్వశ్యః సమాధిమాన్ ॥ 12

ప్రజాపతిసమః శ్రీమాన్ ధాతా రిపునిషూదనః ।
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా ॥ 13

రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా ।
వేదవేదాఙ్గతత్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః ॥ 14

సర్వశాస్త్రార్థతత్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్ ।
సర్వలోకప్రియః సాధురదీనాత్మా విచక్షణః ॥ 15

సర్వదాఽభిగతః సద్భిః సముద్ర ఇవ సిన్ధుభిః ।
ఆర్యః సర్వసమశ్చైవ సదైవ ప్రియదర్శనః ॥ 16

స చ సర్వగుణోపేతః కౌసల్యానన్దవర్ధనః ।
సముద్ర ఇవ గామ్భీర్యే ధైర్యేణ హిమవానివ ॥ 17

విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః ।
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః ॥ 18

ముల్లోకములు తెలిసిన నారదుడీమాట విని, వాల్మీకిని ఆలకింపుమని, ఆనందించుచు నిట్లనెను.

“మహర్షీ! నీవడిగినట్టి సద్గుణములు లోకమున దుర్లభములు. అయినను వాటితో కూడిన మానవునిని నీ కొరకు చెప్పెదను వినుము. ఇక్ష్వాకు మహారాజవంశమున అవతరించిన శ్రీరాముడు అనువాడు సద్గుణరాశి అని లోక ప్రసిద్ధము. అతడు నిర్వికార స్వరూపుడు, అచింత్యాపరిమిత శక్తిగలవాడు, నిత్యప్రకాశముగలవాడనిన స్వయంప్రకాశమూర్తి, ధైర్యవంతుడు, ఇంద్రియములను జయించినవాడు, వివేకవంతుడనిన సర్వజ్ఞుడు, మంచి నీతిగలవాడు, సమస్త విద్యలను తెలిసినవాడు, అఖండ ఐశ్వర్యముగలవాడు, శత్రుసంహారకుడు, ఉన్నతములైన మూపులును, బలిసిన భుజములును, శంఖమువంటి కంఠమును, ఎత్తైయిన చెక్కిళ్ల మీది భాగములును, విశాలవక్షస్సును, గొప్పదగువిల్లును, మాంసమగ్నములగుటచే అగుపడనట్టి మూపులసంధి యెముకలునుగలవాడు, బాహ్యాభ్యంతర శత్రువులను నిగ్రహించువాడు, మోకాళ్ళవఱకు పొడవైన భుజములుగల వాడు, సల్లక్షణ మస్తక మండితుడు, శుభమగు నొసలుగలవాడు, మంచి నడకగలవాడు, మరీ పొడవుగాని, మరీ పొట్టిగానీ

కాని దేహము. హెచ్చు తగ్గుల కాక సుస్పష్టములగు అవయవములు గలవాడు, స్నేహయుక్తమగు రంగుగలవాడు, మేలైన పరాక్రమముగలవాడు, తేజోవంతుడు, బలిసినరొమ్ము గలవాడు, ఆయత నేత్రుడు, లక్ష్మీవంతుడు, కావుననే సమస్త శుభలక్షణములచే కనిపించువాడు. మరియు శరణాగత రక్షణాది సకలధర్మములను తెలిసినవాడు, ఇచ్చినమాట తప్పనివాడు, ప్రజలకు ఎప్పుడూ మేలునే చేయువాడు, కీర్తిసంపన్నుడు, జ్ఞానసంపన్నుడు, పరిశుద్ధుడు, గురుజనులకు వినయవంతుడు, ఆశ్రయించినవారిని కాపాడువాడు, స్వధర్మములను స్వజనులను పరిపాలించువాడు, వేద వేదాంగములలోని తత్త్వములను గ్రహించిన వాడు, ధనుర్విద్యయందు నేర్పరియగువాడు, సర్వశాస్త్రరహస్యవిదుడు, జ్ఞప్తిగలవాడు, వ్యావహారిక వివేకస్ఫూర్తిగలవాడు, సకలలోక ప్రియుడు, సత్పురుషుడు, ఎన్నటికిని తరగని ధైర్యముగలవాడు, నేర్పరి, (15) సముద్రుడు నదులచే అక్రమింపబడునట్లు సత్పురుషులచే ఎల్లప్పుడును పొందబడిన వాడును, పూజ్యుడును, సర్వసమబుద్ధిగలవాడనిన ఆత్మారాముడు, నిరంతరము ఆనందము ప్రసాదించువాడు,అతడు సకలసద్గుణ సంపూర్ణుడై కౌసల్యాదేవికి సంతోషమును వృద్ధిజేయువాడై, గాంభీర్యమున సముద్రునివంటివాడు. ధైర్యమున హిమవత్పర్వతము వంటివాడు. జనులకు ఆహ్లాదమును పంచుటలో చంద్రునివంటివాడు. కోపమునందు కాలాగ్నిని, ఓర్పునందు భూదేవిని మించినవాడు.

**ధనదేన సమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః ।**
**తమేవగుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్ ॥ 19**

**జ్యేష్ఠ జ్యేష్ఠగుణైర్యుక్తం ప్రియం దశరథః సుతమ్ ।**
**ప్రకృతీనాం హితే యుక్తం ప్రకృతిప్రియకామ్యయా ॥ 20**

**యౌవరాజ్యేన సంయోక్తుమైచ్ఛత్ప్రీత్యా మహీపతిః ।**
**తస్యాభిషేకసమ్భారాన్ దృష్ట్వా భార్యా చ కైకయీ ॥ 21**

**పూర్వం దత్తవరా దేవీ వరమేనమయాచత ।**
**వివాసనం చ రామస్య భరతస్యాభిషేచనమ్ ॥ 22**

**స సత్యవచనాద్రాజా ధర్మపాశేన సంయతః ।**
**నిర్వాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్ ॥ 23**

**స జగామ వనం వీరః ప్రతిజ్ఞామనుపాలయన్ ।**
**పితుర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్ ॥ 24**

**తం వ్రజన్తం ప్రియో భ్రాతా లక్ష్మణో౽నుజగామ హ ।**
**స్నేహాద్వినయసమ్పన్నః సుమిత్రానన్దవర్ధనః ॥ 25**

**భ్రాతరం దయితో భ్రాతుః సౌభ్రాత్రమనుదర్శయన్ ।**
**రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా ॥ 26**

**జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా ।**
**సర్వలక్షణసమ్పన్నా నారీణాముత్తమా వధూః ॥ 27**

శ్రీరాముడు– ఔదార్యమున కుబేరుని, సత్యమున ధర్మదేవతను పోలినవాడు. ఆ పరమాత్మ అవతారము వలె ఉండును. ఇట్టి గుణసంపూర్ణుడు, సత్యపరాక్రమవంతుడునగు జ్యేష్ఠపుత్రుడైన శ్రీరాముని దశరథ మహారాజు ప్రజలను ఆనందపరచువాడు, ప్రజలయొక్క హితములనెఱిగి వర్తించువాడు ఇతడే అని నమ్మి, మిక్కిలి మక్కువతో యౌవరాజ్యాభిషేకమును చేయనెంచెను.

శ్రీరాముని పట్టాభిషేక సంభారములను చూచి, కైకేయి యను దశరథపత్ని "శ్రీరాముడిని వనవాసము పంపుటకు, భరతునికి పట్టాభిషేకము చేయుటకు దుష్టతలంపు చేసెను. అందుకు ఆ కైకేయి తనకు దశరథుడు గతంలో ఇచ్చిన రెండు వరములను వేడెను. అంత ఆ దశరథుడు ధర్మపాశ బద్ధుడై సత్యవచనమువలన ప్రియపుత్రుడగు రాముడిని వనవాసమునకు పంపెను. శ్రీరాముడు తండ్రి ప్రతిజ్ఞను పాలించుటకు, కైకేయికి ప్రియమగుటకై తండ్రిగారి ఆజ్ఞచొప్పున వనమునకు వెడలెను (27)

వినయసంపన్నుడును, సుమిత్రాదేవి కుమారుడును, శ్రీరామునికి ప్రియమైన తమ్ముడు అయిన లక్ష్మణుడు అన్నదమ్ముల అన్యోన్య ప్రేమానుబంధమును చూపుటకు శ్రీరాముని అనుసరించెను. జనకునికి కుమార్తె యై, దేవమాయవలే అవతరించినట్టిది అగు సీత శ్రీరాముని ప్రాణప్రేయసి. సకల లక్షణ సంపూర్ణవతి.

**సీతా౽ప్యనుగతా రామం శశినం రోహిణీ యథా ।**
**పౌరైరనుగతో దూరం పిత్రా దశరథేన చ ॥ 28**

**శృంగబేరపురే సూతం గఙ్గాకూలే వ్యసర్జయత్ ।**
**గుహమాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్ ॥ 29**

**గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా ।**
**తే వనేన వనం గత్వా నదీస్తీర్త్వా బహూదకాః ॥ 30**

చిత్రకూటమనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్ ।
రమ్యమావసథం కృత్వా రమమాణా వనే త్రయః ॥ 31

దేవగన్ధర్వసంకాశాస్తత్ర తే న్యవసన్సుఖమ్ ।
చిత్రకూటం గతే రామే పుత్రశోకాతురస్తదా ॥ 32

రాజా దశరథః స్వర్గం జగామ విలపన్సుతమ్ ।
గతే తు తస్మిన్ భరతో వసిష్ఠప్రముఖైర్ద్విజైః ॥ 33

నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛద్రాజ్యం మహాబలః ।
స జగామ వనం వీరో రామపాదప్రసాదకః ॥ 34

గత్వా తు సుమహాత్మానం రామం సత్యపరాక్రమమ్ ।
అయాచద్భ్రాతరం రామమార్యభావపురస్కృతః ॥ 35

త్వమేవ రాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్ ।
రామోఽపి పరమోదారః సుముఖః సుమహాయశాః ॥ 36

ఉత్తమ నారీమణియు అగు సీతాదేవి; చంద్రునితో రోహిణీదేవి వలె, శ్రీరామునితో అడవికి వెడలెను. పౌరులును, దశరథుడును కొంతదూరము వెంబడించి పంపిరి (28). ధర్మాత్ముడైన ఆ రాముడు గంగాతీరమునందలి 'శృంగబేర'మను పురమున బోయవాండ్రకు అధిపతియై, తనయందు ప్రీతిగల గుహునితో గలసి సీతా,లక్ష్మణులతోడ అచ్చటనిలిచి, సుమంత్రుడగు సారథిని అయోధ్యకు త్రిప్పిపంపెను. అ సీతారామలక్ష్మణులు వనమునుండి వనమునకు నడుచుచు, నిండుగా ప్రవహించు నదులనుదాటి భరద్వాజమహర్షి యొక్క ఆజ్ఞతో చిత్రకూటమను పర్వతమున మనోహరమగు పర్ణశాలను నిర్మించుకొని అచ్చట వనకేళినందుచు; దేవతలతోను, గంధర్వులతోను సమానులై సుఖముగానుండిరి. రాముడు చిత్రకూటమును చేరిన తరువాత, పుత్రదుఃఖ పీడితుడైన దశరథుడు శ్రీరాముని తలంచుచూ యేడ్చి యేడ్చి దేవలోకముచేరెను. దశరథుడు మృతినందిన వెనుక మహాబలుడగు భరతుడు; వసిష్ఠులు మొదలగు బ్రాహ్మణులు చెప్పినను రాజరికమును కోరలేదు. రాగ, ద్వేషాదులను జయించిన భరతుడు శ్రీరాముని అనుగ్రహమునుకోరుటకు అరణ్యమునకు వెడలి, వినయముతో కూడుకొనిన వాడై, పూజ్యమగు హృదయమును ఎడతెగని సత్యవ్రతమును గల తన అన్నయగు రాముని జేరి "నీవు సమస్త ధర్మములను తెలిసిన వాడవు. చిన్నవాడు రాజు కారాదను ధర్మము నీకును తెలిసినదే. కావున నీవేరాజు, తక్కినవారెవ్వరును రాజు కానేరరు." అని ప్రార్థించెను. అంత మహాబలుడగు రాముడు

యుజ్యము మొదలగు సకలకోరికలను తీర్చువాడైనను, యాచకలాభముచే ప్రసన్నముఖారవిందుడైనను, దానాతిశయమువలన గల్గిన సత్కీర్తి గలవాడయినను, ఒక్కబాణముచేతనే సమస్తరాక్షసులను సంహరించునంతటి సామర్థ్యముకలిగినవాడైనను, తండ్రియాజ్ఞవలన రాజ్యమును కోరలేదు.

**న చైచ్ఛత్పితురాదేశాద్రాజ్యం రామో మహాబలః ।**
**పాదుకే చాస్య రాజ్యాయ న్యాసం దత్వా పునః పునః ॥ 37**

**నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః ।**
**స కామమనవాప్యైవ రామపాదావుపస్పృశన్ ॥ 38**

**నన్దిగ్రామేఽకరోద్రాజ్యం రామాగమనకాంక్షయా ।**
**గతే తు భరతే శ్రీమాన్ సత్యసంధో జితేంద్రియః ॥ 39**

**రామస్తు పునరాలక్ష్య నాగరస్య జనస్య చ ।**
**తత్రాగమనమేకాగ్రో దండకాన్ ప్రవివేశ హ ॥ 40**

**ప్రవిశ్య తు మహారణ్యం రామో రాజీవలోచనః ।**
**విరోధ రాక్షసం హత్వా శరభఙ్గం దదర్శ సః ॥ 41**

**సుతీక్ష్ణం చాప్యగస్త్యం చ హ్యగస్త్యభ్రాతరం తథా ।**
**అగస్త్యవచనాచ్చైవజగ్రాహైంద్ర శరాసనమ్ ॥ 42**

**ఖడ్గం చ పరమప్రీతస్తూణీ చాక్షయసాయకౌ ।**
**వసతస్తస్య రామస్య వనే వనచరైః సహ ॥ 43**

**ఋషయోఽభ్యాగమన్ సర్వే వధయాసురరక్షసామ్ ।**
**స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం వధాయ చ ॥ 44**

అయితే, తాను తిరిగి వచ్చునంత వరకు తనకు మారుగా భరతునికి రాజ్యమేలుటకై తన పాదుకలనిచ్చి, అతనిని సమాధానపరచి అయోధ్యకు పంపెను. భరతుడు రామసేవ తనకులభించలేదను వ్యర్థమనో రథముతో, రామపాదుకలను సేవించుచు, అయోధ్యలో ఉండగోరక, నందిగ్రామమునందు రాముని రాకను నిరీక్షించుచు రాజ్యముచేసెను. భరతుడు పోగానే, భరతాగమనముచే గల్గిన ప్రతిజ్ఞా భంగ భయము పోయినందున సత్కాంతిగలవాడును, భరతుడు నిర్బంధించినను ఎంతమాత్రము

చెలింపనివాడు, జితేంద్రియుడునగు రాముడు ఆ చిత్రకూటమందు తానుండటం అందరికి తెలిసినందున భరతాదులు మరల అచ్చటికి వత్తురని ఊహించి పితృవాక్య పరిపాలనయందు సావధానుడై దండకావనమున ప్రవేశించెను (40) నళిననయనుడగు రాముడట్లు వనమున ప్రవేశించి, విరాధుడను రాక్షసుని జంపి, శరభంగమునిని, సుతీక్ష్ణమునిని, అగస్త్యమునిని, అగస్త్యభ్రాతయగు సుదర్శనమునినీ చూచెను. అగస్త్యుడు తనకు ఇంద్రుడిచ్చిన ధనుర్బాణ అక్షయ తూణీరములను అర్పింపగా, అవి తన పరాక్రమమునకు తగినవని శ్రీరాముడు అంగీకరించెను. ఆ శరభంగుని ఆశ్రమమునందు శ్రీరాముడు వసించుచుండగా అతనివద్దకు చుట్టుప్రక్కలనుండు సమస్త ఋషులు వచ్చి దుర్మార్గులగు రాక్షసులను సంహరింపుమని ప్రార్థించిరి.

**ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధః సంయతి రాక్షసామ్ ।**
**ఋషీణామగ్నికల్పానాం దండకారణ్యవాసినామ్ ॥ 45**

**తేన తత్రైవ వసతా జనస్థాననివాసినీ ।**
**విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ ॥ 46**

**తతః శూర్పణఖావాక్యాదుద్యుక్తాన్ సర్వరాక్షసాన్ ।**
**ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్ ॥ 47**

**నిజఘాన రణే రామస్తేషాం చైవ పదానుగాన్ ।**
**వనే తస్మిన్నివసతాం జనస్థాననివాసినామ్ ॥ 48**

**రక్షసాం నిహతాన్యాసన్ సహస్రాణిచతుర్దశ ।**
**తతో జ్ఞాతివధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః ॥ 49**

**సహాయం వరయామాస మారీచం నామ రాక్షసమ్ ।**
**వార్యమాణః సుబహుశో మారీచేన స రావణః ॥ 50**

**న విరోధో బలవతా క్షమో రావణ తేన తే ।**
**అనాదృత్య తు తద్వాక్యం రావణః కాలచోదితః ॥ 51**

**జగామ సహమారీచస్తస్యాశ్రమపదం తదా ।**
**తేన మాయావినా దూరమపవాహ్య నృపాత్మజౌ ॥ 52**

జహార భార్యాం రామస్య హత్వా గృధ్రం జటాయుషమ్ ।
గృధ్రం చ నిహతం దృష్ట్వా హతాం శ్రుత్వా చ మైథిలీమ్ ॥ **53**

రాఘవః శోకసన్తప్తో విలలాపాకులేంద్రియః ।
తతస్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్ ॥ **54**

మార్గమాణో వనే సీతాం రాక్షసం స దదర్శ హ ।
కబంధం నామరూపేణ వికృతం ఘోరదర్శనమ్ ॥ **55**

తం నిహత్య మహాబాహుర్దదాహ స్వర్గతశ్చ సః ।
స చాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్ ॥ **56**

శ్రమణీం ధర్మనిపుణామభిగచ్ఛేతి రాఘవ ।
సోఽభ్యగచ్ఛన్మహాతేజాః శబరీం శత్రుసూదనః ॥ **57**

శబర్యా పూజితః సమ్యగ్రామో దశరథాత్మజః ।
పంపాతీరే హనుమతా సంగతో వానరేణ హ ॥ **58**

హనూమద్వచనాచ్చైవ సుగ్రీవేణ సమాగతః ।
సుగ్రీవాయ చ తత్సర్వం శంసద్రామో మహాబలః ॥ **59**

శ్రీరాముడు ఋషుల ప్రార్థనలను అంగీకరించెను. అగ్నిహోత్రమువలె పరిశుద్ధస్వభావులై దండకారణ్యమునందు వాసము చేయుచుండు మునీంద్రులకొరకు "తప్పక రణరంగమున రాక్షసులను సంహరించెద" నని ప్రతిజ్ఞజేసెను. కొంతకాలము అచ్చటనే వసించెను. రావణుని సేనా నివేశస్థానమగు జనస్థానమందు వాసము జేయుచు కామరూపిణియైయున్న శూర్పణఖయను రక్కసికి ముక్కు, చెవులు కోసి విరూపిణిగా జేసెను. అంత ఆ శూర్పణఖ వాక్యముచే యుద్ధమునకువచ్చిన ఖర, దూషణ, త్రిశిరులను వారి సేనలను శ్రీరాముడు సంహరించెను. జనస్థానమున శ్రీరామునిచే 14 వేలమంది రాక్షసులు చంపబడిరి. పిమ్మట దాయాదులయొక్క చావునువిని రావణుడు క్రోధపరవశుడై మారీచుని సహాయము వేడెను. వాడు "రావణా! బలవంతుడగు రామునితో పగ తగదు" అని పలుమార్లు అడ్డగించినను, రావణుడు తనకు మృత్యువు సమీపించి యున్నందున వానిమాటలను వినక, వానితో రాముని ఆశ్రమమునకే వచ్చి, మాయాకాయుడగు మారీచునిచే రాచకుమారులగు రామ లక్ష్మణులను దూరముగాతొలగి పోవునట్లు చేసి జటాయువను గృధ్రరాజునుచంపి, రామపత్నియగు సీతాదేవిని అపహరించెను. మృత్యుముఖమున పడియున్న జటాయువును చూచి, వానివలన సీతాపహరణమును

విన్న శ్రీరామడు ఎంతో దుఃఖితుడాయెను. అంత రాముడు దుఃఖముతోనే తనతండ్రికి మిత్రమగు జటాయువునకు దహనసంస్కారము చేసి వనమున సీతను వెదకుచు వికృతుడైయున్న కబంధుడిని చంపెను. ఆ కబంధుడు రామునిచే చంపబడి దహన సంస్కారమునంది, స్వర్గమునకు పోవుచూ "రామా! ధర్మముల ఆచరించుచు విరక్తయై యుండు ధర్మతత్త్వములలో నేర్పరియగు శబరివద్దకు పొమ్ము" అని చెప్పి గతించెను. ఆ తరువాత శ్రీరాముడు శబరివద్దకు వచ్చి ఆమెచే సత్కరింపబడి, పంపాతీరమున ఆంజనేయునితో కలిసెను. ఆ కపీంద్రుని వచనములు సుగ్రీవునితో కలిపినవి.

ఆదితస్తద్యథావృత్తం సీతాయాశ్చ విశేషతః ।
సుగ్రీవశ్చాపి తత్సర్వం శ్రుత్వా రామస్య వానరః ॥ 60

చకార సఖ్యం రామేణ ప్రీతశ్చైవాగ్నిసాక్షికమ్ ।
తతో వానర రాజేన వైరానుకథనం ప్రతి ॥ 61

రామాయావేదితం సర్వం ప్రణయాద్దుఃఖితేన చ ।
ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి ॥ 62

వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః ।
సుగ్రీవః శఙ్కితశ్చాసీన్నిత్యం వీర్యేణ రాఘవే ॥ 63

రాఘవప్రత్యయార్థం తు దుందుభేః కాయముత్తమమ్ ।
దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్ ॥ 64

ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్య చాస్థి మహాబలః ।
పాదాఙ్గుష్ఠేన చిక్షేప సమ్పూర్ణం దశయోజనమ్ ॥ 65

బిభేద చ పునస్తాలాన్ సప్తైకేన మహేషుణా ।
గిరిం రసాతలం చైవ జనయన్ప్రత్యయం తదా ॥ 66

తతః ప్రీతమనాస్తేన విశ్వస్తః స మహీపతిమ్ ।
కిష్కింధాం రామసహితో జగామ చ గుహాం ప్రతి ॥ 67

తతోఽగర్జద్ధరివరః సుగ్రీవో హేమపింగళః ।
తేన నాదేన మహతా నిర్జగామ హరీశ్వరః ॥ 68

**అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః ।**
**నిజఘాన చ తత్రైనం శరేణైకేన రాఘవః ॥ 69**

**తతః సుగ్రీవవచనాద్గత్వా వాలినమాహవే ।**
**సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్ ॥ 70**

**స చ సర్వాన్సమానీయ వానరాన్వానరర్షభః ।**
**దిశః ప్రస్థాపయామాస దిదృక్షుర్జనకాత్మజామ్ ॥ 71**

సుగ్రీవునితో స్నేహము కుదుర్చుకున్న శ్రీరాముడు, సుగ్రీవునికి మొదటినుండి తనయొక్క సీతయొక్క వృత్తాంతమును వివరించి చెప్పెను. అపుడు సుగ్రీవుడు అంతటినీ విని అగ్నిసాక్షిగా మిత్రత్వమునందెను. అపుడు కపిరాజగు సుగ్రీవుడు దుఃఖించుచు, వాలితో తనకుగల విరోధ వృత్తాంతమును శ్రీరామునికి విన్నవించెను. రాముడు వాలిని వధించుటకై ప్రతిజ్ఞ చేసెను. సుగ్రీవుడు శ్రీరామునికి వాలియొక్క బలమును తెలిపి, “ఇతడు వాలిని చంపుటకు సమర్థుడు అవునో కాదో యని సందేహించుచుండెను, మరియు సుగ్రీవుడు రామునియందు నమ్మకము కలుగుటకై దుందుభియను వాని కొండవంటి దేహమునుచూపెను, అపారబలుడగు శ్రీరాముడు దానిని యిది యెంతమాత్రమని నిర్లక్ష్యముగా చిరునవ్వు నవ్వి, తన కాలిబొటన వ్రేలిచే పదియోజనముల దూరము చిమ్మెను. మరల ఏడుమద్దిచెట్లను, సమీపమందుండు కొండను, రసాతలలోకమును కూడ నొకబాణముచే నమ్మకము పెంచువాడై ఛేదించెను. పిదప కనక పింగళ వర్ణుడగు సుగ్రీవ కపివీరుడు గర్జించెను. ఆ నాదమునువిని వాలియుద్ధమునకు బయలుదేరెను. ఆ సమయమునందు తారయను భార్య యుద్ధమునకు తన అసమ్మతిని తెలిపెను. సుగ్రీవునితో కూడినవాడైన రాముడు ఒక్క బాణము చేతనే ఆ వాలిని సంహరించి, సుగ్రీవునికి కపిరాజ్యపట్టాభిషేకము చేయించెను. అ సుగ్రీవుడు సమస్త వానరులను పిలిపించి, సీతను వెదకుటకు నాలుగు దిక్కులకు పంపెను.

**తతో గృధ్రస్య వచనాత్సంపాతేర్హనుమాన్బలీ ।**
**శతయోజనవిస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్ ॥ 72**

**తత్ర లఙ్కాం సమాసాద్య పురీం రావణపాలితామ్ ।**
**దదర్శ సీతాం ధ్యాయన్తీమశోకవనికాం గతామ్ ॥ 73**

**నివేదయిత్వాఽభిజ్ఞానం ప్రవృత్తిం చ నివేద్య చ ।**
**సమాశ్వాస్య చ వైదేహీ మర్దయామాస తోరణమ్ ॥ 74**

పంచ సేనాగ్రగాన్హత్వా సప్త మంత్రిసుతానపి ।
శూరమక్షం వినిష్పిష్య గ్రహణం సముపాగతమ్ ॥ 75

అస్త్రేణోన్ముక్తమాత్మానం జ్ఞాత్వా పైతామహాద్వరాత్ ।
మర్దయన్ రాక్షసాన్వీరో మంత్రిణస్తాన్యదృచ్ఛయా ॥ 76

తతో దగ్ధ్వా పురీం లఙ్కాం మృతే సీతాం చ మైథిలీమ్ ।
రామాయ ప్రియమాఖ్యాతుం పునరాయాన్మహాకపిః ॥ 77

సోఽభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్ ।
న్యవేదయదమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః ॥ 78

తతః సుగ్రీవసహితో గత్వా తీరం మహోదధేః ।
సముద్రం క్షోభయామాస శరైరాదిత్యసన్నిభైః ॥ 79

దర్శయామాస చాత్మానం సముద్రః సరితాం పతిః ।
సముద్రవచనాచ్చైవ నలం సేతుమకారయత్ ॥ 80

తేన గత్వా పురీం లఙ్కాం హత్వా రావణమాహవే ।
రామః సీతామనుప్రాప్య పరాం వ్రీడాముపాగమత్ ॥ 81

తామువాచ తతో రామః పురుషం జనసంసది ।
అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం ప్రతి ॥ 82

సీతను వెదుకుటకు దక్షిణదిక్కుకు వెళ్ళిన హనుమంతుడు మార్గమధ్యమున సంపాతీయను గ్రద్ద పలుకుల వలన 100యోజనములుగల దక్షిణ లవణసముద్రమును దాటెను. అచ్చట రావణ పాలితమగు లంకాపట్టణములో ప్రవేశించెను. లంకలో అశోకవనమున రామధ్యాన తత్పరయగు సీతాదేవిని దర్శించెను. ఆమెకు ఆనవాలయిన రామముద్రిక నర్పించి, రాముని వృత్తాంతమును విన్నవించి సీతనూరడిల్లజేసెను. లంకాబహిర్ద్వారమును పడగొట్టెను, మరియు ఆ మారుతి 5 మంది సేనాపతులను, 7 మంది మంత్రిపుత్రులను చంపి, శూరుడగు అక్ష కుమారుడిని పిండిచేసి, ఇంద్రజిత్తుచే బంధింపబడినను, బ్రహ్మవరమువలన బ్రహ్మాస్త్రముచే విడువబడినవానిగా తనకు తెలిసినప్పటికీ, తనను కట్టితీసికొనిపోవు రాక్షసులను సహించుచు మన్నించుచునే, సీతయుండెడు

చోటు తప్ప తక్కిన లంకాపట్టణమును తెగగాల్చి, శ్రీరామునికి ప్రియవార్తను విన్నవించుటకై వెనుకకు తిరిగెను. అట్లే మహాత్ముడగు శ్రీరామునికి ప్రదక్షిణ నమస్కారము చేసి, సీతావృత్తాంతమును విజ్ఞాపించెను. అంత ఆ రఘువీరుడు సుగ్రీవునితో కలసి మహాసముద్రపు ఒడ్డుకు వచ్చి, తన బాణములచే సముద్రుని అల్లకల్లోలము చేసెను. సముద్రునికి తన నిజస్వరూపము చూపెను. అంత ఆ నదీపతి వాక్యముచే నలునిచే సేతువును నిర్మింపచేసెను. ఆ సేతుమార్గమున లంకకు వెళ్ళి, రావణుని సంహరించి, సీతనుపొంది, రాక్షసగృహవాసము చేసిన సీతను చేకొంటిని అని సిగ్గునంది, సభలో సీతనుచూచి, క్రూరవాక్యము పలికెను. అంత ఆమె దానినోర్వజాలక అగ్నిలో ప్రవేశించెను.

**తతోఽగ్నివచనాత్సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్ ।**
**కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్ ॥ 83**

**సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః ।**
**బభౌ రామః సుసన్తుష్టః పూజితః సర్వదైవతైః ॥ 84**

**అభిషిచ్య తు లఙ్కాయాం రాక్షసేంద్రం విభీషణమ్ ।**
**కృతకృత్యస్తదా రామో విజ్వరః ప్రముమోద హ ॥ 85**

**దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్ ।**
**అయోధ్యాం ప్రస్థితో రామః పుష్పకేణ సుహృద్వృతః ॥ 86**

**భరద్వాజాశ్రమం గత్వా రామః సత్యపరాక్రమః ।**
**భరతస్యాంతికే రామో హనూమంతం వ్యసర్జయత్ ॥ 87**

**పునరాఖ్యాయికాం జల్పన్సుగ్రీవ సహితస్తదా ।**
**పుష్పకం తత్సమారుహ్య నందిగ్రామం యయౌ తదా ॥ 88**

**నందిగ్రామే జటాం హిత్వా భ్రాతృభిః సహితోఽనఘః ।**
**రామః సీతామనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్ ॥ 89**

**న పుత్రమరణం కేచిద్ద్రక్ష్యన్తి పురుషాః క్వచిత్ ।**
**నార్యశ్చావిధవా నిత్యం భవిష్యన్తి పతివ్రతాః ॥ 90**

**ప్రహృష్టముదితో లోకస్తుష్టః పుష్టః సుధార్మికః ॥**
**నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్షభయవర్జితః ॥ 91**

**నా చాగ్నిజం భయం కించిన్నాప్సు మజ్జంతి జంతవః ।**
**న వాతజం భయం కించిన్నాపి జ్వరకృతం తథా ॥ 92**

**న చాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా ।**
**నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ ॥ 93**

పిదప శ్రీరాముడు అగ్నిభట్టారకుని వచనమువలన సీతాదేవి పాపరహిత యను సంగతిని గ్రహించి, సకల దేవతలచేతను పూజింపబడి, మిక్కిలి సంతోషించి విరాజించెను. మహాత్ముడగు రామునియొక్క శ్రేష్ఠమయిన రావణవధరూపమగు కార్యముచేత స్థావర జంగమాత్మకమును, దేవర్షి గణ సమేతమయిన ముల్లోకములు సంతోషించెను. రాక్షసపతియగు విభీషణునికి ఆ లంకా పట్టణమునిచ్చి, శ్రీరాముడు తన కర్తవ్యమును నిర్వర్తించి, సంతాపముతీరి సంతోషించెను. అట్లే దేవతలనుండి వరమునంది, మృతులైన వానరులను బ్రతికించుకొని, మిత్రులు మొదలగు వారందరితో పుష్పకము నెక్కి, అయోధ్యకువెడలెను. ఇట్లు వచ్చి భరద్వాజాశ్రమమున సత్కరింపబడి, అచ్చటినుండి భరతునివద్దకు హనుమంతుని పంపెను. పిదప రాముడు జరిగినసంగతిని మాటలాడుచు పుష్పకమునెక్కి నందిగ్రామమునకు వచ్చి, అచ్చట తమ్ములతో జటలను వదలి, సీతాసమేతుడై రాజ్యసామ్రాజ్యమును అనుభవించెను. (89) లోకము సంతుష్టినంది, సకల ధర్మములు గలదియును, శారీరిక, మానసిక వ్యాధులు లేనిదియును, క్షామ డామరాది భయములు లేనిదియునయ్యె. రామరాజ్యమున ఎచ్చటను నరులు పుత్రశోకము నెరగరు. పతివ్రతలగు స్త్రీలందరును సుమంగళులై నిత్యానందమునంది యుందురు. జల, అగ్ని, వాతజ భయములు లేవు. జ్వరాది పీడలు లేవు. ఆకలిగొని యేడ్చువారుండరు, దొంగతనము లేదు. పురములు, దేశములు ధన ధాన్య పూర్ణములు.

**నిత్యప్రముదితాః సర్వే యథా కృతయుగే తథా ।**
**అశ్వమేధశతైరిష్ట్వా తథా బహుసువర్ణకైః ॥ 94**

**గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం గమిష్యతి ।**
**అసంఖ్యేయం ధనం దత్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః ॥ 95**

రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః ।
చాతుర్వర్ణ్యం చ లోకేఽస్మిన్ స్వే స్వే లోకే నియోక్ష్యతి ॥ **96**

దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ ।
రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి ॥ **97**

ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్ ।
యః పఠేద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే ॥ **98**

ఏతదాఖ్యానమాయుష్యం పఠన్ రామాయణం నరః ।
సపుత్రపౌత్రః సగణః ప్రేత్య స్వర్గే మహీయతే ॥ **99**

పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వమీయాత్ ।
వణిగ్జనః పణ్యపతిత్వమీయాత్
జనశ్చశూద్రోఽపి మహత్త్వమీయాత్ ॥ **100**

ఏవం శిష్య నారదేన మునినా యచ్చ ధీమతా ।
వాల్మీకయే వేదవాక్యైర్యావన్మాత్రం నివేదితమ్ ॥ **101**

తావదేవార్థమాదాయ శ్లోకబద్ధం మనోరమమ్ ।
వాల్మీకినా కృతం పూర్వం లఘురామాయణాభిధమ్ ॥ **102**

శతశ్లోకమితం స్వీయకవితాయాం చ తన్మయా ।
తవాగ్రే కథితం సర్వం శ్రవణాత్పుణ్యవర్ధనమ్ ॥ **103**

బ్రహ్మదత్తవరేణైవ సర్వం జ్ఞాత్వా స వై మునిః ।
శతకోటిమితాం రామక్రీడాం శ్లోకైర్బబంధ హ ॥ **104**

ఇతి శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే,
లఘురామాయణం నామ, ప్రథమస్సర్గః ॥

కృతయుగము వలె రామరాజ్యమున అందరూ ఆనందించుచుందురు. కీర్తిసంపన్నుడైన శ్రీరాముడు ఆ సమయమున ఆపరిమితములగు దక్షిణలనిచ్చి, నూరు అశ్వమేధాది క్రతువులనాచరించి, కోట్లకొలది గోవులను దానము చేసి బ్రహ్మలోకమును పొందుచున్నాడు, రాజవంశములను నూరింతలుగా నిలుపబోవుచున్నాడు. వర్ణాశ్రమధర్మములను చక్కగా స్థాపించి రక్షించుచున్నాడు. 11,000 వేల సంవత్సరములు రాజ్యమేలి బ్రహ్మలోకమునందుచున్నాడు.

ఇది రామచరిత్రము. మిక్కిలి రమ్యము, పరమ పవిత్రము, వేదసంమతము. దీనిని పఠించినవారు సర్వపాపములనుండి విముక్తులగుదురు. ఈ కథ ఆయుష్యము నిచ్చునది. దీనిని పఠించువాడు సపరివారముగా భుక్తి, ముక్తులనందును. దీనిని పఠించిన బ్రాహ్మణుడు శబ్దబ్రహ్మతత్త్వము నెరిగిన వాడగును. క్షత్రియుడు భూపతియై వెలుగును. వైశ్యుడు వాణిజ్యవృద్ధినంది ఆనందించును. శూద్రుడును ఉత్తమ ఆనందమును పొంది సుఖించుచున్నాడు.” అని యిట్లు సర్వజ్ఞుడగు నారద మునీంద్రుడు వేదవాక్యములచే ఆ మహర్షికి ఉపదేశించెను. ఆ యర్థమునే మొదట శ్లోకబద్ధముగా ఆ వాల్మీకి లఘురామాయణమని రచించెను. అట్టి శతశ్లోక రామాయణమును నీకును చెప్పితిని. ఇది వినినమాత్రమున పుణ్యప్రదమయినది. బ్రహ్మ వరముచే దీనిమీదనే శతకోటి రామచరిత్రను అభివర్ణించి వాల్మీకి ఆదికవి అయ్యె.

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో రామాయణమును క్లుప్తముగా వివరించు, 1వ సర్గ ముగిసినది.**

# ద్వితీయః సర్గః–2వ సర్గ

కౌసల్యాది తల్లులు వైకుంఠమునకు వెళ్ళుట

శ్రీరామదాస ఉవాచ

అథైకదా సభామధ్యే పౌరా జానపదాదయః ।
జ్ఞాత్వా రామం పరాత్మానం పప్రచ్ఛుర్వినయాన్వితాః ॥ 1

రామ రామ మహారాజ కించిదుపదిశస్వ నః ।
విషయాసక్తచిత్తానాం జ్ఞానం యేన భవిష్యతి ॥ 2

ఇతి తేషాం వచః శ్రుత్వా రాఘవః సస్మితోఽబ్రవీత్ ।
నిరంతరం హ్యుపదేశో యుష్మాభిః శ్రూయతే న కిమ్ ॥ 3

ప్రహరే ప్రహరే రాత్రౌ మద్దూతైః క్రియతే సదా ।
అస్తు తచ్చ గతం పూర్వమిదానీం సకలైర్జనైః ॥ 4

అద్య మద్దూతవచనం నిశాయాం బుద్ధిపూర్వకమ్ ।
శ్రుత్వా విచార్య పశ్చాన్మాం ప్రష్టవ్యం యత్తు రోచతే ॥ 5

తథేతి రామవచనాత్సర్వే గత్వా నిజం నిజమ్ ।
గేహం తే స్వస్థచిత్తాశ్చ స్వస్త్రీభిర్మంచకాదిషు ॥ 6

దూతవాక్యే దత్తకర్ణా రాత్రౌ తస్థురనిద్రితాః ।
తావత్తే రామదూతాశ్చ సార్ధయామే సదీపకాః ॥ 7

ధృతశస్త్రా దండహస్తా నానావాహనసంస్థితాః ।
గజేషు దుందుభీన్ ధృత్వా తథావాద్యాన్యనేకశః ॥ 8

ధృత్వా పృథక్ పృథక్ నానాయానేషు మంజులాని హి ।
రాజమార్గేషు సర్వత్ర దీర్ఘశబ్దానుదీరయన్ ॥ 9

హే జనాః శ్రూయతాం సర్వే కిం మోహేన వినిద్రితాః ।
నేయం నిద్రా సమీచీనా కదాఽనర్థో భవిష్యతి ॥ 10

## శ్రీరాముడు పౌరులకు జ్ఞానోపదేశము చేయుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "పిమ్మట ఒకానొకప్పుడు నాగరీకులు, దేశస్థులు మొదలగువారు; సభాసీనుడైన శ్రీరాముని పరాత్పర బ్రహ్మమని తెలుసుకుని, వినయభావముతో, "మహారాజగు శ్రీరామమూర్తీ! మాకు కొంచెము జ్ఞానము ఉపదేశింపుము. ఇంద్రియ భోగాపేక్షలలో ఆసక్తులగువారికి దేనిచేత జ్ఞానముగల్గును?" అని వేడుకొనిరి. అందుకు శ్రీరాముడు నవ్వుచు, "ఎల్లప్పుడును చేయుచుండు ఉపదేశమును వినలేదా ఏమి? రాత్రిపూట ప్రతిజామునను నా యొక్క దూతలు బోధ చేయుచుందురే. కానీండు, గతించిన దినములు పోనిండు. అందరును బుద్ధి పూర్వకముగా నేటిరాత్రి నాయొక్క దూత వచనములను విని, తమలో తాము విచారించుకొనిన పిమ్మట మీకెట్లు తోచిన అట్లు నన్నడగండి." అని ఆనతిచ్చెను. అట్లేయని వారందును శ్రీరామవచమును ఎంచి, తమతమ గృహములకు పోయి, సమాహితమనస్కులై, తమ భార్యలతో రాత్రి పవ్వళించి, నిద్రపోక, దూతవాక్యము కొరకు చెవిమరల్చి నిరీక్షించుచుండిరి. రాత్రి నాలుగవ జాము కాగా; రామదూతలు ఆయుధములు ధరించి, ఏనుగులమీద దుందుభులను మ్రోగించుచు, దీపములతో రాజమార్గమున నడుచుచూ.....

"ఓ జనులారా! మీరందరును వినుడు; మోహముచే నిద్రించుచున్నారేమి? ఈనిద్ర మంచిది కాదు. ఎప్పుడేమనర్థమగునో! సావధానముగా మామాట వినుడు.

**స్వస్థచిత్తాస్త్వద్య సర్వే భూత్వా నః శ్రూయతాం వచః ।**
**నవద్వారాణ్యయోధ్యాయామేకం తు లఘు వర్తతే ॥ 11**

**రామరాజ్యే భయం నేతి కారణాద్ద్వారరక్షకైః ।**
**దీయంతే వా న దీయంతే కవాటాదీని వై తదా ॥ 12**

**నార్గలా శృంఖలాదీని సంతి ద్వారేషు భో జనాః ।**
**కృష్ణవర్ణో మహాంశ్చోరో యామ్యాశాయాం స్థితస్త్వితి ॥ 13**

**శ్రూయతే న కదా దృష్టః కేనాపి భువి సాంప్రతమ్ ।**
**ఏవం సత్యపి నోపేక్షా రోగశాంత్యై ప్రకార్యతే ॥ 14**

**గుప్తరూపాస్తస్య దూతాః సాకేతే విచరంతి హి ।**
**న జ్ఞాయతే కదాఽస్మాభిర్నాగరా ఇవ సంస్థితాః ॥ 15**

**ఆగతశ్చేత్పురో దూతస్త్వేకే దుర్గే తదా క్షణాత్ ।**
**భేదం కృత్వా తు సర్వత్ర దుర్గపాలో నిహన్యతే ॥ 16**

ఇత్థం శ్రుతం సదాఽస్మాభిస్తత్స్వస్యాం సహస్రశః ।
వర్తంతే పరదూతాశ్చ నానావేషధరా జనాః ॥ 17

జీవత్వయం చిరం రాజా ఏవం సత్యపి నో భయమ్ ।
అయోధ్యాయాం జాయతే హి తద్బలం కో వదిష్యతి ॥ 18

ఏభిర్దూతైస్తస్య రాజ్ఞ ఆత్మారామస్య చాత్ర హి ।
కరణీయం ప్రభోః కిం హి సచ్చిదానందరూపిణః ॥ 19

తేషాం భయం తు యుష్మాకం దుర్బలానాం సదాఽస్తి హి ।
అజాపుత్రో దుర్బలోఽత్ర బల్యర్థం దీయతే జనైః ॥ 20

ఈ అయోధ్యకు తొమ్మిది ద్వారములు గలవు, వాటిలో ఒకటి తేలికైనది. ఇట్లుండునపుడు ద్వార రక్షకులు రామరాజ్యమున భయములేదను కారణముచేత నిర్భయులై తలుపులు వేయుదురో వేయరో! ఓ జనులారా! తాళములు గాని తలుపు గడియలుగాని లేవు. నల్లనివాడైన గొప్ప దొంగయొకడు దక్షిణదిక్కున గలడని వినబడుచున్నది. ఇప్పుడెవ్వడును పుడమిని చూడలేదు. ఇట్లున్నను రోగశాంతికై ఉపేక్షింపరాదు. నగరవాసులవలె వాని దూతలు అయోధ్యలో సంచరించుచున్నారుగదా? ఎప్పుడును వారు మనచే ఎరుగ బడరు. కోటలోనికి శత్రుదూత ఒక్కడు వచ్చినట్లైన వాడు క్షణమాత్రమున కోట కాపలాదారుని చంపివేయునని ఈ విధముగా యెల్లపుడును వినుచున్నాము. కావున ఈ ఊరిలో యమదూతలు వేలకొలదిగా వివిధ వేషములు ధరించి యున్నారు. ఇట్లుండినను ఈ రాజు చిరకాలము బ్రతుకని, మనకీ అయోధ్యయందు భయము పుట్టదు. వానిబలమెవ్వడు చెప్పును? ఈ దూతలనే ఆక్రమించినవాడు సచ్చిదానంద రూపుడును, ఆత్మారాముడునగు ఈరాజునకు కర్తవ్యమేమిగలదు? వారిలో భయమనునది దుర్బలులగు మీకు ఎల్లప్పుడును కలుగదుగదా!

మేకపిల్ల దుర్బలము గనుక దానిని జనులు బలి యిచ్చుచున్నారు.

దత్తో బలిస్తు సింహస్య కదా కేన శ్రుతోఽత్ర న ।
అతో యూయం హీనబలాః కిం నిశాయాం వినిద్రితాః ॥ 21

కదా కృత్వాఽత్ర తే భేదం చోరమత్రానయంతి హి ।
స కాలో జ్ఞాయతే నైవ తస్మాన్నిద్రా శుభా న హి ॥ 22

స్వస్థచిత్తాస్త్యక్తనిద్రాస్త్వస్యాంపుర్యామహర్నిశమ్ ।
యూయం భూత్వా సదా ఖడ్గః శితో ధార్యః స్వసన్నిధౌ ॥ 23

**కవచాని శరీరేషు సదా ధార్యాణి భో జనాః ।**
**ధైర్యం ధృత్వా న భేతవ్యం యో జాగర్తి నిరంతరమ్ ॥ 24**

**అయోధ్యాయాం న తస్యాస్తి చోరాదపి కదా భయమ్ ।**
**నైతద్విస్మరణీయం హి సదాఽస్మాకం వచః శుభమ్ ॥ 25**

**సావధానాః సావధానాః సావధానాః సదా జనాః ।**
**భవధ్వం చాత్ర సాకేతపురి స్థాహి నిరంతరమ్ ॥ 26**

**ఇత్యుక్త్వా తే రాజదూతాః కృత్వా దుందుభినిః స్వనాన్ ।**
**వాదయామాసుర్వాద్యాని మంజులాని మహాంతి చ ॥ 27**

**ఏవం సర్వత్ర పుర్యాం తే విచేరూ రామసేవకాః ।**
**ఏవం నిశాయాం తైర్దూతైస్త్రివారం కించిదంతరాత్ ॥ 28**

**పౌరాద్యా బోధితాః ప్రాపుర్జ్ఞానం తస్య విచారతః ।**
**తతః ప్రభాతే తే సర్వే పౌరా జానపదాదయః ॥ 29**

**సభాయాం రాఘవం నత్వా తుష్టాః ప్రోచుః పురః స్థితాః ।**
**రామ రాజీవపత్రాక్ష త్వద్దూతవచనాని హి ॥ 30**

సింహము బలియివ్వబడిన సంగతి ఎవడు ఎప్పుడు ఎరుగడుకదా! కావున దుర్బలులగు మీరు రాత్రి యేమని నిద్రించెదరు? మీలో భేదమునెప్పుడు కల్పించి ఆదొంగ ఎప్పుడు పట్టుకొని పోవునో? ఆ కాలము తెలియదు గాన మంచినిద్ర లేదుగదా! మీరు సమాహితచిత్తులై నిద్రనువిడిచి ఈ పురమున పగలు, రాత్రి యెల్లప్పుడును కవచములను ధరించి, పదునైన ఖడ్గమునుబూని స్వసన్నిధానమున ధైర్యముగా ఉండదగును. భయమువలదు. ఎవరు నిరంతరము జాగరూకులై యుందురో వారి కెన్నటికిని దొంగవలన భయముండదు. మాయొక్క మంచిమాట నెన్నడును మరువవలదు. జనులారా! ముమ్మాటికి సావధానులై యుండండి." అని యిట్లు రామసేవకులు చాటించి, వాద్యములను వాయించి, ఊరంతటా సంచరించి, శ్రీరామసన్నిధి జేరిరి. ఇట్లు ఆరాత్రి ముమ్మారు. చాటింపబడినందున, పౌరులందరును జ్ఞానోపదేశము పొంది, తత్త్వవిచారముచే తమలో తాము మననముజేసికొని, తెల్లవారగానే లేచి, యెప్పటివలె సభకు వచ్చి, శ్రీరామునికి నమస్కరించిరి.

**శ్రూయంతేఽత్ర సదాఽస్మాభిర్న విచారస్తదా కృతః ।**
**అద్యాస్మాభిర్నిశాయాం హి త్వద్దూతవచనం శుభమ్ ॥ 31**

శ్రుత్వా కృతో విచారో హి హృది బుధ్యా తవాజ్ఞయా ।
లబ్ధం జ్ఞానం ప్రభోఽస్మాభిస్త్వజ్ఞానం తద్గతం హి నః ॥ 32

నేదానీముపదేశం హి త్వత్తో వాంఛామ రాఘవ ।
ఇతి తేషాం వచః శ్రుత్వా తాన్రామః ప్రాహ సస్మితః ॥ 33

కథం లబ్ధం హి తత్ జ్ఞానం కిం శ్రుతం కిం విచింతితమ్ ।
తన్మేఽగ్రేకథనీయం హి విస్తరేణ యథాక్రమమ్ ॥ 34

ఇతి రామవచః శ్రుత్వా జనాః ప్రోచుర్ముదాన్వితాః ।
శృణు రామ మహాబాహో యల్లబ్ధం జ్ఞానముచ్యతే ॥ 35

మోహ ఏవ నిశా జ్ఞేయా నిద్రా భ్రాంతిస్తు కథ్యతే ।
నేయం భ్రాంతిః సమీచీనాఽనర్థో మృత్యుర్గ్రసిష్యతి ॥ 36

అయోధ్యేయం స్వీయదేహస్తత్ర ఛిద్రాణి వై నవ ।
లఘు తన్మస్తకే జ్ఞేయం దంతాద్యా ద్వారరక్షకాః ॥ 37

పక్ష్మోష్ఠాదీని ద్వారేషు కపాటానీరితాని చ ।
ప్రాణాశ్చ తే రాజదూతాః పుర్యాం నిత్యమటంతి హి ॥ 38

ఆత్మా జ్ఞేయస్త్వత్ర రాజా జీవశ్చేంద్రియదేవతా ।
జ్ఞేయాశ్చ దేహనగరే పౌరాస్తత్ర రఘూత్తమ ॥ 39

కాలో జ్ఞేయో మహాచోరః త్రిదోషాద్యా గదాశ్చ యే ।
కాలస్య సేవకా జ్ఞేయా నాగరా ఇవ సంస్థితాః ॥ 40

దుర్బలాస్తేఽత్ర జీవాద్యాస్తేషామేవాస్తి తద్భయమ్ ।
కిం మోహే పతితా భ్రాంతాః కాలమత్రానయంతి తే ॥ 41

న జ్ఞాయతే మృత్యుకాలస్తస్మాద్భ్రాంతిః శుభాఽత్ర న ।
జ్ఞానమేవ మహాఖడ్గో వైరాగ్యం తీక్ష్ణతా త్వసేః ॥ 42

సచ్ఛీలం కవచం జ్ఞేయం ధైర్యం భక్తిర్దృఢా త్వయి ।
ఆత్మజ్ఞానేన జాగర్తి న తస్యాస్తి భయం కదా ॥ 43

"రాజీవనయనుడగు రామరాజా! ఇంతవరకు ఈదూత వచనములను వినినప్పటికీ ఎన్నడూ విచారించలేదు. నీయాజ్ఞవలన నిన్న రాత్రి విని, విచారపరులైనందున జ్ఞానము లభించెను. అజ్ఞానము తొలగెను. ఇక నీ యుపదేశము మాకక్కర లేదు." అని సంతోషముతో విన్నవించిరి. ఇట్టి పౌరుల పలుకులను విన్న శ్రీరామచంద్రస్వామి, "సరియే, మీరేమివింటిరి? ఏమి తెలిసికొంటిరి? ఆ సంగతిని విస్తరించి చెప్పండి," అని అడిగెను. అందుకు వారు సంతసించుచూ, "వినుము మహానుభావా! తెలిసినదానిని తెలిపెదము.

మోహమనునదియే రాత్రి. భ్రాంతియే నిద్రయనబడును, ఈ భ్రాంతి మంచిది కాదు. అనర్థకమగు మృత్యువు మ్రింగి వేయును. అయోధ్యయనునది ఈ దేహము. దీని నవరంధ్రములే నవద్వారములు. మరియొక లఘుద్వారము మస్తకమునగలదు, అదియే బ్రహ్మరంధ్రమనబడును. దంతములు మొదలగునవి ద్వారరక్షకులు. పెదిమలు, కనురెప్పలు మొదలగునవి తలుపులై యున్నవి. పంచప్రాణములను 5 మంది దూతలు ఈపురమున సంచరించుచున్నారు. ఆత్మయే రాజు. జీవుడును, ఇంద్రియాధిదేవతలే దేహనగరమున పౌరులైయున్నారు. కాలుడైన యముడే గొప్పదొంగ. వాత, పిత్త, శ్లేష్మములును వాటివల్ల గలునట్టి రోగములును వాని సేవకులు నగరవాసులవలె ఉన్నారు. ఈ జీవాదులు దుర్బలులు గాన వారికి వాని భయముగలదు, కావున భ్రాంతులై మోహమున మునిగిపోవలదు. మృత్యుకాలమెప్పుడు వచ్చునో తెలియదు. కనుక భ్రాంతి మంచిదికాదు. వైరాగ్యమను వాడిగల ఖడ్గము జ్ఞానమనునదియే. సచ్ఛీలమే కవచము. నీయందు దృఢభక్తియనుట ధైర్యము, ఆ జ్ఞానముతో ఎవ్వడు జాగరూకుడై యుండునో అతనికి ఎప్పుడూ భయములేదు.

**సావధానం జ్ఞాననిష్ఠం భవితవ్యం సదాఽత్ర హి ।**
**వాద్యాని వచనాన్యేవ సాధనం బోధనాని వై ॥ 44**

**సదా ధృతాని హృదయే తాని బుద్ధ్వాఽవలోకయేత్ ।**
**మోహక్షయః ప్రభాతోఽయ మిదానీం త్వత్పురః స్థితః ॥ 45**

**త్వమేవాత్మా సభేయం తే నివాసస్థానమీరితమ్ ।**
**తవాగ్రే యే స్థితాః సర్వే వయం త్వాం ముక్తిమాగతాః ॥ 46**

**కిమీదానీం తే ప్రష్టవ్యం వోపదేశ్యం త్వయాఽద్య కిమ్ ।**
**తవ కీర్తనమాత్రేణ నరా ముక్తిం లభంతి హి ॥ 47**

**వయం త్వదంతికాః సర్వే ముక్తా ఏవ న సంశయః ।**
**ఇతి తేషాం వచః శ్రుత్వా సస్మితః ప్రాహ తాన్ ప్రభుః ॥ 48**

సమ్యక్ బుద్ధ్వా పరిజ్ఞాతం సుఖే స్థేయం సదా జనాః ।
నాన్యథా స్వమతిః కార్యాఽఽత్మనో రామం పృథక్ స్థితమ్ ॥ **49**

ఇత్యుక్త్వా సకలాన్ రామో యయౌ సీతాగృహం ముదా ।
పౌరాద్యా గతమోహాస్తే చాత్మానం మేనిరే పరమ్ ॥ **50**

ఏవం రామేణ భోః శిష్య దూతవాక్యైః సుబోధితాః ।
పౌరాః సర్వే యథా తచ్చ మయా తే వినివేదితమ్ ॥ **51**

ఏకదా కైకేయీ రామమాగత్య ప్రణిపత్య సా ।
అబ్రవీన్మధురం వాక్యం వినయాత్పురతః స్థితా ॥ **52**

రామ రాజీవపత్రాక్ష మయా యదపరాధితమ్ ।
పురాఽజ్ఞానాత్త్వయా తచ్చ క్షంతవ్యం వై కృపాళునా ॥ **53**

అహం తే శరణం ప్రాప్తా మాముద్ధర జగత్పతే ।
కించిదుపదిశస్వ త్వం యేనాజ్ఞానం వినశ్యతి ॥ **54**

తత్తస్యా వచనం శ్రుత్వా రామో రాజీవలోచనః ।
ఉవాచ కైకేయీం వాక్యం మధురం ప్రహసన్నివ ॥ **55**

న త్వయా మేఽపరాద్ధం హి మచ్ఛందాచ్చ సరస్వతీ ।
స్థిత్వా తవాస్యే సా ప్రాహ వరయాచ్చాది యత్పురా ॥ **56**

జ్ఞాననిష్ఠయే సావధానమనబడును. వచనములే వాద్యములు. ఇవియే సాధుబోధనలు. సంతతము వాటిని హృదయమున నిలిపి, బుద్ధితో విచారింపవలయును. మోహము నశించుటయే తెల్లవారుట, నీయెదుట నిలుబడుట సాక్షాత్కారము. నీవేయాత్మ. ఈ సభయే ఆత్మారామ నిలయము. నీ సన్నిధిలోనుండు మేమందరము ముక్తులై యున్నాము. ఇప్పుడు మేమడుగవలసిన దేమి? నీవు ఉపదేశింప వలసిన దేమి? నిన్ను స్మరించినమాత్రమున నరులు ముక్తులగుచున్నారుగదా? నీసన్నిధిలో నుండు మేమందరము ముక్తులము. ఇందుకు సంశయము లేదు," అని విన్నవించిన పౌరుల పలుకులను విని శ్రీరామచంద్ర ప్రభువు మందస్మిత ముఖారవిందుడై, వారితో "జనులారా! చక్కగా మననము చేసితిరి, సుఖముగానుండండి. ఆత్మకంటే వేరొక్క రాముడు కలడని భేదము నెంచవలదు." అని యానతిచ్చి శ్రీ జానకీదేవి అంతఃపురమునకు వెడలెను. పౌరాదులు విగత మోహులై ఆత్మనే పరముగా నెంచిరి (50)

## కైకేయికి తత్త్వోపదేశము చేయుట.

వినుము శిష్యుడా! శ్రీరామునిచే ఇట్లు ఉపదేశింపబడి, పౌరులు స్వస్థచిత్తులయిరి. మఱియొక సంగతిని వినుము. ఒకసారి కైకేయి యేకాంతమున శ్రీరామునికి నమస్కరించి, వినయముతో ఎదుట నిలచి, "స్వామీ! రామ! అజ్ఞానవశమున మునుపు నేను చేసిన అపరాధమును దయాళువగు నీవు మన్నింపుము. జగదీశ్వరుడవగు నీవు శరణాగతనగు నన్నుద్ధరించి రక్షింపుము. అజ్ఞానము తొలగునట్లు నాకు కొంచెము తత్త్వోపదేశము చేయుము." అని ప్రార్థించెను. అందుకు శ్రీరాముడు నవ్వుచు, "అమ్మా! నీవు నాకు అపరాధముచేయలేదు. నా ప్రేరణ వలన సరస్వతిదేవి నీనోట నిలిచి, మునుపు నీవు దశరథుని వరము కోరునట్లు చేసినది.

**త్వం చ కైకయి శుద్ధాఽసి త్వయి క్రోధో న మేఽస్తి వై ।**
**శ్వస్త్వాం నీత్వోపదేశ హి కారయిష్యతి లక్ష్మణః ॥ 57**

**ఇత్యుక్త్వా తాం విసర్జ్యాథ లక్ష్మణం రాఘవోఽబ్రవీత్ ।**
**శిబికాస్థా హి కైకేయీ శ్వః ప్రభాతే గిరా మమ ॥ 58**

**త్వయా నేహా బహిః పుర్యాః సరయ్వాశ్చ తటం ప్రతి ।**
**అవిసమూహసంస్థానం వర్తతే యత్ర తత్ర హి ॥ 59**

**అవివృందాంతికం నీత్వా కైకేయీం శిబికాస్థితామ్ ।**
**అవివాక్యాని శ్రావ్యాణి ముహూర్తం మమ వాక్యతః ॥ 60**

**ఆనేతవ్యా తతశ్చేయం కైకేయీ మమ సన్నిధౌ ।**
**ఇతి తద్రామవచనం శ్రుత్వా స లక్ష్మణోఽపి చ ॥ 61**

**తథేత్యుక్త్వా తదా రామం తూష్ణీం తస్థౌ తదగ్రతః ।**
**అథ ప్రభాతే సౌమిత్రిర్గత్వా భరతమందిరే ॥ 62**

**శిబికాయాం స కైకేయీ సమారుహ్య ముదాన్వితామ్ ।**
**దాసీభిః సేవకైశ్చైవ వేష్టితాం వేత్రపాణిభిః ॥ 63**

**తాం నినాయ బహిః పుర్యాః శరయ్వాశ్చ తటే వరే ।**
**అవియూథాంతికం యానం స్థాపయామాస లక్ష్మణః ॥ 64**

**సుస్నాతాం కైకేయీం విప్రాస్తే జ్ఞాత్వా దక్షిణేచ్ఛయా ।**
**దుద్రువుః శిబికాపృష్ఠే లక్ష్మణస్తాన్యవారయత్ ॥ 65**

**అతిమూర్ఖాశ్చ పంగ్వాద్యా యే తే జ్ఞేయా ద్విజాదయః ।**
**దానార్హాః పండితా నైతే శ్రోత్రియా న ప్రతిష్ఠితాః ॥ 66**

**తతో దూతాన్నిరాకృత్య ముక్తాజాలాని లక్ష్మణః ।**
**ఊర్ధ్వం కృత్వా స్వహస్తాభ్యాం కైకేయీం వాక్యమబ్రవీత్ ॥ 67**

నీవు పరిశుద్ధురాలవు. నీయెడ నాకు కోపము లేదు. రేపు లక్ష్మణుడు నిన్ను తీసుకొని వెడలి నీకు ఉపదేశము చేయించుచున్నాడు." అని మధురముగా మాట్లాడి, ఆమెను పంపించి, లక్ష్మణునితో, "నామాటమీద రేపు కైకేయిని పల్లకిమీద ఎక్కించుకొని ఊరివెలుపల సరయూతీరమునకు పోయి మేకలమంద యెచ్చట నుండునో అచ్చట పల్లకిని నిలిపి, ఆమె ఆ మేకల అరుపులను కొంతసేపు వినునట్లు చేసి, నావద్దకు తీసుకొనిరమ్మ." అని యాజ్ఞాపించెను. అందుకతడు అట్లేయని మరునాడు ఉదయమున భరతునియింటికి వెడలి సంతుష్టయగు కైకేయిని పల్లకిలో ఎక్కించికొని, బెత్తములు పట్టుకున్న దాసీలు మొదలగు వారు వెంటనడువగా ఆమెను ఊరిబయటి సరయూతీరమున మేకలమందకు సమీపముగ తీసుకుని వెళ్ళి అచట పల్లకిని ఆపెను. అచ్చట బ్రాహ్మణులు దక్షిణల కొరకు సుస్నాతయగు కైకేయిని వెంబడించి పల్లకికి వెనుక పరుగెత్తసాగిరి. అప్పుడు లక్ష్మణుడు, పండితులును, సుప్రతిష్ఠితులును, శ్రోత్రియులనగా శ్రుత్యుక్త కర్మానుష్ఠానపరులుకాని కుంటివారు మొదలగు ద్విజాదులు అతిమూర్ఖులుగానున్నారు, వీరు దయాకృత పారితోషికార్హులుగా నుందురుగాని మంత్రపూతవిధ్యుక్తదానార్హులు కారని వారిని పంపించి, దూతాది పరివారమును దూరముగా పంపి, పల్లకికి ఇరువైపులలో వేలాడుచుండు ముత్తెముల జాలరు సరములను తన రెండుచేతులతోను పైకెత్తి పట్టుకుని కైకేయిని చూచి ఇట్లనెను.

**పశ్య కైకేయి మాతస్త్వమవియూథం పురఃస్థితమ్ ।**
**రామేణ ప్రేషితాఽసి త్వముపదేశార్థమాదరాత్ ॥ 68**

**తతస్సౌమిత్రివచః శ్రుత్వాఽఽశ్చర్యయుక్తాఽథ కైకేయీ ।**
**ప్రతారితాహం రామేణ కిమత్ర ప్రేష్య సాదరమ్ ॥ 69**

**ఇతి తర్కాన్కుర్వతీ సా తస్థౌ తూష్ణీం క్షణం తదా ।**
**తావచ్ఛుశ్రావ సా మే మే త్వయివాక్యాని వై ముహుః ॥ 70**

తాని శ్రుత్వాఽథ కైకేయీ తదా చిత్తేఽవిచారయత్ ।
మే మే త్వితి ముహుశ్చాత్ర కిమర్థం వచనాని హి ॥ 71

అన్యాః సర్వా వదంత్యత్ర గూఢోఽర్థస్త్వత్ర వర్తతే ।
తతో నిమీల్య కైకేయీ నేత్రం ధ్యాత్వా క్షణం హృది ॥ 72

సర్వం జ్ఞాత్వా గతాజ్ఞానా తుతోష నితరాం తదా ।
తతః స్మితాననా ప్రాహ లక్ష్మణం పురతః స్థితమ్ ॥ 73

లబ్ధం జ్ఞానం మయా బాల నయ మాం రాఘవం ప్రతి ।
ఇతి తస్యా వచః శ్రుత్వా ముక్తాజాలాన్విముచ్య సః ॥ 74

దూతాన్ద్వారగతాన్వేగాదాహూయ నగరీం ప్రతి ।
కైకేయీమానయామాస సీతాగేహం వివేశ సా ॥ 75

తత్ర దృష్ట్వా సమాసీనం సీతయా రఘునందనమ్ ।
బధ్యమానం స్వశిరసి చిత్రోష్ణీషం కరేణ హి ॥ 76

సీతాకరధృతాదర్శే పశ్యంతం స్వముఖోత్పలమ్ ।
తం నత్వా పరయా భక్త్యా కైకేయీ వాక్యమబ్రవీత్ ॥ 77

రామ తే కృపయా లబ్ధమవివాక్యవిచారతః ।
సద్జ్ఞానం మే గతో మోహశ్చేదానీం ప్రయోజనమ్ ॥ 78

ఉపదేశేన తే రామ సదా ముక్తాఽస్మి రాఘవ ।
తత్తస్యా వచనం శ్రుత్వా సస్మితః ప్రాహ తాం విభుః ॥ 79

కథం జ్ఞాతం త్వయా జ్ఞానం విచారశ్చ కథం కృతః ।
తత్సర్వం విస్తరేణైవ మమాగ్రే వద కైకేయి ॥ 80

“అమ్మా! ఎదుటనుండు మేకలమందను చూడుము. తల్లీ! సాదరముగా రాముడు తమరిని ఇచ్చుటికి ఉపదేశమునకై పంపెను.” అని విన్నవించగా, అంత కైకేయి వింతనొంది, ఎందుకిచ్చుటికి పంపి శ్రీరాముడు వంచించెను? అని చింతించుచు, కొంతసేపు ఊరకుండగా ఇంతలో, పలుమార్లు మేకలు **“మే, మే, మే”** యను శబ్దములు చేసినవి. కైకేయి వాటిని విని (సంస్కృత భాషయందు ‘మే’ అనగా (అహం) ‘నాయొక్క’ అని అర్థం. అహం యొక్క షష్ఠీవిభక్తి ఏకవచనము ఇచట మేక

అరుచుచున్నది) "**మే, మే** యని మేకలు నా ఎదుట పలుమార్లు యేల అరుచుచున్నవి? ఇచట ఏదో గూఢార్థముగలదు అని ఆలోచించి, ఆమె కన్నులుమూసికొని కొంతసేపు హృదయమున ధ్యానముచేసి, సర్వము ఎఱిగి, అజ్ఞాన నివృత్తినంది, ఎంతో ఆనందము పొందెను. అంత ఆమె నవ్వుచు, ఎదుట నిలచియున్న లక్ష్మణుని జూచి, "బిడ్డా! నేను జ్ఞానమును పొందితిని. నన్ను శ్రీరామునివద్దకు తీసుకొని పొమ్ము," అని అనగా అతడట్లేయని ముత్తెముల సరములను వదలి, దూతలను పిలిచి, త్వరగా కైకేయిని సీతామందిరమునకు తీసుకుని వచ్చెను. అచ్చట శ్రీరాముడు నవరత్న చిత్రిత దివ్యకిరీటమును ధరించి, సీతతో సరసములాడుచూ, ఆమె చేతిలో తన ముఖారవిందమును చూచుకొనుచుండగా ఈ కైకేయి రామునికి నమస్కరించి, "రామభద్రా! నీ దయచే మేకల అరుపుల విచారమునుండి నాకు జ్ఞానము కలిగినది. మోహము గతించినది. ఇక నీయుపదేశము నాకెందుకు? ఎల్లప్పుడును నేను ముక్తయైయున్నాను." అనెను. కైకేయి మాటలు విన్న శ్రీరాముడు, చిరునవ్వుతో, "తల్లీ! నీవెట్లు విచారించితివి? నీకెట్లు జ్ఞానము కలిగినది? ఆ సంగతిని నాయెదుట విస్తరించి చెప్పు," అనెను.

**తద్రామవచనం శ్రుత్వా కైకేయీ ప్రాహ రాఘవమ్ ।**
**శృణు రామ యథా లబ్ధం జ్ఞానం తత్తే వదామ్యహమ్ ॥ 81**

**మయాఽవివచనాన్యేవ తత్రావియూథసన్నిధౌ ।**
**శ్రుత్వా మే మే త్వితి మయా హృదయే మంత్రితం క్షణమ్ ॥ 82**

**మే మే త్వితి మమైతాశ్చ శ్రావయంతి ముహుర్ముహుః ।**
**శ్రుత్వా మే మే త్వితి మయా చేద్వాచ్య తర్హి వై మయా ॥ 83**

**మే మే ప్రకథ్యతే నిత్యం పశుపుత్రగృహాదిషు ।**
**అతో వక్తుం నోపదేశోఽయం మామేతాభిరుచ్యతే ॥ 84**

**తర్హ్యయం చోపదేశోఽద్య నిషేధే మా ప్రకీర్త్యతే ।**
**అతోఽహం న కదా మే మే ప్రవదామీత్యతః పరమ్ ॥ 85**

**మే మాతా మే సుతాశ్చాయం మే బంధుర్మే గృహం వరమ్ ।**
**మే రాజ్యం మే సపత్నీయం మే సాపత్న్యసుతస్త్వయమ్ ॥ 86**

**మే శరీరమిదం కాంతం మే దివ్యాభరణం వరమ్ ।**
**మే మంథరా ప్రియా దాసీ పుత్రాదీత్యశుభా మతిః ॥ 87**

**యాఽస్తి మే మే త్వితి మయి సా త్యక్తవ్యేతి మామతా ।**
**బోధయామాసుర్వచనైః స్వీయైః స్పష్టం రఘూత్తమ ॥ 88**

**అన్యద్రామ నరాన్ సర్వాంస్తాశ్చావ్యో బోధయంతి హి ।**
**మే మే బుద్ధ్యా సదాఽస్మాభిః పూర్వజన్మని వర్తితమ్ ॥ 89**

**దేహస్థ్వతో హ్యవేర్లబ్ధో యుష్మాభిర్మే మతిస్తు మా ।**
**సర్వతః సాఽత్ర త్యక్తవ్యా నాంగీకార్యా కదాచన ॥ 90**

**మే మే మత్యా గతిర్జ్ఞాతా యాఽస్మాకం సకలా జనాః ।**
**మే మే బుద్ధ్యా హి యుష్మాకం గతిః సైవ భవిష్యతి ॥ 91**

**ఏవం తా బోధయంత్యత్ర జనాన్ స్వవచనైః సదా ।**
**న తద్వాక్య జనైర్బుద్ధ్యా కదాచిత్తే విచార్యతే ॥ 92**

అపుడుకైకేయి, "నాకెట్లు జ్ఞానోదయమైనదో ఆ సంగతిని చెప్పెదను. అచ్చట మేకలమందవద్ద వాటి అరుపులగు **"మే, మే"** యని విని, మనసున క్షణమాలోచించితిని. అవి నాకు పలుమార్లు 'మే-నాయొక్క, మే-నాయొక్క' యని వినిపించినవి. ఆ శబ్దములు వినిన నేను కూడ ఇట్లే పలుకవలయునా ఏమి! అట్లయిన ఎల్లప్పుడును పశు, పుత్ర, గృహారామాది సకల విషయములయందును; మే-నాది, మే-నాది, యని చెప్పుచునే యున్నాను. కావున ఇది నాకు ఉపదేశము. ఇక ఏది అనిన 'మే, మే' యని పలుకవలదనిన 'నాది, నాది' యను 'మమ కారము' ను వదలుమని నిషేధార్థకమందు ఈ ఉపదేశము. ఇకమీదట నేను 'నాది, నాది' యని దేనిని అభిమానించను. నా తల్లి, నా తండ్రి, నా కొడుకు, నా తమ్ముడు, నాయిల్లు, నా రాజ్యము, నా సవతి, నా సవతిబిడ్డలు, నాదేహమిది, నామంచిసొమ్ములు, నా ప్రియదాసియగు మంథర. యిది అనునిట్టి దుర్బుద్ధి యేది గలదో దానిని వదలుమని నాకు ఇవి యుపదేశించుచున్నవి. రామా! ఆ మేకలు సర్వవరములను బోధించుచున్నవి. ఎట్లనిన; 'మే-నాది, నాది, అను బుద్ధితో పూర్వజన్మమునందు ప్రవర్తించినందున ఈ జన్మమున మేకయై జనించితిమి.

(శ్లో॥ యం యం వాఽపిస్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః ॥ (గీత)

తా॥ కుంతీకుమారా! మరణసమయంలో ఏయే భావాన్ని స్మరిస్తూ కళేబరాన్ని వదులుతారో, నిత్యమూ ఆ భావాన్నే భావిస్తుంటారు. కాబట్టి తరువాత దానినే పొందుతారు.)

'నాది' యను బుద్ధి యేదిగలదో దానిని వదలవలయును. ఎన్నటికీ అంగీకరింపరాదు. 'నాది, నాది' యనుటచే ఏగతి మాకు గలిగినదో అదియే మీకును గల్గును." అని ఆ మేకలు తమ అరుపులచే మాకు తెలుపుచున్నవి. దీనిని లోకులు తెలిసీ వర్తించరు.

తాసాం వాక్యోపదేశేన ప్రసాదాత్తవ రాఘవ ।
మేమేబుద్ధిర్గతా మత్తస్త్వత్తో ముక్తాఽస్పృహం త్విహ ॥ 93

మే దేహస్త్వితి యా బుద్ధిర్యదాసక్తా మయాఽత్ర హి ।
తదా కిం శేషమస్త్యత్ర సంసారే దుఃఖదాయకే ॥ 94

అస్త్వయం వా లయం యాతు దేహో వారితరంగవత్ ।
కః పుత్రః కస్య కో మాతా సర్వం భ్రమ న సంశయః ॥ 95

అహమేవ పరం బ్రహ్మ మత్తో బ్రహ్మ పరం న హి ।
సర్వ యద్దృశ్యతే చేదం మాయేయం తవ రాఘవ ॥ 96

నశ్వరం బుద్ధ్యదాకారం జ్ఞాతం చేదం మయా ప్రభో ।
ఇతి తస్యాః వచః శ్రుత్వా శ్రీరామః ప్రాహ సస్మితః ॥ 97

సమ్యక్ విచారిత బుద్ధ్యా త్వయావివాక్యముత్తమమ్ ।
గచ్ఛేదానీం సుఖం తిష్ఠ జీవన్ముక్తాఽసి కైకేయి ॥ 98

తద్రామవచనం శ్రుత్వా కైకేయీ తోషపూరితా ।
దేహాభిమానహీనా సా నత్వా సీతాం రఘూత్తమమ్ ॥ 99

యయౌ భరతగేహం హి నాసక్తా క్వాపి సా త్వభూత్ ।
ఏవం శిష్య మయా ప్రోక్తమవివాక్యోపదేశతః ॥ 100

యథా జ్ఞానం హి కైకేయ్యై జాతం తత్కథితం తవ ।
ఇదానీం శృణు యచ్చాన్యత్తే వదామి కుతూహలమ్ ॥ 101

సుమిత్రా త్వేకదా రామం సీతయా రహసి స్థితమ్ ।
నిరీక్ష్య నత్వా తం ప్రాహ రామ రాజీవలోచన ॥ 102

కించిత్తే ప్రార్థయామ్యద్య కించిదుపదిశస్వ మామ్ ।
తత్తస్యా వచనం శ్రుత్వా తామాహ రఘునందనః ॥ 103

కా త్వం చేతి వదాదౌ మాం పశ్చాదుపదిశామి తే ।
గచ్ఛ గేహం స్వస్యబుద్ధ్యా హృది సమ్యగ్విచార్య చ ॥ 104

మేకల వాక్యోపదేశముచేత, నీ ప్రసాదము వలన 'మే, మే' బుద్ధి నాకు మాయమయ్యె . ఇచ్చట నేను ముక్తురాలనైయున్నాను. నా దేహమను బుద్ధి యెప్పుడు నాకు నశించెనో అప్పుడిక దుఃఖదాయక మగు సంసారమున మిగిలినదేమిగలదు?

నీటియలవలే ఈ దేహముండని, పోనీ. పుత్రుడెవ్వడు? ఎవ్వని కెవ్వడు తండ్రి? సర్వము బ్రహ్మాత్మకము. ఇందులో సంశయము లేదు. నేనే పరబ్రహ్మగా ఉన్నాను. నాకన్నా వేరొక బ్రహ్మవస్తువు లేదు. కనబడుచుండు ఈదృశ్య ప్రపంచమంతయును శ్రీరామా! నీమాయగానున్నది. ఈ ప్రపంచము నీటిబుగ్గవలె నశ్వరమయినది. ప్రభూ! నాచే నీతత్త్వ మిట్లు గ్రహింపబడెను," అనిన కైకయి మాట విన్న శ్రీరాముడు నగుమోముతో, "కైకేయీ! మేక మాటను చక్కగా నొక్కి విచారించి తెలిసికొంటివి. ఇక ఇప్పుడు పోయి సుఖముగా నుండుము. నీవు జీవన్ముక్తురాలవై యున్నావు." అని చెప్పి, ఆమెను పంపెను. కైక దేహాభిమానవిహీనయై, సీతారాములకు నమస్కరించి, భరతుని మందిరమునకు పోయి, ఎచ్చటను ఆసక్తురాలుకాక నిర్లిప్తయై యుండెను .

శిష్యుడా! ఆసంగతిని నీకు ఉపదేశించితిని. మరియొక విశేషమును వినుము (101)

## సుమిత్రాదేవికి బ్రహ్మతత్త్వోపదేశమిచ్చుట

శ్రీరాముడు సీతాకాంతతో ఏకాంతమున ఉండెడు సమయమున ఒకసారి సుమిత్రాదేవి వచ్చి, స్వామినిచూచి, నమస్కరించి "రాజీవాక్షుడవగు రామా! వేడుకొనుచున్నాను. నాకు కొంచెము ఉపదేశ మిమ్ము." అని ప్రార్థింపగా అందుకు రాఘవేంద్రుడు, "నీ వెవరో? ఆ సంగతిని నాకు మొదట చెప్పుము?

**శ్వో మామేత్య మమ ప్రశ్నస్యోత్తరం దేహి వై తతః ।**
**అహముపదేక్ష్యామ్యంబ యేన తుష్టా భవిష్యసి ॥ 105**

**తద్రామవచనం శ్రుత్వా సుమిత్రా విస్మితాననా ।**
**తూష్ణీమేవ యయౌ గేహం రామవాక్యం వ్యచింతయత్ ॥ 106**

**కాఽహం పృష్టా రాఘవేణ కిం వా దేయం మయోత్తరమ్ ।**
**కాఽహం దేవీ చాసురీ వా మానసీ రాక్షసీ తథా ॥ 107**

**మానుషీ చేత్యహం మత్వా యది రామం దదామి వై ।**
**తర్హి నానాశరీరాణి ధ్రియంతే నటవన్మయా ॥ 108**

తదా క్వేదం మానుషీత్వమన్యజాత్యాం ఘటేచ్ఛ మే ।
తదాహం మానుషీ నైవ న చైవాన్యా కదాచన ॥ 109

మానుషీ రాక్షసీ చేతీమాని నామాని తాని న ।
దేహస్యైవాత్ర కథ్యంతే దేహస్తు నశ్వరః స్మృతః ॥ 110

దేహాద్భిన్నాస్మి కాప్యన్యా యాఽహం రూపాణ్యనేకశః ।
ధరామి సర్వదా భూమ్యాం సా కాఽహం చేతి వేద్మినా ॥ 111

ఇదానీం తు మయా జ్ఞాతం యథా విష్ణుస్తథా త్వహమ్ ।
నానారూపాణి సోఽప్యత్ర మత్స్యాదీని దదాతి హి ॥ 112

తథా నానాస్వరూపాణి ధార్యంతేఽత్రాపి వై మయా ।
ఏవమేవ హి వక్తవ్యం తర్హి మే తస్య చాన్తరమ్ ॥ 113

స్వవశోఽస్తి మహావిష్ణుస్త్వహం విష్ణువశా సదా ।
అతో విష్ణోః కాల చాహం సత్యమేవ న సంశయః ॥ 114

విష్ణోర్మే నైవ భేదోఽస్తి యథా గంగా స్థలే ఘటే ।
ఏకైవాస్త్యత్ర తద్వచ్ఛ విష్ణురేవాహమస్మి హి ॥ 115

అహమేవ యదా విష్ణుస్తదా కిం చావశేషితమ్ ।
యత్ప్రష్టవ్యం తు రామాయ జీవన్ముక్తాఽహమస్మి వై ॥ 116

మీరు విచారించిన పిదప నేను ఉపదేశించెదను, ఇంటికి పొమ్ము. నీబుద్ధితో చక్కగా ఆలోచించి, రేపు వచ్చి నాప్రశ్నకు సమాధానమిమ్ము. అప్పుడుపదేశించెదను. తల్లీ! నీవు ఆనందించెదవు." అనిన రామ వాక్యమును ఆలోచించుచు, సుమిత్ర చిరునగవుతో ఊరకే యింటికి వెడలెను. "రామునిచే ప్రశ్నింపబడిన నేనెవరు? నేనేమని సమాధాన మిచ్చునది? నేను దేవతనా ? రాక్షసినా ? అసుర స్త్రీయా? దానవాంగనయా ? మానవవనితగానున్నానా? ఇట్లని యాలోచించి, యేదైన ఒకదానిని చెప్పెదనందునా; నేను నటునివలే నానా శరీరములను ధరించుచున్నాను. అప్పుడీ మనుష్యత్వము ఇతర జాతిలో సంభవించుచున్నదా? లేదు. కావున నేను మనుష్యస్త్రీనిగాను, మరి యితరముగాను. మానవి రాక్షసియను ఇట్టి పేర్లు దేహమునకే గాని నాకుగాదు. దేహమైననూ నశ్వరమని చెప్పబడుచున్నది. దేహమునకంటే వేరుగానుండెడు నేనెవరు? ఇట్టి నేను అనేక రూపములను ధరించుచున్నానన్న

సంగతిని గుర్తింక పోతిని, ఇప్పుడు తెలిసికొంటిని. ఎట్లు విష్ణువో అట్లే నేను. విష్ణువూ మత్స్యాది నానా రూపములను ఎత్తుచున్నాడు గదా, అట్లే అహం వాచ్యమగు నేనుకూడ వివిధరూపములను ధరించుచున్నాను. ఈ విధముగా శ్రీరాముని ప్రశ్నకు నేను సమాధానము చెప్పతగినది. స్వవశముగా ఆ మహావిష్ణువున్నాడు. నేనెల్లప్పుడును విష్ణువశమైయున్నాను. కావున నేను విష్ణువుయొక్క కళయైయున్నాను. ఇదియే సత్యము. ఇందులో సంశయములేదు. విష్ణువునకూ, నాకూ భేదము లేదు. గంగ యెట్లు భూమిమీదను, కుండలోను ఒకటిగా నున్నదో; విష్ణువట్లు నేనుగాఉన్నాను. నేనే విష్ణువయినప్పుడు ఇప్పుడేమి మిగిలినది? సర్వము బ్రహ్మాత్మకమై నిలిచినది. ఇక అడుగవలసినది ఏమిగలదు? జీవన్ముక్తయై యున్నాను."

ఏవం సుమిత్రా సంచింత్య గతాజ్ఞానా ముదాన్వితా ।
అతిక్రమ్య నిశాం తాం సా ప్రభాతే రాఘవం యయౌ ॥ 117

గత్వా రామ తదా ప్రాహ మయా రాత్రౌ విచింతితమ్ ।
కా త్వం పృష్టా త్వయా పూర్వం తర్హ్యహం బ్రహ్మ రాఘవ ॥ 118

త్వత్తో నాన్యచ్చ ప్రష్టవ్యం త్వద్భిన్నాఽహం కదాపి న ।
ఇత్యుక్త్వా సా యథా గేహే నిశి స్వే హృది మంత్రితమ్ ॥ 119

తత్సర్వం శ్రావయిత్వా తం జీవన్ముక్తాఽభవత్తదా ।
సుమిత్రాం రాఘవోఽప్యాహ సమ్యక్ బుద్ధ్వా విచింతితమ్ ॥ 120

జీవన్ముక్తోఽసి చాంబ త్వం గచ్ఛ గేహం సుఖం వస ।
తతః సుమిత్రా సంతుష్టా గతమోహా రఘూత్తమమ్ ॥ 121

సీతాం చాపి పృథక్ నీత్వా యయౌ లక్ష్మణమందిరమ్ ।
ఏవం శిష్య మయా ప్రోక్తం కాఽహం చేతి విచారతః ॥ 122

జీవన్ముక్తా సుమిత్రా సా బభూవ సుఖనిర్భరా ।
అన్యచ్చ తే వదామ్యద్య తచ్ఛృణుష్వ ద్విజోత్తమ ॥ 123

ఏకదా రాఘవం దృష్ట్వా కౌసల్యా జననీ రహః ।
ఆసనే చిత్రశాలాయాం సీతయా సహ సంస్థితమ్ ॥ 124

పప్రచ్ఛ నత్వా శ్రీరామం జ్ఞాత్వా విష్ణు పరాత్పరమ్ ।
రామ రామ మహాబాహో కించిదుపదిశస్వ మామ్ ॥ **125**

తన్మాతృవచనం శ్రుత్వా తాం విహస్యాహ రాఘవః ।
శ్వఃప్రభాతే సముత్థాయ గత్వా గోష్ఠం కియత్క్షణమ్ ॥ **126**

శ్రుత్వా గోవత్సవాక్యాని సమ్యక్తాని విచింతయ ।
మమాంతికం తతో యాహి త్వమంబ వచనాన్మమ ॥ **127**

ఉపదేశం కరిష్యామి తతోఽహం త్వాం న సంశయః ।
తద్రామవచనం శ్రుత్వా కౌసల్యా విస్మితా తదా ॥ **128**

శ్రీరాముడు చెప్పినట్లు సుమిత్రాదేవి చింతనచేసి, మరునాటి ఉదయాన్నే శ్రీరామ పరబ్రహ్మ సాన్నిధ్యమునకు వచ్చి నమస్కరించి, "నీ వెవరవని? నీచేత అడుగబడి నేను, రాత్రి మననము చేసికొంటిని. శ్రీరామా! ఇప్పుడు నేను బ్రహ్మగామిగిలితిని. ఎప్పటికిని నీకంటే వేరొకటిగా లేను." అని యిట్లు తాను చింతన చేసిన యావత్ వృత్తాంతమును విన్నవించి, జీవన్ముక్తయై నిలిచెను. శ్రీరాముడును, "తల్లీ! బాగుగా చింతించితివి. నీవు జీవన్ముక్తవైయున్నావు, ఇంటికి పొమ్ము. స్వస్వరూపానందము పొంది ఆనందించుచుండుము." అని పంపెను. అపుడు సుమిత్రాదేవి సీతారాములకు నమస్కరించి, లక్ష్మణ మందిరమునకు వెళ్ళెను.

విష్ణుదాసా! నేనెవరు? అను చింతనచే ఆమె యిట్లు ముక్తయైన సంగతిని చెప్పితినిగదా, మరియొక సంగతిని చెప్పెద వినుము. (123)

## కౌసల్యాదేవికి బ్రహ్మతత్త్వోపదేశము చేయుట.

ఒకరోజు తన తల్లియగు శ్రీకౌసల్యాదేవి; రహస్యమున చిత్రశాలయందు సీతతో సుఖాసీనుడై ఉన్న శ్రీరామచంద్రునిజూచి నమస్కరించి, సాక్షాత్పరబ్రహ్మయగు నారాయణునిగా యెంచి, "రామభద్రా! దివ్యమంగళమగు నీయొక్క సుజ్ఞానము నాకెట్లు లభించునో, కొంచెము ఉపదేశింపుము నాయనా!" అని ప్రార్థించెను. ఆ తల్లి పలుకును విన్న శ్రీరాముడు, "రేపు పొద్దున లేచి ఆవుల కొష్టమునకు పోయి అచ్చట కొంతసేపు ఉండి, లేగదూడల అరుపులను విని, చక్కగా విచారించుకొని నా వద్దకు రమ్ము. తల్లీ! నీ మాట వినినపిమ్మట నేను ఉపదేశించెదను, సందేహమువలదు." అని చెప్పెను. అంతనామె అట్లేయని ఆశ్చర్యపడి, సీతారాములకు నమస్కరించి ఊరకె యింటికి పోయెను.

నత్వా రామం ససీతం చ తూష్ణీమేవ గృహం యయౌ ।
తతో నిశామతిక్రమ్య కౌసల్యా సాఽరుణోదయే ॥ 129

గోష్ఠం గత్వా క్షణం స్థిత్వా ధేనువత్సవచాంసి సా ।
అహం మా త్వితి సుశ్రావ సుశ్రాంతా వై ముహుర్ముహుః ॥ 130

తాని వాక్యాని వత్సానాం శ్రుత్వా చిత్తేఽవిచారయత్ ।
అహం మా త్వితి వత్సాశ్చ కిం వదంతి ముహుర్ముహుః ॥ 131

ఇమాని కిం బోధయంతి మాం వత్సాశ్చ ముహుర్ముహుః ।
ఇత్యుక్త్వా సా క్షణం ధ్యాత్వా హృది సమ్యగ్విచార్య చ ॥ 132

వత్సవాక్యైశ్చ కౌసల్యా గత్వాజ్ఞానాఽభవత్ క్షణాత్ ।
తతస్తుష్టా యయౌ రామం నత్వా తం ప్రాహ హర్షితా ॥ 133

రామ విష్ణో రమానాథ వత్సవాక్యైః సుబోధితా ।
త్వయైవాహం రామచంద్ర గతాజ్ఞానాఽస్మి రాఘవ ॥ 134

తవోపదేశవాంఛా మే న కించిదస్త్యతః పరమ్ ।
లబ్ధ్వా జ్ఞానం మయా రామ త్వత్తో భిన్నా కదాఽస్మి న ॥ 135

తన్మాతృవచనం శ్రుత్వా కౌసల్యాం రాఘవోఽబ్రవీత్ ।
వత్సవాక్యైః కథ లబ్ధం త్వయా జ్ఞాన వదస్వ మామ్ ॥ 136

తద్రామవచనం శ్రుత్వా కౌసల్యా ప్రాహ రాఘవమ్ ।
అహం మా త్వితి వాక్యాని తేషాం శ్రుత్వా రఘూత్తమ ॥ 137

ఇమాని కిం బోధయంతి మాం వత్సోక్తాని వై ముహుః ।
ఏవం విచారితం ధ్యాత్వా క్షణం స్వహృదయే మయా ॥ 138

వాక్యార్థశ్చ మయా జ్ఞాతస్త్వహం మా కథ్యతాం జనాః ।
వత్సాస్త్వేవం బోధయంతి న జ్ఞాయేత జనైస్తు యత్ ॥ 139

అహాశబ్దో దేహపదో యదా త్యక్తో మయాఽత్ర హి ।
అహం దేహి త్వహ మాతా చేతి బుద్ధిర్గతా మమ ॥ 140

ఆరాత్రి గడచిన తరువాత, మరునాటి ఉదయాన ఆమె గోవుల కొష్టమునకుపోయి కొంతసేపుండి, "అహం మా", అను ఆవుదూడయొక్క అరుపును పలుమార్లు వినెను. వాటిని విని మనమున ఇట్లు మననము చేసెను. 'అహం మా', 'అహం మా,' అని ఏల దూడలిట్లు అరుచుచున్నవి? ఇవి నాకు ఏమని పలుమార్లు బోధించుచున్నవి? అని కొంత సేపు ధ్యానముచేసి, హృదయమున చక్కగా ఆలోచించి, దూడ అరుపులనుండి అజ్ఞానమును తొలగించుకొని, ఆనందముపొంది, శ్రీరాముని సన్నిధికి వచ్చి నమస్కరించి, "రమాకాంతుడగు రామా! విష్ణుమూర్తీ! దూడచేయు శబ్దములచే చక్కగా జ్ఞానమును పొందితిని, నీవల్లనే నా అజ్ఞానము తొలగింపబడినది. ఇక నీవద్దనుండి వినవలయునని కోరికలేదు. విజ్ఞానమునందిన నేను నీకంటే వేరుగా లేను." అనిన కౌసల్యతో శ్రీరాముడు, "తల్లీ! దూడ అరుపులచే జ్ఞానము యెట్లుగల్గెనో ఆ సంగతిని చెప్పు" మని అడిగెను. అందుకు కౌసల్య "రఘురామా! (దేహమే నేను అను కొనిన అజ్ఞుడా! అహం–నేను ఈ దేహము అను భావన. మా–వలదు, విడువుము. దేహము అనిత్యము. అహం వాచ్యుడగు ఆత్మ నిత్యుడు) 'అహం–మా' యని వాటిపలుకులను వింటిని, ఇవి నాకేమని బోధించుచున్నవా? అని విచారించగా, కొంతసేపటికి వాటి అరుపులకు ఇట్లు భావము తోచినది. "జనులారా **'నేను'** వలదు అని పలకండి." అని చెప్పినట్లయినది. దూడలిట్లు బోధించుచున్నవి. జనులువాటిని గ్రహించరు. అహం శబ్దము దేహపరము. దానినెప్పుడు నేను వదిలితినో... నేను దేహిని, నేను తల్లిని, అను ఈ మమకారము నాకు మాయమయ్యెను.

**దేహబుద్ధిర్యదా నష్టా తదా కిం శేషమస్తి హి ।**
**సుఖం దుఃఖం తు దేహాయ న మే కించిద్రఘూత్తమ ॥ 141**

**తిష్ఠత్వయం వా పతతు దేహో భోగాశ్రయః ప్రభో ।**
**అహం త్వదంశ ఏవాత్ర పృథగుపాధితః స్మృతా ॥ 142**

**యథా కుంభే రవిర్భిన్నో దృశ్యతేఽత్ర హ్యుపాధితః ।**
**త్వత్తోఽహం న కదా భిన్నా బ్రహ్మైవాస్మ్యహమేవ వై ॥ 143**

**ఇతి తన్మాతృవచనం శ్రుత్వా రామః స్మితాననః ।**
**కౌసల్యామాహ మాతస్త్వం ముక్తాఽస్యద్య న సంశయః ॥ 144**

**సమ్యగ్విచారితం చిత్తే వత్సవాక్యం సవిస్తరమ్ ।**
**గచ్ఛ తిష్ఠ సుఖం గేహే త్విమాం బుద్ధిం దృఢాం కురు ॥ 145**

**కిమర్థం న మయా పూర్వం యుష్మాస్వవచనేన హి ।**
**ఉపదేశః కృతస్త్వంబ తత్సర్వం త్వం నిబోధయ ॥ 146**

ఉపదేశ గురుజ్ఞేయో యుష్మాకం తనయస్త్వహమ్ ।
కథం యుష్మానత్ర మాతస్త్వహం చోపదిశామి వై ॥ **147**

స్త్రీణాం పతిర్గురుర్జ్ఞేయః స్త్రిభిర్నాన్యో గురుఃకదా ।
కార్యస్తస్మాన్మయా నైవ యుష్మాన్ స్వాస్యోపదేశితమ్ ॥ **148**

పౌరాణాం చ గురుస్తాతస్తథా స్వీయపురోహితః ।
అతస్తేషామపి మయా దూతవాక్యోపదేశితమ్ ॥ **149**

పరాస్యైరేవ యుష్మాకముపదేశః కృతో మయా ।
గచ్ఛ గేహే సుఖం తిష్ఠ సదా మాం పరిచిన్తయ ॥ **150**

తద్రామవచనం శ్రుత్వా కౌసల్యా తుష్టమానసా ।
రామం నత్వా యయౌ గేహం సన్తుష్టా సంస్థితా సుఖమ్ ॥ **151**

ఏవం తా రామచంద్రేణ బోధితా మాతరః శుభాః ।
స్వస్వాయుషః క్షయే సర్వాః స్వదేహాన్ముముచుః సుఖమ్ ॥ **152**

రామసాన్నిధ్యమాత్రేణ విమానవరసంస్థితాః ।
జగ్ముః సర్వాస్తు వైకుంఠం రాఘవేణైవ సత్కృతాః ॥ **153**

శిష్య తాసాం మహద్భాగ్యం యాసాం రామాదిభిస్త్రిభిః ।
పారలోక్యాది సత్కర్మ స్వహస్తైర్వినివర్తితమ్ ॥ **154**

ఏవం శిష్య మయా ప్రోక్తా తాసామూర్ధ్వగతిస్తవ ।
ఉపదేశాస్తథా తాసాం ప్రోక్తాశ్చాప్యత్ర తే మయా ॥ **155**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, మనోహరకాండే, వాల్మీకీయే, ఆదికావ్యే, మాతృవైకుంఠారోహణం నామ, ద్వితీయ స్సర్గః ॥**

శ్రీరామా! బుద్ధిలో దేహభ్రాంతి యెప్పుడుపోయెనో ఇక ఏమున్నది? బ్రహ్మ మొక్కటియే. సుఖ దుఃఖములు దేహాభిమానికే గాని నాకు లేవు. ఈ దేహము ఉండిన ఉండనీ, పోయిన పోనీ. ఈ దేహము భోగాశ్రయము. నేను దేహానికి వేరుగా ఉన్నాను, ఇది వేరొక ఉపాధివలన సత్యమైనది. ఎట్లు సూర్యుడు ఉపాధిభేదము చేత కుండలో కనపడునో అట్లే, నీ కంటే నేను భిన్నము కాను, నేనే

బ్రహ్మస్వరూపము అనబడితినిగదా!” అని చెప్పగా, ఆ తల్లి పలుకులను విన్న శ్రీరాముడు చిరునగవుతో, “తల్లీ! నీవు ముక్తయైతివి సంశయము లేదు. దూడమాటను చక్కగా విచారించితివి, ఈ బుద్ధినే మననముచే దృఢపరుపుము,

అమ్మా! నేనెందుకు మీ కుపదేశింపక యిట్లు చేసితినో వినుము. ఉపదేశించువాడు గురువు అనబడును. మీకు నేను పుత్రుడను, ఎట్లు ఉపదేశించెదను! మరియు, స్త్రీలకు పతియే గురువు, మరియొకడు లేదు. కావున నానోటిమీదుగా ఉపదేశింపలేదు. మీనుండియే మీకు ఉపదేశమిచ్చితిని. పౌరులకును వారివారి తండ్రి మరియు పురోహితుడును గురువుగా నుందురు. కావున దూత వాక్యములచే వారిలో వారికి జ్ఞానము స్ఫురించునట్లు చేసితిని. పరుల ముఖములనుండియే ఇట్లు బోధించితిని. ఇక ఇంటికి పొమ్ము, సుఖముగా నన్నే చింతించుచుండుము.'' అని చెప్పి పంపగా ఆమె తన మందిరము జేరి, తనలో తాను ఆనందించసాగెను.

## కౌసల్య మొదలగు తల్లులు వైకుంఠమునకు వెళ్ళుట

ఇట్లు శ్రీరామచంద్రునిచే బోధింపబడిన తల్లులు ముప్పురును, తమ తమ ఆయుః పరిమితి తీరినపిదప వారివారి దేహములను వదలిరి. శ్రీరామ పరబ్రహ సాన్నిధ్యబలముచే అందరును దివ్య విమానములనెక్కి శ్రీరామునిచేతనే గౌరవింపబడుతూ, నిత్యానంద వైకుంఠలోకమును చేరి, విష్ణు సాయుజ్యముక్తినందిరి.

శిష్యుడా! శ్రీరామాదుల చేతిమీదుగా యే వనితామణులకు పరలోక క్రియాదులు జరిగినవో ఆ స్త్రీలుగదా ధన్యులు. వారి భాగ్యమే భాగ్యము, అట్టి పుణ్యాత్మ రాండ్రగు కౌసల్యా, కైకేయీ, సుమిత్రాంగనల యొక్క ఊర్ధ్వగతులను చెప్పతిని.

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో కౌసల్యాదితల్లులు వైకుంఠమునకు వెళ్ళు ఘట్టమును వివరించు, 2వ సర్గ ముగిసినది.**

# తృతీయః సర్గః-3వ సర్గ

శ్రీరామ పూజావిధానము

విష్ణుదాస ఉవాచ

కథం శ్రీరాఘవస్యాత్ర రామోపాసకమానవైః ।
కార్యా వై మానసీ పూజా బహిఃపూజా తథా శుభా ॥ 1

కథం చోపాసనా గ్రాహ్యా గురో శ్రీరాఘవస్య చ ।
కా శ్రేష్ఠోపాసనా చాత్ర కః శ్రేష్ఠోఽత్ర గురుస్తథా ॥ 2

కే కే మంత్రా రాఘవస్య భక్తానాం సిద్ధిదాయకాః ।
తిథిస్తోషదా తస్య కిం కిం తత్తోషవర్ధనమ్ ॥ 3

కః శ్రేష్ఠోఽత్ర వరో దేవో యస్య గ్రాహ్యా హ్యుపాసనా ।
తత్సర్వం విస్తరేణైవ గురో త్వం వక్తుమర్హసి ॥ 4

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయా శిష్య సావధానమనాః శృణు ।
సర్వం తద్విస్తరేణాద్య త్వదగ్రే కథ్యతే మయా ॥ 5

ఆదౌ గురుం పరీక్ష్యాత్ర తచ్చిహ్నైశ్చ ద్విజోత్తమ ।
ఉపదేశస్తతస్తస్మాద్ గ్రాహ్యస్తీర్థే విధానతః ॥ 6

గురోశ్చైవాత్ర చిహ్నాని తవాదౌ ప్రవదామ్యహమ్ ।
క్రోధీ కుష్ఠీ మహారోగీ మలినో నిర్ఘృణో జడః ॥ 7

అపండితో నిందకశ్చ లోలుపో విషయాతురః ।
దామ్భికో గర్వసంయుక్తః పాపాత్మనా దుష్టవంశజః ॥ 8

ఘాతీ పరద్రోహకర్తా పరద్రవ్యాపహారకః ।
అజితాత్మా వేదబాహ్యః పరదారరతః సదా ॥ 9

పరదోషారోపకశ్చ కృపణశ్చాజితేంద్రియః ।
వేదదేవద్విజాతీనాం యతితీర్థగావామపి ॥ 10

**తులసీవహ్ని సూర్యాణాం ద్వేష్టా యోగ్యో గురుర్న హి ।**
**వేత్తా సకలధర్మాణాం శాస్త్రేషు పరినిష్ఠితః ॥ 11**

## శ్రీరామ మానస పూజావిధానము

విష్ణుదాసు అడుగుచున్నాడు, గురూత్తమా! శ్రీరామపరబ్రహ్మోపాసకులగు మానవోత్తములు శ్రీరామునియొక్క మానసపూజను ఎట్లు చేయవలయును? మంగళమైన బాహ్యపూజ ఎట్లు చేయవలయును? శ్రీరామోపాసనను ఎట్లు గ్రహింపవలయును? శ్రేష్ఠమగు ఉపాసన యెట్టిది? శ్రేష్ఠుడగు గురువెవ్వరు! భక్తులకు సిద్ధిప్రదములయిన శ్రీరామ మంత్రము లెవ్వి? యే తిథి శ్రీరామునికి ఇష్టమైనది? శ్రీరామునికి తృప్తినిచ్చునది ఏది? శ్రేష్ఠుడగు దేవుడెవరు? ఎవరి ఉపాసనను గ్రహింపవలయును? ఈసంగతులను విస్తరించి నాకు ఉపదేశింపుమని అడుగగా, శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు. "శిష్యుడా! చక్కగా అడిగితివి, వాటిని వివరించెదను వినుము....

మొదట సద్గురువును వాని లక్షణములచే పరీక్షించి తెలిసికొని, బ్రాహ్మణోత్తములు తీర్థస్థలమున విధిప్రకారముగా బ్రాహ్మణోత్తముల ఉపదేశమును పొందవలయును. గురువుయొక్క చిహ్నములను నీకు చెప్పుచున్నాను.

"క్రోధముగలవాడు, కుష్ఠు మొదలగు మహారోగములుగలవాడు, మలినుడు, నిర్దయుడు, జడుడు, అవివేకి, దూషకుడు, విషయాసక్తుడు, డాంభికుడు, గర్వయుక్తుడు, దుర్బుద్ధి, దుష్కులజుడు, ఘాతకుడు, పరవంచకుడు, పరులసొత్తును హరించువాడు, ఇంద్రియనిగ్రహము లేనివాడు, వేద బాహ్యుడు, జారుడు, పరులయందు దోషములను ఆరోపించువాడు, లోభి, బుద్ధిని జయించనివాడు- వేదములను, దేవతలను, బ్రాహ్మణులను, యతులను, తీర్థములను, గోవులను, అగ్నిని, సూర్యుని, తులసీ మొదలగు పవిత్రవస్తువులను ద్వేషించువాడు- ఇట్టివాడెన్నటికిని గురువనబడుటకు తగడు గదా?"

ఇక, సకల ధర్మముల ఎరిగినవాడు, శాస్త్రములయందు విచక్షణుడు,

**సత్యవాక్ మితభుక్ జ్ఞానీ కలావాన్ ద్విజవంశజః ।**
**సత్కర్మనిష్ఠో ధర్మాణాముపదేష్టా సుబుద్ధిదః ॥ 12**

**యోగాభ్యాసకలాభిజ్ఞో యోగవాన్ సమదర్శనః ।**
**కృతకర్మా తీర్థసేవీ ధర్మాధర్మ వివేచకః ॥ 13**

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థాశ్రమీ యతిః ।
స్వాశ్రమాచారసన్నిష్ఠో బుద్ధిమాన్విజితేంద్రియః ॥ **14**

క్షమీ కృపాళుర్మృదువాక్ సుముఖః సౌమ్యదర్శనః ।
అనిద్రశ్చ సముద్యోగీ శాంతాత్మా పరతోషకృత్ ॥ **15**

ఔదార్యవాన్ జ్ఞాననిష్ఠః శుచిస్త్యక్తపరిగ్రహః ।
ఇత్యాదిగుణయుక్తో యః స గురుః పరమోత్తమః ॥ **16**

తస్య సేవాం చిరం కృత్వా సేవయా తం ప్రసాద్య చ ।
తస్మాదుపాసనా గ్రాహ్యా సుతీర్థే విధిపూర్వికా ॥ **17**

ఉపాసనాస్త్రయః సంతి సాత్త్వికీ రాజసీ తథా ।
తామసీ చ తృతీయా సా గర్హితాఽత్ర నిగద్యతే ॥ **18**

భూతభేతాళకూష్మాండపిశాచానాముపాసనా ।
సా జ్ఞేయా తామసీ ఘోరా దేవానాం సాత్వికీ స్మృతా ॥ **19**

యక్షాణాం రాక్షసానాం చ యా జ్ఞేయా సా తు రాజసీ ।
శైవ సౌరశ్చ గాణేశాః శాక్తాశ్చ వైష్ణవాస్తథా ॥ **20**

అవతారాస్త్వసంఖ్యాతాః పంచానాం సంతి భూతలే ।
తేషాముపాసనా గ్రాహ్యా గురోరాస్యాద్ద్విజాదిభిః ॥ **21**

## సద్గురువుయొక్క లక్షణములు

సత్యసంధుడు, మితభుజి, జ్ఞాని, కళావంతుడు, బ్రహ్మకులప్రసూతుడు, సత్కర్మపరుడు, ధర్మోపదేశము చేయువాడు, బుద్ధిమంతుడు, యోగాభ్యాస నిపుణుడు, యోగి, అన్నిభూతముల క్షేమమును కోరువాడు, తన బాధ్యతలను చక్కగా నిర్వర్తించినవాడు, తీర్థములను సేవించువాడు, ధర్మాధర్మ పరిశీలుడు, తత్త్వచింతకుడు– బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, యతియైనను సరియే. తన ఆశ్రమమును పరిపాలించువాడు, బుద్ధితో ఇంద్రియములను జయించినవాడు, ఓర్పుగలవాడు, దయాపరుడు, మృదువుగా పలుకువాడు, సుముఖుడు, చల్లనిచూపు గలవాడు, నిద్రాలసుడు కానివాడు, సదుద్యముడు, శాంత స్వభావుడు, పరులను సంతోషపరచువాడు, ఉదారబుద్ధిగలవాడు, బ్రహ్మనిష్ఠుడు, పరిశుద్ధుడు, పరిగ్రహపరాఙ్ముఖుడు ఇట్టివాడెవ్వడో వాడే

ఉత్తమగురువు అనబడును. అట్టివానిని చక్కగా సేవించి, వాని శరణుజొచ్చి, వానివలన దేవతోపాసనమును పుణ్యస్థలమున విధిప్రకారముగా గ్రహించవలయును (17)

## ఉపాసనా భేదములు

సాత్వికోపాసన, రాజసోపాసన, తామసోపాసన యని ఉపాసనలు మూడు విధములుగా ఉన్నవి. భూత, ప్రేత, పిశాచాదులను ఉపాసించునట్టిది క్రూరమైన, నింద్యమగు తామసోపాసన అనబడును. దేవతలను ఉపాసించుట సాత్వికమనబడును. రక్షో యక్షులను పూజించుట రాజసమనబడును.

మరి ఇక, శైవము, సౌరము, గాణాపత్యము, శాక్తము, వైష్ణవము అను అవతారములు ఐదు లోకమున గలవు. బ్రాహ్మణాదులు గురుముఖమునుండి వీటి ఉపాసనలను గ్రహించునది (21).

**పంచానామవతారేషు విష్ణోరేవ వదామ్యహమ్ ।**
**చతుశ్చత్వారింశన్మితానవతారాన్మహత్తమాన్ ॥ 22**

**పురుషోత్తమో విధిశ్చైవ రుద్రో నారాయణస్తథా ।**
**హంసోఽథ దత్తాత్రేయశ్చ కుమారో ఋషభస్తథా ॥ 23**

**హయగ్రీవస్తథా మత్స్యః కూర్మో వారాహ ఏవ చ ।**
**నారసింహో వామనశ్చ జామదగ్న్యస్తథైవ చ ॥ 24**

**రామః కృష్ణస్తథా బౌద్ధః కల్కిర్యజ్ఞో హరిస్తథా ।**
**వాలఖిల్యోద్ధారకశ్చ పృథుర్ధన్వంతరిస్తథా ॥ 25**

**మోహినీ నారదో వ్యాసః కపిలః కేశవస్తథా ।**
**మాధవశ్చాథ గోవిందో మధుసూదన ఏవ చ ॥ 26**

**త్రివిక్రమః శ్రీధరశ్చ పద్మనాభస్తథా స్మృతః ।**
**దామోదరస్తథా సంకర్షణః ప్రద్యుమ్న ఏవ చ ॥ 27**

**అనిరుద్ధోఽధోక్షజశ్చ హ్యచ్యుతశ్చ జనార్దనః ।**
**ఉపేంద్రశ్చ హృషీకేశస్త్వేతే జ్ఞేయా మహత్తమాః ॥ 28**

**మత్స్యాద్యా అవతారాశ్చ దశైతేష్వపి చోత్తమాః ।**
**దశావతారమధ్యేఽపి రామకృష్ణౌ మహత్తమౌ ॥ 29**

**తాభ్యామపి వరః పూర్వః సత్యసంధో రఘూత్తమః ।**
**ఏకపత్నీవ్రతో వీరస్త్వేకబాణో నృపోత్తమః ॥ 30**

**సప్తద్వీపపతిః శ్రీమాంశ్ఛత్రచామరమండితః ।**
**ఏవం జ్ఞాత్వోపాసనాఽత్ర గ్రాహ్యా శ్రీరాఘవస్య చ ॥ 31**

**గురూపదిష్టవిధినా సుముహూర్తే శుభస్థలే ।**
**అథవా తత్తద్దేవానాం గ్రాహ్యా తజ్జన్మసత్తిథౌ ॥ 32**

## దశావతార భేదములు

ఐదువిధములగు అవతారములలోను పరమోత్తమమగు 44 మహావిష్ణువుయొక్క అవతారములను చెప్పబోవుచున్నాను, అవి యేవనిన....

పురుషోత్తమ అవతారము, బ్రహ్మావతారము, రుద్రావతారము, నారాయణావతారము, హంసావ తారము, దత్తాత్రేయావతారము, కుమారావతారము, ఋషభావతారము, హయగ్రీవావతారము- మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బౌద్ధ, కల్కి- అను దశావతారములు. యజ్ఞ, హరి, వాలఖిల్యోద్ధారక, పృథు, ధన్వంతరి, మోహిని అవతారములు- నారద, వ్యాస, కపిలావతారములు- కేశవ, మాధవ, గోవింద, మధుసూదన, త్రివిక్రమ, శ్రీధర, పద్మనాభ, దామోదర, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, అధోక్షజ, అచ్యుత, జనార్దన, ఉపేంద్ర, హృషీ కేశావతారములును చేరి 44 విష్ణు అవతారములు మహోత్కృష్టములు.

పైన తెలిపిన 44 అవతారములలో మత్స్యాది దశావతారములు పరమోత్కృష్టములు. ఆ పది యవతారములలోను రామ, కృష్ణ అవతారములు రెండును అత్యంత ఉత్తమములు. ఆ రెంటిలోను సత్యసంధుడును, ఏకపత్నీవ్రతుడును, ఏకబాణుడును, మహావీరుడును, రాజేంద్రుడును, సప్తద్వీప పరిపాలకుడును, అసాధారణ రాజలక్షణోపేతుడు అగు శ్రీరాముని యవతారము ఉత్తమోత్తమమై ఒప్పుచున్నది అని తెలిసి గురువు ఉపదేశించిన విధిప్రకారము శ్రీరామోపాసనను పుణ్యస్థలమున, మంచి ముహూర్తమున గ్రహించి యుపాసింపవలయును. అదియును గాక, ఆయా అవతారముల జన్మతిథియందు ఆయా అవతారముల దేవతోపాసనను గ్రహించునది. (32)

**చైత్ర మాసి దినే పక్షే నవమ్యాం రామజన్మని ।**
**ఉపాసనానంతరం హి రామం భక్త్యా ప్రపూజయేత్ ॥ 33**

**ఏవం యస్యావతారస్య గృహీతోపాసనా నరైః ।**
**తైస్తస్య జన్మదివసే కార్యా పూజా మహోత్సవైః ॥ 34**

అతో దశావతారాణాం శిష్య జన్మదినాని తే ।
ప్రోచ్యంతేఽత్ర శృణుష్వ త్వం యేషు తాన్పూజయేన్నరః ॥ 35

చైత్రే తు శుక్లపంచమ్యాం భగవాన్మీనరూపధృక్ ।
జ్యేష్ఠే తు శుక్లద్వాదశ్యాం కూర్మరూపధరో హరిః ॥ 36

చైత్ర కృష్ణనవమ్యాం తు హరిర్వారాహరూపధృక్ ।
వైశాఖేఽభూచ్చతుర్దశ్యాం శుక్లపక్షే నృకేసరీ ॥ 37

మాసి భాద్రపదే శుక్లే ద్వాదశ్యాం వామనస్త్వభూత్ ।
వైశాఖే జామదగ్న్యస్తు తృతీయాయాం సితే త్వభూత్ ॥ 38

చైత్రశుక్ల నవమ్యాం తు మధ్యాహ్నే రాఘవస్త్వభూత్ ।
కృష్ణాష్టమ్యాం శ్రావణే హి కృష్ణోఽభూన్మధురాపురి ॥ 39

పౌషశుక్లా సప్తమీ యా బుద్ధజన్మతిథిస్తు సా ।
మాఘశుక్లతృతీయా తు కల్కినః సా తిథి స్మృతా ॥ 40

అహ్నో మధ్యే వామనో రామరామౌ
మత్స్యః క్రోడశ్చాపరాహ్ణే విభాగే ।
కూర్మః సింహో బుద్ధకల్కీ చ సాయం
కృష్ణో రాత్రౌ కాలసామ్యే చ పూర్వే ॥ 41

ఏవం తజ్జన్మకాలశ్చ జ్ఞాత్వా తేషాముపాసకైః ।
ఉత్సవః పరమః కార్యస్తత్తద్దేవప్రపూజనే ॥ 42

నిత్యపూజా ప్రకర్తవ్యా భక్త్యా తేషాముపాసకైః ।
విశేషాజ్జన్మదివసే కార్యం తత్పూజనం ముదా ॥ 43

## దశావతార తిథులు

శ్రీరామ జన్మ దినమగు చైత్రశుక్ల నవమినాడు మంత్రోపాసనానంతరము శ్రీరాముని భక్తితో పూజించవలయు. అదేవిధముగా మహోత్సవములతో యే అవతారమునైనను ఆయా జన్మదినమున ఆరాధించునది. ఇక దశావతార జన్మదినములను వినుము....

చైత్రశుక్ల పంచమినాడు మధ్యాహ్నమున మత్స్యావతారము, జ్యేష్ఠ శుక్ల ద్వాదశియందు సాయంకాలమున కూర్మావతారము, చైత్ర కృష్ణ నవమినాడు మధ్యాహ్నమున వరాహావతారము, వైశాఖ శుక్ల చతుర్దశినాడు సాయంకాలమున నృసింహావతారము, భాద్రపద శుక్ల ద్వాదశినాడు మధ్యాహ్నమున వామన అవతారమును, వైశాఖ శుక్ల తృతీయనాడు మధ్యాహ్నమున పరశు రామావతారము, చైత్రశుక్ల నవమినాడు మధ్యాహ్నమున శ్రీరామావతారము, శ్రావణ కృష్ణాష్టమినాడు అర్ధరాత్రిలో శ్రీకృష్ణావతారము, పుష్య శుక్ల సప్తమినాడు సాయంకాలమున బుద్ధావతారము, మాఘ శుక్ల తృతీయనాడు సాయంకాలమున కల్క్యవతారము అవతరించినది. వీటిలో కాలవ్యాప్తి రెండు దినముల యందును సమానముగా ఉండినయెడల పూర్వదినమే పూజ్యమై యుండును. (41)

## అనంతమగు శ్రీరామమంత్రములు, గురూపదేశము.

ఆయా అవతారముల జన్మతిథులు తెలుసుకుని, ఆయా ఉపాసకులు పూజామహోత్సవములను ఆచరించునది మరియు ఆ ఉపాసకులు నిత్యపూజలను ఆచరించుచు ఆ అవతార జన్మ దినములయందు సంతోషముతో విశేషమహోత్సవములను చేయవలయును.

**గురోర్గృహీతో యో మంత్రస్తం నిత్యం హృదయే జపేత్ ।**
**రామమంత్రాస్త్వనేకాశ్చ శతవర్ణాత్మకో మనుః ॥ 44**

**పంచాశద్వర్ణకశ్చాపి ద్విచత్వారింశదక్షరః ।**
**ద్వాత్రింశదక్షరశ్చాథ సప్తవింశాక్షరస్తథా ॥ 45**

**పంచవింశద్వర్ణకశ్చ చతుర్వింశాక్షరస్తథా ।**
**ఏకవింశద్వర్ణకశ్చ వింశద్వర్ణాత్మకస్తథా ॥ 46**

**అష్టాదశవర్ణకశ్చ షోడశాక్షర ఏవ చ ।**
**పంచదశవర్ణకశ్చ చతుర్దశాక్షరస్తథా ॥ 47**

**త్రయోదశాక్షరశ్చాపి ద్వాదశాక్షర ఏవ చ ।**
**ఏకాదశాక్షరశ్చాపి తథా మంత్రో దశాక్షరః ॥ 48**

**నవాక్షరోఽష్టవర్ణాత్మా సప్తాక్షరమనుస్తథా ।**
**షడక్షరో రామమంత్రస్తథా పంచాక్షరో మనుః ॥ 49**

**చతుర్వర్ణాత్మకశ్చాపి తథా వర్ణత్రయాత్మకః ।**
**ద్వ్యక్షరో రామమంత్రశ్చ మనుస్త్వేకాక్షరోఽపి చ ॥ 50**

**ఏవం నానావిధా మంత్రాః శతశోఽథ సహస్రశః ।**
**గురోస్త్వేకో గృహీత్వాఽత్ర జపేచ్ఛ్రీరామ సన్నిధౌ ॥ 51**

**ఉపాసనావిధానం చ రామోపాసకమానవైః ।**
**యథా మంత్రస్య రూపం హి విజ్ఞేయం మంత్రశాస్త్రతః ॥ 52**

**అధునా మానసీ పూజావిధానం చ మయోచ్యతే ।**
**యద్దండకే సుతీక్ష్ణాయ కథితం కుంభజన్మనా ॥ 53**

**సుతీక్ష్ణస్త్వేకదాఽగస్త్యం దృష్ట్వా రహసి సంస్థితమ్ ।**
**ప్రణమ్య పరయా భక్త్యా ప్రోవాచ వినయాన్వితః ॥ 54**

గురువు ఉపదేశించిన మంత్రమును నిత్యము మనస్సున అనుసంధానము చేసి జపించవలయును. వాటిలో శ్రీరామమంత్రములు అనేకములుగలవు. 100 అక్షరములుగల మంత్రము, అట్లే–50–42 –32–27–25–24–21–20–18–19–15–14–13–12–11–9–8–7–6–5–4–3–2–1–ఏబది మొదలు ఏకాక్షర మంత్రము వఱకు శ్రీరామమంత్రములు నూర్లకొలది, వేలకొలదిగా ఉన్నవి. వాటిలో గురువునుండి ఒకదానినిని గ్రహించి, శ్రీరామసన్నిధానమున జపించ వలయును, శ్రీరామోపాసకులగు మానవోత్తములు ఉపాసనావిధానమును, మంత్ర స్వరూపమును, మంత్రశాస్త్రమునుండి తెలియవలయును. ఇప్పుడు నేనిచ్చట దండకారణ్యమున సుతీక్ష్ణమునికి అగస్త్యముని యిచ్చిన మానసపూజా విధానమును చెప్పుచున్నాను.

ఒకప్పుడు సుతీక్ష్ణుడు అగస్త్యమునీంద్రుని జూచి పరమభక్తితో ప్రణమించి, వినయపూర్వకముగా ఇట్లడిగెను. (54)

## అగస్త్యుడు బోధించిన శ్రీరామోపాసనావిధానము

**సుతీక్ష్ణ ఉవాచ**

**హృదయే మానసీ పూజా కీదృశీ చ వద ప్రభో ।**
**ఉపచారైః కతివిధైః పూజ్యతే రఘునందనః ॥ 55**

**అగస్త్య ఉవాచ**

**రామం పద్మ విశాలాక్షం కాలాంబుద సమప్రభమ్ ।**
**స్మితవక్త్రం సుఖాసీనం చింతయేచ్చిత్తపుష్కరే ॥ 56**

రాగాదికలుషం చిత్తం వైరాగ్యేణ సునిర్మలమ్ ।
కృత్వా ధ్యాయేత్సదా రామం భవబంధవిముక్తయే ॥ 57

ప్రాతః శుద్ధవపుర్భూత్వా శౌచాదిభిరతంద్రితః ।
వివిక్తదేశమాశ్రిత్య ధ్యానం పూజాం సమారభేత్ ॥ 58

నాభికుందసముద్భూతం కదళీకుసుమోపమమ్ ।
అష్టపత్రం స్నిగ్ధవర్ణం ధ్యాయేత్ హృదయపంకజమ్ ॥ 59

తత్పద్మం రామనామ్నైవ ఫుల్లం కృత్వాఽస్య మధ్యమే ।
భావయేత్సూర్యసోమాగ్నిమండలానుత్తరోత్తరమ్ ॥ 60

తస్యోపరి న్యసేద్దివ్యం పీఠం రత్నమయోజ్జ్వలమ్ ।
తన్మధ్యే రాఘవం ధ్యాయేత్సూర్యకోటిసమప్రభమ్ ॥ 61

ఇందీవరనిభం శాంతం విశాలాక్షం సువక్షసమ్ ।
ఉద్యద్దీధితమద్భాస్వత్కుండలాభ్యాం విరాజితమ్ ॥ 62

సునాసం సుకిరీటం చ సుకపోలం శుచిస్మితమ్ ।
విజ్ఞానముద్రం ద్విభుజం కంబుగ్రీవం సుకుంతలమ్ ॥ 63

నానారత్నమయైర్దివ్యహారైర్భూషితమవ్యయమ్ ।
విద్యుత్పుంజప్రతీకాశం వస్త్రయుగ్మధరం హరిమ్ ॥ 64

వీరాసనస్థం సంతానతరుమూలనివాసినమ్ ।
మహాసుగంధలిప్తాంగం వనమాలావిరాజితమ్ ॥ 65

వామపార్శ్వే స్థితాం సీతాం చామీకర సమప్రభామ్ ।
లీలాపద్మధరాం దేవీం చారుహాసాం శుభాననామ్ ॥ 66

పశ్యంతీ స్నిగ్ధయా దృష్ట్యా దివ్యాం కల్పవిరాజితామ్ ।
ఛత్రచామరహస్తేన లక్ష్మణేన సుసేవితమ్ ॥ 67

హనుమత్ప్రముఖైర్నిత్యం వానరైః పరివారితమ్ ।
స్తూయమానం ఋషిగణైః సేవితం భరతాదిభిః ॥ 68

సనందనాదిభిశ్చాన్యైర్యోగివృందైః స్తుతంసదా ।
సర్వశాస్త్రార్థకుశలం యోగజ్ఞం యోగసిద్ధిదమ్ ॥ 69

ఏవం ధ్యాత్వా రామచంద్రం మణిద్వయసుశోభితమ్ ।
శుద్ధేన మనసా రామం పూజయేత్సతతం హృది ॥ 70

## శ్రీరామ మానసపూజా విధానము

స్వామీ! హృదయమున మానసపూజను ఎట్లు చేయవలయును? శ్రీరాముడు ఎన్నివిధములగు ఉపచారములచేత పూజింపబడుచున్నాడు? అని ప్రశ్నించిన సుతీక్ష్ణునికి అగస్త్యముని చెప్పుచున్నాడు.

కమలాయత నేత్రుడు, కాలాంబుదనీలగాత్రుడు, హసన్ముఖుడు, హర్షోపవిష్టుడు, శ్రీరామస్వామిని హృత్కమలమున ధ్యానించవలయును. రాగద్వేషాదులచే కశ్మలమైన మనస్సును వైరాగ్యముచేత నిర్మలము చేసి, సంసార క్లేశనివృత్తికొరకు శ్రీరాముని ధ్యానింపవలెను. ప్రొద్దున అలసటనందక, శౌచాచారములచే దేహము పరిశుద్ధిజేసికొని, రహస్యప్రదేశమున ధ్యానమును, పూజను ప్రారంభింపుడు. పిదప తన హృదయమును నాభినుండి వెలువడిన ఆరిటిఘావు వన్నెగల్గిన ఎనిమిదిదళములు గల స్నిగ్ధవర్ణముగల పద్మముగా అనుసంధానము చేయునది. ఆ పద్మమును రామనామము చేతనే వికపింపజేసి దానిమధ్యన సూర్య, చంద్రాగ్ని మండలములను పైపైగా ధ్యానించి, దానిమీద దివ్యరత్న పీఠమును భావించి, దానినడుమ కోటిసూర్య ప్రకాశమానుడును ఇందిర సుందరుడును, శాంతుడును విశాల నేత్రుడును, మహోరస్కుడును, దివ్యకుండలాలంకృతుడును, అందమైన ముక్కు కలిగినవాడు, సన్మకుటుడును, మంచి నుదురు కలిగినవాడు, నిర్మలమైన చిరునవ్వు కలిగినవాడు, జ్ఞానముద్రుడును, ద్విభుజుడును, కంబుకంఠుడును, సత్కుండలుడును, వివిధ రత్న ములను ధరించినవాడును, మెఱుపుగుమివంటి దివ్యవస్త్రములను అలంకరించికొనియుండును, వీరాసనాసీ నుడును, పారిజాతవృక్షముక్రింద కూర్చుండువాడును, వనమాలావిరాజితుడును, దివ్యగంధాను లిప్తాంగుడును అగు శ్రీరామచంద్ర స్వామిని, కుడి ప్రక్కలో బంగారువంటి ఛాయకలిగి లీలాకమలము దాల్చి, మంగళముఖియై నవ్వుచు, దివ్యాభరణములను ధరించి, ప్రేమార్ద్ర దృష్టిచే అవలోకించుచుండు సీతాదేవిని, ఛత్రచామరహస్తుడై సేవించుచుండు లక్ష్మణుని, సంతతము పరివేష్టించియుండు హనుమంతుడు మొదలగు కపీంద్రులను, స్తుతించుచుండు మునీంద్రులను సేవించుచుండు భరతాదులను, నమస్కరించుచుండు సనందనాది యోగీంద్రులను ధ్యానించ వలయును. ఇది సకల శాస్త్రార్థ కుశలుడును, యోగజ్ఞుడును, యోగసిద్ధిప్రదుడునగు శ్రీరామచంద్ర పరబ్రహ్మ యొక్క ధ్యానక్రమము (70)

ఇతి ధ్యానమ్

ఆవాహయామి విశ్వేశం జానకీవల్లభం విభుమ్ ।
కౌసల్యాతనయం విష్ణుం శ్రీరామం ప్రకృతేః పరమ్ ॥ 71

రాజాధిరాజ రాజేంద్ర రామచంద్ర మహీపతే ।
రత్నసింహాసనం తుభ్యం దాస్యామి స్వీకురు ప్రభో ॥ 72

శ్రీరామాగచ్ఛ భగవన్ రఘువీర రఘూత్తమ ।
జానక్యా సహ రాజేంద్ర సుస్థిరో భవ సర్వదా ॥ 73

రామచంద్ర మహేష్వాస రావణాంతక రాఘవ ।
యావత్పూజాం సమాప్యేఽహం తావత్త్వం సన్నిధో భవ ॥ 74

రఘునందన రాజర్షే రామ రాజీవలోచన ।
రఘువంశజ మే దేవ శ్రీరామాభిముఖో భవ ॥ 75

ప్రసీద జానకీనాథ సుప్రసిద్ధ సురేశ్వర ।
ప్రసన్నో భవ మే రాజన్ సర్వేశ మధుసూదన ॥ 76

శరణం మే జగన్నాథ శరణం భక్తవత్సల ।
వరదో భవ మే రాజన్ శరణం మే రఘూత్తమ ॥ 77

త్రైలోక్యపావనానంత నమస్తే రఘునాయక ।
పాద్యం గృహాణ రాజర్షే నమో రాజీవలోచన ॥ 78

పరిపూర్ణ పరానంద నమో రామాయ వేధసే ।
గృహాణార్ఘ్యం మయా దత్తం కృష్ణ విష్ణో జనార్దన ॥ 79

ఓం నమో వాసుదేవాయ తత్త్వజ్ఞానస్వరూపిణే ।
మధుపర్కం గృహాణేమం రాజరాజాయ తే నమః ॥ 80

నమః సత్యాయ శుద్ధాయ బుద్ధ్యాయ జ్ఞానరూపిణే ।
గృహాణాచమనం దేవ సర్వలోకైక నాయక ॥ 81

బ్రహ్మాండోదరమధ్యస్థై స్తీర్థైశ్చ రఘునందన ।
స్నాపయిష్యామ్యహం భక్త్యా త్వం గృహాణ జనార్దన ॥ **82**

సంతప్తకాంచనప్రఖ్యం పీతాంబరమిమం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోస్తుతే ॥ **83**

శ్రీరామచ్యుత యజ్ఞేశ శ్రీధరానంద రాఘవ ।
బ్రహ్మసూత్రం సోత్తరీయం గృహాణ రఘునాయక ॥ **84**

శ్లో॥ 71 ఆవాహన, 72. రత్న సింహాసన సమర్పణము, 73, 74. నా యొక్క పూజను స్వీకరించుటకు విచ్చేయమని ప్రార్థన, 75. సుముఖీకరణ, 76. ప్రసన్న భావన, 77. శరణాగతిని పొందుట, 78. పాద్య సమర్పణ (పాద ప్రక్షాళనకు నీటిని సమర్పించుట), 79. అర్ఘ్య సమర్పణము (హస్త ప్రక్షాళనకు నీటిని సమర్పించుట), 80. మధుపర్కనివేదనము, 81. ఆచమనార్పణము (త్రాగుటకు మంచినీరు సమర్పించుట), 82. స్నాన కైంకర్యము, 83. వస్త్రసమర్పణ, 84. యజ్ఞోపవీతార్పణము,

కిరీటహారకేయూరరత్నకుండలమేఖలాః ।
గ్రైవేయకౌస్తుభం హారం రత్నకంకణనూపురాన్ ॥ **85**

ఏవమాదీని సర్వాణి భూషణాని రఘూత్తమ ।
అహం దాస్యామి తే భక్త్యా సంగృహాణ జనార్దన ॥ **86**

కుంకుమాగరుకస్తూరీకర్పూరోన్మిశ్రచందనమ్ ।
తుభ్యం దాస్యామి విశ్వేశ శ్రీరామ స్వీకురు ప్రభో ॥ **87**

తులసీకుందమందారజాతీపున్నాగచంపకైః ।
కదంబకరవీరైశ్చ కుసుమైః శతపత్రకైః ॥ **88**

నీలాంబుజైర్బిల్వదళైః పుష్పమాల్యైశ్చ రాఘవ ।
పూజయిష్యామ్యహం భక్త్యా సంగృహాణ నమోఽస్తుతే ॥ **89**

వనస్పతిరసైర్దివ్యైర్గంధాఢ్యైః సుమనోహరైః ।
రామచంద్ర మహీపాల ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥ **90**

జ్యోతిషాం పతయే తుభ్యం నమో రామాయ వేధసే ।
గృహాణ దీపకం రాజంస్త్రైలోక్యతిమిరాపహమ్ ॥ **91**

ఇదం దివ్యాన్నమమృతం రసైః షడ్భిర్విరాజితమ్ ।
శ్రీరామ రాజరాజేంద్ర నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥ 92

నాగవల్లీదళైర్యుక్తం పూగీఫలసమన్వితమ్ ।
తాంబూలం గృహ్యతాం రామ కర్పూరాదిసమన్వితమ్ ॥ 93

మంగళార్థం మహీపాల నీరాజనమిదం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోఽస్తు తే ॥ 94

అథ నమస్కారాష్టమంత్రాః

ఓం నమో భగవతే రామాయ పరమాత్మనే ।
సర్వభూతాంతరస్థాయ ససీతాయ నమో నమః ॥ 95

ఓం నమో భగవతే శ్రీరామ రామచంద్రాయ వేధసే ।
సర్వవేదాంతవేద్యాయ ససీతాయ నమో నమః ॥ 96

ఓం నమో భగవతే శ్రీవిష్ణవే పరమాత్మనే ।
పరాత్పరాయ రామాయ ససీతాయ నమో నమః ॥ 97

ఓం నమో భగవతే శ్రీరఘునాథాయ శార్ఙ్గిణే ।
చిన్మయానందరూపాయ ససీతాయ నమో నమః ॥ 98

ఓం నమో భగవతే శ్రీరామ శ్రీకృష్ణాయ చక్రిణే ।
విశుద్ధజ్ఞానదేహాయ ససీతాయ నమో నమః ॥ 99

ఓం నమో భగవతే శ్రీవాసుదేవాయ శ్రీవిష్ణవే ।
పూర్ణానందైకరూపాయ ససీతాయ నమో నమః ॥ 100

ఓం నమో భగవతే శ్రీరామ రామభద్రాయ వేధసే ।
సర్వలోకశరణ్యాయ ససీతాయ నమో నమః ॥ 101

ఓం నమో భగవతే శ్రీరామాయామితతేజసే ।
బ్రహ్మానందైకరూపాయ ససీతాయ నమో నమః ॥ 102

ఇతి నమస్కారాష్టకమంత్రాః ॥

నృత్యగీతాదివాద్యాదిపురాణపఠనాదిభిః ।
రాజోపచారైరఖిలైః సంతుష్టో భవ రాఘవ ॥ **103**

విశుద్ధజ్ఞానదేహాయ రఘునాథాయ విష్ణవే ।
అంతఃకరణసంశుద్ధిం దేహి మే రఘునందన ॥ **104**

శ్లో॥ 85,86 ఆభరణము సమర్పించుట, 87. గంధము పెట్టుట, 88,89. పత్రము, పుష్పములు, సమర్పించుట, 90. ధూపమువేయుట. 91. దీపము చూపుట, 92. నైవేద్యమును నివేదించుట , 93. తాంబూలసమర్పణము, 94. దివ్యమంగళ నీరాజనము అర్పించుట, 95 వ శ్లోకము మొదలు 102 వ శ్లోకమువరకు గల ఎనిమిది శ్లోకములు నమస్కారాష్టక మంత్రములు, 103. నృత్య, గీతాది సకల రాజోపచార సమర్పణ, 104. బుద్ధికి ప్రసన్నతను ప్రసాదింపమని ప్రార్థన.

నమో నారాయణానంత శ్రీరామ కరుణానిధే ।
మాముద్ధర జగన్నాథ ఘోరాత్సంసారసాగరాత్ ॥ **105**

రామచంద్ర మహేష్వాస శరణాగతతత్పర ।
త్రాహి మాం సర్వలోకేశ తాపత్రయమహానలాత్ ॥ **106**

శ్రీకృష్ణ శ్రీకర శ్రీశ శ్రీరామ శ్రీనిధే హరే ।
శ్రీనాథ శ్రీమహావిష్ణో శ్రీనృసింహ కృపానిధే ॥ **107**

గర్భజన్మజరావ్యాధి ఘోరసంసారసాగరాత్ ।
మాముద్ధర జగన్నాథ కృష్ణ విష్ణో జనార్దన ॥ **108**

శ్రీరామ గోవింద ముకుంద కృష్ణ
శ్రీనాథ విష్ణో భగవన్నమస్తే ।
ప్రౌఢారిషడ్వర్గమహాభయేభ్యో
మాం త్రాహి నారాయణ విశ్వమూర్తే ॥ **109**

శ్రీరామాచ్యుత యజ్ఞేశ శ్రీధరానంద రాఘవ ।
శ్రీగోవింద హరే విష్ణో నమస్తే జానకీపతే ॥ **110**

బ్రహ్మానందైకవిజ్ఞానం త్వన్నామస్మరణం నృణామ్ ।
త్వత్పదాంబుజసద్భక్తిం దేహి మే రఘువల్లభ ॥ **111**

నమో౽స్తు నారాయణ విశ్వమూర్తే
నమో౽స్తు తే శాశ్వత విశ్వయోనే ।
త్వమేవ విశ్వం సచరాచరం చ
త్వామేవ సర్వం ప్రవదంతి సంతః ॥ 112

నమో౽స్తు తే కారణకారణాయ
నమో౽స్తు కైవల్య ఫలప్రదాయ ।
నమో నమస్తే౽స్తు జగన్మయాయ
వేదాంతవేద్యాయ నమో నమస్తే ॥ 113

నమో నమస్తే భరతాగ్రజాయ
నమో౽స్తు యజ్ఞప్రతిపాలనాయ ।
అనంత యజ్ఞేశ హరే ముకుంద
గోవింద విష్ణో భగవన్మురారే ॥ 114

శ్రీవల్లభానంత జగన్నివాస
శ్రీరామ రాజేంద్ర నమో నమస్తే ।
శ్రీజానకీకాంత విశాలనేత్ర
రాజాధిరాజ త్వయి మే౽స్తు భక్తిః ॥ 115

తప్తజాంబూనదేనైవ నిర్మితం రత్నభూషితమ్ ।
స్వర్ణపుష్పం రఘుశ్రేష్ఠ దాస్యామి స్వీకురు ప్రభో ॥ 116

హృత్పద్మకర్ణికామధ్యే సీతయా సహ రాఘవ ।
నివస త్వం రఘుశ్రేష్ఠ సర్వైరావరణైః సహ ॥ 117

మనోవాక్కాయజనితం కర్మ యద్వా శుభాశుభమ్ ।
తత్సర్వం ప్రీతయే భూయాన్నమో రామాయ శార్ఙ్గిణే ॥ 118

అపరాధసహస్రాణి క్రియంతే౽హర్నిశం మయా ।
దాసో౽యమితి మాం మత్వా క్షమస్వ రఘుపుంగవ ॥ 119

**నమస్తే జానకీనాథ రామచంద్ర మహీపతే ।**
**పూర్ణానందైకరూప త్వం గృహాణార్ఘ్యం నమోఽస్తుతే ॥ 120**

**ఏవం యః కురుతే పూజాం బహిర్వా హృదయేఽపి చ ।**
**సకృత్పూజనమాత్రేణ రామ ఏవ భవేన్నరః ॥ 121**

శ్లో॥ 105. సంసార సాగరమునుండి ఉద్ధరింపుమని ప్రార్థన, 106. తాపత్రయాగ్నులనుండి రక్షింపుమని ప్రార్థన, 107. గర్భజదుఃఖాదులనుండి బయటపడవేయమని వేడుట, శ్లో 108. మొదలు 115వ శ్లో. వరకు సగుణ, నిర్గుణ బ్రహ్మనామములతో శ్రీరామస్వామిని స్తుతించుట, 116. సువర్ణ పుష్పార్పణము, 117. సపరివారముగా శ్రీరామమూర్తీ! నాహృదయమున నివసింపుమని ప్రార్థన, 118. సర్వము శ్రీరామ బ్రహ్మార్పణము, 119. అపరాధక్షమాపణము, 120. పునరర్ఘ్య ప్రదానము, ఇట్లు లోపలగాని, వెలుపలగాని యొక్కమారు పూజించిన మాత్రమున నరుడు శ్రీరామసాయుజ్యము పొందును, ఇక చెప్పునదేమి?

**కిం పునః సతతం బ్రహ్మణ్యేవం పూజ్య స్థితో హి సః ।**
**సర్వాన్కామానవాప్నోతి చేహ లోకే పరత్ర చ ॥ 122**

**ఏవం సుతీక్ష్ణతే ప్రోక్తం యథా పృష్టం త్వయా మమ ।**
**హృదయే మానసీపూజావిధానం రాఘవస్య చ ॥ 123**

**శ్రీరామదాస ఉవాచ**

**ఏవం శిష్య సుతీక్ష్ణాయ మునయేఽగస్తినా పురా ।**
**యత్ప్రోక్తం తన్మయా సర్వం తవ ప్రోక్తం సవిస్తరాత్ ॥ 124**

**శిష్యాధునా బహిః పూజావిధానం చ మయోచ్యతే ।**
**నరః ప్రాతః సముత్థాయ కృత్వా శౌచాదికాః క్రియాః ॥ 125**

**స్నాత్వా సంధ్యాదికం కృత్వా దేవపూజాం సమారభేత్ ।**
**తీర్థే దేవాలయే వాఽపి గోష్ఠే పుణ్యస్థలేషు చ ॥ 126**

**నద్యాస్తటే దేవగేహే తులసీ సన్నిధౌ తథా ।**
**లిప్త్వా భూమిం గోమయేన తతో పద్మాని లేఖయేత్ ॥ 127**

సితారక్తహరిత్పీతనీలకృష్ణాదిసంభవైః ।
నానావర్ణైశ్చిత్రితాని తత్ర పూజాం సమారభేత్ ॥ 128

అష్టోత్తరసహస్రశ్రీరామలింగాత్మకాసనమ్ ।
వాష్టోత్తరశతం శ్రీమద్రామలింగాత్మకాసనమ్ ॥ 129

అష్టోత్తరసహస్రశ్రీరామభద్రాసనం హి వా ।
వాష్టోత్తరశతం శ్రీమద్రామభద్రాసనం శుభమ్ ॥ 130

బహూన్యన్యాని శతశః సంతి లఘ్వాసనాని హి ।
తేషాం మధ్యాదేకమేవాసనం సంస్థాప్య చిత్రితమ్ ॥ 131

పీఠోపరి కృతం వస్త్రం పత్రాదిష్వపి వా కృతమ్ ।
ఆసనోపరి జానక్యా రాఘవాదీన్నివేశయేత్ ॥ 132

ఆసనే సర్వతోభద్రమధ్యే పద్మోపరి న్యసేత్ ।
సీతయా రాఘవం రమ్యం వరసింహాసనే స్థితమ్ ॥ 133

రామస్య పృష్ఠభాగే చ లక్ష్మణం స్థాపయేత్తతః ।
రామస్య దక్షిణే పార్శ్వే భరతం విన్యసేచ్ఛుభమ్ ॥ 134

రామస్య వామపార్శ్వే హి శత్రుఘ్నం విన్యసేచ్ఛుభమ్ ।
పురతో రామచంద్రస్య వాయుపుత్రం తు విన్యసేత్ ॥ 135

రామస్య వాయుదిగ్భాగే సుగ్రీవం స్థాపయేత్తతః ।
ఈశాన్యాం రామచంద్రస్య విన్యస్య చ విభీషణాత్ ॥ 136

రామస్య వహ్నిదిగ్భాగే విన్యసేదం మదం తతః ।
నైరుత్యాం రామచంద్రస్య జాంబవంతం తు విన్యసేత్ ॥ 137

## శ్రీరామ బాహ్యపూజా విధానము

ఎప్పుడూ ఈ విధముగా పూజించినవాడు ఇహ పరములలో సమస్త సుఖములను పొందును. సుతీక్ష్ణుడా! నీవడిగిన శ్రీరామమానస పూజావిధానమును ఇట్లు ఉపదేశించితిని. అని యిట్లు అగస్త్యమునీంద్రుడు ఉపదేశించిన శ్రీరామ పూజావిధానమును చెప్పెను.

విష్ణుదాసా! ఇక బాహ్య పూజావిధానమును వినుము...

ప్రాతఃకాలమున శౌచాదిక్రియలను ముగించుకొని, స్నాన సంధ్యాది నిత్యకర్మలను నెరవేర్చి, దేవపూజ ఆరంభించవలయును. నదీఒడ్డునో, దేవాలయముననో, పుణ్యస్థలముయందో, గోవులను కట్టుచోటనో, నదీ తీరముననో, దేవతార్చనయింటిలోనో, తులసీమూలమునో, ఏదైననొకచోట గోమయముచే అలికి, ముగ్గుపిండితో పద్మములను వేసి, వాటిలో ఎఱుపు, పసువు, పచ్చ, నలుపు మొదలగు రంగులను నింపి, దానిమీద 1008 గానీ 108 గాని రామలింగాంకితముల ఆసనము నైనను వేయవలయును. మరియెన్నో లఘు ఆసనములుగలవు. వాటిలో ఒక్కటి నైనను రంగురంగులతో తీర్చిదిద్ది స్థాపించునది, అట్టి పీఠముమీద పూలతోగాని, శుభ్ర వస్త్రముతోగాని ఆసనము పరిచి, అచ్చుట సర్వతోభద్రపీఠమధ్యమున దివ్యరత్న సింహాసనాసీనుడగు శ్రీరామమూర్తిని, సీతాదేవితో కలిపి సంస్థాపించునది. రాముని వెనుక ప్రక్కన లక్ష్మణునిని, కుడిప్రక్క భరతుని, ఎడమప్రక్క శత్రుఘ్నుని, ఎదుట ఆంజనేయస్వామినీ, వాయవ్యమూలలో సుగ్రీవుని, ఈశాన్యమూలలో విభీషణుని, ఆగ్నేయ మూలలో అంగదుని, నైరుతిమూలలో జాంబవంతుని స్థాపించి పూజించునది.

**పూజ్యపూజకయోర్మధ్యే ప్రాగ్దిక్ జ్ఞేయాఽర్చనే త్విహ ।**
**సర్వశాస్త్రేష్వేవమేవ నిర్ణయః కథ్యతే బుధైః ॥ 138**

**లక్ష్మణస్య కరే దేయం ఛత్రం ముక్తావిరాజితమ్ ।**
**భరతస్య కరే దేయం చామరం రుక్మమండితమ్ ॥ 139**

**శత్రుఘ్నస్య కరే దేయం వ్యజనం చిత్రితం శుభమ్ ।**
**హనూమతః కరే దేయం రామస్య పాదుకాద్వయమ్ ॥ 140**

**సుగ్రీవస్య కరే దేయం జలపాత్రం మనోహరమ్ ।**
**కరే విభీషణస్యాపి దేయం ముకురముత్తమమ్ ॥ 141**

**దేయం తాంబూలపాత్రం చ వాలినందనసత్కరే ।**
**జాంబవతః కరే దేయో వస్త్రకోశో మహత్తమః ॥ 142**

**నవాయతనమేవం హి స్థాపయేద్రాఘవస్య చ ।**
**అథవా పంచాయతనం స్థాపయేదాసనోపరి ॥ 143**

**సీతయా రామచంద్రం చ మధ్యే పృష్ఠే తు లక్ష్మణమ్ ।**
**భరతం సవ్యపార్శ్వే చ శత్రుఘ్నం వామపార్శ్వకే ॥ 144**

**పురతో వాయుపుత్రం చ పూర్వోక్తైరుపచార కైః ।**
**ఏవం సంస్థాపయేద్భక్త్యా రామం భద్రాసనోపరి ॥ 145**

**అథవా సీతయా రామం మధ్యే స్థాప్య తతః పరమ్ ।**
**రామస్య పృష్ఠే సౌమిత్రిం రామాగ్రే వాయునందనమ్ ॥ 146**

**సాప్యైవ పూజయేద్భక్త్యా రామం ధృతశరాసనమ్ ।**
**అథవా సీతయా రామం లక్ష్మణం పరిపూజయేత్ ॥ 147**

**సీతానుజౌ వినా పూజా రామస్యైకస్య నాచరేత్ ।**
**కృతా చేద్విఘ్నకర్త్రీ సా భవేదత్ర న సంశయః ॥ 148**

**నవాయతనపూజా సా శ్రేష్ఠా జ్ఞేయా శుభప్రదా ।**
**యా పంచాయతనీ పూజా జ్ఞేయా సా మధ్యమాఽత్ర హి ॥ 149**

**త్రిదైవత్యా తు యా పూజా కనిష్ఠా సా నిగద్యతే ।**
**అతి కనిష్ఠా పూజా సా ద్విదైవత్యా స్మృతా హి సా ॥ 150**

బాహ్యపూజ చేయునప్పుడు తూర్పుదిక్కునకు తిరిగి ఉండవలయును, అన్ని శాస్త్రములలో ఇట్లే చెప్పబడినది. లక్ష్మణుని చేతిలో ముత్తెముల గొడుగు, భరతుని చేతిలో సువర్ణాలంకృత చామరము, శత్రుఘ్నుని హస్తమున మంగళాలంకృత విసనకఱ్ఱ, ఆంజనేయుని చేతిలో శ్రీరామపాదుకలను, సుగ్రీవునిచేత మనోహరమగు మంచినీటిపాత్ర, విభీషణునిచేతిలో అద్దము, అంగదునిచేతిలో తాంబూల పాత్ర, జాంబవంతుని చేతిలో వస్త్రముల పెట్టెను ఆలంకరింపవలయును. ఇది నవాయతనవిధి. అట్లుగాకున్న పీఠమునకు మధ్యన సీతారాములను, ఇరువైపులా భరత శత్రుఘ్నులు, వెనుక లక్ష్మణుడు, ముందు ఆంజనేయుని, ఇట్లు పంచాయతన మూర్తులనయినను స్థాపించవలయును. మరియు పీఠము మధ్యన ఉన్న సీతారాముల వెనుక లక్ష్మణుడును, ఎదుట ఆంజనేయుడును ఇట్లయినను భద్రాసనము మీద పూజించవచ్చును. అదియునుగాక సీతాలక్ష్మణ సమేత శ్రీరామస్వామిని పూజింపవచ్చును. లక్ష్మణుని విడిచి శ్రీరాముని ఒక్కనినే పూజించరాదు. ఆట్లు చేసిన అది మిక్కిలి విఘ్నప్రదము. ఇది నిజము. నవాయతనపూజ ఉత్తమము. పంచాయతనపూజ మధ్యమము. ముగ్గురు (సీత, శ్రీరాముడు, లక్ష్మణుడు) దేవతలుగల పూజ కనిష్ఠము. సీతారాముల నిరువురినే పూజించుట మిక్కిలి కనిష్టము.

**కోదండం వామహస్తే చ తూణీరం వామపార్శ్వకే ।**
**నిజనామాంకితం బాణం దధానం దక్షిణే కరే ॥ 151**

ఏవం శ్రీరాఘవం స్థాప్య తతః పూజాం సమారభేత్ ।
ఆత్మనో వామభాగే చ జలకుంభం నిధాయ హి ॥ 152

ఆత్మనో దక్షిణే భాగే పూజాపాత్రం నివేశయేత్ ।
ఆత్మనః పురతః పాత్రం స్థాపయేద్విస్తృతం వరమ్ ॥ 153

ప్రాఙ్ముఖః సుఖమాసీనో ధృతపద్మాసనః శుచిః ।
మౌనీ ధృతాక్షతులసీమాలో నిశ్చలమానసః ॥ 154

బద్ధగ్రంథిశిఖః శుద్ధవస్త్రో ధృతపవిత్రకః ।
శుద్ధద్వారావతీమృత్కృత్తిలకో ముద్రికాంకితః ॥ 155

నత్వాదౌ గణరాజం చ తిథివారాది కీర్తయేత్ ।
భూమిశుద్ధిం భూతశుద్ధిం న్యాసౌ కృత్వా యథాక్రమమ్ ।
ప్రోక్షణీపాత్రమేకం తు జలపూర్ణం ప్రకారయేత్ ॥ 156

దూర్వాగంధాక్షతపుష్పైస్తత్పాత్రం పరిపూరయేత్ ।
ప్రోక్షయేత్తేన నీరేణ పూజాద్రవ్యం సహాత్మనా ॥ 157

పాద్యార్ఘ్యాచమనార్థం తు త్రీణి పాత్రాణి విన్యసేత్ ।
గణరాజ పూజయిత్వా సంపూజ్య వరుణం తతః ॥ 158

పాంచజన్య పూజయిత్వా ప్రోక్షయేత్తజ్జలైరపి ।
పూజాద్రవ్యం పూర్వవచ్చ స్వాత్మానం చ భువం తథా ॥ 159

ధేనుశంఖచక్రపక్షిరాజముద్రాః ప్రదర్శయేత్ ।
శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ ॥ 160

మనోమయీ మణిమయీ ప్రతిమాఽష్టవిధా స్మృతా ।
అథ ధ్యాయేద్రామచంద్రం ససీతం పురతః స్థితమ్ ॥ 161

ద్విభుజం ధృతతూణీరం చాపబాణధృతాయుధమ్ ।
దివ్యాలంకారసంయుక్తం పీతకౌశేయవాససమ్ ॥ 162

**సలక్ష్మణం సశత్రుఘ్నం భరతేన సమన్వితమ్ ।**
**హనుమత్సేవితపదం సింహాసనవిరాజితమ్ ॥ 163**

**సితచ్ఛత్రసమాయుక్తం దివ్యచామరవీజితమ్ ।**
**విభీషణసమాయుక్తం సుగ్రీవపరివందితమ్ ॥ 164**

**జాంబవతా సమాయుక్తమంగదేన పరిష్టుతమ్ ।**
**అయోధ్యావాసినం రామమేవం హృది విచింతయేత్ ॥ 165**

**సీతారామ సమాగచ్ఛ మదగ్రే త్వం స్థిరో భవ ।**
**గృహాణ పూజాం మద్దత్తాం కృతమావాహనం తవ ॥ 166**

ఎడమప్రక్కన అంబులపొది, ఒరను ఎడమచేతిలో, ధనస్సును కుడిచేతిలో, శ్రీరామ బాణాంకిత బాణమును ధరించియుండు నట్లు శ్రీరామప్రతిమను స్థాపించునది. పిదప పూజించువాడు తన యెడమప్రక్కలో ఉదక కలశమును, కుడిప్రక్కలో పూజాపాత్రను, ఎదుట నొక పెద్దపళ్ళెమును పెట్టునది (53). ఉపాసకుడు తూర్పుముఖముగాను, సుఖాసీనుడును, పద్మాసనారూఢుడును, పరిశుద్ధుడును, మౌనము పూనినవాడును, తులసీమణుల హారమును జపమాలికను ధరించిన వాడును, స్థిర బుద్ధియును, ద్వారకా మృత్తిక యొక్క తిలకమును అలంకరించుకొనినవాడును, పవిత్రకరుడును ఆయి, మొదట గణపతికి మొక్కి; తిథి, వార, కీర్తనాది సంకల్పముచేసి, భూశుద్ధిని, భూతశుద్ధిని, అంగన్యాస కరన్యాసాలను అచరించి, క్రమముగా ప్రోక్షపాత్రను, జలపూర్ణపాత్రయును పెట్టుకొని; గంధ పుష్పాక్షత దూర్వాదులచే కలశపూజజేసి ఆ నీటిచే; పూజాసామగ్రులను, తన్ను గూడ ప్రోక్షించుకొని, పాద్య, అర్ఘ్య, ఆచమనములకు మూడుపాత్రలను వేర్వేరుగా పెట్టునది.

పిమ్మట శ్రీగణపతిని పూజించి, వరుణుని అర్చించి, శంఖమును పూజించి, ఆ ఉదకము చేత– భూమిని, పూజాద్రవ్యములను, తనను ప్రోక్షించి– ధేనుముద్రను, శంఖముద్రను, చక్రముద్రను, గరుడముద్రను చూపించి– శిలాప్రతిమ, కొయ్య విగ్రహము, లోహప్రతిమ, లప్పపు బొమ్మ, చిత్రప్రతిమ, ఇసుకబొమ్మ, రత్నవిగ్రహము, మనోమయమూర్తి– అను ఎనిమిది విధములగు ప్రతిమలలో దేనినైనను ఇట్లు ధ్యానించి పూజించవలయును. 161వ శ్లోకము మొదలు 5 శ్లోకములచే పూర్వోక్త సన్నివేశముతో శ్రీరామచంద్ర స్వామిని ధ్యానించునది. 166 వ శ్లోకము ఆవాహనము.

**హిరణ్మయం రత్నయుక్తం నానాచిత్రవిచిత్రితమ్ ।**
**సింహాసనం సవస్త్రం చ హ్యాసనార్థం దదామి తే ॥ 167**

చందనాగరుసంయుక్తైర్జలైస్తీర్థసముద్భవైః ।
పాద్యం గృహాణ శ్రీరామ మయా దత్తం ప్రసీద మే ॥ 168

పుష్కరాదిషు తీర్థేషు గంగాదిషు సరిత్సు చ ।
యత్తోయం తన్మయాఽఽనీతం దత్తమర్ఘ్యంగృహాణ భోః ॥ 169

సుగంధవాసితం తోయం బహుతీర్థసముద్భవమ్ ।
ఆచమనార్థమానీతం గృహాణ త్వం స్థిరోభవ ॥ 170

హరిద్రాకుంకుమైర్యుక్తం సుగంధద్రవ్యమిశ్రితమ్ ।
సుగంధస్నేహసంమిశ్రముద్వర్తనమథాస్తు తే ॥ 171

కామధేనూద్భవం క్షీరం నందిన్యా దధి సుందరమ్ ।
కపిలాయా ఘృతం శ్రేష్ఠం మధు వింధ్యాద్రిసంభవమ్ ॥ 172

సితోత్పలసమానామ సీతాయుక్తం మనోహరమ్ ।
పంచామృతం మయాఽఽనీతం స్నానార్థం త్వం గృహాణభోః ॥ 173

గంగా చ యమునా చైవ గోదావరీ సరస్వతీ ।
నర్మదా సింధుకావేరీ సరయూ గండకీ తథా ॥ 174

తామ్రపర్ణీ భీమరథీ కృష్ణావేణీ మహానదీ ।
గోమతీ సాగరాః సప్త పయోష్ణీ భవనాశినీ ॥ 175

పూర్ణా తాపీ తుంగభద్రా క్షిప్రా వేగవతీ తథా ।
పినాకీ ప్రవరా సింధుఫేణా సార్ధత్రయో నదాః ॥ 176

ఘృతమాలా కృత్తమాలా మహీ నిక్షేపికా తథా ।
పయోష్ణీ ప్రేమగంగా చ చిత్రగంగా కరానదీ ॥ 177

నీరా చర్మణ్వతీ వృద్ధా వంజరా చ పునః పునః ।
సింధుక్షీరా చ వైకుంఠాఽలకనందా చ వారణా ॥ 178

ఇత్యాదిసర్వతీర్థేషు యత్తోయం వర్తతే శుభమ్ ।
తన్మయాఽఽనీమమద్యాత్ర స్నానం కురు రఘూత్తమ ॥ 179

పునరాచమనం రమ్యం సర్వతీర్థసముద్భవమ్ ।
గృహాణ రఘునాథ త్వం దీయతే యన్మయా తవ ॥ 180

సువర్ణతంతుభిశ్చిత్రం పీతకౌశేయసంభవమ్ ।
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ రఘునాయక ॥ 181

శుద్ధం హేమమయం రమ్యం నవతంతుసముద్భవమ్ ।
బ్రహ్మగ్రంథిసమాయుక్తం బ్రహ్మసూత్రం ప్రగృహ్యతామ్ ॥ 182

ముకుటం కుండలే రమ్యే ముద్రికాః కంకణే తథా ।
నూపురే రశనామాలాః కేయూరే రత్నమండితే ॥ 183

ఇత్యాదీన్పరమాన్ దివ్యాన్ స్వర్ణమాణిక్యనిర్మితాన్ ।
త్వదర్థం చ మయానీతానలంకారాన్ గృహాణ భోః ॥ 184

ఛత్రం సవ్యజనం రమ్యం చామరద్వయసంయుతమ్ ।
త్వదర్థం చ మయాఽఽనీత గృహ్ణీష్వ రిపుసూదన ॥ 185

సుగంధం చందనం దివ్యం కృష్ణాగరువిమిశ్రితమ్ ।
రక్తచందనసంయుక్తం గృహ్ణీష్వ త్వం మయాఽర్పితమ్ ॥ 186

శ్లో॥ 67. సింహాసన సమర్పణము, 68. పాద్యము, 69. అర్ఘ్యము, 70. ఆచమన సమర్పణము, 171 మొదలు 9శ్లోకములచే పంచామృత శుద్ధోదక స్నానము, 180. పునరాచమనము, 181. వస్త్రార్పణము, 182. యజ్ఞోపవీతార్పణము, 183,184. ఆభరణసమర్పణము. 185. ఛత్ర చామరాది రాజచిహ్నములను అర్పించుట, 186. గంధార్పణము....

అక్షతాంశ్చ వరాన్ దివ్యాన్ ముక్తాఫలవినిర్మితాన్ ।
కస్తూర్యా కుంకుమేనాక్తాన్ గృహాణ పరమేశ్వర ॥ 187

మాల్యాదీని సుగంధీని మాలత్యాదీని వై ప్రభో ।
మయాఽఽహృతాని పూజార్థం గృహాణ రఘునాయక ॥ 188

వనస్పతిరసోద్భూతం గంధాఢ్యం గంధముత్తమమ్ ।
ఆఘ్రేయం సర్వదేవానాం ధూపం గృహ్ణీష్వ రాఘవ ॥ 189

సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా యోజితం మయా ।
దీపం గృహాణ భో రామ త్రైలోక్యతిమిరాపహ ॥ 190

భక్ష్యభక్తేన సంయుక్తం సపాయసఘృతాన్వితమ్ ।
శర్కరామధుసంయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥ 191

ఆమ్రాదీని సుపక్వాని ఫలాని వివిధాని చ ।
సమర్పితాని తే రామ గృహ్ణీష్వ రఘునందన ॥ 192

పూగీఫలసమాయుక్తం నాగవల్లీదలైర్యుతమ్ ।
జాతీచతుష్టయయుతం తాంబూలం స్వీకురు ప్రభో ॥ 193

హిరణ్యం బ్రహ్మసంభూతం వహ్నితేజః సముద్భవమ్ ।
దీయతే దక్షిణార్థం తే గృహ్ణీష్వ రఘునందన ॥ 194

ఏవం మయా షోడశకోపచారాః
సవిస్తరం తే కథితాః శిశోఽత్ర ।
ఆవాహనాద్యాశ్చ హి దక్షిణాంతాః
శేషాం చ పూజాం సకలాం హి వక్ష్యే ॥ 195

పంచవర్తిసమాయుక్తం కపిలాఽఽజ్యవిమిశ్రితమ్ ।
వహ్నినా యోజితం రమ్యం గృహ్ణీష్వ త్వం నిరాజనమ్ ॥ 196

జాతీ చంపకమందారౌ కేతకీ తులసీ తథా ।
దమనో మునికుందే చ హ్యనంతం త్వితి వై నవ ॥ 197

ఏభిర్నవవిధైః పుష్పైః మంత్రపుష్పాణి రాఘవ ।
మయాఽర్పితాని గృహ్ణీష్వ ప్రసీద పరమేశ్వర ॥ 198

యాని కాని చ పాపాని జన్మాంతరకృతాని చ ।
తాని సర్వాణి నశ్యంతు ప్రదక్షిణం పదే పదే ॥ 199

ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా ।
పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం సాష్టాంగం చ నమోస్తుతే ॥ 200

**ఆవాహనం న జానామి న జానామి విసర్జనమ్ ।**
**పూజాం చైవ న జానామి క్షమ్యతాం పరమేశ్వర ॥ 201**

**మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం రఘూత్తమ ।**
**యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు మే ॥ 202**

**ఏవం శ్రీరామచంద్రస్య భక్త్యా కార్యం ప్రపూజనమ్ ।**
**నిరంతరం తథా కార్యం నవమ్యాం చ విశేషతః ॥ 203**

శ్లో॥ 187. అక్షతార్పణము, 188. పుష్పపూజనము, 189. ధూపము, 190. దీపము, 191. నైవేద్యము, 192. ఫలసమర్పణము, 193. తాంబూలము. 194. దక్షిణసమర్పణము,

వినుము విష్ణుదాసా! ఇట్లు ఆవాహనము మొదలు దక్షిణ సమర్పణ వరకు పదహారు ఉపచారములతో పూజ చేయవలయును, శ్లో॥ 196 ఐదువత్తులతో కూడిన నీరాజనము. 197, 198. జాజిపూలు, సంపంగిపూలు, పారిజాత పుష్పములు, మొగిలిపూలు, తులసీ దవనము, మొల్లలు, నల్లయవిశపూలు, సింహిపుష్పము, బృహతీ పుష్పము- అను ఈ తొమ్మిది పుష్పములచే మంత్ర పుష్పార్పణము, 199. సకలపాపపరిహారకముగ ప్రదక్షిణ, 200. సాష్టాంగ నమస్కారము, 201 తన అజ్ఞానము వలన చేసిన పొరపాట్లను క్షమింపుమని వేడుట, 202. కొరవ లేనట్లు చేయుమని ప్రార్థన- ఇట్లు శ్రీరామపూజనము భక్తితో నిత్యము చేయవలయును. నవమినాడు విశేషఫలదాయకమని శ్రీరామదాసు ఉపదేశించెను. (203)

**విష్ణుదాస ఉవాచ**

**గురో నవవిధైః పుష్పైస్త్వయాపుష్పాంజలిః కథమ్ ।**
**నివేదితోఽత్ర రామస్య పూజనే తద్వదస్వ మామ్ ॥ 204**

**త్వత్తో నానావిధాః పూజాః సురాణాం చ మయా శ్రుతాః ।**
**పూర్వం తాసు శ్రుతో నైవ వనపుష్పాంజలిః కదా ॥ 205**

**శ్రీరామదాస ఉవాచ**

**సమ్యక్ పృష్టం త్వయా శిష్య సావధానమనాః శృణు ।**
**ఆసీత్పురా ద్విజవరః కావేర్యా ఉత్తరే తటే ॥ 206**

**రామనాథపురే కశ్చిత్సుందరాఖ్యోఽతిభక్తిమాన్ ।**
**తస్యాసన్నవ పుత్రాశ్చ రామచింతనతత్పరాః ॥ 207**

చంద్రోఽతిచంద్రశ్చంద్రాభశ్చంద్రాస్యశ్చంద్రశేఖరః ।
చంద్రాంశుర్జితచంద్రశ్చ చంద్రచూడోఽష్టమః స్మృతః ॥ 208

రామచంద్రశ్చేతి నవ గృహోభాశ్చ నవ స్మృతాః ।
ఏకదా తే త్వయోధ్యాయాం రామం భక్తకృపాకరమ్ ॥ 209

ప్రష్టుం యయుశ్చైత్రమాసే తస్థుస్తే సరయూతటే ।
తావత్తత్ర సమాయాతా నానాదేశాంతరస్థితాః ॥ 210

జనౌఘానాం కోటయశ్చ నానావాహనసంస్థితాః ।
సరయ్వాం రామతీర్థే హి చైత్రస్నానమాదరాత్ ॥ 211

తేషాం సమాగతానాం హి సంమర్దస్తత్ర వై హ్యభూత్ ।
సంమర్దాద్రామచంద్రస్య తేషాం నాభూచ్చ దర్శనమ్ ॥ 212

తదా తే మంత్రయామాసుర్నవ విప్రాః పరస్పరమ్ ।
కథం శ్రీరాఘవస్యాత్ర సంమర్దే దర్శనం భవేత్ ॥ 213

చేజ్జాతం త్వతియత్నేన తర్హి తత్కిం న దర్శనమ్ ।
యావత్స్వస్థేన మనసా రాఘవో న నిరీక్షితః ॥ 214

తావత్తద్దర్శనం నైవ తుష్టిం నో జనయిష్యతి ।
తదా చంద్రోఽబ్రవీజ్జ్యేష్ఠ స్త్వత్రైవ రామదర్శనమ్ ॥ 215

వయం తీవ్రేణ తపసా ప్రాప్స్యామస్తప్యతాం తపః ।
తచ్చంద్రవచనం శ్రుత్వా పునః ప్రోచుర్ద్విజోత్తమాః ॥ 216

## నవపుష్పాంజలి, నవరామోపాఖ్యానము

గురూత్తమా! తమనుండి దేవపూజాక్రమముల నెన్నింటినో వినియున్నాను, ఎచ్చటను నవపుష్పాంజలి చెప్పబడలేదు. ఈ నవ పుష్పాంజలి శ్రీరామప్రీతికరమగుటకు కారణమేమి? అనుగ్రహింపుడనిన విష్ణుదాసునికి శ్రీరామదాసుడిట్లు నిరూపించుచున్నాడు.

విష్ణుదాసా! వినుము, బాగుగాఅడిగితివి. పూర్వము కావేరీతీరమున గల రామనాథపురమున సుందరుడు అను భక్తిగల బ్రాహ్మణోత్తముడుండెను. అతనికి శ్రీరామధ్యాన పరాయణులయిన– చంద్రుడు,

అతిచంద్రుడు, చంద్రిభుడు, చంద్రాస్యుడు, చంద్రశేఖరుడు, చంద్రాంశుడు, జితచంద్రుడు, చంద్రచూడుడు, రామచంద్రుడు- అను పేర్లు గల తొమ్మిదిమంది కొడుకులు గలరు. వారొకసారి భక్తదయానిధియగు శ్రీరామస్వామిని దర్శించుటకై, చైత్రమాసమున అయోధ్యకువచ్చిరి. అప్పటి కచ్చట నానాదేశ జనులును చేరియుండిరి. కోట్లకొలదిగా వాహనాదులతో వచ్చిన ప్రజలు శ్రీరామతీర్థమున స్నానము చేయుచుండుటలో కలిగిన సందడితో వీరికి శ్రీరామదర్శనము దొరకలేదు. అంత ఆసుందర పుత్రులు తొమ్మిదిమందియును "ఎట్లు శ్రీరామదర్శనము కలుగును? బలవంతముగా నొకవేళ కలిగిన అది దర్శనము కాదు. అందువలన ఆనందమును లేదు. అని ఆలోచించుచుండగా, జ్యేష్ఠుడగు చంద్రుడు, "ఇచ్చటనే తీవ్రతపముచే శ్రీరామునిని దర్శింతము. అందరూ తపమునకారంభింపుడు," అనెను.

ఏకకాలే తు సర్వేషాం తపతామంతరేణ హి ।
కస్యాదౌ రామచంద్రశ్చ దాస్యత్యత్ర ప్రదర్శనమ్ ॥ 217

కస్య దాస్యతి పశ్చాచ్చ విదితం తద్భవిష్యతి ।
కస్యాస్మాసు దృఢ భక్తిర్విదితా సా భవిష్యతి ॥ 218

ఏవం పరస్పరం చోక్త్వా తే సర్వే ద్విజసూనవః ।
త్యక్తాహారా వాయుభక్షాశ్చైకాంతే తత్పరేణ హి ॥ 219

గత్వాఽతిదూరం సంమర్దాత్తేషుః సర్వే తపో మహత్ ।
తత్సర్వం రాఘవో జ్ఞాత్వా సర్వసాక్షీ జగత్ప్రభుః ॥ 220

తేషాం స్వదర్శనం దాతుం నవమే దివసే ముదా ।
మంత్రయామాస శ్రీరామః క్షణం చిత్తే సభాస్థితః ॥ 221

ఏకకాలే తు సర్వేషాం యది దాస్యామి దర్శనమ్ ।
తర్హ్యేవ తుష్టిః సర్వేషాం భవిష్యతి న చేన్నహి ॥ 222

అతోఽద్యాహం కరిష్యామి నవ రూపాణి నిశ్చయాత్ ।
ఏవం సంమంత్ర్య శ్రీరామో లక్ష్మణం ప్రాహ సాదరమ్ ॥ 223

శిబికామానయస్వాద్య బహిర్గచ్ఛామ్యహం ముదా ।
తథేతి రామవాక్యేన శిబికాం లక్ష్మణస్తథా ॥ 224

ఆనయామాస దూతైః స రాఘవాయ న్యవేదయత్ ।
తదా సింహాసనాద్రామశ్చోత్తీర్య శిబికాస్థితః ॥ 225

బంధుభిర్మంత్రివర్యైశ్చ సుహృన్మిత్రాదిభిర్యుతః ।
బహిః శనైరయోధ్యాయా యయౌ రామో ముదాన్వితః ॥ 226

తతస్తం జనసంమర్ద సమతిక్రమ్య రాఘవః ।
చకార నవ రూపాణి హ్యాత్మనః పరమేశ్వరః ॥ 227

శిబికాః సుహృదో భ్రాతౄన్ దూతాన్ మిత్రాన్ సవాహనాన్ ।
చకార నవధా రామస్తదా స క్షణమాత్రతః ॥ 228

నిరీక్షితుం సమాయాతా నాత్మానం తాన్ జనానపి ।
చకార నవధా రామస్తదాద్భుతమివాభవత్ ॥ 229

తతస్తైస్తైర్జనైర్మిత్రైర్దూతైర్బంధుజనైః సహ ।
నవానాం భూసురాణాం హి యయావగ్రే రఘూత్తమః ॥ 230

తతస్తే భూసురాః సర్వే తదైకసమయే ప్రభుమ్ ।
ఆత్మనః పురతో రామం దదృశుస్తం పృథక్ పృథక్ ॥ 231

తత్తుష్టమనసః సర్వే ప్రణేమూ రఘునందనమ్ ।
శిబికాభ్యాస్తతో రామస్త్వవరుహ్యా పృథక్ పృథక్ ॥ 232

నవరూపధరాః సర్వాన్విప్రానాలింగ్య సాదరమ్ ।
ఊచుర్మధురయా వాచా ప్రసన్నముఖపంకజాః ॥ 233

చంద్రుడు చెప్పిన మాటకు అందఱును "ఇది బాగుగానున్నది. ఏకకాలమున మంత్ర తపోనుష్ఠానముచే ఎవనికి మొదట దర్శనమిచ్చి యెవనికి పిదప దర్శనమిచ్చును? ఎవనిభక్తి గట్టిదో?" అని సమ్మతించి, ఆ గుంపునకు చాలా దూరముపోయి, ఆహారమును వదలి, వాయుభక్షకులై, ఏకాంతమున శ్రీరామధ్యానతత్పరులై, తపముచేయుచుండిరి. సర్వజ్ఞుడు సర్వసాక్షియుఅయిన భగవంతుడగు శ్రీరాముడు తొమ్మిదవనాడు వారికి తన దర్శన మిచ్చుటకు మనమున క్షణకాలము "ఏక కాలముననే వారికి దర్శనమిచ్చితినా అప్పుడు వారికి సంతోషము సంభవించును, కాని

వేర్వేరుగా ఇచ్చిన ఆనందించరు. కావున నేడు తొమ్మిది రూపముల నందెదను," అని యాలోచించి, బయట పోవలె పల్లకిని తెప్పింపుమని లక్ష్మణుని ఆజ్ఞాపించెను. అట్లేయని లక్ష్మణుడు దూతలచే పల్లకీని తెప్పించెను. అపుడు శ్రీరామచంద్రస్వామి సింహాసనమునుండి దిగి, పల్లకినెక్కి- బంధు, మంత్రి, మిత్ర, పుత్రాది సర్వ పరివారముతో సంతోషించుచు, తిన్నగా వెడలి, ఊరుదాటి సందడిని తప్పించుకొని, పిదప ఆ పరమేశ్వరుడు తాను తొమ్మిది రూపములను దాల్చెను. పల్లకీలు, దూతలు, బోయిలు, మంత్రులు, మిత్రులు మొదలగువారిని, తుదకు చూచుటకు వచ్చిన వారినికూడ తొమ్మిది రూపములుగల వారినిగా ఏర్పరచెను. అపుడు అందరితోను తొమ్మండుగురు చంద్రాంకులగు బ్రాహ్మణులవద్దకు వచ్చెను. వారును తమయెదుట వేర్వేరుగా తొమ్మిది రూపములనంది యుండెడు శ్రీరామమూర్తిని దర్శించి సంతోషించుచు నమస్కరించిరి. శ్రీరాములును పల్లకీలనుండి దిగి వేర్వేరుగా ఆ తొమ్మిదిమంది బ్రాహ్మణులను హత్తుకొనిరి.

**భో విప్రాః శ్రమితా యూయం యుష్మాకం కృతనిశ్చయమ్ ।**
**బుద్ధ్వా వయం పృథకం రూపైర్జాతాః స్మో నవధాఽద్య హి ॥ 234**

**ఏకకాలేఽత్ర తపతాం సర్వేషాం దర్శనం నిజమ్ ।**
**కస్య దేయం తు పూర్వం హి పశ్చాత్కస్య ప్రదీయతామ్ ॥ 235**

**ఇతి సంమంత్ర్య హృదయేన త్వద్వైకసమయేన హి ।**
**యుష్మాకం దర్శనం దత్తం వరయధ్వం వరాన్వితః ॥ 236**

**రామాణాం వచనం శ్రుత్వా తే ప్రోచుర్భూసురోత్తమాః ।**
**యేనాస్మాకం భవేత్కీర్తిః స వరో దీయతాం తు నః ॥ 237**

**తత్తేషాం వచనం శ్రుత్వా రామాః ప్రోచుర్ద్విజాన్ పునః ।**
**యుష్మాకం దర్శనార్థం హి నవరూపధరా వయమ్ ॥ 238**

**అద్య జాతా యతస్తస్మాద్యుష్మాకం నామభిః సదా ।**
**నవ రామః పరా ఖ్యాతిం గమిష్యన్త్యవనీతలే ॥ 239**

**అస్మాకం నవ యత్కించిత్తత్ప్రియం హి భవిష్యతి ।**
**ఇతి తేషాం తు రామాణాం వాక్యం శ్రుత్వా ద్విజోత్తమాః ॥ 240**

**సంతుష్టస్తే నతా నేముః స్వం స్వం రామం ముహుర్ముహుః ।**
**తదా సర్వే జనా రామాన్ లక్ష్మణాన్ భరతాదికాన్ ॥ 241**

**ఆత్మానం నవధా జాతాన్ దృష్ట్వా విస్మయమాగతాః ।**
**తతో రామః శిబికాసు స్థిత్వా పృష్ట్వా ద్విజోత్తమాన్ ॥ 242**

**పరావృత్య యయుః సర్వే మార్గే త్వేకోఽభత్పునః ।**
**సర్వే జాతాస్త్వేకరూపాస్తథా తే విస్మయం యయుః ॥ 143**

**తతో రామో బంధుభిశ్చ పూర్వవన్నగరీం యయౌ ।**
**గత్వా గేహే తు సీతాయై సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 244**

తొమ్మిదిమంది బ్రాహ్మణులతో శ్రీరాములవారు, "బ్రాహ్మణులారా! మీరు ఎంతో శ్రమనందితిరి. మీదృఢతర నిశ్చయమును తెలిసి, మీకు ఏకకాలమున నేడిచ్చట నవరూపధరుడనై దర్శనమిచ్చితిని, వలయు వరములను వేడుడు." అని చెప్పగా, అందుకు వారు, "యే వరముచే మాకు కీర్తికలుగునో ఆ వరమిమ్మ" నిరి. అంత ఆ శ్రీరామమూర్తులవారు "మీ కొరకు నేడు ఈ తొమ్మిది రూపములను ధరించితిని. కావున నేను నవరాముడని ప్రఖ్యాతినందెదను. భూమిలో తొమ్మిది అనునది అంతయును నాకు ప్రీతికరమైయుండును. ఇందుచే మీ పేర్లతోడ నాకు నవఖ్యాతి గల్గే"నని వరమిచ్చిరి. అపుడు ఎంతో సంతోషముపొందిన వారు, బ్రాహ్మణులు తమ తమ రామునికి పలుమార్లు నమస్కరించిరి. అప్పుడు లోకులందరును శ్రీరాములను, లక్ష్మణులను, మంత్రులను, పరివారములను, తుదకు తమతమ రూపములను నవరూపాత్మకముగా చూచి ఎంతో ఆశ్చర్య పరవశులయిరి. అంత ఆ రాములవారు బ్రాహ్మణులను అనుగ్రహించి, యథాపూర్వముగా ఊరివాకిటవరకు నవరూపములతో వచ్చి, అచ్చట మార్గమున తిరిగి ఒకేరూపముగా మారిపోయెను. అందరును ఏకరూపులయిరి. ఆందరూ ఆనందాశ్చర్యమగ్నులయిరి. ఈ సంగతిని శ్రీరాముడు బంధ్వాదులతోడ నగరమునకు వచ్చి అంతఃపురమును ప్రవేశించి సీతాదేవితో చెప్పి సల్లాపోల్లాసమంది ఆనందించుచుండెను.

**అతస్తే నవ విప్రాణాం నామభిర్జగతీతలే ।**
**ఖ్యాతిం రామా యయుస్తత్ర నవ యద్వృచ్చ తత్ప్రియమ్ ॥ 245**

**యథార్కా ద్వాదశ ప్రోక్తా ఏకవింశద్గణాధిపాః ।**
**రుద్రా ఏకాదశ ప్రోక్తా యథాష్ట భైరవాః స్మృతాః ॥ 246**

**నవ దుర్గా యథా త్వత్ర తథా రామా నవ స్మృతాః ।**
**ప్రియం ద్వాదశ సూర్యాయ ఏకాదశ శివప్రియమ్ ॥ 247**

**ఏకవింశత్ప్రియం యద్వద్గణేశాయ మహాత్మనే ।**
**ప్రియమష్ట భైరవాయ దుర్గాయై తు నవ ప్రియమ్ ॥ 248**

**యథా తథాఽత్ర రామాయ నవ శిష్య ప్రియం సదా ।**
**తస్మాన్నవవివిధైః పుష్పైరంజలిస్తత్ప్రియోమతః ॥ 249**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, మనోహరకాండే, వాల్మీకీయే, ఆదికాండే, రామపూజాద్వయవిస్తారో నామ, తృతీయః సర్గః ॥**

తొమ్మిదిమంది విప్రులచే తొమ్మిది సంఖ్యా ప్రీతుడై శ్రీరాముడు ఖ్యాతినందెను, ఏకవింశద్గణపతులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, నవదుర్గలు, అష్టభైరవులు ఎట్లు ప్రసిద్ధులో అట్లే నవరాములు సుప్రసిద్ధులు. (గణపతికి 21 యును, సూర్యునికి 12 ను, శివునికి 11 ను, భైరవునికి 8 ను, దుర్గకు 8యును, ఎట్లు ప్రీతికరమో అట్లే శ్రీరామునికి 9 మిక్కిలి ప్రీతికరమైనది.) కావున శ్రీరామ పూజాసమయాన నవపుష్పాంజలిని ఇచ్చుట సర్వోత్తమమయినది.

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో శ్రీరామపూజను వివరించు, 3వ సర్గ ముగిసినది.**

# చతుర్థః సర్గః-4వ సర్గ

లఘురామతోభద్రవిస్తారము, ఉపనిషత్ తత్త్వవిచారము.

శ్రీవిష్ణుదాస ఉవాచ

స్వామింస్త్వయా రామనామ్నామష్టోత్తరసహస్రకమ్ ।
భద్రముక్తం తథా చాష్టోత్తరశతమనుత్తమమ్ ॥ 1

రామనామ్నాం భద్రముక్తం రామచంద్రప్రపూజనే ।
తత్కీదృశే తే తు భద్రే లేఖనీయే మనోరమే ॥ 2

తే మాం విస్తరతో బ్రూహి యథాఽహం వేద్మి తత్త్వతః ।
తయోర్యే యే విశేషాశ్చ భద్రయోస్తేఽపి మాం వద ॥ 3

శ్రీరామదాస ఉవాచ

శృణు శిష్య ప్రవక్ష్యామి భద్రాణాం రచనాః శుభాః ।
యథా పృష్టా త్వయా మహ్యం రామనామ్నాం మనోరమాః ॥ 4

అష్టోత్తరశతం రామలింగతోభద్రముత్తమమ్ ।
ఆదౌ మయా విస్తరేణ కథ్యతే తన్నిశామయ ॥ 5

అత్రోపాస్యా రామముద్రా రుద్రశ్చోపాసకః స్మృతః ।
శ్రీరామలింగతోభద్రమత ఏవోచ్యతే బుధైః ॥ 6

తిర్యగూర్ధ్వం తదా రేఖా ద్వే శతే రేఖయాఽధికే ।
తత్రాదౌ కృష్ణపరిధిస్తతో రక్తః సితస్తతః ॥ 7

తతః పీతశ్చ పరిధిః కోణేందుః త్రిపదః స్మృతః ।
చంద్రాగ్రే శృంఖలా కృష్ణా స్మృతా ద్వాదశపాదికా ॥ 8

హరితా చ తతో వల్లీ త్రయోవింశత్పదాత్మికా ।
తతః పీతా శృంఖలా చ స్మృతా ద్వాదశపాదికా ॥ 9

వింశత్పాదభవం భద్రం రక్తం వాపీ సితా తతః ।
త్రయోదశపదా జ్ఞేయా లింగం షడ్వింశ పాదజమ్ ॥ 10

కృష్ణశ్చతుష్పదో మూర్ధా నాభిర్యుగ్మపదః స్మృతః ।
మూలస్కంధౌ షట్పదజౌ పార్శ్వే తుర్యపదాత్మకే ॥ 11

తతో రక్తశ్చ పరిధిర్మర్యాదాఖ్యోఽర్కపాదజః ।
తతో ముద్రా తుర్యతుర్య భూమిపాదమితా స్మృతా ॥ 12

తతో మర్యాదాపరిధిర్లింగముద్రాః పునః పునః ।
ఏవం హరా నవ జ్ఞేయా ముద్రాశ్చాష్టౌ ప్రకీర్తితాః ॥ 13

పరిధయః షోడశైవ హ్యంతే లింగోర్ధ్వపార్శ్వకే ।
తిర్యగ్ భద్రం నవపదైః పీతం వా హరితం క్వచిత్ ॥ 14

రక్తభద్రోర్ధ్వతః శేషపదాని యాని సంతి హి ।
యథేచ్ఛ చిత్రవర్ణైశ్చ శృంఖలార్థే నియోజయేత్ ॥ 15

మధ్యలింగస్కంధయోశ్చ సితే నేత్రే స్మృతే శుభే ।
పీతే లింగస్కంధయోశ్చ శృంఖలే త్రిత్రిపాదజే ॥ 16

## శ్రీరామ లింగతోభద్ర ప్రస్తారనిరూపణము

గురూత్తమా! అష్టోత్తర సహస్రనామ (1008) లింగతోభద్రప్రస్తారమనియు, అష్టోత్తరశతనామ (108) సర్వతోభద్రప్రస్తారమనియు చెప్పితిరి. శ్రీరామ పూజయందు రామనామములకు భద్రమని సంజ్ఞ జెప్పితిరి. ఆ భద్రాసనములెట్టివి? వాటినెట్లు వ్రాయవలయును? వాటిలోని మరిమరి విశేషములేవి? ఈ సంగతులను నాకు తెలియజేయవలయునని విష్ణుదాసు ప్రార్థింపగా; శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు. వాటి రచనలను వినుము.

విష్ణుదాసా! వాటిలో మొదట; అష్టోత్తరశత (108) రామలింగతోభద్రమును నీకు వివరించి చెప్పుచున్నాను. ఇచ్చట ఉపాసింపతగినది రామముద్రయై యున్నది. ఉపాసకుడు రుద్రుడుగా ఉన్నాడు. కావుననే దీనిని పండితులు “శ్రీరామ లింగతోభద్ర” మని చెప్పుచున్నారు.

అడ్డముగాను, నిలువుగాను 201 రేఖలను గీయునది. అచ్చట మొదట అంచున నలుపు, పిదప ఎరుపు, పిమ్మట తెలుపు, అటుపై పసుపురంగులు గల పరిధులను ఏర్పరచునది. మూలలలో మూడేసియిండ్లు చంద్రాకృతిగా నిలుపునది. ఆ చంద్రాగ్రమునుండి 12 గడుల సంకిలవలే నల్లగా ఏర్పరచునది. అచ్చటనుండి పచ్చని గీతను 23 గడులలో ఏర్పరచునది. దానిపై పసుపు సంకిల 12 గడులుగా ఉంచవలయును.

అధోముఖం హారోర్ధ్వం చ రక్తం భద్రం ద్విషట్పదమ్ ।
తీర్యగ్భద్రే తు హరితే స్మృతేఽష్టా దశపాదజే ॥ 17

తతః పంక్తేరూర్ధ్వభాగే హరితః పరిధిః స్మృతః ।
తత ఊర్ధ్వం పీతవర్ణః ప్రోక్తశ్చ పరిధిః శుభః ॥ 18

ఏవం ప్రోక్తా ప్రథమేయం పంక్తిః సర్వత్ర కారయేత్ ।
ద్వితీయాయా విశేషం చ వక్ష్యామి న పురేరితమ్ ॥ 19

సప్త ముద్రా హరా హ్యష్టౌ పరిధయశ్చతుర్దశ ।
భద్రం రక్తం షట్పదం చ శేషం సర్వం తు పూర్వవత్ ॥ 20

తృతీయాయాం తతః పంక్తౌ ముద్రాః పంచ శివా రసాః ।
పరిధయో దశ జ్ఞేయా భద్రం త్రింశత్పదాత్మకమ్ ॥ 21

తతః పంక్తౌ చతుర్థ్యాం తు త్రీశా ముద్రాచతుష్టయమ్ ।
పరిధయోఽష్టవిజ్ఞేయా భద్రం చ నవ వేదజమ్ ॥ 22

హరిత్పీతయోర్మధ్యే హి లోహితః పరిధిః స్మృతః ।
పంచమాయా తతః పంక్తౌ ముద్రైకా శంకరద్వయమ్ ॥ 23

పరిధయశ్చ చత్వారి భద్రం నవతిపాదజమ్ ।
హరిద్రరక్తపీతవర్ణా పరిధయశ్చ పూర్వతః ॥ 24

షష్టాయాం చ తతః పంక్తౌ ముద్రైకా పరిధిద్వయమ్ ।
నవ వేదభవం భద్రం తిస్రః పరిధయోఽపి చ ॥ 25

మధ్యేఽపి సర్వతోభద్రం వేదనేత్రాగ్నిపాదజమ్ ।
త్రిపదేందుః శృంఖలాశ్చ కృష్ణాః పంచపదా మతాః ॥ 26

ఏకాదశపదా వల్లీ భద్రం నవపదాత్మకమ్ ।
చతుర్వింశత్పదా వాపీ పీతశ్చ పరిధిః స్మృతః ॥ 27

ఇరువది యిండ్లనుండి యెరుపుతో భద్రమనగా రామనామమును ఏర్పరచునది. అంత తెల్లని కోనేరు 13 గడులనుండి తెలియును. 26 గడులనుండి లింగాకృతిని ఏర్పరుపవలయును. అంత 12వ వరుస యెల్లయయిన పరిధి అనబడును. అంత ముద్రయనగా రామనామాంకిత ముద్ర

144 గడులతో ఏర్పరచునది. దానిమీద పరిధి అంత లింగముద్ర మరల రామముద్ర, పిమ్మట లింగముద్ర యిట్లు 9 లింగముద్రలు. 8 రామముద్రలు, పరిధులనగా ఎల్లలు. 16 మాత్రమే లింగఊర్ధ్వ పార్శ్వములయందు. అడ్డముగా భద్రము 9 యిండ్లచే పసుపువన్నె గాని, పచ్చవన్నెగానీ వేయునది. రక్తభద్రమునకుమీద మిగిలిన యిండ్లెన్ని గలవో వాటిని సంకిలకొరకుపయోగించి నానా రంగుల నింపునది. నడుమ లింగముయొక్క స్కంధములనుండి తెల్లని రెండు కండ్లును, మఱి వాటిప్రక్కనుండి మూడేసి యిండ్లుగల సంకిలలు, అధోముఖమును- లింగ ఊర్ధ్వము అయిన ఎఱ్ఱని భద్రము 62 యిండ్లు గలది. 18 యిండ్లనుండి అడ్డపు భద్రములు పచ్చరంగుతో రెండు. అంతనా పంక్తిపైన పచ్చని పరిధియును, ఆపైన పసుపుపరిధియును. ఇట్లు మొదటిపంక్తిని అంతట ఏర్పరచునది.

రెండవ పంక్తిలో 7 ముద్రలు, 8 లింగములు, ఎఱ్ఱని భద్రము 6 పదములు. తక్కినదంతయు మునుపటివలె. మూడవపంక్తిలో 5 ముద్రలు, 6 లింగములు. 10 పరిధులు. 30 పదాత్మకము భద్రము. నాల్గవ పంక్తియందు 8 ముద్రలు, 3 లింగములు. 8 పరిధులు, 49 పదాత్మకము భద్రము, పసుపు పచ్చలనడుమ ఎఱ్ఱని పరిధియుండవలయును. అంత అయిదవ పంక్తియందు ముద్రయొకటి, లింగములు రెండు, 8 పరుధులు. భద్రము 90 పాదాత్మకము, మునుపటివలెనే పచ్చని, ఎఱ్ఱని, పసుపు పరిధులును. ఇంక ఆరవపంక్తిలో ముద్రయొకటి, పరిధులు రెండు. 49 పదాత్మకము భద్రము.

పదేషు షోడశేష్వేవ మధ్యే పద్మం యథారుచి ।
కర్ణికా పీతవర్ణా చ శేషం బుద్ధ్వా నియోజయేత్ ॥ **28**

ఏతదష్టోత్తరశతం రామలింగాత్మకం స్మృతమ్ ।
తత్ర ముద్రాస్వరూపం చ వేదవేదేందుభిః స్మృతమ్ ॥ **29**

రాజ్యకాండే ఉత్తరార్ధస్య సర్గేఽష్టాదశమే పురా ।
ఉక్తం ముద్రాస్వరూపం చ తథాప్యత్ర తు కథ్యతే ॥ **30**

పంక్తయోఽర్కమితాస్తత్ర సర్వా ద్వాదశపాదజాః ।
తాసు పూర్వాదిగారభ్య క్రమేణైవ ప్రపూరయేత్ ॥ **31**

ప్రథమా సప్తమీ చోభే పంక్తీ కృష్ణే ప్రపూరయేత్ ।
ఊర్ధ్వాధః పంచ పంచైవ పంక్తయస్తత్క్రమం బ్రువే ॥ **32**

పంచపంక్తిషు చోర్ధ్వం హి ప్రథమాయాః ప్రపూరయేత్ ।
ప్రథమం చేశదిగ్జం చ కృష్ణవర్ణం న చాపరమ్ ॥ **33**

తదర్ధంచ ద్వితీయాయాః ప్రథమం చ ద్వితీయకమ్ ।
చతుర్థం సప్తమం షష్ఠం హ్యష్టమం నవమం తథా ॥ 34

తథైకాదశమం చాపి కృష్ణవర్ణాని పూరయేత్ ।
తదధశ్చ తృతీయాయాః చతుర్థం షష్ఠసప్తమే ॥ 35

తథైకాదశమం చాపి కృష్ణవర్ణాని పూరయేత్ ।
చతుర్థ్యాస్తదధశ్చాపి ప్రథమం చ ద్వితీయకమ్ ॥ 36

చతుర్థం సప్తమం వప్రం నవమం రుద్రసంమితమ్ ।
తదధః పంచమాయాశ్చ ప్రథమం చ ద్వితీయకమ్ ॥ 37

చతుర్థం చ తథా షష్ఠం నవమైకాదశే తథా ।
రాజేతి ద్వేఽక్షరే శుక్లే ద్రష్టవ్యే పంచపంక్తిషు ॥ 38

పంచపంక్తిష్వధశ్చాథ ప్రథమాయాశ్చ పూర్వవత్ ।
తదధశ్చ ద్వితీయాయాః ప్రథమం చ ద్వితీయకమ్ ॥ 39

చతుర్థం సప్తమం షష్ఠం నవమం దశమం తతః ।
తథా చైవ ద్వాదశమం కృష్ణవర్గాని పూరయేత్ ॥ 40

తృతీయాయాశ్చతుర్థం చ షష్ఠమకం చ సప్తమమ్ ।
చతుర్థ్యాః ప్రథమం షష్ఠ ద్వితీయం చ చతుర్థకమ్ ॥ 41

అష్టమం నవమం చాకం దశమం చాపి పూరయేత్ ।
పంచమాయాః ప్రథమం చ ద్వితీయం చ చతుర్థకమ్ ॥ 42

షష్ఠమర్మ్యాష్టమం చాపి సప్తమం దశమం తథా ।
నవమం కృష్ణవర్ణాని రామేతి ద్వేఽవలోకయేత్ ॥ 43

రాజా రామేతి చత్వారి హ్యక్షరాణి నిరీక్షయేత్ ।
వ్యత్యయాద్రామరాజేతి బుద్ధ్యా కార్యేక్షరే నరైః ॥ 44

అథవా రామ రామేతి తృతీయం నామ కారయేత్ ।
విశేష తత్ర వక్ష్యామి హ్యధః పంచసు పంక్తిషు ॥ 45

పంక్తైశ్చతుర్థ్యాః ప్రథమం పదం కృష్ణేన కారయేత్ ।
నాకారస్తేవ ద్రష్టవ్యో రామనామావలోకయేత్ ॥ 46

అథవా రామ రామేతి విశేషశ్చోర్ధ్వపంక్తిషు ।
ప్రథమా పూర్వవత్ జ్ఞేయా ద్వితీయాయాస్తతః పరమ్ ॥ 47

ప్రథమం చ ద్వితీయం చ తృతీయం పంచమం తథా ।
అష్టమం నవమం షష్ఠ తథైకాదశమ త్వపి ॥ 48

తృతీయాయాశ్చ ప్రథమం రుద్రం షష్ఠం చ పంచమమ్ ।
చతుర్థ్యాః ప్రథమం చైవ ద్వితీయం చ తృతీయకమ్ ॥ 49

పంచమం సప్తమం చాపి హ్యష్టమ నవమం తథా ।
తథైకాదశమం చాపి కృష్ణవర్ణాని పూరయేత్ ॥ 50

పంచమాయాః ప్రథమం చ ద్వితీయం చ తృతీయకమ్ ।
పంచమం సప్తమం షష్ఠం హ్యష్టమం నవమం తథా ॥ 51

తథైకాదశమం చాపి రామేతి ద్వ్యక్షరే సితే ।
నామాన్యేతాని చత్వారి చతుఃపార్శ్వేషు యోజయేత్ ॥ 52

లఘుముద్రాన్వితం రామలింగాఖ్యం భద్రముచ్యతే ।
మయా శిష్యాధునా తత్త్వం శృణుష్వ స్వస్థమానసః ॥ 53

తిర్యగూర్ధ్వమేకపంచాశద్రేఖాస్తత్ప్రదేషు చ ।
సప్త సప్తపదా తే ద్వ్యా పరిధీ పీతవర్ణకే ॥ 54

కార్యో తత్ర కోణదేశేష్విందుస్త్రిపదశుక్లకః ।
శృంఖలర్తుపదా కృష్ణా త్రయోదశపదా లతా ॥ 55

హరితేశో వసుపదః కృష్ణవర్ణః ప్రకారయేత్ ।
త్రిపదం లోహితం జ్ఞేయం భద్రం వల్యంతికస్థితమ్ ॥ 56

షష్టిపాదాత్మికా ముదా తత్రేంద్రియమదిక్స్థితా ।
త్యక్త్వాపంక్తికోణకోష్ఠం సింధుసింధుమితస్తథా ॥ 57

సింధ్వర్తుపంక్తీ చ సప్తమాయాః పంక్తేః పదం త్వధః ।
మషిణా పూరయేత్తత్ర భాతి రామేతి సత్పదమ్ ॥ 58

తత్రాదావగ్నిముద్రా స్యాత్సీమాపరిధయస్తథా ।
రక్తలింగద్వయం భద్రం తథా లింగోపరి స్థితమ్ ॥ 59

పదద్వయం పీతవర్ణం వీథీవల్ల్యా నియోజయేత్ ।
ద్వితీయే త్వేకముద్రా ద్వౌ పరిధీ ద్వౌ శివౌమతౌ ॥ 60

భద్రం నవపదం లింగవల్ల్యోర్మధ్యే రసాత్మకమ్ ।
భద్రం పాతం లింగోపరి రక్తం తుర్యపదాత్మకమ్ ॥ 61

లింగస్కంధపదే ద్వే ద్వే హరితే వీధికాఽపి చ ।
భద్రాణి త్రీణి జ్ఞేయాని పీతం ద్వే లోహితేఽత్ర హి ॥ 62

తతోఽంతః సర్వతోభద్రం కార్యం తత్ర తు వాపికా ।
చతుర్వింశత్పదం భద్రమంకకోష్ఠ లతే సితే ॥ 63

త్రిపదోఽబ్జః పంచపదా శృంఖలాపరిధిస్తతః ।
మధ్యే పద్మం రక్తవర్ణం రచయేద్వావిచిత్రితమ్ ॥ 64

పీతశుక్లరక్తకృష్ణాశ్చాంతే పరిధయో మతాః ।
ఏతత్షోడశముద్రాభీ రామలింగాఖ్యభద్రకమ్ ॥ 65

సదానందమయం రామం చిజ్జ్యోతిషమనామయమ్ ।
సర్వావభాసకం నిత్యం స్వాత్మానం సముపాస్మహే ॥ 66

మూడు పరిధులును, నడుమ కూడ 828 పాదాత్మకము సర్వతో భద్రము. మూలచంద్రరేఖ మూడిండ్లది. నల్లని సంకిళ్లు ఐదేసి ఇండ్లవి. 11 గడులచే తీగె, 9 గడులతో భద్రము. 98 గడులనేగాని పసుపు పరిధియును, 16 గడుల నడుమ కమలము. కర్ణికను పసుపు రంగుతోనింపి, తక్కినదానిని బుద్ధితో పూర్తిచేయునది. ఇది 108 రామలింగాత్మకమనబడును. ఇచ్చట 144 చే ముద్రాస్వరూపము. రాజ్యకాండయొక్క ఉత్తరార్థమున 18వ సర్గలో మునుపు చెప్పినట్లే చెప్పబడును. (30).

ఇక 'రాజారామ రామ', 'రాజారామ', 'రామరామ', 'రామరామ' అను ఈ నాలుగు నామములను నాలుగు పార్శ్వములలో చేర్చునది.

(ఇక లఘుముద్రాన్విత రామలింగతో భద్రపరిలేఖనము చెప్పబడుచున్నది) (65)

నిరామయుడును, సదాసుఖపూర్ణుడును, జ్ఞానప్రకాశుడును, సర్వప్రకాశుడును, త్రైకాలికా బాధ్యుడును అగు స్వస్వరూప రామబ్రహ్మమును ఉపాసించెదను. (66)

చంద్రకలం రామలింగతోభద్రం యద్వికల్పితమ్ ।
నిర్వికారం నాస్తి తస్మిన్ వివేకట స వివిచ్యతే ॥ 67

కల్పితః స నరో రాజా రామలింగయుతః స్మృతః ।
రమణాద్రామ ఇత్యుక్తో యోగిగమ్యః పరం మహః ॥ 68

లీయంతే యత్ర భూతాని నిర్గచ్ఛంతి యతః పునః ।
తేన లింగం పరం వ్యోమేత్యుక్తం బ్రహ్మవిదుత్తమైః ॥ 69

లింగ్యతే చింత్యతే యేన భావేన భగవాన్ శివః ।
లింగరూపీ స రామేతి లింగం చేతి ద్వినామకః ॥ 70

బహూని సంతి నామాని రామేశస్య మహాత్మనః ।
రజాంసి గణయేత్కోఽపి భూమేర్నైవాఖిలేశితుః ॥ 71

తస్మిన్ యత్సర్వతోభద్రం హృదయం తత్ప్రకీర్తితమ్ ।
తత్ర పద్మమష్టపత్రం సకేసరసకర్ణికమ్ ॥ 72

తత్స్థానం రామలింగస్య ధ్యానార్థం పరికల్పితమ్ ।
అన్యథా సర్వగస్యాస్య కథం దేశాదిభేదతా ॥ 73

చిజ్జ్యోతిః పరమాత్మాయం స్వమాయావశతాం గతః ।
ధర్మార్థకామమోక్షార్థం సృష్ట్యుపాధిం ప్రవిష్టవాన్ ॥ 74

తస్య చైతన్యచంద్రస్య షోడశేమాః కలాః పరాః ।
చిద్వ్యాప్తాశ్చ ద్వారభూతా ఘటాదీన్విషయానిహ ॥ 75

ప్రకాశయంతి గృహ్ణంతి త్యజంతి చ స్వభావతః ।
బుద్ధిరేకాఽత్యంతసితా సన్నికృష్టా శివాత్మనః ॥ 76

దేనియందు 16 రామలింగతో భద్రము వికల్పింపబడినదో దానియందు నిర్విచారకముగా విజ్ఞానవిషయముగలదు. అది యిచ్చట చెప్పబడుచున్నది. (67) అవతరించిన శ్రీదాశరథిరాజు రామలింగయుతుడని చెప్పబడును. యోగీంద్రులచే గమ్యుడై అంతటరమించుట జేసి, పరంజ్యోతి యగు అతడు రాముడనబడును. ఎచ్చట అన్ని భూతములును లీనమగుచున్నవో మఱి వెలువడుచున్నవో ఆ కారణముచే బ్రహ్మవిద్వర్యులు మహదాకాశమగు దానిని లింగమందురు. భగవంతుడగు శివుడు ఏభావముచేత లక్షింపబడి ధ్యానింపబడుచున్నాడో ఆకారణముచే రాముడు లింగరూపీయనబడెను. కావున రాముడు– రామయని, లింగమని రెండు నామములుగలవాడు.

మహాత్ముడగు రామేశునికి అనేక నామములు గలవు. ఒకానొకడు భూమిలోని పరమాణువులను లెక్కించవచ్చునేమో గాని ఆ పరమాత్మయొక్క నామములను లెక్కించలేడు. ఈ సర్వతో భద్రము ఆ పరమాత్మయందు హృదయమనదగును. దానిలోని 8 దళములును, కేసరములును, కర్ణికయునుగల పద్మము రామలింగమూర్తియొక్క ధ్యానమునకై కల్పింపబడినది. అట్లుగాకున్న సర్వగతుడగు ఆ పరమాత్మకు దేశాదిభేద వ్యవహారమెట్లు కలుగును?

జ్ఞానప్రకాశుడగు ఆ పరమాత్మ స్వేచ్ఛచే, తనయొక్క మాయను ఆశ్రయించి, ధర్మ, అర్థ, కామ, మోక్షముల కొరకు సృష్టి అను ఉపాధిని ప్రవేశించెను. అట్టి చైతన్యచంద్రునికి ఈ 16 కళలు పరమములు, జ్ఞానపూర్ణములగునవి స్వభావముగా ద్వార భూతములగు ఘటాదులను విషయములను ప్రకాశింప జేయుచున్నవి, గ్రహించుచున్నవి, విడుచుచున్నవి. శివాత్మయగు ఆ చైతన్యచంద్రునికి 16 కళలలో సమీపవర్తియగు కళయే అంత్యంత నిర్మలమయిన బుద్ధిగానున్నది, (76)

**అతో జ్ఞానప్రధానా సా తత్ జ్ఞాతం చక్షురాదిషు ।**
**ప్రసృతం రూపశబ్దాదీన్ జానాతి సువిశేషతః ॥ 77**

**చతుర్ధా వృత్తి భేదేన ప్రోక్తా తత్త్వార్థదర్శిభిః ।**
**ప్రయోజనం న తేనాత్ర ప్రకృతం తద్వివిచ్యతే ॥ 78**

**క్రియాప్రధానః ప్రాణశ్చ పంచధాఽసౌ స్వవృత్తితః ।**
**ప్రాణాపానౌ తథా వ్యానః సమానోదానకావితి ॥ 79**

**వాగాదికర్మేంద్రియేషు క్రియా ప్రాణాశ్రయా మతా ।**
**శ్రవణం నయన ఘ్రాణం త్వగ్రసనేంద్రియం తథా ॥ 80**

**పంచేమాని చేంద్రియాణి జ్ఞానద్వారాణి వై విదుః ।**
**వాక్పాణిపాదపాయూపస్థాశ్చ కర్మేంద్రియాణి చ ॥ 81**

ఏవం షోడశసంఖ్యానం కలానాముచ్యతే బుధైః ।
తాసు సర్వాసు చైతన్యం రామనామేతి విశ్రుతమ్ ॥ 82

ప్రవిష్టం దీప్యతే శశ్వత్తేన విశ్వ విచేష్టతే ।
అనాదిసంసారతరుః కర్మమూలఫలాత్మకః ॥ 83

దేహాభిమానినో జీవాః ఫలభోగాయ పక్షిణః ।
యథాకర్మ సుఖం దుఃఖం ఖాదంతి స్వేశ్వరార్పితమ్ ॥ 84

కశ్చిజ్జన్మసహస్రేషు జ్ఞానవాన్ జాయతే యదా ।
తదాత్మస్థం రామరూపం జ్ఞాత్వా మోక్షీ భవత్యలమ్ ॥ 85

ఇంద్రియాణి పరాణ్యేవ తేభ్యో బుద్ధిః పరా మతా ।
తత్పరః పరమాత్మా చ సర్వసాక్షీ వినిశ్చితః ॥ 86

## అథర్వణవేదములోని ఉపనిషత్తుల తత్త్వవిచారము

బుద్ధి జ్ఞానప్రధానము. అది చక్షురాదులద్వారా బహిర్గతమౌను, మణిప్రవృతమై రూప, శబ్దాదులను విశేషముగా తెలియును. తత్త్వార్థము గ్రహించినవారిచేత వృత్తిభేదముచేత నాలుగు విధములుగా చెప్పబడినది. దానిచే ఇచ్చట ప్రయోజనము లేదు. ప్రకృతమగుదానిని వివరించెదను. క్రియా ప్రధానమగు ప్రాణము ఐదు విధములుగా ప్రవర్తించినది– ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము లని– వాక్కు మొదలగు ఐదు కర్మేంద్రియములందు క్రియ ప్రాణాశ్రయమైనదని చెప్పబడినది.

చెవి, కన్ను, ముక్కు, నాలుక, చర్మము– అను ఇవి ఐదు ఇంద్రియములు జ్ఞాన ద్వారములు– వాక్కు, పాణి, పాదము, గుదము, ఉపస్థ– అను ఇవి యైదు కర్మేంద్రియములు. ఇట్లు– 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 ప్రాణములు, 1 బుద్ధి, ఇవి మొత్తం16 ను– 16 కళలని సంఖ్యలు చెప్పబడినవి. వీటిలో అన్నిటిలోను చైతన్యమగు నదియే రామనామము. అది ప్రవిష్టమై వెలిగింపబడును.మాటిమాటికిని దానిచే ఈ విశ్వమనిన చరాచరప్రపంచము విచేష్టించుచున్నది. అనాదియగు ఈ సంసారమను వృక్షము కర్మమూలమే ఫలాత్మకముగా ఐనది. మరియు, కర్మయే మూలఫలాత్మకమైనది. ఈ ఫలమును అనుభవించుటకై దేహాభిమానులగు జీవులు పక్షులుగా ఉన్నారు. ఈ జీవులు పుణ్య, పాప కర్మానుగుణముగా సుఖమును, దుఃఖమును ఈశ్వరార్పితమగుదానిని అనుభవించుచున్నారు. ఒకానొకడు వేయి జన్మలలో ఎప్పుడో జ్ఞానవంతుడుగా మారితే అప్పుడు ఆత్మయందుగల రామరూపము నెరిగి బాగుగా ముక్తుడగును. పంచజ్ఞానేంద్రియములే అన్నిటికన్నను మేలైనవి, వాటికన్నను బుద్ధి గొప్పది, దానికన్నను ఉత్కృష్టుడు పరమాత్మ సర్వసాక్షియని వినిశ్చితుడయినవాడు (86)

ద్వౌ సుపర్ణావేకవృక్షం సమాశ్రిత్య స్థితౌ తయోః ।
ఏకః సారఫలం స్వాదు ఖాదత్యన్యో విచక్షతే ॥ **87**

త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగ్యశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణః సాక్షీత్యాహ చాథర్వణీ శ్రుతిః ॥ **88**

యచ్చాస్తీహ యత్ స్ఫురతి యచ్చానందయతి స్వయమ్ ।
యస్మింశ్చ మహసి ప్రఖ్యే సర్వే వేదాః సమన్వితాః ॥ **89**

విషయాది ధీపర్యంతం జడం సర్వమనాత్మకమ్ ।
యస్యార్థే చ ప్రియం చైతత్స రామాత్మా మహాన్ప్రియః ॥ **90**

సర్వేషాం ప్రాణినాం స్వాత్మా పరప్రేమాస్పదో మతః ।
స తు సర్వత్రైక ఏవ నేహ నానాస్తి గచ్ఛతి ॥ **91**

చిద్రామం హృద్గతం జ్ఞాత్వా యోఽసౌ సోఽహమితీరయా ।
ఆచార్యదత్తయా సమ్యక్ పరమోపాసన గతః ॥ **92**

ఆవృత్తిరసకృత్ న్యాయాత్ఫలీభూతే పరాత్మని ।
బోధదార్ఢ్యే పునస్తస్య న కార్యం విద్యతే భవే ॥ **93**

సర్వేఽప్యుపాయాః శాస్త్రేషు యత్ జ్ఞానార్థే ప్రయోజితాః ।
స చేద్దేశికశబ్దేన హృద్యావిః కిం పరం తతః ॥ **94**

దృష్టేఽస్మిన్నచితే భద్రం యద్యేవం ప్రవిచార్యతే ।
తదా చిత్తే పరా ప్రీతిర్జాయతే విదుషాం సతామ్ ॥ **95**

నమో రామాయ శాంతాయ లింగరూపధరాయ చ ।
శంభవే విష్ణవే తుభ్యం శంకరాయ శివాత్మనే ॥ **96**

రెండు పక్షులు ఒక చెట్టునాశ్రయించియున్నవి. వాటిలో నొకటి వ్యావహారిక సంసారసారమగు పుణ్యాపాపకర్మ ఫలమును రుచిగా అనుభవించుచున్నది. వేరొకటి దీనికి విలక్షణమైయుండును. స్థూల, సూక్ష్మ, కారణ భేదముచే మూడైన క్షేత్రమను ఈశరీరమున క్షేత్రజ్ఞుడనబడు జీవుడు మొదటిపక్షి భోక్తగానుండును. వానిచే అనుభవింపబడు ఈక్షేత్రము భోగ్యమనబడును. ఈ రెంటికి విలక్షణుడై సాక్షిగానుండువాడే పరమాత్మ యని, పరబ్రహ్మయని చెప్పబడునని అథర్వణ వేదములోని ముండకోపనిషత్తు నిరూపించుచున్నది.

సర్వత్రకలదను వ్యవహారమునకు సాక్షిగా ఏదిగలదో, ఏది నిత్యము, సత్యముగా స్ఫురించు చున్నదో, ఏది తానుగా ఆనందమయమై ఆనందమును ఇచ్చుచున్నదో, మహత్తయి అసామ్యమగు దేనియందు సమస్త వేదములును సమన్వితములగుచున్నవో, జగద్విషయములు మొదలుకొని బుద్ధిపర్యంతము అనాత్మకమగు ఈజడమంతయును దేనివిషయమునందు ప్రియమగుచుండునో, ఆ యీ పరబ్రహ్మవస్తువే జగజ్జన్మాది కారణుడని చెప్పబడువాడు రామస్వరూపుడు. ఇతడే మహాత్ముడు, ప్రియుడు. (90)

సమస్త ప్రాణులకును స్వాత్మయే పరమప్రేమాస్పదుడుగా అంగీకరింపబడినది. అతడు అంతట ఒక్కడేగాని వేర్వేరుగాలేడు. అతడు నానాత్వమునందడు. (91) ఎవ్వడు చిన్మయుడగు రాముని హృద్గతునిగా గుర్తించి గురూపదిష్టమయిన సోహంభావనోక్తిచే చక్కగా పరమోపాస్తి నందునో (92) అట్టి మహానుభావుడు 'సర్వం ఖల్విదం బ్రహ్మ,' ' నేహనానాస్తికించన, 'ప్రజ్ఞానం బ్రహ్మ', 'సోఽహ మస్మి', ఇత్యాది పరశ్శత వేదవాక్యములచే ఫలీభూతమగు పరమాత్మయందు అసకృన్యాయమువలన బ్రహ్మాహంభావనావృత్త మననమునందగా జ్ఞానదార్ఢ్యముగల్గినపిదప, తానే తానై యుండును. అట్టి కేవల కైవల్యావాప్తి గల్గిన వెనుక అతనికి ఈ జన్మమున కర్తవ్యము లేదు. అనిన అతడే సాధించవలసినది సాధించినవాడు. (93) ('న స పునరావర్తతే' యని శ్రుతిగలదు. గాన అతడు మరల జన్మమెత్తడు) సమస్త యుక్తులును శాస్త్రములయందు ఏ పరమాత్మయొక్క జ్ఞానార్థము ప్రయోజనములయినవో, ఆ పరబ్రహ్మమగు రాముడు గురూపదేశవాక్యముచే హృదయమున ఆవిర్భవించితే అటుపై కాదగినదేమి కలదు? అనిన రామధ్యానము పరమోత్తారకమనుట (94).

రచియించబడిన– ఈ రామలింగతో భద్రమునందు ఇట్లువిచారింపబడినప్పుడు సత్పురుషులగు పండితులకు చిత్తమున అత్యంతప్రీతిగల్గును. (95) లింగరూపధరుడును, శాంతుడును, సుఖప్రదుడును, ఆనందాత్మకుడును వ్యాపకుడును అగు శివరామబ్రహ్మకు నమస్కారము. (96).

**అథవాఽఽద్యే స్థలే భద్రం కార్యం నవపదాత్మకమ్ ।**
**తిర్యగ్ భద్రం షట్పదజం రక్తపీతేఽత్ర తే స్మృతే ॥ 97**

**ద్విద్విపాదాత్మకే కార్యే శేషం సర్వం హి పూర్వవత్ ।**
**రామతోభద్రమేతచ్చ కేవలం రామతుష్టిదమ్ ॥ 98**

**స్థలే ద్వితీయభద్రం హి రక్తం వింశత్పదాత్మకమ్ ।**
**తిర్యగ్ భద్రం నవపదైః పీతం చిత్రే తు శృంఖలే ॥ 98**

నత్వేశానం రామమానందకందం
మాయాతీతం నిర్వికారం నిరీహమ్ ।
విద్యాధీశం షడ్గుణైకాశ్రయం చ
వక్ష్యే భద్రం రామనామాంకితం తత్ ॥ 100

ప్రాగుత్తరా ద్విశతమంకనవాధికాశ్చ
రేఖాః సమాః సుపరికల్ప్య పదేషు తాసామ్ ।
కోణాంతరాఽత్ర ఉపరీందుషాకుంతసంఖ్యాః
పీతాశ్చ తే పరిధయః పరికల్పనీయాః ॥ 101

కోణాబ్జశృంఖలలతాః సితకృష్ణనీలా
భద్రాణి భిన్నరచనాన్యరుణాని తాని ।
ముద్రాశ్చ తత్పరిధయశ్చ సితాశ్చ రక్తాః
సంపూరితాశ్చ జనయంతి రతిం మునీనామ్ ॥ 102

ముద్రా తు షష్టిపదసంవలితా చ తత్ర
పంక్తీ విహాయ యమవాసవదిక్తనస్థే ।
ప్రత్యేకకోణపదాని చతుష్టయాది
పంక్తిద్వయం రసతురీయకమంజనాభమ్ ॥ 103

కృత్వా పదైకమథతస్త్వథ సప్తమాయా-
స్తేనాతిసుందరతరం పరిభాతి సారమ్ ।
రామేతి ద్వ్యక్షరముమేశజపం నిధానం
ప్రాణప్రయాణసమయే జపతాం మహోదయమ్ ॥ 104

రచయేదాదితః సమ్యక్ యావద్వింశస్థలావధి ।
సర్వత్ర రామముద్రాను మధ్యేషు పరిధిద్వయమ్ ॥ 105

ఆదౌ తత్త్వమితా ముద్రాస్త్రయోవింశన్మితాస్తతః ।
ద్వావింశైకవింశివింశ షట్ సప్తదశమాపరాః ॥ 106

ద్వ్యష్ట చతుర్దశత్రయోదశద్వాదశరుద్రకః ।
నవాష్టసప్తషట్తుర్యత్రిహ్యేకాశ్చాప్యనుక్రమాత్ ॥ 107

భద్రం షోడశపాదం చ వింశత్త్రింశత్ షడగ్నికమ్ ।
చంద్రకలం తత్త్వమితం త్రింశాక్షిసింధువింశకమ్ ॥ 108

తత్త్వషడగ్నినేత్రాంబునిధివింశన్నభోఽగ్నికమ్ ।
షట్త్రింశత్ షోడశపదం తత్త్వే త్రింశద్ద్విసింధుకమ్ ॥ 109

వింశత్కోష్ఠం క్రమాదేవ భవేత్పార్శ్వచతుష్టయే ।
ఏకవింశత్పదే భద్రమేకకకోష్ఠ చ వాపికా ॥ 110

చతుర్వింశపదా కార్యా పరిధ్యంతోఽరుణాంబుకమ్ ।
భద్రోపరి యత్ర యత్ర పదాన్యుర్వారితాని చ ॥ 111

తిర్యక్ భద్ర శృంఖలార్థే యథేచ్ఛం పూరయేద్ధియా ।
సర్వత్ర శృంఖలాః పంచపదజైకాదశీ లతా ॥ 112

త్రిపదశ్చ శశీ జ్ఞేయః పరిధయో బహిః క్రమాత్ ।
కృష్ణరక్తశుక్లపీతాశ్చతుర్దిక్షు సమంతతః ॥ 113

ఏతదష్టోత్తరదశశతం జ్ఞేయం రామస్య భద్రకమ్ ।
అథవా మను రేఖానాం వృద్ధిం కృత్వా ప్రకల్ప్య చ ॥ 114

పరిధిస్తత్ర లింగానామేకవింశాధికం శతమ్ ।
వాప్యో భద్రాణి చంద్రాదిచతుః పార్శ్వేషు యోజయేత్ ॥ 115

చతుర్వింశపదం లింగం వాప్యష్టదశపాదికా ।
ద్వే భద్రే నవ నవ పదే ద్వ్యష్ట ద్వ్యష్ట పదాని షట్ ॥ 116

త్రింశల్లింగాని వాప్యస్తు సప్తవింశన్మితా మతాః ।
ఏకస్మిన్ పార్శ్వకే లింగాధివాక్యే భద్రే ప్రకల్పయేత్ ॥ 117

ద్వ్యష్టద్వ్యష్టపదే శేషాణ్యంకకోష్ఠాని యోజపేత్ ।
లింగం కృష్ణం సితా వాప్యః శేషం సర్వం పురోదితమ్ ॥ 118

పదాని శేషభూతాని యత్ర యత్రేహ తాని చ ।
భద్ర శృంఖలయోగ్యాని తదర్థే వినియోజయేత్ ॥ 119

**కృష్ణరక్తశుక్లపీతా అంతే పరిధయో మతాః ।**
**ఏవం లింగయుతం రామతోభద్రం పరికీర్తితమ్ ॥ 120**

**అనేన దేవౌ సుప్రీతౌ రామేశౌ భవతస్త్విహ ।**
**రామస్య పూజనార్థం హి త్విదం ప్రోక్తం వరాసనమ్ ॥ 121**

అని స్తుతించి, మరి శ్రీరామోసనా వివరణము చెప్పబడును. 97,98,99 శ్లోకములచే కేవల రామప్రీతికరమగు శ్రీరామతో భద్రాసన రచనాక్రమము చెప్పబడినది. షడ్గుణైశ్వర్య సంపూర్ణుడై, మాయాతీతుడై, వికారరహితుడై, నిష్కాముడై, శివస్వరూపుడై, ఆనందమూలమై యుండు శ్రీరామ పరబ్రహ్మమూర్తికి నమస్కరించి, శ్రీరామనామాంకిత భద్రాసన రచనాక్రమము చెప్పబడుచున్నది.

యెట్లనిన శ్లో. 100 నుండి 114 వరకు 13 శ్లోకములు ప్రాణులకు ప్రాణప్రయాణ సమయమున మోక్షప్రదమును, శివజప నిక్షేప మంత్రమునైన **'రామ'** అను రెండక్షరముల మంత్రము సర్వత్రకలిగిన అష్టోత్తర సహస్ర రామభద్రాసనము చెప్పబడినది. పిదప, అటుగాకున్న ఇట్లని 139వ శ్లోకమువరకును ఇట్లు లింగయుత రామతోభద్రము చెప్పబడినది. ఇందుచేత రాముడును, శివుడును సుప్రీతులగు చుందురు. శ్రీరామ పూజనముకొరకే ఇది చెప్పబడినది.

**ఆచార్యాన్ జ్ఞానసంపన్నాన్నత్వా తేషాం ప్రసాదతః ।**
**వక్ష్యేఽహం రామతోభద్రకృతిం చ శంభుసంయుతామ్ ॥ 122**

**ప్రకృతిం రామతోభద్రం వికృతిం లింగసంయుతమ్ ।**
**అన్యే వికారాః సంజ్ఞేయా హ్యేవం కృతిస్త్రిధోచ్యతే ॥ 123**

**తిర్యగూర్ధ్వమగ్న్యధికాః శతరేఖాః ప్రకల్పయేత్ ।**
**తత్ప్రదేషుపరిధయః షట్షడంతే షడేవ తు ॥ 124**

**పీతాః కోణేషు త్రిపదః శుక్లేందుః శృంఖలాఽసితా ।**
**పంచపదైకాదశికా వల్లరీ భద్రసంక్రమాత్ ॥ 125**

**సింధుషోడశసూర్యర్తుయుగషోడశకోష్ఠకమ్ ।**
**కల్పయేత్త్వష్టకోష్ఠేషు రామముద్రాం హి పూర్వవత్ ॥ 126**

**అష్టౌ షష్ఠ చ పంచసింధువహ్నిచంద్రమితాః శుభాః ।**
**తాసాం సీమాపరిధయస్త్వేకాధికాస్తు లోహితాః ॥ 127**

**రజనీశనేత్రసింధుపంక్తిషు మధ్యమాస్త్రయః ।**
**మర్యాదాఖ్యాః పరిధయో భవంతి ద్విగుణీకృతాః ॥ 128**

**అంతిమే తు పరిధ్యంతే సర్వతోభద్రకం లిఖేత్ ।**
**విశేషస్త్రత వాపీ తు చతుర్వింశ పదాత్మికా ॥ 129**

**భద్రం నవపదం పద్మం పరిధ్యంతః సులోహితమ్ ।**
**పీతా తత్కర్ణికా కార్యా అంతే పరిధయోఽపి చ ॥ 130**

**పీతశుక్లరక్తకృష్ణవర్ణా యత్ర పదాని చ ।**
**భద్రోర్ధ్వం శేషభూతాని తాని యుక్త్యా ప్రపూరయేత్ ।**

**తిర్యగ్ భద్ర శృంఖలాద్యైః పీతచిత్రే చ తే స్మృతే**
**ఏతదష్టోత్తరశతం రామతోభద్రమీరితమ్ ॥ 132**

**ఏకం సంసారశూన్యం సకలసుఖనిధిం సచ్చిదానందకందం**
**మాయాయోగేన విశ్వాత్మకమిదమమలం బ్రహ్మవిష్ణీశసంజ్ఞమ్ ।**
**సృష్టిస్థిత్యంతహేతుం నిగమకవినుతం సర్వభూతాత్మభూతం**
**సర్వజ్ఞం సర్వశక్తిం రణహరమమృతం తన్మహో భావయేఽహమ్ ॥133**

ఇక జ్ఞానసంపన్నులగు ఆచార్యులవారికి నమస్కరించి, వారి ప్రసాదమువలన శివ సంయుతమగు రామతోభద్రాకృతిని చెప్పుచున్నాను. రామతోభద్రము ప్రకృతి లింగసంయుతమైన అది వికృతి. అన్యములు వికారములని యెరుగునది. ఇట్లు 3 రకములుగా కృతులు చెప్పబడును (23) ఇట్లిది తొమ్మిది శ్లోకములలో అష్టోత్తర శతరామతో భద్రమనీ చెప్పబడును. (132). అద్వితీయమును జనన, మరణ, దుఃఖప్రవాహ రహితమును, అన్ని ఆనందములకు మూలము, సచ్చిదానందాత్మక మును, ప్రకృతి సంయోగముచేత ప్రపంచ స్వరూమును, నిర్మలమును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను త్రిగుణాత్మిక సగుణ రూపములను దాల్చినదియు, సృష్టి, స్థితి, సంహారములకు కారణమును, శాస్త్రకారులగు మునీంద్రులచే కీర్తింపబడినదియును, సకలభూతస్వరూపముగా ఏర్పడియుండునది యును, సర్వము తెలిసినదియు, సర్వశక్తికమును, కలహనివారకమును, అమృతమనిన ముక్తి స్వరూపమును అగు పరబ్రహ్మమును ధ్యానించుచున్నాను.

నత్వా శ్రీదేశికేంద్రస్య పాదాబ్జమమరప్రదమ్ ।
వక్ష్యే చాధ్యాత్మికీం సూక్తిం సతాం చిత్తచమత్కృతిమ్ ॥ 134

పశూనాం నఖరోమాది సర్వమర్థాయ కల్పతే ।
మృతస్య నరదేహస్య సృష్టిర్దోషావహోదితా ॥ 135

ఏకమేవామునా సాధ్యం జ్ఞానం యత్స్వస్వరూపదమ్ ।
తద్వినా తు పశుభ్యశ్చ నరో హీనతరో మతః ॥ 136

ప్రతిభావాన్పుణ్యతమః శ్రద్ధావాన్ గుర్వధోక్షజే ।
కోటిష్వేకః స్వయం సాక్షాన్నరో నారాయణో భవేత్ ॥ 137

కేనచిద్రామతోభద్రం ముదా షష్టిపదాత్మికా ।
రామాంకితా చ సంక్లృప్తే వివిచ్యతే చ తే ఉభే ॥ 138

లోకాః సప్తయథాండేఽస్మిస్తథా తత్ర ప్రకల్పితాః ।
తేనేయం రచనా తుల్యా జ్ఞాత్వా హృత్ స్థముదీర్యతే ॥ 139

బ్రహ్మాండం రామతోభద్రం ముద్రాభూతాని సంమతాః ।
రామచైతన్యయుక్తాని సంమతాని తు సూరిభిః ॥ 140

శ్రీమత్పరమగురుమూర్తియొక్క పాదారవిందములకు నమస్కరించి, సత్పురుషులయొక్క హృదయమునకు ఆనందానుభవమును ఇచ్చునట్టి ఆత్మవిచార పరమగు సువచనమును చెప్పుచున్నాను. (34) "పశువులయొక్క గిట్టలు, వెంట్రుకలు మొదలుగాగల సర్వము నీ ప్రసంగ ప్రయోజనముకొరకే పరికల్పింపబడినది. చచ్చిన మానవుని దేహముయొక్క పుట్టుక దోషమును కలుగుజేయదగినదిగా ఏర్పడినది." దీనిచేతనే కేవలమును స్వస్వరూపప్రదము అగు జ్ఞానము సాధ్యమైయున్నది. అదియనగా పైమాటయొక్క అర్థవిచారము లేకపోయిననో నరుడు పశువులకన్న హీనుడుగా నుండును. (36) మహాపుణ్యశాలియును, బుద్ధిమంతుడును, శ్రద్ధావంతుడు, అధోక్షజుడు అనిన భగవద్భక్తిసంయుక్తుడును అగు నరుడు కోటికొక్కడు సాక్షాత్ నారాయణుడు అగుచున్నాడు. (132)

## రామతోభద్ర ముద్రాస్వరూపము

ఒకానొకనిచే రామతోభద్రము రామాంకితమును, షష్టిపదాత్మకము అయిన 'ముద్ర' అను ఈ నీ కృతకల్పనములగు రెండును వివరింపబడుచున్నవి. ఈ బ్రహ్మాండమున ఎట్లు సప్తలోకములు

గలవో, అట్లే రామతోభద్ర ముద్రయందును ప్రకల్పింపబడినవి. దానిచే ఈ రచనతుల్యము. హృదయస్థమును తెలిసి చెప్పబడును. ఈ బ్రహ్మాండమే రామతోభద్రము. ముద్రలే భూతములని గుర్తించాలి. వీటిని రామచైతన్యయుతములని పండితులు అంగీకరించి యున్నారు. (140)

**యస్యాం స్యాన్ముద్రితం వస్తు సా ముద్రేతి నిగద్యతే ।**
**ముద్రేత చిహ్నితం చాథ పిహితం హ్యర్థతో భవేత్ ॥ 141**

**తద్వత్సర్వాసు చైతాసు బ్రహ్మముద్రితముచ్యతే ।**
**తథాప్యాసాం సబాహ్యాంతశ్చైతన్యః సంప్రకాశతే ॥ 142**

**ఆచ్ఛాదితోఽపి కలశే స్ఫటికేఽంతర్బహిః కిల ।**
**దీపః ప్రకాశతే కస్తం లోపయేచ్చ తథేష్యతే ॥ 143**

**మూషాసిక్తం తామ్రరసం తదాకారం ప్రపద్యతే ।**
**తథా బ్రహ్మ నిరాకారం ముదాకరం విభాసతే ॥ 144**

**పురశ్చక్రే ప్రభుః సర్వాః పురః పురుష ఆవిశత్ ।**
**ఇత్యుక్తం కణ్వశాఖాయాం అన్యత్రాపి హి పఠ్యతే ॥ 145**

**ఏకో వశీ సర్వభూతాంతరాత్మేతి శ్రుతేర్యద్వచః ।**
**ఏకో దేవః సర్వభూతేష్వితి చైవాపరా శ్రుతిః ॥ 146**

**పురః సృష్టాః పరేశేన నైవ తాభిస్తుతోష సః ।**
**సృష్ట్వేమాం మానుషీం ముద్రాం పరం తోషమవాప సః ॥ 147**

**దేవతాశ్చాన్నభుక్త్యర్థం దృష్ట్వేమాం పౌరుషీం తనుమ్ ।**
**హర్షాదాహుశ్చ సుకృతం బతేతి శ్రూయతే స్ఫుటమ్ ॥ 148**

దేనియందు వస్తువు ముద్రింపబడుచున్నదో అది ముద్రయనిచెప్పబడును. దీని యర్థమును విచారించితే, ముద్రితము= ముద్రాంకితమనగా స్వరూపముతో కూడినది. చిహ్నితము= గుర్తు చేయబడినది, పిహితము= ఆచ్ఛాదితమనిన మూయబడినది అని యర్థమగును. అట్లే వీటియందు అంతటను బ్రహ్మము ముద్రితమైయున్నదని చెప్పబడును. అయిన వీటియొక్క వెలుపల, లోపల, అంతట చైతన్యము చక్కగా ప్రకాశించుచున్నది. ఎట్లనిన–స్ఫటికపు కుండలోపల మూయబడినదైనను దీపమువెలుపల లోపలగూడ ప్రకాశించుచున్నది. ఎవడు తానే దానిని లోపింపగలడు? మూసలో

పోసిన తామ్రము ఆమూసయొక్క ఆకారము నెట్లుపొందుచున్నదో, అట్లే నిరాకారమగు బ్రాహ్మము ముద్రాకారమనిన సర్వజగదాకారమై వెలుగుచున్నది (144) ఎదుట వ్యాపకుడగు పరమాత్మ సమస్త శరీరములను సృజించెను. వాటియందంతట తాను వ్యాపించి పురుషుడనబడెను. అని యిట్లు కణ్వశాఖయందు చెప్పబడినది. ఇతరస్థలములయందుగూడ ఇట్లే పఠింపబడినది.

(ఈ విషయమందు శ్రుతిబృహదారణ్యక చతుర్థాధ్యాయ పంచమబ్రాహ్మణమున 18వ మంత్రము
ఇదంవై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోశ్విభ్యామువాచ, తదేతదృషిః ,
పశ్యన్నవోచత్ పురశ్చక్రే ద్విపదఃపురశ్చక్రేచతుష్పదః ।
పురస్సపక్షీభూత్వా పురఃపురుష అవిశదితి
సవా అయం పురుషః సర్వాసుపర్షుపురిశయోనైనేనకించన
అనావృతంనైనేనశించనాసంవృతమ్ ॥)

అను ఈ శ్రుతిమంత్రములచే ఆ పరబ్రహ్మమొక్కటే లోపలా బయటా వ్యాపించిన చైతన్యమని తెలియవచ్చు చున్నది. (146)

## ఐతరేయోపనిషత్ ప్రాశస్త్యము

పరమేశ్వరుడు శరీరములను సృజించెను. వాటివలన అతడు ఆనందించలేదు. ఈ మనుష్య శరీరాత్మకమగు ముద్రను సృజించి, అత్యంతానందమునందెను. (147). దేవతలు కూడా అన్నభుక్తి కొరకై ఈ మనుష్య శరీరముజూచి, సంతోషముతో మా భాగ్యమౌరాయనిరి. అని శ్రుతి చెప్పుట సుస్పష్టము.

**పురుషం త్వేవావిస్తరమాత్మేత్యాహ శ్రుతిః స్వయమ్ ।**
**పురా సృష్టైః సర్వభూతైరతుష్టహృదయః స్వరాట్ ॥ 149**

**బ్రహ్మేవలోకధిషణం నరం దృష్ట్వా ముదం గతః ।**
**ఇత్యస్మాభిర్విష్ణుదాస శ్రూయతే భగవద్వచః ॥ 150**

**ముదం కరోతి దేవస్య ద్రావయేద్దుఃఖపాతకే ।**
**ఇతి ముద్రానిరుక్తిశ్చ మంత్రశాస్త్రేఽపి శ్రూయతే ॥ 151**

**అతః సర్వేషు దేహేషు సద్రూపగ్రహణం కృతమ్ ।**
**స్వర్గాపవర్గయోశ్చైషోఽధికారోస్మిన్న చేతరే ॥ 152**

లోకే ప్రసిద్ధిర్యః కశ్చిద్రాజముద్రాంకితో నరః ।
అధికారీతి మన్యంతే పూజయంత్యాదరాదిభిః ॥ 153

తథానయాంకితో జీవోఽధికారీ శాస్త్రభూమిషు ।
నాన్యాభిర్యో నిభిర్జ్ఞాతుం శక్యతే స్వాత్మనః పదమ్ ॥ 154

తస్మింశ్చైవ నరోపాధౌ పదాని షష్టి సంతి హి ।
తాని సంక్షేపతః సమ్యక్ ప్రదర్శ్యంతేఽవబుద్ధయే ॥ 155

అవిద్యాకామకర్మాణి భోక్తృభోగౌ సుషుప్తికా ।
షట్పదాని తు జ్ఞేయాని దేహే కారణసంజ్ఞకే ॥ 156

తమోఽజ్ఞానమవిద్యేతి శబ్దా ఏకార్థవాచినః ।
అతో గుణ గ్రహో నాత్ర దృశ్యతే షట్సు భో ద్విజ ॥ 157

లింగే పుర్యష్టకేఽవిద్యాకామకర్మగ్రహః స్మృతః ।
తథాప్యత్ర తు హేతుత్వాత్త్రయాణాం గ్రహణం కృతమ్ ॥ 158

కార్యాభావేఽవ్యవస్థానాత్కారణే కారణాత్మనా ।
కామస్య కర్మణశ్చాఽత్ర విద్యతే సూక్ష్మరూపతా ॥ 159

అవిద్యా యా ముఖ్యతోఽత్ర విద్యతే కారణాత్మనా ।
వస్తుతస్తు న కామోఽత్ర కామనా వా శ్రుతేర్మతమ్ ॥ 160

ఈ ఐతరేయ ఉపనిషత్ ఇచ్చట మనుష్యదేహాత్మక ముద్రకు ప్రాశస్త్యము చెప్పుటలో సూచింప బడినది. కావున పురుషునే సువిస్తారముగా ఆత్మయని శ్రుతి స్వయముగా చెప్పెను. మొదట సృజించిన సర్వభూతములచేతను తృప్తినందనివాడైన పరమేశ్వరుడు స్వస్వరూప బ్రహ్మానుసంధాన నిపుణమైన బుద్ధిశక్తిగల నరుని సృష్టించి వానిని చూచి సంతోషించెను. అనగా సమస్త భూతములలోను మానవదేహమే గౌరవనీయమైనదని భావము.

ఓయి విష్ణుదాసా! ఇట్లు భగవద్వాక్యమని మాచే వినబడుచున్నది. అని రామదాసుడు మఱి చెప్పుచున్నాడు. (150)

మంత్రశాస్త్రమునందు ముద్రయనుట కిట్లు వివరణము చెప్పబడును.

## ఆత్మసాక్షాత్కారం కేవలం మానవునికే

ము=ముదమును దేవునికి గల్గించును. ద్రా= దుఃఖములను, పాపములను, ద్రవింపజేయుననిన నాశము చేయును. కావున ముద్ర మేలైనది. అట్టి ముద్ర యేది? మానవాత్మక ముద్రయే. అందువల్ల యే సమస్త దేహములలోను మానవదేహమునందు సద్రూపగ్రహణము చేయబడే. ఈ మానవ దేహము నకే స్వర్గ, మోక్షములను పొందునట్టి అధికారముగలదు. లోకమునందు రాజముద్రాంకితుడగు ఒకానొక నరుడున్న అతనిని అందరు అధికారియని గౌరవించి, ఆదరాభిమానములచే పూజించుచున్నా రనునది సుప్రసిద్ధము. అట్లే యీ మానవదేహమున ముద్రాంకితుడగు జీవుడు శాస్త్రాధ్యయనము నకు అధికారియై యున్నాడు. ఆత్మస్వరూపమును తెలుసుకొనుట యితర ప్రాణులకు వీలుకాదు.(54)

## స్థూల, సూక్ష్మ, కారణ పురత్రయము.

ఈ మానవోపాధియందే 60 పదములు గలవుగదా. (పదమనిన – కళాస్థాన విశేషము, చిహ్నము, స్థానము.) అవి యిచ్చట సంక్షేపముగా తెలియుటకే చూపబడుచున్నవి. అవిద్యా, కామ, కర్మములు–3, భోక్తృ భోగములు–2, సుషుప్తియనగా నిద్ర– 1, ఇవి 9పదములు. కారణ సంజ్ఞ కమగు దేహమునందు తెలియబడదగినవి తమస్సు, అవిద్య, అజ్ఞానము అనునవి మూడు శబ్దములును ఒకే అర్థమును తెలుపును.

విష్ణుదాసా! అందువలన ఈ ఆరింటియందును గుణములు కనబడుటలేదు. పై యారింటిలోను ఈ తమస్సు, అజ్ఞానము కూడ చేరి 8 పురి సంజ్ఞలయినవి. ఇవి ఎనిమిదింటిని లింగదేహమంటారు. కారణదేహమునందు అవిద్యా, కామ, కర్మ, గ్రహణము చెప్పబడినది. అయినను ఇచ్చట ఈ మూడింటిని హేతుత్వమువలన గ్రహించడమయినది. కారణ దేహమునందు కామ, కర్మలు కార్యాభావమైనను కారణాత్మకముగా ఉండుటను బట్టి వాటి రెంటికిని, సూక్ష్మరూపత్వముగలదు, ఇచ్చట కారణదేహము నందు అవిద్యకు ముఖ్యముగలదు. యథార్థముగా విచారించినచో కామము అనగ కోరిన వస్తువు, అని శ్రుతి అభిప్రాయము. (160)

**అష్టత్రింశత్పదానీహ విద్యంతే సూక్ష్మదేహకే ।**
**దశేంద్రియాణీ పంచైవ ప్రాణా బుద్ధిర్మదస్త్వితి ॥ 161**

**సప్తదశాత్మకం లింగం ప్రసిద్ధం శాస్త్రసమ్మతమ్ ।**
**పంచవిషయగ్రహణం పంచ కర్మక్రియాస్తతః ॥ 162**

**పంచ సంప్రాణవ్యాపారాః సంకల్పో నిశ్చయస్త్వితి ।**
**సప్తదశ చైవ ధర్మాః ప్రసిద్ధాః శాస్త్రసమ్మతాః ॥ 163**

స్వప్నాభిమానినౌ భోగౌ రజశ్చేతి చతుష్టయమ్ ।
దేవానామింద్రియాణాం చ స్థానాభావేఽప్రవృత్తితః ॥ 164

స్థూలదేహే షోడశైవ పదాని సమ్మతాని హి ।
గణాః సప్తదశ తేషామపానవ్యానయోః పదే ॥ 165

పాయుత్వక్ స్థానయోర్ జ్ఞేయే వాచోరసి నికేతనే ।
ప్రాణస్య మనసశ్చాపి బుద్ధిస్థానే పదం త్వితి ॥ 166

పదాని ద్వాదశే మాసి భోక్తృభోగౌ తథా గుణః ।
అవస్థా జాగృతిశ్చేతి కథితాని మనీషిభిః ॥ 167

ముద్రామేతాదృశీం ప్రాప్య వేద వేదాత్మచిత్పదమ్ ।
తస్య జన్మ కృతార్థం స్యాన్మహతీ నష్టిరన్యథా ॥ 168

ముద్రారూపం వివిచ్యైవ యన్నామ్నాం సాంకితేతి చ ।
ఉక్తం తదధునా కించిత్సంక్షేపేణ నిరుచ్యతే ॥ 169

రామేతి లోకరమణాద్రమంతే యోగినోఽమలే ।
పరానందపదే నిత్యం తేన రామ ఇతీర్యతే ॥ 170

రసేనైవామునా సర్వే జీవా జీవంతి నాన్యథా ।
ఇమం రసమయం లబ్ధ్వా భవంత్యానందినోఽఖిలాః ॥ 171

సూక్ష్మదేహమున 38 పదములుగలవు. అవి యేవియనిన : జ్ఞానేంద్రియములు-5, కర్మేంద్రియములు-5, ప్రాణములు-5, బుద్ధి-1, మనస్సు-1, ఈ 17 తత్త్వాత్మకము లింగదేహమని శాస్త్రసమ్మతము. విషయగ్రహణములు-5, కర్మక్రియలు-5, ప్రాణవ్యాపారములు-5, సంకల్పము-1, నిశ్చయము-1, అనుఇవి 17 ధర్మములు శాస్త్రసమ్మతములై ప్రసిద్ధములుగా ఉన్నవి.

స్వప్నాభిమానత్వము, భోక్తృ భోగము, రజోగుణము అనునివి- 4, వెరసి 38 పదములు. దేవతలకు, ఇంద్రియములకు వేరొక ఆయతనము (చోటు) లేనందున, ఇట్లు ప్రవర్తించుటను బట్టి లింగదేహమున కలిగినవి.

ఇక స్థూలదేహమున- 16 పదము సమ్మతములు. అవి యేవియనిన ఆ 17 యొక్క గణము-1, వాటిలోన పాన, వ్యాన స్థానములగు పాయు త్వక్కులు-2 తోడ-భోక్తృ, భోగము, తమోగుణము,

జాగ్రదవస్థ–8 ను వెరసి 16 పదచిహ్నములు ఈస్థూలదేహమని పండితులు చెప్పెదరు. ఇటువంటి షష్టిపదాత్మక మానవదేహ ముద్రనవలంభించిన జీవుడు, స్వాత్మజ్ఞాన పదమును తెలిసితే వాని జన్మ కృతార్థమగును. అట్లుగాకున్న అంతకన్న అనర్థము వేరొకటిలేదు. ఏనామముచే ఆముద్ర యంకితమనియు, ఆ ముద్రాస్వరూపము ఇట్టిదనియును వివరించి చెప్పితినో ఆ నామము ఇప్పుడు ఇచ్చట నిరూపింపంబడుచున్నది.

## రామలింగ నామ నిర్వచన, మహిమాదులు.

అది ఒక రామయని (69) లోకమునందంతట వీడు రమించుట చేతను, పరమానందపద నిర్మలుడగు వీనియందు సంతతము యోగులు రమించుచుండుటచేతను 'రామ'యని చెప్పబడును. ఈ బాహ్యము ఇంద్రియ విషయ రసములచేత సమస్తజీవులును జీవించుచున్నారు. వేరువిధమున కాదు. అఖిలురనగా ఖిలులు కానివారు, బ్రహ్మవేత్తలు. ఈ రసమయుండగు రామబ్రహ్మమునందు ఆనందముగలవారగుచున్నారు. (171)

**విశతా యేన విశ్వేషు సర్వం చేతయతే జగత్ ।**
**న తం చేతయతే కశ్చిత్స రామ ఇతి కీర్త్యతే ॥ 172**

**సత్తా యేనాఖిలం విశ్వం స దేవేతి ప్రతీయతే ।**
**అసత్సత్తాప్రదః సాక్షాద్రామ ఇత్యభిధీయతే ॥ 173**

**యథా ప్రసిద్ధం రామేతి బ్రహ్మణే హ్యభిధానకమ్ ।**
**తథా లింగం పదం వ్యోమ నిష్కలః పరమాత్మనః ॥ 174**

**లీయంతే యత్ర భూతాని నిర్గంచ్ఛంతి యతః పునః ।**
**తేన లింగం పదం వ్యోమ నిష్కలః పరమః శివః ॥ 175**

**ఇతి శాస్త్రవిదాం వాణీ శ్రూయతే తత్త్వదర్శినామ్ ।**
**అతః సర్వాణి నామాని రూపాణి చాంతరాత్మనః ॥ 176**

**సంతి తేన శబ్దభేదే రూపభేదేఽపి సర్వథా ।**
**తత్త్వతో నైవ భేదోఽస్తి హ్యర్థస్యైకస్య వస్తునః ॥ 177**

**స బ్రహ్మ స శివశ్చాథ స హరిః స సురేశ్వరః ।**
**సోఽక్షరః పరమశ్చైవ స స్వరాడితి వేదవాక్ ॥ 178**

యస్యేమే సచ్చిదానందాః స వ్యాప్తః సర్వవస్తుషు ।
తేనాస్తి చ ప్రియం భాతి వస్తుమాత్రం ప్రదృశ్యతే ॥ **179**

ఆమ్నాయేషు చ సర్వేషు రామబ్రహ్మాత్మకీర్తనమ్ ।
ఆదిమధ్యావసానేషు శ్రూయతే గుర్వనుగ్రహాత్ ॥ **180**

ఐతరేయకే ఆత్మా వా ఇదమేకః పురాజనైః ।
ఆసీత్తేనైవ లోకానాం పాలానాం సృష్టిరిచ్ఛయా ॥ **181**

కృతార్థః సర్వదేవానామన్నభుక్త్యర్థమీప్సితమ్ ।
తదావాయతనం చాన్నం సృష్టం తేభ్యస్తతః పరమ్ ॥ **182**

విచార్య స్వీయస్వామిత్వం సీమాద్వారా ప్రవిష్టవాన్ ।
తత్రాత్మానం బ్రహ్మ తతం దృష్ట్వైవోపేంద్రతాం కిల ॥ **183**

కోఽయమాత్మేతి సంప్రశ్నే యేన పశ్యతి జిఘ్రతి ।
ఇత్యాదిభిర్వినిర్ణీతం తదేతద్ధృదయాదిభిః ॥ **184**

ప్రజ్ఞానస్యాస్య నామాని చోక్త్వా తత్సర్వతా సమా ।
ఏష బ్రహ్మేత్యాదిశబ్దైర్దర్శితం చాఖిలం జగత్ ॥ **185**

ప్రజ్ఞానేత్రం చ ప్రజ్ఞానే ప్రతిష్ఠంతేత్యనేన హి ।
ప్రజ్ఞానం బ్రహ్మ శ్రుత్యంతే త్రికాలేష్వితి దర్శితమ్ ॥ **186**

ఎవ్వడు అన్నిటియందును వ్యాపించి, సమస్త ప్రపంచమును తరింపజేయుచున్నాడో, యే పరమాత్మ లేనిచో యే ఒక్కడును తరింపడో అట్టిబ్రహ్మ పరమాత్మ వాచ్యుడే రాముడు. (172) ఎవనిచేత అఖిలప్రపంచమును సత్తాస్వరూపమని యెల్లప్పుడును తోచుచున్నదో, ప్రత్యక్షుడైనవాడు ఈ జగత్తు యొక్క అసత్సత్తాస్వరూపము నిచ్చునోయనిన తానొక్కడే సత్తామాత్రుడై మిగిలియుండునో వాడు రామయని చెప్పబడుచున్నాడు (173). పరబ్రహ్మకు 'రామ' యను నామము ఎట్లు ప్రసిద్ధమైయున్నదో, అట్లే లింగమను నామమును ఆపరమాత్మకు లింగరూపమును ప్రసిద్ధమై ఒప్పియున్నయది. (174). ఎచ్చట భూతములు లయించుచున్నవో, దేనినుండి మరల వెలువడు చున్నవో, అందుచేత అదియే లింగము. లయించియుండు తత్త్వమును స్ఫురింపజేయునది లింగము. పరము= సర్వోత్తమము. వ్యోమవాచ్యము= సర్వశూన్యమనిన పూర్ణమని భావము. నిష్కలః= కళంకము

లేనివాడు. సర్వాధారుడు, పరమః=సర్వాతీతుడు, శివః=మంగళస్వరూపుడు, పరమేశ్వరుడు, అని చెప్పబడు బ్రహ్మము (75). ఇట్లు తత్త్వజ్ఞానులును, శాస్త్రవిదులునగు మహాత్ములయొక్క మాట వినవచ్చుచున్నది. అందువల్ల సమస్త నామములును అంతరాత్మనామములే. సమస్త రూపములును అంతరాత్మ యొక్క రూపములే యనబడినవి. కావున, సర్వవిధములతోను రూపభేదమును, శబ్దభేదమును పారమార్థికమున సర్వార్థమగు ఒకవస్తువగు బ్రహ్మకు లేదు. అతడే శివుడు, అతడే బ్రహ్మ, అతడే విష్ణుభట్టారకుడు, అతడే యింద్రుడు, అతడే ముక్తుడు, అతడే స్వతంత్రుడు, అతడే సర్వోత్కృష్టుడు.

ఈ ప్రపంచము ఎవనిదిగా, ఈ విషదాది సమస్త ప్రపంచ విషయములును సచ్చిదానందాత్మకములై యున్నవో ఆపరమాత్మ సమస్తవస్తువులయందును వ్యాపక చైతన్యముగా వెల్గుచున్నాడు. అందుచేత స్వస్వరూపాత్మకమగు వస్తుమాత్ర ప్రియముగా వెల్గుచున్నదై ప్రకాశించుచున్నది. రామబ్రహ్మాత్మకీర్తనము సమస్త వేదములయందును, మొదటను, నడుమను, అంతమునను, గుర్వనుగ్రహమువలన వినబడుచున్నది. (180)

'ఏష బ్రహ్మే'త్యాది శబ్దములచే సమస్త జగత్తును ప్రజ్ఞానముగా చూపబడెను. ప్రజ్ఞా నేత్రం=ప్రజ్ఞయే నేత్రము. ప్రజ్ఞానే= బ్రహ్మయందు ఉత్పత్తి, స్థితి, లయము కాలములలో ప్రతిష్ఠింపబడినది. అనిన సర్వము ప్రజ్ఞాశ్రయము, కావున ఈలోకము ప్రజ్ఞయే నేత్రముగా కలిగినది. గనుక ప్రజ్ఞాన బ్రహ్మమే త్రైకాలికా బాధ్యమని చూపబడెను. (186)

**తత్రామ సచ్చిదానందఘనానంతం న సంశయః ।**
**తైత్తిరీయకశాఖాయాం బ్రహ్మణో లక్షణం పురా ॥ 187**

**సత్యం జ్ఞానమనంతం సంకీర్త్య వేదగుహాదికమ్ ।**
**యశ్చాసావశ్నుతే కామాన్సర్వాన్యుగపదేవ హి ॥ 188**

**ఫలం జ్ఞానస్య చోక్త్వాఽథ తస్మాద్బ్రహ్మాత్మకం కిల ।**
**క్రమోత్పత్తిర్హి గుప్తానాం కోశపంచకవేదనమ్ ॥ 189**

**తత్ఫలం తదనాత్మత్వం సంప్రదర్శ్యాంతరత్వతః ।**
**పుచ్ఛం బ్రహ్మేతి నిర్ణీయ తదసత్త్వప్రతీతితః ॥ 190**

**అసత్సద్భవతి హ్యేవం సంకీర్త్య చ తతః పరమ్ ।**
**కామయిత్వా తదేవేహ స్వాత్మానం జగదాత్మనా ॥ 191**

కృత్వా తస్మిన్ ప్రవిష్టేవ సచ్చాచ్చాభవత్కిల ।
అపానప్రాణయోశ్చేష్టా యస్యాస్తిత్వే ప్రజాయతే ॥ 192

ఆత్మైవ రస ఏవైష ఆనందయతి చాఖిలాన్ ।
భయహేతుస్తదేవేహ వాతాదీనాం ప్రదర్శితమ్ ॥ 193

మానుషారభ్య బ్రహ్మాంతా ఆనందా యే శతోత్తరాః ।
బిందవస్తే పరబ్రహ్మానందస్యేతి వినిశ్చితమ్ ॥ 194

స యశ్చాయం నరోపాధావాదిత్యేయశ్చ వర్తతే ।
స ఏక ఇతి జ్ఞాతారం పాపం పుణ్యం కృతాకృతే ॥ 195

న సంతాపయతస్త్వేవం సమ్యక్ సర్వం ప్రకీర్తితమ్ ।
యద్బ్రహ్మమహిమాఽపేక్ష్యః తద్రామేతి న సంశయః ॥ 196

ఛాందోగ్యోఽపి స వేదేతి బ్రహ్మోపక్రమ్య బ్రహ్మణః ।
తేజోఽబన్నాదికా సృష్టిః సన్మూలా సా స్థితిర్హృతిః ॥ 197

ఆ ప్రజ్ఞానమేది యందురో, సచ్చిదానంద ఘనానంతమగు శ్రీరామబ్రహ్మమే. ఇందులో సంశయము లేదు. ఇక ఇందుకు తైత్తిరీయోపనిషత్తునందు- పూర్వము బ్రహ్మలక్షణమును సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ. ఇట్లుసర్వాత్మకముగా ఉండునది రామబ్రహ్మమొక్కటే, ఇందులో సంశయములేదు. (196)

ఇక మూడు శ్లోకములలో ఛాందోగ్యోపనిషత్ అర్థవిచారముచే రామబ్రహ్మైక్యభావము ఉపదేశింపబడుచున్నది.

జీవాత్మనా ప్రవేశశ్చ వ్యాకృతిర్నామరూపయోః ।
శ్వేతకేతోస్త్వంపదస్య తత్పదేనైక్యతాఽపి చ ॥
సదసంభావనాయాం చ సద్భావే చ బహూక్తితా ॥ 198

తత్జ్ఞానే చ గురోర్జ్ఞానం జ్ఞానాన్మోక్షోఽపునర్భవః ।
సత్యబ్రహ్మాభిసంధస్యేత్యేవం సద్బ్రహ్మకీర్తనమ్ ।
తద్రామేతి పరం బ్రహ్మ సృష్టిస్థిత్యంతహేతుకమ్ ॥ 199

అన్యస్యామపి శాఖాయాం ప్రశ్నప్రత్యుక్తితః స్ఫుటమ్ ।
మనః ప్రాణేంద్రియాణాం యన్మనః ప్రాణేంద్రియం హి తత్ ॥ 200

సర్వేషామనుభూతేః సద్విదితావిదితాత్పరమ్ ।
విషయో నేంద్రియాదీనామిత్యుక్త్వా తస్య శోధనమ్ ॥ 201

సర్వదర్శీ సర్వవేత్తృదేవానాం జయకారణమ్ ।
తదజ్ఞానం చ దేవానాం గురోర్జ్ఞానముపాస్తితా ॥ 202

విద్యైవ నాన్యన్మానుష్యం ప్రాప్య జన్మ న వేద చేత్ ।
వినష్టిర్మహతీ తస్య చేతి ప్రోక్తాం తతః పరమ్ ॥ 203

అధ్యాత్మాధిదేవభిదా విద్యాసాధనమేవ చ ।
బ్రహ్మజ్ఞానేన పాపానాం హానిస్తత్రాప్తిరిత్యయమ్ ॥ 204

బ్రహ్మణో మహిమా శ్రుత్యా కీర్తితో వ్యాసతః స్వయమ్ ।
తద్రామేతి గురోర్జ్ఞేయ నాన్యథా గ్రంథకోటిభిః ॥ 205

ముండకేఽపి పరా విద్యా విషయో బ్రహ్మ బ్రహ్మణః ।
సృష్టిశ్చానేకదృష్టాంతైరుక్తా తస్మింశ్చ సంస్థితా ॥ 206

లయశ్చాపి హి తత్రైవ విశ్వం సర్వే హి తన్మయమ్ ।
తారేణ ధనుషా వేద్య లక్ష్య ఆత్మార్పణం తథా ॥ 207

మహిమాతిశయస్తస్య తద్భాసా భాత్యశేషకమ్ ।
అగోచరం చ సర్వేషాం ధ్యాయమానోఽనుపశ్యతి ॥ 208

వేద హి తం గుహాయాం యోఽవిద్యాగ్రంథిం భినత్తి సః ।
కృపయా వృణుతే బ్రహ్మ యం కంచనం సుసాధకమ్ ॥ 209

(ఇక్కడ ముండకోపనిషత్తును చర్చించడమైనది) ప్రణవస్వరూపమగు ధనస్సుచేత ఆ బ్రహ్మము వేదితవ్యమైయుండును అనిన ఆ పరమాత్మయే లక్ష్యుడనగా ప్రణవమునకు గురిగానుండును. అందుచేత ఏమగును అనిన జీవుడు తదాకారాకారితమై బ్రహ్మార్పణమగును. ఆ పరమాత్మయొక్క మహిమ అతిశయమనిన అపారమైనది. తత్ప్రకాశముచేతనే సమస్తమును ప్రకాశించుచున్నది. సమస్త ప్రాణులకును, సకలేంద్రియములకును కూడా ఆ పరబ్రహ్మ గోచరించునది కాదు. అయిన,

సర్వరూపములలో ఉన్న ఆ పరబ్రహ్మను ధ్యానించుచుండువాడు బ్రహ్మము నెరుగుచున్నాడు. (209). ఎవడు ఆ నిరాకార పరబ్రహ్మను హృదయపుండరీకమను గుహయందు దాగియున్న వానిగా ధ్యానించుచున్నాడో అట్టి బ్రహ్మవేత్త అవిద్యయనబడు జీవోపాధియగు అజ్ఞానముయొక్క గ్రంథి బంధనమును భేదించుచున్నాడు.

**తేనైవ లభ్యతే సాక్షాన్నాన్యథా యత్నతోఽపి హి ।**
**అథవా యం పరేశం తం ప్రాప్తుమిచ్ఛతి సాధకః ॥ 210**

**తేనైవ హేతునా లభ్యో నాన్యథా సాధనాంతరైః ।**
**బలహీనాదిభిర్నేదం లభ్యతే తైస్తు లభ్యతే ॥ 211**

**సన్న్యాసయోగతః సత్వం శుద్ధం యేషాం విచారతః ।**
**తే పరాంతేన కాలేన పరిముచ్యంతి నాన్యథా ॥ 212**

**యథా నద్యః సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపతః ।**
**తథా విద్వాన్కలా దేవప్రతిష్ఠాయాం చ సంక్షయమ్ ॥ 213**

**ప్రారబ్ధకర్మణాం సాక్షాన్మోక్షమేత్యపునర్భవమ్ ।**
**యో వేద పరమం బ్రహ్మ స బ్రహ్మ భవతీతి చ ॥ 214**

**సర్వ సముదితం యస్మాత్తద్రామబ్రహ్మచిద్ఘనమ్ ।**
**పూర్ణమదః పూర్ణమితి కండికాయా సమాసతః ॥ 215**

**ఆదిమధ్యావసానేషు పూర్ణం బ్రహ్మైవ నిశ్చితమ్ ।**
**పూర్ణం పరోక్షరూపేణ జాతం తత్పదసంజ్ఞితమ్ ॥ 216**

**ప్రత్యక్షత్వం పదార్థేన స్థితం భూతమయేషు చ ।**
**పూర్ణాన్నిరూపకాత్పూర్ణం సోపాధికమిహోచ్యతే ॥ 217**

**తత్పూర్ణం శాస్త్రశాస్తృభ్యాం స్వావిద్యాజ్ఞానతః స్వయమ్ ।**
**స్వఖండైకరసం లక్ష్యమాదాయోపనిషద్గిరా ॥ 218**

**నిర్గతోపాధికం సర్వం పూర్ణమేవావశిష్యతే ।**
**తద్రామ పరమం బ్రహ్మ యోగిధ్యేయం సనాతనమ్ ॥ 219**

తన స్వరూపమగు ఆత్మను తెలుసుకోదలచి ప్రయత్నించు సాధకులలో నెవనినో ఒకనిని ఆ బ్రహ్మము దయచే తనను పొందుటకు అనుమతిచ్చుచున్నది. ఆ బ్రహ్మాత్మానుసంధానమును ఒక్క హేతువుచేతనే లభించుచున్నది గాని మరియే సాధనములచేతను లభ్యముకాదు. అదియును గాక, సాధకుడగువాడు ఆ పరబ్రహ్మమును ఐక్యభావముతో పొందనిచ్ఛయించునో ఆ కారణముచేతనే బ్రహ్మాపాప్తి గలుగును. ఇతర సాధనములచే లభింపదు. ఆత్మనిష్టాపరాక్రమాది బలములు లేకపోయిన ఆ పరమాత్మ లభింపదు. ఆ యాత్మ నిష్ఠాదికములచేతనే ప్రాప్యము.

వేదాంత విజ్ఞానమువలన, సన్న్యాస యోగమువలన, వైరాగ్యమువలన ఎవరియొక్క అంతః కరణము శుద్ధముగా మారునో అట్టివారు దేహవియోగసమయమున అంతట ముక్తినందుచున్నారు. మరేవిధముగాను ఇది కానేరదు. సముద్రమునందు నదులు ఎట్లు తమ నామ, రూపములను విడిచి కలసిపోవుచున్నవో, అట్లే ప్రాణాది కళలును, ఇంద్రియములును, ప్రతిష్టనందియున్న చిత్తునందు కలసిపోవుచున్నవి. బ్రహ్మవేత్తయగువాడు ప్రారబ్ధ కర్మలయొక్క సంక్షయమును పునర్జన్మరహితమును అగు సాక్షాన్మోక్షమునందుచున్నాడు. అనగా ఎవడు పరమాత్మను తెలియుచున్నాడో వాడే బ్రహ్మీభూతుడగుచున్నాడు.

ఏ పరబ్రహ్మనుండి ఈ సమస్తమును ఉదయించినదో అదియే ఈ జ్ఞాన పూర్ణమగు రామబ్రహ్మము. పూర్ణమదః పూర్ణమను ఖండికయందు ఆదిమధ్యాంతములలో బ్రహ్మమే పూర్ణమని నిశ్చయింపబడినది.

## శాంతిమంత్రముల విచారము

పూర్ణమనబడు పరోక్షరూపముచే అవ్యక్త, అద్వయ, నిర్గుణ బ్రహ్మమునుండి తత్పదసంజ్ఞితమనిన మాయోపాధికుడగు ఈశ్వరచైతన్యముదయించెను. మరి ప్రత్యక్షమగు 'త్వం' పదాఖ్యచే పాంచభౌతిక ములగు దేహములలో నిలిచిన అవిద్యోపాధికమైన జీవచైతన్యముదయించెను. నిరూపాధికమగు పూర్ణ బ్రహ్మనుండి పూర్ణమైన ఈ జీవాత్మ ఎట్లు గల్గెనని చెప్పబడుచున్నది. శాస్త్రమువలనను, శాస్త్రోపదేశకు డగు గురువువలనను, తనయొక్క ఉపాధియగు అవిద్య నశించుటచేత, తానే తత్పూర్ణాత్మయని వేదాంత వాక్యముచేత స్వవిజ్ఞానానంద చిదాఖండైక రసమును లక్ష్యముగా గ్రహించి, ఉపాధి శూన్యము, సర్వము అగు బ్రహ్మమొక్కటి గానే మిగులుచున్నాడు. కార్యకారణాత్మక జగదీశ్వరస్వరూపియగు పరమమయిన రామబ్రహ్మమే యోగులచే ధ్యానింపబడునట్టి అనాది తత్త్వము.

(220)

సర్వధర్మనిషేధేన శ్రుతిగీతం పరాత్పరమ్ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ 220

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 221

ఇత్యాహ భగవాన్ సాక్షాద్వేదేఽపి తజ్జలానితి ।
ఏవం సర్వాసు శ్రుతిషు స్మృత్యాదిషు యదీరితమ్ ॥ 222

తద్రామ పరమం బ్రహ్మ యోగిగమ్యమనామయమ్ ।
అనంతనామరూపైశ్చ విశ్వాకారం స్వమాయయా ॥ 223

భూత్వా సర్వేషు భూతేషు వ్యాపకం భూతచాలకమ్ ।
స్ఫుటమప్యస్ఫుటం తేషామజ్ఞానాం స్వాత్మనః సదా ॥ 224

బ్రహ్మజ్ఞానే పరో హేతుః సర్వేఽపి బహిరీక్షకాః ।
మానవాః సంతి తేనేదం చిద్బ్రహ్మ న ప్రకాశతే ॥ 225

పరాంచి ఖాని ప్రభుణా సృష్టాని చేక్షతే పరాక్ ।
వీక్షంతే నాంతరాత్మానం ప్రసిద్ధం శ్రుత్యుదీరితమ్ ॥ 226

సర్వోఽపి మనుజో దాసో విత్తస్త్రీతనుజాత్మనామ్ ।
కింవా స్వః కామదాసోయం తేనాంతశ్ఛిన్న కాశతే ॥ 227

యది భూయాత్సదానందః స్వాత్మా సాక్షీ గుణాత్పరః ।
తదా కిన్నామ రోచేత వ్యాసాదన్యన్నరస్య హి ॥ 228

ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్ ॥ 229

ఇత్యాహ చ శ్రుతిః సాధ్వీ బృహదారణ్యకా స్వయమ్ ।
యత్స్వామరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ॥ 230

ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ।
ఇతి సాక్షాజ్జగన్నాథోఽర్జునాయ ప్రోక్తవాన్ స్వయమ్ ॥ 231

## భగవంతుని వచనములమీద చర్చ

“సర్వధర్మనిషేధ పూర్వకముగా శ్రుతులయందు ప్రతిపాదింపబడినవాడును, పరాత్పరుడును, సమస్తజగత్తునకు పుట్టుకయును, అట్లే ప్రళయమును అగునేను; ధనంజయా! వ్యాపియగు జీవుడా! నా కంటే గొప్పదేదొక్కటియును లేదు. దారముతో మణులు గుచ్చబడినట్లు నాయందీ సమస్త ప్రపంచమును కూర్చబడియున్నది,” ఇట్లు భగవద్గీతలో సాక్షాత్ భగవంతుడు ఆనతిచ్చియున్నాడు. వేదమునను, “తజ్జలానితి శాంత ఉపాసీత,” అను ఇది మొదలుగా ఈ తత్త్వమే ప్రతిపాదింప బడుచున్నది. ఇట్లే సకల శ్రుతులయందును, స్మృతులు మొదలగువాటి యందును ఏది పరబ్రహ్మమని చెప్పబడి యున్నదో, ఆ రామపదవాచ్యమే యోగిగమ్యము. అనామయమును, పరమమునగు బ్రహ్మము. అది నిజలీలచే స్వమాయచేత అనంతనామరూపములతో జగదాకారమునంది, సమస్త భూతములలోను వ్యాపకమై, సర్వచైతన్యమగుటచే, సర్వభూత సంచాలకమునై సుస్పష్టముగా ఉండినప్పటికిని అజ్ఞులగు వారికి తమబుద్ధిలో ఎప్పటికిని గోచరింపకయున్నది. (225)

## కఠోపనిషత్ సారము

బ్రహ్మజ్ఞానమున మరియొక కారణము ఏమనిన మానవులంతా తమ ఇంద్రియములను బహిర్ముఖముజేసి, బాహ్యసుఖములకు తపించి, అశాంతిపాలగుచున్నారు. అందుచేత చిదాత్మకమగు బ్రహ్మ ప్రకాశించదు (226). “స్వయంప్రభువగు భగవంతునిచేత అడ్డముగా శబ్దాది విషయ ప్రకాశమునకు ప్రవర్తించు నటువంటివనిన ఆత్మప్రకాశములుకాని ఇంద్రియములు సృష్టింపబడినవి. ప్రత్యక్ రూప అనాత్మ భూతములగు శబ్దాదులనే చూచుచున్నాడు. అంత నిగూఢమగు ఆత్మను ఈ ఇంద్రియములు చూడలేవు,” అను ఈ సంగతి ప్రసిద్ధముగా శ్రుతిలో చెప్పబడియున్నది.

మానవులందరు ధన, స్త్రీ, పుత్రస్వరూపమగు ఈషణత్రయమునకు దాసులుగా ఉన్నారు. ఏమి చెప్పునది. ఈ జీవుడు సుఖ, కామదాసుడైయున్నాడు. అందుచేత అంతఃప్రజ్ఞానము ప్రకాశించదు. (228). నిత్యానందుడును, త్రిగుణాతీతుడును, సార్వసాక్షియును అగు స్వాత్మ ఒకవేళ ప్రకాశించితే అప్పుడు మానవునికి విస్తారమగు ఆ పరమాత్మ స్వరూపమునకన్న ఇంకొకటి యేది రుచించును? ఆత్మకంటే అన్యమైనది మానవునికి సంతృప్తినివ్వదు. స్వాత్మస్ఫూర్తియొక్కటియే నిత్యతృప్తము(129). వేయిమందిలో ఒకానొక మానవుడు ఆత్మస్వరూపమును తెలుసుకొనుటకు ప్రయత్నించును. అలా ప్రయత్నించిన వారిలో యే ఒకానొకడో దానిని తెలుసుకొనును. ఏ కారణమువలన ఆత్మవిచారము వలననే తృప్తుడగు పురుషుడు స్వాత్మారామస్థితిగలవాడే అగునో, ఆ కారణమున అతడు పరబ్రహ్మము నందే ఏకీభవించి సంతుష్టుడుగా నుండును. అతనికి వేరొక కార్యమేమియును లేదు. ఇట్లు ప్రత్యక్షుడగు శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి స్వయముగా ఉపదేశించెను.(232)

భోగాసక్తః పుమాన్పూర్వమేకాకీ రమతే న చ ।
ఏషణామయసంబద్ధో యతతేఽర్థాయ నిత్యదా ॥ 232

స లోకోఽపుత్రిణ శ్రుత్వా పుత్రోత్పాదనతత్పరః ।
జాయాం సంపాదయత్యాదావతియత్నేన మూఢధీః ॥ 233

పుత్రానుత్పాద్య క్లేశేన దేవతీర్థాదిసేవయా ।
కుటుంబ భరణార్థం చ యాగార్థం వా ధనేచ్ఛయా ॥ 234

అనిశం దహ్యతే చిత్తే న ప్రాప్నోతి యథేప్సితమ్ ।
శాస్త్రజ్ఞోఽపి సత్క్రియావానర్థదాసః ప్రతిగ్రహమ్ ॥ 235

ధనినాం యాత్యగవతాం గ్రామే కౌలేయకో యథా ।
అవ్యుత్పన్నమతీనాం తు కా వార్తా స్వాత్మచింతనే ॥ 236

అనేక పుణ్యపుంజైః సత్కులే జన్మాప్య సాధుభిః ।
సజ్జతే సద్భిరుక్తేన మార్గేణేతి యదా తదా ॥ 237

రామబ్రహ్మదర్శనార్థం ముద్రాం స్వాం పూరయత్యత ।
యుక్త్యా న దత్తయా సద్భిర్న స్వయాఽమూలయా క్వచిత్ ॥ 238

తం పూరణప్రకారం తు సంక్షేపేణోచ్యతేఽధునా ।
యథా లోకేంజనం సమ్యక్ సంపాద్య పూర్యతేఽక్షి చ ॥ 239

నిధిః ప్రత్యక్షతస్తస్య దర్శనం యాతి నాన్యథా ।
ఏవమత్రాపి తత్తుల్యం సాధనం యచ్చతుష్టయమ్ ॥ 240

సంపాద్య చేక్షతే శుద్ధం రామేతి పదమవ్యయమ్ ।
మాయావ్యసితవర్ణం యద్బ్రహ్మ తత్సాధనం తథా ॥ 241

ఇంద్రియభోగములయందు ఆసక్తుడగు మానవుడు ఏకాంతజీవితమును గడపలేడు. ఇక పుత్ర, విత్త, దారాత్మక ఈషణత్రయమున బంధింపబడి, యెల్లప్పుడును ఆ భోగాలకోసం వెంపర్లాడుచున్నాడు. ఈ నరలోకమున మానవుడు పుత్రోత్పాదన యందు ఆసక్తుడై మొదట ఎంతో ప్రయాసతో భార్యను సంపాదించుచున్నాడు. (134) పిదప పుత్రులను కని, వారి పోషణ క్లేశము చేత, దేవక్షేత్ర, తీర్థస్థలాది

యాత్రాసేవచేత కుటుంబ రక్షణకొరకును, యజ్ఞ యాగాది ధర్మకర్మార్థముగ ధనేచ్ఛచే ఎల్లప్పుడు చిత్తమున సంతాపపడుచున్నాడు. అయినను ప్రారబ్ధకర్మ వశమున యథేష్టముగా ధనాది భోగములను పొందలేకపోతున్నాడు. ఆహా! వేదశాస్త్రములు చదివినప్పటికీ, పుణ్యకార్యములు చేసినప్పటికీ, ధనదాసుడుగానే వర్తించుచున్నాడు. గ్రామమున కుక్క పాట్లు పడినట్లుగా, పండితుడే ఇట్లు ద్రవ్యాశచే అవమానితుడగుచున్నాడు. ఇక సామాన్యమానవుల సంగతేమిటి? అనగా విద్యావంతులే ప్రవృత్తి మార్గమున పయనించగా, ఇక సామాన్యులగతేమిటి? కావుననె ఎవనికైనను బ్రహ్మతత్త్వ విచారము దుర్లభమనిరి (237).

పురాకృత బహుపుణ్యముచేత అసాధువులును సత్కులమునందు జన్మనందెదరు. వారు ఒకానొకప్పుడు సత్పురుషులు చూపిన మార్గమునందు పోవుచున్నారు. అట్టివారే రామబ్రహ్మదర్శనము కొరకు స్వాత్మ ముద్రను నింపుచున్నారుగదా యనిన స్వాత్మా రాములగుచున్నారు. ఇంతేగాని ఎచ్చటను సత్పురుషులిచ్చిన యుక్తిచేతనే పురాకృత పుణ్యమూలకము కాని అవిద్యచేత బ్రహ్మజ్ఞానమునందనేరరు. అనిన సద్గురూపదిష్ట మార్గమునవర్తించుచు, ప్రారబ్ధం తీరిపోవునంతవరకు మోక్షము సులభముగా లభించదు. (239) అయినను అట్టి పరబ్రహ్మస్వరూపమైన శ్రీరాముని పొందుటకు తగు సాధనా విధానమును ఇచ్చట చెప్పుచున్నాను. ఎట్లనిన లోకమున సరియైన అంజనము కంటికి అద్దితే, నిధి ప్రత్యక్షముగా కనుబడునట్లుగానే, ఈ బ్రహ్మవిచారమువలన సాధన చతుష్టయము అను ఆ నిక్షేపాంజనముతో సమానముగనున్నది. (241)

**శుద్ధావిద్యామయం చేతి ప్రోచ్యతే తత్త్వదర్శిభిః ।**
**శాస్త్రృశాస్త్రం చ శాస్యశ్చ మిథ్యాఽవిద్యామయం త్రయమ్ ॥ 242**

**జ్ఞానోత్తరమితి మతం తస్మాత్తద్వర్ణమీరితమ్ ।**
**చతుష్పాదసాధనం తత్పూర్ణమిత్యభిధీయతే ॥**
**ప్రత్యేకం సాధనం యచ్చ చతుః సాధనముచ్యతే ॥ 243**

**వికేకవైరాగ్య శమాదిషట్కం**
**ముముక్షుతా చేతి ప్రసిద్ధమేతత్ ।**
**లక్ష్మాణి ప్రత్యేకముశత్తమాని**
**ప్రోక్తాన్యమీషాం స్మృతిభూమికాసు ॥ 244**

**సాధనానాం చతుష్కం చ హ్యేషణాత్యాగపూర్వకమ్ ।**
**సన్న్యాసశ్చ గురోః సేవాశ్రవణాదిత్రయం తతః ॥ 245**

పూర్వోత్తరసమాధీ చ పుంజ ఏకాదశాత్మకః ।
ఏతేషాం తు మిథః సాక్షాత్ప్రాణాద్యా సంగతీర్మయా ॥ **246**

ముముక్షయా తు న్యాసాది షణ్ణాం సాక్షాదిహోచ్యతే ।
సమాధిరుత్తరశ్చాపి పృథగేవేతి సంమతః ॥ **247**

పూర్వత్రయాణాం న వినా ముముక్షా షడ్భిరాదరః ।
ఏతైః సాధనసంఘైశ్చ పదాని పూరయత్యలమ్ ॥ **248**

సర్వాణి తాని ప్రోచ్యంతే శ్రోతౄణామవబుద్ధయే ।
దశేంద్రియాణి తేషాం తు గోలకాని నవైవ తు ॥ **249**

## సర్వతోభద్ర యంత్రమునందలి వర్ణకల్పనావిచిత్రార్థ విచారము.

శుద్ధము, అవ్యయము అయిన **'రామ'** అను పదము స్వస్వరూపానుసంధాన లక్ష్యముగా సంపాదించికొని బ్రహ్మసాక్షాత్కారము నొందవచ్చును. పదమనగా 'రామ' యని నామము వ్రాయ బడియుండు ఇల్లు. అందులో నింపబడియుండు నల్లనివర్ణము పరమాత్మ మాయావీయనుటను స్ఫురింప జేయుచున్నది. ఏది బ్రహ్మమో అది బ్రహ్మసాధనమని ఈ నల్లనిరంగు తెలుపుతున్నది.

శుద్ధమనిన తెల్లనిరంగుతో నేర్పడియుండు రామ నామ వ్యంజకరేఖ బ్రహ్మవిద్యామయి యని బ్రహ్మవేత్తలచే చెప్పబడును. బ్రహ్మజ్ఞానానంతరము శాస్త్రవనిన శిక్షించుడు. శాస్త్రమనిన శివానిరూపక గ్రంథము. శాస్యుడనిన శిక్షింపబడువాడు. అనగా బోధక- బోధ-బోధ్యములను మూడును మిథ్యాభూతమనిన పారమార్థికము కాదు మరియు అవిద్యామయము అని తత్త్వవిదులు చెప్పుచున్నారు. కావున 'అవర్ణ' మనిన రామనామగతములగు నలుపు, తెలుపు మొదలగు రంగు చెప్పబడినది. ఇది నాల్గుప్రక్కలలోను వ్రోయబడుట చేత చతుష్పాదమనబడును. రామతో భద్రము సంపూర్ణ సాధకమని చెప్పబడినది. మరియొక సాధనము ఏది గలదో అది సాధనచతుష్టయమనబడును. (244)

## మోక్షమునకు సాధనచతుష్టయము

బ్రహ్మజ్ఞానసాధనకు అవసరమైన నాలుగింటిలో మొదటిది నిత్యానిత్యవస్తువివేకము. బ్రహ్మసత్యము జగత్తు మిథ్యయను నిశ్చయజ్ఞానమే నిత్యానిత్య వస్తువివేకము.

సాధన చతుష్టయములో రెండవది వైరాగ్యము. వైరాగ్యమనగా ఇహ లోకములోని, స్వర్గాది పరలోకముపట్ల వ్యతిరేకభావన. భోగ విషయములయిన సుగంధము, వనితాదులయందు కోరికలేక యుండుట.

సాధన చతుష్టయములో మూడవదైన 'శమాది షట్క సంపత్తి' అనగా అంతరింద్రియనిగ్రహమను శమము, దమము, ఉపరమ, తితీక్ష, శ్రద్ధ, సమాధానము.

అంతరింద్రియ నిగ్రహమే శమము. బహిరింద్రియ నిగ్రహము దమము. తనకు ఉన్న బాధ్యతలను చక్కగా నిర్వర్తించడమే ఉపరతి. శీతోష్ణాది ద్వంద్వములను సహించుటే తితిక్ష. శ్రవణాదులయందు అవధానమునందిన మనఃస్థితియే సమాధానము. గురు, వేదాంతవాక్యములలో అత్యంత విశ్వాసమనబడు నది శ్రద్ధ. ఈ ఆరు గుణములు గల్గియుండుటే శమాది షట్కసంపత్తి.

మోక్షమునందు తీవ్రమైన ఇచ్ఛ కలిగియుండటమే ముముక్షుత్వము. ఇది సాధన చతుష్టయములో నాలుగవది.

ఈ సాధన చతుష్టయమునకు ప్రత్యేకముగా స్మృతులలో మోక్షవిచారప్రక్రియారంభమున మిక్కిలి శ్రేష్ఠములగు లక్ష్యములు చెప్పబడినవి. పైన చెప్పబడిన సాధన చతుష్టయము నాల్గును, ధన, దార, పుత్రాత్మక ఈషణత్రయ త్యాగపూర్వకముగా ఒనర్చు సన్న్యాసమును, సద్గురుసేవయును, గురువేదాంత వాక్యమును, తదర్థమననమును, నిదిధ్యాసనమును, పూర్వసమాధి, ఉత్తరసమాధియును, చేరి ఈ 11 యొక్క సమష్టి మోక్షసాధన ఏకాదశమనబడును. వీటికి పరస్పరము ప్రాణాదులు సంగతులని పెద్దల అభిప్రాయము.(247)

మోక్షేచ్ఛచేతనే సన్న్యాసాదికములగు ఆరుగుణములకు ప్రత్యక్షమని యిచ్చట చెప్పబడినది. అనిన అవి యామోక్షేచ్ఛగలిగినపిదప సహాయకములనుట, ఉత్తర సమాధియను కడపటిగుణము వేరుగా నుండునని చెప్పబడినది. మోక్షేచ్ఛ పూర్వత్రయమనిన; వివేక, వైరాగ్య, శమాది షట్కములు లేకనే మోక్షము గలుగదని జ్ఞానులయొక్క అభిప్రాయము. ఇట్టి సాధన సంఘముచేత సాధకుడగువాడు సర్వతోభద్రమున పదములను చక్కగా నింపుచున్నాడు. అనిన మోక్ష సాధనక్రమస్ఫురణ గల్గునట్లు సర్వతోభద్రయంత్ర రచన సమన్వయింపబడినదనిచెప్పాలి. (249)

**ప్రాణాపానౌ మనోబుద్ధీ తస్మాద్ధర్మాశ్చ తన్మితాః ।**
**బుద్ధేర్ జ్ఞానం యథాఽసోశ్చ క్రియా తత్త్రతా మతా ॥ 250**

**ఉభయేంద్రియధర్మాణా మతోఽమీషామనాగ్రహః ।**
**సప్తవింశతిసంఖ్యాని పదానీమాని సాధనైః ॥ 251**

**యోగ్యాని లాంఛితుం సమ్యక్ పూరయత్యేవ సర్వథా ।**
**తదా యత్పరమం బ్రహ్మ రామేతి పదమవ్యయమ్ ॥ 252**

భాతి ప్రత్యక్షతస్తేన కృతకృత్యో హి జాయతే ।
ఏతావతా విధానేన రామతోభద్రముద్రికే ॥ 253

రామశ్చ కథితశ్చాథ సర్వతోభద్రమీర్యతే ।
స్థానతో నామతశ్చాపి సంశయస్యాపనుత్తయే ॥ 254

కళ్యాణం సర్వతః పుంసాం చింతనాద్యస్య బ్రహ్మణః ।
తద్భద్రవాచకం ముఖ్యం మంగళానాం చ మంగళమ్ ॥ 255

యత్ర యద్వ్యజ్యతే సాక్షాత్తన్నామ్నా తదుదీర్యతే ।
అధిదైవం తథాఽధ్యాత్మం సర్వతోభద్రమిష్యతే ॥ 256

వివిచ్యతేఽత్రోభయం చ ప్రోచ్యతే వస్తువ్యక్తయే ।
అధిదైవే తు యద్భద్రం తదాదావుచ్యతేఽమలమ్ ॥ 257

అండహృద్బ్రహ్మలోకస్తు సర్వతోభద్రముచ్యతే ।
తేనైవ భద్రం సర్వేషాం లోకానామితి హి స్థితిః ॥ 258

తత్ర స్వర్ణమయం వేశ్మ నిర్మితం ప్రభుణా స్వయమ్ ।
తత్పద్మమితి విజ్ఞేయం యత్ర కార్యచితిః స్వయమ్ ॥ 259

న్యాసేన సర్వసత్త్వానాం గతానాం సర్వయోగినామ్ ।
ప్రాణోపాసననిష్ఠానాం బ్రహ్మణా చిత్ప్రకాశతే ॥ 260

వాటిననగా ఇతర పదము(గడు)లను పూరణముజేయు విషయములనన్నిటిని జిజ్ఞాసువులజ్ఞానము కొరకై చెప్పుచున్నాను.

## శ్రీరామ బ్రహ్మైక్య తత్త్వప్రబోధనము.

వాటిలో దశేంద్రియంబులు-10, వీటిలో తొమ్మిదిమాత్రమే గోళకములుగానున్నవి. అనిన చర్మస్థానము తప్ప శ్రోత్ర, చక్షు, జిహ్వా, ఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలను ఇంద్రియ స్థానములు తొమ్మిది-9 గోళకములు.

ప్రాణాపానములు-9, మనో బుద్ధులు-2, ఈ ప్రాణాపాన, మనోబుద్ధిధర్మములనిన సంశయ, నిశ్చయ, ప్రాణ, అపానములు-4, వెరసి ఈ 27 పదములను రామబ్రహ్మానుసంధాన సాధనముల తోడ చక్కగా గుర్తించుటకు యోగ్యములని, అవి తద్వ్యంజకములుగా సర్వప్రకారముగాను ఈ

రామతోభద్రమున పూరణము చేయబడును. అప్పుడు యేది అవ్యయ పరబ్రహ్మ పదమనబడునో అదియే 'రామ' యను పదము (253). తద్రామపదము ప్రత్యక్షముగా స్ఫురించును. అందుచేత సాధకుడు కృతకృత్యుడుగా ఏర్పడును. ఇంతమాత్రము విజ్ఞానముచేత రామతోభద్ర ముద్రిక యందు శ్రీరామపరమాత్మ నిరూపింపబడెను. ఇక సంశయ పరిహారముకొఱకు సర్వతోభద్రము చెప్పబడుచున్నది.

స్థానమువల్లగానీ, నామమువల్ల గాని, అంతటా ఏ బ్రహ్మముయొక్క చింతనమువలన కళ్యాణము గానున్నదో అదియే ముఖ్యమైన భద్రవాచకము. ఇది సకల మంగళములకును మంగళమై యుండును. (256). ఎచ్చట ఆ మంగళ స్వరూపము ప్రత్యక్షమై స్ఫురించుచున్నదో ఆ పేరగు భద్రనామముచే అది చెప్పబడుచున్నది. ఈ సర్వతోభద్రమే అధిదైవమనియు, అధ్యాత్మమనియు చెప్పబడుచున్నది. రామబ్రహ్మము వ్యక్తికొరకై యిచ్చట ఆ రెండును వివరణముగా చెప్పబడును. అధిదైవమున ఏది భద్రమో అమలమగు మొదటదానిని చెప్పెద ఎట్లనిన....

బ్రహ్మాండముయొక్క హృదయమగు బ్రహ్మలోకమే సర్వతోభద్రమనబడును. దానిచేతనే సకల లోకములకును భద్రముగలదని స్థితితెలియునుగదా. స్వయంప్రభువగు బ్రహ్మచే అచ్చట సువర్ణ మయమగు దివ్యధామము ఏర్పరుచబడియున్నది. స్వయముగా కార్యప్రజ్ఞ యెచ్చటగలవో అట్టి హృత్పద్మమని తెలియతగినది. (260)

**బ్రహ్మణా సహ తే సర్వ ఇతి స్మృతిరథాగమః ।**
**క్రమముక్తేస్త్వయం పంథాః శ్రుతిస్మృతిమతోఽమలః ॥ 261**

**అధ్యాత్మే హృదయే యత్తత్సర్వతోభద్రమీర్యతే ।**
**తేన భద్రేణ కళ్యాణం సర్వేష్వవయవేష్విహ ॥ 262**

**తత్ర యత్పుండరీకం తద్బ్రహ్మణః స్థానముచ్యతే ।**
**శ్రుతావేవం ప్రసిద్ధిర్హి దహరాంబుజవేశ్మతః ॥ 263**

**సాధనసంపత్సంయుక్తా స్తస్మిన్యే తు సమాహితాః ।**
**గురూపదిష్టయా యుక్త్యా తేషాం బ్రహ్మ ప్రకాశతే ॥ 264**

**పరమః పురుషో భూమౌ స ఏవాధస్తథోపరి ।**
**ఇత్యాదిశ్రుత్యా యత్ ప్రోక్తం తన్న పరోక్షమిత్యపి ॥ 265**

**అహ చాహమేవాధస్తాదిత్యాదిసుమవ్యాప్తితామ్ ।**
**మూఢానామపి సర్వేషాం దేహేఽహమితి దృశ్యతే ॥ 266**

**మాభూత్సంభ్రమ ఇత్యర్థమాత్మైవేతి పునర్వచః ।**
**ఏకాత్మరూపయోస్తయోర్భేదశంకానివృత్తయే ॥ 267**

**సర్వాసూపనిషత్స్వేవం బ్రహ్మాద్వైతం సునిశ్చితమ్ ।**
**బ్రహ్మైవేదమమృతమిత్యాహ చాథర్వణీ శ్రుతిః ॥ 268**

**తత్త్వమేవ త్వమేవైతదితి కైవల్యగం వచః ।**
**తత్త్వమసీతిఛాందోగ్యే బ్రహ్మాత్మైక్యం న భేదధీః ॥ 269**

అచ్చట సర్వసత్త్వవంతులై గతించిన ప్రాణోపాస్తి పరినిష్ఠులగు సర్వయోగులకును న్యాసమగు బ్రహ్మచే ప్రజ్ఞానము ప్రకాశించుచున్నది. (261) ఇట్లు బ్రహ్మలోకమునందిన యోగులు బ్రహ్మతోడ ముక్తులగుచుందురని స్మృతిగలదు. మరియు ఆగమము అట్లే చెప్పబడినది. కావున క్రమముక్తికి శ్రుతి, స్మృతి సమ్మతమగు ఈమార్గము నిర్మలమయినది. (262). ఆధ్యాత్మ్యమున ఈ దేహగతమగు హృదయమే సర్వతోభద్రమనబడును. భద్రసంజ్ఞకమగు నా హృదయముచేత ఇచ్చట అన్ని యవయవములలోను కళ్యాణము కలుగుచున్నది. అచ్చటనే పుండరీకము గలదు అది బ్రహ్మస్థానము అనబడును. ఇట్లే శ్రుతియందు హృత్పుండరీక ధామమని ప్రసిద్ధిగలదుగదా. బ్రహ్మజ్ఞాన సాధనముల యొక్క సంపత్తినందిన వారెవరు ఈ హృత్పుండరీకమున సమాహిత చిత్తులై యున్నవారికి గురూపదిష్టమగు యుక్తిచే ఆ బ్రహ్మము స్వయంజ్యోతిగా వెలుగుచున్నది. (265)

పరమపురుషుడగు ఆ పరమాత్మయే భూమియందు, క్రింద, పైన, అంతట నిండియున్నాడను విషయమేది శ్రుతిచేత చెప్పబడునో అది పరోక్షము కాదనియు శ్రుతి చెప్పినది. అనిన అంతయును ఈ దేహమున ప్రత్యక్షముగా ఉన్నదనుట. నేనే క్రిందనున్నాను, నేనే పైనకూడ ఉన్నాను, నేనే అంతట ఉన్నాను, అను మొదలగు సమవ్యాప్తిత్వమును కూడ శ్రుతి సమన్వయించి చెప్పెను. మూఢులందరికిని ఈ దేహమందు దేహము కాక తానొకడు సత్యమనుట తెలియవచ్చుచున్నది. ఇచ్చట సంభ్రాంతివలదను అర్థమును నిరూపించుటకొరకై ఏకాత్మస్వరూపులగు ఈ జీవాత్మ పరమాత్మలలో భేదభ్రాంతి పోవుటకై ఆత్మమాత్రమొక్కటే సచ్చిదానందాద్వయ నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావమని పలుమార్లు శ్రుతినిరూపక వాక్యము గల్గె. (168) అన్ని ఉపనిషత్తులయందును ఇట్లు బ్రహ్మాద్వైతము చక్కగా నిశ్చితమైయున్నది " తేజోమయోఽమృత మయః పురుషోఽయమేవ సయోమాత్మేదమమృతమిదం బ్రహ్మేదమ్ సర్వమ్," అని బృహదారణ్యక చతుర్థాధ్యాయ మధుబ్రాహ్మణశ్రుతి ఆత్మైకత్వమును నిరూపించుచున్నది.

**ఏకత్వం పదయోః స్పష్టం శ్రుత్వా యత్రప్రతిపాదితమ్ ।**
**సాక్షాన్ముక్తేః కారణం తద్బోధస్తేషాం స ఏవ హి ॥ 270**

యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥ 271

ఇదం సర్వం యదయమాత్మైకమేవాద్వితీయకమ్ ।
సర్వం ఖల్విదమిత్యాదిశ్రుతయో యద్బ్రువంతి హి ॥ 272

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
సంపశ్యన్నాత్మయాజీతి పరమార్థం మనోర్వచః ॥ 273

ఏతాదృశేన బోధేన భూత్వా బ్రహ్మాత్మరూపకాః ।
కృతకృత్యాః స్వయం తీర్త్వా సచ్ఛిష్యాన్ గ్రాహయంతి చ ॥ 274

అత్రోక్తం శ్రుత్యభిప్రాయం జానంతి విదుషోఽఖిలాన్ ।
కిం బహూక్తేన చోద్దిష్టం సంక్షేపేణోపసంహృతమ్ ॥ 275

నారాయణాచ్యుత జనార్దన వాసుదేవ
గోవింద మాధవ ముకుంద రమేశ విష్ణో ।
సంకర్షణాజ నరసింహ పరావరాత్మన్
రామోరుగాయ శివ వామన పాహి శిష్యమ్ ॥ 276

యేనేదం వికృతం విశ్వం విశతా యేన చేతనమ్ ।
యత్స్థితం యత్ప్రతిష్ఠం చ తస్మై సర్వాత్మనే నమః ॥ 277

ఇదానీం రామతోభద్రస్యాష్టోత్తరశతస్య చ ।
నానాభేదాః ప్రకథ్యంతే లఘుముద్రాంకితస్య హి ॥ 278

"యత్పరంబ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనంమహత్ । సూక్ష్మాత్సూక్ష్మతరంనిత్యం తత్త్వమేవ త్వమేవతత్ ॥" అని కైవల్యోపనిషత్తు పరమాత్మ జీవాత్మైక్యమును ఉపదేశించుచున్నది. "తత్త్వమసి" అని ఛాందోగ్యమున బ్రహ్మాత్మైక్యము ప్రతిపాదింప బడినది. భేదబుద్ధి లేదు. జీవ, దేవ పదములకు స్పష్టముగా శ్రుతిచే ఏది ప్రతిపాదింపబడినదో అది సాక్షాన్మోక్షమునకు కారణముగానున్నది. వాటియొక్క బోధయనిన ప్రజ్ఞానము ఆ పరమాత్మగానే యుండును. (271) సర్వజగత్తులోను కనబడునట్టి, వినబడునట్టి యిసుమంతైన ఏదికలదో అదంతటిని లోపలను, వెలుపలనుగూడ వ్యాపించి నారాయణుడున్నాడు. "ఇదం సర్వం యదయమత్మా, ఏకమ్ ఏవ అద్వితీయం బ్రహ్మ", "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యములు ప్రసిద్ధముగా దేనిని చెప్పుచున్నది అనిన అద్వైత బ్రహ్మతత్త్వమునే చెప్పుచున్నది. (273)

సర్వభూతములలోను ఆ పరమాత్మను, ఆ పరమాత్మయందు సర్వభూతములను చూచుచున్న వాడే ఆత్మారాధనుడగునని పరమార్థమును మనుధర్మశాస్త్ర వచనముపదేశించుచున్నది. (274) బ్రహ్మ వేత్తలు చెప్పిన ఇట్టి ఐక్యానుసంధాన ప్రజ్ఞచే బ్రహ్మాత్మ స్వరూపులై తాము సంసారక్లేశమునుండి తరించి, తమ జీవితములను సార్థకము చేసుకుని, యోగ్యులగు శిష్యులను అనుగ్రహించుచున్నారు. (275). ఇచ్చట చెప్పబడిన వేదాంతాభిప్రాయమును విద్వాంసులందరు ఎరుగుదురు. పెక్కుమాటలచే చెప్పి ఏమి ప్రయోజనము. సంక్షేపముగా నిట్లు నిరూపించబడినది. (276)

నారాయణ మొదలగు 17 నామములచే కీర్తింపబడిన సర్వచైతన్య స్వరూపియగు ఓ పరమాత్మా! తత్త్వ జిజ్ఞాసువగు ఈ శిష్యుని స్వస్వరూపస్ఫూర్తిచే పరిరక్షింపుము. సర్వ శ్రేష్ఠుడని స్తుతిగలవాడు, గొప్పవాడును గానముగలవాడును, సర్వోత్తముడనుట. తక్కిన నామములకు నిర్వచనములు ఇంతకు మునుపే చెప్పబడినవి. (277) ఈప్రపంచము ఎవనిచేత ఇట్లు వికృతమైనదో, దీనియందు అనుప్రవేశము చేయుచుండెడు ఎవనిచేత ఇది చేతనమై యున్నదో, ఎవనిచేత నిలిచియున్నదో, ఎవనియందు ప్రతిష్ఠింపబడినదో అట్టి సర్వాత్మకుడగు బ్రహ్మకు నమస్కారము. (278)

**పూర్వోక్తేఽష్టవింశతీనాం రేఖావృద్ధిం ప్రకల్పయేత్ ।**
**పరిధీ ద్వావధికౌ తత్పంక్త్యోర్లింగాని యోజయేత్ ॥ 279**

**ప్రథమే తిథిమితీశాశ్చతుర్వింశపదాత్మకాః ।**
**వాప్యః షోడశసంఖ్యానాస్త్రయోదశపదాత్మికాః ॥ 280**

**భద్రం తత్త్వమితం చాథ ద్వితీయేఽర్కమితాః శివాః ।**
**వ్యాప్యస్త్రయోదశమితా హ్యష్టాదశపదాత్మికాః ॥ 281**

**భద్రమర్కపదం శేషం యథాపూర్వం ప్రకల్పయేత్ ।**
**ఏతద్రామలింగతోభద్రశతం చ వసూత్తరమ్ ॥ 282**

**అథవాఽఽద్యే రసముద్రా రసేమా వాపికాశ్చ షట్ ।**
**త్రయోదశ పదాః కార్యా భద్రం చంద్రకలాత్మకమ్ ॥ 283**

**ద్వితీయే పంచ ముద్రాశ్చ లింగషట్కం చ వాపికాః ।**
**తన్మితాశ్చ భద్రమర్కపదమగ్రేఽష్టమావధి ॥ 284**

**తుర్యపంచతుర్యనేత్రచంద్రసంఖ్యాశ్చ ముద్రికాః ।**
**షట్నేత్రనేత్రనయననేత్రేందుశంకరాంస్తథా ॥ 285**

భద్రం షట్పదమర్కాంఘ్రి షట్పదం వింశపాదకమ్ ।
షోడశాంఘ్రియుగ్మపాదం క్రమాత్ జ్ఞేయం విచక్షణైః ॥ **286**

అథవాఽష్టపదే ముద్రాం విధాయ తత్ స్థలింగకమ్ ।
రచయేత్ స్థానకే తుర్యే భద్రం వింశత్పదాత్మకమ్ ॥ **287**

సర్వత్ర సమముద్రాసు మధ్యే చ పరిధిద్వయమ్ ।
ముద్రా సీమాలింగగతా వాప్యర్ధా తుర్యకోష్ఠకా ॥ **288**

లింగస్కంధగతా కోష్ఠా వర్జై రిష్టైః ప్రకల్పయేత్ ।
వల్లీవాప్యోర్మధ్యగాని పదాన్యుర్వరితాని తు ॥ **289**

భద్ర శృంఖలయోగ్యాని తదర్థం వినియోజయేత్ ।
అథవాఽఽద్యే దశ ముద్రా సీమాపరిధయస్తథా ॥ **290**

## అష్టోత్తర శతపద (108) రామతోభద్రాది నానాభేదములు

ఇప్పుడు అష్టోత్తర శతపదాత్మక (108) రామతోభద్రముయొక్కయు లఘుముద్రాంకితము యొక్కయు పలురకములు చెప్పబడును. ఇంతకుమునుపు చెప్పబడినట్లు 28 రేఖావృద్ధిని కల్పించునది. రెండుపరిధులెక్కువ. ఆ పంక్తులలో లింగములను యోజించునది. మొదట 24 పదాత్మకములయిన 15 లింగములు, 13 పదములతో ఏర్పరిచిన వాపికలు–16, పంచవింశన్మితము(25) భద్రము. పిదవ రెండవవరుసలో 11 లింగములు, 18 పదములతో వాపులు, 13, 12 పదములతో భద్రము, వెనుకటివలె ఏర్పరచునది. ఇది అష్టోత్తర రామలింగతోభద్రము. మరియు, మొదట 6 ముద్రలు, 6 లింగములు, 6 వాపికలు, వీటిని 13 పదములచే ఏర్పరచునది. 16 పదాత్మకము భద్రము. రెండవవరుసలో 5 ముద్రలు, 6 లింగములు, 6 వాపికలును, 12 పదముల భద్రము. పిదప 8 వరుసలవరకు 4–5–4–2–1 సంఖ్యలవి ముద్రలు. 6–2–2–2–2 సంఖ్యాకములు లింగములు. 6–3–6–20–8 పదములలో భద్రములు. ఇట్లు క్రమముగా ఏర్పరుచునది. (287) అదిగాక, 8 వ పదమున ముద్రనేర్పరచి అచ్చట ఉండతగినలింగమును ఆ స్థానముననే రచించునది.

భద్రమర్కపదం మధ్యే పరిధీ ద్వే ప్రకల్పయేత్ ।
ఏవమగ్రే పరిధయస్తృతీయేఽష్టైవ ముద్రికాః ॥ **291**

చతుష్పాదాత్మకం భద్రం పంచ ముద్రాశ్చ పంచమే ।
అర్కపాదాత్మకం భద్రం నాత్ర ద్వౌ పరిధీ స్మృతౌ ॥ **292**

సప్తమేఽగ్నిమితా ముద్రా భద్రం తుర్యపదాత్మకమ్ ।
ద్వయే త్రయోదశేశాశ్చ వాప్యశ్చాపి చతుర్దశ ॥ **293**

భద్రం తత్త్వమితం తుర్యే నవేశా దశ వాపికాః ।
భద్రం తత్త్వమితం షష్ఠే పంచేశా వాపికాశ్చ షట్ ॥ **294**

భద్ర తత్త్వమితం శేషం యథాపూర్వం ప్రకల్పయేత్ ।
అథవాఽఽద్యే పంచదశ శివా నేత్రేఽష్ట ముద్రికాః ॥ **295**

శివద్వయం త్రిషట్ పాదం త్రిషట్ పాదా చ ముద్రికాః ।
షట్తుర్యే పంచ ముద్రాః స్యుర్బాణే సింధుమితాస్తథా ॥ **296**

షష్ఠే ద్వే ముద్రికే ముద్రా గిరో ముద్రా గజైస్తథా ।
శివద్వయం వాపికే చ సప్తమాంతం భవేదిదమ్ ॥ **297**

భద్రమానం తత్త్వకోష్ఠ షట్షోడశరవిర్తు చ ।
వింశషోడశ భిశ్చాపి క్రమేణైవ ప్రకల్పయేత్ ॥ **298**

యద్వా ద్వౌ ముద్రికామేకాం మధ్యలింగం ప్రకల్పయేత్ ।
భద్రమిందుకులం కృత్వా తల్లింగం రచయేద్గజే ॥ **299**

భద్రే గజే తత్త్వకోష్ఠం శేషం సర్వం తు పూర్వవత్ ।
అథవాద్యత్రిపంక్తిషు పంచాబ్ధ్యగ్నిమితాంఛివాన్ ॥ **300**

నాల్గవపదమున 20 పదాత్మక భద్రమును ఏర్పరచునది. అంతట సమానముద్రల నడుమ రెండు పరుధులు. ముద్రసీమస్థానలింగమును అందియుండవలెను. వాటియొక్క అర్ధభాగము నాల్గవకోష్ఠకముగా ఉండును. లింగస్కంధగతకోష్ఠమున ఇష్టమగు రంగులను నింపవచ్చును. వల్లీ వాపులకు నడుమనుండు ఉపరితలములగు పదములను భద్రయొక్క శృంఖలాస్థానముగా వినియోగించునది. అట్లుగాకున్న, మొదట 10 ముద్రలు, అట్లే సీమాపరిధులు, నడుమ 12 పదములలో భద్రము. 2 పరిధులు, ఇట్లే ముందును పరిధులు. మూడవ వరుసలో 8 ముద్రికలు. 4 పదములచే భద్రము, 5 వ వరుసలో 5 ముద్రలు, 12 పాదములచే భద్రము, ఇచ్చట పరిధులు లేవు. 7వ వరుసలో 3ముద్రలు, 4పదములచే భద్రము, రెండవ వరుసలో 13లింగములు, వాపులు-14. 4వ వరుసలో 25 పదములచే భద్రము. 9లింగములు, 10వాపికలు. 6లో

25 పదాత్మకభద్రము. 5లింగములు, వాపికలు-6. 25పదాత్మక భద్రము. తక్కినదంతయును వెనుకటివలెనే. (295)

అదియుగాక, 1 వరుసలో 15 లింగములు. 2 లో 8 ముద్రికలు. 3 లో 6 పాదములవి రెండు లింగములు. 6పాదముల ముద్రికలు-6. 4లో 5ముద్రికలు. 5లో 4ముద్రికలు. 9లో 2ముద్రలు, 7లో 8ముద్రికలును, రెండు లింగంబులును, రెండు వాపికలును, ఇట్లు 7 వరుసలతో ఇదియొక విధానము. ఇందులో భద్రపరిమాణము వరుసగా- 25-6-16-3-20-16-16- కోష్టములు. (299) మరియొకవిధము- మొదట నొకముద్రికను, నడుమ లింగమును కల్పించి, 16కోష్ఠముల భద్రమును రచించి, ఆ గజమున ఆ లింగమును రచించునది. గజాకృతియందు వ్రాసిన భద్రము 25 కోష్టములది. తక్కినదంతయును వెనుకటిక్రమము. (300)

**ముద్రామన్యే నియోజ్యాథ మర్యాదాపరిధిస్తథా ।**
**భద్రసంఖ్యా తు ప్రథమా షట్పదా చ ద్వ్యార్కికా ॥ 301**

**ద్వితీయా వింశకోష్ఠా స్యాద్ ద్వే ద్వే వాప్యౌ చ లింగకే ।**
**రచయేత్పార్శ్వయోః సమ్యక్ శేషం సర్వం పురోదితమ్ ॥ 302**

**అథవోక్తాః ప్రథమతః సప్త షట్పంచతుర్యకాః ।**
**వహ్నిచంద్రచంద్రముద్రాః సీమాపరిధయస్తథా ॥ 303**

**షట్సు స్థానేషు చ శివాస్తుర్యమితాః స్మృతాః ।**
**విశేషస్తు లింగద్వయం బాణైస్త్రిషట్ త్రిషట్ పదమ్ ॥ 304**

**వాప్యోఽపి తన్మితాః కార్యా భద్రాణి వక్ష్యమాణతః ।**
**తత్త్వకోష్ఠం కలాకోష్ఠం తుర్యకోష్ఠ చ షట్పదమ్ ॥ 305**

**షట్పదం చ కలాకోష్ఠం శేషం సర్వం పురోదితమ్ ।**
**అథవా ప్రథమాద్యావత్పంచమస్థానకావధి ॥ 306**

**షట్ షట్ పంచ తుర్యవహ్ని ముద్రాశ్చ మధ్యశంకరాన్ ।**
**తుర్యనేత్రాక్షినేత్రాక్షిమర్యాదాపరిధీంస్తథా ॥ 307**

**విశేషస్తు లింగద్వయం బాణైః షట్ త్రిషట్ పదమ్ ।**
**భద్రసంఖ్యేందుకలేందుకలాకర్తురసాత్మికామ్ ॥ 308**

**ప్రకల్ప్యారచయేద్బుధ్యా శేషం సర్వం పురోదితమ్ ।**
**ఏనం నానావిధా భద్రా బహవః సంతి భో ద్విజ ॥ 309**

**ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గతే, శ్రీమత్ ఆనందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే శ్రీరామదాస విష్ణుదాస సంవాదే, లఘురామతోభద్రవిస్తారో నామ, చతుర్థః సర్గః ॥**

మొదటి మూడువరుసలలో 5-4-3 లింగములను ముద్రామధ్యమున విభాగించి, పిదప సీమాంత పరిధులను వ్రాయునది. భద్రపరిమాణ సంఖ్య 1-2-3 వరుసలలో క్రమముగా 6-12-20 కోష్టాత్మకము. అచ్చుటచ్చుట 2వాపికలును, 2లింగములును, ప్రక్కలలో వ్రాయునది. తక్కినది ముందువిధానమును అనుసరించునది. (303)

మరియొక విధము- మొదటినుండి 4-5-6-7 వ వరుసలలో 1-2-3-3 ముద్రలు. అట్లే సీమాపరిధులును. 6 స్థానములలోను 44 పదముల లింగములు, విశేషమేమనిన రెండు లింగములు 68-68 పదములవి. అట్టివే వాపికలు. 6 వరుసలలోను భద్రములు 25-16-4-6-6-16 కోష్ఠ పరిమితములు. తక్కినది ముందువలెనే (306).

ఇక 5 వరుసలుగలది-12-3-4-5 లో 6-6-5-4-3 నడుమలింగములుగల ముద్రికలును, 4-2-2-2-2 మర్యాదా పరిధులును, విశేషమేమనిన రెండు లింగములు- 68-68 పదములవి. భద్రసంఖ్య 16-16-12-6-6 నుండును. ఇట్లు బుద్ధితో పరికల్పించునది. తక్కినది పూర్వోక్తము.

ఓ విష్ణుదాసా! ఇట్టివి ప్రభేదములు అనేకములు గలవు. అని శ్రీరామదాసముని నిరూపించెను.

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో శ్రీరామదాస-విష్ణుదాసుల సంవాదరూపమైన లఘుశ్రీరామలింగతోభద్రవిస్తారమును వివరించు 4వ సర్గ ముగిసినది.**

# పంచమః సర్గః-5వ సర్గ

రామలింగతోభద్రరచన

శ్రీరామదాస ఉవాచ

పూర్వోక్తశ్రేష్ఠముదీర్య రామతోభద్రవిస్తరాన్ ।
వదామ్యహం తవాగ్రే హి విష్ణుదాస శృణుష్వ తాన్ ॥ 1

తిర్యగూర్ధ్వరక్తరేఖా ఏకషష్టిమితాః శుభాః ।
అంతాత్కృష్ణరక్తశుక్లపీతాః పరిధయః క్రమాత్ ॥ 2

ద్వాదశాంతే పీతకృష్ణరక్తశుక్లాః పునః స్మృతాః ।
పంచమః పీతవర్ణోఽపి సర్వతోభద్రమాలిఖేత్ ॥ 3

బహిః పంక్తౌ ద్వాదశాంతే సీమాపరిధయః స్మృతాః ।
పీతా వా లోహితాః కార్యా మధ్యే ద్వౌ పరిధీ స్మృతౌ ॥ 4

తతో మధ్యగేహయోర్ద్వే ముద్రికే వేదవర్ణకే ।
చతుఃపార్శ్వేషు చత్వారి నామాని పూర్వవల్లిఖేత్ ॥ 5

కోణగేహేషు కోణేందుస్త్రిపదః శుక్లవర్ణకః ।
ఏకాదశపదా కృష్ణా శృంఖలా పీతవర్ణకా ॥ 6

దశపదా శృంఖలాఽన్యా వల్లరీ హరితా స్మృతా ।
ఏకోనవింశత్పదజా భద్రం రక్తం నవాత్మకమ్ ॥ 7

త్రయోదశపదా వాపీ సితాఽన్యత్ త్రిపదాత్మకమ్ ।
రక్తం భద్రం పీతభద్రం తిర్యఙ్నవపదాత్మకమ్ ॥ 8

భద్రయా శృంఖలా రక్తా ద్విపదైవ సమంతతః ।
అష్టముద్రాత్మకం రామతోభద్రం తే మయోదితమ్ ॥ 9

త్యక్త్వా పీతాం శృంఖలా వా లింగం కృష్ణ త్రిషట్పదమ్ ।
ఖండవాప్యశ్చతుష్పాదజా భద్రం లోహితం రసైః ॥ 10

**తిర్యగ్భద్రం పీతవర్ణే విధిజం వేదజం తథా ।**
**లింగోర్ధ్వం మాలికా రక్తా త్రిపదా వా త్రిలోచనా ॥ 11**

## వివిధ రామతోభద్ర లింగరచనాక్రమము.

శ్రీరామదాసముని యిట్లు చెప్పుచున్నాడు, “విష్ణుదాసా! వినుము. ముందు చెప్పబడిన శ్రేష్ఠ ముద్రికలుగల సర్వతోభద్రయంత్ర విస్తారమును వివరించెదను....

నిలువుగను, అడ్డముగను 61 రేఖలు గీసి, చివరనుండి వానికి నలుపు, ఎరుపు, తెలుపు, పసుపు వన్నెలపరిధులను నాల్గింటిని ఏర్పరచునది. 12వ వరుసకు కడపట మరల పసుపు, నలుపు, ఎరుపు, తెలుపు రంగుల పరిధులను ఏర్పరుచునది. 5వ వరుస పసుపురంగు. ఇట్లు సర్వతో భద్రమును వ్రాయునది. అంత నడుమ యిండ్లలో వేదవర్ణములైన నాల్గు రంగులు గల రెండు ముద్రికలు వ్రాయునది. నాల్గుప్రక్కలలోను మునుపువలే నాల్గు నామములను వ్రాయునది. మూలలలో చంద్రరేఖ మూడేసియిండ్లు తెల్లనివి, 11యిండ్లతో నల్లనిగొలుసు, 10 యిండ్లతో మరియొక పసుపు గొలుసు, 19యిండ్లతో పచ్చనితీగె వీటిని లిఖించునది. 9పదాత్మక రక్తభద్రము, 13పదములతో వాపిక తెల్లనిది, అంత త్రిపదాత్మక రక్తభద్రము. 9పదములది పసుపువన్నెతో నొకభద్రము. రెండు పదములచే ఒకయెఱ్ఱని సంకిలను అంతట వ్రాయునది. 8 ముద్రలుగల రామతో భద్రయంత్ర మనబడును. పసుపు సంకిలను వ్రాయక, నల్లని త్రిషట్పదాత్మకలింగము రెండు ఖండవాపికలు, నాల్గు పదములచే రెండు కమలములు, 6 పాదములతో ఎఱ్ఱని భద్రము, అడ్డపు భద్రములు రెండు పసుపువన్నెగలవి, వాటిలోనొకటి 9 పదములది, మరియొకటి నాలుగుపదములది. మూడు పదములచే లింగము మీద మాలికనువ్రాయునది. అట్లు గాకున్న లింగాకృతితో మాలికను వ్రాసినను సరియె. ఇది 8అష్టముద్రాత్మిక సలింగరామ భద్రయంత్రమగును. (11)

**అష్టముద్రాత్మకం చైతత్సలింగం రామభద్రకమ్ ।**
**తిర్యగూర్ధ్వం త్రిపంచాశద్రేఖాః సర్వం హి పూర్వవత్ ॥ 12**

**ముద్రికాపరిధీనాం చ షట్కం స్వేచ్ఛం ప్రపూరయేత్ ।**
**చతుర్ముద్రాత్మకం చైతత్సలింగం వాపిపూర్వవత్ ॥ 13**

**తిర్యగూర్ధ్వం త్రిసప్తాశ్చ రేఖాః కార్యాః సులోహితాః ।**
**తాసు చతుర్షు పార్శ్వేషు కార్యాః పరిధయః క్రమాత్ ॥ 14**

కృష్ణరక్తశుక్లపీతా ద్వాదశాంతే పదేషు చ ।
కార్యః పునశ్చతుః పార్శ్వే పరిధిః పీతవర్ణకః ॥ **15**

తదగ్రే రక్తవర్ణశ్చ పరిధిర్ద్వి సమంతతః ।
తతోఽష్టపదః పరితః పరిధిః పీతవర్ణకః ॥ **16**

తతః షష్ఠపదోర్ధ్వం చ పునః పీతాః ప్రకారయేత్ ।
అద్యస్థానే చ సీమాఖ్యాః పీతా పరిధయోఽథవా ॥ **17**

రక్తా వేదమితాః కార్యా ద్వాదశాంతే పదేషు చ ।
కోణగృహే పూర్వవచ్చ మధ్యే చ ముద్రికాత్రయమ్ ॥ **18**

తతోద్వితీయస్థానే హి చంద్రః కృష్ణా చ శృంఖలా ।
సప్తపదా వల్లరా చ చతుర్దశసు పాదికా ॥ **19**

వల్ల్యోర్నియోజనం కార్యం రక్తం భద్రం హి షట్పదమ్ ।
త్రయోదశపదా కార్యా వాప్యో వేదమితాః సితాః ॥ **20**

షడ్వింశత్పదజాః కార్యాస్త్రిశివాః కృష్ణవర్ణకాః ।
వాప్యస్త్రయోదశ లేఖ్యా హి లింగమధ్యే పదేషు చ ॥ **21**

రామతి రామనామాని మధ్యా కంకణవత్యపి ।
మూర్ధా చతుష్పదో జ్ఞేయః పాదాభ్యాం కంఠ ఈరితః ॥ **22**

చతుష్పదౌ లింగపార్శ్వౌ పాదస్కంధౌ హి షట్పదౌ ।
శివనేత్రస్థలే శుక్లే ద్వే పదే రచయేద్ధియా ॥ **23**

వాప్యుపరిష్ఠాచ్ఛేషాణి యాని హ్యష్టపదాని చ ।
తేషు రక్తాని త్రీణ్యాదౌ పంచ పీతాని చోపరి ॥ **24**

మధ్యేఽథ సర్వతోభద్రే పూర్వవచ్చైవ నో పరమ్ ।
సర్వలింగరామభద్రత్రయమేకం మయేరితమ్ ॥ **25**

ఏతద్ద్వాదశముద్రాభీ రామలింగాత్మకం శుభమ్ ।
అతిరమ్యం విచిత్రం చ రామతుష్ట్యర్థమీరితమ్ ॥ **26**

**తిర్యగూర్ధ్వమంకసప్త రేఖాః సర్వం హి పూర్వవత్ ।**
**చతుర్ముద్రాత్మకం భద్రం యథా తద్వచ్చ మధ్యమే ॥ 27**

**అద్యే తిస్రః స్థలే ముద్రా సీమాపరిధయస్తథా ।**
**మధ్యే త్రయస్త్రయో జ్ఞేయా అంతే ద్వౌ ద్వౌ శుభౌ స్మృతౌ ॥ 28**

**తతః షోడశ ముద్రాభీ రామతోభద్రమీరితమ్ ।**
**అంతర్గేహే కృతే లింగే సలింగం షోడశాత్మకమ్ ॥ 29**

**తిర్యగూర్ధ్వభూమిబాణవేదరేఖాః సులోహితాః ।**
**అష్టముద్రాత్మకం మధ్యే రామతోభద్రకం లిఖేత్ ॥ 30**

**తిర్యగూర్ధ్వం పరిధయః పీతాశ్చైవ సమంతతః ।**
**ద్వాదశాంతే రచనీయా బహిః పరిధయోఽపిచ ॥ 31**

**పూర్వవత్ కోణగేహాని ముద్రాణాం చ క్రమోఽధునా ।**
**ఉక్తే ద్వే ముద్రికే పూర్వం తదధో వేదముద్రికాః ॥ 32**

**మధ్యే సర్వత్ర పరిధిద్వయ నాన్యస్థల కదా ।**
**తతో రసమితో హ్యష్టవిశేషః పంచమే స్థలే ॥ 33**

**షణ్ముద్రికా వేద వాప్యశ్చతురశీతిపాదకాః ।**
**వాప్యంతర్గతకుండంచ కృష్ణం ద్వాదశపాదజమ్ ॥ 34**

ఇటు అటు 53 రేఖలుగీసి, తక్కినదానినంత మునుపటివలె గీయునది. ముద్రికాపరిధులను ఆరింటిని తెల్లనిరంగుతో ఏర్పరచునది, ఇది చతుర్ముద్రాత్మకము. ఇట్లే మునుపటివలె సలింగకమును. అడ్డము, నిలువు రేఖలు 73 టిని గీసి వెనుకటివలె ఊహించి గీయునది, 12 ముద్రలచే రామలింగాత్మక భద్ర చక్రమగును. ఇది మిక్కిలి రమ్యము, విచిత్రము, ఇందులో ఒక్కదానియందే- లింగాత్మక, రామాత్మక, భద్రాత్మక- మూడు రచనలు ఇమిడియున్నది. కావున ఈ ద్వాదశాత్మకము శ్రీరామ ప్రీతికరమై యుండును. ఇట్లే 79 రేఖలచే 16 ముద్రలుగల రామతో భద్రము, సలింగతో భద్రమును తెలియునది. ఇక 451 ఎట్టని రేఖలచే అష్టోత్తర సహస్రరామతోభద్రము ఏర్పడుచున్నది. (30)

**వాపీపార్శ్వేషు భద్రాణి చత్వారి లోహితాని చ ।**
**పృథక్ పృథక్ పంచదశపదైర్ జ్ఞేయాని తాని హి ॥ 35**

షష్ఠే స్థానే ద్వాదశైవ ముద్రా హ్యగ్రే చతుర్దశ ।
షోడశాష్టాదశావాథ వింశద్ద్వావింశముద్రికాః ॥ 36

చతుర్వింశాథ షడ్వింశా హ్యష్టావింశత్సుముద్రికాః ।
త్రింశద్ద్వాత్రింశన్ముద్రాణాం స్థానే షోడశ ముద్రికాః ॥ 37

వాప్యః షోడశ విజ్ఞేయా మధ్యే వాపీద్వయ స్మృతమ్ ।
అష్టోత్తరసహస్రం చ రామతోభద్రమీరితమ్ ॥ 38

తిర్యగూర్ధ్వం హి వస్వంకబాణరేఖాః సులోహితాః ।
సర్వలింగరామభద్రత్రయమేకం పురేరితమ్ ॥ 39

తదత్ర మధ్యే లేఖ్యం హి మధ్యముద్రాస్థలే శివః ।
ద్విసప్తాతపదైః కార్యః కృష్ణవర్ణః ప్రకారయేత్ ॥ 40

షట్త్రింశద్రామనామాని వై లేఖ్యాని చ హస్తతః ।
కృష్ణా తత్కర్ణికా కార్యా చతుర్భిశ్చ శిరః స్మృతః ॥ 41

కటిశ్చతుష్పదైః కార్యా పార్శ్వే ద్వాదశపాదజే ।
స్కంధా వింశత్పదైర్జ్ఞేయో మూలం వింశత్పదాత్మకమ్ ॥ 42

షడ్వింశపాదజే జ్ఞేయే ద్వే వాపీశకలే సితే ।
ద్వాభ్యాం శివశ్య వై నేత్రే సితే శేషపదాని హి ॥ 43

పంచ రక్తాని చత్వారి పీతాని శివకర్ణయోః ।
స్థానే తృతీయే ముద్రాశ్చ తిస్రో ద్వౌ శంకరౌ వరౌ ।
స్థానే చతుర్థే ముద్రాశ్చ చత్వారస్త్రిశివాః స్మృతాః ॥ 44

ఏవమగ్రే క్రమేణైవ విశేషం కథయామ్యహమ్ ।
స్థానే చతుర్దశే ముద్రాశ్చతుర్దశ శివాస్తథా ॥ 45

పంచదశే హి విజ్ఞేయా ఏవమగ్రే ధియా లిఖేత్ ।
కోణస్థగేహయోః కార్యౌ ద్వౌ శివౌ చ త్రిషట్పదౌ ॥ 46

అష్టముద్రాత్మకే భద్రే సలింగే చ కృతౌ యథా ।
ముద్రాభ్యో లింగవృద్ధిర్హి కర్తవ్యా చరమావధి ॥ **47**

స్థానే ద్వావింశతితమే ముద్రా ద్వాదశ చేరితాః ।
త్రయోవింశచ్చ లింగాని బహిః పరిధయస్తతః ॥ **48**

ఏవం యుక్త్యా రచనీయం శేషం సర్వం పురోదితమ్ ।
అష్టోత్తరసహస్రం చ రామలింగాత్మకం త్విదమ్ ।
రమాస వరిష్ఠం హి రాఘవస్యాతితుష్టిదమ్ ॥ **49**

తిర్యగూర్ధ్వం బాణశాస్త్రభూమిరేఖాశ్చ పూర్వవత్ ।
అష్టముద్రాత్మకం మధ్యే పరిధయః సమంతతః ॥ **50**

తిర్యగూర్ధ్వం ద్వాదశాంతే బహిః పరిధయస్తథా ।
మధ్యే సీమాపరిధిద్వయం నాన్యత్ స్థలే కదా ॥ **51**

నేత్రస్థానే వేదముద్రా విశేషశ్చ తృతీయకే ।
తిస్రో ముద్రాస్త్రిముద్రాశ్చ హ్యష్టమే చ చతుర్థకే ॥ **52**

పంచమే దశ ముద్రాశ్చ శేషం సర్వం పురోదితమ్ ।
అష్టోత్తరశతం రామతోభద్రం తే మయోదితమ్ ॥ **53**

తిర్యగూర్ధ్వం త్రిపూర్ణాక్షిరేఖాః కార్యాశ్చ పూర్వవత్ ।
సర్వలింగం రామభద్రవయమేకే పురోదితమ్ ॥ **54**

తదత్ర మధ్యే లేఖ్యం హి మధ్యముద్రా స్థలే సితా ।
వాపీ కార్యా ద్వాదశాంతే పరిధయశ్చ పూర్వవత్ ॥ **55**

తిర్యగూర్ధ్వం శుభా కార్యా బహిః పరిధయస్తథా ।
స్థానే తృతీయా ముద్రాశ్చ తిస్రో ద్వౌ శంకరౌ వరౌ ॥ **56**

చతుర్థే వేదముద్రాశ్చ త్రయస్తే శంకరాః స్మృతాః ।
పంచమే పంచ ముద్రాశ్చ చత్వారశ్చ హరా వరాః ॥ **57**

షష్ఠే స్థానే చ షణ్ముద్రాః శివాః సప్త ప్రకీర్తితాః ।
కోణస్థగేహయోః కార్యౌ ద్వౌ హరౌ చ త్రిషట్పదౌ ॥ **58**

అష్టముద్రాత్మకే భద్రే సలింగే చ కృతౌ యథా ।
స్థానే చ సప్తమే ముద్రాః సప్త లింగాని చాష్ట వై ॥ **59**

కోణస్థగృహయోః కార్యౌ ద్వౌ హరౌ చ త్రిషట్పదౌ ।
ఏతదష్టోత్తరశతం రామలింగాత్మకం స్మృతమ్ ॥ **60**

అట్లే 598 రేఖలచే ప్రస్తారం రచిస్తే అష్టోత్తర సహస్ర (1,008)రామలింగతోభద్రాసనము ఏర్పడును. శ్రీరామ ప్రీతికరమైన రామతో భద్రాసనము మిక్కిలి శ్రేష్ఠమయినది మరియును 195 రేఖలచే అష్టోత్తర రామతోభద్రమేర్పడును. అట్లే 203 రేఖలచే అష్టోత్తర రామలింగతో భద్రాసనమగును (60).

షష్ఠే స్థానే కోణగేహే౽థవా శంభుం న కారయేత్ ।
స్థానే తృతీయే ముద్రైకా వాప్యౌ ద్వౌ ద్వౌ హరావపి ॥ **61**

ఏతచ్ఛతాత్మకం భద్రం రామలింగాత్మకం మయా ।
అష్టోత్తరశతే రామతోభద్రే వహ్నిసద్మని ॥ **62**

షడేవ ముద్రాః కర్తవ్యా అంతే స్థానే హి పంచమే ।
పంచ ముద్రాః పంచ వాప్యః శతముద్రాత్మకం త్విదమ్ ॥ **63**

అష్టోత్తరసహస్రే శ్రీరామతోభద్రకే వరే ।
బాణస్థానే హి షడ్ వాప్యో వేదముద్రాః ప్రకారయేత్ ॥ **64**

సహస్రరామముద్రాణాం రామతోభద్రమీరితమ్ ।
అష్టోత్తరసహస్రే శ్రీరామలింగాత్మకాసనే ॥ **65**

స్థానే చతుర్దశే కోణగేహే శంభుం న కారయేత్ ।
ముద్రాస్థానే చ ద్వౌ వాప్యౌ మధ్యే క్వాపి న కారయేత్ ॥ **66**

సహస్రరామముద్రాణాం రామలింగాత్మకం త్విదమ్ ।
షోడశ రామతోభద్రే చాద్యస్థానే త్రిదిక్షు చ ॥ **67**

మధ్యముద్రాస్థలే వాప్యస్తిస్రః కార్యా మహత్తమాః ।
త్రయోదశాత్మకం చైతద్రామతోభద్రమీరితమ్ ॥ **68**

అథవాఽఽద్యస్థలే మధ్యముద్రాసు వేదదిక్షు చ ।
వేదవాప్యోఽపరే స్థానే తిస్రశ్చైవ త్రిదిక్షు చ ॥ **69**

వాప్యశ్చైతద్విజ్ఞాతవ్యం నవముద్రాత్మకం శుభమ్ ।
రామతోభద్రకం రమ్యం రాఘవస్యాతిహర్షదమ్ ॥ **70**

తిర్యగూర్ధ్వం బాణపూర్ణ భూమిరేఖాశ్చ పూర్వవత్ ।
త్రయోదశాత్మకం మధ్యే స్థానే తు ముద్రికాత్రయమ్ ॥ **71**

ముద్రామధ్యే హి ద్వౌ వాప్యౌ పరిధయోఽర్కమధ్యమాః ।
ద్వౌ ద్వౌ సర్వత్ర సంయోజ్యౌ తత్త్వముద్రాత్మకం త్విదమ్ ॥ **72**

జ్ఞాతవ్యం రామతోభద్రం తోషదం తత్త్వవాదినామ్ ।
కోణగేహేషు లింగాని నేత్రస్థానే హి పశ్చిమే ॥ **73**

కార్యం వాపీస్థలే లింగం పంచవింశతిమం వరమ్ ।
పంచవింశతిముద్రాభీ రామలింగాత్మకం త్విదమ్ ॥ **74**

అథోచ్యంతే దైవతాని రామాసనభవాని చ ।
మధ్యేఽథ సర్వతోభద్రే సమావాహ్యాత్ర తత్సురాన్ ॥ **75**

అష్టోత్తర (1,008) సహస్ర రామతోభద్రమున కొన్నిమార్పులచే సహస్ర రామముద్రాన్విత రామతోభద్రాసనమును, అష్టోత్తర సహస్రరామలింగతోభద్రమున కొంత వ్యత్యాసముచేత సహస్ర(1000)రామ ముద్రలయొక్క రామలింగాత్మకాసనము అగును. ఇంతకు మునుపు జెప్పిన షోడశ రామతోభద్రమున అద్యస్థానమున మూడుదిక్కులలోను, మధ్య ముద్రాస్థలమున వాపికలు మూడింటిని ఏర్పరచిన అది త్రయోదశరామతో భద్రాసనమగును. అదియునుగాక ఆద్యస్థలమున మధ్యముద్రలయందు నాల్గు దిక్కులయందును 4వాపికలును, తక్కిన స్థలములలో మూడు దిక్కులయందు మూడు వాపికలను వ్రాసిన అది మంగళమగు నవముద్రాత్మక రామతోభద్రాసనమగును, ఇది శ్రీరాములవారికి సంతోషప్రదమైనది (70). మరియు 105 రేఖలతో మునుపటివలే రామతోభద్రమును ఏర్పరచి, దాని నడుమ 13పదముల పరిమాణముగల ముద్రాత్రయమును, ముద్రామధ్యమున రెండు

వాపికలను, అర్కమధ్యమములగు పరిధులను రచించి, అంతట 'రెండేసి చేర్చి వ్రాసిన అది తత్త్వ ముద్రాత్మక రామతో భద్రమగును. ఇది తత్త్వవాదులకు సంతోషప్రదము, మూలయింఢ్లలో లింగములను వ్రాయుచు, పశ్చిమభాగమున నేత్రస్థానమనగా రెండవ వరుసలో వాపికాస్థలమున నిరువదియైదవ లింగమును లిఖించునది. ఇది 25 ముద్రలతో రామలింగాత్మకమగును.(74)

తతో బహిస్తు లింగేషు రుద్రం వాపిషు వై నలమ్ ।
సుగ్రీవం తత్ర భద్రేషు తిర్యగ్ భద్రేషు వై గతమ్ ॥ 76

పీతాసు చ శృంఖలాసు హ్యంగదం పరికల్పయేత్ ।
పీతశృంఖలాభావే తం తిర్యక్ భద్ర చతుష్పదే ॥ 77

కృష్ణవర్ణ శృంఖలాసు సమావాహ్య విభీషణమ్ ।
వల్లీషు చ జాంబవంతం మైందం ఖండేందుషు స్మరేత్ ॥ 78

ద్వివిధం పరిధిష్వేవ ముద్రాయాం రాఘవం స్త్రియా ।
ముద్రాయాః పశ్చిమే చాథ దక్షిణే హ్యుత్తరం పురః ॥ 79

లక్ష్మణం భరతం చాపి శత్రుఘ్నం వాయునందనమ్ ।
పూజ్యపూజకయోర్మధ్యే జ్ఞేయా పూర్వదిగేత్ర హి ॥ 80

సితాపరిధిష్వత్రైవ సుషేణం పరిచింతయేత్ ।
సర్వత్ర పదమాత్రేషు చింతయేత్ సర్వవానరాన్ ॥ 81

బహిస్త్రిపరిధిష్వేవ త్రివేణీం పరిచింతయేత్ ।
చతుర్దిక్పాలాభిముఖా హరా రుద్రాశ్చ వాపికాః ॥ 82

కర్తవ్యా వాత్మాభిముఖాః కార్యా వా పద్మసంముఖాః ।
చతుర్దిక్పాలాభిముఖా ఎవ భద్రేషు మేఽకథి ॥ 83

పక్షత్రయే వరిష్ఠాస్తా వదంతీత్థం మునీశ్వరాః ।
పూర్వోక్తభద్రే దేవాన్ హి సంపూజ్యాదౌ తతః పరమ్ ॥ 84

సమారభేద్రాఘవస్య శ్రేష్ఠాం పూజాం సవిస్తరామ్ ।
పద్మస్య కర్ణికాయాం చ ససీతం రాఘవం న్యసేత్ ॥ 85

**అష్టపద్మదళేష్వేవ తస్యావరణదేవతాః ।**
**పూజయేదితి సర్వత్ర బుధైస్తు పరికథ్యతే ॥ 86**

**పద్మే సంకోచమాలక్ష్య ప్రకారాంతరముచ్యతే ।**
**సర్వతోభద్రకమలే ధాన్యరాశౌ ఘటం న్యసేత్ ॥ 87**

**జలపూర్ణం చ తస్యాస్యే కేతకీపత్రపూరితే ।**
**తామ్రపాత్రం విస్తృతం చ న్యస్య తండులపూరితమ్ ॥ 88**

**తత్ర వస్త్రం సావరణం రామచంద్ర ప్రపూజయేత్ ।**
**శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ ॥ 89**

ఇక రామాసనభవములగు దేవతలను చెప్పెదను- నడుమ సర్వతోభద్రమున దేవతలను ఆవహించునది. అంత వెలుపల లింగములలో రుద్రునిని, వాపికలయందు నళునిని, అచ్చటి భద్రములలో సుగ్రీవుని, తిర్యగ్భద్రములలో గవునిని, పసుపు సంకిళ్లలో అవిలేనియెడల చతుః పాదతిర్యగ్భద్రమున అంగదునిని, నల్లని సంకిళ్లలో విభీషణుని, తీగెలలో జాంబవంతుని, మూలల్లో నుండు అర్ధచంద్రాకృతులలో మైందుని, పరిధులలో ద్వివిదుని, ముద్రికయందు సీత తోడ శ్రీరామమూర్తిని, దానికి పడమట లక్ష్మణుని, దక్షిణమున భరతుని, ఉత్తరమున శత్రుఘ్నుని, తూర్పున ఆంజనేయుని భావించునది. ఇచ్చట పూజ్య పూజక మధ్యమున పూర్వ(తూర్పు)దిక్కు గల్గియుండవలెను. సీమాపరిధులలో సుషేణుని స్మరించునది, ప్రతిపదమునను సమస్త వానరులను భావించునది. వెలుపటి మూడు పరిధులలో త్రివేణిని భావించునది, నాల్గుదిక్పాలకులకు అభిముఖముగా ఉండునట్లు లింగములను వాపికలు ఏర్పరచునది. తనకు సమ్ముఖములు(ఎదురు)గా గాని నడుమనుండు పద్మాభిముఖముగాగాని చేయవచ్చును. ఐన దిక్పాలాభిముఖములుగా వ్రాయుట మూడు పక్షములలో ఉత్తమము. ఇట్లు మునీంద్రులందురు. మొదట పూర్వోక్త భద్రమున దేవతలను పూజించి, పిదప సవిస్తరమును శ్రేష్ఠము అయిన శ్రీరామపూజను ఆరంభించవలెను. కమలకర్ణికయందు సీతారాములను ఆవాహన చేయునది. 8 పద్మ దళములలో ఆవరణదేవతను అనుసంధానము చేయునది. (88) పద్మ సంకోచభావమును భావించి మరియొక క్రమమును చెప్పెదను.

**మనోమయీ మణిమయీ ప్రతిమాఽష్టవిధా స్మృతా ।**
**సర్వేషు రామభద్రేషు ముద్రాపూజ్యో రఘూత్తమః ॥ 90**

**పూజకశ్చ శివో జ్ఞేయో భద్రాద్యా రామపార్షదాః ।**
**శ్రీరామలింగతోభద్రమత ఏవోచ్యతే బుధైః ॥ 91**

ఏవం నానావిధా భేదా బహవః సంతి భో ద్విజ ।
శ్రీమద్రామతోభద్రాణాం యేషాం సంఖ్యా న విద్యతే ॥ 92

మయా భేదాః కియంతోఽత్ర తవాగ్రే వినివేదితాః ।
నరైర్బుద్ధ్వా ప్రకర్తవ్యాః పూజనార్థం రమాపతేః ॥ 93

హేమతంతుభవం చైవం కార్యమాసనముత్తమమ్ ।
రాఘవార్థం మహచ్ఛ్రేష్ఠం రౌప్యతంతుభవం తు వా ॥ 94

అథవా పట్టకూలస్య చైవ కార్య వరాసనమ్ ।
అథవా లేఖయేత్పత్రే సర్వాభావే ధ్వజోత్తమైః ॥ 95

భూర్జపత్రే విలిఖితం విశేషాత్సిద్ధిదం నృణామ్ ।
వా వస్త్రోపరి లేఖ్యం వా కర్తవ్యం చిత్రతంతుభిః ॥ 96

వినాసనేన యా పూజా సా పూజా నిష్ఫలా భవేత్ ।
రామభద్రాసనే పూజా సా పూజాఽతిఫలప్రదా ॥ 97

యద్యద్రామపరం కర్మ తత్తచ్చ ద్విజపుంగవైః ।
రామాసనస్థితం రామం పురస్కృత్య సమారభేత్ ॥ 98

రామభద్రాసనైర్హీనం యత్కర్మ తచ్చ నిష్ఫలమ్ ।
తస్మాదేవం స్వమేవైతత్కర్తవ్యం రామపూజనే ॥ 99

అష్టోత్తరసహస్రం చ రామలింగాత్మకం హి యత్ ।
ఆసనం తద్వరిష్ఠం హి రాఘవస్యాతితోషదమ్ ॥ 100

సర్వతోభద్ర మధ్యకమలముమీద ధాన్యరాశియందు ఘటమును ఉంచునది. దానిలో నీళ్లునింపి, మొగలిరేకులను నింపి, బియ్యము నింపిన వెడల్పుగు తామ్రకలశమును దానిపైపెట్టి, దానిపై వస్త్రమునుకప్పి, సపరివార శ్రీరామమూర్తిని అచ్చట పూజించునది.(88) రాతితో ఏర్పరచినది, లేదా కొయ్యతో చేసినది, లేదా లోహముచే చేసినది, లేదా లక్కతో చేసినది, లేదా చిత్రించబడినది, లేదా ఇసుకతో ఏర్పరచినది, మనోమయము, రత్నకల్పితము అనునివి 8 విధముల ప్రతిమలు. అంతట రామతోభద్రమున ముద్రారూపి శ్రీరాముని పూజించునది. పూజచేయువాడు శివుడు. భద్రాదులు రామపరివారము. కావుననే శ్రీరామ లింగతోభద్రమని పెద్దలు చెప్పెదరు.

శ్రీరామదాసా! వినుము, ఇట్లే నానావిధములగు భేదములు అనేకములు గలవు. శ్రీవిష్ణు పూజనమునకై పురుషులు బుద్ధిశక్తిచే కల్పించుకొనవలయును. అవి అపారములు. నేను చెప్పిన ప్రభేదములనగ ఎంతటివి? (93). శ్రీరామునికొరకు బంగారు సరిగతోచేసిన ఆసనము పరమశ్రేష్ఠము. లేకపోయిన వెండి సరిగెతోనయినను సరియే. అదిగూడ లేకపోయిన పట్టువస్త్రముతో చేయునది. సర్వాభావమున పత్రమునందు వ్రాయునది. భూర్జపత్రమున వ్రాయుట మిక్కిలి సిద్ధిప్రదము. వస్త్రముమీద చిత్రతంతువులచే వ్రాసినను సరియే. ఆసనములేనిపూజ నిష్ఫలము. రామభద్రాసనము నందు చేయుపూజనము అధిక ఫలదాయకము. శ్రీరామపరమగు పూజాదికకర్మ యేదిగానీ సర్వమును సర్వతోభద్రాసనముమీద చేయవలెను. అట్లు చేయనిది వ్యర్థము. ఇక ఆయా ఆసనములలో అష్టోత్తర సహస్ర రామలింగతో భద్రాసనము శ్రీరామమూర్తికి మహానందప్రదమగుటచే అది అత్యంత శ్రేష్ఠము.

**తదధో రామతోభద్రమష్టోత్తరసహస్రకమ్ ।**
**తదధోః రామలింగాఖ్యమష్టోత్తరశతాత్మకమ్ ॥ 101**

**తదధో రామతోభద్రమష్టోత్తరసహస్రకమ్ ।**
**తదధః పంచవింశచ్ఛ్రీరామభద్రాసనం శుభమ్ ॥ 102**

**తదధో రామతోభద్ర షోడశాత్మకమీరితమ్ ।**
**త్రయోదశాత్మకం రామతోభద్ర తదధః స్మృతమ్ ॥ 103**

**ద్వాదశం చ నవాఖ్యం చ హ్యష్టముద్రాత్మకం తథా ।**
**చతుర్ముద్రాత్మకం వాపి పూర్వతశ్చాపరం హ్యథః ॥ 104**

**ఏవం క్రమేణ జ్ఞేయాని రామభద్రాసనాని హి ।**
**శ్రేష్ఠాసనేషు యా పూజా తస్యాః శ్రేష్ఠం ఫలం స్మృతమ్ ॥ 105**

**లఘ్వాసనేషు యా పూజా తాదృశం తత్ఫలం స్మృతమ్ ।**
**ఏవం జ్ఞాత్వా ఫలం బుద్ధ్వా శ్రేష్ఠమేవాసనం శనైః ॥ 106**

**యత్నేనైవ ప్రకర్తవ్యం రామోపాసనం మానవైః ।**
**ప్రతివర్షే నవీనం చ కార్యమాసనమాదరాత్ ॥ 107**

**ఏకస్మిన్హ్యాసనే పూజ న వర్షాదూర్ధ్వతః శుభా ।**
**ఏవం శిష్యాసనానాం చ భేదాః పృష్టాస్త్వయా పురా ॥ 108**

తవాగ్రే హి మయాఖ్యాతాః శ్రీరామస్యాతితోషదాః ।
త్వత్పృష్టరామతోభద్రవర్ణనస్య ప్రసంగతః ॥ 109

స్మారితా రామచంద్రస్య కించిల్లీలా మయాఽద్య హి ।
వదామ్యహం తవాగ్రే తాం త్వం శృణుష్వ ద్విజోత్తమ ॥ 110

ప్రత్యబ్దం శ్రావణే మాసే గురువాక్యాద్రఘూత్తమః ।
చత్వారింశట్టంకమితసువర్ణస్య పృథక్ పృథక్ ॥ 111

ప్రత్యహం లక్షలింగాని కృత్వా పత్న్యా యుతోఽర్చయేత్ ।
అష్టోత్తరసహస్రైశ్చ లింగైర్యద్భద్రముత్తమమ్ ॥ 112

తచ్ఛంభోరాసనం జ్ఞేయం మహాప్రీతివివర్ధనమ్ ।
తన్మధ్యగతకమలే చైకం లింగం నివేశ్య చ ॥ 113

షోడశైరుపచారైస్తత్సంపూజ్య స రఘూత్తమః ।
హేమముద్రాం దక్షిణార్థం దత్వా సంపూజ్య భూసురమ్ ॥ 114

తస్మై లింగం సాసనం తద్దదౌ ప్రత్యేకమాదరాత్ ।
ఏవం స కోటిలింగాని త్రయస్త్రింశద్దినైర్దదౌ ॥ 115

రామసహస్ర భద్రముకంటే చిన్నది అష్టోత్తర శతరామతో భద్రము. దానికి తక్కువ అష్టోత్తరశత రామలింగతో భద్రము. అంతకు తక్కువ అష్టోత్తర శతలింగతోభద్రము. 25 రామతో భద్రము అంతకన్నను తక్కువ. 16-13-12-9-8-4 ముద్రాత్మక సర్వతోభద్రములు ఇట్లు వెనుకటిదాని కన్నను తక్కువ. ముందరిది తక్కువగా నెంచునది. ఇట్లు రామభద్రాసనమలను ఎరుగునది. శ్రేష్ఠాసనము న చేయుపూజ శ్రేష్ఠమై యుండును. లఘ్వాసనమున చేయునది దానికి తగినట్లు ఫలమునిచ్చును. ఇట్లు ఫలమును గుర్తించి తిన్నగా భజనపరుడగు పురుషుడు యత్నించి శ్రేష్ఠాసనమును ఏర్పరచునది.

ప్రతిసంవత్సరము శ్రీరామాసనములను వేర్వేరుగా ఏర్పరుపవలయును. పాతది పనికిరాదు. శిష్యుడా! నీవడిగిన ఆసన క్రమములను ఇట్లు ఉపదేశించితిని. ఇవి శ్రీరామప్రీతికరములు. (108). ఇట్లు నీవడిగిన శ్రీరామతో భద్రప్రసంగవశమున శ్రీరామచంద్రస్వామియొక్క చిన్న వినోదలీల ఒకటి జ్ఞాపకమువచ్చెను. దానినిప్పుడు చెప్పెదను వినుము.

## కోట్లకొలది శివలింగార్చన

శ్రీరాముడు గురువాక్యమును అనుసరించి ప్రతిసంవత్సరము శ్రావణమాసమున ఒక్కొక్క లింగమును, 40టంకములతో అనగా 160రూప్య పరిమాణ సువర్ణముతో ఏర్పరచి, అట్టి లక్ష లింగములను సీతాదేవితోకలసి ప్రతినిత్యము పూజించును. అష్టోత్తర సహస్రలింగములతోడ ఏర్పరచునట్టి భద్రాసనమేది గలదో అది శివప్రీతివర్ధకమగు ఉత్తమాసనము. దానియొక్క మధ్యకమలమునందు ఒక లింగమును ప్రతిష్ఠించి, దానికి షోడశోపచారములను ఆచరించి, దానికి ఒక సువర్ణ ముద్రికను దక్షిణపెట్టి, బ్రాహ్మణుని పూజించి, అతనికి ఆ ఆసనముతో కలిపి లింగము దానము చేసెను. ఇట్లు వేర్వేరుగా ముప్పదిమూడు దినములలో కోటిలింగములను దానముచేసెను.

ఏవం వ్రతం శ్రావణే హి ప్రతివర్షేఽకరోద్విభుః ।
దివ్యైరాభరణైర్వస్త్రైర్ద్విజా రామార్పితైర్బభుః ॥ **116**

హేమతంతుసముద్భూతాన్యకరోదాసనాని సః ।
ఉద్యాపనం చ హవనం చకార రఘునందనః ॥ **117**

విష్ణుదాస ఉవాచ

అష్టోత్తరసహస్రైర్యల్లింగతోభద్రమీరితమ్ ।
కథం కార్యం తస్య భేదా విస్తరాద్వక్తుమర్హసి ॥ **118**

హేమతంతుసముద్భూతమకరోదాసనం విభుః ।
స హైమాన్యపి లింగాని చాకరోచ్చ వరాణి హి ॥ **119**

దివ్యైరాభరణైర్వస్త్రైరకరోత్స ద్విజార్చనమ్ ।
అశక్తౌ తత్ వ్రతం సిద్ధ్యేత్కథం తద్వక్తుమర్హసి ॥ **120**

శ్రీరామదాస ఉవాచ

శక్తౌ చ పట్టకూలస్య కంబళస్యాథవా నరైః ।
కార్యం తదథవా వస్త్రైస్తంతుభిశ్చ ప్రకారయేత్ ॥ **121**

లేఖ్యం వస్త్రేఽథవా రంగైర్లేఖ్యం పత్రాదిసంస్థలే ।
అశక్తౌ రాజతాన్యేవ లింగాని తామ్రజాని చ ॥ **122**

కింవా పారదభూతాని స్ఫాటికాన్యోపలాని వా ।
దారుజాని చందనైర్వా గోమయేన మృదాఽపి వా ॥ **123**

**కృత్వా లింగాని పూజ్యాని స్వశక్త్యా పూజయేద్ద్విజాన్ ।**
**ఇదానీం లింగతోభద్రరచనాం తే వదామ్యహమ్ ॥ 124**

ఇట్లు శ్రీరాముడు వ్రతమును శ్రావణమాసమున ప్రతిసంవత్సరము ఆచరించెను. శ్రీరామ ప్రభువు ఇచ్చిన దివ్య వస్త్రాభరణములచే బ్రాహ్మణులు ప్రకాశించిరి. శ్రీరాముడు బంగారు సరిగెతోడనే ఆసనములను ఏర్పరచెను. వ్రతాంగ హోమములను ఉద్యాపనమునుగూడ ఆచరించెను. (117)

అంత ఆ విష్ణుదాసు; గురువులవారూ! అష్టోత్తర సహస్రలింగతోభద్రమని చెప్పితిరే, దాని భేదములను విస్తరింపుడు. విభుడగు శ్రీరాముడు బంగారు సరిగెతో ఆసనమును, బంగారుతో లింగములను చేసి, వస్త్రాభరణములచే విప్రులనారాధించెనంటిరి. శక్తిలేనివానికి ఎట్లు ఈ వ్రతము సిద్ధింపగలదు? సెలవివ్వండి. అని అడుగగా గురువగు రామదాసముని యిట్లు చెప్పుచున్నాడు. (120).

శక్తియుండిన పట్టువస్త్రమునందుగాని, కంబళిమీదగాని, సాధారణ వస్త్రముమీదగానీ, ఆయా తంతువుల చేతనే కుట్లువేసి వ్రాయునది. అది గాకున్న ఆ వస్త్రముమీద రంగులతో గీయునది. మరి శక్తిలేకపోయిన వెండి లింగములనుగాని, రాగి లింగములను గాని, రస లింగములను గాని, స్ఫటిక లింగములను గాని, కొయ్యతో చేసిన లింగములనుగాని, శ్రీగంధ లింగములనుగాని, గోమయ లింగములను గానీ, చివరకు మట్టిలింగములనుగాని చేసి, పూజించి, తనశక్తి కనుగుణముగా బ్రాహ్మణులను పూజించునది. ఇక అష్టోత్తర సహస్రలింగతో భద్రరచనాక్రమమును చెప్పెదను.

**తిర్యగూర్ధ్వం రక్తరేఖా ద్వే శతేష్టాఽదశ స్మృతాః ।**
**తాసాం పదానామేకేన పూర్వసంఖ్యా భవేదిహ ॥ 125**

**పీతాః పరిధయః కార్యాః షట్పదాంతేఽత్ర సర్వతః ।**
**యుగేందుసంమితాస్తేషు లింగాది రచయేద్ధియా ॥ 126**

**చతుష్కోణేషు శశినస్త్రిపదైః పరికల్పయేత్ ।**
**తదగ్రే శృంఖలా పంచపాదైః కార్యా చ సర్వతః ॥ 127**

**ఏకాదశపదా వల్లీ వాపీ త్రిదశపాదికా ।**
**అష్టాదశపదైః శంభుః సర్వత్రైవం లిఖేత్ క్రమాత్ ॥ 128**

**తత్ర ప్రథమపరిధేరర్వాక్ లింగాని యోజయేత్ ।**
**త్రిరేకాదశసంఖ్యాని వాప్యస్త్వేకాధికాస్తతః ॥ 129**

భద్రేఽర్కార్కపదైః కార్యా ద్వితీయే లింగసంతతిః ।
ఏకత్రింశన్మితా కార్యా భద్రే నవనవాత్మకే ॥ 130

తృతీయ నవనేత్రేశసంఖ్యా భద్రే తు షట్ పదే ।
తుర్యే షడ్వింశలింగాని భద్రేఽర్కార్కపదే మతే ॥ 131

పంచమే తుర్యనేత్రేశా భద్రే నవనవాత్మకే ।
షష్ఠే ద్వాదశలింగాని భద్రే షట్ షట్ పదే స్మృతే ॥ 132

సప్తమే లింగవితతిరేకోనవింశత్సంఖ్యకాః ।
భద్రేర్కాఽర్కపదే జేయేఽష్టమే సప్తదశేశ్వరా ॥ 133

భద్రే నవనవపదే నవమే మనుశంకరాః ।
భద్రే శశికలాసంఖ్యే దశమేఽర్కమితాః శివాః ॥ 134

భద్రేర్కాఽర్కపదే జ్ఞేయే తథా త్వేకాదశే దశ ।
శివా నవ నవపదే భద్రే జ్ఞేయే మనోరమే ॥ 135

ద్వాదశే సప్త లింగాని భద్రే చంద్రకలాత్మకే ।
త్రయోదశే పంచ హరా భద్రేఽర్కార్కపదే మతే ॥ 136

చతుర్దశే త్రిలింగాని భద్రే నవనవాత్మకే ।
చరమే తతస్తు రచయేత్సర్వతోభద్రముత్తమమ్ ॥ 137

ఖండేందుస్త్రిపదః కోణే శృంఖలా షట్పదాత్మికా ।
త్రయోదశపదా వల్లీ వాపీ తత్త్వమితిర్మతా ॥ 138

భద్రే షోడశ షోడశపదేఽంతః పరిధిర్భవేత్ ।
తదంతరే పంచ పంచ పదైః పద్మం సముద్ధరేత్ ॥ 139

విచిత్రం చిత్రవర్ణం చ శ్వేతేందుః శృంఖలాఽసితా ।
వాపీ శుక్లాఽసితః శంభూ రక్తం భద్రం ప్రకల్పయేత్ ॥ 140

నీలా వల్లీశ్వరస్కంధకోష్ఠాశ్చిత్రా యథారుచి ।
యత్ర యత్ర పదానీహ శేషభూతాని తాని తు ॥ 141

యథాయోగ్యం ధియా తత్ర శృంఖలార్థే నియోజయేత్ ।
శుక్లరక్తకృష్ణవర్ణా హ్యేతే పరిధయస్త్రయః ॥ 142

వా పూర్వపీతపరిధిం దత్త్వా దేవాస్త్రైయస్తతః ।
ఏతేషాం పరిధీనాం వై పదాన్యష్టాధికాని హి ॥ 143

నోక్తాని పూర్వసంఖ్యాయా జ్ఞాత్వేత్థం వృద్ధిమాచరేత్ ।
అగ్రేప్యేఽవం హి బోద్ధవ్యం పరిధీనాం చతుష్టయే ॥ 144

ఏతదష్టోత్తరదశశతం భద్రం లింగోద్భవం స్మృతమ్ ।
ఏకస్త్వయం ప్రకారో హి ప్రకారాంతరముచ్యతే ॥ 145

ద్వే శతే సప్త పంచాశద్రేఖాః పూర్వోత్తరాః స్మృతాః ।
పీతాః పరిధయః కార్యాః షట్పదాంతేఽత్ర సర్వతః ॥ 146

సప్తేందుసంఖ్యా రచయేల్లింగానాం యోజయేద్ధియా ।
సర్వతస్తన్మితా చాద్యా నవనేత్రమితా పరా ॥ 147

సప్తాక్షిసంమితా త్వన్యా వక్ష్యమాణాని ధారయ ।
బాణాక్షాగ్నినయనా నేత్రనేత్రాథ వింశతిః ॥ 148

గజేందుగిరిచంద్రా చ బాణేందుహుతభుక్ శశీ ।
రుద్రా దశాన్యాష్టమితా షట్ చత్వారి త్రిచంద్రమాః ॥ 149

ప్రతిపంక్తిమేకవాపీ లింగేభ్యస్త్వధికా భవేత్ ।
చతుర్వింశత్పదం లింగం వాపీ వస్విదుపాదికా ॥ 150

218 ఎట్టని రేఖలచే అష్టోత్తర సహస్రలింగతోభద్రరచన ఒక ప్రకారముగా చెప్పబడినది. (145) మరియు అట్లే 257 రేఖలచే అష్టోత్తర సహస్రలింగతోభద్రరచన యిది ఒకవిధము. ఇట్లు వికల్పించి రెండువిధములుగా నిరూపింపబడియున్నది. (150)

భద్రసంఖ్యా క్రమేణైవ జానీయాద్వక్ష్యమాణతః ।
పూర్వపంక్తౌ చ పంచమ్యాం నవమ్యాం హి తథైవ చ ॥ 151

త్రయోదశ సప్తదశయోర్భద్రం వింశపదైః స్మృతమ్ ।
ద్వితీయాయాం చ షష్ఠ్యాం చ దశమ్యాం చ తనౌ తథా ॥ 152

చతుర్దశ్యాం స్మృతం భద్రం పంచవింశపదైః స్మృతమ్ ।
తృతీయాయాం చ సప్తమ్యామేకాదశ్యాం తథైవ చ ॥ 153

పంచదశ్యాం హి పంక్తౌ చ భద్రం త్రింశపదాత్మకమ్ ।
షడ్వింశద్భిః పదైర్భద్రం చతుర్థ్యాం చ తతః స్మృతమ్ ॥ 154

వస్వర్కషోడశీష్వేవ భద్ర షోడశపాదజమ్ ।
సర్వకోణేషు త్రిపదశ్చంద్రః శృంఖలికాపదైః ॥ 155

పంచభిరేకాదశభిర్లతా కార్యా తతోఽంతరే ।
సర్వతోభద్రకం రమ్యం చతుర్వింశైస్తు వాపికా ॥ 156

భద్రం నవపదం సర్వపార్శ్వేష్వేవం ప్రకల్పయేత్ ।
పరిధ్యంతర్భవేత్పద్మం రక్తం చిత్రం యథారుచి ॥ 157

కృష్ణం లింగం శృంఖలాఽపి భద్రం రక్తం చ వాపికా ।
శ్వేతః శశీ సితో జ్ఞేయస్తథా నీలా స్మృతా లతా ॥ 158

శిష్టానీహ పదాన్యేవ భద్రాద్యర్థం నియోజయేత్ ।
పీతశుక్లకృష్ణరక్తా హ్యంతే పరిధయః స్మృతాః ॥ 159

అష్టోత్తరసహస్రాఖ్యం లింగతోభద్రకం త్విదమ్ ।
ఏవం వికల్పతః ప్రోక్తా రచనా ద్వివిధా మయా ॥ 160

అథాన్యత్తే ప్రవక్ష్యామి ప్రకారాంతరముత్తమమ్ ।
సైకవింశచ్ఛతైర్లింగైర్లింగతోభద్రమాదరాత్ ॥ 161

అష్టాష్టరేఖాః ప్రాగ్ యామ్యాః పశ్చిమోత్తరదిక్షు చ ।
సప్తాశీతిపదేష్వేవ లింగానాం పంచ పఙ్క్తయః ॥ 162

తాసు ప్రాథమికాయాశ్చ విస్తారః కథ్యతేఽధునా ।
పృథక్ కోణేషు త్రిపదైః శశీ శ్వేతస్తదగ్రతః ॥ 163

శృంఖలా కృష్ణవర్ణా చ పదైః పంచభిరుత్తమా ।
తస్యాః పార్శ్వద్వయే కార్యే వల్ల్యౌ హరితవర్ణకే ॥ 164

పృథగేకాదశపదైస్తతః పీతే తు శృంఖలే ।
షడ్భిః పదైరుభయతో భద్రం షోడశపాదజమ్ ॥ 165

ఆరక్తం చ సితా వాప్యో దశాష్టాదశపాదజాః ।
కృష్ణాన్యష్టాదశపదైర్నవ లింగాని కారయేత్ ॥ 166

మస్తకోపరి భద్రస్య లోహితే శృంఖలే శుభే ।
ద్వాభ్యాం పదాభ్యాం చ పృథక్ మధ్యే హరిత శృంఖలా ॥ 167

రచితా త్రిపదా రమ్యా వాపీనాం మస్తకోపరి ।
ఆరక్తే ద్వే పదే కార్యే చైకం హరిత శృంఖలా ॥ 168

ఉభయోః పార్శ్వయోర్లింగమస్తకస్య సితే పదే ।
ఏవం సర్వత్ర బోద్ధవ్యం పరిధిః పీతవర్ణకః ॥ 169

సప్తాశీతిపదైశ్చైవ సమాప్తా ప్రథమా తతిః ।
ప్రోచ్యతేఽగ్రే ద్వితీయా తు పంక్తిస్త్రిసప్తపాదజా ॥ 170

శశౌ చ శృంఖలావల్ల్యౌ శృంఖలే ద్వేఽత్ర పూర్వవత్ ।
భద్రం వింశపదైర్జ్ఞేయం నవ వాప్యస్త్రయోదశైః ॥ 171

పదైరష్టాత్ర లింగాని భద్రయోర్మస్తకోపరి ।
ద్వాభ్యాం కార్యే శృంఖలేఽత్ర లోహితే హ్యుత్తరే తయోః ॥ 172

ద్విపదా శృంఖలా పీతా హరితా త్రిపదా స్మృతా ।
ఆరక్తం చ పదం కార్యం వాపీనాం మస్తకోపరి ॥ 173

పూర్వవత్సకలం జ్ఞేయమేకషష్టిపదైః శుభాః ।
పరిధిః పీతవర్ణశ్చ జాతా పంక్తిర్ద్వితీయకా ॥ 174

అనైకేన పదా షష్టిపదైః పంక్తిస్తృతీయకా ।
భద్ర షడ్భిః పదైః ప్రోక్తం సప్తలింగాని కారయేత్ ॥ 175

వసు వాప్యః స్మృతాః శేషం పూర్వవచ్చ ప్రకీర్తితమ్ ।
సప్తచత్వారింశత్పదైః పరిధిశ్చ ప్రకీర్తితః ॥ 176

జాతా తృతీయా పంక్తిర్హి చతుర్థాఽర్థం నిగద్యతే ।
పంచచత్వారింశత్పదైరియం పంక్తిరుదాహృతా ॥ 177

భద్రమర్కపదైర్ జ్ఞేయం పంచ వాప్యోఽత్ర కీర్తితాః ।
తుర్యలింగాని కార్యాణి భద్రస్య మస్తకోపరి ॥ 178

ఆరక్తా షట్పదా వల్లీ పరిధిస్త్రిత్రిభిః పదైః ।
జాతా చతుర్థ పంక్తిర్హి పంచమైకత్రిభిః పదైః ॥ 179

భద్రం నవపదం జ్ఞేయం త్రివాప్యో ద్వౌ హరౌ స్మృతౌ ।
త్రిపదా శృంఖలా రక్తా భద్రస్యోపరి కీర్తితా ॥ 180

ఏకోనవింశతిపదః పరిధిః సంప్రకీర్తితః ।
జాతేయం పంచమా పంక్తిస్త్వగ్రే సప్తదశైః పదైః ॥ 181

చతుష్కోణం సమం తత్ర సర్వతోభద్రమాలిఖేత్ ।
తస్యాపి క్రమ ఏవాయం త్రిపదశ్చ శశీ సితః ॥ 182

కృష్ణాః పంచపదైః కార్యాః శృంఖలాః సర్వతః శుభాః ।
పదైరష్టాదశైర్లింగం పశ్చిమే తస్య పార్శ్వయోః ॥ 183

త్రయోదశపదైర్వాప్యో భద్రం తుర్యపదాత్మకే ।
యామ్యప్రాగుత్తరేష్వేవ మధ్యే తిస్రశ్చ వాపికాః ॥ 184

భద్రం నవపదైః కార్యా వల్ల్యో దశపదాత్మికాః ।
వల్ల్యోః స్థానే పశ్చిమేఽత్ర హ్యద్యంతే హరితే పదే ॥ 185

మధ్యేఽత్ర త్రుటితా వల్లీ భద్రం యచ్చనవాత్మకమ్ ।
తస్యోపరి పదాభ్యాం హి రక్తాఽత్ర శృంఖలా స్మృతా ॥ 186

వాపీనాం మస్తకే కార్యం పదం రక్తం చ పార్శ్వయోః ।
సితే ద్వే ద్వే పదే కార్యే పరిధిః పంచపాదజః ॥ 187

రక్తమష్టదళం మధ్యే కార్యం నవపదాత్మకమ్ ।
కర్ణికా పీతవర్ణా చ బాహ్యాః పరిధయః క్రమాత్ ॥ 188

పీతశుక్లరక్తకృష్ణాః సైకవింశశతాత్మకమ్ ।
కథితం లింగతోభద్రం సర్వేషాం ముకుటోపమమ్ ॥ 189

ఇక మరియొక ఉత్తమవిధానాన్ని చెప్పెదను. 121 సంఖ్యాకలింగతో భద్రమును వినుము. 88 రేఖలచే ప్రస్తారక్రమమును నిరూపించితిని. ఈఏకవింశశత 121 లింగతోభద్రము సమస్త లింగతోభద్రములన్నిలోను కిరీటమువంటిది. (189)

ప్రకారాంతరమన్యచ్చ శృణు శిష్య బ్రవీమి తే ।
తిర్యగూర్ధ్వం కృతా రేఖాస్త్ర్యధికాః శతసంఖ్యకాః ॥ 190

శతం ద్వ్యధికకోష్ఠేషు రచయేల్లింగపంక్తయః ।
నవాష్టరసచత్వారి ద్వ్యేకసంఖ్యాశ్చతుర్దిశమ్ ॥ 191

లింగసంఖ్యాధికా వాపీ ప్రతిపంక్తి భవేదిహ ।
షట్సు పరిధయస్తత్ర షట్పదాంతే తు వాపికాః ॥ 192

కోణేష్వింధుః శృంఖలా చ వల్లీ చ రచయేత్క్రమాత్ ।
త్రిపంచైకాదశపదే లింగం త్ర్యష్టమితం త్రిషట్ ॥ 193

వాపీ భద్రాణి క్రమశః షట్త్రింశద్వింశతత్త్వజమ్ ।
త్రింశత్ షట్త్రింశద్వింశచ్చాంత్యమపంక్తేశ్చ పార్శ్వకే ॥ 194

ఏకస్మిన్ రచయేల్లింగద్వయం భద్రే రసాత్మకే ।
తస్యోపరి భవేత్సర్వతోభద్రం తత్ర వాపికా ॥ 195

చతుర్వింశత్పదం భద్రమంకసంఖ్యా తతః పరమ్ ।
పరిధ్యంతే తుర్యతుర్యపదైః పద్మం సముద్ధరేత్ ॥ 196

చిత్రం వా లోహితం లింగశృంఖలే కృష్ణవర్ణకే ।
హరితా వల్లరీ భద్రం రక్తం శుద్ధేఽబ్జవాపికే ॥ 197

ఏకవింశోత్తరశతం లింగతోభద్రమీరితమ్ ।
ప్రకారాంతరమన్యచ్చ శృణు శిష్య బ్రవీమి తే ॥ 198

షడధికాశీతిరేఖాస్తిర్యగూర్ధ్వం ప్రకల్పయేత్ ।
పంచాశీతి పదాని స్యుః పంక్తయస్తత్ర సర్వతః ॥ 199

తత్ర షట్ షట్ పదాంతే స్యాత్పరిధిః పీతవర్ణకః ।
సర్వతోఽనేన విధినా చతుఃపరిధయః క్రమాత్ ॥ 200

తేషు వై పంక్తికోష్ఠేషు లింగాది రచయేద్ధియా ।
కోణేషు త్రిపదచంద్రస్తదాది శృంఖలా మతా ॥ 201

తతో వల్లీ తతో భద్రం వాపీ లింగం క్రమాద్భవేత్ ।
తత్ర ప్రథమపంక్తౌ తు శృంఖలా పంచపాదికా ॥ 202

ఏకాదశపదా వల్లీ శృంఖలా షట్పదాత్మికా ।
భద్రమేకపదం వాపీ త్రిషట్ కోష్ఠైః ప్రకల్పయేత్ ॥ 203

ఈశానస్తన్మితే కార్య ఏవం తే నవసంఖ్యయా ।
భవంతి వాప్యో దశ తా భద్రద్వయమభీప్సితమ్ ॥ 204

ద్వితీయపంక్తౌ వాపీ తు త్రయోదశపదా మతా ।
భద్రం తు షడ్ దశపదం శేషం పూర్వం సమీరితమ్ ॥ 205

అష్టౌ లింగాని వాప్యస్తు భవంతి నవసంమితాః ।
తృతీయాయాం తుర్యపదం భద్రం శేషం తు పూర్వవత్ ॥ 206

అష్టౌ వాప్యః సప్త హరాః క్రమశః స్యుః సముద్ధృతాః ।
ద్వే వాప్యావంతిమే న్యూనే త్రిభిః కోష్ఠైస్తు సంస్మృతే ॥ 207

చతుర్థపంక్తౌ వాప్యస్తు చతస్రః శంకరత్రయమ్ ।
భద్రం ద్విదశకం జ్ఞేయం శేషం పూర్వవదుద్ధరేత్ ॥ 208

చతుర్థ పరిధ్యుపరి బాణాంతే పరిధిర్భవేత్ ।
తత్పంక్తౌ శృంఖలే న్యూనే పదేనైకేన వల్లరీ ॥ 209

ద్వాభ్యాం పదాభ్యాం చంద్రస్తు యథాపూర్వం ప్రకల్పయేత్ ।
భద్రద్వయం పట్ షట్ పదం త్వన్యం భద్రే నవాత్మకే ॥ 210

త్రయోదశపదైర్వాపీ తత్ర తత్ర ప్రకల్పయేత్ ।
భద్రయోరూర్ధ్వం స్యాద్భద్రద్వయం షట్ షట్ పదం శుభమ్ ॥ 211

సంస్పృష్టాని పదాన్యేవ శృంఖలార్థే నియోజయేత్ ।
తస్యోపరి పరిధిస్తత్ర బాణాంతే పరికల్పయేత్ ॥ 212

ఉభయోరంతరే వాపీ త్రయోదశపదాత్మికా ॥ 213

భద్రద్వయం షట్ షట్ పదం శేషం సర్వం యథోదితమ్ ।
అంతిమేऽంతః పంచపంచపదైః పద్మం సముద్ధరేత్ । 214

రక్తం వా చిత్రవర్ణం చ శ్వేతశ్చంద్రోऽసితా మతా ।
శృంఖలా హరితా వల్లీ పీతం తచ్ఛృంఖలాద్వయమ్ ॥ 215

రక్తం భద్రం సితా వాపీ లింగం కృష్ణం ప్రకల్పితమ్ ।
లింగస్కంధగతాః కోష్ఠాః శోభాకోష్ఠాః ప్రకల్పయేత్ ॥ 216

పదానీ శేషభూతాని యత్ర క్వ చ భవంతి హి ।
తాని తత్ర యథాయోగ్యం ధియా సమ్యఙ్నియోజయేత్ ॥ 217

యద్వా తుర్యపరిధ్యూర్ధ్వమేకాదశపదాత్పరమ్ ।
పరిధిః స్యాత్తయోర్మధ్యే కోణె చంద్రో యథోదితః ॥ 218

శృంఖలా దశపాదా స్యాద్వల్లీ స్యాదేకవింశతిః ।
శృంఖలాऽన్యా రుద్రపదా భద్రం త్రింశత్పదాత్మకమ్ ॥ 219

ఏకషష్టిపదైర్వాపీ సమ్యక్ బుద్ధ్వా ప్రకల్పయేత్ ।
అథవా ద్వే పదే చాన్యే సంయోజ్య గిరిహస్తిషు ॥ 220

పదేషు రచయేద్బుద్ధ్యా లింగానాం పంక్తయః క్రమాత్ ।
నవాష్టరసత్రీణ్యేకా శేషం పూర్వం యథోదితమ్ ॥ 221

విశేషస్త్రత్ర భద్రేషు షడ్లింగే షోడశాత్మకమ్ ।
ఏకలింగే వింశపదం ద్వాభ్యామన్యత్ర చాధికమ్ ॥ 222

పూర్వవత్సర్వతోభద్ర పద్మవర్ణాస్తు పూర్వవత్ ।
పీతశుక్లరక్తకృష్ణా బహిః పరిధయః స్మృతాః ॥ 223

మరియొక విధమునుకూడ వినుము. 103 రేఖలచే 121 (ఏకవింశోత్తర శత)లింగతో భద్రమును రచించునది. (197) ఇంకొకవిధ మెట్లనిన-86 రేఖలు గీసి ఉక్తక్రమమున ప్రస్తరించితే (108) అష్టోత్తర శతలింగతో భద్రమగును. (223).

ఏతదష్టోత్తరశతం లింగతోభద్రమీరితమ్ ।
ప్రకారాంతరమన్యత్తే శృణు శిష్య బ్రవీమి యత్ ॥ 224

తిర్యగూర్ధ్వం గతా రేఖా నవాష్టలోహితాః స్మృతాః ।
తత్కోష్ఠేష్వధినేత్రాగ్నికోష్ఠకా రచయేద్ధియా ॥ 225

సర్వతోభద్రకం రమ్యం పరితః పరిధిర్మతః ।
తతో రసరసాంతే స్యుశ్చతుః పరిధయః శుభాః ॥ 226

తత్ర చతుర్షు పార్శ్వేషు కోణేందుస్త్రిపదః స్మృతః ।
శృంఖలా పంచభిర్వల్లీ త్వేకాదశపదా మతా ॥ 227

లింగం చతుర్వింశపదం వాపీ త్వష్టాదశా భవేత్ ।
నవ సప్త తథా పంచయుగనేత్రమితాః శివాః ॥ 228

పంచపంక్తయ ఏవ స్యుర్వార్షికౌకాధికా తతః ।
తుర్యలింగాని ద్వే వాప్యౌ త్రయోదశ పదాత్మికే ॥ 229

షడంకార్కరసరసభద్రసంఖ్యా క్రమాద్భవేత్ ।
సర్వతోభద్రకే వాపీ యుగనేత్రమితా తథా ॥ 230

నవకోష్ఠమితం భద్రం శేషం సర్వం తు పూర్వవత్ ।
తతోఽంతః పరిధిః కార్యస్తత్ర పద్మం సముద్ధరేత్ ॥ 231

శ్వేతోఽబ్జః శృంఖలా కృష్ణా నీలా వల్లరికాఽరుణమ్ ।
భద్రం వాపీ సితా కృష్ణం లింగం పరిధయోఽంతిమాః ॥ 232

పీతశుక్లరక్తకృష్ణా జ్ఞేయాః పీతాశ్చ మధ్యమాః ।
ఏతదష్టోత్తరశతం లింగతోభద్రమీరితమ్ ॥ 233

తిర్యగూర్ధ్వం పంచ పంచ రేఖాః కార్యా సులోహితాః ।
తత్కోష్ఠేషు పరిధయః షట్ షడంతే త్రయః స్మృతాః ॥ 234

త్రిద్వ్యంకలింగరచనా చతుర్వింశతిపాదికా ।
వాపీ త్వష్టాదశపదా షట్త్రింశద్ ద్విదశాంక కమ్ ॥ 235

భద్రం భద్రం పీతమన్యద్భద్రపార్శ్వే ప్రకల్పయేత్ ।
ప్రథమం నవపాదం స్యాద్ద్వితీయం షట్పదాత్మకమ్ ॥ 236

వాపీపార్శ్వే చ త్రిపదా శృంఖలా లోహితా భవేత్ ।
ప్రతిపార్శ్వే భవేదేతచ్ఛృంఖలా పంచపాదికా ॥ 237

ఏకాదశపదా వల్లీ త్రిపదశ్చంద్ర ఈరితః ।
చతుర్వింశ పదైర్జ్ఞేయం లింగం పరమసుందరమ్ ॥ 238

మధ్యే చంద్రః శృంఖలా చ త్రిపదా షట్పదా లతా ।
భద్రకర్మపదం లింగమష్టావింశత్పదాత్మకమ్ ।
లింగమస్తకపార్శ్వస్థే పదాని పీతకాని తు ॥ 239

లింగం కృష్ణం సితా వాపీ భద్రం రక్తం సితః శశీ ।
శృంఖలా కృష్ణాహరితా వల్లీ వర్ణాస్త్విత్రీరితాః ॥ 240

పరిధిః పీతవర్ణాః స్యాత్పదాన్యుర్వరితాని తు ।
యథేష్టం రంజయేదేతద్బాణాక్షిలింగసాధనమ్ ॥ 241

మరియు... 89 రేఖలచే ఇదియు ఒక అష్టోత్తరశతలింగతోభద్రమేర్పడుచున్నది. (233) ఇదియునుంగాక 55 రేఖలచే పంచవింశల్లింగాత్మక సర్వతోభద్రమును యథేష్టముగా రచియించ వచ్చును. (241).

పీతశుక్లరక్తకృష్ణా బాహ్యాః పరిధయః క్రమాత్ ।
ప్రకారాంతరమన్యద్వా శృణు శిష్య బ్రవీమ్యహమ్ ॥ 242

చంద్రాబ్ధిపదసంఖ్యాసు సర్వతస్తత్త్వసంమితమ్ ।
లింగపీఠం విరచయేత్ షడంతే పరిధీ మతౌ ॥ 243

తయోరర్వాక్ లింగపంక్తిద్వయం సమ్యక్ ప్రకల్పయేత్ ।
అష్టాదశపదం లింగం వాపీ త్రిదశపాదికా ॥ 244

త్రిపదోఽబ్జః శృంఖలా చ పంచపాదేశవల్లరీ ।
ప్రథమా యుగలింగాఽన్యా పంక్తిర్లింగద్వయాన్వితా ॥ 245

ఆదౌ భద్రం నవపదం పరం భద్రం తు షట్పదమ్ ।
పరిధ్యంతే త్రయస్త్రింశత్కోష్ఠైర్లింగం ప్రకల్పయేత్ ॥ 246

మూలస్కంధౌ సప్తసప్తపదజౌ షట్పదైః శిరః ।
పంచపంచపదైః పార్శ్వౌ కటిః శంభోస్త్రిపాదజః ॥ 247

చతుర్దిక్షు హరస్యాస్య చతుర్భద్రం నవాంఘ్రికమ్ ।
చంద్రోఽత్ర త్రిపదో జ్ఞేయః శృంఖలా ద్విపదా స్మృతా ॥ 248

వల్లరీ పంచపాదా స్యాచ్ఛృంఖలాఽన్యా త్రిపాదజా ।
లింగస్కంధగతాః కోష్ఠాః పీతాః కార్యాః శుభావహాః ॥ 249

అన్యాని శేషభూతాని పదాని పూరయేద్ధియా ।
యథేచ్ఛం వై పరిధయః కార్యా వేదమితా బహిః ॥ 250

పంచవింశచ్ఛివైరేతౌ ప్రకారౌ ద్వౌ మయోదితౌ ।
అతిప్రియౌ శంకరాయ జ్ఞాతవ్యౌ ద్విజసత్తమ ॥ 251

నమస్కృత్యా మహద్బ్రహ్మ గురుపాదసరోరుహమ్ ।
సంసారతారకం వక్ష్యే కథామధ్యాత్మ సంగ్రహామ్ ॥ 252

పంచవింశతిసంఖ్యాకం లింగతోభద్రమీప్సితమ్ ।
కేనచిత్ కల్పితం తత్కిం తత్త్వం తత్కథ్యతే స్ఫుటమ్ ॥ 253

లింగతోభద్రమిత్యేతన్నిరుక్తమర్థవద్భవేత్ ।
లింగం గమకమిత్యాహుర్జ్ఞానం జ్ఞాపకమిత్యపి ॥ **254**

పీయూషవాపనాద్వాపీ భద్రం భద్రసమీక్షణాత్ ।
సాధ్యశబ్దాః ప్రసిద్ధా హి వర్తంతే సాధనేష్వపి ॥ **255**

అయినను పంచవింశల్లింగతోభద్రమును ఈక్రమమున రచియించునది. యథేష్టముగా 4 బహిః పరిధులను కల్పింపవచ్చును. (250).

## పరమాత్మ లింగతత్త్వ విచారము

ఇట్లు 25 లింగాత్మకములగు భద్రములను రెండువిధములుగా జూపితిని. ఇవి రెండును శివ ప్రీతికరములు. పరబ్రహ్మమునకును సంసారతారకమగు శ్రీగురుపాదారవిందమునకును నమస్కరించి, అధ్యాత్మ సంగ్రహమగు కథను చెప్పుచున్నాను. పంచవింశల్లింగతోభద్రం ఇష్టమైనది. ఇది ఒక్కనిచే కల్పింపబడేదేగాని దీనితత్త్వమేమనిన జెప్పెద వినుము.

విష్ణుదాసా! లింగతోభద్రమని చెప్పునది అర్థవత్తుగానుండును, అదియెట్లనిన– లింగమనిన గమక మందురు. జ్ఞానమే జ్ఞాపకమై యున్నదని తత్త్వవిదులు చెప్పుదురు. అమృత వాపము చే వాపియనబడును, మంగళసమీక్షణమువలన భద్రమను సంజ్ఞగల్గెను. సాధ్యములనిన ప్రసిద్ధము లనగా మోక్షసాధనములు సాధ్యములనుట. ఇట్లు శ్రీరామలింగ బ్రహ్మోపాస్తి సాధనములలో నున్నవి. దానిలో తెలుపు, నలుపు, ఎరుపు మొదలగు రంగులుకూడ వేదశాసనముబట్టి బ్రహ్మోపాసనార్థము కాగలవు. లింగమనిన పరబ్రహ్మము. అదియే సర్వమంగళముగాన భద్రమను వాచకము అందినది.

తస్మిన్ శుక్లముత నీలమిత్యాది శ్రుతిశాసనాత్ ।
వర్ణా అపి పరస్మింస్తూపాసనార్థం భవంతి హి ॥ **256**

తద్బ్రహ్మ పరమం లింగం మంగళం భద్రవాచకమ్ ।
మంగళం మంగళానాం చ శివం శాంతమితి స్ఫుటమ్ ॥ **257**

లీయంతే యత్ర భూతాని నిర్గచ్ఛంతి యతః పునః ।
తేన లింగం పరం వ్యోమ నిష్కలః పరమః శివః ॥ **258**

సత్త్వం రజస్తమోవర్ణత్రయం మాసాసు వేష్టితమ్ ।
మనశ్చంద్రో మహామోహాః శృంఖలా స్నేహవల్లికా ॥ **259**

తైరిదం సర్వతస్తత్త్వం వేష్టితం ఘటవ్యోమవత్ ।
తిర్యగూర్ధ్వమహంకారః ప్రసృతః పటతంతువత్ ॥ 260

తేన స్తానాని జాతాని లక్షాణాం చతురష్ట హి ।
గుణాస్తేషు ప్రపూర్యంతే యథా చిత్రపటో భవేత్ ॥ 261

ఆసీదేకం పురా తత్త్వం తస్మిన్మాయానియోగతః ।
కామో బహుధా భవతి భవేయమితి సాదరమ్ ॥ 262

ఏకః సన్నితి చాత్మానం స్వయమకురుతేతి చ ।
ఇంద్రో మాయాభిరితి చ ఏకధా బహుధేతి హి ॥ 263

ఊచుశ్చ శ్రుతయః సాధ్యో బ్రహ్మణో భవనం ప్రతి ।
తజ్జలానితి చ శ్రుత్వా న తతోఽస్తి హి కించన ॥ 264

భిన్నోఽహమితి హృద్గ్రంథౌ న సంసారస్తదాశ్రయః ।
గతే తేజస్యంబు యాతి స్వప్నో నిద్రానుగో యథా ॥ 265

ఏతదర్థం విరక్తః సన్ జిజ్ఞాసుః శ్రేయ ఉత్తమమ్ ।
ఆశ్రయేత్సద్గురుం సాక్షాద్ బ్రహ్మభూతం నిరామయమ్ ॥ 266

తేన ప్రబోధితః సిద్ధమాత్మానం సంతమాత్మని ।
జానీయాద్బ్రహ్మభావేన జగచ్చిత్తం స్థితం సదా ॥ 267

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే సంస్థితోఽమలః ।
ఏకోఽద్వితీయః పరమో నాంతః ప్రజ్ఞాదిలక్షణః ॥ 268

అక్షరః సచ్చిదానందోఽమరోఽజర ఉశత్తమః ।
నిర్వికారో నిరాకారో నిరామయ ఉదీరితః ॥ 270

లింగము మంగళములలో ఉత్తమ మంగళమనియు, శివమనియు, శాంతమనియు సుస్పష్టము. (257) ఎచ్చట అన్నిభూతములు లీనమగుచున్నవో మరల దేనినుండి వెలువడుచున్నవో అది ఆ కారణముచే లింగమనబడి, పరబ్రహ్మమై ఒప్పుచున్నది. ఇదియే చిదాకాశము. ఆ లింగస్వరూప మేమని విచారించిన, నిష్కళమనిన కేవల శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుడగు పరమశివుడని యెరుగ వలయును. (258). సత్త్వ రజస్తమస్స్వరూపమగు వర్ణత్రయము మాయావేష్టితమైనది. చంద్రుడే మనస్సు, మహా మోహమే శృంఖలమనబడు. స్నేహపాశమే వల్లరియగును. (259). వాటినుండి ఈ

జగత్తత్త్వము పరివేష్టింపబడియున్నది. ఎట్లనిన మహదాకాశము ఘటోపాధియందు భిన్నమై తోచుచున్నట్లు బ్రహ్మతత్త్వము ప్రకృతియందు మాయావిద్యోపాధి విశిష్టమై జగదాకారముగా ఒప్పుచున్నదనుట.

అహంకారము తిర్యగూర్ధ్వమనిన ఇటు అటు అంతట వస్త్రమున తంతువులవలె, వ్యాపకమై యున్నది. (260). అందుచే 84 లక్షస్థానములేర్పడినవి. ఎట్లు చిత్రపటమేర్పడుచున్నదో అట్లు గుణములు వాటియందు నింపబడుచున్నవి. (261). పూర్వమందనిన ఆదియందు ఒక్కటే తత్త్వము కేవలమై ఒప్పుచున్నది, అదియే పరబ్రహ్మతత్త్వము. ఆ బ్రహ్మతత్త్వమునందు మాయానియోగమువలన ఆదరము తోడ అనిర్వచనీయ లీలాత్మక కామము నానాప్రకారములుగా ఏర్పడెనని బ్రహ్మకారము లగుచున్నవి. (262) 'స్వయమకురుత' అనియు 'ఇంద్రోమాయాభిః' అనియు, 'ఏకధా బహుధా' అనియును. సర్వవిధములతోను సంపాదనీయమగు ఆత్మస్వరూపమును గురించి శ్రుతులు చెప్పినవిగదా? అనిన ఆ బ్రహ్మస్వరూపమును విచారించునపుడు ఆత్మ ఒక్కటే నిత్యము. ఆ పరమాత్మ నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావుడు. స్వయముగా ఏకత్వమైన ఆ పరమాత్మయే నానాత్వమునంది సదసద్విలక్షణుడై కేవలముగ ఉన్నాడు. ఈ అర్థము సోపాఖ్యానవివరణ పురస్సరముగా వేదములు పలుకుచున్నవనుట.

'తజ్జలాని' మొదలగు వేదవాక్యములచే ఆత్మ అతిరిక్త వస్తుస్వభావము సిద్ధించుచున్నది. ఒకవేళ ఇట్లున్నను, ఆత్మతత్వమును ఎరుగక యుండినను ఈవిషయమునందు చెప్పుచున్నాను వినుము! వ్యావహారిక జగత్తునే సత్యమని నమ్మి ద్వైతవాసనా వాసితుడై, అవిద్యావశమై యుండునట్టి దుస్థితి నాకు హితము కాజాలదు. ఎంతవరకు అహంకారభావము గల్గియుండునో అంత వరకు ఈ జనన, మరణ దుఃఖప్రవాహరూప సంసారబంధము గల్గియుండును. అహంభావమను ప్రబలమైన ముడి వీడిన వెంటనే ఆ మమకారము నాశ్రయించి యుండు సంసారము వీడిపోవును. కావుననే "మమేతిబధ్యతే జంతుః న మమేతి విముచ్యతే," అని ఉపనిషత్తు ఘోషించుచున్నది. ఆ భావమిచట చెప్పబడినది. నిద్రనుండి స్వప్నము వెలువడినట్లు, తేజస్సు గతింపగా జలము వెలువడుచున్నది. అనిన ఆత్మతత్త్వము మాయా వరకమై స్ఫురించనపుడు జడమగు జగత్తు సత్యముగా స్ఫురించుచున్నది. ఇట్టి అధ్యాత్మ తత్త్వార్థమును తెలుసుకొనుటకై జిజ్ఞాసువగువాడు విరక్తుడగుచు పరమోత్తమమగు శ్రేయస్సును ఆశ్రయించవలెను. ఎట్లనిన–సాక్షాత్ బ్రహ్మభూతుడును, నిరామయుడును అగు సద్గురువునాశ్రయించి, ఆ గురువుచే బోధింపబడినవాడై తత్వవిచార సిద్ధమును, సత్తామాత్రమును అగు బ్రహ్మమును స్వాత్మయందు ఐక్యభావముతో అందనగును. అట్టి బ్రహ్మభావముచేత ఈజగత్తు ఎల్లప్పుడును చిత్రమై యుండును. కావుననే ఆ సచ్చిదానందాత్మకుడగు పరమేశ్వరుడు సర్వభూతములయొక్క హృద్దేశమున నుండువాడు. అతడు నిర్మలుడు, కేవలుడు, స్వాతిరిక్తసత్తాశూన్యుడు, పరముడు, అంతరహితుడు, ప్రజ్ఞాస్వరూపుడను మొదలగు లక్షణములుగలవాడు, నాశరహితుడు, సచ్చిదానందుడు, అమరుడు, అజరుడు, షడ్భావవికారరహితుడు, నిరాకారుడు, నిరామయుడనియును చెప్పబడినది. (270)

అలింగోఽరూప ఏవాసావేకత్వగణనాత్పరః ।
మాయయా లింగరూపీవ హ్యేక ఇత్యభిధీయతే ॥ 271

పురుషశ్చ ప్రకృతిశ్చ వ్యక్తోఽహంకార ఏవ చ ।
చతుర్లింగాని ప్రోక్తాని లక్షణాని శివస్య చ ॥ 272

కార్యకారణభూతానామేకమేవ హి పంచకమ్ ।
సత్త్వం రజస్తమ ఇతి వసులింగాని చాత్మనః ॥ 273

దశేంద్రియాణి చ మనో బుద్ధిర్ద్వాదశకం స్మృతమ్ ।
లింగానాం పరమేశస్య విరేకోఽత్ర ప్రతిష్ఠితః ॥ 274

ఇతి కారణలింగాని కార్యలింగాన్యనేకశః ।
శతం సహస్రమయుతం కోటిశః సంతి సంఖ్యయా ॥ 275

సర్వాణి జ్ఞాపకాన్యేవ శివస్య పరమాత్మనః ।
వస్తుతస్తు పరం తత్త్వం సజాతీయాదిహీనకమ్ ॥ 276

విచారే వర్తమానే తు తంత్వాద్యేవ పటాది న ।
ఏవం సర్వం శివో భాతి న సర్వం శివ ఏవ హి ॥ 277

బిందునాదమకారాది మాత్రాత్రయముదీరితమ్ ।
ఆత్మైవ పంచధా సాక్షాత్తథా బ్రహ్మేశ్వరో హరిః ॥ 278

విధిరుద్రౌ పంచ పంచ సద్యోజాతాదిరూపకః ।
శుద్ధః సాక్షీ తథా ప్రాజ్ఞస్తైజసో విశ్వ ఏవ చ ॥ 279

సచ్చిత్సుఖత్రయం నామరూపే బ్రహ్మైవ కేవలమ్ ।
జాతం పంచాత్మకం నాన్యద్ బ్రహ్మైవేదమితి శ్రుతిః ॥ 280

ప్రధానం మహదహం చ పంచతన్మాత్రకం చ తత్ ।
అష్టప్రకృతిరిత్యేతచ్ఛాస్త్రేషు పరిగీయతే ॥ 281

పరమాత్మ అలింగుడనిన విలక్షణుడు, రూపరహితుడు, ఒక్కడని వ్యవహరించుటకుగూడ అలవిగానివాడై యుండు పరాత్పరుడు. మాయచే లింగరూపియైయుండువానివలె ఒక్కడుగా పిలువ బడుచున్నాడు, అట్టి లింగాత్మ యగు శివునికి పురుషుడనియును, ప్రకృతియనియు, వ్యక్తుడనియు, అహంకారమనియు లక్షకములగు నాలుగు గుర్తులు చెప్పబడినవి. ఇట్టి కార్యకారణ భూతములగు 5 లింగములను పంచాత్మకమగు ఒక్క లింగమనియే భావింపవలయునుగదా! ఈ 5 లింగములకును సత్వము, రజస్సు, తమస్సు అను మూడు లింగములు చేరితే ఆత్మయొక్క 8 వసులింగస్వరూపము ఏర్పడినది.

5జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 1మనస్సు, 1బుద్ధి ఇవి- 12 ను పరమేశ్వరునియొక్క ద్వాదశలింగ స్వరూపమని స్మరింపబడెను. ఇచ్చట ప్రతిష్ఠితము, వివేకము. ఇట్లు కారణలింగములు నిరూపింపబడే. ఇక కార్యలింగములను విచారించితే : 100–1000–10,000– 1,00,000, కోట్ల కొలదిగా అపారమైయున్నవి. ఇవి సర్వమును పరమాత్మయగు శివునికి జ్ఞాపకములైనవి. వాస్తవికార్థమును విచారించునపుడు పరమాత్మతత్త్వము సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమైనది. ఎట్లనిన–దారములే వస్త్రాలు గదా. ఇట్లే సర్వమును శివుడుగాను, శివుడే సర్వముగా ఉన్నాడుగదా? బిందు, నాద, అకార, ఉకార, మకారములను పంచావయవముగా ఆత్మయే చెప్పబడెను. ఇట్లు సాక్షాత్కరించిన పరమాత్మయే– పరబ్రహ్మయని, ఈశ్వరుడని, విష్ణువని, చతుర్ముఖుడని, రుద్రుడని– సద్యోజాత, వామదేవ, అఘోర, ఈశాన, తత్పురుష– పంచబ్రహ్మ లింగ రూపియై యున్నాడు. మఱి యీ యైదును– శుద్ధుడు, సాక్షి ప్రాజ్ఞుడు, తైజసుడు, విశ్వుడు అనియు –సత్తు,చిత్తు,సుఖము,నామము,రూపము–అనియును, ఇట్లు పంచబ్రహ్మాత్మకముగాఉన్నది. పుట్టినదంతయు ఇట్లు పంచాత్మకమైనదేగాని వేరుగా లేదు. ఇదంతయును బ్రహ్మమని శ్రుతి చెప్పుచున్నది. ప్రధానము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలును, ఇవియే అష్టప్రకృతులని శాస్త్రములయందు చెప్పబడెను.

**అష్టమూర్తిస్వరూపం సద్భవశర్వాదినామభృత్ ।**
**వస్వష్టకస్వరూపేణ మాయయా భాతి సర్వతః ॥ 282**

**జ్యోతిర్లింగద్విషట్కం చ ద్వాదశాదిత్యనామకమ్ ।**
**దశేంద్రియమనోబుద్ధినామభిర్భాతి సత్ స్ఫుటమ్ ॥ 283**

**దశేంద్రియాణి చ ప్రాణపంచకం భోగ్యపంచకమ్ ।**
**చేతశ్చతుష్కమాత్మైవ పంచవింశమతో బుధైః ॥ 284**

**లక్షాణాం చతురశీతి భోగాయతనవిస్తరః ।**
**తస్యైవ కల్ప్యతే భ్రాంత్యా కర్మభిర్గుణభేదతః ॥ 285**

**జాగ్రత్స్వప్నసుషుప్తిం చ భోగస్థానాని చాత్మనః ।**
**భోగో భోక్తా భోజయితా సర్వం బ్రహ్మైవ న పృథక్ ॥ 286**

**అధ్యాత్మమధిదైవం చ హ్యధిభూతమితి త్రిధా ।**
**స్థూలం సూక్ష్మం కారణం చ సర్వం బ్రహ్మైవ న పృథక్ ॥ 287**

**ఏతత్ జ్ఞానం చ ధ్యానం చ వివేకశ్చ విరాగితా ।**
**జీవేశ్వరేజగద్భావమాత్మైవేతి న తు పృథక్ ॥ 288**

**సర్వం ఖల్విదమితి చేదం సర్వం యదయమాత్మనా ।**
**బ్రహ్మైవేదం సర్వమితి శ్రుతయః ప్రవదంతి హి ॥ 289**

**అయం సిద్ధస్య విషయో యత్సర్వాత్మని దర్శనమ్ ।**
**ఆరురుక్షుః శాంతదాంతస్తితిక్షుః సర్వతో భవేత్ ॥ 290**

ఆ పరమేశ్వరుడు అష్టమూర్తి స్వరూపుడై; భవుడు, శర్వుడు మొదలైన నామములను భరించి యున్నాడు. అష్టవసు స్వరూపముతో, మాయచే అంతట వెలుగుచున్నాడు. ద్వాదశాదిత్యులే 12 జ్యోతిర్లింగములనబడును మరియు ఆ శివబ్రహ్మము దశేంద్రియములు, మనస్సు, బుద్ధి అను నామములచే సుస్పష్టము, 10 ఇంద్రియములు, 5 తన్మాత్రలు, 4 అంతఃకరణములు, అత్మయును చేరి 25 పంచవింశ లింగాత్మకమని పండితులచే చెప్పబడినది. ఆ పరమాత్మకే భ్రాంతిచేత గుణ, కర్మ భేదమువలన 84 లక్షల జీవరాసులయందును భోగాయతనవిస్తరము పరికల్పింప బడుచున్నది.(285)

జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను మూడు అవస్థలును ఆత్మయొక్క భోగాయతనములు. భోగము, భోగింపబడునది, భోగించువాడు సర్వము బ్రహ్మమే, మరి వేరేకాదు. ఈ జ్ఞానమును, ధ్యానమును, వివేకమును, వైరాగ్యమును, జీవుడు, ఈశ్వరుడు, ఈ జగమంతయును ఆత్మగానే ఉన్నది. భిన్నము కాదు. కావుననే "సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఇదగ్ం సర్వం", "యదయమాత్మా", "బ్రహ్మై వేదం సర్వం" మొదలైన శ్రుతివాక్యములు చెప్పుచున్నవిగదా? సర్వాత్మకమగు ఆత్మ దర్శనమనిన స్వాతిరిక్త సత్తాశూన్యవివేకమనునదియే గదా. యీ విషయము అత్మ సిద్ధునిదిగానున్నది. ఇట్టి శాస్త్రజన్యజ్ఞానముగల్గి; శాంతుడును, జితేంద్రియుడును, ఓర్పుగలవాడు అయిన ఆరురుక్షువు అంతటను ఉన్నవానిని స్వస్వరూప విజ్ఞానముచే దర్శించి, బ్రహ్మభూతుడగును. (290)

స్వదేశే ప్రాప్తపురుషం నిబధ్నంతి వశీకృతమ్ ।
తేనామీ విషయాః ప్రోక్తా ముముక్షుస్తాన్ వివర్జయేత్ ॥ 291

వివిక్తసేవీ లఘ్వాశీత్యాది భాగవతం వచః ।
కిం బహూక్తేన విధినా సమాప్తం శాస్త్రహృద్గతమ్ ॥ 292

దత్తం మే గురుణా కిమప్యజడమానందాత్మవస్త్వద్వయమ్
యత్సేవాత ఇదం తదాత్మకమహం త్వం చాశు నష్టం తమః ।
ఆపూర్ణం సహసోదితం మహ ఋతం గంభీరమవ్యాకృతమ్
యేనాచ్ఛాదితమిందుసూర్యపవనం విశ్వం విశేషాత్మకమ్ ॥ 293

తిర్యగూర్ధ్వగతా రేఖాశ్చత్వారింశత్సమాః శుభాః ।
తాసామంకత్రికోష్ఠేషు పరిధీ ద్వౌ ప్రకల్పయేత్ ॥ 294

సప్తాంతే ప్రథమాఽన్యాస్తు తతో బాణాంతకోష్ఠకే ।
తన్మధ్యే రుద్రరుద్రేషు పదేష్వష్టాదశైః పదైః ॥ 295

లింగమేకం ఖండవాప్యౌ తుర్యతుర్యపదాత్మకే ।
అష్టకోష్టాత్మకం భద్రం ప్రోక్తం పార్శ్వచతుష్టయే ॥ 296

శృంఖలా ద్విపదా చంద్రం త్రిపదా వల్లరీ పదా ।
పంచపాదైః స్మృతా వల్ల్యౌ త్రిపార్శ్వేషు నిమీలయేత్ ॥ 297

ద్వితీయే త్రిపదశ్చంద్రః శృంఖలా వేదపాదికా ।
వల్లీ నవపదా భద్రత్రయం నవపదాత్మకమ్ ॥ 298

త్రయోదశపదం వాపీద్వయం పార్శ్వే తు శృంఖలే ।
ద్విపదే రక్తవర్ణే చ భద్రం తుర్యపదం హరిత్ ॥ 299

ప్రతిపార్శ్వే భవేదేతత్ప్రథమాధః సు యోజయేత్ ।
ప్రతిపార్శ్వే చతుర్లింగం వాపీనాం పంచకం తథా ॥ 300

అష్టాదశపదం లింగం వాపీ త్రయోదశాత్మికా ।
భద్రం రసపదైర్జ్ఞేయం వల్లీ రుద్రపదాత్మికా ॥ 301

వ్యావహారిక సత్తాకములును, ప్రాతిభాసిక సత్తాకములు అయిన ఈ జగద్విషయములు భోగములు ఏమి చేయుచున్నవనిన వీటికిలోబడి సంసృతిమగ్నుడగు పురుషుని వశీకృతునిగా కట్టివేయుచున్నవి. అనగా పారమార్థికసత్తాస్ఫూర్తినివ్వక జనన, మరణ దుఃఖప్రవాహమునందే పడద్రోయుచున్నవి. కావుననే ఇవి విషయములనబడినవి. అందువలన మోక్షాపేక్షగలవాడు ఆ విషయములనన్నిటిని విసర్జింపవలయును. కావుననే 'వివిక్త సేవి' అనగా జనసంగమునకు దూరముగాను, భార్య, పుత్రాదుల బాధారాహిత్య రహస్య స్థలమున సమాహితమనస్కుడై వర్తించువాడును, 'లఘ్వాశి' అనగా మితభోజి అగువాడు బ్రహ్మతత్త్వ విచారపరుడగును, మరి బ్రహ్మసాక్షాత్కారము నందుననునది మొదలైనది భాగవతవచనమై యున్నది. కావున ఓయి విష్ణుదాసా! బహూక్తమగు విధిచేత ఇక ఏమిఫలము? ఇదివరకు నీకు చెప్పిన వేదశాస్త్రరహస్యార్థము ఇంతటితో విరమింపబడినది.

శిష్యుడా! నాకు గురువుచే ఇవ్వబడిన ఒకానొకటి కలదు. అది ఏమనిన...సర్వ చేతనమును నిత్యానందమును స్వాతిరిక్తసత్తా శూన్యమును అగు నా తపస్సు. దాని సేవవలన ఇదంతయును తదాత్మకము. నేనును, నీవును తత్స్వరూపమే. త్వరగా అజ్ఞానము నశించెను. నిండి యుండు వెలుగు త్వరగా ఉదయించె. ఆ పరబ్రహ్మ తేజము సూర్య, చంద్రాగ్నులను ఆక్రమించి యున్నది. ఇదియే పారమార్థిక సత్యమగుటచే సత్యమయినది. దురూహమగుటచే, అమేయమగుటచే గంభీరము. మరియు అవ్యాకృతము. సర్వప్రపంచమును నిశ్శేషముగా ఆత్మస్వరూపమై వెలుగుచున్నది. (293)

**శృంఖలా పంచభిః పాదైస్త్రిపదశ్చంద్ర ఈరితః ।**
**లింగోపరితనా వీథీ నీలావల్ల్యా నియోజయేత్ ॥ 302**

**యద్వా రసాంతే పరిధిం విధాయ తదనంతరమ్ ।**
**త్రిలింగాన్యేకలింగం చ ద్వయోః పంక్త్యోః ప్రకారయేత్ ॥ 303**

**ఆదౌ చంద్రకలం భద్ర పదమర్కపదైః స్మృతమ్ ।**
**శృంఖలాపంచభిర్వల్లీ రుద్రకోష్ఠా సమీరితా ॥ 304**

**వాపీచతుష్టయం పూర్వం పరం వాపీద్వయం స్మృతమ్ ।**
**పూర్వవత్సకలం రోయం బాహ్యాః పరిధయః క్రమాత్ ॥ 305**

**పీతశుక్లరక్తకృష్ణా జ్ఞేయాః సంఖ్యాధికాః శుభాః ।**
**ఏతత్సప్తేందులింగాఖ్యం పీఠం సమ్యగుదాహృతమ్ ॥ 306**

అథవాఽస్మిన్ త్రికోష్ఠాని వర్ధయిత్వా క్రమేణ తు ।
షష్ఠాంతే పరిధీ కార్యౌ తత్ర లింగాని యోజయేత్ ॥ 307

ప్రథమే త్రీణి లింగాని ద్వితీయే చైకమీరితమ్ ।
చతుర్వింశపదైర్లింగం వాప్యష్టాదశపాదజా ॥ 308

ఆదౌ వేదమితా వాప్యో ద్వే వాప్యౌ చ ద్వితీయకే ।
ఆదౌ నవపదం భద్ర ద్వితీయేఽర్కపదం స్మృతమ్ ॥ 309

చంద్రవల్ల్యాదిపూర్వోక్తం మధ్యే లింగం ప్రకారయేత్ ।
అష్టావింశపదైర్ జ్ఞేయం చతుః పాదైః శిరః కటిః ॥ 310

అర్కహ్యర్కపదే ఖండవాప్యౌ ద్విపదశృంఖలాః ।
పంచపదా స్మృతా వల్లీ త్రిపదా పీతశృంఖలా ॥ 311

అర్కపాదైశ్చతుర్దిక్షు మధ్యే భద్రచతుష్టయమ్ ।
చంద్రశ్చ త్రిపదః కోణే శివమస్తకపార్శ్వకే ॥ 312

నేత్రార్థం ద్వే పదే శుక్లే శేషాణి చ పదాని హి ।
లింగపార్శ్వే పంచ పంచ యథేచ్ఛం తాని పూరయేత్ ॥ 313

పీతశుక్లరక్తకృష్ణా బహిః పరిధయో మతాః ।
ఏతత్సప్తదశలింగైర్లింగతోభద్రమీరితమ్ ॥ 314

దశకం కారణానాం చ ప్రాణానాం పంచకం మనః ।
షోడశేమాః కలా ఆత్మా సాక్షీ సప్తదశః స్మృతః ॥ 315

అర్కలింగాత్మకం భద్రం శృణు శిష్య మయోచ్యతే ।
ప్రాగుదీచ్యా గతా రేఖాః షట్త్రింశద్ధి ప్రకల్పయేత్ ॥ 316

పదాని ద్వాదశశతం పంచవింశతిరేవ చ ।
ఖండేందుస్త్రిపదః కోణే శృంఖలా షట్పదాత్మికా ॥ 317

త్రయోదశపదా వల్లీ భద్రం తు నవభిః పదైః ।
భద్రోర్ధ్వం త్రిపదా జ్ఞేయా ద్వితీయా పీత శృంఖలా ॥ 318

త్రయోదశపదా వాపీ లింగమష్టాదశైః స్మృతమ్ ।
లింగం నియమ్య పంక్తౌ తు శోభాకోష్ఠాశ్చతుర్దశ ॥ 319

తేషాముపరి పంక్తౌ తు కోష్ఠాః సప్తదశైవ తు ।
పూజాపంక్తిః సితా జ్ఞేయా పరితః పరికల్పితా ॥ 320

పూజాపంక్త్యంతరాపంక్తౌ కోష్ఠా అశీతిసంఖ్యయా ।
పరిధిః స చ విజ్ఞేయో మండలాంతరయోర్ద్వయోః ॥ 321

పరిధ్యంతరకోష్ఠేషు సర్వతోభద్రమాలిఖేత్ ।
విశేషశ్చాత్ర విజ్ఞేయో శృంఖలా షట్పదా భవేత్ ॥ 322

త్రయోదశపదా వల్లీ భద్రం తు ద్వాదశైః పదైః ।
పంచవింశత్పదా వాపీ పరిధిః షోడశాత్మకః ॥ 323

మధ్యే నవపదైః పద్మం కర్ణికాకేసరాన్వితమ్ ।
సత్త్వం రజస్తమోవర్ణాః పరితో మండలస్య చ ॥ 324

త్రయః పరిధయః కార్యాస్తత్ర ద్వారాణి కారయేత్ ।
సితేందుః శృంఖలా కృష్ణా వల్లీ నీలా ప్రపూరయేత్ ॥ 325

భద్రం రక్తం శృంఖలాఽన్యా పీతా వాపీ సితా స్మృతా ।
లింగాని కృష్ణవర్ణాని పార్శ్వేషు ద్వాదశైవ తు ॥ 326

పరిధిః పీతవర్ణః స్యాత్కమలం పంచవర్ణకమ్ ।
కర్ణికా చ కేసరాణి పీతవర్ణాని కారయేత్ ॥ 328

ప్రకారాంతరమన్యత్తే శృణు శిష్య మయోచ్యతే ।
పూర్వోత్తరగతా రేఖా సప్తవింశన్మితాః శుభాః ॥ 328

నలువదినాలుగు రేఖలచే సప్తేందులింగమను లింగతోభద్ర శివ పూజాపీఠము ప్రకల్పింపబడినది. (306). ఈ సప్తేందులింగ లింగతోభద్రమునకు మూడేసికోష్ఠములను వృద్ధిజేసి రచించితే 17 లింగములచే లింగతోభద్ర పీఠమేర్పడుచున్నది. ఈ పదునేడింటి (17) తత్త్వమేమనిన-దశ ఇంద్రియములు, పంచప్రాణములు, మనుస్సు చేరి 16 ను షోడశ కళలనబడు వీటితో సాక్షిగానుండు ఆత్మచేరియున్నదని స్మరింపబడె. (315)

తత్షట్ త్రింశత్పదేష్వేవ సర్వతోభద్రముత్తమమ్ ।
అబ్ధినేత్రాగ్నికోష్ఠైశ్చ రచయేత్పూర్వవచ్ఛుభమ్ ॥ 329

పరిధిస్తత్సమంతాచ్చ ప్రకల్ప్యః పీతవర్ణకః ।
అష్టోత్తరశతైర్లింగతోభద్రం కథితం యథా ॥ 330

తస్య చతుర్షు పార్శ్వేషు రచయేదర్కలింగకమ్ ।
కోణే కోణే త్రిపదోఽబ్జః శృంఖలా సక్తపాదికా ॥ 331

వల్లీమనుపదా భద్రం షట్పదం త్రీందువాపికా ।
లింగం షడ్వింశపదజం భద్రం స్యాద్వాపికోపరి ॥ 332

లింగపార్శ్వపదాన్యేవ షట్ పీఠాని ప్రకల్పయేత్ ।
లింగోపరితనా వీథీ నీలా వల్ల్యోర్నియోజయేత్ ॥ 333

చతుష్పదైర్లింగశిరస్తథా పరిధయో బహిః ।
సర్వాణి తు యథాపూర్వముక్తవర్ణైః సురంజయేత్ ॥ 334

చతుర్వింశతిరాలేఖ్యా రేఖాః ప్రాగ్దక్షిణాయతాః ।
కోణేషు శృంఖలా పంచపదా వల్ల్యశ్చ పార్శ్వతః ॥ 335

పదైర్నవభిరాలేఖ్యాశ్చతుర్భిర్లఘు శృంఖలాః ।
లఘువల్ల్యః పదైః షడ్భిస్తతోఽష్టాదశభిః పదైః ॥ 336

కృత్వా లింగాని వాప్యస్తు త్రయోదశభిరంతరా ।
తతో వీథీద్వయేనైవ పీఠం కుర్యాద్విచక్షణః ॥ 337

తస్య పాదాః పంచపదా ద్వారాణ్యపి తథైవ చ ।
ఏకాశీతిపదం మధ్యే పద్మం స్వస్తికమిష్యతే ॥ 338

కోణేషు శృంఖలాః కార్యాః పదైస్త్రిభిరతః పరమ్ ।
పదైశ్చతుర్భిర్దిక్షు స్యుర్భద్రాణ్యేషాం సమంతతః ॥ 339

ఏకాదశపదే వల్ల్యౌ మధ్యేఽష్టదళ మాలిఖేత్ ।
పద్మం నవపదం హ్యేతల్లింగతోభద్రమిష్యతే ॥ 340

శృంఖలా కృష్ణవర్ణేన వల్లీ నీలేన పూరయేత్ ।
రక్తేన శృంఖలా లక్ష్మ్యై వల్లీ పీతేన పూరయేత్ ॥ 341

లింగాని కృష్ణవర్ణాని శ్వేతేనాప్యథ వాపికా ।
పీఠం స్వపాదం శ్వేతేన పీతేన ద్వారపూరణమ్ ॥ 342

మధ్యే స్యుః శృంఖలా రక్తా వల్లీర్నీలేన పూరయేత్ ।
భద్రాణి పీతవర్ణాని పీతా పంకజకర్ణికా ॥ 343

దళాని శ్వేతవర్ణాని యద్వా చిత్రాణి కల్పయేత్ ।
తిస్రో రేఖా బహిః కార్యాః సితరక్తాఽసితాః క్రమాత్ ॥ 344

ఊర్ధ్వలింగోద్భవం హ్యష్టలింగతోభద్రముచ్యతే ।
అన్యన్మయాతిరమ్యం తచ్ఛృణు శిష్యాత్ర కౌతుకమ్ ॥ 345

అష్టావింశతిరేఖాశ్చ తిర్యగూర్ధ్వం సమంతతః ।
సప్తవింశతికోష్ఠేషు షడంతే పరిధయః స్మృతాః ॥ 346

కోణేషు త్రిపదైశ్చంద్రః శృంఖలా పంచపాదికా ।
వాప్యర్కపాదజా భద్రషట్కం షట్ షట్ పదాత్మకమ్ ॥ 347

ఊర్ధ్వే భద్రే రవిపదే పదైరష్టాదశైః శివాః ।
ఆత్మనోఽభిముఖాః సర్వే కార్యా హ్యష్ట శుభావహాః ॥ 348

త్రయోదశాంఘ్రిజా వాపీ తత్త్రయం పశ్చిమే స్మృతమ్ ।
పూర్వే త్వేకా ద్వే శకలే శేషం సర్వం తు పూర్వవత్ ॥ 349

తిర్యక్ భద్రే వేదపదే పదన్యునోర్ధ్వవల్లరీ ।
దక్షిణోత్తరతశ్చాపి వాపీనాం శకలాష్టకమ్ ॥ 350

ఉభయోర్లింగయోర్మాలా సా త్రిభిర్నయనైః స్మృతా ।
సర్వత్ర నేత్రే ద్వే జేయే దక్షిణోత్తరయోస్త్రిభిః ।
పృథక్ చత్వారి భద్రాణి హ్యథోభద్రే చతుష్పదే ॥ 351

దక్షిణోత్తరదిగ్భాగే పూర్వవల్ల్యా చ సంధయేత్ ।
త్ర్యంతే మధ్యే తు పరిధిః పంచవిశైర్జలేరుహమ్ ॥ 352

శృంఖలా ద్విపదా మధ్యే వల్లీ షట్పాదజా స్మృతా ॥
వాప్యః పంచపదైర్ జ్ఞేయా భద్రం వేదపదాత్మకమ్ ॥ 353

సితా వాపీ శివః కృష్ణః పద్మభద్రే చ లోహితే ।
తిర్యక్భద్ర లింగమాలే పరిధీ పీతవర్ణకౌ ॥ 354

నేత్రేందూ ధవలౌ కృష్ణా శృంఖలా హరితా లతా ।
పదత్రయం హి వాప్యూర్ధ్వం తద్యథారుచి పూరయేత్ ॥ 355

పీతశుక్లరక్తకృష్ణా బహిః పరిధయః స్మృతాః ।
అష్టలింగాత్మకం జ్ఞేయం లింగతోభద్రముత్తమమ్ ॥ 356

ఇక నవలింగాత్మకమగు లింగతోభద్రపీఠము 36 రేఖలచే ఏర్పరచవచ్చును. మరియొకవిధము 27 రేఖలచే ఏర్పడుచున్నది. (345). మరియు 28 రేఖలచే అష్టలింగాత్మకమగు లింగతోభద్రపీఠము నిరూపింపబడినది. అన్నిటియందును ప్రకృతిపురుషాత్మకమగు అధ్యాత్మతత్త్వభావన ఉండవలయును అనునది ఆయా రచనాక్రమమున చక్కగా తెలియబడుచున్నది. (356)

అథవాఽన్యౌ ద్వౌ ప్రకారౌ ప్రోచ్యతే శృణు తావపి ।
ద్వాత్రింశచ్చరణేష్వేవం చతుర్లింగం తథాఽష్టకమ్ ॥ 357

యుక్త్యా విరచయేత్తత్ర విశేషోఽథ నిగద్యతే ।
ఆద్య లింగం చతుర్వింశపదమష్టేందువాపికా ॥ 358

భద్రం వింశపదం చాన్యల్లింగమష్టాదశాత్మకమ్ ।
భద్రం నవపదం శేషం యావదవధి యోజయేత్ ॥ 359

రేఖాస్త్వష్టాదశ ప్రోక్తాశ్చతుర్లింగసముద్భవే ।
కోణేందుస్త్రిపదః శ్వేతస్త్రిపదైః కృష్ణ శృంఖలా ॥ 360

వల్లీ సప్తపదా నీలా భద్రం రక్తం చతుష్పదమ్ ।
భద్రపార్శ్వే మహాలింగం కృష్ణమష్టాదశైః పదైః ॥ 361

శివపార్శ్వే తు వాపీం చ కుర్యాత్పంచపదాం సితామ్ ।
పదమేకం తథా పీతం భద్రం వాప్యస్తు మధ్యతః ॥ 362

శిరసి శృంఖలా పార్శ్వం కుర్యాత్పీతం పదత్రయమ్ ।
లింగానాం స్కంధతః కోష్ఠా వింశత్యో రక్తవర్ణకాః ॥ 363

పరిధిః పీతవర్ణస్తు పదైః షోడశభిః స్మృతః ।
పదైస్తు నవభిః పశ్చాత్పద్మం చిత్రం సకర్ణికమ్ ॥ 364

తిర్యగూర్ధ్వం గతా రేఖాః కార్యాః స్నిగ్ధాస్త్రయోదశ ।
కోణేందుస్త్రిపదః కార్యః శృంఖలా త్రిపదా స్మృతా ॥ 365

వల్లీ చ షట్పదా నీలా రక్తం భద్రం ప్రకల్పయేత్ ।
పదైర్ద్వాదశభిః స్పష్టముత్తరే పూర్వదక్షిణే ॥ 366

పశ్చిమాయాం మహారుద్ర మష్టావింశతికోష్టకే ।
లింగపార్శ్వే తథా మూర్ధ్ని హ్యష్ట కోష్ఠాస్తు పీతకాః ॥ 367

లింగమేకం తథా గౌర్యాస్తిలకం ప్రోక్తమండలే ।
పూజయేన్మండలే చైవ తస్య గౌరీ ప్రసీదతి ॥ 368

ప్రాగుదీచ్యాం గతా రేఖాః కుర్యాదేకోనవింశతిః ।
ఖండేందుస్త్రిపదః కోణే శృంఖలా పంచభిః పదైః ॥ 369

ఏకాదశపదా వల్లీ భద్రం తు నవభిః పదైః ।
చతుర్వింశత్పదా వాపీ పరిధిర్వింశకైః పదైః ॥ 370

మధ్యం షోడశభిః కోష్ఠైః పద్మమష్టదళం స్మృతమ్ ।
శ్వేతేందు శృంఖలా కృష్ణా వల్లీ నీలేన పూరయేత్ ॥ 371

భద్రారుణం సితా వాపీ పాతే పరిధికర్ణికే ।
రక్తం వా చిత్రితం పద్మం బాహ్యాః సత్త్వరజస్తమాః ।
సర్వతోభద్రకం చేదం కర్తవ్యం సర్వకర్మసు ॥ 372

పిదప ఇక రెండువిధములుగలవు. 32 పదములలో నాల్గులింగములను రచించి, మరినాల్గు లింగములను చేర్చినను సరియే. లేనియెడ చతుర్లింగాత్మకముగనే రచింపవచ్చును. అయిన చతుర్లింగాత్మకము నందు 18 రేఖలుగానుండును. అందులో గౌరీప్రసాదకరమగు లింగమును రచించి దేవీతృప్తిని కూడా పొందవచ్చును. (368) మరియు, 29 రేఖలను ఏర్పరచిన సర్వకర్మోప యోగియగు సర్వతోభద్రమునందు మూడేసి పదములచే కోణములలో అర్ధచంద్రాకృతులును, పంచపదములచే శృంఖలమును, ఏకపదాత్మకవల్లియును, 9 పదములచే భద్రమును, నడుమ 16 కోష్ఠములచే అష్టదళ పద్మమును కలిగి యుండవలయును. చంద్రకళ తెలుపు, శృంఖలము నలుపు, వల్లరి నీలమును, భద్రము ఎఱుపు, వాపిక తెలుపు, పరిధులును కమలకర్ణికయును పసుపు, పద్మము చిత్రవర్ణము గాని, ఎరుపు గాని గల్గియుండును. సత్వ రజ స్తమములు బాహ్యావరకములు. (372) ఇట్లే లింగతోభద్రముల రచనగూడ చెప్పబడినది. ఇవి శివపదములుగా ఎంచునది. విష్ణుపూజనమున ఇవి యోగ్యములు కావు. ఈ రామలింగాత్మక భద్రపీఠము శివునికి, విష్ణువునకు యోగ్యమయినది.

ఏవం లింగతోభద్రాణాం రచనాః కథితా మయా ।
ఏతాః శివపరా జ్ఞేయా న యోగ్యా విష్ణుపూజనే ॥ **373**

రామలింగాత్మకం యోగ్యం శ్రీవిష్ణోరర్చనస్య చ ।
పూజనే త్వేక ఏవాత్ర తద్విస్తారేణ కథ్యతే ॥ **374**

శివస్య పూజనే లింగముపాస్యం పరిచింతయేత్ ।
ఉపాసికా రామముద్రా జ్ఞేయా తద్వద్ధ్వవానపి ॥ **375**

లింగతోభద్రవచ్చాత్ర సమావాహ్యేతిబుద్ధితః ।
రామతోభద్రకం యచ్చ జ్ఞేయం విష్ణుపరం హి తత్ ॥ **376**

రమా రామేతి వర్ణవచ్చిహ్నితం భద్రకం కృతమ్ ।
ధియా దేవీపరం తచ్చ జ్ఞాతవ్యం సర్వకర్మసు ॥ **377**

ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, రామదాస విష్ణుదాససంవాదే, రామలింగతోభద్రాణాం, తథా లింగతోభద్రాణాం రచనాప్రకారకథనం నామ పంచమః సర్గః ॥

కావున ఇది ఒక్కటియే సర్వపూజార్హము. కావున విస్తారముగా చెప్పబడును.

శివుని ఆరాధించునపుడు ఉపాస్యమూర్తి లింగముగా భావింపవలయును, రామముద్ర ఉపాసికయని తెలియునది. అట్లే నీవును లింగతోభద్రమునందెట్లో అట్లే బుద్ధిచే చక్కగా ఆవాహనచేసి పూజించునది. రామతోభద్రకమనునది విష్ణుపరమైయుండును. "రమా, రామా" అనువర్ణములచే చిహ్నితమగు భద్రపీఠమును సర్వకర్మలయందును దేవీపరమని బుద్ధిచే తెలుసుకొనవలయును. (377)

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో శ్రీరామదాస-విష్ణుదాసుల సంవాదరూపమైన శ్రీరామలింగతోభద్రవిస్తారమును వివరించు 5వ సర్గ ముగిసినది.**

# షష్ఠః సర్గః–6వ సర్గ (1)

## రామతోభద్ర దేవతాస్థాపన విధానము

అథ సర్వతోభద్రం తద్దేవతాశ్చ లిఖ్యంతే ।

ప్రాణానాయస్య, దేశకాలౌ స్మృత్వా, రామతోభద్రదేవతాస్థాపనం వా, రామలింగతోభద్ర దేవతాస్థాపనం వా, రమానామతోభద్రదేవతాస్థాపనం వా, రామనామతోభద్రదేవతాస్థాపనం కరిష్య ఇతి సంకల్ప్య ।

బ్రహ్మజ్ఞానమితి మంత్రస్య, వామదేవఋషిః, త్రిష్టుప్ ఛందః, బ్రహ్మోదేవతా, బ్రహ్మస్థాపనే వినియోగః ॥

'బ్రహ్మజజ్ఞానం..' సర్వతోభద్రమధ్యే బ్రహ్మాణమావాహయామి । 1

ఉత్తరే వాపీప్రాంతభాగే 'ఆప్యాయస్వస...
సోమాయ నమః, సోమమావాహయామి ॥ 2

ఈశాన్యాం ఖండేందౌ 'తమీశానంజ...
ఈశానాయ నమః, ఈశానమావాహయామి ॥ 3

పూర్వస్యాం వాప్యాం 'త్రాతారమింద్ర...
ఇంద్రాయ నమః, ఇంద్రమావాహయామి ॥ 4

ఆగ్నేయ్యాం ఖండేందౌ 'అగ్నిందూతం....
అగ్నయే నమః, అగ్నిమావాహయామి ॥ 5

దక్షిణస్యాం వాప్యాం 'యమాయత్వాగ్నిం....
యమాయ నమః, యమమావాహయామి ॥ 6

నైఋుత్యాం ఖండేందౌ 'అసున్వంతం...
నిఋురుతయే నమః, నిఋురుతి మావాహయామి ॥ 7

పశ్చిమాయాం వాప్యాం 'తత్వాయామి....
వరుణాయ నమః, వరుణమావాహయామి ॥ 8

వాయవ్యే ఖండేందౌ 'ఆనోనియుద్భిః....
వాయవే నమః, వాయుమావాహయామి ॥ 9

వాయుసోమమధ్యే భద్రే 'నివేశనీసంగమనీవసూనాం...
ధ్రువం అధ్వరం సోమం ఆపః అనిలం అనలం
ప్రత్యూషం ప్రభాసమ్ ఇతి, అష్టవసూనావాహయామి ॥ 10

సోమేశానమధ్యే భద్రే 'నమస్తే రుద్ర...
వీరభద్రం శంభుం గిరిశం అజైకపాదం అహిర్బుధ్న్య
పినాకినం భువనాధీశ్వరం కపాలినం దిక్పతిం
స్థాణుం రుద్రమ్ ఇతి ఏకాదశ రుద్రానావాహయామి ॥ 11

ఈశానేంద్రమధ్యే భద్రే 'ఆకృష్ణేన...
భగం వరుణం సూర్యం వేదాంగం భానుం రవిం గభస్తిం
హిరణ్యరేతసం దివాకరం మిత్రం ఆదిత్యం విష్ణుమ్ ఇతి
ద్వాదశాదిత్యానావాహయామి ॥ 12

ఇంద్రాగ్నిమధ్యే భద్రే 'అశ్వినా తేజసా చక్షుం...
అశ్వినీకుమారాభ్యాం నమః, అశ్వినౌ దేవావాహయామి ॥ 13

అగ్నియమమధ్యే భద్రే 'సమశ్చర్షణిర్ ధృతో....
సపైతృకాన్ దేవానామావాహయామి ॥ 14

యమనిర్‌ఋుతిమధ్యే భద్రే 'అభిత్యం దేవం...
యక్షేభ్యో నమః, యక్షానామావాహయామి ॥ 15

నిర్‌ఋుతివరుణయోర్మధ్యే భద్రే 'ఆయంగౌః ...
భూతనాగేభ్యో నమః, భూతాన్నాగానామావాహయామి ॥ 16

వరుణవాయుమధ్యే భద్రే 'నదీభ్యః పౌంజిష్ఠం...
గంధర్వాప్సరోభ్యో నమః, గంధర్వాప్సరస ఆవాహయామి ॥ 17

బ్రహ్మసోమమధ్యే వాప్యాం 'యదక్రందః ప్రథమం ...
స్కందాయ నమః, స్కందమావాహయామి ॥ **18**

'నమః శంభవే... నందీశ్వరాయ నమః
నందీశ్వర మావాహయామి ॥ **19**

'భద్రం కర్ణేభిః ... శూలాయ నమః, శూలమావాహయామి ॥ **20**

'విశ్వకర్మాహ్యజ.... మహాకాలాయ నమః
మహాకాలమావాహయామి ॥ **21**

బ్రహ్మేశానమధ్యే వల్లీషు 'అదితిర్ ధ్యౌరం....
ఋక్షాదిభ్యో నమః, ఋక్షాదీనావాహయామి ॥ **22**

బ్రహ్మేంద్రమధ్యే వాప్యాం 'శ్రీశ్చతేత ....
దుర్గాయై నమః, దుర్గామావాహయామి ॥ **23**

'ఇదం విష్ణు ... విష్ణవే నమః  విష్ణుమావాహయామి ॥ **24**

బ్రహ్మాగ్నిమధ్యే వల్లీషు 'ఉదీరితా ...
స్వధాయై నమః, స్వధామావాహయామి ॥ **25**

బ్రహ్మమధ్యే వాప్యాం 'అరం మృత్యో ...
మృత్యవే నమః, మృత్యుమావాహయామి ॥ **26**

బ్రహ్మవరుణమన్యే వాప్యాం 'గణానాంత్వా...
గణపతయే నమః, గణపతి మావాహయామి ॥ **27**

బ్రహ్మవరుణమధ్యే వాప్యాం 'శన్నోదేవీ...
అద్భ్యో నమః, అప్ ఆవాహయామి ॥ **28**

బ్రహ్మవాయుమధ్యే వల్లీషు 'మరుతోయస్య....
మరుతే నమః, మరుతమావాహయామి ॥ **29**

బ్రహ్మణః పాదమూలే కర్ణికాధః 'స్యోనాపృథివి....
పృథివ్యై నమః, పృథ్వీ మావాహయామి ॥ **30**

తత్రైవ 'పంచ నద్యః సరస్వతీం....
గంగాదిసర్వనదీనావాహయామి ॥ **31**

'తత్రైవ 'ధామ్నోధామ్నోరాజంస్తతోవరుణం....
సప్తసాగరేభ్యో నమః, సప్తసాగరానావాహయామి ॥ **32**

తతః కర్ణికోపరి నామమంత్రేణ మేరవే నమః,
గదామావాహయామి ॥ **33**

తతః పీతపరిధౌ సోమాదిసన్నిధౌ క్రమేణ ఆయుధాని ।
సోమసమీపే గదాయై నమః, గదామావాహయామి ॥ **34**

ఈశానసమీపే శూలాయ నమః, శూలమావాహయామి ॥ **35**

ఇంద్రసమీపే వజ్రాయ నమః, వజ్రమావాహయామి ॥ **36**

అగ్నిసమీపే శక్తయే నమః, శక్తిమావాహయామి ॥ **37**

యమసమీపే దండాయ నమః, దండమావాహయామి ॥ **38**

నిర్ఋతిసమీపే ఖడ్గాయ నమః, ఖడ్గమావాహయామి ॥ **39**

వరుణసమీపే పాశాయ నమః, పాశమావాహయామి ॥ **40**

వాయుసమీపే అంకుశాయ నమః, అంకుశమావాహయామి ॥ **41**

పునః సోమస్యోత్తరే సదా సమీపే గౌతమాయ నమః,
గౌతమమావాహయామి ॥ **42**

ఈశాన్యాం భరద్వాజాయ నమః, భరద్వాజమావాహయామి ॥ **43**

పూర్వే విశ్వామిత్రాయ నమః, విశ్వామిత్రమావాహయామి ॥ **44**

ఆగ్నేయ్యాం కశ్యపాయ నమః, కశ్యపమావాహయామి ॥ **45**

దక్షిణే జమదగ్నయే నమః, జమదగ్నిమావాహయామి ॥ **46**

నైర్ఋత్యాం వసిష్ఠాయ నమః, వసిష్ఠమావాహయామి ॥ **47**

పశ్చిమే అత్రయే నమః, అత్రిమావాహయామి ॥ **48**

వాయవ్యాం అరుంధత్యై నమః, అరుంధతీమావాహయామి ॥ **49**

పునః పూర్వాదిక్రమేణ పూర్వే విశ్వామిత్రసమీపే
ఐంద్ర్యై నమః, ఐంద్రీమావాహయామి ॥ **50**

ఆగ్నేయ్యాం కౌమార్యై నమః, కౌమారీమావాహయామి ॥ **51**

దక్షిణే బ్రాహ్మ్యై నమః, బ్రాహ్మీమావాహయామి ॥ **52**

నైర్‌ఋత్యాం వారాహ్యై నమః, వారాహీమావాహయామి ॥ **53**

పశ్చిమే చాముండాయై నమః, చాముండామావాహయామి ॥ **54**

వాయవ్యే వైష్ణవ్యై నమః, వైష్ణవీనామావాహయామి ॥ **55**

ఉత్తరే మాహేశ్వర్యై నమః, మాహేశ్వరీమావాహయామి ॥ **56**

ఈశాన్యాం వైనాయక్యై నమః, వైమాయకీమావాహయామి ॥ **57**

అష్టదళ మధ్యే సూర్యాయ నమః, సూర్యమావాహయామి ॥ **58**

బాహ్యపూర్వాద్యష్టదిక్షు యథాస్థానేషు
పూర్వేసోమాయ నమః, సోమమావాహయామి ॥ **59**

ఆగ్నేయ్యాం భౌమాయ నమః, భౌమమావాహయామి ॥ **60**

దక్షిణే బుధాయ నమః, బుధమావాహయామి ॥ **61**

నైర్‌ఋత్యాం బృహస్పతయే నమః, బృహస్పతిమావాహయామి । **62**

పశ్చిమే శుక్రాయ నమః, శుక్రమావాహయామి ॥ **63**

వాయవ్యాం శనైశ్చరాయ నమః, శనైశ్చరమావాహయామి ॥ **64**

ఉత్తరే రాహవే నమః, రాహుమావాహయామి ॥ **65**

ఈశాన్యాం కేతవే నమః, కేతుమావాహయామి ॥ **66**

ఏతా దేవతాః సర్వతోభద్రే ప్రతిష్ఠాప్య తతః పరిధిభూతపంక్తౌ
సుషేణాయ నమః, సుషేణమావాహయామి ॥ 67

సర్వేషు లింగేషు రుద్రాయ నమః, రుద్రమావాహయామి ॥ 68
సర్వాసు వాపీషు నళాయ నమః, నలమావాహయామి ॥ 69

సర్వేషు భద్రేషు సుగ్రీవాయ నమః, సుగ్రీవమావాహయామి ॥ 70

సర్వేషు తిర్యగ్భద్రేషు గవాయ నమః, గవమావాహయామి ॥ 71

సర్వాసు పీత శృంఖలాసు అంగదాయ నమః,
అంగదమావాహయామి ॥ 72

సర్వాసు కృష్ణ శృంఖలాసు విభీషణాయ నమః,
విభీషణమావాహయామి ॥ 73

సర్వాసు వల్లీషు జాంబవతే నమః,
జాంబవంతమావాహయామి ॥ 74

సర్వేషు ఖండేషు మైందాయ నమః,
మైందమావాహయామి ॥ 75

సర్వేషు పరిధిషు ద్వివిదాయ నమః,
ద్వివిదమావాహయామి ॥ 76

ముద్రాయాం రామజానకీభ్యాం నమః
రామజానకీమావాహయామి ॥ 77

ముద్రాయాః పశ్చిమే పోతపరిధౌ లక్ష్మణాయ నమః,
లక్ష్మణమావాహయామి ॥ 78

ముద్రాయా ఉత్తరే భరతాయ నమః, భరతమావాహయామి ॥ 79

ముద్రాయా దక్షిణే శత్రుఘ్నాయ నమః,
శత్రుఘ్నమావాహయామి ॥ 80

ముద్రాయాః పురతః వాయుపుత్రాయ నమః,
వాయుపుత్రమావాహయామి ॥ 81

బహిస్త్రిపరిధిషు శ్వేతపరిధౌ భాగీరథ్యై నమః,
భాగీరథీమావాహయామి ॥ 82

రక్తపరిధౌ సరస్వత్యై నమః, సరస్వతీమావాహయామి ॥ 83

కృష్ణపరిధౌ యమునాయై నమః, యమునామావాహయామి ॥ 84

ఏవ మేవ రమారామభద్రేఽప్యావాహనం కార్యమ్ ।
రమారామభద్రే ముద్రాయామేవ విశేషః ।
ఆదౌ రమామావాహ్య రామమావాహయేత్ ।
ఏవమావాహనం కృత్వా షోడశోపచారైః పూజయేత్ ॥
శేషాన్నేన దిగ్బలిః కార్యః ॥

ఇతి ఆనందరామాయణాంతర్గత రామతోభద్రదేవతా స్థాపనవిధిః ॥

# షష్ఠః సర్గః-6వ సర్గ (2)

## రామనవమీ కథావర్ణన

శ్రీరామదాస ఉవాచ

శిష్య యద్యత్ప్రియం తస్మై రామాయ తద్వదామ్యహమ్ ।
మాసేషు చైత్రమాసస్తు రాఘవస్యాతివల్లభః ॥ 1

పక్షయోః సితపక్షస్తు ప్రియోఽస్తి రాఘవస్య హి ।
సర్వాసు తిథిషు శ్రేష్ఠా నవమీ రాఘవప్రియా ॥ 2

సూర్యవంశసముద్భూతస్తస్మాచ్చ భానువాసరః ।
ప్రియోఽతిరాఘవస్యైవ నక్షత్రేషు పునర్వసు ॥ 3

చంపకః పుష్పజాతౌ హి తులసీ వై తథైవ చ ।
అథవా నవకం చాపి పుష్పాణాం రాఘవప్రియమ్ ॥ 4

జాతిశ్చంపకమందారౌ తులసీ మునిమాలతీ ।
దమనః కేతకీ సింహీ పుష్పాణాం నవకం స్మృతమ్ ॥ 5

తథా నవవిధం చాన్నం రాఘవస్యాతివల్లభమ్ ।
మోదకో లడ్డుకో మండో పూర్ణగర్భాథ ఫేణికా ॥ 6

వటకః పర్పటః ఖాద్యం ఘృతపక్వం నవం త్వితి ।
ఏతాని నవ భక్ష్యాణి రాఘవస్య ప్రియాణి హి ॥ 7

అథవాన్యత్ప్రవక్ష్యామి దివ్యాన్ననవకం శుభమ్ ।
మోదకో లడ్డుకో మండో వటకః ఫేణికా తథా ॥ 8

వరాన్న మోదనః శాకం పాయసం నవకం శుభమ్ ।
అన్న్యచ్ఛృణుష్వ భో శిష్య నవాన్నం రాఘవప్రియమ్ ॥ 9

ఏకాశీతికుడవం చ గోక్షీరం తండులాస్తథా ।
సపాదద్వికుడవాశ్చ ముద్గాశ్చ వితుషాస్తథా ॥ 10

**కుడవస్త్వేక ఏవాథ శర్కరా కుడవా నవ ।**
**త్రికుడవం మధు ప్రోక్తం ఘృతం చ కుడవద్వయమ్ ॥ 11**

**మరీచం కుడవాష్టాంశమితం నారీఫలం తథా ।**
**కుడవస్త్వేక ఏవాథ జాతిపత్రిస్తథైవ చ ॥ 12**

**గ్రాహ్యో మారీచమానేన నవాన్నం నవభిస్త్విదమ్ ।**
**తోషదం రామచంద్రస్య భక్త్యా కార్యం సదా నరైః ॥ 13**

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, విష్ణుదాసా! యేది యేది శ్రీరామచంద్రస్వామికి ప్రియమై యుండునో వానిని చెప్పెదను. శ్రీరామునికి మాసములలో చైత్రమాసము, పక్షములలో శుక్ల పక్షము, ప్రతిపదాది తిథులలో నవమీ తిథి ప్రియమైనది. శ్రీరాముడు సూర్యవంశోత్పన్నుడు గనుక ఆది(త్య)వారము వారములలో అతనికిష్టము. నక్షత్రములలో పునర్వసూనక్షత్రము ప్రియము, ఇక పుష్పములో చంపక పుష్పము, అట్లే తులసి యును, మఱియు నవ (తొమ్మిది) పుష్పములు– జాజి, సంపంగి, మందారము, తులసి, అగసి, మాలతి, దవనము, మొగలి, సింహి (ములగ)– యనునవి ఇష్టము. ఇట్లే నవవిధ (తొమ్మిది)అన్నములు –మోదకములు, లడ్డులు, మీగడ, ఫేణీలు, సుగియలు, వడియములు, గారెలు, నేతివంట– యనునవి, లేదా– మోదకము, లడ్డు, మీగడ, వడియము, ఫేణి అన్నము, వరాన్నము, శాకము, పాయసము– అను ఈ దివ్యాన్నములు శ్రీరామునికి ఇష్టము.

ఇక మారీచుని మానముచే ఒక నవాన్న పరికల్పనమెట్లనిన– కుడవమనగా చతుఃప్రస్థ చతుర్థాంశము, ఒకమానెడని కొందరు, ఆవుపాలు 81 కుడవములు, బియ్యము 81 కుడవములు, పెసరపప్పు 2 కుడవములు, పెసరపప్పు 1 కుడవము మాత్రమే, పంచదార 9 కుడవములు, తేనె 3 కుడవములు, నెయ్యి 2 కుడవములు, కుడవములో ఎనిమిదవపాలు మిరియములు, జాజికాయ అట్లే, జాపత్రి 1 కుడవము. ఇట్లు ఈ తొమ్మిదింటిచే నవాన్నమేర్పడును. భక్తితో శ్రీరామునికి ప్రీతికరముగా మానవులు అర్పింపవలయును.

**లఘు నవాన్నం వక్ష్యామి నైవేద్యార్థం నిరంతరమ్ ।**
**కుడవా నవ గోక్షీరం తండులాః కుడవస్య చ ॥ 14**

**చతుర్థాంశమితా గ్రాహ్యాః కుడవాష్టాంశసంమితాః ।**
**గ్రాహ్యో వితుషముద్గాశ్చ కుడవార్ధం సితా స్మృతా ॥ 15**

**ఘృతం ముద్గసమం గ్రాహ్యం తావన్మానం మధు స్మృతమ్ ।**
**తావన్మానం శ్రీఫలం చ మరీచం టంకసమ్మితమ్ ॥ 16**

టంకార్ధా జాతిపత్రశ్చ నవాన్నం లఘుకీర్తితమ్ ।
కుడవోఽర్కటకమితష్టంకో మాషచతుష్టయమ్ ॥ 17

లఘు నవాన్నమేతచ్చ రాఘవాయ నివేదయేత్ ।
నిరంతరం హి పూజాయాం రాఘవస్యాతి హర్షదమ్ ॥ 18

చూతజంబుకపిత్థాశ్చ బీజపూరం చ దాడిమమ్ ।
ఖర్జూరీ నారికేళం చ కదలీఫలమేవ చ ॥ 19

పనసం చేతి రామాయ ఫలాని నవ సర్వదా ।
ఏతాన్యతిప్రియాణ్యత్ర పూజాయాం తన్నివేదయేత్ ॥ 20

సీతాఫలం చ జంబీరం నారంగం స్నిగ్ధమజ్జకమ్ ।
జాతీఫలం మాతులింగం తథా ద్రాక్షాఫలం శుభమ్ ॥ 21

ఉర్వారుకం తథా ధాత్రీఫలం చైతాని వై నవ ।
ఫలాని రామపూజాయాముక్తాని మునిభిః సదా ॥ 22

నవోపచారస్తాంబూలో రాఘవాయ నివేదయేత్ ।
నాగవల్లీః క్రముకం చ ఖదిరః సౌధ ఏవ చ ॥ 23

జాతీపత్రో లవంగం చ జాతీఫలవరాంగకే ।
ఏలా చేతి నవవిధస్తాంబూలః కీర్త్యతే బుధైః ॥ 24

నవరాజోపచారాంశ్చ రాఘవాయ నివేదయేత్ ।
ఛత్రం సింహాసనం యానం చామరం వ్యజనం తథా ॥ 25

పానతాంబూలపాత్రం చ పాత్రం నిష్ఠీవనస్య చ ।
వస్త్రకోశశ్చేతి రాజ్ఞాముపచారా నవ స్మృతాః ॥ 26

నవాథ భోగ్యవస్తూని రాఘవాయ నివేదయేత్ ।
చందనం పుష్పమాలాం చ ద్రవ్యం పరిమళం తథా ॥ 27

అవతంసః ఫలం చాపి సుగంధతైలముత్తమమ్ ।
తాంబూలం కస్తూరి చాపి తథా రక్తాక్షతాః శుభాః ॥ 28

## శ్రీరామునికి ప్రీతిపాత్రమగు నవ (తొమ్మిది)పదార్థములు

ప్రతిరోజూ నివేదనచేయుటకు లఘునవాన్న క్రమము– 9 కుడవములు ఆవుపాలు, కుడవములో నాలుగవవంతు బియ్యము, కుడవములో ఎమిదవవంతు పెసరపప్పు, 4 కుడవముల చక్కెర, కుడవములో ఎనిమిదవ వంతు నెయ్యి, అంతయే తేనె, దానితో సమము బిల్వపండు, 1 టంకము మిరియములు, జాపత్రి 4 టంకములు ఇవి లఘు నవాన్నము. ఇచ్చట కుడవమనగా 12 డబూకములు. డబూకమనిన పావుసేరని కొందరు, ఆళాకని కొందరును, 4 రూపాయల తూకమని కొందరును వ్యవహరించెదరు. ఇచ్చట నాల్గు మినుముల తూకము టంకమగునని యుండుటచే, ఢబూక పరిమాణము చెటాకని తోచుచున్నది. ఇట్టి రామోపాసక సంప్రదాయాగత లఘునవాన్నమును శ్రీరామునికి అర్పింపతగును. నిరంతరమును పూజయందు శ్రీరామునికిది ప్రీతికరమయినది.

మామిడిపండు, నేరేడుపండు, వెలగపండు, మాదిఫలము(ఆల్‌బొకరా), దానిమ్మపండు, ఖర్జూరము, కొబ్బరికాయ, అరటిపండు, పనసపండు– అను ఈ తొమ్మిది ఫలములను పూజయందు శ్రీరామునికి అర్పింపవచ్చును.

సీతాఫలము, నిమ్మపండు, కిచ్చిలిపండు, జాతీఫలము, మాతులుంగము, ద్రాక్ష, దోసపండు, ఉసిరిక ఈ 9 ఫలములను రామపూజయందు మునులు చెప్పియున్నారు.

తమలపాకులు, వక్కలు, సున్నము, జాజికాయ, జాపత్రి, లవంగము, ఏలకులు, జాతిఫలము, చంద్రపొడి ఇవి చేరిన అది శ్రీరామునికి నవోపచార తాంబూల మనబడును.

ఛత్రము(గొడుగు), సింహాసనము, యానము(పల్లకి), చామరము, వ్యజనము(విసనకఱ్ఱ), పాన(మంచినీటి)పాత్ర, తాంబూలపాత్ర, ఉమ్మి గిన్నె, బట్టల పెట్టె– ఇవి 9 రాజోపచారములను రామునికి అర్పించునది.

చందనము, పూలదండ, పరిమళద్రవ్యము, సిగపూలదండ, ఫలము, సుగంధతైలము, తాంబూలము, కస్తూరి, ఎఱ్ఱని అక్షతలు అను ఈ 9 భోగ్యవస్తువులను శ్రీరామునికి అర్పించవలెను.

**ఏతాని భోగ్యవస్తూని రాఘవాయ నివేదయేత్ ।**
**నవోపచారాః శయ్యాఽపి రాఘవాయ సమర్పయేత్ ॥ 29**

**పర్యంకతూలికా రమ్యా వితానం చోపబర్హణమ్ ।**
**ఆదర్శే దీపికా తోయపాత్రం ప్రావరణం శుభమ్ ॥ 30**

వ్యజనశ్చేతి శయ్యాయాశ్చోపచారా నవ స్మృతాః ।
నవ వస్త్రాణి రామాయ దేయాన్యతిమహాంతి చ ॥ 31

పీతాంబరముత్తరీయం చోష్ణీషం కంచుకం తథా ।
ఉష్ణీషోర్ధ్వస్థితం దివ్యం తథా చ కటిబంధనమ్ ॥ 32

ముఖశోధనవస్త్రం చ త్రిముఖం హ్యంకయోగ్యకమ్ ।
తథా ప్రావరణం దివ్యం నవ వస్త్రాణి భో ద్విజ ॥ 33

నవ దివ్యాస్త్వలంకారా దేయాః శ్రీరాఘవాయ హి ।
కుండలే కంకణే మాలా కేయూరే నూపురే తథా ॥ 34

పదకం కటిసూత్రం చ శృంఖలా ముద్రికేతి చ ।
ఏతే నవ త్వలంకారా దేయా రామాయ భక్తితః ॥ 35

ఏవం శిష్య మయా రామప్రీతిదాని మహాంతి చ ।
నవకాన్యతిరమ్యాణి తవాగ్రే కీర్తితాని హి ॥ 36

ముఖ్యాస్త్వత్ర పదార్థా హి నవకేషు మయా స్మృతాః ।
ఏభ్యస్త్వన్యే పదార్థాశ్చ యే యే సంతి సహస్రశః ॥ 37

తే సర్వే రాఘవాయాతి భక్త్యా దేయాస్తు పూజనే ।
ప్రత్యహం రామచంద్రస్య త్రికాలం పూజనం నరైః ॥ 38

కార్యం విద్యానుసారేణ న కదా శాఠ్యమాచరేత్ ।
ప్రతిపద్దినమారభ్య యావచ్చ నవమీతిథిః ॥ 39

తావద్విశేషతః కార్యం ప్రత్యహం రామపూజనమ్ ।
వివిధైర్మండపాద్యైశ్చ సంపూజ్య రఘునందనమ్ ॥ 40

పారాయణం తదగ్రే హి కర్తవ్యం నవభిర్దినైః ।
ఆనందరామచరితం పఠనీయం తు సర్వదా ॥ 41

ఇక మంచము, మెత్త, మేలుకట్టు, తలగడ, అద్దము, దీపము, మంచినీటిపాత్ర, విసనకఱ్ఱ, ఉత్తరీయ వస్త్రము ఇవి 9 యును శ్రీరామునికర్పించునట్టి శయ్యోపభోగములు.

పీతాంబరము, ఉత్తరీయము, కిరీటవస్త్రము. చొక్కాయ, కిరీటముపై దివ్యవసనము, కటీవాసము, మోముతుడుచు కరవస్త్రము, తొడమీది మూడుమూరలవస్త్రము, పైన వేసుకొను అంగవస్త్రము అను ఈ తొమ్మిది నవ వస్త్రములను అర్పింపవలె.

కుండలములు, కంకణములు, కంఠమాలిక, భుజకీర్తులు, కాలియందెలు, పదకము, మొలత్రాడు, బంగారు గొలుసు, ఉంగరము అను ఈ తొమ్మిది అలంకారములను భక్తితో అర్పింపవలయును.

విష్ణుదాసుడా! ఇట్లు క్లుప్తముగా నవోపచారప్రక్రియను ఉపదేశించితిని. ముఖ్యములగు ఇవిగాక వేరుగా ఉపచారములను ఎన్నింటినైనా చేయవచ్చును. వేలకొలదిగా ఇతర వస్తువులు కూడ సమర్పించవచ్చును. శ్రీరాముని నిత్యము మూడుకాలములలోను పూజింపవలయును. తనకు కలిగినంతలో చేయవచ్చును. ఎప్పుడును లోభత్వము కూడదు.

పాడ్యమిమొదలు నవమివరకు ప్రతిరోజూ విశేషముగా శ్రీరామచంద్రస్వామిని పూజింపవలెను, తొమ్మిది దినములలోను విచిత్రమంటపాదులతో శ్రీరాముని అర్చించి, ఆయన సన్నిధిలో ఆనంద రామచరితమును సంతతముగా పఠించునది.

**నవమ్యాం రాఘవం రామతీర్థే వాహనసంస్థితమ్ ।**
**నీత్వా మంగళతూర్యాద్యైర్ధ్వజాద్యైర్దుందుభిస్వనైః ॥ 42**

**అభిషేకస్తత్ర కార్యో రుద్రసూక్తైః సుపుణ్యదైః ।**
**తథా పురుషసూక్తేన శ్రీసూక్తేన తథైవ చ ॥ 43**

**విష్ణుసూక్తాదిభిః సూక్తైరభిషిచ్య రఘూత్తమమ్ ।**
**పూజనం విస్తరేణాథ కృత్వా గేహం సమానయేత్ ॥ 44**

**తతో హరేః కీర్తనాని స్వయం కార్యాణి వా పరైః ।**
**గాయకైః కారణీయాని వేశ్యాభిర్నర్తనాన్యపి ॥ 45**

**తతః స్వయముపోష్యాథ భక్త్యా విప్రప్రపూజనమ్ ।**
**కార్యం వై గాయకానాం చ పూజనం విస్తరేణ హి ॥ 46**

**రాత్రౌ జాగరణం కార్యం కథాభిర్గీతనృత్యకైః ।**
**దశమ్యాం ప్రాతరుత్థాయ స్నాత్వా సంపూజ్య రాఘవమ్ ॥ 47**

మధ్యాహ్నే రామచంద్రస్య పూజనం బ్రాహ్మణేషు హి ।
కార్యం తస్య విధానం తే వదామ్యద్య శృణుష్వ తత్ ॥ 48

ఏకం యుగ్మం తు విప్రస్య విప్రాష్టం చ నిమంత్రయేత్ ।
భూమిం గృహే విలిఖ్యాథ గోమయేనాతివిస్తృతామ్ ॥ 49

రంగవల్ల్యాశ్చ పద్మాని నీలపీతాదివర్ణకైః ।
తత్ర సమంతతః కృత్వా మధ్యే సింహాసనం శుభమ్ ॥ 50

స్థాప్య తత్ర మహావస్త్రైరాసనం పరికల్పయేత్ ।
అష్టోత్తరసహస్రం చ రామలింగాత్మకం శుభమ్ ॥ 51

అథవాఽష్టోత్తరశతం రామలింగాత్మకం శుభమ్ ।
అష్టోత్తరసహస్రం వా రామతోభద్రముత్తమమ్ ॥ 52

అథవాఽష్టోత్తరశతం రామతోభద్రముత్తమమ్ ।
సింహాసనే నిధాయాథ రామస్యాసనముజ్జ్వలమ్ ॥ 53

భద్రోపరి సపత్నీకం తత్ర విప్రం నివేశయేత్ ।
పశ్చిమాభిముఖే వామభాగే తత్ స్త్రీం నివేశయేత్ ॥ 54

సీతారామౌ తు దంపత్యోరావాహ్య తదనంతరమ్ ।
తత్పృష్ఠే లక్ష్మణం విప్రం చింతయేచ్చ తతః పరమ్ ॥ 55

భరతం రామసవ్యే తు ఆవాహ్య భూసురే తథా ॥ 56

విప్రేఽంజనిసుతం చాపి రామస్యాగ్రే విచింతయేత్ ।
రామస్య వాయుదిగ్భాగాత్సుగ్రీవాదీన్విచింతయేత్ ॥ 57

నవమినాడు శ్రీరామస్వామిని వాహనముమీద ఎక్కించుకొని- ఛత్ర, ధ్వజ, పతాక, మంగళ వాద్యములతో రామతీర్థమునకు వెడలి, వేదమంత్రములతో అభిషేకముచేసి, చక్కగా పూజించి, తిరిగి మందిరమునకు వచ్చి, తాను హరికీర్తనములను చేయునది. పరులచే నృత్య గీతాదులను చేయింపవచ్చు. పిదప తాను ఉపవాసము చేసి, భక్తితో విప్రులను పూజించి, గాయకులను సమ్మానించి, నృత్య, గీత కథాభివర్ణనములతో రాత్రి జాగరణము చేసి, దశమినాడు ప్రొద్దున స్నానముచేసి, శ్రీరాముని అర్చించి, మధ్యాహ్నమున బ్రాహ్మణులయందు శ్రీరామస్వామిని ఆరాధించవలయును. అది ఎట్లనిన.

## శ్రీరామస్వామిని బ్రాహ్మణులయందు ఆరాధించుట.

బ్రాహ్మణ దంపతులను ఇరువురిని, 8 మంది బ్రాహ్మణులను రామార్చనకై నిమంత్రించునది. అంతట గోమయముచే అలికి, రంగులు నిండిన తామర ముగ్గులుపెట్టి, అందు నడుమ దివ్య సింహాసనమును స్థాపించి, దానిమీద వస్త్రాసనమును కల్పించి, 1008 రామలింగాత్మకమునైనను, 108 రామలింగాత్మకమునైనను. 1008 రామతోభద్రాత్మకమునైనను, 108 రామతోభద్రాత్మకము నైనను శ్రీరామాసనమును పెట్టి, దానిపై సపత్నీక బ్రాహ్మణుని కూర్చుండబెట్టునది. పశ్చిమాభిముఖమున ఎడమపక్కలో స్త్రీని కూర్చుండబెట్టి, దంపతులయందు సీతారాములను ఆవాహనము చేసి, వెనుక ప్రక్కనుండు విప్రునియందు లక్ష్మణుని, కుడిప్రక్కనుండు ద్విజునియందు భరతునిని, ఎడమ ప్రక్కనుండు భూసురుని యందు శత్రుఘ్నునిని, ఎదుటనుండు బ్రాహ్మణునియందు ఆంజనేయునిని ఆవహించి, వాయవ్యాదిగా నాల్గుదిక్కులయందు బ్రాహ్మణులలో సుగ్రీవాదులను ఆవహించునది. ఇది నవాయతన పూజ అనబడును.

**చతుష్కోణేషు విప్రేషు తతః పూజనమాచరేత్ ।**
**నవాయతనపూజేయం జ్ఞేయా శ్రీరాఘవస్య హి ॥ 58**

**అథవా పంచాయతనం పంచవిప్రేషు చింతయేత్ ।**
**ససీత శక్తిహీనేన నరేణ సర్వదా భువి ॥ 59**

**అథవా యతినం రామస్థానే భక్త్యా నివేశయేత్ ।**
**పూగీఫలమయీం సీతాం యతివామే నివేశ్య చ ॥ 60**

**కార్యం సమ్యక్పూజనం చ తతో గేహే సువాసినీమ్ ।**
**సీతాం మత్వా పునః పూజ్య భోజనీయా సవిస్తరమ్ ॥ 61**

**ఆదౌ సీతారాఘవయోః కృత్వా పూజనముత్తమమ్ ।**
**తతః పూజా తు సర్వేషాం కార్యా నానోపచారకైః ॥ 62**

**క్రమేణ లక్ష్మణాదీనాముపచారైస్తు షోడశైః ।**
**అథవా సహ తంత్రేణ రామపూజనమాచరేత్ ॥ 63**

**ఆదావావాహ్యవిప్రేషు దేయమాసనముత్తమమ్ ।**
**తతః ప్రక్షాళ్య పాదౌ చ సర్వేషాం చ పృథక్ పృథక్ ॥ 64**

**యతి పాదోదకం భిన్నం స్థాపనీయం నరోత్తమైః ।**
**తతః పృథక్ పృథక్ అర్ఘ్యాన్ దత్వా సుచందనాదిభిః ॥ 65**

**తతశ్చాచమనం దత్వా స్నానార్థం జలముత్సృజేత్ ।**
**తతో వస్త్రం సమర్ప్యాథ దేయాన్యాభరణాని హి ॥ 66**

**సమర్ప్య బ్రహ్మసూత్రాణి గంధం దేయం మనోహరమ్ ।**
**తతో రక్తాక్షతా దేయాః పుష్పమాలాస్తథాఽపరాః ॥ 67**

**తతో మాంగల్యవస్తూని తతశ్ఛత్రం చ చామరమ్ ।**
**వ్యజనం చ తతో దేయం దేయస్తూణీరకస్తథా ॥ 68**

**దేయా బాణాశ్చ చాపాని దేయాని హి పృథక్ పృథక్ ।**
**దత్వా పరిమళాదీని భోగ్యవస్తూని విస్తరాత్ ॥ 69**

**ధూపో దేయస్తథా దీపో నైవేద్యో దీయతాం తతః ।**
**అథవాఽన్యచ్ఛర్కరాది నైవేద్యార్థం సమర్పయేత్ ॥ 70**

అటుగాకున్న ఐదుగురిలోను ఆవాహనచేసి పంచాయతనపూజ యనబడును. అపుడు శక్తిహీనుడగు విప్రునియందు సీతా రాములిరువురును ఆరాధింపబడుదురు. అదిగాక శ్రీరామస్థానమున యతిని పూజింపవచ్చును. అప్పుడతనిప్రక్కలో సీతాస్థానము వక్కపండు ఉంచవలెను. పిదప యింటిలో వేరుగా సీతగా సువాసినిని పూజించి, భోజనముపెట్టి, ఆరాధించవలయును. క్రమముగా షోడశోపచారాది నానా ఉపచారములచే మొదట సీతారాములను పూజించి, ఆ తరువాత లక్ష్మణాదులను అర్చించునది. సమానతంత్రముతోనైనను శ్రీరామపూజ చేయవచ్చు. మొదట విప్రులయందు దేవతలను ఆవాహనముచేసి, పీఠములను అర్పింపవలెను. పిమ్మట వేర్వేరుగా అందరి పాదములను కడుగవలయును. యతిపాదోదకమును మాత్రము వేరుగా ఉంచవలయును, పిదప అందరికిని వేర్వేరుగా వరుసగా- చందనము, అర్ఘ్యము, ఆచమనము, స్నానజలము, వస్త్రములు, ఆభరణములు, యజ్ఞోపవీతము, దివ్యగంధము, రక్తాక్షతలు, పుష్పమాలికలు, మాంగళ్యవస్తువులు, -ఛత్ర, చామర, వ్యజనములు, ధనుర్బాణ తూణీరములు, ధూపము, దీపము, నైవేద్యము సమర్పింప వలయును.

**నానాఫలాని దేయాని దేయస్తాంబూల ఉత్తమః ।**
**దక్షిణాం చ తతో దత్వా దేయో ముకుర ఉజ్జ్వలః ॥ 71**

నీరాజనం తతః కృత్వా మంత్రపుష్పాణి దీయతామ్ ।
ప్రదక్షిణానమస్కారాన్నవ కృత్వా తతః పరమ్ ॥ 72

నృత్యగీతాదికం కృత్వా ప్రార్థయేద్రఘునాయకమ్ ।
వినిమీల్య కరౌ పాదౌ రామాగ్రే సంస్థితైర్నరైః ॥ 73

వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పృష్ఠే సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయవ్యకోణాదిషు ।
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్ ॥ 74

రామో హత్వా దశాస్యం ద్విజవచనగురుత్వేన యాత్రాఽస్త్రయజ్ఞాన్ ।
కృత్వా భుక్త్వాతిభోగానవనితలవిశంతీం గృహీత్వాఽథ సీతామ్ ।
లబ్ధ్వా నానాస్నుషాస్త్వస్త్వవనితలగతాన్పార్థివాదీంశ్చ జిత్వా
కృత్వా నామోపదేశాన్ గజపురనికటే స్వీయలోకం జగామ ॥ 75

నవకాండమయః శ్లోకః పఠిత్వాఽయం హరేః పురః ।
తతః క్షమాప్య శ్రీరామం పూజాం తస్మై సమర్పయేత్ ॥ 76

మయా మాసవ్రతే రామనవమ్యాం యత్ప్రపూజనమ్ ।
పారాయణాదికం సర్వం నవరాత్రేఽపి యత్కృతమ్ ॥ 77

తత్సర్వం తేఽర్పితం త్వద్య ప్రసన్నో భవ మే ప్రభో ।
నవాయతనపూజేయం యా కృతా నవమీదినే ॥ 78

నవవిప్రేషు సాఽప్యద్య తేఽర్పితా రామ వై మయా ।
త్వం గృహాణ యథాశక్త్యా కృతాం తాం త్వం ప్రసీద మే ॥ 79

ఏవం సమర్ప్య రామాయ సకలం పూజనాదికమ్ ।
తతో భోజనరీత్యా తాన్ సన్నివేశ్యాథ భోజయేత్ ॥ 80

పునర్దత్వా తు తాంబూలం దక్షిణాం తు విసర్జయేత్ ।
తతః స్వయం విప్రతీర్థం గృహీత్వా వై తతః పరమ్ ॥ 81

**యతిపాదోదకం ప్రాశ్య దేవతీర్థం తతః పరమ్ ।**
**గృహీత్వా భోజనం కార్యం సుహృన్మిత్రజనైః సహ ॥ 82**

**సమర్పితం యద్యతయే తతశ్చ బ్రాహ్మణాయ హి ।**
**దేయం స్వగురవే సర్వ బ్రహ్మసూత్రాదికం శుభమ్ ॥ 83**

**ఏవం వ్రతం రాఘవస్య పక్షే పక్షే ప్రకారయేత్ ।**
**అథవా శుక్లపక్షే హి కార్యం వ్రతమిదం శుభమ్ ॥ 84**

**మాసే మాసే సర్వదైవ రామోపాసకమానవైః ।**
**ఏవం మాసవ్రతం ప్రోక్తం రాఘవస్యాతితోషదమ్ ॥ 85**

పాదములను నిజకరతలములచే కప్పి, యిట్లు 74 వ శ్లోకముచే ప్రార్థింపవలయును. పిదప నవకాండ కథాసారమగు ఈ 75 వ శ్లోకమును పఠించి, క్షమాపణము వేడుకొని, పూజాఫలమును గూడ శ్రీరామచంద్ర పరబ్రహ్మార్పణమని సమర్పించవలయును.

"ఓ రామా! మాసవ్రతమున నవమియందు నేను యేపూజను ఒనర్చితినో, నవరాత్ర వ్రతమున పారాయణాది కర్మనేమి చేసితినో అదంతయును నీకొరకు అర్పింపబడినది. ఈ 9 మంది బ్రాహ్మణులలో నవాయతనపూజ యేది చేయబడెనో అదిగూడ నీకు అర్పింపబడెను, స్వీకరించి ప్రసన్నుడవగుము." అని యిట్లు సర్వమును రామబ్రహ్మార్పణము చేసిన పిదప, భోజనరీతిగా అందరికిని భోజనము చేయించి, మరల తాంబూల దక్షిణలనిచ్చి పంపివేయునది. పిదప బ్రాహ్మణ తీర్థమును, ఆ తరువాత యతితీర్థమును, పిదప దేవతీర్థమును తీసికొని, బంధుమిత్ర పరివారముతో కలసి తాను భుజింప వలయును. యతికి సమర్పించినట్టి వస్తువులను వాటినన్నిటిని తన గురువగు బ్రాహ్మణుని కర్పించునది. ఇట్లు శ్రీరామవ్రతమును నెలలో ప్రతి పక్షమునను చేయవలె. అటుగాకున్న ఈ వ్రతమును శుక్ల పక్షమున తప్పక చేయవలెను. ఇట్లు చేయుట మాసవ్రత మనబడును.

**సంతి వ్రతాన్యనేకాని జగత్యాం పుణ్యదాని హి ।**
**తథాప్యనేన సదృశం న భూతం న భవిష్యతి ॥ 86**

**వ్రతానాముత్తమం చైతద్భుక్తిముక్తిప్రదాయకమ్ ।**
**అవశ్యమేవ కర్తవ్యం రామోపాసకమానవైః ॥ 87**

**ఏవం శిష్య మయా ప్రోక్తం వ్రతానాముత్తమం వ్రతమ్ ।**
**సవిస్తారం తవాగ్రే హి రాఘవస్యాతితోషదమ్ ॥ 88**

విష్ణుదాస ఉవాచ

శ్రీరామనవమీమాసవ్రతస్యోద్యాపనం వద ।
కదా కార్యం కథం కార్యం గురో కృత్వా కృపాం మయి ॥ 89

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయా వత్స సావధానమనాః శృణు ।
నవసంవత్సరం మాసనవమీవ్రతముత్తమమ్ ॥ 90

కృత్వా చోత్థాపనం కార్యం చైత్రే శ్రీరామజన్మని ।
నవమ్యాం సముపోష్యాథ కర్తవ్యమధివాసనమ్ ॥ 91

గృహే బృందావనే వాథ గోష్ఠే దేవగృహాదిషు ।
సుమ్మార్జనం గోమయేన కార్యం వా చందనాదిభిః ॥ 92

తతః పాషాణచూర్ణైశ్చ నానాపద్మాదికాని హి ।
భువి సంలేఖనీయాని నీలపీతాదివర్ణకైః ॥ 93

రంజనీయాని రమ్యాణి తతః పత్రాదిసంస్థలే ।
పూర్వోక్తరామభద్రాణాం మధ్యే త్వేకం వరాసనమ్ ॥ 94

లిఖిత్వా చిత్రవర్ణైశ్చ ప్రోక్తైరేవం సురంజయేత్ ।
తస్యోపరి మహాన్ రమ్యశ్చిత్రవర్ణశ్చ మండపః ॥ 95

దేయో ద్వారాణి చత్వారి కార్యాణి తోరణాని చ ।
కదలీస్తంభయుక్తాని చేక్షుదండయుతాని చ ॥ 96

నానాఘంటాకింకిణీభిర్ధ్వనితాన్యుజ్జ్వలని చ ।
రమ్యాదర్శమండితాని విచిత్రాణి శుభాని చ ॥ 97

చిత్రధ్వజైర్వితానైశ్చ ముక్తాహారైర్యుతాన్యపి ।
అథ తద్రామభద్రస్థే కలశే వారిపూరితే ॥ 98

తామ్రపాత్రే రామచంద్రం నవాయతన చిహ్నితమ్ ।
సీతయా పూజయేద్రాత్రౌ మహోత్సాహపురఃసరమ్ ॥ 99

**నవపలమితాం మూర్తి హైమీం కృత్వా ప్రపూజయేత్ ।**
**సీతా హైమీ ప్రకర్తవ్యా శుభాఽష్టఫలసంమితా ॥ 100**

**రాజతాస్తే లక్ష్మణాద్యాః పృథక్పంచపలైఃస్మృతాః ।**
**అశక్తౌ చ తదర్ధేన తదర్ధార్ధేన వై పునః ॥ 102**

పుణ్యవ్రతములు లోకమున ఎన్నోగలవు కానీ నవాయతన వ్రతమునకు సమానములు గావు. ఇది భుక్తి, ముక్తి ప్రదమైన సర్వోత్తమవ్రతము. కావున రామోపాసకులు తప్పకచేయతగినది. ఇట్లు ఉత్తమ వ్రతమును నిరూపించితిని. అనగా...

## శ్రీరామవ్రత ఉద్యాపన విధానము

విష్ణుదాసుడు, "స్వామీ! ఈ శ్రీరామవ్రతముయొక్క యుద్యాపనము ఎట్లు చేయునది? ఎప్పుడు చేయునది? అని గురువగు రామదాసును అడిగెను. అందుకు రామదాసు ఇట్లుచెప్పుచున్నాడు.

"చక్కగా అడిగితివి నాయనా! వినుము; ఈ మాసనవమీ వ్రతమును తొమ్మిది సంవత్సరములు ఆచరించి చైత్ర-శుక్ల-శ్రీరామనవమినాడు ఉద్యాపన చేయవలయును. నవమినాడు ఉపవాసము చేసి, యింటనుగాని, బృందావనమునగాని, ఆవుల కొట్టమునగానీ భూమిని గోమయ చందనాదులచే అలికి, రంగులతో వివిధ పద్మములను గీసిన అట్టి సుస్థలమునందు, ఇంతకు మునుపు చెప్పబడిన రామభద్రములలో ఒకదానిని పరికల్పించి, దానిపైన చిత్రవర్ణ మంటపమునుంచి, దానికి నాలుగు ద్వారములలో తోరణములతోను, అరటి చెట్లను, అద్దములను, చెరుకు గడలను, గంటలను, గజ్జెలను అలంకరించి, చిత్రధ్వజ పతాకాదులను కట్టి, దానినడుమ రామతోభద్రముమీద శ్రీరామమూర్తిని జలపూరిత కలశమున ఆరాధించుట యెట్లనిన....

శ్రీరామమూర్తిని సీతాసమేతునిగా, రాగి కలశమున ఆరాత్రి మహోత్సాహముతో పూజించునది. రామమూర్తి విగ్రహము 9 ఫలముల బంగారుతోను, సీతామూర్తిని 5 ఫలముల బంగారుతోను, లక్ష్మణాదులను అయిదేసి ఫలముల వెండితోను అశక్తుడగువాడు దానిలో సగము, మఱిదానిలో అర్ధము, అందులో నరవాసి, మఱిదానికన్నను తక్కువ యిట్లు చేయించుకొనునది. అయినా పెట్టికొని లుబ్ధుడై యుండరాదు. పిదప వాటిని షోడశ ఉపచారములచే ఆరాధించి, ఆ రాత్రి జాగరణ వ్రతము చేయవలెను.

**దశమ్యాం ప్రాతరుత్థాయ స్నాత్వా సంపూజ్య రాఘవమ్ ।**
**రామమంత్రేణ హవనం కార్యం నవసహస్రకమ్ ॥ 103**

తిలాద్యైః పాయసాద్యైశ్చ నవాన్నేనాథ తత్ స్మృతమ్ ।
తద్దశాంశేన క్షీరేణ తర్పణం హి ప్రకారయేత్ ॥ 104

తస్యాపి చ దశాంశేన మార్జనం ద్విజభోజనమ్ ।
కర్మముద్రాం హస్తముద్రాం వసనే బ్రహ్మసూత్రకమ్ ॥ 105

చిత్రాసనముత్తరీయం ముకుటం ఝర్ఝరీం తథా ।
కాంస్యపాత్రం భోజనస్య నవాన్నేన ప్రపూరితమ్ ॥ 106

ఘృతపాత్రం కాంస్యమయం నవాన్నోపరి సంస్థితమ్ ।
పాదుకే పుస్తకం దివ్యం యత్కించిద్రాఘవస్య చ ॥ 107

తాంబూలం దక్షిణాం చాపి ప్రత్యేకం భూసురాయ హి ।
అర్పయేత్సకలం చేత్థమేవం సర్వాన్ సమర్పయేత్ ॥ 108

తతో గురుం సమభ్యర్చ్య ప్రణమ్యచ పునః పునః ।
తామర్చామర్పయేత్సర్వాం గురవే దక్షిణాన్వితామ్ ॥ 109

తతో గురుం ప్రార్థయేత్తం ప్రణమ్యచ పునః పునః ।
మాసే మాసే నవమ్యాం తు సోద్యాపనవ్రతం మయా ॥ 110

యత్కృతం నవ వర్షాణి తేన తుష్యతు రాఘవః ।
అగ్రేఽపి యావజ్జీవామి తావత్కాలం కరోమ్యహమ్ ॥ 111

వ్రతానాముత్తమం చేదం తుష్ట్యర్థం రాఘవస్య చ ।
గురో త్వత్కృపయా రామో మాం ప్రసీదతు సీతయా ॥ 112

ఏవం సంప్రార్థ్య స్వీయం తం గురుం నత్వా విసర్జయేత్ ।
తతః స్వయం హి భుంజీత సుహృన్మిత్రసుతాదిభిః ॥ 113

ఏవముద్యాపనం కృత్వా కార్యమగ్రే వ్రతం పునః ।
మాసే మాసే రాఘవస్య న త్యాజ్యం సర్వథా నరైః ॥ 114

దశమినాడు ప్రొద్దున లేచి, స్నానముచేసి, శ్రీరాముని పూజించి, శ్రీరామ మంత్రముచే తిలాదులతోనో, పాయసాదులతోనో, నవాన్నాదులతోనో 9000 హోమము చేయవలయును. తద్దశాంశ (అందులో పదవవంతు) క్షీరతర్పణము, తద్ద(అందులో పదిశాతము)శాంశమనిన 70 మందిచే మార్జనము, వారికి భోజనారాధనను చేయవలయును. వారిలో ప్రతి బ్రాహ్మణునికిని పవిత్రఉంగరమును, వస్త్రములను, యజ్ఞోపవీతమును, చిత్రాసనమును, ఉత్తరీయమును, కిరీటమును, దక్కీవాద్యమును, నవాన్నములతోనిండిన కంచు కంచమును, దాని పైన నేతి కంచుగిన్నెను, పాదుకలను, పుస్తకమును, దక్షిణ తాంబూలములను సమర్పింపవలయును. అంత గురుమూర్తిని ఆరాధించి, పూజించిన గోవును, సదక్షిణాకముగా గురువుకు దానము చేయవలెను.

"ఇట్లు ఉద్యాపనవిధానముతో మాస నవమివ్రతమును ఆచరించితిని. ఈ 9 సంవత్సరముల వ్రతాచరణముచేత శ్రీరాముడు తృప్తినందుగాక! ఇకమీద గూడ నేను బ్రతుకునంత కాలము ఈవ్రతమునాచరించెదను. శ్రీరామప్రీతికై చేయు ఈ వ్రతమే సకలవ్రతములలో ఉత్తమోత్తమము. శ్రీగురుమూర్తీ! మీదయచే సీతాసమేతుడయిన శ్రీరాముడు నాకు ప్రసన్నుడగుగాక!" అని యిట్లు గురుమూర్తిని పలుమార్లు ప్రణమిల్లుచు ప్రార్థించవలయును. ఈవిధముగా ప్రార్థించి, తన ఆచార్యునికి నమస్కరించి పంపి, పిదప తనమిత్ర పుత్ర పరివారముతోడ భోజనము చేయవలయును. ఇట్లు ఉద్యాపనవ్రతమును ఆచరించి, పిదప మరలవ్రతమును ఆరంభించునది.

మానవులు మాసమాసమునను ఈ నవమీ వ్రతమును ఆచరించక యుండరాదు.

**ఏకాదశీవ్రతం నిత్యం యథా తత్క్రియతే నరైః ।**
**తథా మాసవ్రతం చేదం నిత్యమేవ స్మృతం బుధైః ॥ 115**

**అశక్తేన యథాశక్త్యా కార్యముద్యాపనం వ్రతమ్ ।**
**ఉపోష్యా నవమీ శుక్లా సర్వదైవ నరైర్భువి ॥ 116**

**నవమ్యాం శుక్లపక్షే యో భుంక్తేఽన్నం మూఢధీర్నరః ।**
**రౌరవే కల్పపర్యంతం తస్య వాసః స్మృతో బుధైః ॥ 117**

**ఏవం శిష్య త్వయా యచ్చ పృష్టం తత్తే నివేదితమ్ ।**
**కా తేఽన్యా శ్రోతుమిచ్ఛాస్తి తాం వదస్వ వదామి తే ॥ 118**

**విష్ణుదాస ఉవాచ**

**గురో త్వయా రాఘవస్య శ్రీరామనవమీవ్రతమ్ ।**
**మాసే మాసే ప్రకర్తవ్యమితి ప్రోక్తం మమాగ్రతః ॥ 119**

తత్కేనాచరితం పూర్వం సిద్ధిర్లబ్ధ్వాఽత్ర కేన హి ।
తత్సర్వం విస్తరేణైవ వద కృత్వా కృపాం మయి ॥ **120**

అన్యత్తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం మాం వక్తుమర్హసి ।
అశక్తేన నరేణేదం వ్రతం కార్యం కథం మహత్ ॥ **121**

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయా శిష్య సావధానమనాః శృణు ।
ఆసీత్పురా ద్విజః కశ్చిత్ కేరలే రామతత్పరః ॥ **122**

నాభూత్తస్య వివాహోఽత్ర నిర్ధనస్య జనస్య చ ।
నాసీత్తస్మై గేహమపి న మాతా న పితాఽపి చ ॥ **123**

తస్యైకో నియశ్చాసీద్దరిద్రస్య చ తం శృణు ।
నిత్యం ప్రాతః సముత్థాయ కృతమాలానదీజలే ॥ **124**

స్నాత్వాం నదీసికతాయాం సికతావేదికా నవ ।
కృత్వా తత్ర జనకజాసహితం రఘునందనమ్ ॥ **125**

పత్రనిర్మితశ్రీరామలింగాత్మకవరాననే ।
మధ్యమాయాం వేదికాయాం సంస్థాప్య ధాతునిర్మితమ్ ॥ **126**

అష్టదిక్షు వేదికాసు తరుపత్రాసనే పృథక్ ।
సమంతతో రాఘవస్య లక్ష్మణాదీన్న్యవేశయత్ ॥ **127**

ఏకాదశీవ్రతమును ఎట్లు నిత్యముగా ఆచరించెదరో అట్లే ఈ వ్రతమును ఆచరించదగును, అశక్తుడగువాడు యథాశక్తితో ఉద్యాపనవ్రతమును ఆచరించదగును. నరులు భూమిపై నవమినాడు ఉపవాసమును తప్పక చేయవలెను. యే మూఢుడగు మానవుడు శుక్లనవమినాడు ఉపవాసము చేయకపోవునో అతనికి కల్పాంతము వరకు నరకవాసము అని ప్రాజ్ఞులచే విధింపబడినది.

శిష్యుడా! నీవడిగిన శ్రీరామవ్రత విధానమును సమగ్రముగా నిరూపించిచెప్పితిని. ఇక ఏమి వినగోరుచున్నావు? అడుగుము. అనిన శ్రీరామదాస మునితో విష్ణుదాసుడిట్లనెను. (118)

## పేదబ్రాహ్మణుడు శ్రీరామాదిమూర్తులనారాధించి ధన్యుడగుట.

గురుమూర్తీ! మాసమాసమున ఈ శ్రీరామనవమి వ్రతమును ఆచరించవలయునని సెలవిచ్చితిరి గదా! మునుపు ఎవరు ఈవ్రతమును ఆచరించిరి? ఎవడీ వ్రతమునాచరించి సిద్ధినందెను. మఱియొక తత్త్వము నడిగెదను. ఈగొప్పవ్రతమును అశక్తుడు ఎట్లు చేయగలడు? దయచేసి సెలవియ్యమని అడిగిన విష్ణుదాసునితో శ్రీరామదాసముని యిట్లనెను. బాగుగా అడిగితివి శిష్యుడా! సావధానముగా వినుము....

మునుపు కేరళదేశమున శ్రీరామపరాయణుడగు ఒకానొక బ్రాహ్మణుడుండెను. దరిద్రుడగుటచే అతనికి పెండ్లి కాలేదు. మఱి ఇల్లు లేదు, తల్లిదండ్రులును లేరు. అయినా అతనికి నియమ మొక్కటి మాత్రము గలదు. ఏమనిన, కృతమాలానదియందు నిత్యము ప్రొద్దున స్నానముచేసి తన నిత్య కర్మానంతరము ధాతు మయములగు శ్రీరామాది నవమూర్తులను ఆ నదీతీరమున, తొమ్మిది యిసుక దిబ్బల నేర్పరచి, వాటిపై వేసిన శ్రీరామలింగాత్మ శాసనమున ప్రతిష్ఠించి, ఇట్లు నడుమ శ్రీరామ మూర్తిని, అష్టదిక్కులలో లక్ష్మణాది అష్టమూర్తులను భావించి,

**తతః స రాఘవం ప్రాహ రామం రాజీవలోచనమ్ ।**
**కర్తుమావశ్యకం కర్మ గంతుమర్హసి సత్వరమ్ ॥ 128**

**ఇత్యుక్త్వా తం స్వయం పృష్ఠం నివేశ్య రఘునందనమ్ ।**
**కియద్దూరం రహో వృక్షఖండే గత్వా ద్విజోత్తమః ॥ 129**

**రామం తృణభువి స్థాప్య తదగ్రే పాత్రముత్తమమ్ ।**
**సజల మృత్తికాం చాపి సంస్థాప్య చ జవన హి ॥ 130**

**కించిద్దూరం స్వయం గత్వా స్థితవాన్ స కియత్క్షణమ్ ।**
**రామాంతికం పునర్గత్వా పాదప్రక్షాళనాదికమ్ ॥ 131**

**అకరోన్మృత్తికాశౌచం చ తస్య స్వకరేణ హి ।**
**దత్త్వాஉన్యపాత్రతోయేన రామాయాచమనం తతః ॥ 132**

**దంతకాష్ఠేన తద్దంతాన్సంశోధ్య భక్తిపూర్వకమ్ ।**
**గండూషార్థం జలం దత్త్వా కవోష్ణం శీతలం పునః ॥ 133**

**సమర్ప్యాచమనార్థం స వస్త్రేణాస్యం ప్రమార్జయత్ ।**
**సంమార్జ్య హస్తౌ పాదౌ చ రామస్య వాససా ద్విజః ॥ 134**

**తం విగృహ్య పునః పృష్ఠే నమ్రీభూతః శనైః శనైః ।**
**సికతావేదికాయాం చ పూర్వస్థానే న్యవేశయత్ ॥ 135**

**ఏవం సీతాం లక్ష్మణం చ భరతం లవణాంతకమ్ ।**
**సుగ్రీవాదీన్ పృథక్ నీత్వావశ్యకాదీన్యకారయత్ ॥ 136**

**తతః పృథక్కవోష్ణేన తైలాభ్యంగాన్విధాయ సః ।**
**నరేణాస్నాపయత్ సర్వాన్ కృత్వా చోద్వర్తనాన్యపి ॥ 137**

**తతో భూర్జాది పత్రాణి వస్త్రార్థం స పృథగ్దదౌ ।**
**తతః పత్రైః ఫలైః పుష్పైర్లబ్ధైస్సానచర్యత్ క్రమాత్ ॥ 138**

**తతః స స్థూలవ్రీహీణాం కృత్వౌదనమనుత్తమమ్ ।**
**స్నాత్వా మాధ్యాహ్నికం కృత్వా పునః సంపూజ్య రాఘవమ్ ॥ 139**

పిదప, రాజీవాక్షుడగు శ్రీరామచంద్ర స్వామిని చూచి, ఆవశ్యక శౌచకర్మను ఆచరించుటకు యేతెంచవచ్చును. మహాప్రభూ! అని శ్రీరామమూర్తిని తాను తన వీపుమీద నెక్కించుకొని కొంతదూరము వెడలి, చెట్లనడుమ రహస్యమగుచోట గడ్డినేలమీద స్థాపించి, అచ్చట ఎదుట చెంబులోనీళ్లను, మృత్తికను పెట్టి, తాను దూరముగాపోయి కనిపెట్టియుండి, మరలవచ్చి చేతులు కాళ్లుకడిగి, మృత్తికాశౌచ క్రమమును నెరవేర్చి, మరియొక పాత్రనుండి తన చేతులతో నీళ్ళుపోసి శ్రీరామునికి ఆచమనము చేయించి, పుల్లతో పండ్లుతోమి, వెచ్చనినీళ్లచే భక్తి పూర్వకముగా గండూష ముఖ ప్రక్షాళనాదులను చేయించి, శుభ్రవస్త్రముతో తుడిచి, మరల మూపులపై నెక్కించుకొని వినమ్రుడై, తిన్నతిన్నగా వచ్చి, యిసుకతిన్నెమీద మునుపటివలె కూర్చుండబెట్టి, ఇట్లే సీతను, లక్ష్మణునిని, భరతునిని, సుగ్రీవాదులను వేర్వేరుగా గొనిపోయి, శౌచవిధానము చేయించి తెచ్చి, పిదప వేడినీళ్లతో అభ్యంగ స్నానములను వారికందరికిని వేర్వేరుగా చేయించి, నలుగుపెట్టి, వస్త్రములకు బదులుగా భూర్జపత్రాదులను అలంకరించి, అంత తనకు లభించిన పత్ర, పుష్ప, ఫలములచే పూజించి, పిదప పెద్ద బైరువడ్ల బియ్యముచే వంటజేసి, మాధ్యాహ్నిక స్నానాహ్నికములను ఆచరించి, మరల శ్రీరాముని పూజించి,....

**దత్వౌదనస్య నైవేద్య వైశ్వదేవం విధాయ చ ।**
**కించిద్భిక్షామతిథయే మత్వాన్యగ్గామండజాదికాన్ ॥ 140**

దత్వా పృథక్ పృథక్ విప్రశ్చక్రే రామాజ్ఞయాఽశనమ్ ।
తతో రామం పునః పృష్ఠే రమారోహయదాదరాత్ ॥ 141

తతః సీతాం తతః సర్వాన్ లక్ష్మణాదీన్ క్రమేణ హి ।
పూజోపకరణం సర్వం పేటికాయాం నిధాయ సః ॥ 142

కృత్వా తాం పేటికాం కక్షే జగమాథ శనైర్ద్విజః ।
స వనారామోపవనం గత్వా రామం వచోఽబ్రవీత్ ॥ 143

రామ రాజీవపత్రాక్ష వనారామాదికౌతుకమ్ ।
జానకీసహితః పశ్య నానాండజమృగాదికాన్ ॥ 144

తతో యయౌ గ్రామహట్టం దర్శయత్కౌతుకం విభుమ్ ।
సంమర్దే తాడయామాస మార్గార్థం యాన్ స యష్టినా ॥ 145

తేఽపి తత్కౌతుకావిష్టా జనాః కోపం న మేనిరే ।
ఏవం నానాకౌతుకాని దర్శయామాస రాఘవమ్ ॥ 146

తతః శూన్యే తృణగృహే రామ తానవరుహ్యా చ ।
కాష్ఠనిర్మితపర్యంకే కారయామాస నిద్రితాన్ ॥ 147

తతో వేగాద్ధట్టమధ్యే గత్వా స బ్రాహ్మణోత్తమః ।
యాంచయా తండులాన్ తైలం ఘృతం శాకం ఫలాని చ ॥ 148

నాగవల్లీదళాదీని క్రముకం కుంకుమాదికమ్ ।
లబ్ధ్వా తామ్రమయం కించిద్ద్రవ్యం రామాంతికం యయౌ ॥ 149

తత్ గ్రామవాసినః సర్వే యే యే హట్టే స్థితా జనాః ।
స్వస్వనానావ్యవసాయతత్పరాస్తే ద్విజోత్తమమ్ ॥ 150

శ్రీరామనిష్ఠం త ద్దృష్ట్వా దదుస్తద్యాచితం ముదా ।
విప్రః శూన్యగృహే రామం రామాగ్రే దీపముత్తమమ్ ॥ 151

ప్రజ్వాల్యారార్తికం కృత్వా గంధాద్యైః పరిపూజ్య చ ।
వీజయామాస రామాదీన్ పల్లవేన ముదాన్వితః ॥ 152

మహానైవేద్యమును అర్పించి, వైశ్వదేవకర్మను ఆచరించి, అతిథికి భిక్ష కొంత బెట్టి, శ్రీరామ అనుజ్ఞ పొంది భుజించును. పిదప శ్రీరామమూర్తిని, సీతను, లక్ష్మణాదులను, ఇట్లే క్రమముగా అందటిని, పూజాసామాగ్రులను ఎత్తి చేతిపెట్టెలో పెట్టి, దానిని చంక బెట్టికొని, అతడు నందన వనములకును, ఉద్యానములకును వెడలి, అచ్చట శ్రీరామమూర్తిని జూచి, “స్వామీ! రాజీవాక్షుడగు రామచంద్రమూర్తీ! సీతాదేవితో నీవు వనోద్యానముల కౌతుకములను అవలోకింపుము. మృగ, పక్షి, క్రీడలు జూడుము.” అని ప్రార్థించుచు, చూపికొని ఆ విభునికి ఊరిలో అంగడివీధులకువచ్చి, అచ్చటి వినోదములను చూపుచు, దారికడ్డమగువారిని ప్రక్కకు తప్పిస్తూ, వారును వీని వినోదమును విలోకించు వారలై, కోపపడక యుందురు. ఇట్లు శ్రీరామమూర్తికి వివిధవిచిత్రములను చూపించి, అంతట ఎవ్వరులేని పూరింటిలో అందరినిదింపి, కొయ్యమంచముమీద పరుండబెట్టి నిద్రితులను జేయును. ఆ తరువాత ఈ బ్రాహ్మణుడు అంగడివీధికివెడలి యాచించి; బియ్యము, నూనె, నెయ్యి, కూరలు, పండ్లు, వక్కలు, ఆకులు, కుంకుమ, డబ్బులు మొదలగు వాటిని సంపాదించుకొని యిల్లు జేరును. ఆ గ్రామమున వసించువారును ఇతని శ్రీరామభక్తికి మెచ్చి, వారివారి శక్తికొలది కోరినదానిని సంతోషముగా ఇచ్చుచుందురు.

అపుడు ఆ విప్రుడు ఆయింటిలో శ్రీరామమూర్తి యెదుట దీపమును వెలిగించి హారతులను ఇచ్చి, పుష్ప గంధ తాంబూలాదులచే పూజించి, చిగురుటాకులచే సంతోషముతోవిసిరి సేవించును.

**తతః స్తుత్వా ముహుర్జప్త్వా కృత్వా చాపి ప్రదక్షిణాః ।**
**చకార కీర్తనం వక్ష్యమాణైః సన్మనుభిర్ద్విజః ॥ 153**

**తతస్తు యాచితాన్యేవ వస్తూని మిశ్రితాని హి ।**
**పృథక్కృత్వా తు సర్వేషాం త్రీన్ భాగాంశ్చ చకార సః ॥ 154**

**ద్వౌ భాగౌ స స్వనికటే స్థాప్యైకం భాగముత్తమమ్ ।**
**చిత్రగేహే న్యాసభూతం నవమ్యర్థం చకార సః ॥ 155**

**తతః స్వయం ద్వారమధ్యే చకార శయనం ద్విజః ।**
**పునః ప్రభాతే చోత్థాయాచమ్య గీతాదిభిః ప్రభుమ్ ॥ 156**

**తాళవాద్యైః ప్రబోధ్యాథ తాన్ పృష్ఠే స్థాప్య పూర్వవత్ ।**
**నదీతీరం యయౌ విప్రః పూజయామాస పూర్వవత్ ॥ 157**

**ఏవం నిత్యపూజనం చ చకారాదృతమానసః ।**
**నవమ్యాం చ విశేషేణ పూజయిత్వాఽథ రాఘవమ్ ॥ 158**

స్వయంచోపోషణం కృత్వా స్వయం చక్రే సుకీర్తనమ్ ।
రాత్రౌ జాగరణం చాపి రాఘవం పూజ్య వై పునః ॥ 159

చకార కీర్తనైశ్చాథ నర్తనాద్యైః స్వయం కృతైః ।
తతః ప్రభాతే శ్రీరామం దశమ్యాం పరిపూజ్య చ ॥ 160

ప్రతిపద్దినమారభ్య నవరాత్రేఽథ యత్కృతమ్ ।
ఆనందరామచరితపారాయణమనుత్తమమ్ ॥ 161

తత్సమాప్య పూజయిత్వా పుస్తకం బ్రాహ్మణాన్నవ ।
నిమంత్రితాన్ సమాహూయ తేష్వేవైకం సపత్నికమ్ ॥ 162

ద్విజమాకారయామాస తతః సంచితతండులాః ।
మిత్రగేహే న్యాసభూతాస్తేషాం కృత్వోదనం శుభమ్ ॥ 163

తథా సంచితశాకాది తథా లబ్ధాని యాని సః ।
తాని సర్వాణి సంస్కృత్య వరాన్నీదీని చాకరోత్ ॥ 164

వాలుకావేదికాయాం వై మధ్యే పత్నీయుతం ద్విజమ్ ।
అష్టకోణేషు విప్రాంస్తానష్ట సంవేశ్య వై క్రమాత్ ॥ 165

షోడశైరుపచారైస్తాన్ పూజయామాస భక్తితః ।
రంభాదళేషు చ తతో విస్తీర్ణేషు ద్విజోత్తమః ॥ 166

చకార తైః కృతైరన్నైః స ముదా పరివేషణమ్ ।
తతస్తే భోజనం చక్రుస్తద్భక్త్యాఽతిముదాన్వితాః ॥ 167

తతో దత్వా సుతాంబూలం దక్షిణాం తాన్ ప్రణమ్య చ ।
విసర్జయామాస విప్రాంస్తతశ్చక్రేశనం ద్విజః ॥ 168

ఏవం విప్రో మాసి మాసి నవాయతనపూజనమ్ ।
నవమ్యాః పారణాయాశ్చ దివసే దశమీదినే ॥ 169

చకార నవవిప్రేషు యాంచాం కృత్వాఽపి భక్తితః ।
ఏవం గతాని వర్షాణి నవ తస్య ద్విజన్మనః ॥ 170

పలుమార్లు రామమంత్రమును జపించి, ప్రదక్షిణ, ప్రణామములు ఒనరించి, స్తుతించి, వక్ష్యమాణులగు మహర్షి ప్రణీత శ్లోకములను ఉచ్చరిస్తూ, శ్రీరామకీర్తనముజేసి, తానుతెచ్చిన వస్తువులను మూడుపాళ్లుజేసి, రెండుపాళ్లను తనభృతికై దగ్గర పెట్టుకొని, ఒకపాలును నవమీ వ్రతమునకై మిత్రునింట దాచిపెట్టి, తానింటి వాకిట నడుమ పరుండి, మరునాడు వేకువనే లేచి, ఆచమన అనంతరము కరతాళములతో శ్రీరామస్తుతి, గీతములను పాడి, శ్రీరామాదులను లేపి, మునుపటి నదీతీరమునకు వెళ్ళి పూజించును. ఈ విధముగా ప్రతి నిత్యము నేరవేర్పుచు, మిక్కిలి మక్కువతో నవమినాడు విశేషముగా శ్రీరాముని పూజించి, తాను ఉపవాసవ్రతమును ఆచరించి, తానే కీర్తనము జేసి, జాగరణము చేసి, మరల రాముని పూజించి, నిజకృత నర్తన, కీర్తనాదులచే ఆరాధించి, దశమినాడు ప్రొద్దున శ్రీరాముని చక్కగా పూజించి, పాడ్యమి మొదలు తాను చేయుచువచ్చిన ఆనంద రామచరిత్ర పారాయణమును పూర్తి జేసి, తాను నిమంత్రించియుండిన 9 మంది బ్రాహ్మణులను పిలచికొనివచ్చి, తన మిత్రుని ఇంట దాచుచువచ్చిన ద్రవ్యములనన్నిటిని సేకరించి తెచ్చి, నవాన్నాదులనువండి యథావైభవముతో వారినందరిని యిసుకతిన్నెలమీద సపత్నీక బ్రాహ్మణుని సీతారామ స్వరూపముగా కూర్చుండబెట్టి, ఎనిమిదికోణములలో ఎనిమిదిమంది బ్రాహ్మణులను కూర్చుండబెట్టి, వారిని క్రమముగా భక్తితో, షోడశోపచారములచే చక్కగా పూజించి, వెడల్పయిన అరిటాకులలో వండిన వస్తువులను వడ్డించి, వారందరును వీనిభక్తికి మెచ్చి సంతోషముగా భుజించిన పిదప, దక్షిణ, తాంబూలాది సత్కారములచే ఆరాధించి పంపి, పిదప తానుభుజించి శ్రీరామ బ్రహ్మానంద నిమగ్నుడై యుండును. ఇట్లు మాసమాసమునను పూజాపురస్కారములు జరిగెను.

**ఏకదా శ్రావణే మాసి తద్ గ్రామే సేనయా నృపః ।**
**కశ్చిద్యయౌ తదా విప్రః స్వస్థలే నిశి నిద్రితః ॥ 171**

**ఏతస్మిన్నంతరే వృష్టిపీడితా నృపసేవకాః ।**
**గ్రామే గేహాని వివిశుః శూన్యగేహం యుయుర్ద్విశ ॥ 172**

**అశ్వారూఢాః సశస్త్రాస్తే ద్వారమధ్యే ద్విజోత్తమమ్ ।**
**దృష్ట్వా వినిద్రితం ప్రోచుర్ద్విజోత్తిష్ఠ జవేన హి ॥ 173**

**మార్గం దేహి  వయం వృష్ట్యా పీడితాః స్మశ్చిర బహిః ।**
**శూన్యగేహేఽత్ర స్థాస్యామః సుఖంసాశ్వాః ససేవకాః ॥ 174**

**తత్తేషాం వచనం శ్రుత్వా సంభ్రమేణ ద్విజోఽబ్రవీత్ ।**
**రామచంద్రః సీతయాత్ర నిద్రితోఽస్తి స్వబంధుభిః ॥ 175**

న వర్తతేఽత్ర యుష్మాకం స్థలం సత్యం వచో మమ ।
గచ్ఛధ్వం నగరే నానా స్థలాన్యన్యాని సంతి హి ॥ 176

తత్తస్య వచనం శ్రుత్వా రాజదూతాః పునర్ద్విజమ్ ।
ప్రోచుస్తే హ్యస్తి శ్రీరామ సోఽపి నిర్యాతు వై బహిః ॥ 177

సీతయా బంధుభిర్యుక్తః స్థలం నో దేహి భో ద్విజ ।
పునరాహ ద్విజస్తాన్ స కథం రామం వినిద్రితమ్ ॥ 178

ప్రబుద్ధం వై కరోమ్యద్య నిశాయాం రాజసేవకాః ।
యుష్మాకం ప్రార్థనా త్వద్య క్రియతే వై మయా ముహుః ॥ 179

ప్రణమ్య విధివద్యూయం గచ్ఛధ్వం వై స్థలాంతరమ్ ।
తతస్తన్నిగ్రహం దృష్ట్వా తేఽతివృష్ట్యా ప్రపీడితాః ॥ 180

## బ్రాహ్మణాగ్రహముతో స్త్రీదేశ మేర్పడుట.

ఇట్లుండగా, ఒకసారి శ్రావణమాసమున ఆ గ్రామమునకు ఒకరాజు తనసేనతో వచ్చెను. అప్పుడీ బ్రాహ్మణుడు తనస్థలమున నిద్రించియుండెను. అంతలో గొప్ప వానవచ్చుటచే ఆ సైనికులు వర్ష పీడితులై ఇండ్లలోజొచ్చిరి. అంతనట్లే పదిమంది రాజభటులు ఈ శూన్యగృహమున ప్రవేశించిరి. గుఱ్ఱపురౌతులు 'వేలకొలదిగా వాకిటనుండిరి. అప్పుడు ద్వారమధ్యమున నిద్రించు విప్రునిజూచి వారు "ఓరి బాపడా! లెమ్ము లెమ్ము! త్వరగా లెమ్ము! దారినిమ్ము, మేము బయట వానచే తడిసి యున్నాము, ఈ శూన్య గృహమున మా వాహన పరివారముతో సుఖముగా నుందుము," అనగా అందుకా బ్రాహ్మణుడు, సంభ్రమముతో, "ఈ యింటిలో శ్రీరామచంద్రమూర్తి సీతాసమేతుడై బంధుపరివారముతో సుఖముగా నిద్రించియున్నాడు. ఇచ్చట మీకుస్థలము దొరకదు. ఊరిలో ఎన్నియో చోట్లుగలవు, అక్కడికి వెళ్ళండి." యని నిరాకరించెను. అంత వారు "విప్రుడా! అట్లు శ్రీరాముడు నిద్రించుచున్న యెడల అతడు సీతతోను, తమ్ములతోను, పరివారముతోను బయటకుపొమ్మను. మాకు స్థలమునివ్వవా ఏమి?" అని అదలించిరి. అంత ఆ భక్తుడు, "భటులారా! ఈ రాత్రి పూట నిద్రించుచుండు రామచంద్రమూర్తిని నేనెట్లు లేపుదును? నేను పలుమార్లు మిమ్ము ఇట్లు ప్రార్థించుచున్నాను, మీరును గౌరవముగా నమస్కరించి వేరుచోటికి పోండి." అనిన అంత ఆ రాజసైనికులు వానబాధనోర్వలేక ఆబ్రాహ్మణుని కొట్టిరి. అంత ఆ బ్రాహ్మణుడు కుయ్యో మొఱ్ఱో యని ఊరకయుండదండి,...

తం విప్రం తాడయాంచక్రుస్తదా ప్రాహ ద్విజోత్తమః ।
రామం బహిః కరోమ్యద్య తిష్ఠధ్వం రాజసేవకాః ॥ 181

ఇత్యుక్త్వాఽఽచమ్య శ్రీరామం భూసురో వాక్యమబ్రవీత్ ।
రామోత్తిష్ఠ బహిర్దుష్టాః స్థితాః సంత్యశ్వసంస్థితాః ॥ 182

తేషాం వస్తుం స్థలం దేహి వయం యామో బహిర్నిశి ।
ఇత్యుక్త్వా నిజపృష్ఠే తానారోహయత్స పూర్వవత్ ॥ 183

తతః కృత్వా మహాక్రోశం వస్త్రాదీనాం ద్విజోత్తమః ।
ధృత్వా కక్షే తోయకుంభం ధృత్వా వామకరేణ సః ॥ 184

యష్టిం ధృత్వా సవ్యహస్తే శనైర్ద్వారాద్బహిర్యయౌ ।
తే ద్విజం తాదృశం దృష్ట్వా భ్రాంతం తం మేనిరే ఖలాః ॥ 185

తతో దృష్ట్వాఽతివృష్టిం స గేహాగ్రాద్ధో బహిర్ద్విజః ।
నమ్రీభూతస్తదా తస్థౌ గేహే సంవివిశుః  ఖలాః ॥ 186

తతోఽతిశ్రమితో విప్రశ్చింతయామాస చేతసి ।
పురాణే వాయుపుత్రస్య మయా సారం శ్రుతం బహు ॥ 187

తత్సర్వం తు మృషా త్వద్య కిమస్త్యత్ర ప్రయోజనమ్ ।
ఇతి నిశ్చిత్య విప్రః స క్రోధేన మహతా వృతః ॥ 188

శీఘ్రం ఘటం భువి స్థాప్య వామహస్తేన మారుతేః ।
పుచ్ఛం ధృత్వా ప్రాక్షిపత్తమాకాశే వేగవత్తరః ॥ 189

తదా సా మారుతేర్ధాతుమయీ మూర్తిః శుభావహా ।
గత్వాఽఽకాశే గర్జనాం వై చకారాతిభయంకరామ్ ॥ 190

తాం గర్జనాం మహావీరా గ్రామస్థాశ్చ బహిః స్థితాః ।
శ్రుత్వాఽతిభయసంత్రస్తా మృతాః సర్వే క్షణేన హి ॥ 191

అశ్వా నాగా వృషాద్యాశ్చ మృతా సర్వే తదా క్షణాత్ ।
యద్యద్గ్రామే బహిర్వాఽపి చరం పురుష సంజ్ఞితమ్ ॥ 192

**పుత్రగర్భాశ్చ నారీణాం సర్వే ప్రాపుః క్షయం తదా ।**
**తదా స పురుషస్త్వేకో న మృతో బ్రాహ్మణోత్తమః ॥ 193**

రాజసేవకులారా! రాముని బయటికి పంపెదను అని వారిని సమాధానపరచి; శ్రీరామమూర్తిని జూచి, "రామప్రభూ! లెమ్ము, వెలపట దుష్టులగు సైనికులు గుఱ్ఱములను ఎక్కియున్నారు. వారుండుటకు స్థలమునిమ్ము, ఈరాత్రి మనము వెలుపటికి పోదము" అని ప్రార్థించి, ఆమూర్తులను మూపున కెత్తికొని, తన వస్త్ర, పాత్రాదుల మూటను చంకన తగిలించికొని, యెడమచేతితో జలకుంభమును, కుడిచేతితో దండమును దాల్చి కోపముతో తిన్నగా వెడలివచ్చెను. ఆ దుష్టులు అతనినిజూచి భ్రాంతుడని యెంచిరి. అంత ఆ బ్రాహ్మణుడు కురుస్తున్న భారీ వర్షమును జూచి, యింటిముందరి చూరుక్రింద నిలబడెను. ఆ సైనికులు లోనికి జొచ్చిరి. అప్పుడా బ్రాహ్మణుడు తనమనసున "పురాణమునందు నేను ఆంజనేయుని పరాక్రమమును అపారముగా వినియున్నాను, అదంతయును ఇప్పుడు కల్లయినది, దీనితో ఏమిప్రయోజనము?" అని యాలోచించి క్రుద్ధుడై, వడిగా చేతిలో ఉన్న నీటి కుండను క్రిందబెట్టి, యెడమచేతితో హనుమన్మూర్తియొక్క తోకనుపట్టి గగనమునకు విసిరివేసెను. అప్పుడామూర్తి ఆకాశమునకుపోయి, మిక్కిలిభయంకరమగు గర్జనజేసెను. ఆ గర్జన విన్న మహా వీరులును, గ్రామస్థులును, వెలుపలనుండిన వారును, సంభ్రాంతచిత్తులై క్షణమాత్రమున పడి మృతులయిరి. ఏనుగులు, గుఱ్ఱములు, ఎద్దులు మొదలగునవిగూడ చచ్చెను, పురుషులందఱును భూమిపై చచ్చిపడిరి. చివరకు గర్భములలో ఉండిన పురుషగర్భములు కూడా నష్టములయ్యె. అప్పుడీ బ్రాహ్మణోత్తముడొకడు మాత్రమే బ్రతికియుండెను.

**కృపయా రామచంద్రస్య మారుతేః కృపయాఽపి చ ।**
**తతః ప్రభాతే తా నార్యః సర్వాన్స్వపురుషాన్ మృతాన్ ॥ 194**

**దృష్ట్వాఽతివిస్మయం ప్రాపుస్తాభిర్నైవ శ్రుతో ధ్వనిః ।**
**తదా విప్రం జీవితం తం దృష్ట్వా పంకేఽపి మారుతిమ్ ॥ 195**

**పతితం విస్మయావిష్టాః పప్రచ్ఛుస్తం ద్విజోత్తమమ్ ।**
**తతః స సకలం వృత్తం నారీః సంశ్రావయత్తదా ॥ 196**

**తతస్తాః ప్రార్థయిత్వా తం చక్రుః స్వీయపురాధిపమ్ ।**
**సోఽపి రామాజ్ఞయా రాజ్యం చకార తత్పురస్య చ ॥ 197**

**పురస్థితానాం నారీణాం స ఏవాసీత్పతిస్తదా ।**
**తన్మారుతేర్గర్జితం హి కాలే కాలే తు పూర్వవత్ ॥ 198**

అద్యాపి శ్రూయతే తస్మిన్నగరే ఘనశబ్దవత్ ।
తచ్ఛ్రుత్వా పుత్రగర్భాశ్చ ప్రస్ఖలంతి హి యోషితామ్ ॥ 199

స్త్రియః సహస్రశశ్చాసన్ పురుషస్త్వేక ఏవ సః ।
తదారభ్య తత్ స్త్రీరాజ్యం కథ్యతే మానవోత్తమైః ॥ 200

తతః కాలాంతరేణైవ స విప్రశ్చ మృతో యదా ।
తదా స్వపూర్వేపుణ్యేన విష్ణుసాయుజ్యమాప సః ॥ 201

తతస్తాభిస్తు నారీభిః కశ్చిత్పాంథః సమాగతః ।
స ఏవ క్రియతే భర్తా న తం తా మోచయంతి హి ॥ 202

జ్ఞాత్వా తం గర్జనాకాలం పురుషాన్విపరేషు హి ।
గోపయిత్వా దుందుభీనాం శంఖానాం నిఃస్వనాదిభిః ॥ 203

న శ్రావయంతి తేషాం తం ధ్వనిం మారుతసంభవమ్ ।
అతిక్రాంతేఽథ తత్కాలే తాన్ పునర్జీవితానితి ॥ 204

ఇందుకు శ్రీరామచంద్రునియొక్కయు, హనుమంతుని యొక్కయు దయయే కారణము. అంత ఆ మరుసటిరోజు తెల్లవారగా ఆ ఊరిస్త్రీలు తమ పురుషులందరును మృతులైయుండుట జూచి, తాము ఆ గర్జనను వినకపోవుటచే అత్యంతాశ్చర్యముతో చావక బ్రతికియుండు ఈబ్రాహ్మణుని జూచి బురదలో పడియుండు హనుమన్మూర్తిని జూచి విస్మయమంది, "బ్రాహ్మణోత్తమా! ఇది యేమివింత" యని అడిగిరి. అతడును వారికి జరిగిన సంగతి తెలిపెను. అంత వారందరును ప్రార్థించి, యితనిని ఆ పట్టణమునకు పెద్దగా జేసిరి. అతడును శ్రీరామాజ్ఞతో, ఆ పట్టణమున రాజ్యము ఏలసాగెను. అప్పుడా యూరిలోనుండు స్త్రీలందరికిని అతడే నాథుడయ్యె. ఆ హనుమంతునియొక్క గర్జన ఒక్కొక కాలమునందు మునుపటివలె నిప్పటికిని ఆ పురమున పిడుగువలే వినబడుచున్నది. అది వినబడిన అచ్చటి అంగనలకు పుత్రగర్భములుండిన అట్లే నశించును, స్త్రీలు వేలకొలదిగా ఉందురు. అతడొక్కడేపురుషుడు. అది మొదలు దానిని స్త్రీరాజ్యమని పిలువసాగిరి. పిదప కాలాంతరమున ఆ బ్రాహ్మణుడు మృతుడై తన పుణ్యప్రభావముచేత విష్ణులోకమునందెను. (200).

## పుత్ర ప్రాశస్త్య విచారము

పిమ్మట అచ్చటి నారీమణులు నాథుడు లేక తామే రాజ్యమును పరిపాలింపసాగిరి. బాటసారియై అటువైపు ఎవరైనా పురుషుడువచ్చినచో వారు వానిని వరించి పతిగా జేసికొని వదలకయుందురు.

మతి వారు హనుమద్గర్జన కాలమును గుర్తించి, తమ రాజ్యములోని పురుషులను సందుగొందులలో దాచి భేర్యాది వాద్యధ్వనులనడుమ ఆగర్జన వినబడనట్లు చేసి ఆ కాలమతిక్రమింపగానే పునర్జీవితులై ఆ పురుషులతో మహోత్సవములుజేసి భోగించుచుందురు. కావున అది స్త్రీ రాజ్యమనబడెను.

కృత్వా నానోత్సవైః పూజ్య తైర్భోగం తా భజంతిహి ।
నార్యా తచ్ఛాస్యతే రాజ్యం సదైవ ద్విజసత్తమ ॥ 205

స్త్రీణామేవ సదోత్పత్తిర్జాయతే పురుషస్య చ ।
తద్రాజ్యనికటస్థా యే దేశాస్తేష్వపి భో ద్విజ ॥ 206

మారుతే శబ్దసంస్పృష్టవాయునా స్పర్శితా నరాః ।
అశక్తా ఏవ జాయంతే న తేష్వాసీత్సుపౌరుషమ్ ॥ 207

అతస్తేషామశక్తానాం వీర్యక్షీణతయా ద్విజ ।
భవంతి దుహితర ఏవం క్వచిత్పుత్రః ప్రజాయతే ॥ 208

ఆధిక్యే రజసః కన్యా శుక్రాధిక్యే సుతో భవేత్ ।
నపుంసకః సమత్వేన యథేచ్ఛా పారమేశ్వరీ ॥ 209

అన్యత్తే కారణం వచ్మి న భవంతి సుతా యతః ।
కారణం శృణు తస్యేదం విష్ణుదాస ద్విజోత్తమ ॥ 210

తేషు దేశేషు నార్యశ్చ నిజరాజ్యమదేన హి ।
రతికాలేఽధః పురుషం కృత్వా క్రీడాం భజంతి తాః ॥ 211

న స్వీయాం రతికాలే తాః పుష్టిం భూమిం స్పృశంతి హి ।
అతఏవ రతికాలే శుక్రం తు స్రవతే బర్హిః ॥ 212

సూక్ష్మచ్ఛిద్రే తథా గర్భస్థానే తన్నైవ గచ్ఛతి ।
నాసానయనకర్ణానాం ద్వే ద్వే రంధ్రే ప్రకీర్తితే ॥ 213

మేహనాపానవక్త్రాణామేకైకం రంధ్రముచ్యతే ।
దశమం మస్తకే ప్రోక్తం రంధ్రాణీతి నృణాం విదుః ॥ 214

స్త్రీణాం త్రీణ్యధికాని స్యుః స్తనయోర్గర్భవర్త్మనః ।
సూచికాగ్రసమాన్యేవ తాని ఛిద్రాణి సంతి హి ॥ 215

గర్భఛిద్రం రతికాలే కించిద్వికసితం ద్విజ ।
భూత్వా మార్గం తు వీర్యస్య దదాతి పురుషస్య చ ॥ 216

తన్మార్గేణ గత వీర్యం చేత్ సమ్యక్ పురుషస్య చ ।
గర్భస్థానే తదా పుత్రో జాయతే నాత్ర సంశయః ॥ 217

స్వల్పం ప్రవిష్టం వీర్యం చ తదా కన్యా ప్రజాయతే ।
రజసశ్చాధికత్వేన జానీహ్యేవం వినిశ్చయమ్ ॥ 218

తస్మాద్యదాఽధః శేతే వై తద్దేశేషు నరోత్తమః ।
రతికాలే తస్య వీర్యమూర్ధ్వం గచ్ఛతి నైవ తత్ ॥ 219

యది దైవవశాత్కించిద్గతం స్త్రీరంధ్రమార్గతః ।
తదా దైవవశాత్పుత్రో జాయతే సోఽపి షండవత్ ॥ 220

ఆ భూమిపై స్త్రీలు తప్ప పురుషులు పుట్టరు. ఆ రాజ్యమునకు చుట్టుప్రక్కల ఉండు దేశములయందు అంతటా హనుమద్గర్జన సంబంధ వాయువు వీచుటచేత అచ్చటి పురుషులు గూడ నిస్సారులై యుందురు. నిర్వీర్యులగు వారికి కలుగు సంతానములు స్త్రీలుగానుండును. రాజ్యంలో పురుషులు ఎచ్చటనో అరుదుగా ఉందురు. రజోధిక్యముచే కన్యలును శుక్రాధిక్యముచే నపుంసక ప్రజలును గల్గును. సమత్వమున నపుంసక సంతానము ఉదయించును. మరియు ఒక కారణమును చెప్పెదను వినుము.

ఆ దేశములలో స్త్రీలు తమరాజ్యమదముచే పురుషాయిత మారంభించెదరు. అందువలన శుక్రము బహిస్స్రవణమై గర్భస్థాన సూక్ష్మరంధ్రమున చక్కగా నిలువకపోవును. ముక్కు, కళ్ళు, చెవులకు, రెండేసి రంధ్రములును, మల, మూత్ర ద్వారములు, వక్త్రములకు ఒక్కొక్క రంధ్రమును పదియవ రంధ్రము తలమీదను గలవు. స్త్రీలకు స్తనములలో రెండును, గర్భరంధ్ర మొకటియును వెరసి మూడురంధ్రములు అధికముగా నుండును. అవి సూర్యగ్రహము వలె సూక్ష్మములు. అయిన సంగమ సమయమున గర్భరంధ్రము వికసించియుండును. అప్పుడు శుక్రమధికముగా ప్రవేశించిన అది పురుషగర్భము. రజస్సు అధికమైనచో స్త్రీ సంతానమగును. అట్టి పురుషాయిత దాంపత్యమునకు దైవవశమున ఎప్పుడో పురుష సంతానము కలుగును. అదియును దుర్బలమై నపుంసకమై యుండును.

అతఏవ హి తద్దేశే బహుకన్యా భవంతి హి ।
ఏవం తే కారణం ప్రోక్తం కన్యోత్పత్తేర్ద్విజోత్తమ ॥ 221

ఏవం సర్వేషు దేశేషు చేన్నార్యా అధికం బలమ్ ।
అస్తి తర్హి భవేత్కన్యా పుత్రః పురుషసారతః ॥ 222

తస్మాత్ పుత్రార్థినా నారీ పోషణీయా కదాపి న ।
పోషయేచ్చ సదాఽఽత్మానం నానాత్రాద్యరసాయనైః ॥ 223

అతఏవ హి వైద్యాశ్చ పాలనీయాః సదా నరైః ।
బలాబలప్రవేత్తారస్తైర్ జ్ఞేయం స్వబలాబలమ్ ॥ 224

పుష్టదేహం నిరీక్ష్యాథ న జ్ఞేయం త్వధికం బలమ్ ।
వాతేనాపి పుమాన్పుష్టో జాయతేఽత్ర సదైవ హి ॥ 225

అతో వైద్యం వినా తచ్చ న జ్ఞాస్యతి బలాబలమ్ ।
అతో వైద్యాస్తే ప్రష్టవ్యాః సదా భక్తిపురః సరాః ॥ 226

మంత్రే తీర్థే ద్విజే దైవే వైద్యేథ గణకే గురౌ ।
యాదృశీ భావనా స్వీయా సిద్ధిర్భవతి తాదృశీ ॥ 227

అతో వైద్యోక్తమార్గేణ సదా గచ్ఛేన్నరోత్తమః ।
బలాబలవిచారేణ పుత్రా ఏవ భవంతి హి ॥ 228

ఏక ఏవ వరః పుత్రః కిం జాతా దశ కన్యకాః ।
పున్నామ్నో నరకాత్పుత్రస్తారయేత్స్వకులం క్షణాత్ ॥ 229

కన్యా స్వీయదురాచారాత్ క్షణాన్నిజపితుః కులమ్ ।
తథా భర్తుః కులం చాఽపి నరకే పాతయేచ్చ సా ॥ 230

తస్మాన్నరైశ్చ పుత్రార్థం యత్నః కార్యస్త్వహర్నిశమ్ ।
ఏష్టవ్యా బహవః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్ ।
యజేత్ వాఽశ్వమేధేన నీలం వా వృష ముత్సృజేత్ ॥ 231

**జీవతో వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరి భోజనాత్ ।**
**గయాయాం పిండదానేన త్రిభిః పుత్రస్య పుత్రతా ॥ 232**

**ఏవం శిష్య త్వయా పృష్టమశక్తేన కథం వ్రతమ్ ।**
**కార్యం తచ్చ మయా సర్వం భూసురస్య కథానకమ్ ॥ 233**

**తవాగ్రే కథితం రమ్యం త్వత్తోషార్థమనుత్తమమ్ ।**
**తస్య వ్రతస్య సామర్థ్యాత్స దరిద్రో ద్విజోత్తమః ॥ 234**

**లబ్ధ్వా తద్విపులం రాజ్యం భుక్త్వా భోగాన్ మనోరమాన్ ।**
**సాయుజ్యం ప్రాప విష్ణోశ్చ స్వాయుషశ్చ క్షయే ద్విజః ॥ 235**

ఇదేవిధముగా అన్నిదేశములలోను స్త్రీకి బలాధిక్యమై యుండిన స్త్రీ సంతతివర్ధిల్లును. కావున పుత్రసంతానం కోరువారు స్వబలమును అభివృద్ధి జేసికొనదగును. బలాబల ప్రవక్తలెవ్వరనిన వైద్యులై యుందురు. ఆప్తులును, సజ్జనులగు వైద్యులు అందరిని పరిరక్షింపవలయును.

మఱి లోకమున మంత్రమునందు, తీర్థమునందు, బ్రాహ్మణునియందు, దైవమందు, దైవజ్ఞుని యందు, వైద్యునియందు, గురుమూర్తియందు తన నమ్మకమెట్లుండునో అట్లు ఫలసిద్ధి యగుచుండును. కావున సద్వైద్యునినమ్మి బలాబలస్వరూపమెరిగి స్వబలాధిక్యమునంది, పుత్రులను సంపాదించు కొనునది.

పున్నామ నరకమునుండి యుద్ధరించువాడు పుత్రుడగుటచేత ఒక పుత్రుడుగల్గినను చాలును. పదిమంది పుత్రికలుపుట్టి ఫలమేమి? కన్యక నిజదురాచారముచేత పితృకులమును, పతికులమును కూడ జెరుచును. కావున పురుషుడు పురుష ప్రజ్ఞకై ప్రయత్నింపతగును. పదిమంది పుత్రులనందిన వారిలో నెవడైన నొకడు గయాక్షేత్రమునకు వెళ్ళును, అశ్వమేధాది క్రతువులనైన జేయును. పితృూద్దేశముచే నీల వృషభమునైన విడుచును. బ్రతికియున్నపుడు తండ్రిమాట వినుటచేతను, ప్రత్యాబ్దికమునందు బ్రాహ్మణ భోజనముచేతను, గయాశ్రాద్ధము చేతను పుత్రుడు పుత్రత్వమునందును.

వినుము విష్ణుదాసా! నీవడిగిన విషయమును అశక్తుడగు ఆ బ్రాహ్మణుడు శ్రీరామవ్రతమును ఆచరించి, రాజ్యభోగములనంది, ఎంతో సంతోషము పొంది, అంత్యకాలమున విష్ణుసాయుజ్య ముక్తి పొందెను.

**ఏవం తద్రామచంద్రస్య వ్రతం కోఽత్ర తు నాచరేత్ ।**
**సుఖేన ముక్తిదం చాఽత్ర పరలోకే విముక్తిదమ్ ॥ 236**

మునిభిశ్చ సురైర్నాగైర్గంధర్వైః కిన్నరైర్నృపైః ।
సదాఽను భావితం చేదం వ్రతానాముత్తమం వ్రతమ్ ॥ 237

స్త్రీపుత్రధనదం చైతత్సర్వసౌఖ్యప్రదం నృణామ్ ।
ఇహలోకే పరే చాపి విష్ణోః సాయుజ్యదాయకమ్ ॥ 238

సంతి వ్రతాన్యనేకాని స్వర్గే మర్త్యే రసాతలే ।
తథాపి మాసనవమీసమానం వ్రతముత్తమమ్ ॥ 239

విష్ణుదాస ద్విజశ్రేష్ఠ న భూతం న భవిష్యతి ।
తస్మాత్సదా నరైః కార్యం వ్రతం చేదం మహత్తమమ్ ॥ 240

ఏవం త్వయా యథా పృష్టం తథా తే వినివేదితమ్ ।
కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛాస్తి తద్వదస్వ వదామి తే ॥ 241

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, నవమీ కథావర్ణనం నామ, షష్ఠః సర్గః ॥**

ఇహపరములలో భుక్తి, ముక్తి నిచ్చునట్టి సురముని గంధర్వకిన్నర నృపాదులచే అనుభవింపబడి సర్వోత్తమ వ్రతమనబడు దీనిని ఎవడు ఆచరించడు? నరులకు ఈవ్రతము భార్య, పుత్ర, విత్తాది సమస్త సుఖములనిచ్చి, పరమున విష్ణుసాయుజ్యమునిచ్చునది. త్రిలోకములలో ఎన్నియో వ్రతములు గలవు అయిన ఈ మాసనవమి వ్రతమువంటి సర్వోత్తమవ్రతము మరియొకటిలేదు. ఇటువంటిది గతములో లేదు, ఇక భవిష్యత్తులో ఉండదు. కావున శ్రేయస్సును కోరు మానవులు భక్తితో ఈ శ్రీరామనవమీ వ్రతమును ఆచరింపవలయును. ఇకనేమి తెలియవలె అడుగుమని శ్రీరామదాసు పలికెను. (241)

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో శ్రీరామదాస–విష్ణుదాసుల సంవాదరూపమైన నవమి మహాత్మ్యమును వివరించు 6వ సర్గ ముగిసినది.**

# సప్తమః సర్గః-7వ సర్గ

## శ్రీరామనామ లక్షఉద్యాపన విధానము

విష్ణుదాస ఉవాచ

అన్యద్గురో రాఘవస్య తుష్టిదం కిం వదస్వ తత్ ।

శ్రీరామదాస ఉవాచ

శృణుష్వ విష్ణుదాస త్వం యత్తేஉహం ప్రవదామి చ ।
తుష్ట్యర్థం రామచంద్రస్య నిత్యం పత్రే తు మానవైః ॥ 1

లేఖనీయం రామనామశతాని నవ ప్రత్యహమ్ ।
అథవాஉష్టోత్తరశతం పూజనీయం సవిస్తరమ్ ॥ 2

ఏవం కోటిమితం లేఖ్యం లక్షం వా తు తతః పరమ్ ।
హవనం హి దశాంశేన కర్తవ్యం విధిపూర్వకమ్ ॥ 3

ఇదం విష్ణురితి ఋచా తిలాజ్యైః పాయసేన వా ।
నవాన్నేనాథవా కార్యం రాఘవం పరిపూజ్య చ ॥ 4

హవనాంగే రాఘవాదిదేవానాం పూజనే నరైః ।
ఆసనార్థం తు భద్రం చ స్థాపనీయం ప్రయత్నతః ॥ 5

అష్టోత్తరసహస్రం చ రామలింగాత్మకం శుభమ్ ।
అథవాஉష్టోత్తరశతం రామలింగాత్మకం శుభమ్ ॥ 6

అష్టోత్తరసహస్రం వా రామతోభద్రముత్తమమ్ ।
అథవాஉష్టోత్తరశతం రామతోభద్రముత్తమమ్ ॥ 7

ఏవం హోమం లేఖనం చ పూజనాది చ యత్కృతమ్ ।
అర్పయేద్రఘునాథాయ తత్సర్వం త్వతిభక్తితః ॥ 8

విష్ణుదాసు అడుగుచున్నాడు. ఓ గురువా! శ్రీరాముని సంతోషపరుచు మరికొన్ని సాధనలను చెప్పుము. అనగా,

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, “శిష్యుడా! నేను చెప్పెడుసంగతిని వినుము. శ్రీరామచంద్రస్వామికి తృప్తికరముగా మానవులు ప్రతిదినము నూటతొమ్మిదేసి (109) రామనామములను లిఖించి చక్కగా పూజింపవలయును. 108 వంతున వ్రాసిననుసరియె. ఇట్లు కోటిరామనామములు అగునంతవరకు వ్రాయవలయును. లక్ష నామములనైనను వ్రాయక తప్పదు. దానికి శాంతిగా శ్రీరాముని పూజించి, పదివేల హోమము పాయసము చేతనో, నవాన్నము చేతనో, తిల ఆజ్యముల చేతనో, 'ఇదం విష్ణుర్విచక్ర' ఇత్యాది మంత్రముచే చేయనగును, హోమాంగముగా శ్రీరామాది దేవతలను పూజించునవుడు అసమర్థులుగూడ 1008 గాని, 108 గాని గల రామతోభద్రమునైనను, 1008 గాని, 108లో గాని గల రామలింగతోభద్రము నైనను స్థాపించవలెను. ఇట్లు చేసిన రామనామ లేఖన, హవన, పూజలను భక్తితో శ్రీరామస్వామికి అర్పించునది.

**విష్ణుదాస ఉవాచ**

**త్వయా గురో శుభం ప్రోక్తం రామనామప్రలేఖనమ్ ।**
**న తస్యోద్యాపనం ప్రోక్తం తద్వదస్వ మమాధునా ॥ 9**

**శ్రీరామదాస ఉవాచ**

**శృణు శిష్య భవిష్యాంతే కథాం వక్ష్యామి భూతవత్ ।**
**రామనామోద్యాపనస్య విస్తరేణ మనోరమామ్ ॥ 10**

**పాండుపుత్రో మహావీరో బంధుభిశ్చ యుధిష్ఠిరః ।**
**స్త్రియా మాత్రా భ్రష్టరాజ్యో వనే వాసం కరిష్యతి ॥ 11**

**తం ద్రష్టుం ద్వాపరే కృష్ణః కదా గచ్ఛతి వై వనే ।**
**తం కృష్ణం పూజయిత్వా స తస్మై ప్రశ్నం కరిష్యతి ॥ 12**

**యుధిష్ఠిర ఉవాచ**

**దేవదేవ జగన్నాథ భక్తానాం వరదాయక ।**
**కించిత్త్వాం ప్రష్టుమిచ్ఛామి మయి తుష్టోఽసి చేత్ప్రభో ॥ 13**

**లక్ష్మీప్రాప్తికరం పుణ్యం పుత్రపౌత్రప్రవర్ధనమ్ ।**
**వ్రతమాఖ్యాహి దేవేశ రాజ్యభ్రష్టస్య మేఽధునా ॥ 14**

**శ్రీకృష్ణ ఉవాచ**

**గుహ్యాద్గుహ్యతమం శ్రోతుం యది వాంఛసి భూపతే ।**
**తదా నిగదతో మత్తః స్వకాశాచ్ఛృణు సాదరమ్ ॥ 15**

**రామనామ్నః పరం నాస్తి మోక్షలక్ష్మీప్రదాయకమ్ ।**
**తేజోరూపం యదవ్యక్తం రామనామాభిధీయతే ॥ 16**

**తస్మాత్తన్నామ జప్త్వా వై రామరూపో భవేన్నరః ।**
**ఏతదేవ హి రామేణ మారుతిం ప్రతి భాషితమ్ ॥ 17**

**యుధిష్ఠిర ఉవాచ**

**కస్మిన్కాలే హనుమతే రామేణైవోపదేశితమ్ ।**
**ఏతద్విస్తారతో బ్రూహి సుమతే రుక్మిణీపతే ॥ 18**

**శ్రీకృష్ణ ఉవాచ**

**పురా రామావతారే చ సీతా నీతా సురారిణా ।**
**హనూమంతం సమాహూయ రామచంద్రోఽబ్రవీద్వచః ॥ 19**

అపుడు విష్ణుదాసు, "స్వామీ! శ్రీరామనామ లేఖనక్రమమును ఉపదేశించితిరి. దీని ఉద్యాపన విధానమును అనుగ్రహింపుము." అని వేడగా రామదాసు ఇట్లనెను, "విష్ణుదాసా! జరుగబోవు కథను జరిగినట్లు చెప్పెదను. ఇది మనోహరము. రామనామ ఉద్యాపన ప్రక్రియా ప్రతిపాదకమునై యుండును. పాండురాజు పుత్రుడగు ధర్మరాజు తమ్ములతోను, పత్నితోను రాజ్యభ్రష్టుడై, వనమున వాసము చేయును. ద్వాపరమున శ్రీకృష్ణుడు అతనిని పరామర్శించుటకై వనమునకు ఒకప్పుడేతెంచును. ధర్మరాజప్పుడు శ్రీకృష్ణుని పూజించి,

"జగన్నాథుడగు శ్రీకృష్ణ స్వామీ! నాయెడ నీకు ప్రీతిగల్గియుండిన రాజ్యభ్రష్టుడగు నాకు లక్ష్మీప్రదమును, పుత్రపౌత్రాది సాంసారిక సకలభోగవర్ధనమునైన వ్రతమును ఒకదానిని ఉప దేశింపుము. నీవు భక్తులకు వరప్రదుడవు గదా?" అని ప్రార్థింపగా ఆ కృష్ణమూర్తి యిట్లు చెప్పుచున్నాడు,

"మిగుల రహస్యమగు విషయమును ప్రస్తావించితివి, చెప్పెదను వినుము. శ్రీరామ నామముకన్నను మోక్షలక్ష్మిప్రదమగునట్టిది మఱియొకటి లేదు. అవ్యక్త దివ్యతేజస్స్వరూపమయినది శ్రీరామనామమై యుండును. కావున నానామమును జపించి నరుడు రామరూపుడగును. దీనినే శ్రీరాముడు హనుమంతునికి ఒకప్పుడు ఉపదేశించెను." అని, అదియెప్పుడనిన, ధర్మరాజుతో శ్రీకృష్ణుడు మరల చెప్పుచున్నాడు. మునుపు రామావతారమున రావణుడు సీతను అపహరించె.

శ్రీరామచంద్ర ఉవాచ

వాయుసూనో మహావీర సీతాన్వేషణహేతవే ।
సమస్తాం దక్షిణదిశం గత్వా శుద్ధిం సమానయ ॥ **20**

శ్రీహనుమాన్ ఉవాచ

రఘునాథ జగన్నాథ దక్షిణస్యాం హి సాగరః ।
బహవో రాక్షసాః సంతి తత్ర శక్తిః కథం మమ ॥ **21**

శ్రీరామచంద్ర ఉవాచ

మారుతే రావణాదీనాం రాక్షసానాం నివారకమ్ ।
మంత్రం దదామి సుగమం యేన సర్వజయీ భవేత్ ॥ **22**

శ్రీహనుమాన్ ఉవాచ

మహారాజ కృపాసింధో దీనానాం త్వం సుతారకః ।
ఉపదేశోఽధునా కార్యస్తస్య మంత్రస్య తత్త్వతః ॥ **23**

శ్రీరామదాస ఉవాచ

ఇతి శ్రుత్వా చ తద్వాక్యం రహస్యాహూయ సత్వరమ్ ।
మారుతేరక్షిణే కర్ణే శ్రీరామేత్యుపదేశితః ॥ **24**

తస్య మంత్రస్య సకలం పురశ్చరణముత్తమమ్ ।
లక్షసంఖ్యం విధాయాశు ప్రతస్థే దక్షిణాం దిశమ్ ॥ **25**

తన్మంత్రస్య ప్రభావేణ నానాజలచరాచరమ్ ।
దుర్గమం సాగరం తీర్త్వా లంకామధ్యే సమాయయౌ ॥ **26**

న స లేభే తత్ర శుద్ధిమశోకాఖ్యవనం గతః ।
వృక్షమూలే స్థితాం సీతాం దూరతోఽగ్రే దదర్శ సః ॥ **27**

తాం దృష్ట్వా శీఘ్రమాగత్య హర్షనిర్భరమానసః ।
సీతాయాశ్చరణౌ నత్వా దండవత్పతితో భువి ॥ **28**

అత్యంతం సూక్ష్మవపుషం బాలకాకారసంయుతమ్ ।
తం భూమౌ పతితం దృష్ట్వా సీతా వచనమబ్రవీత్ ॥ **29**

ఆగతోఽసి కుతో బాల కుత్రత్యః కస్య బాలకః ।
శ్రీహనుమానువాచ
సీతా మాతా పితా రామో రామచంద్రసమీపతః ॥ **30**

సమాగతోఽస్మి హనుమాన్ గ్రాహ్యైకా ముద్రికా త్వయా ।
రామనామాంకితాం ముద్రాం శుద్ధకాంచననిర్మితామ్ ॥ **31**

జ్ఞాత్వా రామస్య సా సీతా పరమం తోషమాయయౌ ।
తాం జ్ఞాత్వా తోషసహితామాంజనేయోఽబ్రవీద్వచః ॥ **32**

మాతః క్షుధాఽస్త్యతి మమ త్వద్యాతిక్లేశ కారిణీ ।
అస్మిన్వనేఽతిమధురః ఫలసంఘోఽతిదుర్లభః ॥ **33**

తవాజ్ఞయాఽహం సీతేఽద్య కరిష్యే భక్షణం ధ్రువమ్ ।
సీతోవాచ
భో బాలక మహావీర రావణోఽస్తి వనాధిపః ॥ **34**

న శక్తిర్న చ శక్యం తే కథం త్వం భక్షయిష్యసి ।
హనుమానువాచ
శ్రీరామేతి పరో మంత్రః శస్త్రం మే హృదయాంతరే ॥ **35**

శ్రీరాముడు ఆంజనేయుని పిలచి "మహాబలుడగు మారుతీ! సీతనువెదకుటకై దక్షిణదిక్కులో అంతట సంచరించి వృత్తాంతమును గొనిరమ్ము" అని ఆజ్ఞాపించెను. అందుకు హనుమంతుడు "స్వామీ! జగదీశుడగు జానకీప్రియా! దక్షిణమందే గదా సముద్రమపారమై యున్నది. మరియు అచ్చట అనేకులు రాక్షసులుగలరు. నాకచ్చట బలమెట్లుగల్గు?" ననివేడెను, అపుడు రాముడు, "నాయనా! నీవు సుఖముగా వెడలివచ్చుటకై రావణాది రాక్షసులను నివారించునట్టి మంత్రమునిచ్చెదను. దానివలన సర్వజయములు సిద్ధించును" అనగా, ఆంజనేయుడు "దయాసాగరుడగు మహారాజా! దీన ప్రాణరక్షకా! ఆ మంత్రమును సమర్మకముగా నాకు ఉపదేశింపుము స్వామీ! అని ప్రార్థించెను. అపుడు శ్రీరామచంద్రస్వామి హనుమంతుని ఏకాంతమునకు తీసికొనిపోయి అతని కుడిచెవిలో,

"శ్రీరామ" అని ఉపదేశించెను. అపుడాంజనేయుడు ఆనందభరితుడై క్రమముగా లక్ష రామనామ పురశ్చరణముచేసి, త్వరగా దక్షిణమునకు వెడలెను. ఆహా! ఆ మంత్ర ప్రభావముచే దుర్గమమగు మహాసముద్రమును లంఘించి లంకలో ప్రవేశించెను. అచ్చట సీతను గానక అశోకవనమున ప్రవేశించి, వృక్షమూలమున వసించుచుండు సీతాదేవిని జూచి త్వరగావచ్చి ఆమె పాదపద్మములకు సాష్టాంగ దండప్రణామము చేసెను. అపుడు జానకీదేవి మిక్కిలి చిన్నని మేనుగల్గి బాలరూపముచే ఒప్పుచు నేలబడియుండు హనుమనుజూచి, "నాయనా! నీవెచ్చటినుండి వచ్చితివి? నీవెవనివాడవు?" అని విచారించెను. అందు కాంజనేయుడు, "తల్లీ సీతాదేవి, తండ్రి రామప్రభు, ఆస్వామివద్దనుండి వచ్చితిని. నీవీఅంగులీయకమును గైకొమ్ము." అని ప్రార్థించెను. అపుడు సీత దివ్యకనక నిర్మితమును శ్రీరామ నామాలంకృతమునగు ముద్రికను స్వీకరించి, అది లోకపతిది అని గుర్తించి, సంతోషపడెను. అపుడు ఆంజనేయుడు తల్లి ఆనందముగా ఉన్నదని యెఱింగి, "తల్లీ! విపరీతమగు ఆకలి పుట్టి శ్రమపడుచున్నాను. ఇక్కడ వనమున మిక్కిలి రుచికరమును, అంతట దుర్లభమగు ఫలసమూహ ముగలదు. తమరి ఆజ్ఞయైనచో భక్షించెదను." అని వేడెను.

అందుకు సీతాదేవి, "ఓరి బిడ్డడా! నీవు మహావీరుడవు, అయిన ఈ వనానికి రావణుడు అధిపతి, నీకు శక్తి చాలదు, ఇది సాధ్యముకాదు, నీ వెట్లుతిందువు?" అని అడిగెను. అంత ఆ కపివీరుడు "జననియగు జానకీమాతా! శ్రీరామ మహామంత్రమను మహాస్త్రము నాహృదయ మధ్యమునగలదు అనెను.

**తేన సర్వాణి రక్షాంసి తృణరూపాణి సాంప్రతమ్ ।**
**ఇత్యుక్త్వాఽథ తదీయజ్ఞాం గృహీత్వా వనభూరుహాన్ ॥ 36**

**తన్మూలనం చకారాథ శ్రుత్వా రక్షాంసి చాయయుః ।**
**యుద్ధం చ తుములం జాతం పశ్చాన్మంత్రప్రభావతః ॥ 37**

**దళితం రాక్షసబలం దగ్ధా లంకా హనూమతా ।**
**పునర్గత్వాఽశోకవనం సీతాం నత్వా చ మారుతిః ॥ 38**

**తదలంకారమాదాయ రామచంద్రం సమాయయౌ ।**
**రామాయాలంకృతిం దత్వా తస్థౌ తత్పాదసన్నిధౌ ॥ 39**

**రామోఽలంకృతిమాదాయ తచ్ఛ్రుత్వా ముదితోఽభవత్ ।**
**రామనామప్రభావోఽయం మహారాజ యుధిష్ఠిరమ్ ॥ 40**

తస్మాత్త్వమపి రాజేంద్ర రామనామజపం కురు ।
యుధిష్ఠిర ఉవాచ
కథం జపో విధేయోఽస్య పురశ్చరణకం ఫలమ్ ॥ 41

కథముద్యాపనం చైవ సర్వమాఖ్యాహి యత్నతః ॥ 42

శ్రీకృష్ణ ఉవాచ
అథవా పుస్తకే లేఖ్యం స్మరణం హృదయేఽథవా ।
కోటిసంఖ్యాపరిమితమథవా లక్షసంమితమ్ ॥ 43

మంత్రా నానావిధాః సంతి శతశో రాఘవస్య చ ।
తేభ్యస్త్వేకం వదామ్యద్య తవ మంత్రం యుధిష్ఠిర ॥ 44

శ్రీశబ్దమాద్యం జయశబ్దమధ్యం
జయద్వయేనాపి పునః ప్రయుక్తమ్ ।
త్రిస్సప్తకృత్వో రఘునాథనామ
జపో నిహన్యాద్ద్విజకోటిహత్యాః ॥ 45

అనేనైవ చ మంత్రేణ జపః కార్యః సుమేధసా ।
లక్షసంఖ్యే కృతే తస్మిన్నుద్యాపనవిధిం చరేత్ ॥ 46

రామమంత్రప్రభావముచేత రాక్షసవీరులు ఇప్పుడు నాకు గడ్డిపరకల వంటివారు." అని చెప్పి సీతాదేవి ఆజ్ఞనంది వనవృక్షములను పెళ్ళగించెను. ఆ అల్లరిని చూసి రాక్షసవీరులు సాయుధులై వచ్చిరి. భీకరయుద్ధము జరిగె, మంత్ర ప్రభావముచే రాక్షసబలము ధ్వంసమయ్యెను, లంకకాల్చబడె. అంత ఆ వానరవీరుడు మరల అశోక వనమునకువచ్చి, సీతాదేవికి నమస్కరించి ఆమె అనుగ్రహించిన అలంకారాభరణమును తీసికొని అనుజ్ఞనంది, శ్రీరామ సన్నిధికివచ్చి, చరణకమలములవద్ద నిలచి సీత సమర్పించిన అలంకారమును అర్పించెను. శ్రీరాముడు ఆ అలంకృతిని స్వీకరించి, జరిగిన వృత్తాంతమును విని సంతసించెను. కావున ఓయి ధర్మరాజా! రామనామ మంత్రము ఇట్టిది. అంత,

"ఈ శ్రీరామమంత్ర జపవిధానమెట్లు? దీనిపురశ్చరణ ఫలమెట్టిది? దీని ఉద్యాపన మెట్లు? అనుగ్రహింపుము," అని వేడిన ధర్మరాజుతో, కృష్ణుడు చెప్పుచున్నాడు, "స్నాన నిత్యకర్మానంతరము శుచిస్థలమున తులసీ జపమాలికచే ఈ మంత్రమును జపించునది. పుస్తకమునందైనను వ్రాయవచ్చును. అట్లుగాకున్న మనసున స్మరింపవచ్చును. శక్తియున్న కోటి సంఖ్యాకముగాను, లేనిచో లక్ష

సంఖ్యాకముగానైనను జపించవలయును. శ్రీరామమంత్రములు నూర్లకొలదీ అనేకములు అనేక విధములుగా ఉన్నవి. నీకు వాటిలో ఒక మంత్రమును చెప్పుచున్నాను. “శ్రీరామజయరామ జయజయరామ” అని 7 మార్లు చెప్పిన ఒక జపము చొప్పున జపించవలయును, ఈ మంత్రము బ్రహ్మహత్యాది పాతకములను కూడ పరిహరింపగలదు. ప్రజ్ఞావంతుడు ఈ మంత్రమునే జపింప వలయును, లక్షజపము కాగానే ఉద్యాపనక్రమమును ఆచరించునది.

జపాచ్ఛతగుణం పుణ్యం రామనామప్రలేఖనే ।
లక్షే లక్షే పృథక్కార్యముద్యాపనమనుత్తమమ్ ॥ 47

ఉద్యాపనవిధానం చ సంక్షేపేణ వదామి తే ।
పూర్వేద్యురుపవాసీ స్యాద్రాత్రౌ మండపికాంతరే ॥ 48

రామలింగాత్మకే భద్రే రామతోభద్రకేఽథవా ।
అష్టోత్తరసహస్రాఖ్యే హ్యష్టోత్తరశతేఽథవా ॥ 49

ధాన్యరాశౌ మధ్యదేశే కలశం స్థాపయేత్తతః ।
తన్ముఖే స్వర్ణపాత్రే వై వరవస్త్రోపశోభితే ॥ 50

సీతాలక్ష్మణసంయుక్తాం రాఘవప్రతిమాం శుభామ్ ।
ఆమాషాత్పలపర్యంతాం సౌవర్ణీం ప్రతిమాం యజేత్ ॥ 51

రాజతీ వా తామ్రమయీ విత్తశాఠ్యం న కారయేత్ ।
ఉపచారైః షోడశభిః పూజయేత్సుసమాహితః ॥ 52

రామనామాంకితం హేమపత్రం తత్పురతోఽర్చయేత్ ।
కథాం శ్రుత్వా చ విధివద్దేవదేవం క్షమాపయేత్ ॥ 53

సాపరాధం చ శరణం త్వద్భక్తినిరతం హి మామ్ ।
దీననాథ కృపాసింధో త్రాహి సంసారసాగరాత్ ॥ 54

రాత్రౌ జాగరణం కృత్వా గీతవాద్యైశ్చ మంగలైః ।
తతః ప్రభాతసమయే స్నాత్వా హోమం సమారభేత్ ॥ 55

దశాంసేనైవ హోమః స్యాత్తద్దశాంశేన తర్పణమ్ ।
గవ్యేన పయసా కార్యం రామమంత్రేణ యత్నతః ॥ 56

తస్యాపి చ దశాంశేన కుర్యాద్ బ్రాహ్మణభోజనమ్ ।
ఆచార్యాయ సవత్సాం గాం సాలంకారాం సవాససామ్ ॥ 57

భక్త్యాఽర్పయేత్సుసువర్ణాం వ్రతసంపూర్ణహేతవే ।
అన్యానపి ద్విజాంస్తోష్య రాజ్యం లక్ష్మీం సమాప్నుయాత్ ॥ 58

పుత్రార్థీ లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।
నానాదానాని తీర్థాని ప్రదక్షిణతపాంసి చ ॥ 59

తాని సర్వాణి లక్షాంశసమాన్యస్య భవంతి చ ।
నిష్కామో వా సకామో వా యః కుర్యాద్భక్తిసంయుతః ॥ 60

జపముకన్న నూరింతలు శ్రీరామ నామ లేఖనమున పుణ్యము గలదు. ప్రతి లక్షకును వేర్వేరుగా ఉద్యాపన చేయవలె. సంగ్రహముగా ఉద్యాపన విధానమెట్టిదనిన...

తొలిరోజున ఉపవాసముచేసి, ఆరాత్రి 108 లేదా1008 రామలింగాత్మకమును గాని రామతో భద్రమునుగాని మంటపమధ్యమున రచియించి, ధాన్యరాశిమీద కలశస్థాపన చేయవలయును. దానిముందర దివ్యవస్త్రాది అలంకృతమగు రాగిపాత్రమున సీతా, లక్ష్మణ సంయుక్తమును మంగళమగు శ్రీరామప్రతిమను ఉంచవలయును. ఆ ప్రతిమయొక్క- ప్రమాణము మినపగింజంత మొదలు పలమాత్ర సువర్ణమువరకు ఉండవచ్చును. వెండితో నైనను, రాగితో నైనను చేయింపవచ్చును. అయిన పిసినారితనము కూడదు. ఇట్టి కలశ ప్రతిమాదులను షోడశోపచారములచే అర్పింపవలయును. ఆ కలశమునకు ముందర శ్రీరామ నామాంకితమగు సువర్ణపత్రమును ఉంచి పూజింపవలయును. విధిప్రకారముగా కథను విని దేవదేవుని క్షమింపుమని ప్రార్థింపవలయును. (54 వ శ్లోకము ప్రార్థన) అంత ఆ రాత్రి మంగళ గీతవాద్యములతో జాగరణచేసి, ప్రొద్దున స్నానముచేసి, నిత్యకర్మానంతరము హోమమును ఆరంభించి, ఆవుపాలతో రామమంత్రముచే 1000 స్వాహాకారములు హోమముచేసి, వేయిమంది బ్రాహ్మణులకు భోజనమును, లేదా చివరకు 100 మందికైనను సమారాధన చేయునది. వ్రత సమాప్తికై ఆచార్యునికి చక్కగా అలంకరించి, దూడ కలిగిన గోవును దానమియ్యవలెను. ఇతర విప్రులను సంతోషపరచి, రాజ్యమును, సంపదను. సంపాదింపదగును.

సంతానమును కోరువారు సంతానమును, ధనము కోరువారు ధనమును పొందుదురు. వివిధ దానములు, తీర్థసేవనలు, తపములు, ప్రదక్షిణాదులును ఈవ్రతముయొక్క లక్షాంశలో నొకపాలు కాజాలదు.

తస్య సర్వేఽపి లక్షాంశసమాన్యస్య భవన్తి చ ।
లిఖిత్వా పుస్తకం వాపి వరం రామాయణస్య చ ॥ 61

ఏవముద్యాపనం కార్యం శ్లోకసంఖ్యాదశాంశతః ।
పూర్వవద్ధవనం కార్యం తద్దశాంశాచ్చ తర్పణమ్ ॥ 62

తస్యాపి చ దశాంశేన కుర్యాత్ బ్రాహ్మణభోజనమ్ ।
పూర్వశ్లోకేన వాఽన్యేన హవనాది ప్రకీర్తితమ్ ॥ 63

అథవా గ్రంథశ్లోకానాం దశాంశైర్హవనం స్మృతమ్ ।
అథవాఽగ్రే వక్ష్యమాణరీత్యా వై శకునస్య చ ॥ 64

శ్లోకం నిష్కాస్య వై గ్రంథాదాచరేద్ధవనాదికమ్ ।
అథవా రామగాయత్ర్యా రామమంత్రైస్తు వాఽఽచరేత్ ॥ 65

హేమపత్రే త్వేక ఏవ లేఖ్యః శ్లోకః శుభావహః ।
అర్చయిత్వా పూర్వవచ్చ హేమపాత్రే సవిస్తరమ్ ॥ 66

రామమూర్తేః పురః స్థాప్య సర్వం తద్గురవేఽర్పయేత్ ।
శ్రీరామకవితాం కృత్వా త్వేవముద్యాపనం నరైః ॥ 67

అవశ్యమేవ కర్తవ్యం కవితాఫలమీప్సుభిః ।
దేవాలయగజాన్నానాం వృక్షాణాం వాపికూపయోః ॥ 68

సర్వాపణానాం పణ్యానాం చిహ్నార్థం యోషితాం నృణామ్ ।
కావ్యానాం చ కవీనాం చ పశ్వాదీనాం చ సర్వశః ॥ 69

రాజప్రాసాదవాస్తూనాం నామకర్మ విశిష్యతే ।
వినా కర్ణోపదేశేన స్థావరాణాం విధానకమ్ ॥ 70

కృత్వా నామకర్మణశ్చ కార్యముద్యాపనం తతః ।
లక్షపుష్పైః పూజనాది యద్యచ్ఛ్రీరాఘవస్య చ ॥ 71

సంతోషార్థం కృతం తస్య కార్యముద్యాపనం వరమ్ ।
ఏవం రాజన్ మయా సర్వం తవాగ్రే వినివేదితమ్ ॥ 72

ఈ రామాయణ పుస్తకమునైనను లిఖించినవాడు సమస్త కామములను ఇహ పరములలో అందగలడు. ఇట్లు ఉద్యాపనమును ఆచరింపవలెను.

వెనుక జెప్పినట్లు రామాయణ శ్లోకసంఖ్యలో పదింటనొకపాలుగానైనను, గ్రంథసంఖ్యనుబట్టి తద్దశాంశమైనను, రామాయణ శకునమువేసి ప్రాప్తగ్రంథశ్లోక సంఖ్యాకముగనైనను, రామ గాయత్రితోనైనను, రామమంత్రములతోనైనను హోమముచేయునది. దాని దశాంశము తర్పణమును, తర్పణదశాంశము బ్రాహ్మణభోజనమునైనను చేయవలెను. బంగారు పత్రముమీద మాత్రము ఒక శ్లోకమును వ్రాసి శ్రీరామసన్నిధిలో ఉంచవచ్చును. దానిని పూజించి సర్వమును గురువునకు అర్పించునది. ఆయా ఫలాపేక్షగల నరులు శ్రీరామునిమీద కవిత్వము చేసియును ఈ యుద్యాపనమును చేయవలయు. దేవాలయములకు, గజ అశ్వములకు, వృక్షాదులకు, బావులు, చెరువులకు, అంగళ్లకు, వీధులకు, పురుషులకును, కవులయొక్క కావ్యములకు, పశు పక్ష్యాదులకు, రాజభవనములకు, ఇండ్లకు, కట్టడములకును కర్ణోపదేశము లేక చేయబడును. అప్పుడుకూడ తత్కర్మానంతరము ఉద్యాపన చేయనగును. శ్రీరాముని సంతోషముకొరకు లక్షపుష్పార్చన పూజను ఆచరించినను దాని సాఫల్యమునకై ఉద్యాపన చేయవలె.

**రామనామప్రభావేణ స్వీయం రాజ్యం లభిష్యసి ।**
**శ్రీరామదాస ఉవాచ**
**యుధిష్ఠిరస్తు తచ్ఛ్రుత్వా కరిష్యతి యథావిధి ॥ 73**

**మాసత్రయేణ తస్యైవ రాజ్యప్రాప్తిర్భవిష్యతి ।**
**అంతే చ పరమం స్థానం గమిష్యతి మనోబలాత్ ॥ 74**

**ఏవం కథా భవిష్యా చ తవాగ్రే వినివేదితా ।**
**రామనామమహిమానమిమం నరః శృణోతి యః ॥ 75**

**పరమభక్తిసమేతః పుత్రపౌత్రజవత్సుఖమ్ ।**
**భువి భుక్త్వా ప్రాప్నుయాత్పరమం మోక్షపదం తు సః ॥ 76**

**నిత్యం వ్యాఖ్యా శ్రీరామాగ్రే కర్తవ్యా త్వతిభక్తితః ।**
**ఆనందరామచరితస్యాథవాఽన్యస్య విస్తరాత్ ॥ 77**

**సర్గస్య వాఽర్ధసర్గస్య పాదసర్గస్య వా తథా ।**
**నవశ్లోకమితా వాపి శ్లోకమాత్రస్య వా తథా ॥ 78**

శ్లోకార్ధం శ్లోకపాదంవాఽఽనందరామాయణస్థితమ్ ।
యే పఠంతి నరా నిత్యం తే నరా ముక్తిభాగినః ॥ 79

యేఽశ్వత్థమూలే మునివృక్షమూలే
తథా తులస్యాశ్చ సమీపదేశే ।
పుణ్యస్థలే భాస్కరభూసురాగ్రే
శ్రీరామచంద్రస్య పురః సదైవ ॥ 80

తథా సభాయాం ద్విజవృందమధ్యే
నద్యాస్తటే వా రఘునాయకస్య ।
ఆనందరామాయణమాదరేణ
పఠంతి ధన్యా భువి మానవాస్తే ॥ 81

రామాయణం లిఖిత్వా తు దాతవ్యం భూసురాయ హి ।
సమగ్రం వా కాండమేకం సర్గో వాఽతిసుపుణ్యదః ॥ 82

సర్గస్త్వేకః ప్రత్యహం హి లిఖిత్వా భూసురాయ హి ।
సంపూజ్య దేయశ్చానందరామాయణసముద్భవః ॥ 83

అశక్తేన నవ శ్లోకాః సదా దేయా విలేఖ్య చ ।
ప్రీత్యర్థం రామచంద్రస్య విప్రేభ్యః పరిపూజ్య వై ॥ 84

నిత్యదానమేతదేవ కర్తవ్యం సర్వదా నరైః ।
నిత్యం సువర్ణముద్రాయా దానేన యత్ఫలం స్మృతమ్ ॥ 85

ధర్మరాజా! రామనామ జప ఉద్యాపన విషయమును నీకు చెప్పితిని. శ్రీరామనామ ప్రభావముచే రాజ్యమునందగలవు. అని శ్రీకృష్ణుడు అనుగ్రహించును. అట్లే ధర్మరాజు విని యథావిధిగా నీ శ్రీరామ నామవ్రతమును ఆచరించి మూడు నెలలలోగా రాజ్యమును పొంది మనోబలమువలన అంత్యమున పరమపదమునందును".

విష్ణుదాసా! నీకిట్లు భవిష్యత్కథావృత్తాంతమును చెప్పితిని. ఏమానవుడు పరమభక్తితో యీకథను వినునో, వాడు పుత్రపౌత్రాదికమగు సమస్తసుఖములను ఈలోకమున అనుభవించి పరమగతినందును. అనందరామచరితమునకుగాని మరియేరామకథా గ్రంథమునకు గాని మిక్కిలి భక్తితో నిత్యము

శ్రీరామసన్నిధానమున అర్థవిచారము చేయతగినది. ఒక సర్గగాని, అర్ధ సర్గగాని, 9 శ్లోకములకు గాని, చివరకొక శ్లోకమునకైనను, శ్లోకార్ధమున కైనను, శ్లోకపాదమునకైనను ఆనందరామాయణము నందు; ఏమానవులు అశ్వత్థ (రావిచెట్టు) మూలమందైనను, అతసీవృక్ష సమీపమునను, తులసీసమీపమునను, పుణ్యస్థలమునను, సన్యాసి, బ్రాహ్మణ సన్నిధానమునను, నదీతీరమునను, బ్రాహ్మణ సభయందును, నిరంతరము శ్రీరామసన్నిధానమునందు ఆనందరామాయణమును పఠించుచుందురో వారు ఈ భూమిపై ధన్యులైయుందురు.

రామాయణమును వ్రాసి, సమగ్రముగా గాని, కాండను గాని, చివరకు సర్గను గాని బ్రాహ్మణునికి దానము చేసిన అది మిగుల పుణ్యప్రదము. శక్తిలేనివాడు ఆనందరామచరితమును నిత్యమొక సర్గవ్రాసి, శ్రీరాముని అర్చించి యిచ్చుటమంచిది. అంతకూ శక్తిలేనివాడు ప్రతిరోజూ 9 శ్లోకములనైనా వ్రాసి యిచ్చి బ్రాహ్మణులను సత్కరింపవలయును ఇది శ్రీరామస్వామికి ప్రీతికరము. సువర్ణముతో శ్రీరామ ముద్రికను చేయించి, నిత్యము దానము చేసినట్లు....

**తత్ఫల ప్రత్యహం సర్గదానేన లభ్యతే నరైః ।**
**నానేన సదృశం దానం రాఘవస్యాతితోషదమ్ ॥ 86**

**తస్యాదవశ్యమేవైతద్దానం కార్యం నిరంతరమ్ ।**
**శ్రీరామచంద్రతుష్ట్యర్థం నవపూగఫలైస్తథా ॥ 87**

**నాగవల్లీనవదలైస్తాంబూలః సోపచారకః ।**
**పృథక్ నవభూసురేభ్యో దేయో నిత్యం సదక్షిణః ॥ 88**

**అశక్తైనైక ఏవాపి దేయస్తాంబూల ఉత్తమః ।**
**న తాంబూల సమం దానం కించిదస్తి జగత్త్రయే ॥ 89**

**తాంబూలః శుద్ధిదః ప్రోక్తస్తాంబూలో మంగళప్రదః ।**
**తాంబూలః శ్రీకరో జ్ఞేయస్తాంబూలో రాఘవప్రియః ॥ 90**

**తస్మాత్ప్రయత్నతస్త్వయా దేయాస్తాంబూల ఉత్తమః ।**
**సదా రామం పూజయేచ్చ సదారామం విచింతయేత్ ॥ 91**

**శ్రీరామస్మరణం నిత్యం కార్యం భక్త్యా ముహుర్ముహుః ।**
**యస్య వాణ్యాం రామనామ హస్తౌ పూజనతత్పరౌ ॥ 92**

శ్రీరామచరితాన్యేవ శ్రోతుకామా చ యచ్ఛ్రుతిః ।
రామతీర్థాని రామేశాన్ రామక్షేత్రాణి యాని చ ॥ **93**

యదంఘ్రి గంతుకామౌ తు రామపూజోత్సవాన్ వరాన్ ।
సంద్రష్టుకామౌయన్నేత్రౌ స ధన్యః పురుషః స్మృతః ॥ **94**

రామ రామేతి రామేతి యే వదంతి జనా భువి ।
మహాపాతకనస్త్రేత్ర ముక్తిం యాంతి న సంశయః ॥ **95**

రామచంద్రేతి మంత్రోఽస్తి వాగస్తి వశవర్తినీ ।
తథాపి నిరయే ఘోరే పతంతీత్యద్భుతం మహత్ ॥ **96**

శ్రీరామనామామృతమంత్రబీజ
సంజీవనీ చేన్మనసి ప్రవిష్ట ।
హాలాహలం వా ప్రళయానలం వా
మృత్యోర్ముఖం వా విశతాం కుతో భీః ॥ **97**

ఆసనే చ తథా నిద్రాకాలే భోజనకర్మణి ।
క్రీడనే గమనే నిత్యం రామమేవ విచింతయేత్ ॥ **98**

ఒక సర్గ రామకథను దానము చేయుటచే సత్ఫలమబ్బును. ఈ దానమునకు సాటియైన దానముండదు. కావున తప్పక ఈ దానము చేయవలసినది. అప్పుడు ప్రతిరోజూ- 9 వక్కలు, 9 ఆకులు గల, షోడశోపచార సదక్షిణాక తాంబూలములను 9 మంది విప్రులకియ్యవలయును, అశక్తుడు ఒక్క తాంబూలమునైనను దానమిచ్చుట శ్రేయస్కరము.

తాంబూల దానమునకు సాటివచ్చునది మరియొకటి లేదు. తాంబూలము శుద్ధిప్రదము, మంగళ ప్రదము, సంపత్కరము, శ్రీరామప్రియము, కావున సర్వప్రయత్నముతోను తాంబూల దానము చేయవలయును.

సంతతము రాముని పూజించి, నిరంతరము రాముని ధ్యానించి, మాటమాటకు రాముని స్మరించుచుండవలయును. ఎవనికి- ముఖమున రామనామము, చేతులచే శ్రీరామార్చనము, కర్ణంబులచే శ్రీరామ కథాశ్రవణము, కాళ్లచే శ్రీరామ తీర్థయాత్ర, నయనములచే శ్రీరామోత్సవ దర్శనమును గల్గియుండునో ఆపురుషుడే కృతకృత్యుడు.

**'రామ'** యని మూడుసార్లు పలికినవారు పాపాత్ములైనను ముక్తినందుదురు. ఆహా! జనులు శ్రీరామచంద్రయను మంత్రము తమ స్వాధీనమైయున్నను ఘోరనరక పాత్రులగుచున్నారనుట ఆశ్చర్యముగా ఉన్నది. శ్రీరామనామామృత మంత్రబీజమను సంజీవని మనసున ప్రవేశించి యుండువారు కాలకూటమును, ప్రళయాగ్నిని, మృత్యుముఖమును ప్రవేశించుచుండినను భయములేదు. కూర్చున్నపుడు, నిద్రాకాలమున, క్రీడించునప్పుడు, సంచారమున, భుజించునపుడు, సంతతము శ్రీరామునినే చింతింపవలయును.

**శ్రవణీయః కీర్తనీయశ్చింతనీయః సదా నరైః ।**
**గేయశ్చ రామో హ్యుపదేశ్యో రామ ఏవావనీతలే ॥ 99**

**స్వర్గే సురాణామమృతం యథాఽస్తి పరమం శుభమ్ ।**
**రామనామామృతం భూమ్యాం క్షయం నాప్నోతి వై కదా ॥ 100**

**గోపీచందనలిప్తాంగో రామచంద్రాంకితో నరః ।**
**రామనామోచ్చారకశ్చ తులసీకాష్ఠమాలికః ॥ 101**

**శంఖచక్రగదాపద్మధారకో రామమానసః ।**
**యస్త్వత్ర స నరో ధన్యో నేతరశ్చ కదాచన ॥ 102**

**స ఏవ పురుషోఽగ్రయో రామరామ సదావదేత్ ।**
**స ఏవ పురుషో నింద్యస్త్వత్ర రామం స్మరేన్న యః ॥ 103**

**యే నరాః శివసద్భక్తిం కృత్వా నిందంతి రాఘవమ్ ।**
**పూర్వవచ్చ ఖరాస్తేఽపి నరా జ్ఞేయాఽవనీతలే ॥ 104**

**రామ ఏవ హరో జ్ఞేయః శివ ఏవ రఘూత్తమః ।**
**ఉభయోర్నాంతరం జ్ఞేయం భేదదృగ్ నారకీ నరః ॥ 105**

**రామశంకరయోరత్ర భిన్నత్వం యేన మానితమ్ ।**
**అజాగళస్తనవచ్చ తస్య జన్మ వృథా గతమ్ ॥ 106**

**శంభోశ్చ హృదయం రామో రామస్య హృదయం శివః ।**
**నైవాంతరం కల్పనీయం కుతర్కైర్వివిధైర్నరైః ॥ 107**

**రామేతి ద్వ్యక్షరం నామ యే వదంతి త్వహర్నిశమ్ ।**
**న కస్యాపి భయం తేషాం జీవన్ముక్తాశ్చ తే నరాః ॥ 108**

**రామముద్రాంకితం దృష్ట్వా నరం యే యమకింకరాః ।**
**పలాయన్తే దశ దిశః సింహ దృష్ట్వా గజా యథా ॥ 109**

**లలాటే పృష్ఠదేశే చ కుక్ష్యోర్ద్వే జఠరే తథా ।**
**హృదయే భుజయోర్ద్వే హి మస్తకే త్వితి వై నవ ॥ 110**

**రామముద్రా ధారణీయా గోపీచందన చిహ్నితా ।**
**రామముద్రా మహాశ్రేష్ఠా సర్వదోషనికృంతనీ ॥ 111**

**సదా దేహే నరైర్ధార్యా గోపీచందనచిహ్నితా ।**
**రామముద్రాఽస్తి యద్దేహే తం పాపం స్పృశతే న హి ॥ 112**

నరులు 'రామ' అను మంత్రమును వినుట, చదువుట, ధ్యానించుట, ఇతరులకు ఉపదేశించుటయే ముఖ్యము, స్వర్గమున దేవతలకెట్లు అమృతము మంగళప్రదమో అట్లే భూమిపై శ్రీరామ నామామృతము ఎప్పటికిని అక్షయమైనది. ఏ నరుడు గోపీచందనముతో ఊర్ధ్వపుండ్రమును ధరించి, రామముద్రాలంకృతుడై– శంఖ, చక్ర, గదా, పద్మ– చిహ్నములను ధరించి, తులసీమాలికచే రామనామ స్మరణ జేయుచుండునో అతడే కృతకృత్యుడు, ఇతరుడు కాడు. అట్టివాడే శ్లాఘ్యుడు. రామస్మరణ లేనివాడే నింద్యుడు, ఎవరు వీరశైవభక్తితో మదించి రాముని నిందించెదరో వారే గాడిదలుగా ఎంచబడుదురు. రాముడే విష్ణువు, రాముడే శివుడు. హరిహరులకెప్పటికీని భేదములేదు. భేదభావనగల నరుడు నరకమును పొందును. వాని జన్మము అజాగళస్తనము (మేక మెడక్రింద వ్రేలాడు రొమ్ములు)వలే వ్యర్థము. రామతత్వమే శివుడు, శివతత్త్వమే రాముడు. కుయుక్తులచే ఇరువురికిని వ్యత్యాసమును కల్పింపరాదు. **'రామ'** అను రెండక్షరముల మంత్రమును ఎవరు నిరంతరము జపించెదరో వారు నిర్భయులై జీవన్ముక్తులగుదురు.

రామముద్రాంకితుని జూచినచో; యమదూతలు సింహమును చూచిన గజములవలే పరుగెత్తెదరు. ముఖమున, వీపున, ఇరుప్రక్కల, కడుపున, హృదయమున, రెండు భుజములమీద శిరస్సున రామముద్రలు 9గానుండును. గోపీచందనముచే శ్రీరామముద్రికలను ధరింపవలె, ఈ 'రామ' ముద్ర దోషనాశకము, మిక్కిలి శ్రేష్ఠము. ఈ రామముద్ర యేదేహమందు ఉండునో ఆ దేహమునకు పాపమంటదు.

స్తుతిః సదైవ రామస్య స్తోత్రైః కార్యా త్వహర్నిశమ్ ।
ప్రాచీనైశ్చ నవీనైశ్చ స్వబుద్ధ్యా రచితైరపి ॥ 113

స వాగ్విసర్గో జనతాఽఘవిప్లవో
యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి ।
నామాన్యనంతస్య యశోఽంకితాని
యచ్ఛృణ్వంతి గాయంతి గృణంతి సాధవః ॥ 114

కవిత్వమత్యశుద్ధం చ రామనామాంకితం చ యత్ ।
తత్జ్ఞేయమతిశుద్ధం చ శ్రవణాత్పాతకాపహమ్ ॥ 115

యస్మిన్ రామస్య కృష్ణస్య చరిత్రాణి మహాంతి చ ।
కవిత్వే తత్పుణ్యతమం సదా గేయం మహత్తమైః ॥ 116

శృణు శిష్య తవాగ్రేఽన్యద్గుహ్యం కించిద్ బ్రవీమ్యహమ్ ।
కవితావిషయం యచ్చ సర్వసందేహనాశకమ్ ॥ 117

అశ్వత్థామా బలిర్వ్యాసో హనూమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥ 118

ఏవం యద్వచనం శిష్య ప్రోచ్యతే సర్వదా బుధైః ।
తదగ్రే సర్వదా సత్యం జ్ఞేయం కలియుగేఽపి చ ॥ 119

యేషు మంత్రబలం భూమ్యాం వర్తతేఽత్ర నరేషు హి ।
అశ్వత్థామాంశభూతాస్తే జ్ఞేయాశ్చ పురుషా బుధైః ॥ 120

న్యాయోపార్జితద్రవ్యేణ రాజ్యం కుర్వంతి ధర్మతః ।
బల్యంశభూతాస్తే జ్ఞేయా మానవా జగతీతలే ॥ 121

రామస్తుతిం కవిత్వే యే చరిత్రం వర్ణయంతి చ ।
వ్యాసాంశభూతాస్తే జ్ఞేయా మానవా జగతీతలే ॥ 122

యే యే వీరాస్త్వత్ర భూమ్యాం వాయుపుత్రాంశరూపిణః ।
తే తే జ్ఞేయా నరాస్తస్య చిరజీవిత్వసూచకాః ॥ 123

**యే యే శాంతాం రామభక్తాః సంత్యత్ర మానవా భువి ।**
**విభీషణాంశభూతాస్తే జ్ఞేయాశ్చ సకలైర్జనైః ॥ 124**

**యే ధైర్యవంతో యోద్ధారః సంత్యత్ర మానవా భువి ।**
**కృపాచార్యాంశభూతాస్తే జ్ఞేయాః సర్వే బుధైః సదా ॥ 125**

**యే వీరాః క్రోధసంయుక్తాస్తేఽత్ర సర్వేఽవనీతలే ।**
**జామదగ్న్యంశభూతాశ్చ సదా జ్ఞేయా నరోత్తమైః ॥ 126**

**చిరంజీవీతి వ్యాసః కః కథం జ్ఞేయో జనైర్భువి ।**
**తస్య స్వరూపం వక్ష్యామి సావధానమనాః శృణు ॥ 127**

మునుపటివో, తాను కల్పించినవో, ఎట్టిస్తోత్రములనైనా నిరంతరము పఠించి, రామస్తుతిని చేయవలయును. అబద్ధ శ్లోకములు గలదైనను ఎవనికృతియందు శ్రీరామ నామములను సత్పురుషులు వినుచు, పాడుచు, గ్రహించుచుందురో ఆ కృతికర్తయే లోక పాపపరిహారకుడు. అతడే వాగ్విభూతి గలవాడు. కవిత్వవిషయక రహస్య విషయమును కొంచెము చెప్పెదను వినుము.

విష్ణుదాసా! అశ్వత్థామ, బలి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు, కృపుడు, పరశురాముడు అను 7 మంది చిరంజీవులై ఉందురు." అను ఈ వచనమును పండితులు పలికెదరు. ఇది ఈ కలి యుగమున సత్యమని నీవెరుగుము.

మానవులలో; మంత్రబలముగలవారు అశ్వత్థామ అంశ సంభూతులనియును, ధర్మపరిపాలకులగు ప్రభువులు బలిఅంశ సంభూతులనియును, కవిత్వమున శ్రీరామ కథాభివర్ణనము చేయువారు వ్యాస అంశ సంభూతులని, వీరులగువారు వాయుపుత్ర అంశ సంభూతులనియు, రామనామ భక్తులై శాంతులగువారు విభీషణ అంశ సంభూతులనియు, ధైర్యవంతులగు యుద్ధవీరులు కృపాంశ సంభూతులనియు, క్రోధయుక్తులై వీరులగువారు పరశురామాంశ సంభూతులనియు తెలియవలెను. వ్యాసులవారు చిరంజీవులని యెట్లు గుర్తించవలయునో ఆ స్వరూపమును చెప్పెదను వినుము.

**యే గీర్వాణ్యా కవిత్వాని కరిష్యత్యవనీతలే ।**
**వ్యాసాంశభూతాస్తే జ్ఞేయాః పండితా మానవాస్త్విహ ॥ 128**

**యే రామచంద్రం కృష్ణం చ శివః స్తుత్యా స్తువంతి హి ।**
**వర్ణయంతి చరిత్రాణి తే జ్ఞేయా వ్యాసమూర్తయః ॥ 129**

**యే రాజానం చ గణికాం నారీం రాజ్ఞః సభాం తథా ।**
**నరం స్తువంతి స్తుత్యా తే న జ్ఞేయాఽ వ్యాసమూర్తయః ॥ 130**

**యావద్భూమ్యాం తు రామస్య చరిత్రాణి స్తువీత హి ।**
**తావదత్ర స్మృతో వ్యాసస్తతో ముక్తిం గమిష్యతి ॥ 131**

**కిం ఫలం కస్య పాఠాచ్చ తద్బ్రవీమి తవాధునా ।**
**శృణు స్వస్థమనాః శిష్య విస్తరేణోచ్యతే చ యత్ ॥ 132**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, రామనామలక్షోద్యాపనం నామ, సప్తమః సర్గః ॥**

ఎవరు సంస్కృతమున కవిత్వమును వ్రాయుచుందురో, పండితులగు ఆ మానవులు వ్యాసాంశ స్వరూపులు. ఎవరు శ్రీరామమూర్తిని, శ్రీకృష్ణమూర్తిని, శ్రీశంభుమూర్తిని స్తుతులచే స్తోత్రము చేయుదురో వారందరును శ్రీవ్యాసమూర్తులనబడుదురు. రాజులను, వారాంగనలను, విలాసినులను, వీరసభలను వర్ణించువారలు వ్యాసమూర్తులు కారు.

మానవులు ఈ భూమిపై ఎప్పటివరకు శ్రీరామకథలను స్తుతించుచుందురో అంతవరకు ఇచ్చట వ్యాసులవారు స్మరింపబడుచుండి యంతట ముక్తినందుదురు. దేనిని పఠించినను ఏమిఫలమో ఆసంగతిని విస్తరించి చెప్పెదను వినుము అని విష్ణుదాసుకు శ్రీరామదాసముని చెప్పుచున్నాడు. (7)

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో శ్రీరామలక్షఉద్యాపనను వివరించు 7వ సర్గ ముగిసినది.**

# అష్టమః సర్గః-8వ సర్గ

వేదముల ఫలశ్రుతి

శ్రీరామదాస ఉవాచ

శిరోవ్యాహృతిసంయుక్తా గాయత్రీ పరికీర్తితా ।
వేదాక్షరాణాం తుల్యా సా శతేన మునిభిః స్మృతా ॥ 1

చతుః శతేన గాయత్ర్యాః సంమితం పరికీర్తితమ్ ।
పావమానం మహాసూక్తం షట్ శతం చ సుపుణ్యదమ్ ॥ 2

తథోపనిషదః పుణ్యా గాయత్ర్యక్షరసంఖ్యయా ।
ప్రోచ్యతే పుణ్యదా లోకే పుణ్యసూక్తాని యాన్యపి ॥ 3

సంహితాపాఠతః ప్రోక్తం ద్విగుణం పదపాఠతః ।
త్రిగుణం క్రమపాఠే స్యాజ్జటాపాఠే తు షడ్గుణమ్ ॥ 4

మహాభారతపాఠస్తు వేదతుల్యః ప్రకీర్తితః ।
పురాణానాం తదర్ధేన స్మృతీనాం చ తథోచ్యతే ॥ 5

భారతే భగవద్గీతా తథా నామసహస్రకమ్ ।
గాయత్ర్యాశ్చ సమం ప్రోక్తం పుణ్యే పాపక్షయేఽపి చ ॥ 6

పాఠేన యత్ఫలం ప్రోక్తమర్థజ్ఞానాచ్చతుర్గుణమ్ ।
సద్భక్తేభ్యః శ్రవణాచ్చ పుణ్యం దశగుణం స్మృతమ్ ॥ 7

భూమిదానం యథా లోకే మహాదానమితీరితమ్ ।
విద్యాదానం దశగుణం తతోఽపి స్యాత్ఫలప్రదమ్ ॥ 8

## వేదశాస్త్రాది గ్రంథపఠనఫలము.

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "బ్రహ్మశిరోవ్యాహృతులతో కూడిన శతగాయత్రీజపము వేదాంకురములతో సమానమని మునులు చెప్పుదురు. చతుశ్శతగాయత్రి 104 ఋక్కులు గల పావమాన మహాసూక్తమునకు సమము. ఇక ఉపనిషత్తులును, పుణ్యసూక్తములెన్ని గలవో అన్నియును

గాయత్రీ అక్షరసంఖ్యచే లోకమున పుణ్యప్రదములు. వేద సంహితకన్నను పదపాఠము రెండింతల ఫలితమునిచ్చును. క్రమపాఠము మూడింతల ఫలితమునిచ్చును. జటాపాఠము ఆరింతల ఫలితమును ఇచ్చును.

మహాభారత పారాయణము వేదతుల్యము. పురాణములు, స్మృతులును తదర్ధము. భారతమున భగవద్గీత, సహస్రనామమును పుణ్యకరము, దురితనివారకము, గాయత్రీసదృశము. పారాయణము కన్నను అర్ధజ్ఞానము కలుగుటలో పదింతలు ఫలము. భూమిదానము గొప్పదానమనిగదా పెద్దల అభిప్రాయము? విద్యాదానము దానికన్నను పదింతలు ఫలమునిచ్చును.

**విష్ణుదాస ఉవాచ**

**కస్మై దానం ప్రకర్తవ్యం సువర్ణస్యేతరస్య వా ।**
**కథం వా పాత్రతామేతి బ్రాహ్మణశ్చేతరోఽథవా ॥ 9**

**శ్రీరామదాస ఉవాచ**

**వసేన్ గురుకులేయస్తు భిక్షాన్నాశీ శ్రుతిం పఠన్ ।**
**అధీత్య శాఖాం పూర్ణం స యథోక్తం లభతే ఫలమ్ ॥ 10**

**శిష్యస్యాధ్యాపకస్యాపి సంహితాం పఠతః ఫలమ్ ।**
**ప్రత్యక్షరం తు గాయత్రీసకృత్పాఠఫలం లభేత్ ॥ 11**

**పదపాఠే తదర్ధం స్యాత్తదర్ధం క్రమపాఠతః ।**
**సంహితాపాఠతో ద్విఘ్నం గాథాపాఠఫలం స్మృతమ్ ॥ 12**

**తతోఽప్యుపనిషత్పాఠైర్ద్విగుణం ఫలమీరితమ్ ।**
**పాఠే చ పాఠనే తుల్యం ఫలం వై గురుశిష్యయోః ॥ 13**

**అధీతాత్త్రిగుణం తు స్యాత్ఫలం వైకుంఠపాఠతః ।**
**తదర్ధం లేఖ్యపాఠత్తు ఫలముక్తం మనీషిభిః ॥ 14**

**అధీత్యాపి న యస్య స్యాత్కంఠపాఠసమం స్వతః ।**
**కృతే యత్నేఽపి దైవేన స లభేత్పాఠమాత్రజమ్ ॥ 15**

**ప్రజ్ఞాయామపి సత్యాం తు విస్మరేత్ పఠితాం శ్రుతిమ్ ।**
**అనాస్థయా ప్రమాదేన మృతో గర్ధభతాం వ్రజేత్ ॥ 16**

**యావద్వేదోత్థవర్ణానాం పఠితానాం చ విస్మృతిః ।**
**తావద్వర్షాణి భుక్త్వా సా ఖరయోనిం తతః పరమ్ ॥ 17**

**పాఠపుణ్యార్జితం లోకం లభతే నాత్ర సంశయః ।**
**స్వశాఖాం ప్రథమం యస్తు పఠిత్వాఽన్యాం పఠేదపి ॥ 18**

**ప్రత్యక్షరం తు లభతే గాయత్ర్యా ద్విగుణం ఫలమ్ ।**
**పఠిత్వాపి స్వకాం శాఖాం రామోత్కర్షం న వేత్తి యః ॥ 19**

విష్ణుదాసుడు గురువుగారిని అడుగుచున్నాడు, "బంగారము గాని, ఇతరమును గాని ఎవనికి దానము చేయవలె? బ్రాహ్మణునిగాని, యితరునిగాని దానమునకు అర్హుడు అని గుర్తించుట ఎట్లు?" శ్రీరామదాస ముని చెప్పుచున్నాడు, "ఎవడు గురుకులమున వాసము చేయుచు, భిక్షాన్నమును భుజించి, స్వ వేద శాఖాధ్యయనమును చేయునో వాడు శాస్త్రోక్త ఫలమునందును. గురు-శిష్యు లిరువురికిని సంహితాధ్యయనమున ప్రత్యక్షరమును గాయత్రీపురశ్చరణ ఫలమునిచ్చును. పదపాఠమున దానిలో సగము, క్రమపాఠమున అందులో సగము. సంహితను అధ్యయనము చేయునప్పటికన్నను రెండింతలుగా అధ్యాపనమున గల్గును. ఉపనిషత్పఠనమున దానికన్నను రెండింతలు. అధ్యయనము చేయించుటలో గురు, శిష్యులకు సమానఫలము. నోటికి వచ్చి అధ్యయనము చేయుటలో మూడురెట్లు ఫలము కలుగును. పుస్తకముమీద పారాయణము అందులో సగము ఫలితమునిచ్చున. అధ్యయనము చేసియు తాను ఎంత ప్రయత్నించినను కంఠపాఠముగా రానివానికి అధ్యయన ఫలముమాత్రముగల్గును. బుద్ధి స్ఫూర్తి యుండియును చదివిన వేదమును మరచి ప్రామాదికమున మృతుడైనచో, వాడు గాడిదగా జన్మించి, ఎన్ని వేదాక్షరములను మరచియుండునో అన్నిసంవత్సరములు గాడిద జన్మలలో పడి చివరకు అధ్యయన ఫలమువలన పుణ్యలోకమునందును. మొదట స్వశాఖా అధ్యయనముచేసి పిదప అన్యశాఖాధ్యయనము చేసినవాడు ప్రతి అక్షరమునకును గాయత్రి ద్విగుణ ఫలమునందును. స్వవేదశాఖాధ్యయనము చేసినను శ్రీరామమహిమను ఎరుగని వాడు రామపూజకుడునైనను అర్ధఫలము నందును.

**రామపూజాయుతశ్చాపి సోఽర్ధం ఫలమవాప్నుయాత్ ।**
**వర్జితో రామభక్త్యా యః కేవల పాఠకో భవేత్ ॥ 20**

**లభేత్ఫలస్య తుర్యాంశం తద్ద్వేషాన్నిష్ఫలం భవేత్ ।**
**అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః ॥ 21**

పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతాశ్చతుర్దశ ।
ఆయుర్వేదో ధనుర్వేదో గాంధర్వం చాథశాస్త్రకమ్ ॥ 22

ఉపవిద్యాశ్చతస్రః స్యురేవమష్టాదశ స్మృతాః ।
శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమ్ ॥ 23

ఇత్యంగాని తు వేదస్య యోఽధీతే తత్ఫలం శృణు ।
సంహితా పాఠతోఽప్యర్థం లభతే పాఠతః ఫలమ్ ॥ 24

శిక్షా ఘ్రాణం తు వేదస్య కల్పః పాణీ ప్రకీర్తితౌ ।
ముఖం వ్యాకరణం ప్రోక్తం నిరుక్తం శ్రోత్రముచ్యతే ॥ 25

జ్యోతిషం నయనం ప్రాహుశ్ఛందః పాదావితి స్మృతౌ ।
శిక్షాకల్పనిరుక్తానాం ఛందసశ్చార్థవిత్తయే ॥ 26

సకృద్యోగం ప్రకుర్వంతి ఫల తేషాం చతుర్గుణమ్ ।
భవేత్పాఠాత్తతో జ్యోతి శాస్త్రార్థజ్ఞానతః ఫలమ్ ॥ 27

సంహితాపాఠజం పుణ్యం గణితజ్ఞో లభేత్ఫలమ్ ।
జ్యోతిషాం సంహితాజ్ఞానాదర్థం తు లభతేఫలమ్ ॥ 28

జాతకప్రశ్నయోగేన న కించిత్పుణ్యమీరితమ్ ।
వేదాధ్యయనహీనో యో జాతకప్రశ్నమాత్రవిత్ ॥ 29

న వేత్తి గణితం యస్తు జ్ఞేయో నక్షత్రసూచకః ।
దానం నార్హతి విప్రస్తు సర్వకర్మసు గర్హితః ॥ 30

స్వల్పామపి చ స్వాం శాఖాం యోఽనధీత్య ద్విజాధమః ।
అంగాదిష్వన్యశాస్త్రేషు సక్తః స తు విగర్హితః ॥ 31

కించిచ్ఛాఖామధీన్యాపి యశ్చోపనిషదః పఠేత్ ।
జ్ఞానాధిక్యాయ శాస్త్రాణాం వేదజ్ఞానార్థమేవ వా ॥ 32

అధీతే జ్ఞానపాత్ర స్యాత్పుణ్యాధిక్యేన యుజ్యతే ।
యతో విప్రేషు వృద్ధత్వం పూజ్యత్వం జ్ఞానతః స్మృతమ్ ॥ 33

శ్రీరామభక్తిలేని కేవలవేదపాఠకుడు ఫలమునందు నాలుగవ భాగమును నిష్ఫలమగును. ఆరు అంగములు, నాలుగువేదములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము, ఇవి 18 విద్యలనబడును. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థశాస్త్రము ఇవి 4 ను వాటికి చేరి 18 మహావిద్యలనబడును.

వేదపురుషునికి నాసిక(ముక్కు)వంటిదైన శిక్షాంగము, చేతులువంటిదైన కల్పసూత్రాంగము, ముఖమువంటి వ్యాకరణాంగము, కర్ణములవంటి నిరుక్తాంగము, నయనముల వంటి జ్యోతిషాంగము, పాదములవంటి ఛందశ్శాస్త్రాంగము చేరి, యివి 6ను వేదాంగములు. ఇవి సంహితాధ్యయనము నందలి అర్థఫలముగలవి.

ఛందస్సు, శిక్ష, కల్ప, నిరుక్తాదులు సకృద్యోగ ఫలమునందుదురు. వారికి జ్యోతిశ్శాస్త్రపరిజ్ఞానము నుండి, తత్పఠనమునుండి ఫలము నాల్గింతలగును. వేదసంహితాధ్యయనమువల్ల గలుగు పుణ్యమును గణితజ్ఞుడందును. జ్యోతిస్సంహితా జ్ఞానమువలన దానిలో అర్ధఫలము. జాతక ప్రశ్న జ్ఞానముచే పారత్రికఫలము సున్న. ఎవడు వేదాధ్యయనముచేయక జాతక ప్రశ్న శాస్త్రముమాత్రము నెరుంగునో, ఎవడు గణితమును కూడ నెరుంగడో వాడు నక్షత్రసూచకుడు అనబడును. అట్టివిప్రుడు సకల కర్మలయందు నిందితుడై దానయోగ్యుడుకాడు.

అధ్యయనజ్ఞాన సంపన్నమగు దానపాత్రమే పుణ్యాధిక్యముచేత యోగ్యమనబడును. ఎందువల్ల అనిన, బ్రాహ్మణులలో వృద్ధత్వము, పూజ్యత్వము జ్ఞానమునలన కలుగును.

**జ్ఞానాధిక్యేషు తేషు స్యాత్పాత్రాపాత్రవిచారణా ।**
**పుణ్యాధిక్యేన వాజ్ఞేయా పాఠకానాం పవిత్రతా ॥ 34**

**జ్ఞానిపాఠకయోర్మధ్యే జ్ఞానీ పుణ్యాధికో యతః ।**
**తతః పూజ్యత్వమస్య స్యాత్ జ్ఞానినస్త్వితి మ మతమ్ ॥ 35**

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం రామః సోపి చ తత్ప్రియః ॥ 36**

**పరం వాదిజయే శక్తిర్ యస్య స్యాత్తద్గతిం పునః ।**
**స ఏవ శ్రేష్ఠతాం యాతి పాఠకానాం శతాదపి ॥ 37**

**వేదాదిసర్వవిద్యానామర్థజ్ఞానాయ యః పఠేత్ ।**
**శాస్త్ర వ్యాకరణ నామ లభేద్వేదసమం ఫలమ్ ॥ 38**

జ్ఞానాధిక్యేన లభతే వేదార్థజ్ఞానజం ఫలమ్ ।
మీమాంసా ద్వివిధా ప్రోక్తా కర్మణో బ్రహ్మణస్తథా ॥ 39

వేదార్థజ్ఞానతుల్యాయా ద్వితీయాయాః ఫలం శృణు ।
ప్రత్యక్షరం తు లభతే గాయత్రీశతజం ఫలమ్ ॥ 40

యే తూపయోగినః సాక్షాద్ గ్రంథాస్తేభ్యో భవంతి హి ।
తేऽప్యర్థఫలదా జ్ఞేయా వ్యవధానాత్త పాదశః ॥ 41

వేదోపనిషదామర్థే జ్ఞానాధిక్యాయ చేత్పఠేత్ ।
ప్రదీపం సర్వవిద్యానాం యో విద్యాన్న్యాయవిస్తరాన్ ॥ 42

వేదార్థజ్ఞానతుల్యం తు ఫలం తస్య ప్రకీర్తితమ్ ।
కేవలం జీవికార్థం తు యః పఠేన్న్యాయవిస్తరాత్ ॥ 43

హేతువాదరతో బ్రహ్మజిజ్ఞాసాం నైవ యః పఠేత్ ।
స సృగాలో భవేదేవ పఠితాక్షరసంఖ్యయా ॥ 44

వర్షాణి నాత్ర సందేహో వృథాభాషణతత్పరః ।
పురాణం వైష్ణవం మాత్స్యం కౌర్మం భాగవతం తథా ॥ 45

ఆదిత్యం గారుడం స్కాందం మార్కండేయమథాష్టమమ్ ।
బ్రహ్మబ్రహ్మాండలైంగ్యాని బ్రహ్మవైవర్తమేవ చ ॥ 46

భవిష్యోత్తరమాగ్నేయం పాద్మం వామనమేవ చ ।
వారాహం చైవ వాయవ్యం హ్యష్టాదశాని వై త్వితి ॥ 47

మహాపురాణాన్యేతాని రామాయణభవాని హి ।
రామాయణాత్పురాణాని వ్యాసేన ఖండితాని హి ॥ 48

బ్రాహ్మణులలో జ్ఞానముచేతనే పాత్రాపాత్ర వివేకమేర్పడెను. పుణ్యాధిక్యముచేతనే పాఠకులలో యోగ్యత నెరుగునది, అధ్యయనము చేసినవాడు, తత్ జ్ఞానముగలవాడను వీరిలో పుణ్యాధికుడు జ్ఞాని గావున అతడే పూజ్యుడు. జ్ఞానులకు శ్రీరాముడే మిగులప్రియమైన వాడుగదా! ఆ శ్రీరాముడును వారినే ప్రేమించును. ఎవనికి వాదులను జయించు శక్తిగల్గునో ఆ గతినిగూడ రామభక్తుడు పొందును.

వేదాది సకల విద్యలయొక్క అర్థజ్ఞానముకొరకై వ్యాకరణశాస్త్రమును అధ్యనయముచేయువాడు వేదాధ్యయన సదృశ ఫలభాగియగును. ఇందుకు జ్ఞానాధిక్యమే కారణము. కర్మమీమాంస, బ్రహ్మ మీమాంస యని ఆ శాస్త్రము రెండు విధములుగాఉన్నది. అందు మొదటిది వేదార్థజ్ఞానముతో సమము. రెండవది అక్షరాక్షరమునకును శతగాయత్రీ జపఫలప్రదము. ప్రత్యక్షోపయోగి గ్రంథములు పాద పాదమునను అర్థఫలదములని తెలియవలె. వేదోపనిషత్తులను జ్ఞానాధిక్యమునకై పఠించితే అవియట్లే ఫలము నిచ్చును. సకలవిద్యలకును గొప్ప వెలుతురువంటి న్యాయ్యశాస్త్రమును అభ్యసించిన వాడు వేదార్థ జ్ఞానసమఫలుడు. ఇక తనజీవికకై తర్కమునుచదివి కారణవాదపరుడై బ్రహ్మవిచారము చేయనివాడు పఠితాక్షరసంఖ్యతో తుల్యముగా అన్నిసంవత్సరములు గాడిదై జన్మమెత్తును మరియు,

వైష్ణవ, మాత్స్య, కౌర్మ, దేవీభాగవత, ఆదిత్య, గారుడ, స్కాంద, మార్కండేయ, బ్రహ్మ, బ్రహ్మాండ, లైంగ, బ్రహ్మవర్త, భవిష్యోత్తర, ఆగ్నేయ, పాద్మ, వామన, వారాహ, వాయవ్య అను ఈ పేర్లుగల 18 పురాణములు, రామాయణ పురాణమునుండి వ్యాసునిచే వేర్వేరుగా భాగింపబడినవి.

**అతః పురాణం నామాభూదేతేషాం జగతీతలే ।**
**ఆదౌ కృతాని యాన్యత్ర తేషాం జ్యేష్ఠత్వసూచకః ॥ 49**

**మహాశబ్దః ప్రోచ్యతే హి వైష్ణవాదిషు షట్ త్రిషు ।**
**పురాణానాం తు సర్వేషాం ఫల శిష్య బ్రవీమ్యహమ్ ॥ 50**

**వేదతుల్యఫలం పాఠే శ్రవణే చ తదర్ధకమ్ ।**
**అర్థశ్రవణతశ్చాస్య పుణ్యం దశగుణం స్మృతమ్ ॥ 51**

**వక్తుః స్యాద్విగుణం పుణ్యం వ్యాఖ్యాతుశ్చ శతాధికమ్ ।**
**అన్యాన్యుపపురాణాని సంతి తేషాం ఫలం శృణు ॥ 52**

**విష్ణుధర్మోత్తరం శైవం బృహన్నారదమేవ చ ।**
**భగవతీపురాణం చ లఘునారదమేవ చ ॥ 53**

**భవిష్యత్పర్వషష్ఠం స్యాత్తంత్రం భాగవతం తథా ।**
**అష్టమం నారసింహ స్యాత్పురాణం రేణుకాభిధమ్ ॥ 54**

**దశమం తత్త్వసారం స్యాద్వాయుప్రోక్తం తథైవ చ ।**
**నందిప్రోక్తం ద్వాదశం స్యాత్తథా పాశుపతాభిధమ్ ॥ 55**

యమనారదసంవాదః తథా హంసపురాణకమ్ ।
వినాయకపురాణం చ బృహద్బ్రహ్మాండమేవ చ ॥ 56

పుణ్యం విష్ణురహస్యం స్యాదితి హ్యష్టాదశాని వై ।
ఏతాన్యుపపురాణానీ పురాణార్ధఫలాని చ ॥ 57

భారతం వేదతుల్యం స్యాదర్థతోఽధికముచ్యతే ।
తథాపి భగవద్గీతా విష్ణోర్నామసహస్రకమ్ ॥ 58

దశాధికఫలం ప్రోక్తం భారతాదపి సర్వశః ।
శ్రోతాఽర్ధం ఫలమాప్నోతి భక్తితః శృణుయాత్తు యః ॥ 59

భారతం త్వితిహాసంచ రామాయణసముద్భవమ్ ।
యద్వేదపాఠపుణ్యం తత్ జ్ఞేయం రామాయణస్య చ ॥ 60

పురాణపఠనముచే వేదతుల్య ఫలము, వినుటచే అందులో సగము, అర్థవిచార శ్రవణము చే పదింతలు, అర్థబోధకునికి రెండింతలు పుణ్యము. విస్తరించి వివరణము చేయువానికి నూరింతలు. ఇక విష్ణుధర్మోత్తర, శైవ, బృహన్నారద, భగవతీ, లఘునారద, వాయు, నంది, పాశుపత, యమ, నారద, హంస, గణపతి, బృహద్బ్రహ్మాండ, విష్ణురహస్య నామములచే 18 ఉపపురాణములు. ఇవి పురాణ ఫలములో అర్థఫలమునిచ్చును. భారతము వేదతుల్యము. అర్థజ్ఞానముచే మరియు అధికము. దానిలోను భగవద్గీత, విష్ణుసహస్రనామము పదింతలు ఫలప్రదములు. భారతమను ఇతిహాసము రామాయణమునుండి కలిగినదే. (61)

పాఠాత్తదర్ధం శ్రవణే వ్యాఖ్యాతుశ్చ దశాధికమ్ ।
వాల్మీకినా కృతం యచ్చ శతకోటిప్రవిస్తరమ్ ॥ 61

తత్సర్వేషామాదిభూతం మహామంగళకారకమ్ ।
రామాయణాదేవ నానా సంతి రామాయణాని హి ॥ 62

శేషభూతం చతుర్వింశత్సహస్రం ప్రథమం స్మృతమ్ ।
తథా చ యోగవాసిష్ఠమధ్యాత్మాఖ్యం తథాస్మృతమ్ ॥ 63

వాయుపుత్రకృతం చాపి నారదోక్తం తథా పునః ।
లఘురామాయణం చైవ బృహద్రామాయణం తథా ॥ 64

అగస్త్యుక్తం మహాశ్రేష్ఠం సారరామాయణం తథా ।
దేహరామాయణం చాపి వృత్తరామాయణం పునః ॥ 65

బ్రహ్మరామాయణం రమ్యం భారద్వాజం తథైవ చ ।
శివరామాయణం క్రౌంచ భారతస్య చ జైమినేః ॥ 66

ఆత్మధర్మం శ్వేతకేతుఋషేశ్చైవ జటాయుషః । 67

రవేః పులస్త్యేర్దేవ్యాశ్చ గుహ్యకం మంగళం తథా ।
గాధిజం చ సుతీక్ష్ణం చ సుగ్రీవం చ విభీషణమ్ ॥ 68

తథాఽఽనందరామాయణమేతన్మంగళకారకమ్ ।
ఏవం సహస్రశః సంతి శ్రీరామచరితాని హి ॥ 69

కః సమర్థోఽస్తి తేషాం హి సంఖ్యాం వక్తుం సవిస్తరాత్ ।
శతకోటిమితాదేవ విభక్తాని పృథక్ పృథక్ ॥ 70

సర్వేష్వప్యానందసంజ్ఞం వరిష్ఠం ప్రోచ్యతే త్విదమ్ ।
అస్య పాఠేన యత్పుణ్యం తత్తే శిష్య వదామ్యహమ్ ॥ 71

శతకోటిమితం శ్రుత్వా యత్ఫలం లభ్యతే నరైః ।
ఫలమస్య తదర్ధం హి జ్ఞేయం శిష్య శుభప్రదమ్ ॥ 72

శ్రవణాద్ద్విగుణం పాఠే వ్యాఖ్యాతుశ్చ దశాధికమ్ ।
తస్మాదేతత్సదాఽఽనందసంజ్ఞం శ్రావ్యం నరోత్తమైః ॥ 73

నానేన సదృశం కించిత్ భూతం నాగ్రే భవిష్యతి ।
సర్వేష్వపి చ శాస్త్రేషు పంచరాత్రాగమోఽధికః ॥ 74

భగవద్గీతయా తుల్యం ఫలం తస్యాఖిలస్య చ ।
భారతీయకథాబంధం సద్భక్తైరైవ నిర్మితమ్ ॥ 75

తత్కావ్యం యః పఠేత్ప్రాజ్ఞో దశాంశం ఫలమాప్నుయాత్ ।
సద్భ క్తైర్నిమితం తత్తు శతాంశఫలదం స్మృతమ్ ॥ 76

యః కరోతి స్వయం కావ్యం కల్పయిత్వా స్వయంకథామ్ ।
తచ్ఛ్రమో వ్యర్థతామేతి తదధ్యేతా చ దోషభాక్ ॥ **77**

పౌరాణీం భారతీం వాపి తథా రామాయణస్థితామ్ ।
తథా హ్యుపపురాణస్థాం కథాం గ్రథతి యః స్వయమ్ ॥ **78**

రామభక్తోఽపి లభతే శాస్త్రలోకాధివాసతామ్ ।
ప్రత్యక్షరం వర్షమేకం వాసస్తస్య భవేద్ధ్రువమ్ ॥ **79**

రామభక్తః పురాణేభ్యః కథాం గ్రథతి యః పునః ।
వ్యాసమూర్తిః స లభతే బృహస్పతిసలోకతామ్ ॥ **80**

## అనేక రామాయణములు

రామాయణ పఠనచే వేదాధ్యయనఫలము కలుగును, వినుటచే సగము, వివరించుటచే పదింతలు గల్గును. మహామంగళకరముగా శ్రీవాల్మీకి మునిచే తొలుత చెప్పబడిన శతకోటి విస్తరమగు రామాయణమే అన్నింటికి మూలము. దానినుండియే అనేక రామాయణములు ఏర్పడినవి. వానిలో శేషరామాయణము 24 వేల శ్లోకములతో మొదటిది. అట్లే– యోగవాసిష్ఠ, అధ్యాత్మ, హనుద్రామాయణ, నారద రామాయణ, లఘురామాయణ, బృహద్రామాయణ, అగస్త్యరామాయణ, సారరామాయణ, దేహరామాయణ, వృత్త రామాయణ, బ్రహ్మరామాయణ, భరద్వాజ రామాయణ, శివరామాయణ, భరత రామాయణ, క్రౌంచరామాయణ, జైమిని రామాయణ, ఆత్మ రామాయణ, జటాయు రామాయణ, రవి రామాయణ, పులస్త్యరామాయణ, దేవీరామాయణ, గుహ్యరామాయణ, మంగళరామాయణ, విశ్వామిత్ర రామాయణ, సుతీక్ష్ణరామాయణ, సుగ్రీవ రామాయణ, విభీషణ రామాయణ, మొదలగు అనేకములు గలవు.

అట్లే ఆనంద రామాయణ మిది. మంగళప్రదము, అట్లే వేలకొలదిగా ఎన్నియో శ్రీరామచరిత్రలు గలవు. వాటి సంఖ్యను విస్తరించుటకు ఎవనితరము? ఇవన్నియును నూరుకోట్ల శ్లోకములనుండి (శతకోటి) వేర్వేరుగా ఏర్పడినవి, ఆనందసంజ్ఞగల యిది అన్నిటిలో ఉత్తమము. దీనిని పఠించుటలో శతకోటిరామచరిత శ్రవణఫలములో సగముసిద్ధించును. పారాయణముచే రెండింతలు, పురాణము చెప్పుటచే పదింతల ఫలము. కావున ఇది సదానంద సంజ్ఞగలిగి వినదగినది. త్రైకాలికముగా మరియొకటి దీనికి సాటికాదు. అన్ని శాస్త్రములకన్న పంచరాత్రాగమము గొప్పది. దాని సర్వఫలము భగవద్గీతతో సమము. భారతకథాబంధము సద్భక్తులచే నిర్మితము. ఆ కావ్యమును పఠించువాడు దశాంశ ఫలమునందును. మంచిభక్తులు దానిపై నిర్మించినది శతాంశఫలప్రదము. తానొక కథను

కల్పించి కావ్యమురచించిన అది వ్యర్థము. దానిని చదువుట దోషము. రామాయణ, పురాణ, భారత ఇతిహాసములనుండి కథను సంగ్రహించి కావ్యము కల్పించువాడు రామభక్తుడును, అక్షరమునకు అబ్దమవంతున స్వర్గవాసము నందును, రామభక్తుడే అట్టికావ్యమును రచించితే వ్యాసమూర్తి యనబడి గురులోకమునందును. (80)

దౌహిత్రపోషితః శిష్య ఆరామశ్చ జలాశయః ।
సద్గ్రంథకరణం పుత్రః తే పుత్రా వై ప్రకీర్తితాః ॥ **81**

ఏవం భూమ్యామంశభూతైర్నరైస్తే విచరంతి హి ।
అశ్వత్థామాదయః సప్త యే చిరంజీవినః సదా ॥ **82**

అతః శ్రీరామభక్తైశ్చ కవిత్వైస్తత్కృతిః కృతా ।
సాపి మాన్యా సదా శ్రావ్యా పఠనీయా బుధైర్ముహుః ॥ **83**

భారతాచ్చ శతాంశేన ఫలధాత్రీ స్మృతాఽత్ర హి ।
నిందంతి యే భక్తకృతం కవితాం తే ఖరాః స్మృతాః ॥ **84**

తత్తద్భాషాకృతం కావ్యం రామవర్ణనసంయుతమ్ ।
భారతస్య సహస్రాంశం శ్రోతుర్వక్తుః ఫలం స్మృతమ్ ॥ **85**

నిర్మాతుస్తు భవేత్పుణ్యం సాధుశబ్దశతాంశతః ।
గీర్వాణీకవితాకర్తా సోఽపి వ్యాసాంశ ఈరితః ॥ **86**

స్వస్వభాషాకవిత్వానాం కర్తారస్తే కవీశ్వరాః ।
గీర్వాణీకవితా చాపి పదాన్వయసమన్వితా ॥ **87**

అర్థప్రమాణసహితా సైవ మాన్యా న చేతరా ।
నరస్తుతిం తు యః కుర్యాజ్జీవికార్థం కవిః క్వచిత్ ॥ **88**

నిష్ఫలస్తచ్ఛ్రమః ప్రోక్తః తదధ్యేతా చ దోషభాక్ ।
ఉన్మాదేన తు యః కుర్యాత్కామినీనాం తు వర్ణనమ్ ॥ **89**

స హి శ్వయోనిం ప్రాప్నోతి వర్షాణ్యక్షరసంఖ్యయా ।
వేదోక్తార్థానుసారేణ మన్వాద్యాః స్మారకాః స్మృతాః ॥ **90**

తేషాం వై స్మృతయో నామ నానాధర్మప్రవర్తకాః ।
తత్ర కేచిద్వైదికేషు కర్మస్వధికృతాః పరే ॥ 91

అవైదికేషు మంత్రేషు కేచిత్పశుసమాః స్మృతాః ।
అవైదికేష్వపి ప్రోక్తో నాధికారో భవేన్నృణామ్ ॥ 92

## సప్తసంతాన కవిత్వ తారతమ్యాలు

కూతురికొడుకు, పోషింపబడినవాడు, శిష్యుడు, తోట జలాధారము, సత్‌గ్రంథము, విద్యాలయము, సత్సంతానము అను ఏడును, అశ్వత్థామాది చిరంజీవులు పురాణములలో కావ్యకారులుగా అంశావతారలు జేసి చరించుచున్నారు. కావున శ్రీరామభక్తులు కవితాశక్తితో రామకథా కృతులు చేసెదరు. వాటినిగూడ ప్రాజ్ఞులు పఠన, శ్రవణాదులచే పలువురు సమ్మానింతురు. ఆకృతి, భారత శ్రవణాదులలోని సహస్రాంశఫలము నిచ్చును. భక్తుల కృతులను నిందించు వారు గాడిదెలు అనబడుదురు. శ్రీరామవర్ణనతో కూడిన ఆయాభాషలలో రచింపబడిన కవిత్వము చెప్పెడువాడు, వినెడువాడును భారత సహస్రాంశఫలభాగులగుదురు. కవికి సత్ శబ్దప్రయోగజన్య ఫలముకన్న నూరింతలు పుణ్యమగును. సంస్కృత కవితాశక్తి వ్యాసాంశవల్ల కలుగును. వారివారి ప్రాకృతభాషలలో కవిత్వము చేయువారు కవీశ్వరులగుదురు. సంస్కృత కావ్యము సప్రమాణమును, శుద్ధాన్వయమును, సత్పదమండితమగుటచే అది మాన్యమై ఒప్పుచున్నది.

తన జీవికకై నరస్తుతి జేయు కవియొక్క శ్రమ వ్యర్థము. తత్కృతి పఠనమును వ్యర్థమే. పిచ్చిపట్టినట్టు స్త్రీలను వర్ణించు కవులు తన కవితాక్షర సంఖ్యావత్సరములు కుక్కజన్మమెత్తియుందురు. ఇక మన్వాదులు వేదార్థ అనువాదమునకు స్మారకులనబడిరి. వారికృతులు మానవధర్మ ప్రవర్తకములై స్మృతులనబడే, అచ్చట కొందరు వైదికకర్మయందు అధికృతులైరి. కొందరు పశుతుల్యులు అవైదికమంత్రములలో స్మరింపబడిరి. అట్టి అవైదికమంత్రములు అవలంబించువారు దానానికి అనర్హులు.

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థో యతిస్తథా ।
ప్రోక్తా హ్యాశ్రమిణస్త్వేతే భిన్నధర్మాణ ఏవ చ ॥ 93

కదా కుత్ర కథం కర్మ కేన కార్యమితి స్ఫుటమ్ ।
ధర్మశాస్త్రం తు నిర్ణీతమన్యథా దోషభాగ్భవేత్ ॥ 94

అదేశే యత్కృతం వ్యంగమకాలేనాధికారిణా ।
ప్రత్యేకం తద్భవేద్వ్యర్థం ప్రత్యవాయోఽధికో భవేత్ ॥ 95

తస్మాదవశ్యకం తత్తు విప్రాణాం చ విశేషతః ।
స్మృత్యర్థం జ్ఞానతో వాపి వేదార్థజ్ఞానతోఽధికమ్ ॥ 96

ఋగ్వేదస్యోపవేదః స్యాదాయుర్వేదో హి వైదికః ।
పరేషాముపకారాయ స్వస్యారోగ్యార్థమేవ వా ॥ 97

జీవికార్థమప్యసౌ హి పఠితవ్యో ద్విజాతిభిః ।
బ్రాహ్మణం రోగిణం క్షీణముపచారేణ జీవయేత్ ॥ 98

బ్రహ్మహత్యాభవం పాపం తస్య నశ్యతి వై ధ్రువమ్ ।
యతః స లభతే పుణ్యం చతుః కృచ్ఛ్రసముద్భవమ్ ॥ 99

ఏవం పుణ్యం భవేత్తస్య తత్తద్వర్ణానుసారతః ।
యత్నే కృతేఽపి యో రోగీ న జీవత్యాయుషః క్షయాత్ ॥ 100

సోప్యర్థాత్ఫలమాప్నోతి నాత్ర కార్యా విచారణా ।
జీవితార్థం తు యః కుర్యాదుపవిద్యాచతుష్టయమ్ ॥ 101

ఇహ లోకే ఫలం తస్య పరలోకే న కించన ।
నరం రోగార్ణవే మగ్నం యోఽభ్యుద్ధరాతి మానవః ॥ 102

కస్తేన న కృతో ధర్మః కాం వా పూజాం న సోఽర్హతి ।
గతశ్రీర్గణకాన్ ద్వేష్టి గతాయుశ్చ చికిత్సకాన్ ॥ 103

గతశ్రీశ్చ గతాయుశ్చ బ్రాహ్మణాన్ ద్వేష్టి మూఢధీః ।
గాంధర్వమప్యధీయాత రామాగ్రే యశ్చ గాయతి ॥ 104

తద్భక్తియుక్తో లభతే గాంధర్వం లోకముత్తమమ్ ।
ధనుర్వేదో దండనీతిర్ బ్రాహ్మణానాం తు జీవికా ॥ 105

బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, సన్న్యాసి అనే నలుగురి ఆశ్రమధర్మాలు వేరువేరు. వీరు ఎవ్వరు ఎప్పుడు, ఎచ్చట, యెట్లు కర్మ చేయవలయునో ధర్మశాస్త్రమునుబట్టి నిర్ణయించదగును. అటుగాకున్న వాడు ద్రోహియగును. దేశ కాలములనెరుగక చేసిన కర్మ చెడుటయేగాక పాపము

వచ్చిచేరును. కావున ఏది అవశ్యకముగా చేయవలయునో అట్టిది చేయవలయును. ఋగ్వేదమునకు ఉపవేదమయిన ఆయుర్వేదమును పరోపకారమునకును, తనఆరోగ్యమునకును, జీవన భృతికొరకు ద్విజులు అభ్యసింపవలయును. రోగియును క్షీణుడగు బ్రాహ్మణుని ఉపచారముచే బ్రతికించితే, చతుః కృచ్ఛ్ర పుణ్యఫలము గలవాడు అగుటచే వానికి బ్రహ్మహత్యాజనిత పాపముకూడ పరిహరింపబడును. ఇట్లే ఆయా వర్ణములను అనుసరించి పుణ్యము కలుగుచుండును. ఏరోగికై ప్రయత్నము చేయబడునో ఆ రోగి ఆయుష్షు నశించిపోయినను ఉపకరించినవానికి ఫలము తప్పదు. ఇందులో కారణము వెదకనవసరములేదు. తన జీవనము కొరకై యెవరు ఉపవేదములను అభ్యసించి బ్రతుకుదురో వారు ఇహలోక ఫలమునందుదురు. స్వర్గాదిలోక ఫలము వారికబ్బదు. రోగసముద్రమున మునిగిన వానిని ఉద్ధరించినవాడు సకలధర్మములను చేసినవాడగును, సర్వపూజార్హుడగును. సర్వం తొలగినవాడు గణితజ్ఞులను; కాలము తీరినవాడు వైద్యులను; సంపద, ఆయుర్బలము క్షీణించినవాడు బ్రాహ్మణులను మూఢుడై ద్వేషించుచున్నాడు. శ్రీరాముని యెదుట గానముచేయువాడు లోకోత్తమమగు గాన విద్యనుకూడ అభ్యసింపవచ్చును. ధనుర్వేదము, దండనీతిశాస్త్రము బ్రాహ్మణులకు జీవికగానుండును. అది క్షత్రియులకు వేదముకన్న అర్ధఫలమునిచ్చును. (105)

**క్షత్రియాణాం తు సా ప్రోక్తా వేదాదర్ధ ఫలప్రదా ।**
**జ్ఞాతిష్వేతేషు సర్వేషు పుణ్యం జ్ఞానానుసారతః ॥ 106**

**వివేకస్తస్య కర్తవ్యో ద్రవ్యదానే విశేషతః ।**
**అన్నస్య క్షుధితః పాత్రం పానీయస్య పిపాసితః ॥ 107**

**ద్రవ్యదానే తు కర్తవ్యం విశేషాత్పాత్రవీక్షణమ్ ।**
**ఖలాయాం గవి దుగ్ధం సాద్దుగ్ధమప్యురగే విషమ్ ॥ 108**

**పాత్రాపాత్రవిచారేణ సత్పాత్రే దానముత్తమమ్ ।**
**యథా పుణ్యాధికం పాత్రం తథా దానం ఫలాధికమ్ ॥ 109**

**జ్ఞానాధిక్యాద్భవేత్పుణ్యాధిక్యాత్పాత్రం శ్రమేణ వా ।**
**రామభక్తశ్చ పాత్రం స్యాద్రామాభక్తో న సర్వథా ॥ 110**

**రామద్వేషీ వర్జనీయో దర్శనాలాపనాదిషు ।**
**సంగతశ్చ భవేత్పూతస్తద్భక్తానాం తు నాన్యథా ॥ 111**

యచ్ఛక్తేరధికం దద్యాత్తద్దానం పరికీర్తితమ్ ।
విత్తశాఠ్యేన యద్దానం న తద్దానం స్మృతం బుధైః ॥ 112

దేశకాలవిశేషేణ తత్తత్పాత్రవిశేషతః ।
దానస్య ఫలముద్దిష్టమధికం న్యూనమేవ చ ॥ 113

విప్రశుల్కం తు యో మూఢో దద్యాచ్ఛక్తిసంభవమ్ ।
విష్ఠాక్రిమిర్భవేదేవ సువర్ణైరేవ సంఖ్యయా ॥ 114

దివ్యవర్షాణి నైవాత్ర త్వయా కార్యస్తు సంశయః ।
యత్తు జ్ఞానవతా కర్మ క్రియతే పుణ్యదాయకమ్ ॥ 115

అధికం తత్ఫలం ప్రోక్తమజ్ఞానికృతకర్మణః ।
యథా యథాఽధికం జ్ఞానం పాపహానిస్తథా తథా ॥ 116

యత్తు జ్ఞానవతా కర్మ క్రియతే పాపకారకమ్ ।
తన్న్యూనఫలదం ప్రోక్తమజ్ఞానికృతపాతకాత్ ॥ 117

## జ్ఞానము, జ్ఞాని ప్రాశస్త్యము. పుణ్య, పాప విచారము.

అందరిలోను జ్ఞానానుసారముగా పుణ్యముగల్గును. ద్రవ్యదాన విషయమందు దాని పాత్రాపాత్ర వివేకము కర్తవ్యము. అన్నదానమునకు ఆకలిగలవాడు, నీళ్లకు దప్పిగలవాడును పాత్రము. ద్రవ్యదానమునకు విశేషముగా యోగ్యతనెంచుట ముఖ్యము. దుష్టగోవులో పాలుగానిమ్ము, సర్పము నందు పాలుగూడ విషమే. సత్పాత్రము నెరిగి చేసినదానము ఉత్తమము. ఎట్లు దానమునందువాడు పుణ్యాధికుడై యుండునో అట్లు దానఫలము అధికముగా ఉండును. జ్ఞానాధిక్యముచేత గాని, పుణ్యాధిక్యముచేత గానీ, శ్రమచేత గాని రామభద్రుడు ఉత్తమపాత్రము. తదితరుడెన్నటికిని కాడు.

రాముని ద్వేషించువానిని చూచుట, పలుకరించుట మొదలగువాటియందుకూడ వర్జ్యుడు. ఒక వేళ అట్టివాడు శ్రీరామభక్తులతో చేరిన అతడు పరిశుద్ధుడగును. శక్తిమీరి చేసిన దానమే దానము. లోభముచే జేయుదానము దానముకాదు. దేశ, కాల భేదముచే దానఫలము ఎచ్చు తక్కువలనందును. బ్రహ్మత్వముచే మూఢుడు శక్తికొలది యివ్వకున్న అతడు మలగత క్రిమియగును. అజ్ఞాని సత్కర్మ కన్నను ప్రాజ్ఞునిసత్కర్మకు ఫలమెక్కువ.

యథా యథాధికం జ్ఞానం పాపహానిస్తథా తథా ।
యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతే క్షణాత్ ॥ 118

జ్ఞానాగ్నిదుష్టకర్మాణి భస్మసాత్కురుతే తథా ।
వర్ణాధిక్యం యథా హేమ్నో వహ్నిసంగేన జాయతే ॥ 119

పుణ్యాధికం తథా శిష్య జ్ఞానిసంగేన జాయతే ।
పుణ్యేన వర్ధతే పుణ్యం పాపం స్వల్పం చ జాయతే ॥ 120

పాపేన పాపవృద్ధిశ్చ పుణ్యం స్వల్పం చ జాయతే ।
అతిసూక్ష్మో విచారోఽయం దుర్జ్ఞేయః స్థూలదృష్టిభిః ॥ 121

తథాప్యేవం విచార్యం స్యాత్ తత్త్వజ్ఞానానుసారతః ।
యస్తు సత్యధికారేఽపి జ్ఞానే వా పఠనేఽపి వా ॥ 122

ప్రయత్నం నైవ కుర్వీత స నరో జాయతే పశుః ।
జ్ఞానాద్వాఽధ్యయనాద్వాపి పుణ్యం విప్రస్య వర్ధతే ॥ 123

ఇతి సంక్షేపతః ప్రోక్తమేతత్పృష్టం త్వయాఽనఘ ।
ఉన్నయం చాప్యనేనైవ పుణ్యం పాపమథాపి వా ॥ 124

ధర్మాస్తు బహవః సంతి తథా పాపాన్యనేకశః ।
తత్ర తత్రోదితాన్యేవ ప్రాయశ్చిత్తాని వై బుధైః ॥ 125

కర్తవ్యాని జనైస్తాని సమ్యక్ బుధ్వావివిచ్య చ ।
సర్వసారమిదం ప్రోక్తం రహస్యం పురతస్తవ ॥ 126

గ్రహణీయం ప్రయత్నేన న హ్యభక్తాయ దీయతామ్ ।
శుశ్రూషవే సాధవే చ రామభక్తాయ దీయతామ్ ॥ 127

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, సర్వేషాంవేధాదీనాం ఫలశ్రుతినార్నామ, అష్టమస్సర్గః ॥

అజ్ఞాని దుష్కర్మకన్నను ప్రాజ్ఞుని దుష్కర్మకు ఫలము తక్కువ. కట్టెలు వేయుకొద్దీ అగ్ని జ్వలించి భస్మముచేయునట్లు, జ్ఞానికి వచ్చిన పాపాలను జ్ఞానాగ్ని దహించుచుండును. అనగా నిర్మలవిజ్ఞానము సర్వోత్తమము. జ్ఞాని సంగముచే పుణ్యము పెరుగును. జ్ఞానికి పుణ్యముచే పుణ్యము పెరగుచుండును. పాపము అల్పమగుచుండును. పాపముచే పాపము కూడా పెరుగును, పుణ్యమల్పమగు చుండును. ఇది మిక్కిలి సూక్ష్మమయిన విచారము. అయినను వారివారి వివేకము కొలది విచారము చేయవలెను.

ఎవడు వివేకము గల్గియున్నను పతనమందు ప్రయత్నించక యుండునో అతడు పశువై పుట్టును. బ్రాహ్మణునికి జ్ఞానమునుండి గాని, అధ్యయనమునుండిగాని పుణ్యవృద్ధిగల్గును.

విష్ణుదాసా! సంక్షేపముగా దానపాత్రత గురించి చెప్పితిని. ఇంతటితో పుణ్యపాప స్వరూపమును గూడ గ్రహింపబడు. ఇందులో ధర్మము, పాపములు వాటి ప్రాయశ్చిత్తములును అనేకములుగలవు. చక్కగా తెలుసుకొని వాటిని జపించి తరించెదవు గాక. ఇది సర్వసారమగు రహస్యము. ఈ తత్త్వమును దైవభక్తుడు కానివానికి చెప్పవద్దు. సాధువై సేవించు శ్రీరామభక్తునకు ఉపదేశింపవలయును.

**శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో 8వదైన మనోహరకాండలో వేదశాస్త్రముల ఫలమును వివరించు 8వ సర్గ ముగిసినది.**

# నవమః సర్గః-9వ సర్గ

## విశేషకాల పూజావర్ణన

విష్ణుదాస ఉవాచ

గురోఽన్యద్రామచంద్రస్య విశేషేణ చ పూజనమ్ ।
యస్మిన్కాలే ప్రకర్తవ్యం తం కాలం కథయస్వ మామ్ ॥ 1

శ్రీరామదాస ఉవాచ

శృణు శిష్య ప్రవక్ష్యామి కాలం పుణ్యతమం శుభమ్ ।
వదామి రామచంద్రస్య పూజనార్థం విశేషతః ॥ 2

మాఘస్య శుక్లపక్షస్య యా పుణ్యా పంచమీ తిథిః ।
పుణ్యా శ్రీపంచమీనామ్నీ సా ఖ్యాతాఽస్తి జగత్త్రయే ॥ 3

తదారభ్య సార్ధమాసద్వయం రామం మహోత్సవైః ।
పూజయేత్పంచమీం యావద్వైశాఖే కృష్ణపక్షజామ్ ॥ 4

మాఘకృష్ణచతుర్థ్యాంచ నవమీ మధుశుక్లజా ।
యావత్తావత్ఫలాహారీ చైకాశీతి దినాని హి ॥ 5

సీతారామస్య నిత్యం హి కేచిత్కుర్వంతి పూజనమ్ ।
పౌర్ణిమాంతాః స్మృతాశ్చాత్ర మాసాః సర్వత్ర భో ద్విజ ॥ 6

ప్రత్యహం వాహనారూఢం కృత్వా రామం మహోత్సవైః ।
భేరీదుందుభినిర్ఘోషైర్మహావాద్యపురస్సరైః ॥ 7

వారస్త్రీణాం నృత్యగీతైశ్ఛత్రచామరతోరణైః ।
నానాకుసుమవర్షాద్యైర్నానాస్తోత్రాదిపాఠనైః ॥ 8

నానాపరిమళద్రవ్యాంజలీనాం మోచనాదిభిః ।
నానామాంగల్యవస్తూనామంజలీభిః సుశోభనైః ॥ 9

నానాకుసుమరంగానాం తైలానాం చ పరస్పరమ్ ।
రామం చ వారనార్యశ్చ జలయంత్రైః కరే ధృతైః ॥ 10

ముహుర్ముహుః సించనాద్యైస్తథా స్త్రీణాం సుగాయనైః ।
ద్విజానాం వేదఘోషైశ్చ ధూపైర్నృరాజనాదిభిః ॥ 11

సహకారారామమధ్యే నీత్వైవం పరమోత్సవైః ।
సహకారవృక్షబద్ధదోలకే తం నివేశయేత్ ॥ 12

నాగేన వా పుష్పకేణ శేషయానేన వాజినా ।
రథేన గరుడేనాపి తథా సింహాసనేన చ ॥ 13

తథా శిబికయా వాపి వాయుపుత్రేణ వా తథా ।
యానైర్నవభిరేతైశ్చ సదా నేయో రఘూత్తమః ॥ 14

ఆమ్రవృక్షారామమధ్యే వల్లీపుష్పనగాన్వితే ।
అవనిం చందనైర్లిప్త్వా వికీర్య కుసుమాని చ ॥ 15

ఆచ్ఛాద్య నానావస్త్రైశ్చ శోభనీయాఽవనిః శుభా ।
హేమసింహాసనస్యైవ కృత్వా దోలకముత్తమమ్ ॥ 16

చూతవృక్షస్య శాఖాయాం తం బద్ధ్వా శృంఖలాదిభిః ।
తత్ర శ్రీరామతోభద్రే రామచంద్రం ప్రపూజయేత్ ॥ 17

నానానవవిధైః పుష్పైః షోడశైరుపచారకైః ।
సంపూజ్య సీతయా బంధుసుగ్రీవాద్యైః సమన్వితమ్ ॥ 18

ఆందోళయేద్దోళకం తం శిశుపాలకవచ్ఛనైః ।
నర్తితవ్యా వారవేశ్యాస్తదాగ్రే శతశో ముదా ॥ 19

గాయనీయా గాయకాశ్చ నర్తితవ్యా నటాదయః ।
వాదనీయాని వాద్యాని జ్వాలనీయాః సుధూపకాః ॥ 20

వీజనీయశ్చామరాద్యైః సీతయా రఘునందనః ।
తద్వ్యాసైః కీర్తనాన్యేవ కారయిత్వా మహోత్సవైః ॥ 21

**పునః పూజ్య పూర్వవచ్చ సమానీతో గృహం ప్రతి ।**
**సంపూజనీయః శ్రీరామః కుంభదీపార్తికాదిభిః ॥ 22**

## చూతవన డోలాపూజా మహోత్సవము.

విష్ణుదాసు అడుగుచున్నాడు. "గురువా! శ్రీరామచంద్రునికి విశేషముగా ఎప్పుడు, ఎక్కడ, ఎలా పూజచేయాలో సెలవియ్యండి," అనగా

శ్రీరామదాసుడు చెప్పుచున్నాడు. విష్ణుదాసా! "శ్రీరామ పూజాపుణ్యకాలమును చెప్పెదను వినుము. మాఘ శుక్లపంచమి శ్రీపంచమియని ప్రసిద్ధి. అది మొదలు వైశాఖ కృష్ణపంచమి వరకు శ్రీరామోత్సవమునకు ప్రశస్తము. మాఘకృష్ణ చతుర్థి మొదలు, చైత్ర శుక్లనవమి వరకు 81 దినములు ఫలాహారదినములు. కొందఱు శ్రీసీతారామ పూజనమును నిత్యముచేయుదురు. అంతట పూర్ణి మాంతముగా మాసములు చెప్పబడినవి. ఈ దినములలో ప్రతిదినమునను- రథ, గజ, తురగ, శేష, పుష్పక, గరుడ, సింహాసన, హనుమత్- ఆందోళన స్వరూపములగు నవ (తొమ్మిది) వాహనము లలో దేనిమీదనైనను శ్రీరామచంద్రస్వామిని ఎక్కించి నృత్త, గీత, మంగళవాద్య, వేదఘోషణాదులతో సకల రాజోపచారములతో, వారాంగనావసంతోత్సవములతోను, మిక్కిలి వైభవముతో ఉత్సవము చేసికొనిపోయి, మామిడితోటలో, మామిడిచెట్టుకు గట్టిన అరుగుమీద స్థాపించునది. గంధలిప్త శుద్ధ భూమియందు పూలు జల్లి, దివ్యవస్త్రాది అలంకృతమును రామతోభద్రాది రంజితమగు అచ్చోట శ్రీరామమూర్తిని, సుగ్రీవాది సకల పరివారముతోడ షోడశోపచారముచే సవిస్తరముగా, యథా వైభవముగా పూజించి, డోలోత్సవము చేసి, అప్పుడు నృత్త, గీత, వాద్య, కీర్తనాదులచే, రాజోపచారములచే రాముని ఆరాధించి యథాక్రమముగా ఇంటికి ఉత్సవ వైభవముతో గొనివచ్చి, కుంభహారతినిచ్చి పూజింపవలయును.

**ఏవం నిత్యం సార్ధమాసద్వయ రామం ప్రపూజయేత్ ।**
**చూతవృక్షతలే నీత్వా పూజయేచ్చ సవిస్తరమ్ ॥ 23**

**యదా రామశ్చ సీతా చ బహిర్నేయా నిజగృహాత్ ।**
**తదా తయోర్నయనాధః కస్తూర్యాంగుళినాఽసితాః ॥ 24**

**దేయాశ్చ బిందవో యత్నాత్పరదుర్ దృష్టినాశనాః ।**
**ఏవం దోళాపూజనం చ శిష్య తే కథితం మయా ॥ 25**

విశేషం శృణు తత్రాపి కథ్యతే యో మయాఽధునా ।
వసంతపూజనాత్పూర్వదివసే గణనాయకమ్ ॥ 26

మాఘశుక్లచతుర్థ్యాం హి పూజయేద్విఘ్ననాశనమ్ ।
మాఘశుక్లచతుర్థ్యాం తు నక్తవ్రతపరాయణః ॥ 27

యే దుండిం పూజయిష్యంతి తేఽర్చ్యాః స్యురసురద్రుహామ్ ।
మాఘమాసే చతుర్థ్యాం తు తస్మిన్కాల ఉపోషితః ॥ 28

అర్చయిత్వా విఘ్నరాజం జాగరం తత్ర కారయేత్ ।
చతుర్థీ కుందనామ్నీయం కుందపుష్పైః ప్రపూజయేత్ ॥ 29

మాఘశుక్లపంచమీ సా జ్ఞేయా శ్రీపంచమీ శుభా ।
తస్యాం తిథౌ రమానాథం రామచంద్రశ్రియాఽర్చయేత్ ॥ 30

మాఘశుక్లచతుర్థ్యాంతు వరమారాధ్య చ శ్రియా ।
పంచమ్యాం కుందకుసుమైః పూజాం కుర్యాత్సమృద్ధయే ॥ 31

నీత్వా రామం చూతవృక్షతలే దోలకసంస్థితమ్ ।
సీతారామం పూజయేచ్చ గేహే వాఽథ ప్రపూజయేత్ ॥ 32

ప్రవృత్తే మధుమాసే తు ప్రతిపద్యుదితే రవౌ ।
కృత్వా చావశ్యకార్యాణి సంతర్ప్య పితృదేవతాః ॥ 33

వందయేద్దోళికాభూమిం సర్వదుఃఖోపశాంతయే ।
వందితాఽసి సురేంద్రేణ బ్రహ్మణా శంకరేణ చ ॥ 34

అతస్త్వం పాహి మాం దేవి భూతే భూతిప్రదా భవ ।
చైత్రే మాసి మహాపుణ్యే పుణ్యే తు ప్రతిపద్దినే ॥ 35

యస్తత్ర శ్వపచం స్పృష్ట్వా స్నానం కుర్యాన్నరోత్తమః ।
న తస్య దురితం కించిన్నాధయో వ్యాధయోనృప ॥ 36

సీతారాములకు దృష్టిదోష పరిహారకముగా కస్తూరిచుక్కలను ఉంచాలి. ఇట్లు 81 దినములలో చేయునది డోలాపూజనము అనబడును. (25).

## వసంత కాలములో శ్రీరామోత్సవము

ఇచ్చుట విశేషమేమనిన ఈ వసంత డోలామహోత్సవములకు మొదటిరోజగు మాఘశుక్ల 4వ నాడు నక్త్రవ్రతపరాయణులు విఘ్నపరిహారకుడగు డుంఢిరాజ గణపతిని పూజించి, దేవస్తుతులగుదురు. ఆరోజు ఉపవాసముచేసి, గణపతిని మొల్లలచేపూజించి, జాగరణవ్రతము చేయునది. కావున అది కుందచతుర్థియయ్యే.

ఆ మాఘశుక్ల పంచమి శ్రీపంచమి యెందుకనిన; ఆరోజు రమాపతియగు శ్రీరాముని శ్రీదేవితో ఆరాధించునది. చతుర్థినాడు పూజించి, పంచమినాడు కుందపుష్పములచే అర్చింపవలయును. చూత(మామిడి)వృక్ష మూలమున అరుగుమీద గాని, ఇంటిలోగాని పూజింపవచ్చు. ఫాల్గుణ కృష్ణ ప్రతిపత్తునాడు (ఇది చైత్ర శుక్లపంచమి యని పూర్ణిమాంత మాసక్రమముననగును) సూర్యోదయాన్నే నిత్య కర్మానంతరము పితృతర్పణం ఒనరించి, సమస్తదుఃఖనివారణమునకై, "వందితాసి సురేంద్రేణ ..... భూతి ప్రదాభవ" అను ఈ శ్లోకముచే హోలికాభూమికి నమస్కరింపవలయును. పుణ్యకరమగు చైత్రమాసమున, పుణ్యాతిశయమైన పాడ్యమినాడు శ్వపచు నంటినవాడైన ఎవడు అచ్చట స్నానము చేయునో ఆ నరునికి పాపములు హరింపబడి, వ్యాధులు తొలగిపోవును.

**వృత్తే తుషారసమయే సితపంచదశ్యాః**
**ప్రాతర్వసంతసమయే సముపస్థితే చ ।**
**సంప్రాశ్య చూతకుసుమం సహ చందనేన**
**సత్యం హి విప్రపురుషోఽథ సమాః సుఖీ స్యాత్ ॥ 37**

**చూతమగ్రం వసంతస్య మాకంద కుసుమం తవ ।**
**సచందనం పిబామ్యద్య సర్వకామార్థసిద్ధయే ॥ 38**

**పంచమ్యాం మాఘమాసేఽపి చూతపుష్పం సచందనమ్ ।**
**ప్రాశనీయం నరైర్భక్త్యా కలకంఠో భవిష్యతి ॥ 39**

**చూతపుష్పప్రాశనేన కోకిలాస్వరవత్స్వరః ।**
**భవిష్యతి మానవానాం కలకంఠో మనోరమః ॥ 40**

**సీతారామం చూతపుష్పైస్తథా కోమలపల్లవైః ।**
**పూజయేత్ప్రత్యహం భక్త్యా దోళకస్థం మహోత్సవైః ॥ 41**

చైత్రకృష్ణప్రతిపది చూతపుష్పం సచందనమ్ ।
పీత్వా మహోత్సవేనైవ సీతారామం ప్రపూజయేత్ ॥ 42

ఏవం తచ్చ దినం నీత్వా తతశ్చాగ్రే దినత్రయమ్ ।
నానోత్సవసుగీతాద్యైర్నీత్వా చైవ తతః పరమ్ ॥ 43

పంచమ్యాం చైత్రకృష్ణేఽపి సౌభాగ్యద్రవ్యమంగళైః ।
స్నాత్వా కేసరపాలాశకృతరాగై శ్శుభావహైః ॥ 44

చిత్రితాని హి వాసాంసి పరిధాయ నరోత్తమః ।
నానాసుగంధతైలాద్యైరభ్యంగం తూర్యనిస్వనైః ॥ 45

జానక్యై రామచంద్రాయ కృత్వా తీర్థోదకైః శుభః ।
కేశరాదిభీ రాగైశ్చ వాసాంసి చిత్రితాని హి ॥ 46

దత్వా రామాయ సీతాయై తతో భక్త్యా ప్రపూజయేత్ ।
వసంతోద్భవపుష్పైశ్చ నానామంగళపూర్వకమ్ ॥ 47

నానాదానాని దేయాని నిజమాంగళ్యహేతవే ।
నానాసుగంధద్రవ్యాణి గృహీత్వా చ పరస్పరమ్ ॥ 48

ఏకైకోపరి సించేచ్చ మహామాంగల్యదాయకమ్ ।
మృష్టాన్నైర్భోజయేద్విప్రాన్ స్వయం చాపి సుహృజ్జనైః ॥ 49

భోక్తవ్యం తు వసంతర్తౌ పంచమ్యాం మానవైః సుఖమ్ ।
వసంతపంచమీనామ్నీ మహాపుణ్యాత్మికా సితా ॥ 50

పక్షే పక్షే తు పంచమ్యామారభ్య మాఘపంచమీమ్ ।
ఏవం రామం పూజయేచ్చ యావద్వైశాఖపంచమీ ॥ 51

హిమ (చలి) కాలము పోయి, వసంత సమయము వచ్చియుండ, ప్రొద్దున చందనరసముతో, మామిడి పువ్వును పచ్చడిచేసిన మానవుడు నిత్యసుఖియగును. 38 వశ్లోకము "చూతమగ్రం... సిద్ధయే" అను నిది ప్రాశన మంత్రము. మాఘమాసము పంచమినాడును ఇట్లు ప్రాశనము చేసినవాని కంఠస్వరము కోవిలకంఠ స్వరము వంటిదగును. డోలా(ఊయల)గత శ్రీసీతారాములను ప్రత్యహము

మామిడిపూలచేతను, మామిడి చిగుళ్లచేతను పూజించునది. చైత్రకృష్ణ పాడ్యమి నాడు శ్రీచందనముతో కలిపి మామిడి చిగుళ్ళను పచ్చడి చేసియే శ్రీసీతారామోత్సవమును గొప్పగా చేయనగును, ఆ దినము ఇట్లుగడిపి, పిదప మూడుదినములలో నృత్త, గీత, రామకీర్తన వినోదములచే ఉత్సవముజేసి, చైత్రకృష్ణ పంచమినాడు కుంకుమపువ్వు, కచ్చూరములు మొదలగు మంగళద్రవ్యములచే నలుగుపెట్టి, అభిషేకించి, రంగురంగుల వస్త్రములను ధరించి, సుగంధ తైలములతోను, తీర్థజలములతోను, శ్రీసీతారాములకు అభిషేకోత్సవమును మంగళ వాద్యములతో జరిపించవలయునది. అంతనా సీతారాములకు అంగరాగమును చిత్రవస్త్రములను అర్పించి భక్తితో వసంతఋతువులో లభించే పుష్పములతో పూజించి, వివిధ దానములను చేసి, తనకు మంగళకరముగా సుగంధ ద్రవ్యములను బంధువులపై ఒకరిమీద ఒకరు జల్లుకొని, బ్రాహ్మణులకు మృష్టాన్నము పెట్టి, తాను మిత్రులతోడ భుజింపవలయును. ఈ వసంతపంచమి బహు పుణ్యప్రదము. ఇట్లే ప్రతిపంచమినాడును వైశాఖపంచమి వరకు చేయవచ్చును.

**విశేషేణ నవమ్యాం హి పక్షే పక్షే ప్రపూజయేత్ ।**
**అథవా మాఘశుక్లాయాం కృష్ణాయాం చైత్రమాసి వై ॥ 52**

**కృష్ణాయాం మాధవే చాపి పంచమ్యాం పూజయేన్నరః ।**
**మహోత్సాహేన శ్రీరామో దోలకస్థోఽతియత్నతః ॥ 53**

**తతశ్చైత్రశుక్లపక్షే ప్రతిపది నరోత్తమైః ।**
**తైలాభ్యంగం స్వయం కృత్వా రామాయాభ్యంగమాచరేత్ ॥ 54**

**పూజయేన్నవరాత్రం తం యావత్సా నవమీ తిథిః ।**
**వత్సరాదౌ వసంతాదౌ బలిరాజ్యే తథైవ చ ॥ 55**

**తైలాభ్యంగమకుర్వాణో నరకం ప్రతిపద్యతే ।**
**అతీతే ఫాల్గునే మాసి ప్రాప్తే చైత్రే మహోత్సవే ॥ 56**

**పుణ్యేఽహ్ని విప్రకథితే ప్రపాదానం సమారభేత్ ।**
**ప్రపాముత్సర్జయేద్విద్వాన్ మంత్రేణానేన మానవః ॥ 57**

**అరణ్యే నిర్జలే దేశే పథి గ్రామేఽథవా శుభా ।**
**ప్రపేయం సర్వసామాన్యాత్ భూతేభ్యః ప్రతిపాదితా ॥ 58**

అస్యాః ప్రదానాత్పితరస్తుష్యంతు హి పితామహాః ।
అనివార్య తతో దేయం జలం మాసచతుష్టయమ్ ॥ 59

దేవాలయేషు లింగానాం దేయాస్తోయగలంతికాః ।
ప్రపాం దాతుమశక్తేన విశేషాద్ధర్మమీప్సునా ॥ 60

ప్రత్యహం ధర్మఘటకో వస్త్రసంవేష్టితాననః ।
బ్రాహ్మణస్య గృహే దేయః శీతామలజలః శుచిః ॥ 61

తాంబూలఫలధాన్యైశ్చ దక్షిణాభిః సమన్వితః ।
ఏష ధర్మఘటో దత్తో బ్రహ్మవిష్ణుశివాత్మకః ॥ 62

అస్య ప్రదానాత్సఫలాః సర్వే సంతు మనోరథాః ।
అనేన విధినా యస్తు ధర్మకుంభం ప్రయచ్ఛతి ॥ 63

ప్రపాదానఫలం సోఽపి ప్రాప్నోతీహ న సంశయః ।
తృతీయాయాం చైత్రశుక్లే సీతారామౌ ప్రపూజయేత్ ॥ 64

## అభ్యంగస్నానము, జలదానము.

ప్రతిపక్ష నవమినాడు, వీలుకానిచో మాఘశుక్లమున, చైత్రకృష్ణమున, వైశాఖకృష్ణమున పంచమి నాడైనను, శ్రీరామడోలికోత్సవపూజ కర్తవ్యమైయున్నది, పిదప చైత్రశుక్ల ప్రతిపదినాడు తాను అభ్యంగస్నానము జేసి, శ్రీరామునికి అభ్యంగము చేయించి, నవమి వరకు నియమముతో పూజింప వలయును. సంవత్సరా(ఉగా)దియందును, వసంతాది యందును, బలి ఉత్సవదినమగు కార్తీక శుక్ల పాడ్యమినాడును, తైలాభ్యంగము జేసికొననివాడు నరకమునందును.

మహోత్సవమగు చైత్రము వచ్చుచునే, బ్రాహ్మణులను అడిగి మంచిదినమున చలువ పందిరి వేయించవలయును. అడవిలోను, నిర్జల ప్రదేశమునను, మార్గమునను, గ్రామమునకు సకలభూత తృప్తికై చలువపందిరి ప్రతిపాదింపబడినది. అను అర్థముగల 58వ శ్లోక మంత్రముతో ప్రపాశాలను ప్రతిష్ఠించునది. చలువపందిరి వేయించడం వలన గతించిన తండ్రి, తాతలకు తృప్తిగల్గును. కావున తడవుజేయక నాల్గునెలలు జలదానము చేయవలయును. చేయవలయునని కోరికయుండి, శక్తిలేనివాడు కనీసం శివాలయములకు నీటికుండలను సమర్పింపవలయును. ప్రతిసంవత్సరము బ్రాహ్మణ గృహమునకు మంచినీటి కుండలను సమర్పించుట పుణ్యకరము. సదక్షిణ తాంబూల ఫలధాన్యమగు ధర్మ జలకుంభమును, "ఏషధర్మ ఘటో...మనోరథా," అను శ్లోక మంత్రముచే, విధివిధానముగా ఇచ్చువాడు చలువపందిరి వేయించిన ఫలమునందును. (64)

కుంకుమాగరుకర్పూరమణివస్త్రసుగంధకైః ।
స్రగ్గంధధూపదీపైశ్చ దమనేన విశేషతః ॥ 65

ఆందోళయేత్తతః సీతారామౌ చ దోళకస్థితౌ ।
వసంతమాసమాసాద్య తృతీయాయాం ద్విజోత్తమ ॥ 66

సౌభాగ్యాయ తదా స్త్రీభిః సౌభాగ్యశయనవ్రతమ్ ।
కార్యం మహోత్సవేనైవ సుఖం పుత్రమఖేత్సభిః ॥ 67

విశేష చాత్ర వక్ష్యామి తృతీయాయాం ద్విజోత్తమ ।
తృతీయాయాం తు నారీభిః శుక్లపక్షే మధౌ శుభౌ ॥ 68

స్నాత్వా మృణ్మయదుర్గం హి కార్యం చిత్రవిచిత్రితమ్ ।
తత్రాష్టాదశ ధాన్యాని వాపయేత్తదనంతరమ్ ॥ 69

పుష్పవృక్షాంచ్ఛుభాంస్తత్ర వాపయేత్సర్వతస్తతః ।
జలయంత్రాణి కార్యాణి చిత్రాణ్యపి విలేఖయేత్ ॥ 70

తుర్యద్వారాణి కార్యాణి పూర్వవన్మండపాదికమ్ ।
యథా శ్రీరామపూజాయాముక్తం తద్వత్రప్రకారయేత్ ॥ 71

దుర్గోపరి ఘటం స్థాప్య సజలం పుష్పగుంఫితమ్ ।
దోళకం చ తతో న్యస్య ఘటపృష్ఠే మహచ్ఛుభమ్ ॥ 72

కాంచనీం రాజతీం మూర్తి సీతాయాః పరికల్ప్య చ ।
రామస్యాపి శుభాం మూర్తిం కృత్వా తౌ పూజయేత్తతః ॥ 73

దోళకోపరి సంస్థాప్య మాసమేకం ప్రపూజయేత్ ।
కేచిచ్ఛిష్యాత్ర పార్వత్యా శివేన చ ప్రపూజనమ్ ॥ 74

వదంతి మునయస్తత్ర నిర్ణయం శృణు వక్ష్యతే ।
రామస్య హృదయం శంభుః శ్రీరామో హృదయం స్మృతః ॥ 75

శంకరస్య తథా గౌరీహృదయం జానకీ స్మృతా ।
జానక్యా హృదయం గౌరీ శివా నైవాంతరం కదా ॥ 76

**రామస్య చ శివస్యాపి సీతాగిరిజయోస్తథా ।**
**యే మానయంతి వై భేదం తేషాం వాసస్తు రౌరవే ॥ 77**

**అతశ్చైత్రతృతీయాయాం సీతారామౌ ప్రపూజయేత్ ।**
**అశక్తౌ తామ్రజే మూర్తీ కార్యే వా కాష్ఠనిర్మితే ॥ 78**

**పాషాణనిర్మితే చాపి మూర్తీ కార్యే యథాసుఖమ్ ।**
**ప్రత్యహం మంగళద్రవ్యైః సర్వస్త్రీభిః ప్రపూజయేత్ ॥ 79**

**మాసమేకం తు నారీభిః స్నానం హి సీతలాభిధమ్ ।**
**అవశ్యమేవ కర్తవ్యం సీతాతీర్థే విశేషతః ॥ 80**

## అక్షయతృతీయ మహిమ.

చైత్రశుక్ల తృతీయనాడు, సకల మంగళ ద్రవ్యములతో ముఖ్యముగా దవనముతోను సీతారాములను అర్చింపవలయును. మరియు ఆ వసంత తృతీయలలో డోలోత్సవము చేయవలయును. స్త్రీలు సౌమంగళ్యమునకై సౌభాగ్య శయనోత్సవము ఒనరించునది. ఇది పుత్రప్రదము. ఇచ్చట విశేష మేమనిన, చైత్రశుక్ల తృతీయమున స్త్రీలుస్నానముచేసి, చిత్రమగు నాలుగు ద్వారములుగల మట్టికోటను రచించి అందు పూలచెట్లను పెట్టి, ముగ్గులువేసి, జలయంత్రములనుంచి, మునుపటివలె శ్రీరామ పూజామంటపాది రచనచేసి దానిపై పుష్పాలంకృత పూర్ణకుంభమును స్థాపించి, దాని మూలమున అందలము(దిమ్మె)గట్టి, దానిలో, కలశమూలమున బంగారముతో చేసిన సీతారామ మూర్తులను స్థాపించి, ఒకనెల పూజించునది. అందు గౌరీశంకర మూర్తులనూ కొందరు ఆరాధించెదరు. ఇచ్చట మునులు చెప్పిన తత్త్వనిర్ణయమును వినుము.

రాముని హృదయమే శివుడు, శివుని హృదయమే రాముడు. గౌరికి హృదయమే సీత, సీతకు హృదయమే గౌరి. అనిన ఏకాత్ములనుట. కావున శివ–రాముల యందు, గౌరీ–సీతలయందు భేదములేదు. భేదమునుంచేవారు నరకమునందెదరు. కావున సీతా రాములను చైత్రశుక్ల తృతీయ నాడు బంగారు, వెండి మూర్తులకు శక్తిలేనిచో రాగియందు కొయ్యతో శిలవరకు ఎట్లు సందర్శించిన నట్లు బింబముల నేర్పరచికొని నిత్యము స్త్రీలు పూజింపవచ్చును.

**యత్ర యత్ర రామతీర్థం తస్య వామేఽవనీతలే ।**
**సీతాతీర్థం తత్ర తత్ర జ్ఞేయం సీతాకృతం శుభమ్ ॥ 81**

చైత్రశుక్లతృతీయాయామారభ్యాక్షయ్యసంజ్ఞితా ।
యావత్తృతీయా వైశాఖశుక్లా తావన్నిరంతరమ్ ॥ 82

సీతలాసంజ్ఞకం స్నానం స్త్రీభిః సీతార్థమాచరేత్ ।
చైత్రశుద్ధతృతీయాయామ్ అక్షయ్యాయాం తథాపి చ ॥ 83

తృతీయాయాం తు నారీభిస్తైలాభ్యంగం ప్రకారయేత్ ।
అన్యత్ర దివసే స్త్రీభిస్తైలాభ్యంగం న కారయేత్ ॥ 84

ప్రత్యహం చోత్సవాః కార్యాః సీతాయాః పురతః శుభాః ।
సువాసినీపూజనం చ కార్యం భక్త్యా దినే దినే ॥ 85

సువాసినీనాం దేయాని వాయనాని శుభాని చ ।
నిరంతరం పూజనార్థం యది శక్తిర్న వర్తతే ॥ 86

తదా కార్యం చైకదినే సుభగానాం ప్రపూజనమ్ ।
సువాసినీనాం దేయం హి ప్రత్యహం భోజనం వరమ్ ॥ 87

నానాపక్వాన్నసంయుక్తం ఘృతపాయససంయుతమ్ ।
అలంకారాశ్చ వస్త్రాణి కంచుక్యాది చ యచ్ఛుభమ్ ॥ 88

భర్తురాయుష్యవృద్ధ్యర్థం నారీభిర్దేయముత్తమమ్ ।
ఏవం స్నాత్వా మాసమాత్రం సీతలాస్నానముత్తమమ్ ॥ 89

అక్షయ్యాయాం తృతీయాయాం పూజయిత్వా విశేషతః ।
త్రింశత్సువాసినీభ్యశ్చ దాతవ్యం భోజనాదికమ్ ॥ 90

గురుపత్నీం నిజాం పూజ్య తస్యై సర్వం విసర్జయేత్ ।
ఏవం స్త్రీణాం వ్రతం ప్రోక్తం మాసమాత్రం ద్విజోత్తమ ॥ 91

అన్యద్విశేషం వక్ష్యామి తవాగ్రే శృణు చోత్తమమ్ ।
అశోకకలికాభిస్తు చైత్రశుక్లాష్టమీదినే ॥ 92

సీతారామౌ పూజయిత్వా మహామంగళపూర్వకమ్ ।
అశోకకలికాశ్చాష్టౌ యే పిబంతి పునర్వసౌ ॥ 93

**చైత్రే మాసి సితాష్టమ్యాం న తే శోకమవాప్నుయుః ।**
**త్వామశోకకరాభీష్టం మధుమాససముద్భవమ్ ॥ 94**

**పిబామి శోకసంతప్తో మామశోకం సదా కురు ।**
**పునర్వసుబుధోపేతాం చైత్రే మాసి సితాష్టమీమ్ ॥ 95**

రామతీర్థమునకు ఎడమభాగమున ఉండునది సీతాతీర్థము. సీతాతీర్థ స్నానము మేలు. ఇందు చైత్రశుక్ల తృతీయ మొదలు వైశాఖశుక్ల తృతీయ వరకు ఒకనెలపాటు స్త్రీలు స్నానవ్రత మాచరించవలె. ఇదియే సీతాతీర్థస్నానము. అందు చైత్రశుక్ల తృతీయనాడు అభ్యంగము, తక్కినరోజులలో కూడదు. సీతాదేవి యెదుట నిత్యోత్సవము, సువాసినీ పూజనము కార్యము. సాలంకార వాయనదాన పూర్వక సువాసినీ భోజనము నెలరోజులు చేయవలెను. శక్తి లేనిచో ఒకనాడైననుచేయునది, చివరలో పురోహిత పత్నికి అంతటిని అర్పించునది. ఈ యక్షయ తృతీయా సీతలాస్నాన మాసవ్రతమును స్త్రీలు పతులకు ఆయుర్వృద్ధికై చేయవలెను. (91)

## అశోకాష్టమి, శ్రీరామనవమి వ్రతమహిమ

చైత్రశుక్ల అష్టమి నాడు అశోక కలికలచే సీతారాములను అర్చించి ఎనిమిది మామిడి చిగుళ్లను ప్రాశనము చేయువారు శోకముపొందరు. అందు పునర్వసు కూడ చేరియుండిన అధికఫలదము.

**ప్రాతస్తు విధివత్స్నాత్వా వాజపేయఫలం లభేత్ ।**
**చైత్రే నవమ్యాం ప్రాక్పక్షే దివా పుణ్యే పునర్వసౌ ॥ 96**

**ఉదయే గురుగౌరాంశ్వోః స్వోచ్చస్థే గ్రహపంచకే ।**
**మేషే పూషణి సంప్రాప్తే లగ్నే కర్కటకాహ్వయే ॥ 97**

**ఆవిరాసీన్మహావిష్ణుః కౌసల్యాయాం పరః పుమాన్ ।**
**తస్మిన్దినే తు కర్తవ్యముపవాసవ్రతం నరైః ॥ 98**

**తత్ర జాగరణం కుర్యాద్రఘునాథపురే జనైః ।**
**చైత్రశుద్ధా తు నవమీ పునర్వసుయుతా యది ॥ 99**

**సైవ మధ్యాహ్నయోగేన మహాపుణ్యతమా భవేత్ ।**
**కేవలాపి సదోపోష్యా నవమీశబ్దసంగ్రహాత్ ॥ 100**

తస్మాత్ సర్వాత్మనా సర్వైః కార్యం వై నవమీవ్రతమ్ ।
శ్రీరామనవమీ ప్రోక్తా కోటిసూర్యగ్రహాధికా ॥ 101

ఉపోషణం జాగరణం పితౄనుద్దిశ్య తర్పణమ్ ।
తస్మిన్ దినే తు కర్తవ్యం బ్రహ్మప్రాప్తిమభీప్సుభిః ॥ 102

సర్వేషామప్యయం ధర్మో భుక్తిముక్త్యైకసాధనః ।
అశుచిర్వాపి పాపిష్ఠః కృత్వేదం వ్రతముత్తమమ్ ॥ 103

పూజ్యః స్యాత్సర్వభూతానాం యథా రామస్తథైవ సః ।
యస్తు రామనవమ్యాం వై భుంక్తే మోహాత్తు మూఢధీః ॥ 104

కుంభీపాకేషు ఘోరేషు పచ్యతే నాత్ర సంశయః ।
అకృత్వా రామనవమీవ్రతం సర్వవ్రతోత్తమమ్ ॥ 105

వ్రతాన్యన్యాని కురుతే న తేషాం ఫలభాగ్భవేత్ ।
ఆచార్యం చైవ సంపూజ్య శృణుయాత్ప్రార్థయేన్నిశి ॥ 106

శ్రీరామప్రతిమాదానం కరిష్యేఽహం ద్విజోత్తమ ।
భక్త్యాచార్య భవ ప్రీతః శ్రీరామోఽసి త్వమేవ చ ॥ 107

స్వగృహే చోత్తమే దేశే దానస్యోజ్జ్వలమండపమ్ ।
శంఖచక్రహనూమద్భిః ప్రాగ్ద్వారే సమలంకృతమ్ ॥ 108

గరుత్మచ్ఛార్ఙ్గబాణైశ్చ దక్షిణే సమలంకృతమ్ ।
గదాఖడ్గాంగదైశ్చైవ పశ్చిమే సువిభూషితమ్ ॥ 109

పద్మస్వస్తికనీలైశ్చ కౌబేరే సమలంకృతమ్ ।
మధ్యే హస్తచతుష్కాట్యం వేదికాయుక్తమాయతమ్ ॥ 110

అష్టోత్తరసహస్రైశ్చ రామలింగాత్మకం శుభమ్ ।
ఆస్తీర్య రామతోభద్రం వేదికాయామనుత్తమమ్ ॥ 111

చైత్రశుక్ల అష్టమినాటి ప్రాతఃస్నానము వాజపేయ యాగఫలదము. "త్వామశోక ......... నకురు" అను (94,95)శ్లోకము ప్రాశన మంత్రము. ఇక చైత్రశుక్ల పునర్వసూ నక్షత్రము, మధ్యాహ్నమున కర్కాటక లగ్నమున గురు చంద్రులుండగా, ఐదుమంది తారాగ్రహములు ఉచ్చస్థితిలో ఉండగా, రవి మేషమునెక్కియుండగా, శ్రీమహావిష్ణువు కౌసల్యయందు అవతరించెను. ఆ రోజు నరులు ఉపవాసముతో చేసిన పితృతర్పణము బ్రహ్మప్రాప్తినిచ్చును. సీతారాములను అర్చించి, యెదుట జాగరవ్రత మాచరింపవలయును. సామాన్య నవమియే ఉపవాసదినము. చైత్ర శుక్ల నవమి, పునర్వసు మధ్యాహ్నమున చేరి వచ్చినది కోటిసూర్యగ్రహణ సమానము. ఇది ముఖ్య వ్రతము. పాపి దీనినైనను చేసితే శుద్ధుడగును. రామనవమినాడు భుజించువాడు కుంభీపాక నరకమునందును. ఈ వ్రతము విడిచి మఱియేవ్రతమాచరించినను ఫలములేదు. ఈవ్రతముచే రామునివలె సకలభూతములచే పూజ్యుడగును. ఆచార్యుని వరించి, వారివలన రామకథను విని "స్వామీ గురుమూర్తీ! రామప్రతిమా దానమును ఒసంగెద. శ్రీరామస్వరూపులు మీరు తృప్తులగుదురుగాక," అని ఆరాత్రి ప్రార్థించి, తన గృహమున– హనుమత్ శంఖ చక్రాంకిత ప్రాగ్ద్వారమును, గరుడ శార్ఙ్గ బాణకలిత దక్షిణ ద్వారమును, అంగద గదా ఖడ్గాలంకృత పశ్చిమద్వారమును, కమలస్వస్తిక నాళమండిత ఉత్తర ద్వారమును, నడుమ 1008 రామలింగాత్మకమగు రామతోభద్రమునుగల మంటపమును రచించి, ...

**తతః సంకల్పయేదేవం రామమేవ స్మరన్ ద్విజ ।**
**అస్యాం రామనవమ్యాం చ రామారాధనతత్పరః ॥ 112**

**ఉపోష్యాష్టసు యామేషు పూజయిత్వా యథావిధి ।**
**ఇమాం స్వర్ణమయీం రామప్రతిమాం చ ప్రయత్నతః ॥ 113**

**శ్రీరామప్రీతయే దాస్యే రామభక్తాయ ధీమతే ।**
**ప్రీతో రామో హరత్వాశు పాపాని సుబహూని మే ॥ 114**

**అనేకజన్మసంసిద్ధాన్యభ్యస్తాని మహాంతి చ ।**
**తతః స్వర్ణమయీం రామప్రతిమాం పలమానతః ॥ 115**

**నిర్మితాం ద్విభుజాం దివ్యాం వామాంకస్థితజానకీమ్ ।**
**బిభ్రతీం దక్షిణకరే జ్ఞానముద్రాం మనోరమామ్ ॥ 116**

**వామేనాథః కరేణారారాద్దేవీమాలింగ్య సంస్థితామ్ ।**
**సింహాసనే రాజతే చ పలద్వయవినిర్మితే ॥ 117**

అశక్తో యో మహానత్ర స తు విత్తానుసారతః ।
పలేన వా తదర్ధేన తదర్ధార్ధేన వా పునః ॥ 118

సౌవర్ణం రాజతం వాపి కారయేద్రఘునందనమ్ ।
పార్శ్వే భరతశత్రుఘ్నౌ ధృతఛత్రకరావుభౌ ॥ 119

చాపద్వయసమాయుక్తం లక్ష్మణం చాపి కారయేత్ ।
మాతురంకగతం రామమింద్రనీలసమప్రభమ్ ॥ 120

పంచామృతస్నానపూర్వం సంపూజ్య విధివత్తతః ।
అశోకకుసుమైర్యుక్తమర్ఘ్యం దద్యాద్విచక్షణః ॥ 121

దశాననవధార్థాయ ధర్మసంస్థాపనాయ చ ।
రాక్షసానాం వినాశాయ దైత్యానాం నిధనాయ చ ॥ 122

పరిత్రాణాయ సాధూనాం జాతో రామః స్వయం హరిః ।
గృహాణార్ఘ్యం మయా దత్తం భ్రాతృభిః సహితోఽనఘ ॥ 123

దివైవం విధివత్కృత్వా రాత్రౌ జాగరణం చరేత్ ।
తతః ప్రాతః సముత్థాయ స్నానసంధ్యాదికాః క్రియాః ॥ 124

సమాప్య విధివద్రామం పూజయేద్విధివన్మునే ।
తతో హోమం ప్రకుర్వీత మూలమంత్రేణ మంత్రవిత్ ॥ 125

పూర్వోక్తమండపే కుండే స్థండిలే వా సమాహితః ।
లౌకికాగ్నౌ విధానేన శతమష్టోత్తరం శనైః ॥ 126

సాజ్యేన పాయసేనైవ స్మరన్ రామమనన్యధీః ।
తతో భక్త్యా సుసంతోష్య హ్యాచార్యం పూజయేద్ద్విజః ॥ 127

తతో రామం స్మరన్ దద్యాదేవం మంత్రముదీరయన్ ।
ఇమాం స్వర్ణమయీం రామప్రతిమాం సమలంకృతామ్ ॥ 128

చిత్రవస్త్రయుగచ్ఛన్నాం రామోఽహం రాఘవాయ తే ।
శ్రీరామప్రీతయే దాస్యే తుష్టో భవతు రాఘవః ॥ 129

**ఇతి దత్వా విధానేన దద్యాద్వై దక్షిణాం భువమ్ ।**
**బ్రహ్మహత్యాదిపాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః ॥ 130**

**ఏవం శిష్య చైత్రేమాసే నవమ్యాం భూసురాయ హి ।**
**దానం దేయం రాఘవస్య రామసంతుష్టిహేతవే ॥ 131**

"నేడు ఉపవాసవ్రతముచేసి శ్రీరామ స్వర్ణప్రతిమను దానము చేసెదను, శ్రీరాముడు తృప్తుడై జన్మజన్మాంతర దురితకోటిని పరిహరించి ఉద్ధరించుగాక!" అని సంకల్పించి; పలపరిమాణ సువర్ణముతో ఎడమతొడపై సీతగల ద్విభుజ రామమూర్తిని చేయించి పెట్టుకొని, 2 పలముల సింహాసనమును ఇచ్చి పూజించునది. అంత శక్తిలేనివాడు తన శక్త్యానుసారము బంగారమో, వెండియో దేనితోనైనను పలము, అరపలము, అందులోసగము ఇట్లు చేయించుకొనవచ్చును. శస్త్రధారులగు భరత, శత్రుఘ్ను లిరువైపులలోను, రెండుధనుస్సులుగల లక్ష్మణమూర్తియు ఉండవలెను. తల్లి తొడపై యింద్రనీల నిభుడై ఒప్పు శ్రీరామమూర్తి పంచామృత స్నానపూర్వకముగా పూజింపవలెను. పిదప అశోక కలికల తోడ 122, 123 శ్లోకములను చెప్పి, అర్ఘ్యమర్పించునది. ఇట్లు విధివిధానముగా పగలు పూజించి, రాత్రిజాగరణముచేసి, మరునాడు ప్రొద్దున నిత్యకర్మానంతరము, శ్రీరాముని ఆరాధించి, ఇంతకు మునుపు చెప్పబడినట్లు మంటపమున లౌకికాగ్నియందు శ్రీరామ మూల మంత్రముచే, నేతితో గాని, పాయసముతో గాని 108 హోమముచేసి, ఆచార్యుని భక్తితో పూజించి, శ్రీరామతత్పరుడై, "ఇమాం స్వర్ణమయీం ...(శ్లో॥128) అను శ్లోకముజెప్పి, శ్రీరామమూర్తి దానము నొసంగవలయును. పిదప భూదాన దక్షిణనీయవలెను. దీనిచే బ్రహ్మహత్యాది మహాపాపములు నశించును. ఇది శ్రీరామప్రీతికర మహావ్రతము. (131)

**అన్యద్విశేషం వక్ష్యామి చైత్రే మాసి శృణుష్వ తత్ ।**
**చైత్రస్య శుక్లైకాదశ్యాం దోలకస్థం రఘూత్తమమ్ ॥ 132**

**పూజయేన్మానవో భక్త్యా ఆమ్రవృక్షతలే స్థితమ్ ।**
**చైత్రమాసస్య శుక్లాయామేకాదశ్యాం తు వైష్ణవైః ॥ 133**

**ఆందోలనీయో దేవేశః సలక్ష్మీకో మహోత్సవైః ।**
**ద్వాదశ్యాం చైత్రమాసస్య శుక్లాయాం దమనోత్సవః ॥ 134**

**బోధాయనాదిభి ప్రోక్తః కర్తవ్యః ప్రతివత్సరమ్ ।**
**ఊర్జే వ్రతం మధౌ దోలా శ్రావణే తంతుపూజనమ్ ।**
**చైత్రే చ దమనారోపమకుర్వాణో వ్రజత్యధః । 135**

వహ్నిర్విరించో గిరిజా గణేశః
ఫణీ విశాఖో దినకృన్మహేశః ।
దుర్గాఽంతకో విశ్వహరిః స్మరశ్చ
శర్వః శశీ వై తిథిషు ప్రపూజ్యాః ॥ **136**

అథ చైత్రపౌర్ణిమాయాం భక్త్యా రామం ప్రపూజయేత్ ।
సీతయా దోళకస్థం వై దమనేన మహోత్సవైః ॥ **137**

చైత్రీ చిత్రాయుతా చేత్స్యాత్ తదా పుణ్య మహాతిథిః ।
జ్ఞేయా సర్వాధికా సా హి స్నానదానజపాదిషు ॥ **138**

స్త్రీభిర్దేయం చిత్రవస్త్రం తస్యాం సౌభాగ్యదాయకమ్ ।
సీతారామౌ చిత్రవస్త్రైః పూజనీయౌ మహోత్సవైః ॥ **139**

మందే వార్కే గురౌ వాపి వారేష్వేతేషు చైత్రికా ।
తత్రాశ్వమేధజం పుణ్యం స్నానశ్రాద్ధాదిభిర్లభేత్ ॥ **140**

సంవత్సరకృతాచార్యః సాఫల్యాయాఖిలాన్ సురాన్ ।
దమనేనార్చయేచ్చైత్ర్యాం విశేషేణ రఘూత్తమమ్ ॥ **141**

చైత్రస్నానోద్యాపనం చ తిథౌ తస్యాం స్మృతం బుధైః । **142**

## చైత్రమున దమనోత్సవ, ఆందోళనోత్సవములు.

మరియొక విశేషము, చైత్రశుద్ధ శుక్లఏకాదశినాడు మామిడిచెట్టు క్రింద సీతారాములకు అందల(ఊంజల)సేవ చేయవలయును. దీనిని బోధాయనాదులు చైత్రశుక్ల ద్వాదశి నాడు దమనోత్సవమని విధించిరి. అదియును ప్రతివత్సరము తప్పనిసరిగ చేయాలి. కార్తీకమున వ్రతమును, చైత్రమున డోలోత్సవమును, శ్రావణమున తంతు(వస్త్ర)పూజనమును, మఱియు చైత్రమున దమనోత్సవమును చేయనివాడు అధమగతి నందును. అగ్ని, బ్రహ్మ, గౌరీ, గణేశ, నాగ, కుమార, సూర్య, శివ, దుర్గా, యమ, విశ్వ (సమస్త దేవతలును–విశ్వేదేవతలని కొందరందురు) విష్ణు, మన్మథ, శివ, చంద్రులు, వరుసగా ప్రతిపదమొదలు పౌర్ణమివరకు తిథులలో ప్రపూజ్యులైయుందురు. ఇక చైత్రశుద్ధ పౌర్ణమిన సీతారాములకు దమన, డోలకా మహోత్సవము. అందు చిత్తా నక్షత్రము చేరినచో స్నాన, దాన, జపాదులకు మహాపుణ్యము. సౌభాగ్యకరముగా నాడు స్త్రీలు చిత్రవస్త్రదానము

చేయవలె. అదేవిధముగా సీతారాములను పూజించునది. నాడు రవి, గురు, శనివారములలో ఒకటి చేరెనా నాటి స్నాన, శ్రాద్ధాదులు అశ్వమేధ ఫలదములు. సంవత్సర పూజాఫలసిద్ధికై సకల దేవతలకు దమనోత్సవము ముఖ్యము. శ్రీరామునికి మిక్కిలి విశేషము. చైత్ర స్నాన ఉద్యాపనమును ఆనాడేయని బుధులు అందురు.

అథ వైశాఖకృష్ణాయాం పంచమ్యాం పరమోత్సవైః ॥
సీతారామౌ ప్రపూజ్యాథ దోళకస్థౌ తు బంధుభిః ॥ **143**

ఉద్యాపనం తత్ర కార్యం మహాఫలమభీప్సునా ।
వైశాఖే కృష్ణపక్షే తు చతుర్థ్యాం సముపోష్య చ ॥ **144**

నిశాయాం చ ప్రకర్తవ్యమధివాసనముత్తమమ్ ।
శుచౌ దేశే మండపాది కృత్వా పూర్వోక్తవచ్ఛుభమ్ ॥ **145**

రామలింగాత్మకే భద్రే ధాన్యరాశౌ మహత్తమమ్ ।
సజలం కలశం స్థాప్య తామ్ర పాత్రం తు తన్ముఖే ॥ **146**

స్థాప్య వస్త్రే దోళకస్థం రామచంద్రం ప్రపూజయేత్ ।
హైమో వా రజతో వాపి దోళకస్త్రిపలైః స్మృతః ॥ **147**

హైమీ పలమితా రామమూర్తిః కార్యా మనోరమా ।
తావన్మితా రుక్మమూర్తిః సీతాయాశ్చాపి కారయేత్ ॥ **148**

నానోపచారైః సంపూజ్య రాత్రౌ జాగరణం చరేత్ ।
నృత్యగీతమంగళాద్యైః పురాణశ్రవణాదిభిః ॥ **149**

ప్రభాతే తం పునః పూజ్యం రామం సీతాసమన్వితమ్ ।
సహస్రం హవనం కార్యం తిలాజ్యపాయసాదినా ॥ **150**

తర్పణం రామమంత్రేణ క్షీరేణైవ ప్రకారయేత్ ।
తతో గురుం సపత్నీకం సంపూజ్య వసనాదిభిః ॥ **151**

రామాయ ప్రార్థయేద్భక్త్యా ప్రబద్ధకరసంపుటః ।
సార్ధమాసద్వయం రామ వసంతే తవ పూజనమ్ ॥ **152**

దోళకస్థస్య జానక్యా యథాశక్త్యా మయా కృతమ్ ।
ప్రసీదానేన శ్రీరామ మాముద్ధర భవార్ణవాత్ ॥ 153

ఏవం సంప్రార్థ్య శ్రీరామం తామర్చాం మూర్తిసంయుతామ్ ।
దద్యాత్స్వగురవే భక్త్యా తం ప్రణమ్య పునః పునః ॥ 154

పంచసప్తతియుగ్మాని హ్యష్టావింశన్మితాని వా ।
తదర్థాన్యథవా శక్త్యా భోజయేద్గురుణా సుఖమ్ ॥ 155

తతః స్వయం సుహృన్మిత్రైః కార్యం వై భోజనం సుఖమ్ ।
అశక్తోఽపి యథాశక్త్యా వ్రతమేతత్తు సర్వదా ॥ 156

కరోతు రామతుష్ట్యర్థం వసంత పూజనం వరమ్ ।
ఏవం శిష్య త్వయా పృష్టం విశేషేణ చ పూజనమ్ ॥ 157

సీతారామస్య తత్ప్రోక్తం దోళకస్థస్య తే మయా ।
విష్ణుదాస ఉవాచ
గురో తే ప్రష్టుమిచ్ఛామి యత్త్వం వద సవిస్తరాత్ ॥ 158

ఇక వైశాఖ కృష్ణ పంచమినాడు పెద్దపెద్ద కోరికలను తీర్చుకోదలచిన వారు సీతారామ డోలోత్సవ వ్రతోద్యాపనమును చేయవచ్చును.

తద్విధానము కలశ, వస్త్ర, ప్రతిమామూర్తి దాన, జప, హోమ, తర్పణ, బ్రాహ్మణ భోజన, గురుపూజన పురస్సరముగా ముందు అధ్యాయములో చెప్పిన విధముగా చేయవచ్చును.

"శ్లో. 152. సార్ధమాస.... అనునిది శ్రీరామప్రార్థన మంత్రము. ఇట్లు ఉద్యాపనచేసి, గురుపూజ అనంతరము తాను స్వజనులతో భుజించి, సుఖించునది. ఇందుచే శ్రీరాముడు సుప్రీతుడగు. (157).

కయా కామనయా కస్య కార్యం పూజనముత్తమమ్ ।
తత్సర్వం కథయస్వాద్య మయి కృత్వా పరాం కృపామ్ ॥ 159

రామదాస ఉవాచ
సమ్యక్ పృష్టం త్వయా వత్స సావధానమనాః శృణు ।
బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిమ్ ॥ 160

ఇంద్రమింద్రియకామస్తు ప్రజాకామః ప్రజాపతీన్ ।
దేవీం మాయాం తు శ్రీకామస్తేజస్కామో విభావసుమ్ ॥ 161

వసుకామో వసూన్ రుద్రాన్ వీర్యకామోఽథ వీర్యవాన్ ।
అన్నాదికామస్త్వదితిం స్వర్గకామోఽదితేః సుతాన్ ॥ 162

విశ్వాన్ దేవాన్ రాజ్యకామః సాధ్యాన్ సంసాధకో విశామ్ ।
ఆయుష్కామోఽశ్వినౌ దేవౌ పుష్టికామ ఇలాం యజేత్ ॥ 163

ప్రతిష్ఠాకామః పురుషో రోదసీ లోకమాతరౌ ।
రూపాభికామో గంధర్వాన్ స్త్రీ కామోప్సర ఊర్వశీమ్ ॥ 164

అధిపత్యకామః సర్వేషాం యజేత పరమేష్టినమ్ ।
యజ్ఞం యజేద్యశస్కామః కోశకామః ప్రచేతసమ్ ॥ 165

విద్యాకామస్తు గిరిశం దాంపత్యార్థముమాం సతీమ్ ।
ధర్మార్థ ఉత్తమశ్లోకం తంతు తన్వన్ పితౄన్ యజేత్ ॥ 166

రక్షా కామః పుణ్యజనానోజస్కామో మరుద్గణాన్ ।
రాజ్యకామో మనూన్దేవాన్ నిర్ఋతిం త్వభిచర్యజేత్ ॥ 167

కామకామోయజేత్సోమ మకామః పురుషం పరమ్ ।
అకామః సర్వకామో వా మోక్షకామ ఉదారధీః ॥ 168

తీవ్రేణ భక్తియోగేన యజేత రఘునందనమ్ ।
రామేణ సదృశో దేవో న భూతో న భవిష్యతి ॥ 169

తస్మాత్సర్వప్రయత్నేన రామచంద్రం ప్రపూజయేత్ ।
తస్యాద్యవర్ణసామర్థ్యవిద్వద్వస్త్వత్ర రాదికమ్ ॥ 170

పరం శ్రేష్ఠత్వమాపన్నం విస్తారేణ వదామ్యహమ్ ।
రుక్మం రత్నం రథో రామా రాక్షసో రజతం రజః ॥ 171

రక్షా రణో రమా రక్తం రజకో రాగరామతౌ ।
రాజా రోగో రవీ రాత్రీ రాజ్యం రజస్వలా తథా ॥ 172

**ఏవమాదీన్యనేకాని శ్రేష్ఠాన్యేవాత్ర భో ద్విజ ।**
**రుక్మం పీతం మహార్ఘం చ రత్నం రమ్యం సుదుర్లభమ్ ॥ 173**

## కోరికలునెరవేరుటకు దేవతారాధన

ఎప్పుడు ఏకోరికకై ఎవనిని పూజింపవచ్చును? దానిని నామీద దయగలిగి ఉపదేశింపుము అనిన విష్ణుదాసునికి శ్రీరామదాసు చెప్పుచున్నాడు.

బ్రహ్మవర్చసకాముడు బృహస్పతిని, ఇంద్రియకాముడు ఇంద్రుని, ప్రజాకాముడు ప్రజాపతిని, తేజస్కాముడు సూర్యుని, వసుకాముడు వసుదేవతలను, వీర్యకాముడు రుద్రులను, అన్నాదికాముడు అదితి దేవిని, స్వర్గకాముడు దేవతలను, రాజ్యకాముడు విశ్వేదేవతలను, జనవశ్యము కోరువాడు సాధ్యులను, ఆయుష్కాముడు అశ్వినీ దేవతలను, పుష్టికాముడు ఇలాదేవిని, ప్రతిష్ఠాకాముడు ద్యావాభూములను, సౌందర్యకాముడు గంధర్వులను, స్త్రీ కాముడు అప్సరసయగు ఊర్వశిని, సర్వాధిపత్యమును కోరువాడు పరమేష్ఠిని, కీర్తికోశకాముడు వరుణుని, విద్యాకాముడు శివునిని, దాంపత్యసుఖ కాముడు ఉమాదేవిని, ధర్మార్థుడు పితృదేవతలను, రక్షాకాముడు పుణ్యజనులను, ఓజస్కాముడు మరుత్తులను, రాజ్యకాముడు మనుదేవతలను, అభిచారికుడు నిర్ఋతిని, కామాభిలాషి సోమదేవునిని, నిష్కాముడు పరమాత్మను ఉద్దేశించి యజ్ఞము చేయుటచే ఆరాధించదగును. మోక్షకాముడగు ఉదారుడే అకాముడు. (167)

## శ్రీరామ నామ మాహాత్మ్యము

మరి సర్వకాముడు తీవ్రభక్తియోగముచే శ్రీరామచంద్రస్వామిని ఆరాధించవలెను. రామునికి సమానమగు దైవము ఎప్పటికినిలేదు. కావున సర్వప్రయత్నముతో రాముని భజింపుడు. అందాది వర్ణమగు రేఫతో ఆరంభమగు వస్తువులన్నియు శ్రేష్ఠతనందినవి.

రుక్మము= బంగారు, రత్నము మహార్ఘములు. రథము, యానశ్రేష్ఠము. రామా=సుందరి, లోక మంతయు దానివల్లనే రాక్షసులు దేవతలకే భయప్రదులు. రజతము మేలయినది. రజస్సు పరమాణువగుటచే నిత్యము. రక్ష అందరికి కావలెను. రణము జయకరము, రమా= సంపత్కరి. రక్తం= రక్తిమనిచ్చునది. రజకుడు నిర్మలకరుడు.

**రథో యానం వరిష్ఠం చ రామా యస్యా ఇదం జగత్ ।**
**రాక్షసో దేవభయదో రజతం తత్సుదుర్లభమ్ ॥ 174**

రజః సాక్షాత్పరమాణుర్నిత్యః సోఽత్ర ప్రకీర్త్యతే ।
రక్షా రక్షాకరీ జ్ఞేయా రణో జయకరః స్మృతః ॥ 175

రమా సా దుర్లభా త్వత్ర రక్తోఽస్తి రక్తతా వరా ।
రజకో నిర్మలకరో రాగః ప్రీతిః సుఖప్రదాః ॥ 176

రామఠః శుద్ధిదోఽద్యస్య రుచిదశ్చ ప్రకీర్తితః ।
రాజ్యం సౌఖ్యకరం శ్రేష్ఠం పుత్రదా సా రజస్వలా ॥ 177

ఏవం యద్యద్రకారాద్యం తత్తచ్ఛ్రేష్ఠం భువి స్మృతమ్ ।
రామాద్యవర్ణసామర్థ్యాత్ విష్ణుదాస మయేరితమ్ ॥ 178

అన్యచ్ఛిష్య శృణుష్వ త్వం యన్మయా కథ్యతే తవ ।
యథా ప్రోక్తా రామనామముద్రా తవ మయా శుభా ॥ 179

తథా నాన్యస్య దేవస్య నామముద్రా ప్రజాయతే ।
రామనామ వినా నామముద్రికాయాం స్ఫుటాక్షరమ్ ॥ 180

న కదా దృశ్యతే స్పష్టమేతచ్చ మహదద్భుతమ్ ।
అత్ర ప్రభావో రామస్య త్వం విద్ధి ద్విజపుంగవ ॥ 181

అతఏవ రామనామ కాశ్యాం విశ్వేశ్వరః సదా ।
స్వయం జప్త్వోపదిశతి జంతూనాం ముక్తిహేతవే ॥ 182

సంసారార్ణవసంమగ్నం నరం యస్తారయేన్మనుః ।
స ఏవ తారకస్త్వత్ర రామమంత్రః ప్రకథ్యతే ॥ 183

తారకాఖ్యస్త్వయం రామనామమంత్రో న చేతరః ।
అత ఏవాంతకాలేఽపి మర్తుకామనరస్య చ ॥ 184

కర్ణే సర్వత్ర దేవేశ రామనామోపదిశ్యతే ।
అంతకాలే నృణాం రామస్మరణం చ ముహుర్ముహుః ॥ 185

ఇతి కుర్వంత్యుపదేశం మానవా ముక్తిహేతవే ।
అన్యచ్చాపి శవవాహైః సదా లోకైర్ముహుర్ముహుః ॥ 186

**రామనామైవ ముక్త్యర్థం శవస్య పథి కీర్త్యతే ।**
**రామనామ్నః పరో మంత్రో న భూతో న భవిష్యతి ॥ 187**

రాగము, ప్రీతి, సుఖప్రదము, రామతము ఉప్పు రుచికారీ. రాజ్యము శ్రేష్ఠము. రజస్వల పుత్రప్రద. రాత్రి విశ్రాంతినిచ్చునది, రవి లోకమునకే కన్ను, రాజీవము రవిప్రియము. మఱి లక్ష్మీమందిరము. కావున ఇట్లే రేఫాద్యము రామనామ అవయవజన్యము శోభావహము. ఇక మరి వినుము.

రామ నామ ముద్రవలె ఇక ఏముద్రయును స్ఫుటాక్షరమై శోభావహమై ఒప్పదు సుమీ! ఇచ్చట రామనామ ప్రభావమును నీవెరుగుదువు. కావున శ్రీవిశ్వేశుడు కాశిలో నీనామమును తాను జపించి, అందరికి ముక్తిప్రదముగా ఉపదేశించి ఉన్నాడు. సంసారసాగరమగ్నుని ఇది తరింప జేయుటచే నీనామమే తారకము. మఱి లోకులు మృతి కాలమున మొదలు, వాహకులు శవమును మోస్తూ కూడ నీనామమును ఉచ్చరించెదరు.

**రామనామ్నో జపో నిత్యం క్రియతే శంభునాపి చ ।**
**పార్వత్యా నారదేనాపి వాయుపుత్రాదిభిః సదా ॥ 188**

**రమయతి జనాన్ రామో రమతే వా సదాత్మని ।**
**రాక్షసానాం మారణాద్వా రామనామ మహత్తమమ్ ॥ 189**

**రసాతలాద్రకారో హి త్వకారోఽవనిసంభవః ।**
**మహర్లోకాన్మకారశ్చ త్రివర్ణాత్మకముచ్యతే ॥ 190**

**రకారేణ నిజం భక్తం భవాబ్ధేః పరిరక్షతి ।**
**అకారేణాతిసౌఖ్యం హి స్వభక్తస్య కరోతి యత్ ॥ 191**

**మనోరథాన్మకారేణ దదాతి స్వజనస్య యత్ ।**
**అథవా నిజభక్తస్య మరణాది ముహుర్ముహుః ॥ 192**

**నివారయతి తత్ శీఘ్రం రామనామ వరం తతః ।**
**అయమేవ సదా జప్యో రామేతి ద్వ్యక్షరో మనుః ॥ 193**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, అదికావ్యే మనోహరకాండే, విశేషకాలపరత్వేన పూజావిస్తారోనామ నవమః సర్గః ॥**

గౌరీ, శంకర, నారద, హనుమత్ ప్రభృతులీ రామనామమునే నిత్యము జపించెదరు. జనులను రమింప జేయుట చేతను, స్వాత్మయందు సంతతము రమించుటచేతను, రాక్షసమారణుడగుటచేతను రామనామము ఉత్తమము.

రసాతలమునుండి **'ర'** వర్ణము, అవనినుండి **'అ'** వర్ణము, మహర్లోకమునుండి **'మ'** వర్ణము చేరి, రామనామమయ్యె. ఈ నామము **'ర'** వర్ణము భక్తుని భవాబ్ధినుండి పరిరక్షించుచున్నది. భక్తునికి **'అ'** కారము సుఖమునుచేయును. **'మ'** కారము భక్తుల మనోరథములు ఈడేర్చును. మరియు భక్తులకు జనన, మరణములు పలుమార్లు లేకుండా నివారించును.

కావున సర్వశ్రేష్ఠమగు ఈ **'రామ'** అను రెండక్షరాల మంత్రము సంతతము జపించుకొనదగిన మంత్రము.

**శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని మనోహరకాండలో**
**విశేషకాలములలోచేయు పూజలను వివరించు 9వ సర్గ ముగిసినది.**

# దశమఃసర్గః-10వ సర్గ

## చైత్రమాస మహిమ

శ్రీరామదాస ఉవాచ

ఏవం శిష్య త్వయా పూర్వం యే యే ప్రశ్నాః కృతాః శుభాః ।
శ్రీరామవిషయే తే తే మయోక్తాః పరమాదరాత్ ॥ 1

ఇదానీం తే పునః శ్రోతుమిచ్ఛాఽస్తి తాం వదస్వ మామ్ ।
యద్యత్ పృచ్ఛసి భో వత్స తత్సర్వం తే వదామ్యహమ్ ॥ 2

శ్రీమహాదేవ ఉవాచ

ఏవం గురోర్వచః శ్రుత్వా విష్ణుదాసోఽబ్రవీత్పునః ।

విష్ణుదాస ఉవాచ

గురో త్వయాఽయోధ్యాయాం చైత్రమాసఫలం మహత్ ॥ 3

ప్రోక్తం తద్విస్తరేణాద్య కథయస్వ మమాంతికమ్ ।
కిం దానం కిం ఫలం తత్ర కముద్దిశ్య చరేద్వ్రతమ్ ॥ 4

కో విధిశ్చ కదారంభః సర్వం విస్తరతో వద ।
యత్సరయ్వాం రామతీర్థే స్నాతవ్యం చేతి కీర్తితమ్ ॥ 5

శ్రీరామదాస ఉవాచ

సాధు సాధు మహాప్రాజ్ఞ శుభః ప్రశ్నః కృతస్త్వయా ।
అధునా చైత్రమాసస్య మహిమా ప్రోచ్యతే మయా ॥ 6

మాసానాం ప్రథమో మాసశ్చైత్రమాసః ప్రకీర్త్యతే ।
మాతేవ సర్వజీవానాం సదైవేష్ట ఫలప్రదః ॥ 7

దానయజ్ఞ వ్రతసమః సర్వపాపప్రణాశనః ।
ధర్మసారః క్రియాసారస్తపః సారః సదాఽర్చితః ॥ 8

**విద్యానాం వేదవిద్యేవ మంత్రాణాం ప్రణవో యథా ।**
**భూరుహాణాం సురతరుర్ ధేనూనాం కామధేనువత్ ॥ 9**

**శేషవత్సర్వనాగానాం పక్షిణాం గరుడో యథా ।**
**దేవానాం తు యథా విష్ణుః వర్ణానాం బ్రాహ్మణో యథా ॥ 10**

**ప్రాణవత్ ప్రియవస్తూనాం భార్యేవ సుహృదాం యథా ।**
**ఆపగానాం యథా గంగా తేజసాం తు రవిర్యథా ॥ 11**

## శ్రీరాముని విభూతులు, చైత్రమాస ప్రాశస్త్యము

శ్రీరామదాసముని చెప్పుచున్నాడు, శిష్యా! ఇంకా ఏమి వినగోరెదవు అని అడుగగా,

విష్ణుదాసు, “గురుదేవా! చైత్రమాస దాన, ధర్మ, వ్రత ఫలములను వివరింపుము” విస్తరింపుము అని అడుగగా, రామదాసు ఇట్లు చెప్పుచున్నాడు అని గౌరీదేవితో పరమేశ్వరుడు చెప్పుచున్నాడు.

విష్ణుదాసా! చాలా చక్కగా ప్రశ్నించితివి. తపో, ధర్మ, కర్మ సారమును; దాన, యజ్ఞ, వ్రత తుల్యమును, దురిత పరిహారకమును, నిత్య ఇష్ట ఫలదాయకము అగు నెలలలో మొదటిదైన చైత్రమాసము సకలజీవులకు తల్లి వలెనున్నది.

విద్యలలో వేదవిద్య, మంత్రములలో ప్రణవము, వృక్షములలో కల్పవృక్షము, ఆవులలో కామధేనువు, సర్పములలో ఆదిశేషుడు, పక్షులలో గరుడుడు, దేవతలలో విష్ణువు, వర్ణములలో బ్రాహ్మణవర్ణము, ప్రియవస్తువులలో ప్రాణము, స్నేహితులలో ఇల్లాలు, నదులలో గంగ, తేజస్సులలో సూర్యుడు, ....

**ఆయుధానాం యథా వజ్రం ధాతూనాం కాంచనం యథా ।**
**వైష్ణవానాం యథా రుద్రో రత్నానాం కౌస్తుభో యథా ॥ 12**

**పుష్పేషు చ యథా పద్మం సరసాం మానసం యథా ।**
**మాసానాం ధర్మహేతూనాం చైత్రమాసస్తథా స్మృతః ।**
**నానేన సదృశో లోకే విష్ణుప్రీతివిధాయకః ॥ 13**

**చైత్రస్నానే చ నిరతే మీనే ప్రాగరుణోదయాత్ ।**
**లక్ష్మీసహాయో భగవాన్ ప్రీతిం తస్మిన్ కరోత్యలమ్ ॥ 14**

**జంతూనాం ప్రీణనం యద్వదన్నేనైవ హి జాయతే ।**
**తద్వచ్చైత్రే చ స్నానేన విష్ణుః ప్రీణాత్యసంశయః ॥ 15**

యశ్చైత్రస్నాననిరతాన్ జనాన్ దృష్ట్వాఽనుమోదతే ॥
తావతాఽపి విముక్తాఘో విష్ణోర్లోకే మహీయతే ॥ 16

సకృత్స్నాత్వా మీనసంస్థే సూర్యేప్రాతః కృతాహ్నికః ।
మహాపాపైర్విముక్తోఽసౌ విష్ణు సాయుజ్యమాప్నుయాత్ ॥ 17

స్నానార్థం చైత్రమాసే యః పాదమేక చలేద్యది ।
సోఽశ్వమేధాయుతానాం చ ఫలం ప్రాప్నోత్యసంశయః ॥ 18

అథవా కూటచిత్తస్తు కుర్యాత్సంకల్పమాత్రకమ్ ।
సోఽపి క్రతుశతం పుణ్యం లభత్యేవ న సంశయః ॥ 19

యో గచ్ఛేద్ధనురామాయం స్నాతుం మీనగతే రవౌ ।
సర్వబంధవినిర్ముక్తో విష్ణోః సాయుజ్యమాప్నుయాత్ ॥ 20

త్రైలోక్యే యాని తీర్థాని బ్రహ్మాండాంతర్గతాని చ ।
తాని సర్వాణి భో శిష్య సంతి బహ్మాజలేఽల్పకే ॥ 21

తావల్లిఖంతి పాపాని గర్జంతి యమశాసనే ।
యావన్న కురుతే జంతుః చైత్రే స్నానం జలాశయే ॥ 22

తీర్థాదిదేవతాః సర్వాః చైత్రే మాసి ద్విజోత్తమ ।
బహిర్జలం సమాశ్రిత్య సదా సన్నిహితాః శిశో ॥ 23

సూర్యోదయం సమారభ్య యావత్ షట్ ఘటికావధి ।
తిష్ఠంతి చాజ్ఞయా విష్ణోర్నరాణాం హితకామ్యయా ॥ 24

తత్రాప్యకుర్వతా స్నానం జ్ఞాపం దత్వా సుదారుణమ్ ।
స్వస్థానం యాంతి భో శిష్య తస్మాత్స్నానం సమాచరేత్ ॥ 25

న హి చైత్రసమో మాసో న కృతేన సమం యుగమ్ ।
న చ వేదసమం శాస్త్రం న తీర్థం గంగయా సమమ్ ॥ 26

న జలేన సమం దానం న సుఖం భార్యయా సమమ్ ।
న హి చైత్రసమం లోకే పవిత్రం కవయో విదుః ॥ 27

ఆయుధములలో వజ్రాయుధము, ధాతువులలో బంగారము, విష్ణుభక్తులలో రుద్రుడు, రత్నములలో కౌస్తుభము, పూలలో తామర, సరస్సులలో మానససరస్సు, ధర్మ కారణములగు మాసములలో చైత్రము ఉత్తమము. విష్ణు ప్రీతికరమగు దీనికి సాటి లేదు.

మీనమునందు రవియుండగా చైత్రస్నాన నిరతుని యందు సాక్షాత్ లక్ష్మీపతి సంతోషిస్తున్నాడు. ప్రాణికి అన్నమువల్ల ప్రీతికల్గునట్లు, చైత్రస్నానముచే హరికి ప్రీతికల్గును. స్నానము చేయువారిని చూచి సంతసించువాడు, స్నానముచేసి యాగము జేయువాడును విష్ణులోకమునందెదరు. చైత్ర స్నానమునకై అడుగిడినవాడు అశ్వమేధ ఫలముగలవాడు. కపటచిత్తుడు కూడా చైత్రస్నాన సంకల్పము చేతనే నూరుయజ్ఞముల ఫలమునందును. చైత్రస్నానమునకై బారెడు నడచినవాడు హరిసాయుజ్యము పొందును. ఆ కాలమున వెలుపటి కుంటలోగూడ ముల్లోకతీర్థములు కూడియుండును. ప్రొద్దున 6 గడియలవరకు తీర్థ దేవతలందరా బహిర్జలమున నివసించునట్లు విష్ణుమూర్తి ఆజ్ఞగలదు. అప్పుడును స్నానము చేయనివానిని అవి శపించి వెళ్ళిపోవును. చైత్రస్నానము ఎన్ని పాపములను హరించునో అన్నిటిని యేప్రాణియు చేయజాలదు. కావున మీన చైత్ర స్నానము శ్రేయస్కరము.

చైత్రమువంటి మాసము, కృతయుగమువంటి యుగము, వేదమువలెనుండు శాస్త్రము, గంగవంటి తీర్థము, జలదానమువంటి దానము, సతీసుఖము వంటి సౌఖ్యము, తీర్థమువంటి పవిత్రము, మరియొకటి లేనందున; ఈ చైత్రము విష్ణుమూర్తికి ప్రియమగు కాలమైయున్నది.

**తస్మాదయం చైత్రమాసః శేషశాయిప్రియః సదా ।**
**అవ్రతేన నయేద్యస్తు చాండాలశ్చ స జాయతే ॥ 28**

**యథా గృహం సర్వగుణోపపన్నం**
**పరిచ్ఛదైర్హీనమశోభతే తథా ।**
**యథైవ కన్యా సకలైస్తు లక్షణైః**
**యుక్తాఽపి జీవత్పతిలక్షణోజ్ఝితా ॥ 29**

**శాకం తు యద్వల్లవణేన హీనం**
**న శోభతే సర్వగుణోపపన్నమ్ ।**
**యథా లలామైశ్చ వినా సభా తైః**
**వస్త్రేణ హీనా లలనా చ శిష్య ॥**

**తథాఽన్యమాసేషు కృతో హి ధర్మః**
**చైత్రేణ హీనశ్చ వృథైవ యాతి ॥ 30**

తస్మాత్సర్వప్రయత్నేన యేన కేనాపి దేహినా ।
చైత్రమాసస్య యో ధర్మః కర్తవ్య ఇతి నిశ్చయః ॥ 31

న నందసూనోః పృథగస్తి రామో
న రామతోఽన్యో వసుదేవసూనుః ।
అతస్త్వయోధ్యాపురపాలకస్య
చైత్రే తు కార్యం విధివత్ప్రపూజనమ్ ॥ 32

జానకీకాంతముద్దిశ్య మీనసంస్థే దివాకరే ।
ప్రాతః స్నాత్వా జపేద్రామమన్యథా నరకం వ్రజేత్ ॥ 33

చైత్రమాసే హి సకలః సీతారాఘవదైవతః ।
యద్యత్కర్మ హి తత్సర్వం తముద్దిశ్య చరేన్నరః ॥ 34

జానకీకాంత హే రామ చైత్రే మీనగతే రవౌ ।
ప్రాతః స్నానం కరిష్యామి నిర్విఘ్నం కురు రాఘవ ॥ 35

చైత్రేఽద్య మీనగే భానౌ ప్రాతః స్నానపరాయణః ।
అర్ఘ్యం తేఽహం ప్రదాస్యామి గృహాణ రఘునాయక ॥ 36

గంగాద్యాః సరితః సర్వాస్తీర్థాని జలదా నదాః ।
ప్రతిగృహ్య మయా దత్తమర్ఘ్యం సమ్యక్ప్రసీదత ॥ 37

బ్రహ్మాద్యా దేవతాః సర్వా ఋషయో యే చ వైష్ణవాః ।
తే గృహ్ణంతు మయా దత్తం ప్రసీదన్త్వర్ఘ్యదానతః ॥ 38

ఋషభః పాపినాం శాస్తా యమ త్వం సమదర్శనః ।
గృహాణార్ఘ్యం మయా దత్తం యథోక్తఫలదో భవ ॥ 39

ఇతి చార్ఘ్యం సమర్ప్యాథ పశ్చాత్స్నానం సమాచరేత్ ।
వాససీ పరిధాయాథ కృత్వా కర్మాణి సర్వశః ॥ 40

జానకీకాంతమభ్యర్చ్య ప్రసూనైర్మధుసంభవైః ।
శ్రుత్వా రామకథాం దివ్యామేతన్మాసప్రశంసినీమ్ ॥ 41

**కోటిజన్మార్జితాత్పాపాన్ముక్తో మోక్షమవాప్నుయాత్ ।**
**చైత్రే యః కాంస్యభోజీ హి తథా చాశ్రుతసత్కథః ॥ 42**

చైత్ర స్నాన వ్రతమునాచరించనివాడు చండాలుడగును. ఎట్లు సకలగుణ పూర్ణమగు ఇల్లు పైకప్పులేక ప్రకాశించదో, సర్వలక్షణ సంపన్నురాలగు ఇల్లాలు పతిలేక శోభించదో, ఉప్పులేనికూర యెట్లు రుచించదో, చక్కగా అలంకరింపబడిన కన్య వస్త్రములు లేక యెట్లు వెలుగదో అట్లు ఇతర మాసములయందు చేసిన ధర్మములు చైత్రమాసమునందు వ్రతము చేయనిదే ఫలించవు. కావున నరునికి ఎట్లైనను సర్వ ప్రయత్నములతోను నిక్కముగా చైత్రమాసధర్మము కర్తవ్యము.

కృష్ణునికంటే రాముడు వేరుగాలేడు. రామునికంటే కృష్ణుడు వేరుగా లేడు. కావున అయోధ్యా నాథుని పూజను చైత్రమున చేయవలెను. మీన చైత్రమున రామోద్దేశముగా ప్రొద్దున స్నానముచేసి, జపనిరతుడు కావలెను. లేనిచో నరకమునందును. చైత్రమాసమునకు అధిదైవతములు సీతారాములు. చైత్రమున చేయు కర్మలన్నీ శ్రీరామునికి చెందును. శ్లో. 35 స్నానప్రార్థనామంత్రము, 36 రామార్ఘ్యము 37 గంగాది తీర్థదేవతార్ఘ్యము. 38 యమార్ఘ్యమంత్రము. ఇట్లు అర్ఘ్యములనిచ్చి, పిదప స్నానముచేసి, నిత్యకర్మానంతరము చైత్ర పుష్పములచే సీతాకాంతుని ఆరాధించి, చైత్ర మాసమును వర్ణించు శ్రీరామ కథను వినవలెను. ఈ విధముగా చేసినవాడు పూర్వజన్మపాపములను పోగొట్టుకొని ముక్తుడగును.

కంచుపాత్రలో భుజించువాడు, సత్కథలు విననివాడు, చైత్రస్నానము చేయనివాడు, దానమొసంగని వాడును నరకమునకుపోవును.

**న స్నాతశ్చాప్యదాతా చ నరకానేవ విందతి ।**
**యథా మాఘః ప్రయాగే హి స్నాతవ్యః పుణ్యమిచ్ఛతా ॥ 43**

**కార్తికోఽపి యథా కాశ్యాం పంచగంగాజలే స్మృతః ।**
**ద్వారకాయాం యథా ప్రోక్తో వైశాఖో మాధవప్రియః ॥ 44**

**అయోధ్యాయాం రామతీర్థే తథా చైత్రే ప్రకీర్తితః ।**
**ప్రయాగే మాసమాత్రేణ యత్ఫలం ప్రాప్యతే నరైః ॥ 45**

**అయోధ్యాయాం రామతీర్థే సకృత్స్నానేన తత్ఫలమ్ ।**
**వైశాఖద్వాదశభవం పుణ్యం యద్గోమతీజలే ॥ 46**

**తత్పుణ్యం శరయూతోయేఽయోధ్యాయాం ప్రాప్యతే నరైః ।**
**చైత్రే మాసి త్రిభిః స్నానైః రామతీర్థే న సంశయః ॥ 47**

కార్తికే పంచగంగాయాం యైః స్నాతం ద్వాదశాబ్దకమ్ ।
అయోధ్యాయాం రామతీర్థే చైత్రే పక్షేణ తత్ఫలమ్ ॥ **48**

అయోధ్యా దుర్లభా లోకే నరాణాం పాపకారిణామ్ ।
తావద్గర్జంతి పాపాని యావద్దృశ న సా పురీ ॥ **49**

అయోధ్యాయా యథాఽభావస్తదా రామకృతాని చ ।
జగత్యాం యాని తీర్థాని తత్ర స్నానం విధీయతామ్ ॥ **50**

యత్రాయోధ్యాపురీ నాస్తి స్నానార్థం సరయూర్న చ ।
రామతీర్థం న యత్రాస్తి తదా తీర్థేషు కారయేత్ ॥ **51**

సుఖము గోరువానికి ప్రయాగలో మాఘస్నానము, కార్తీకమున కాశీ పంచగంగా స్నానము, ద్వారకలో వైశాఖస్నానము, అయోధ్యలో రామతీర్థస్నానముచేయునట్లే; శ్రీరామప్రీతికై అంతట చైత్ర స్నానము కీర్తిదాయకము. అయోధ్యా రామతీర్థమునందొకమారు స్నానము ప్రయాగలోని మాసనియమ స్నాన ఫలమునిచ్చును. 12 వైశాఖములలో చేసిన గోమతీ నదీస్నాన ఫలము చైత్రమున అయోధ్యా రామతీర్థ స్నానములు మూడింటిచే గల్గును. 15 దినముల చైత్ర రామతీర్థ స్నానము 12 కార్తీకములలోని పంచగంగా స్నానఫలమునిచ్చును. పాపిష్ఠులకు లోకమున అయోధ్య దుర్లభము. అయోధ్యను చూడనంతవరకు పాపములు మ్రోగును. లోకమున ఎచ్చట రామతీర్థమనినను అయోధ్యయందు వలెనే భావన గలదు. గాన అచ్చోట స్నానము చేయదగును. (51)

తైలాభ్యంగం దివాస్వాపస్తథా వై కాంస్యభోజనమ్ ।
ఖట్వానిద్రా గృహే స్నానం నిషిద్ధస్య చ భక్షణమ్ ॥ **52**

చైత్రే తు వర్జయేదష్టౌ ద్విభుక్తం నక్తభోజనమ్ ।
చైత్రే మాసే తు మధ్యాహ్నే భ్రాంతానాం చ ద్విజన్మనామ్ ॥ **53**

పాదావనేజనం కుర్యాద్ వ్రతం తు వ్రతోత్తమమ్ ।
మార్గేఽధ్వగానాం యో మర్త్యః ప్రపాదానం చ చైత్రకే ॥ **54**

మార్గే ఛాయాం తు యః కుర్యాత్స స్వర్గే చ మహీయతే ।
సలిలం సలిలాకాంక్షీ ఛాయార్థీ ఛాయమిచ్ఛతి ॥ **55**

వ్యజనం వ్యజనాకాంక్షీ దానమేతత్తు చైత్రకే ।
జలం ఛత్రం తు వ్యజనం దానం మీనే విశిష్యతే ।
చైత్ర మాసే తు సంప్రాప్తే బ్రాహ్మణాయ కుటుంబినే ॥ 56

అదత్త్వోదకకుంభం తు చాతకో భువి జాయతే ।
చైత్రే దేయం జలం చాన్నం దేయా శయ్యా మనోరమా ॥ 57

ఆదర్శదానం తాంబూలగుడదానం ప్రకారయేత్ ।
గోధూమతువరీదానం దానం దధ్యోదనస్య చ ॥ 58

ఘృతయుక్తం కాంస్యపాత్రం దానమిక్షురసస్య చ ।
తథా శ్రీఫలదానం చ దానం చామ్రఫలస్య చ ॥ 59

సూక్ష్మవస్త్రమంచకయోః పానపాత్రం కమండలుమ్ ।
యతీనాం దండదానం వై తైలదానం మతేషు చ ॥ 60

జీర్ణోద్ధారం మఠానాం చ ఘంటానాం కరణం తథా ।
ప్రాసాదకరణం చైవ వాపీకూపాదికం తథా ॥ 61

మార్గస్థానాం ఛత్రదానం మధ్యాహ్నేఽతిథిపూజనమ్ ।
కరపాత్రం యతీనాం చ గోగ్రాసం తు గవామపి ॥ 62

ఏతాని చైత్రమాసే తు దానాని కథితాని హి ।
ఫలం శాకం తు మూలం చ కందం పుష్పం తు చందనమ్ ॥ 63

ఉశీరః శీతలం ద్రవ్యం కర్పూరం కస్తురీ శుభా ।
దీపదానం ధేనుదానం గేహదానం తథా స్మృతమ్ ॥ 64

గోరసానాం పృథగ్దానం యతిబ్రాహ్మణభోజనమ్ ।
సువాసినీపూజనం చ రామనామప్రలేఖనమ్ ॥ 65

పుస్తకానాం తథా దానం తథా కుంకుమకేసరే ।
జాతీఫలం లవంగాశ్చ జాతిపత్రీవరాంగకే ॥ 66

ధాతకీం నాగరం ధూపం బీజపూరం కళింగకమ్ ।
జంబీరం పనసశ్చైవ కపిత్థం మాతులింగకమ్ ॥ 67

కూష్మాండదానమారామకరణం మార్గశోధనమ్ ।
తథోపానహదానం చ గజవాజిభవం తథా ॥ 68

ఏతాని చైత్రమాసే తు దానాని కథితాని హి ।
యాని చైత్రే తు వర్జ్యాని తాని తే ప్రవదామ్యహమ్ ॥ 69

## చైత్రమాసమునందు చేయవలసిన, చేయకూడని పనులు

తైలాభ్యంగము, పగటినిద్ర, కంచుపాత్రలో భోజనము, మంచముమీద పడక, ఇంటిలో స్నానము, నిషేధ పదార్థభోజనము, రెండుమార్లు భుజించుట, రాత్రిభోజనము అను ఈ ఎనిమిది చైత్రమాసమున నిషిద్ధములు.

చైత్రమున మధ్యాహ్నమున దస్సివచ్చిన ద్విజులకు పాదసేవజేయుట వ్రతములలో ఉత్తమము. చైత్రమున చలివేంద్రముపెట్టుట, నీడలను ఏర్పరచుటయును స్వర్గమునిచ్చును. మీన చైత్రమున కావలసినవారికి ఛత్రము, విసనకఱ్ఱ, జలము– వీటి దానముచే విశేష ఫలము లభించును. చైత్రమున బ్రాహ్మణకుటుంబికి మంచినీటి కుండను ఇవ్వనివాడు చాతకపక్షియై పుట్టును.

గోధుమలు, కందులు, దధ్యోదనము, నేతి కంచుపాత్ర, చెరుకురసము, బిల్వపండు, మామిడి పండు, లేసుగుడ్డలు, మంచము, పంచపాత్ర, యతులకు దండ కమండలువులు, తైలదానము మొదలగు వీటి దానము మంచి ఫలితములనిచ్చును. జీర్ణములయిన మఠములను, బాటలను, మేడలను, వాపీ కూప తటాకాదులను కట్టించవలయును. బాటసారులకు ఛత్ర దానమిచ్చునది.

మధ్యాహ్నమున అతిథిసత్కారము, గోవులకు పచ్చికవేయుట, ఇవన్నియును చైత్రమాసమున ఉత్తమదాన కార్యములనబడును. కందమూలఫల శాకాదుల నిచ్చుట, శీతలపుష్ప, గంధ, తాంబూలాదుల నిచ్చుట, గోదానము, దీపదానము, గృహదానము, క్షీర, దధి, తక్ర, నవనీత, ఆజ్యములు, యతుల సత్కారము, బ్రాహ్మణ భోజనము, సువాసినీ పూజనము, రామనామములను వ్రాయుట, పుస్తక దానము; కేసరీ, కస్తూరీ, కర్పూరములు, జాజికాయ, జాపత్రి, లవంగములు, లవంగ చెక్క, ధూపము మొదలగు వాటి దానము; ఆరేపువ్వు, శొంఠి, గొయ్యా కాయలు, మాదీఫలము, వెలగపండు, పనసపండు, నిమ్మపండు, కోడిసే కాయ, గుమ్మడి కాయ– వీటి దానములు, తోటలను, దారులను చక్కపరచుట, పాదరక్షాదానము, గజ, అశ్వ భవన దానములు ఇవి చైత్రమాసమున తగినవి.

సర్వాణి చైవ మాంసాని క్షౌద్ర సౌవీరకం తథా ।
రాజమాషాదికం చాపి చైత్రస్నాయీ ప్రవర్జయేత్ ॥ 70

పరాన్నం చ పరద్రోహం పరదారాగమం తథా ।
తీర్థఘ్నాని సదైవేహ చైత్రస్నాయీ ప్రవర్జయేత్ ॥ 71

ద్విదళం తిలతైలం చ తథాఽన్నం శల్యదూషితమ్ ।
భావదుష్టం శబ్దదుష్టం చైత్రస్నాయీ తు వర్జయేత్ ॥ 72

దేవవేదద్విజానాం చ గురుగోవ్రతినాం తథా ।
స్త్రీరాజమహతాం నిందాం చైత్రస్నాయీ వివర్జయేత్ ॥ 73

ప్రాణ్యమగమామిష చూర్ణం ఫలే జంబీరమామిషమ్ ।
ధాన్యే మసూరికా ప్రోక్తా చాన్నం పర్యుషితం తథా ॥ 74

బ్రహ్మచర్యమధః సుప్తిః పత్రావళ్యాం చ భోజనమ్ ।
చతుర్థకాలే భుంజీత కుర్యాదేవం సదా వ్రతీ ॥ 75

సంవత్సరప్రతిపది తైలాభ్యంగం తు కారయేత్ ।
చైత్రస్నాయీ నరోఽన్యత్ర తైలాభ్యంగం న కారయేత్ ॥ 76

అలాబుం చాపి వృతాక కూష్మాండం బృహతీఫలమ్ ।
శ్లేషాత్మకం కలింగం చ కపిత్థం చైవ వర్జయేత్ ॥ 77

రజస్వలాం త్యజ మ్లేచ్ఛపతితవ్రాతకైః సహ ।
ద్విజద్విడ్ వేదబాహ్యైశ్చ న వదేత్సర్వదా వ్రతీ ॥ 78

పలాండుం లశునం చైవ ఛత్రాకం గృంజనం తథా ।
నాళికామూలకం శిగ్రుం చైత్రస్నాయీ వివర్జయేత్ ॥ 79

ఏభిః స్పృష్టం శ్వపాకైశ్చ సూతకాన్నం చ వర్జయేత్ ।
ద్విపాచితం చ దగ్ధాన్నం చైత్రస్నాయీ వివర్జయేత్ ॥ 80

ఏతాని వర్జయేన్నిత్యం వ్రతీ సర్వత్ర తేష్వపి ।
కృచ్ఛ్రాద్యం చ ప్రకుర్వీత స్వశక్త్యా రామతుష్టయే ॥ 81

**ఇక చైత్రమున విడిచిపెట్టవలసినవి ఏవి అనిన....**

మాంసము, మద్యము, రేగుపండు, కారామణులు మొదలగునవి చైత్రస్నానము చేయువాడు విడువవలయును. పరనారీ, పరాన్న, పరద్రోహ సంగతులు తీర్థ నాశకములు గాన అవి చైత్రస్నాయికి తగవు. ఇట్లే, ద్విదళమనిన– సెనగలు, పెసలు, మినుములు మొదలగునవి. నూనె, నువ్వులు, పాపాన్నము, వికృతాన్నము, దూషితాన్నము కూడదు.

స్నాన వ్రతమును చేయువాడు– నిమ్మపండును, మాంసాహారమును. ధాన్యములలో చిరుసెనగలను, చద్దిఅన్నమును విడుచునది.

బ్రహ్మచర్యము, నేలనిద్రించుట, విస్తరిలో భోజనము, మధ్యాహ్న భోజనము ఇవి వ్రతమునాచరించు వానికి ముఖ్యములు. చైత్రస్నాయి– సంవత్సరాదినాడు తప్ప, తక్కిన రోజులలో అభ్యంగస్నానము చేయకూడదు. సొరకాయ, వంకాయ, నేలములక, బహువారక మనిన విరిగి చెట్టు ఇవి వర్జ్యములు, వ్రతపరాయణుడు– అంత్యజులతోను, ముసల్మానులతోను, బ్రహ్మద్వేషుల తోను, వేద బాహ్యులతోను సంభాషించరాదు. ఎఱ్ఱగడ్డ, తెల్లపాయ, ధనియాలు, కారుమునగ, తామరగడ్డలు, మునగ ఇవి వ్రతధారికి పనికిరావు.

కాకి, కుక్కలంటిన వంటను, సూతకాన్నమును, ఇరువురు వండిన వాటిని, కాల్చిన అన్నమును చైత్రస్నాయి తినరాదు. వీనిని తప్పి నడచినవాడు శ్రీరామప్రీతికై భక్తితో కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తము చేయవలయును.

**క్రమాత్కూష్మాండబృహతీ ఛత్రాకం మూలకం తథా ।**
**శ్రీఫలం చ కళిగం చ ఫలం ధాత్రీభవం తథా ॥ 82**

**నారికేళమలాబుం చ పటోలం బదరీఫలమ్ ।**
**చర్మవృంతాకకం వల్లీశాకం తులసిజం తథా ॥ 83**

**శాకాన్యేతా చ వర్జ్యాని క్రమాత్ ప్రతిపదాదిషు ।**
**ధాత్రీఫలం రవౌ తద్వద్వర్జయేత్సర్వదా గృహీ ॥ 84**

**ఏభ్యోఽన్యద్వర్జయేత్కించిత్తద్రామపీతయే నరః ।**
**దత్వా వ్రతాంతే విప్రాయ భక్షయేత్సర్వదైవ హి ॥ 85**

**ఫాల్గునీపౌర్ణిమారభ్య యావచ్చైత్రీ తు పౌర్ణిమా ।**
**చైత్ర స్నానం తు తావద్ధి నరైః కార్యం చ భక్తితః ॥ 86**

అథవా మినగో భానుర్యావత్తావత్ ప్రకారయేత్ ।
దశమీం ఫాల్గునీం శుద్ధాం సమారభ్య మధోః సితా ॥ 87

యావద్భవేత్తు దశమీ తావత్స్నానం ప్రకారయేత్ ।
స్నానస్యైవం త్రయో భేదాః శిష్య తే సముదీరితాః ॥ 88

చైత్రశుక్లతృతీయాయా యావద్వైశాఖసంభవా ।
తృతీయా శుక్లపక్షస్య హ్యక్షయ్యేతి స్మృతాఽత్ర యా ॥ 89

తావచ్చ సీతలా గౌరీ స్నాతవ్యా సుఖలబ్ధయే ।
సీతాతీర్థే తు నారీభిః పూజనీయా చ జానకీ ॥ 90

తృతీయా యా తు చైత్రస్య సితపక్షోద్భవా తథా ।
వైశాఖశుక్లపక్షే యా తృతీయాఽక్షయ్యసంజ్ఞికా ॥ 91

నారీ యా పీతలాగౌరీవ్రతస్నానపరాయణా ।
అభ్యంగం సా కరోత్వనయోస్తియ్యోర్నాన్యదినే కదా ॥ 92

త్రింశచ్చ తిథయః పుణ్యాశ్చైత్రమాసే మహత్తమాః ।
తథాపి హి విశేషోఽత్ర తిథీనాం వర్ణ్యతే మయా ॥ 93

చైత్రమాసే కృష్ణపక్షే పంచమీ దశమీ తథా ।
ఏకాదశీ ద్వాదశీ చ శివరాత్రిస్త్వమా తథా ॥ 94

ఏతాః శుభాశ్చైత్రకృష్ణే మహాపాతకనాశనాః ।
ఇదానీం చైత్రమాసస్య సితపక్షోద్భవాః శుభాః ॥ 95

ప్రతిపదాదులలో వరుసగా గుమ్మడికాయ, నేలములక, భూకందము, ముల్లంగి, బిల్వఫలము, కోడిసెకాయ, నెల్లికాయ, టెంకాయ, సొరకాయ, పొట్లకాయ, వెలగపండు, వంకాయ, తీగెలుదంటు, కామలు మొదలగునవి తులసివంటికూరలు–ఇవి వర్జ్యములు.

గృహస్థుడు భాను(ఆది)వారమున ఎప్పుడును ఉసిరికాయ తినరాదు. రామప్రీతికై వీటినితప్ప మరియేదైన నొకటిని గూడ విడుచునది. ఎప్పుడును వ్రతాంతమున బ్రాహ్మణునికి పెట్టి తినవచ్చును.

ఫాల్గున అమావాస్య మొదలు చైత్ర అమావాస్య వరకు భక్తితో చైత్రస్నానము చేయునది. రవి మీనమున ఎక్కియుండ జేయవచ్చును. అది గాక ఫాల్గుణ శుద్ధ దశమి మొదలు, చైత్రశుద్ధ దశమి వరకు చేయవచ్చును. చైత్రశుద్ధ తృతియ, వైశాఖశుద్ధ తృతియ ఇవి రెండును అక్షయ్య సంజ్ఞికములు. ఈ నెలరోజులు అక్షయములు. స్త్రీలు ఆ రెండు రోజులలో అభ్యంగము చేసికొనునది. తక్కిన రోజులలో కూడదు. ఈ నెలలో సీతార్చనమును, శీతలాస్నానమును, సీతలాగౌరీ పూజనమును చేయవలె. ఇక వాటిలో, శుక్ల పక్షమున నవమి వరకు తొమ్మిది దినములును కృష్ణపక్షమున పంచమి-దశమి-ఏకాదశి-ద్వాదశి-చతుర్దశి-అమావాస్య ఈ రోజులును విశేష ఉత్తమదినములు. చైత్రశుక్ల ప్రదిపదనాటి స్నానదాన జపాదికముకన్నను విదియనాటిది రెండింతలు ఫలమునిచ్చును.

వర్ణ్యంతే తిథయః శ్రేష్ఠా నరాణాం హితకామ్యయా ।
సంవత్సరప్రతిపదమారభ్య దశమీదినమ్ ॥ 96

యావత్తావచ్ఛుభాః సర్వాః స్నానదానాదికర్మణి ।
యత్కృతం చ ప్రతిపది స్నానదానవ్రతాదికమ్ ॥ 97

ద్వితీయాయాం చ తత్ప్రోక్తం ద్విగుణం నాత్ర సంశయః ।
యత్కృతం చ ద్వితీయాయాం భక్త్యా స్నానాదికం నరైః ॥ 98

ద్విగుణం తత్తృతీయాయాం చైత్రమాసే నృపోత్తమ ।
ఏవం సర్వాసు తిథిషు యావత్స్యాన్నవమీ శుభా ॥ 99

ఏవం విశేషో జ్ఞాతవ్యో యథాఽగ్రాదిక్షుచర్వణాత్ ।
యథా క్షీరాద్దధి ప్రోక్తం దధ్నస్తు నవనీతకమ్ ॥ 100

నవనీతాద్ఘృతం యద్వత్తథాఽత్ర తిథినిర్ణయః ।
చైత్రమాసస్తు మాసానాం తత్ర పక్షః సితో వరః ॥ 101

సితపక్షే క్రమేణైవ యావత్సా నవమీ తిథిః ।
తావదేకైకశః శ్రేష్ఠాః సర్వాసు నవమీ వరా ॥ 102

యస్యాం జాతం రామజన్మ ధర్మసంస్థాపనాయ హి ।
తస్మాత్తిథిస్తు సా జ్ఞేయా కర్మనిర్మూలనక్షమా ॥ 103

తస్యాం దత్తం హుతం జప్తం యత్కించిచ్చ కృతం శుభమ్ ।
సర్వం తదక్షయం విద్యాన్నాత్ర కార్యా విచారణా ॥ **104**

ప్రతిపద్దినమారభ్య నవరాత్రముపోషయేత్ ।
ప్రత్యహం రఘువీరస్య పూజనం చైవ కారయేత్ ॥ **105**

సంవత్సరప్రతిపది ధ్వజాః సౌధోపరి స్థితాః ।
దివ్యవస్త్రైశ్చ మాల్యైశ్చ మండితాశ్చ మనోరమాః ॥ **106**

రామజన్మసూచనార్థం ప్రీత్యర్థం రాఘవస్య చ ।
గృహే గృహే నరైః కార్యాః పూజనీయాశ్చ భక్తితః ॥ **107**

గృహే దేవాలయే వాఽథ గోష్ఠే బృందావనే శుభే ।
సంమార్జనాదికం నిత్యం కార్యం చందనవారిభిః ॥ **108**

తతః పాషాణచూర్ణైశ్చ నానాపద్మాదికాని హి ।
లేఖనీయాని భూమ్యాం తు నీలపీతాదివర్ణకైః ॥ **109**

అష్టోత్తరసహస్రాఖ్యం రామతోభద్రముత్తమమ్ ।
సీతాఖ్యం వా లిఖేద్భద్రమథవాఽన్యన్మనోరమమ్ ॥ **110**

తస్యోపరి మహాన్ రమ్యశ్చిత్రవర్ణశ్చ మండపః ।
దేయో ద్వారాణి చత్వారి కార్యాణి తోరణాని చ ॥ **111**

కదలీస్తంభయుక్తాని ఇక్షుదండయుతాని చ ।
నానాఘంటాకింకిణీభిర్ధ్వనితాన్యుజ్జ్వలాని చ ॥ **112**

విదియనాటిదానికన్నను తదియనాటిది రెండింతలు ఫలించును. ఇట్లు నవమివరకు ఉత్తరోత్తర ఫలప్రదము. క్షీరసారము పెరుగు, దధిసారము వెన్న, నవనీతసారము నెయ్యి ఎట్లో అట్లే తిథినిర్ణయము. నెలలలో చైత్రము, అందులో శుక్లపక్షము, దానిలో నవమితిథి శ్రేష్ఠము. ధర్మసంస్థాపనకై శ్రీరామ అవతారమైన ఆ చైత్ర శుక్ల నవమి తిథియనునది కర్మనిర్మూలన దక్షమై ఉత్తమమనబడెను. దానిలో జేసిన స్నాన, దాన, జప, హోమ అర్చనాది కర్మ అక్షయమై మంగళమగును. (108)

## చైత్ర నవమి రాత్రోత్సవ విధానము

చైత్రశుక్ల ప్రతిపత్తు మొదలు 9దినములు ఉపవాసముచేసి, శ్రీరాముని పూజింపవలయును, సంవత్సరాదియందు రామజనోత్సవ సూచకముగా శ్రీరామప్రీతికై యిండ్లలో, మేడలమీద, చిత్రవస్త్ర ధ్వజములను స్థాపించి, పూజించునది. ఇంటిలోగాని, దేవాలయమునగాని, గోష్ఠమునగాని, బృందావనమునగాని చక్కగా అలికి, గంధోదకము జల్లి, రంగుముగ్గులు వేసి, 1108 రామతో భద్రాదీష్ట భద్రాసనమును లిఖించి, దానిపై నాలుగు ద్వారములుగల మంటపమును నిర్మించి, దానికి తోరణములు, అరటిస్థంభములు, చెరుకుగడలు, చిత్రవస్త్రపతాక ఘంటాకింకిణీ ముక్తాది ఆభరణములు మొదలగువాటిని చక్కగా అలంకరించునది.

రమ్యాదర్శైమండితాని విచిత్రాణి శుభాని చ ।
నానాచిత్రవితానైశ్చ ముక్తాహారైర్యుతాని చ ॥ **113**

తస్యాం షోడశమాషైశ్చ ప్రతిమా కాంచనోద్భవా ॥ **114**

ద్విభుజా రామచంద్రస్య సర్వలక్షణలక్షితా ।
చతుర్వింశతిమాషైశ్చ ప్రతిమా రజతోద్భవా ॥ **115**

కౌసల్యాయాః శుభా కార్యా పూజనీయా మనోరమా ।
యథావిత్తానుసారేణ పూజయేత్ ప్రత్యహం నరః ॥ **116**

భేరీమృదంగతూర్యైశ్చ గీతనృత్యాది కారయేత్ ।
నానాపక్వాన్న నైవేద్యైరుపచారైః సుపూజయేత్ ॥ **117**

ప్రతిపద్దినమారభ్య యావత్తు నవమీదినమ్ ।
రామాయణ తావదేవ పఠనీయమిదం శుభమ్ ॥ **118**

యద్వై వాల్మీకినా గీతం శ్రవణాన్మంగళప్రదమ్ ।
ఆనందసంజ్ఞికం రమ్యం పఠనీయం మనోరమమ్ ॥ **119**

నవ కాండాని నవభిర్దినైరేవ పఠేన్నరః ।
దివసే దివసే కాండం పఠనీయం ప్రయత్నతః ॥ **120**

అథవా ప్రత్యహం సర్గాః పఠితవ్యాస్తు ద్వాదశ ।
శేషస్త్వేకః కదా మధ్యేஉధికః సోஉపి పఠేన్నరః ॥ **121**

అష్టోత్తరశతైః సర్గై రామకీర్తనమాలికా ।
మేరుయుక్తా పఠేదేవం రామాగ్రే నవభిర్దినైః ॥ 122

సర్వతీర్థేషు యత్పుణ్యం సర్వదానేషు యత్ఫలమ్ ।
రామాయణస్య పఠనాత్ తత్ఫలం నవరాత్రకే ॥ 123

శ్లోకం వా శ్లోకపాదం వా యద్రామాయణసంభవమ్ ।
నవరాత్రే పఠిష్యంతి చైత్రే తే మోక్షభాగినః ॥ 124

ఏవం హి ప్రత్యహం కార్యం కౌసల్యారామపూజనమ్ ।
సపుత్రాణాం తు నారీణాం తత్ర కార్యం ప్రపూజనమ్ ॥ 125

సపుత్రద్విజవర్యాణాం విశేషాత్పూజనం స్మృతమ్ ।
వస్త్రాద్యలంకారయుతం చిత్రభోజనభోజితమ్ ॥ 126

ఏవం కృత్వా విధిం సర్వం నవమ్యాం చ విశేషతః ।
పూజయిత్వా రామచంద్రం వాహనారూఢముత్తమమ్ ॥ 127

భేరీమృదంగఘోషైశ్చ తూర్యదుందుభినిఃస్వనైః ।
వారస్త్రీకృతనృత్యైశ్చ గాయకానాం చ గాయనైః ॥ 128

ఏవం నానాసముత్సాహైః మండితం ఛత్రశోభితమ్ ।
చామరైర్వీజ్యమానం చ పుష్పకే సంస్థితం వరమ్ ॥ 129

రామతీర్థాంతికం నీత్వా పంచామృతఘటైర్వరైః ।
స్నాపయేద్రఘువీరం హి పుణ్యతోయైస్తతః పరమ్ ॥ 130

ఆ మంటపమున 16 మాడల బంగారముతో ద్విభుజ శ్రీరామమూర్తిని, 24 మాడల వెండితో కౌసల్యాదేవిని చేయించి పెట్టునది. యథావైభవముగా వివిధ భక్ష్య, భోజ్యములతోను, మంగళవాద్యాది మహోత్సవములతోను, సకలోపచారములతోను నిత్యము పూజించునది. అప్పుడు శ్రీరామ సన్నిధానమున 'ఆనందరామాయణము' తొమ్మిదికాండలను తొమ్మిది దినములలో గాని, ప్రతిరోజు ఒకసర్గ చొప్పున గాని నియమముతో పఠించవలెను. ఇది సర్వతీర్థపుణ్యము, సకలదాన ఫలము ఒసంగును. అప్పుడు శ్లోకమైనా, శ్లోకార్థమైనా పఠించినవారు ముక్తి భాజనులై యుందురు.

ఇట్లు కౌసల్యా రాములను పూజించి పుత్రవంతులగు బ్రాహ్మణ దంపతులను వస్త్రాలంకార భోజనాదులచే సత్కరించవలయును. అంత నవమినాడు కౌసల్యా రామమూర్తిని వాహనారూఢునిగా పుష్పకము నెక్కించి, మంగళ వాద్య పురస్సరముగా సమస్త రాజవైభవములతో ఉత్సవము చేసికొని శ్రీరామతీర్థమునకు గొనిపోయి, అచ్చట పంచామృత పవిత్ర తీర్థజలములతో శ్రీరామమూర్తిని రుద్రసూక్త, విష్ణుసూక్తాది మంత్రములచే అభిషేకము చేసి, ఇట్లు మంగళ స్నానము చేయించిన పిదప పంచగవ్యాది తీర్థమును శ్రీరామతీర్థములో పోయవలయును.

**రుద్రసూక్తైర్విష్ణుసూక్తైః సహస్రైర్నామభిస్తు వా ।**
**మాంగల్యద్రవ్యసంమిశ్రై ర్జలైస్తమభిషేచయేత్ ॥ 131**

**మాంగల్యవరద్రవ్యైశ్చ యుక్తం తన్మంగళాభిదమ్ ।**
**ప్రోచ్యతే మంగళస్నానం తచ్చైత్రే దుర్లభం నృణామ్ ॥ 132**

**తత్పంచామృతతీర్థం తు తీర్థమధ్యే వినిక్షిపేత్ ।**
**తత్ర సర్వైర్జనైః శీఘ్రం స్నాతవ్యం తదనంతరమ్ ॥ 133**

**సహస్రావబృథస్నానైర్యత్ఫలం ప్రాప్యతే నరైః ।**
**తత్ఫలం రామచంద్రస్య మంగళస్నానకారణాత్ ॥ 134**

**పుష్కరాదిషు తీర్థేషు గంగాద్యాసు సరిత్సు చ ।**
**ప్రాప్యతే యత్ఫలం స్నానాన్మంగళస్నానకృచ్చ యత్ ॥ 135**

**ఏవం రామం తు సంస్థాప్య సీతాయుక్తం ప్రపూజ్య చ ।**
**పునః పూర్వోక్తవాద్యాది మంగళైరానయేద్గృహమ్ ॥ 136**

**గృహే రామం పునః పూజ్య రామాయణకృతం వరమ్ ।**
**పారాయణం సమాప్యాథ పుస్తకం పూజయేచ్ఛుభమ్ ॥ 137**

**నానోత్సవైర్దినం నీత్వా కార్యం జాగరణం నిశి ।**
**దశమ్యాం ప్రాతరుత్థాయ భోజయిత్వా ద్విజాన్ బహూన్ ॥ 138**

**పూజయిత్వా పునః సర్వం గురవే తన్నివేదయేత్ ।**
**తతః స్వయం సుహృన్మిత్రైః కుర్యాద్భోజనముత్తమమ్ ॥ 139**

ఏవం వ్రతం సమాఖ్యాతం చైత్రస్య నవరాత్రకే ।
అతస్తన్నవరాత్రే హి శ్రేష్ఠం చైత్రం మహత్తమమ్ ॥ 140

నవరాత్రేఽపి సా రామనవమీ పరమార్థదా ।
తత్సమానా తిథిర్నాన్యా చైత్రమాసే శుభప్రదా ॥ 141

అతః పరం ప్రవక్ష్యామి చైత్రోద్యాపనకం విధిమ్ ।
యత్కృత్వా సఫలం సర్వం చైత్రస్నానం తు జాయతే ॥ 142

చైత్రే మాసి సితే పక్షే యా వై హ్యేకాదశీ తిథిః ।
సర్వాసు తిథిషు శ్రేష్ఠా చోపోష్యా వ్రతకారిభిః ॥ 143

అందరూ శ్రీరామతీర్థములో స్నానముచేసి, సహస్రనామ పూజాది ఉపచారములచే శ్రీరాముని అర్చించునది. ఈ శ్రీరామమంగళ తీర్థస్నానమునుండి వేయి యజ్ఞ అవభృథస్నాన ఫలములను, గంగాది దివ్యనదీస్నాన ఫలములును సిద్ధించుచున్నవి. ఇట్లు స్నానమహోత్సవానంతరము సీతా సమేతునిగా శ్రీరామస్వామిని యథాపూర్వకముగా స్వస్థానమునకు మహోత్సవముతో తీసుకొనివచ్చి, పూజించి, శ్రీమదానందరామాయణమును పారాయణ జేసి, వైభవోత్సవములతో ప్రొద్దుబుచ్చి, రాత్రి జాగరణవ్రతమును ఆచరించి, దశమినాడు ఉదయమున పునఃపూజ చేసి, బ్రాహ్మణ మహాసమారాధన గావించి, సర్వమును గురువునకు అర్పించి, తన మిత్రులతోకలసి భుజించునది. ఇట్లు శ్రీరామ నవరాత్రోత్సవ వ్రతము చెప్పబడినది. కావున ఈచైత్రమాసమునందలి నవమి మిక్కిలి శుభకరము.

శ్రేష్ఠా సా ద్వాదశీ జ్ఞేయా తస్యాం తు యమపూజనమ్ ।
కార్యం దధ్యోదనం దత్వా జలకుంభః ప్రదీయతామ్ ॥ 144

తిస్రశ్చ తిథయః శ్రేష్ఠాచ్చైత్రే మాసీ మహత్తమాః ।
త్రయోదశీ తథాభూతా పౌర్ణమాసీ తథైవ చ ॥ 145

యాసు స్నానంచ దానం చ సర్వవాంఛితదాయకమ్ ।
యైర్న స్నానం చైత్రమాసే న స్నానం నవరాత్రకే ॥ 146

తైస్తు చాన్తదినే స్నాత్వా చైత్ర స్నానఫలం లభేత్ ।
తాసు శ్రేష్ఠా పౌర్ణిమా హి సర్వపాతకనాశినీ ॥ 147

తస్యాముద్యాపనం ప్రోక్తం చైత్రస్నానఫలాప్తయే ।
ఉపోష్య చ చతుర్దశ్యాం పూర్వవన్మండపాదికమ్ ॥ 148

కృత్వా తస్మిన్ ధాన్యరాశౌ కలశం వారిపూరితమ్ ।
స్థాపయిత్వా తదుపరి హేమపాత్రం సువిస్తృతమ్ ॥ 149

పంచరత్నయుతం స్థాప్య వస్త్రేణాచ్ఛాదయేచ్చ తత్ ।
తస్మిన్ సీతాయుతం రామం సౌవర్ణం విధిపూర్వకమ్ ॥ 150

భ్రాతృభిర్వాయుపుత్రేణ సుగ్రీవేణ సమన్వితమ్ ।
విభీషణాంగదాభ్యాం తు జాంబవత్సహితం తథా ॥ 151

పూజయేద్దేవదేవేశం పరమం గుర్వనుజ్ఞయా ।
ఉపచారైః షోడశభిర్నానాభక్ష్యసమన్వితైః ॥ 152

రాత్రౌ జాగరణం కుర్యాద్గీతవాద్యాదిమంగళైః ।
తతస్తు పౌర్ణమాస్యాం చ సపత్నీకాన్ ద్విజోత్తమాన్ ॥ 153

త్రింశన్మితానథైకం వా స్వశక్త్యా వా నిమంత్రయేత్ ।
తతస్తాన్ భోజయేద్విప్రాన్ పాయసాన్నాదినా వ్రతీ ॥ 154

అతో దేవా ఇతి ద్వాభ్యాం జుహుయాత్తిలసర్పిషా ।
ప్రీత్యర్థం దేవదేవస్య దేవానాం చ పృథక్ పృథక్ ॥ 155

దక్షిణాం చ యథాశక్త్యా ప్రదద్యాచ్చ తతో నమేత్ ।
పునర్దేవ సమభ్యర్చ్య దేవాంశ్చ తులసీం తథా ॥ 156

తతో గాం కపిలాం తత్ర పూజయేద్విధినా వ్రతీ ।
గురువ్రతోపదేష్టారం వస్త్రాలంకారమండనైః ॥ 157

సపత్నీకం సమభ్యర్చ్య తతో విప్రాన్ క్షమాపయేత్ ।
యుష్మత్ప్రసాదాద్దేవేశః సుప్రసన్నోఽస్తు వై మమ ॥ 158

## చైత్రస్నాన ఉద్యాపన విధానము.

చైత్రస్నానము సఫలమగునట్టి చైత్రస్నాన ఉద్యాపన విధియెట్టిదనిన ; తిథులలో అత్యుత్తమమగు చైత్రశుక్ల ఏకాదశినాడు ఉపవాసవ్రతమును ఆచరించునది. ఉత్తమమగు ఆ ద్వాదశియందు యముని పూజించి; దధ్యోదన, జలకుంభ దానముచేయునది. త్రయోదశీ, చతుర్దశీ, పూర్ణిమలు మిక్కిలి శ్రేష్ఠములు, ఈ మూడు తిథులలో చేయుస్నానము కోరినకోర్కెలు తీర్చును.

చైత్రస్నానము చేయక, నవరాత్ర స్నానము చేయక యుండినవాడును, పౌర్ణమినాడు స్నానము చేయుటచే మాసస్నానఫలమందును. కావున అఖిలదురిత పరిహారకమగు పౌర్ణమినాడే ఉద్యాపన విధింపబడినది. కావున చతుర్దశినాడు ఉపవాసముచేసి, ముందు చెప్పిన విధముగా మంటపాదికమును రచియించి, అందులో ధాన్యరాశిపై సువర్ణ జలకుంభమును, పంచరత్న పంచపల్లవ ఫల, దివ్య వస్త్రాదులచే అలంకరించి సంస్థాపించి, దానిలో సుగ్రీవ, విభీషణాది పరివారముతోడ– సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, హనుమత్సమేత శ్రీరామమూర్తిని– ప్రతిమలలో ఆవాహనజేసి, శ్రీగుర్వాజ్ఞానుసారముగా సర్వ ఉపచార వైభవములచే పూజించి, మంగళ గీత వాద్యములతో రాత్రిజాగరణ వ్రతముచేసి, పున్నమినాడు ముప్పదిమందికి గాని, ఒకనికి గాని, యథాశక్తిగా కొందరికి గాని బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. అంత, "అతోదేవా" యను రెండు ఋక్కులచే తిల ఆజ్యములతో దేవతలకు వేర్వేరుగా హోమమును కావించి, యథాశక్తి దక్షిణలనిచ్చి, కపిలగోవును అర్చించి వ్రతాన్ని ఉపదేశముచేసిన గురువుగారిని, గురుపత్నిని వస్త్రాలంకారాదులచే సత్కరించి, యాగ సహితముగా సర్వమును దానమొసంగి, "యుష్మత్ప్రసాదాత్.... దుర్లభం," అను 158వ శ్లోకముచే క్షమాపణలను కోరి, తృప్తులగు బ్రాహ్మణులను పంపించిన పిదప, స్వజన పరివారముతో భుజించి, వ్రతియగువాడు ధన్యుడగును.

**వ్రతాదస్మాచ్చ యత్పాపం సప్తజన్మకృతం మయా ।**
**తత్సర్వం నాశమాయాతు స్థిరా మే చాస్తు సంతతిః ॥ 159**

**మనోరథాస్తు సఫలాః సంతు నిత్యం మమార్చనాత్ ।**
**దేహాంతే వైష్ణవం స్థానం మమ చాస్త్వతిదుర్లభమ్ ॥ 160**

**ఇతి క్షమాప్య తాన్ విప్రాన్ ప్రసాద్య చ విసర్జయేత్ ।**
**తామర్చాం గురవే దద్యాద్రత్నయుక్తాం సదా వ్రతీ ॥ 161**

**తతః సుహృత్ ప్రియైర్యుక్తః స్వయం భుంజీత భక్తిమాన్ ।**
**ఏవముద్యాపనవిధిశ్చైత్రస్నానఫలాప్తయే ॥ 162**

సవిస్తరశ్చ కర్తవ్యః చైత్రస్నానపరాయణైః ।
ఏవం యః కురుతే సమ్యక్ చైత్రస్నానవరం నరః ॥ 163

సర్వపాపైర్వినిర్ముక్తో విష్ణుసాయుజ్యమాప్నుయాత్ ।
సర్వవ్రతైః సర్వతీర్థైః సర్వదానైశ్చ యత్ఫలమ్ ॥ 164

తత్కోటిగుణితం పుణ్యం సమ్యగస్య విధానతః ।
దేహస్థితాని పాపాని నాశమాయాంతి తద్భయాత్ ॥ 165

క్వ యాస్యామో వదంత్యేవం యచ్చైత్రవ్రతకృన్నరః ।
తస్మాదవశ్యమేవైతత్ చైత్రస్నానంసమాచరేత్ ॥ 166

శ్రీచైత్రవ్రతకథనం పఠంతి భక్త్యా
యే వై తద్ద్విజయతివైష్ణవాన్ వదంతి ।
తే సమ్యక్ వ్రతకరణాత్ ఫలం లభన్తే
తత్సర్వం కలుషవినాశనం లభంతే ॥ 167

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, చైత్రమహిమాభివర్ణనం నామ, దశమః సర్గః ॥**

చైత్రస్నాన వ్రత పరాయణుడు ఇట్లు ఉద్యాపనమును ఆచరించి, పాపముక్తుడై విష్ణుసాయుజ్య మందును. సర్వతీర్థ, సకలవ్రత, సమస్తదాన ఫలములను కోటింతలుగా ఈ చైత్ర విధానముచే లభించుచున్నవి. చైత్రస్నాన వ్రతాచరణజేసిన వాని దేహమునుండి పాపములు ఎచ్చటికేగుదుమాయని యేడ్చుచు పరుగెత్తుచున్నవి. కావున ఇది అవశ్యకర్తవ్యము. ఇట్టి చైత్రవ్రతకథను పఠించినవారును దీనిని ద్విజ, యతి, విష్ణు భక్తులకు చెప్పినవారును, వ్రతాచరణఫలమునంది పాపవిముక్తులు అగుచుందురు.

**శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో మనోహరకాండలో చైత్రమాసమహిమను వర్ణించు 10వ సర్గ ముగిసినది.**

# ఏకాదశః సర్గః-11వ సర్గ

## చైత్రస్నాన మాహాత్మ్యము

విష్ణుదాస ఉవాచ

కిమర్థం సర్వమాసేషు చైత్రమాసః స్మృతో వరః ।
తత్కారణం వదస్వాద్య గురో సంతోషహేతవే ॥ 1

శ్రీరామదాస ఉవాచ

శృణు శిష్య మహాబుద్ధే సమ్యక్ పృష్టం త్వయా మమ ।
బ్రహ్మ ప్రార్థనయా విష్ణుర్యదా భూమ్యాం ద్విజోత్తమ ॥ 2

అయోధ్యాపాలకస్యాథ రాజ్ఞో దశరథస్య హి ।
కౌసల్యాయాస్తు భార్యాయా జఠరాన్నిర్గతో బహిః ॥ 3

చైత్రే మాసి సితే పక్షే నవమ్యాం పరమే దినే ।
పునర్వస్వర్క్షనక్షత్రే ప్రోచ్చస్థే గ్రహపంచకే ॥ 4

మధ్యాహ్నే ప్రకటో జాతః శ్రీరామో రాజసద్మని ।
ఆనందశ్చ తదాజాతః సర్వత్ర జగతీతలే ॥ 5

దేవదుందుభయోనేదుః పుష్పవృష్టిః శుభాఽపతత్ ।
రాజసద్మని వాద్యానాం సంఘా నేదుః పృథక్ పృథక్ ॥ 6

ననృతుర్వారనార్యశ్చ జగుర్గీతం మనోరమమ్ ।
తదా సర్వే హి భూమిస్థా జనా ద్రష్టుం శిశుం శుభమ్ ॥ 7

ప్రయయుర్ నృపజం బాలం దృష్ట్వా ముదమవాప్నుయుః ।
నానావిమానమారూఢా దివి దేవాః సవాసవాః ॥ 8

మిళితా రాఘవం ద్రష్టుం కౌసల్యాజఠరోద్భవమ్ ।
బ్రహ్మా రుద్రశ్చ సూర్యశ్చ దేవేంద్రాదిసురాః శుభాః ॥ 9

ఉత్సవాన్ విదధుః సర్వే తదా శ్రీరామజన్మని ।
ఏవముత్సాహసమయే దేవా హర్షాద్దివి స్థితాః ॥ 10

**నమస్కృత్వా రామచంద్రం తుష్టువుర్వివిధైః స్తవైః ।**
**ప్రోచుస్తదా సురాః సర్వే హర్షాద్దేవం రఘూత్తమమ్ ॥ 11**

**అద్య ధన్యా వయం దేవ ముక్తాశ్చాసురజాద్భయాత్ ।**
**యన్నిమిత్తం త్వయా దేవ హ్యవతారః కృతో భువి ॥ 12**

**అస్మాకం హర్షకాలోఽయం దేవదేవ కృపానిధే ।**
**తస్మాదయం సదా పుణ్యః శ్రేష్ఠః కాలో భవిష్యతి ॥ 13**

**త్వం చాప్యంగీకురుష్వాద్య దేహ్యస్మై సుబహూన్ వరాన్ ।**
**ఇతి తేషాం వచః శ్రుత్వా దేవానాం రాఘవః శుభమ్ ॥ 14**

## చైత్రమాస నవమీ ప్రాశస్త్యము

గురుమూర్తీ! సంతోషకారణమైన చైత్రమాసము అన్నినెలల్లో ఉత్తమమై యుండు విషయమును నిరూపింపుడని విష్ణుదాసు వేడగా, శ్రీరామదాసు చెప్పుచున్నాడు

"శిష్యుడా! బ్రహ్మప్రార్థనచే శ్రీమహావిష్ణువు అయోధ్యానాథుడగు దశరథ మహారాజుగారి పట్టపురాణి కౌసల్యాదేవి గర్భమునుండి, చైత్రశుక్ల నవమి మధ్యాహ్నమున అవతరించెను. అప్పుడు లోకమునకు ఆనందము కలిగెను. అపుడు బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది సకలదేవతలును గగనమున నిలచి దేవ దుందుభులు మ్రోగగా, పుష్పవర్షములు కురియగా, అప్సరసలాడగా ఎంతో సంతోషముతో ఇట్లు శ్రీరామచంద్రస్వామికి నమస్కరించి, నానాస్తోత్రములచే పొగిడిరి. మరి...

"మహాప్రభూ! నేడు రాక్షసభీతినుండి ముక్తులైతిమి, ధన్యులైతిమి. దయానిధీ! మాకొరకై నీవవతరించిన ఈ శుభకాలము శ్రేష్ఠమగును. నీవుకూడ ఆమోదించి ఇక్కాలమునకు వరములను ఇవ్వుము" అని ప్రార్థించిరి.

**తుతోష నితరాం తేషు దేవేషు భగవాన్ హరిః ।**
**శ్రీరామ ఉవాచ**
**సమ్యక్ ప్రోక్తం సురాః సర్వే తత్త్రైలోక్యోపకారకమ్ ॥ 15**

**భవద్భిః ప్రార్థితోఽహం తు హర్షకాలే మహత్తమే ।**
**శృణుధ్వం వచనం మేఽద్య యద్ధర్షాత్ ప్రోచ్యతే మయా ॥ 16**

**సర్వేషామేవ మాసానాం శ్రేష్ఠశ్చాయం భవిష్యతి ।**
**వైశాఖాత్కార్తికః శ్రేష్టః కార్తికాన్మాఘ ఏవ చ ॥ 17**

మాఘమాసాద్వరశ్చాయం చైత్రమాసే భవిష్యతి ।
చైత్రమాసే కృతం దత్తం హుతం స్నాతం విచింతితమ్ ॥ 18

సర్వం కోటిగుణం ప్రోక్తమయోధ్యాయాం విశేషతః ।
యచ్ఛ్రేయశ్చాశ్వమేధేన యద్గోమేధేన వై ఫలమ్ ॥ 19

యత్ఫలం సోమపానేన తచ్చైత్రే స్నానమాత్రతః ।
సూర్యగ్రహే కురుక్షేత్రే యచ్ఛ్రేయః స్నానదానతః ॥ 20

తచ్ఛ్రేయః స్యాన్మధౌ స్నానాదయోఽధ్యాయాం సురోత్తమః ।
అత్ర వై సరయూతీరే రావణం లోకరావణమ్ ॥ 21

హత్వా యత్పాపశాంత్యర్థం కరిష్యామి క్రతుం శుభమ్ ।
యత్ర యాగసమాప్తిర్హి భవిష్యతి సురోత్తమాః ॥ 22

తత్తీర్థం మమ నామ్నా హి ఖ్యాతిం శ్రేష్ఠాం గమిష్యతి ।
అయోధ్యాయాం రామతీర్థే సరయూజలమధ్యగే ॥ 23

చైత్రస్నానం ప్రకుర్వాణాస్తే నరా మోక్షభాగినః ।
యథా మాఘః ప్రయాగే హి స్నాతవ్యః సుఖమిచ్ఛతా ॥ 24

కార్తికోఽపి యథా కాశ్యాం పంచగంగాజలే స్మృతః ।
ద్వారకాయాం యథా ప్రోక్తో వైశాఖో మాధవప్రియః ॥ 25

అయోధ్యాయాం రామతీర్థే తథా చైత్రో భవిష్యతి ।
సర్వేషామేవ మాసానామాదౌ శ్రేష్ఠో భవిష్యతి ॥ 26

చైత్రమాసే తు సంప్రాప్తే సర్వే దేవాః సవాసవాః ।
బహిర్జలే సమాశ్రిత్య తిష్ఠధ్వం హి మమాజ్ఞయా ॥ 27

ఏవం హరిస్తాన్ మఘవాదికాన్
సురానుక్త్వా సురైస్తైశ్చ నమస్కృతో బభౌ ।
వృషేంద్రమారుహ్య శివో నిజం స్థలం
యయౌ సురాస్తేఽపి యయుర్నిజం స్థలమ్ ॥ 28

**తస్మాత్సర్వేషు మాసేషు ముఖ్యశ్చైత్రః ప్రకీర్త్యతే ।**
**మాసాదౌ ప్రథమః సర్వైః ప్రోచ్యతే హి వరాద్ధరేః ॥ 29**

**ఏవం శిష్య యదా పృష్టం తథా తే వినివేదితమ్ ।**
**కారణం చైత్రమాసస్య రామచంద్రవరాదికమ్ ॥ 30**

అంత ఆ శ్రీహరి సంతుష్టుడై, "దేవతలారా! త్రిలోక ఉపకారకముగా మీరడిగినది మిగుల సంతోషము. నేను సంతుష్టుడనై చెప్పెడు దానిని వినుడు. "మాసములలో ఈ చైత్రమే శ్రేష్ఠమగును. వైశాఖముకన్నను కార్తికము, దానికన్నను మాఘము, దానికన్నను ఈ చైత్రము ఉత్తమోత్తమము. చైత్రమాసము నెలలోని దాన, ధర్మ, జప, హోమ, సురార్చనాదికమంతయు కోటింతలు ఫలించును. అయోధ్యలో మరీ విశేషము. చైత్రస్నానము సర్వయజ్ఞ ఫలప్రదము. చైత్రమాసములో చేసిన స్నాన, దానములు కురుక్షేత్ర సూర్యగ్రహణ పుణ్యమునిచ్చును. లోకకంటకుడైన రావణుని వధించినందుకు ఈ సరయూతీరమున యజ్ఞకర్మను ఆచరించెదను. పాపపరిహారకమగు ఆ యాగము సమాప్తి నందుచోటు శ్రీరామ తీర్థమని నాపేరుతో ఖ్యాతి నందును. రామతీర్థములో చైత్రస్నానము ఆచరించు వారు ముక్తులగుచుందురు.

ప్రయాగలో మాఘము, కాశీ పంచగంగలో కార్తీకము, ద్వారకలో వైశాఖమును ఎట్లు ప్రశస్త మనబడునో అట్లే అయోధ్యలో చైత్రము ముఖ్యస్నానకాలము కాగలదు. నెలలలో మొదటిదగు దీనియందు అంతట బహిర్జలములను ఆశ్రయించి సమస్త దేవతలును వసింతురుగాక." అని వరంబులనిచ్చి సకలదేవతలచేత నమస్కరింపబడి శ్రీరామచంద్రుడు రారాజించెను. అంత ఆ రుద్రుడు కైలాసమునకు వెళ్ళగా, దేవతలు వారి వారి నివాసములకు వెళ్ళిరి. కావున ఈ చైత్రమధికము. శ్రీహరి వరమువలననే చైత్రము మొదటి నెల అనబడెను. నీవడిగినందుకే శ్రీరామపరమున ఇట్లు చెప్పితిని. (30)

**విష్ణుదాస ఉవాచ**
**స్వామిన్ గురో త్వయా చైత్రస్నానం పుణ్యతమం స్మృతమ్ ।**
**తత్కేనచరితం పూర్వం కా సిద్ధిస్తత్ ప్రభావతః ॥ 31**

**తత్సర్వం విస్తరేణైవ మమాగ్రే త్వం నివేదయ ।**
**శ్రీరామదాస ఉవాచ**
**సమ్యక్ పృష్టం స్వస్థమనాః శృణు త్వం యన్మయోచ్యతే ॥ 32**

మమ తాతో నృసింహాఖ్యః పురాఽత్రాసీద్ద్విజోత్తమ ।
తస్యైకాం నియమశ్చాసీత్ ప్రత్యహం భూసురోత్తమమ్ ॥ 33

ఏకమబ్జకక్షేత్రస్థం ద్విజమన్నార్థినం త్వపి ।
స్నుషాస్త్రీపుత్రతనయదాసీదాసాదిభిర్యుతమ్ ॥ 34

కుటుంబభోజం తస్మై సంపూజ్యాన్నైర్విధీయతామ్ ।
లక్ష్మీనామ్నీ తు మన్మాతా తావుభౌ రామతత్పరౌ ॥ 35

పుత్రోత్పత్తిమదృష్ట్వా తౌ వృద్ధౌ పుత్రార్థముద్యతౌ ।
స్వదోషపరిహారార్థముపాయం కర్తుముద్యతౌ ॥ 36

నివాసాఖ్యే పురే గత్వా దంపతీ మోహినీం శుభామ్ ।
స్వీయేష్టదేవతామంబాం ప్రవరాతీరవాసినీమ్ ॥ 37

దృష్ట్వా దేవ్యాశ్చ తౌ సేవాం నిత్యం తత్ర ప్రచక్రతుః ।
గతే బహుతిథే కాలే వరదా యా మహాలయా ॥ 38

ప్రసన్నా చ ద్విజం భూత్వా ప్రాహ తద్దోషశాంతయే ।
హే నృసింహ మహాబుద్ధే గచ్ఛాయోధ్యాపురీం ప్రతి ॥ 39

తత్ర వై సరయూతోయే రామతీర్థే మహత్తమే ।
చైత్ర మాసి వసంతర్తౌ యదా స్యాన్మీనగో రవిః ॥ 40

చైత్రస్నానం మాసమేకం కురు తత్ర ద్విజోత్తమ ।
పాతకం సకలం త్యక్త్వా పుత్రం ప్రాప్యస్యనుత్తమమ్ ॥ 41

ఇతి దేవ్యా వచః శ్రుత్వా ద్విజశ్చింతాపరస్తదా ।
యయౌ మార్గే హృది ధ్యాయన్నయోధ్యాఖ్యాం పురీం శుభామ్ ॥ 42

చింతయా పరయా వ్యాప్తః కథం గంతుం హి శక్యతే ।
మయాఽయోధ్యాపురీ దూరమితః కష్టం చ జీవితమ్ ॥ 43

ఇతి చింతాయుతో మార్గే క్వచిత్తిష్ఠన్ క్వచిత్ స్ఖలాన్ ।
భార్యాయాశ్చ కరే ధృత్వా వృద్ధశ్చైవం యయౌ ద్విజః ॥ 44

ఏనం గోదావరీతీరం గత్వా స్నాత్వా ద్విజోత్తమః ।
రామమూర్తి పురః స్థాప్య పూజయామాస భక్తితః ॥ 45

తావత్తస్మై ప్రసన్నోఽభూద్రామో దేవ్యాః ప్రసాదతః ।
ద్విజం ప్రాహ రఘుశ్రేష్ఠో భో నృసింహ ద్విజోత్తమ ॥ 46

మాఽయోధ్యాం త్వమితో గచ్ఛ శృణు మే వచనం శుభమ్ ।
ఇతః పూర్వే హ్యదూరం హి యోజనద్వయ సంమితమ్ ॥ 47

ప్రతిష్ఠానాభిధం క్షేత్రం గోదాయా ఉత్తరే తటే ।
తత్రాస్తి రామతీర్థే హి మన్నామ్నా చ మయా కృతమ్ ॥ 48

తత్ర త్వం గచ్ఛ విప్రేంద్ర స్నాత్వా శీఘ్రం హి భార్యయా ।
చైత్రమాసే వసంతర్తౌ యదా స్యాన్మీనగో రవిః ॥ 49

తదా కురు విశేషేణ పూజయిత్వా చ మాం శుభమ్ ।
పాపక్షయః పుత్రలాభో భవిష్యతి న సంశయ ॥ 50

ఇత్యుక్త్వా రఘువీరస్తు తత్రైవాంతరధీయత ।
యత్ర గంగాహ్రదే రామః ప్రసన్నోఽభూద్ద్విజాయ హి ॥ 51

## శ్రీరామదాసుని జన్మవృత్తాంతము

విష్ణుదాసు అడుగుచున్నాడు, "స్వామీ! చైత్రస్నానము మహాపుణ్యమంటిరి. దీనిని మునుపు ఎవరు ఆచరించిరి? దానిమహిమచే ఎటువంటి సిద్ధికలుగును? విస్తరింపు"డనగా,

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "బాగుగా అడిగితివి, వినుము! ఇచ్చట మాతండ్రి నృసింహశర్మ ఉండెను. ఆయన ఈ అబ్జక క్షేత్రమందుండెను. బ్రాహ్మణ కుటుంబి. ప్రతిరోజూ ఒక బ్రాహ్మణుని అన్నాదులచే సత్కరించవలెనను వ్రతము గలదు.

మాతల్లి లక్ష్మినామముగలది. ఆ యిరువురును శ్రీరామ పరాయణులు. వీరు ముసలివాండ్రై సంతానములేనందున చింతించుచు, తమ అపుత్రదోష నాశమునకై ప్రవరాతీరమందలి నివాస పురమునకు పోయి, ఇష్టదేవతయగు మోహినీదేవిని సేవించుచుండిరి. ఇట్లు బహుదినములు గతించినపిదప ఆ దేవి ప్రసన్నురాలై, "మీరు సరయూ రామతీర్థమున మీన చైత్రమాస స్నానమును ఆచరించితే దోషముతొలగి, సత్పుత్రలాభము గలుగును." అని వరమొసగెను. అంత మా తండ్రి

అయోధ్య ఎచ్చట? మేమెచ్చట? బ్రతుకుటయే కష్టమే, ఇక పోవునదెట్లు? అని చింతించుచునే ఇల్లాలి చేబట్టి తిన్నగా వెడలి, గోదావరి జేరి, ఆ గోదావరీ నదీతీరమున స్నానముజేసి, రామమూర్తి నెదుటబెట్టి, భక్తితో పూజించెను. అంత నంతలో మోహినీ దేవి అనుగ్రహముచే శ్రీరాముడు వారికి ప్రసన్నుడై, మా నాన్నతో, "నృసింహుడా! నీవు అయోధ్యవరకు పోవలదు. నామాట విను, ఇచ్చటికి మూడామడ దూరములోనే ప్రతిష్ఠాన క్షేత్రముగలదు. అచ్చట గోదానదికి ఉత్తరతీరమున నేను శ్రీరామతీర్థమును స్థాపించియున్నాను. నీవచ్చట నీ చైత్రమాసస్నానమును నిర్వర్తించి, నన్ను పూజించి, దురితముక్తుడవై, పుత్రునిగందువు పొమ్ము." అని యనుగ్రహించెను. ఆ గోదావరీ తీరముననే శ్రీరాముడు అదృశ్యుడయ్యెను. కావున అది రామహ్రదమని ప్రఖ్యాతము. అంత అతడు ప్రతిష్ఠానమునకు వెడలి, అచ్చట విధిపూర్వకముగా నిత్యము స్నానముచేసెను.

**తస్మాత్స వై రామహ్రదో నామ్నా సర్వత్ర కీర్త్యతే ।**
**తద్రామవచనాద్విప్రః ప్రతిష్ఠానపురం యయౌ ॥ 52**

**మాసమేకం చ వై స్థిత్వా చైత్రస్నానం చకార హ ।**
**సూర్యోదయే సముత్థాయ కృతశౌచాదిసత్క్రియః ॥ 53**

**స్నాత్వా తస్మిన్ రామతీర్థే సరయూసంగసమాన్వితే ।**
**రామచంద్రం స్వర్ణగిరౌ పూజయామాస భక్తితః ॥ 54**

**ప్రదక్షిణాః స్వర్ణగిరేశ్చకార నవ ప్రత్యహమ్ ।**
**నవపుష్పైశ్చ నైవేద్యైః పూజయామాస రాఘవమ్ ॥ 55**

**చైత్రశుక్లతృతీయాయ యావద్వైశాఖసంభవా ।**
**తృతీయా సీతలా గౌరీ స్నానం చక్రే చ భార్యయా ॥ 56**

**ఏవం మాసం వ్రతం కృత్వా స ద్విజస్తుష్టమానసః ।**
**అబ్జకం ప్రతి మార్గేణ యయౌ లక్ష్మ్యా సమన్వితః ॥ 57**

**యావన్మార్గే ద్విజోఽగచ్ఛత్తావద్దృష్టస్త్రిభిర్నరైః ।**
**పిశాచైః క్షుతృషాక్రాంతైస్నాతుద్ధార్య సభార్యయా ॥ 58**

**యయౌ స్వనగరం రమ్యం గోదానాభివిరాజితమ్ ।**
**చైత్రస్నానప్రభావేణ జాతస్తస్మాత్సుతస్త్వహమ్ ॥ 59**

తస్మాన్మయా తే కథితం వరం హి
స్నానం మధౌ తే సరయూజలే వై ।
సాకేతపుర్యాం వరరామతీర్థే
భుక్తిప్రదం మోక్షదముత్తమం చ ॥ 60

విష్ణుదాస ఉవాచ
కథం పిశాచయోన్యాస్తే ముక్తా విప్రేణ వై త్రయః ।
కస్మాత్పాపాచ్చ తే సర్వే పైశాచీం యోనిమాశ్రితాః ॥ 61

తత్సర్వం విస్తరేణైవ శ్రోతుమిచ్ఛామి త్వన్ముఖాత్ ।
శ్రీరామదాస ఉవాచ
శృణు శిష్య ప్రవక్ష్యామి రంభానామ్నీ వరాఽప్సరా ॥ 62

చైత్రే స్నాత్వా వరాయోధ్యా సరయూనిర్మలేజలే ।
ఆర్ద్రవస్త్రయుతా చారుహాస్యాలంకారమండితా ॥ 63

గృహీత్వా శరయూతోయం రత్నకాంచననిర్మితే ।
పాత్రే రామేశ్వరం సేతౌ ద్రష్టుం మౌనేన సా జవాత్ ॥ 64

యయావాకాశమార్గేణ పిశాచా యత్ర తే త్రయః ।
తదార్ద్రవస్త్రచాంచల్యాద్బిందుభిః ప్రోక్షితాశ్చ తే ॥ 65

క్రూరస్వభావముత్సృజ్య చాశ్చర్యం పరమం యయుః ।
పూర్వజన్మానుస్మరణమభూత్తేషాం తదా నృప ॥ 66

విస్మయావిష్టచిత్తాస్తే తాం దృష్ట్వాఽప్సరసం దివి ।
బహుధా ప్రార్థయామాసుస్తాన్ సా పప్రచ్ఛ సంజ్ఞయా ॥ 67

మా తండ్రి నిత్యము స్నానముచేసి, స్వర్ణగిరికి తొమ్మిదిప్రదక్షిణములుచేసి, నవపుష్పాదులతో శ్రీరామచంద్ర స్వామిని ఆరాధింపబూనెను. అంత మాతల్లి గూడ చైత్ర శుక్ల తృతీయ మొదలు, వైశాఖ శుక్ల పంచమి వరకు సీతలాగౌరీ స్నానానుస్థానమును ఆచరించెను. ఇట్లు వ్రత సమాప్తినంది, ఆ దంపతులు మరల తమ అబ్జక క్షేత్రమునకు వచ్చుచు, దారిలో మూడు పిశాచములను ఉద్ధరించి, యిల్లుజేరి నన్ను గనిరి. కావున నేను సరయూ రామతీర్థ మహిమను ఇట్లు భుక్తి ముక్తి ప్రదమని చెప్పుచున్నాను” అనగా....

## మూడు పిశాచముల కథ

రామదాసమునితో విష్ణుదాసుడు, (60) "గురూత్తమా! మీ తండ్రిచే ఆ పిశాచములు ఎట్లు ముక్తి నందినవి? వారు పిశాచములగుట యెట్టిది? దానిని చెప్పుము అని అడుగగా, రామదాసు చెప్పుచున్నాడు, "వినుము! రంభయను దేవకాంత అయోధ్యా సరయు రామతీర్థమున జలకమాడి, తడిబట్టలతోనే హాస్యాలంకారమండితయగు ఆమె రత్నపాత్రలో సరయూతీర్థమును తీసుకొని, శ్రీరామేశ్వరుని దర్శనమునకై మౌనముతో వడివడిగా పోవుచుండ, ఎచ్చట ఆమూడు పిశాచములుగలవో అచ్చట ఆకాశమునుండి ఆమెవస్త్రము నందలి నీటిచుక్కలు రాలినవి. వాటిచే ప్రోక్షింపబడగా, ఆ పిశాచములు క్రూరస్వభావమునువదలి అత్యాశ్చర్యమునంది, పూర్వజన్మ స్మరణగల్గి, ఆ అప్సరసను ప్రార్థించిరి. అంత ఆమె, "మీరేల ఇట్టిదశను పొందితి"రని చేతిసైగచే అడిగెను.

కస్మాద్యూయం పిశాచా హి జాతాస్తత్కథ్యతాం మమ ।
ఇతి తత్కరకృత్సంజ్ఞాప్రేరితాస్తే త్రయస్తదా ॥ 68

తేషు ద్వౌ వర్తమానౌ హి కథయామాసతుశ్చ తామ్ ।
శృణు భామిని చావాం హి పూర్వజన్మని భూసురాత్ ॥ 69

విరజాయాం సముత్పన్నౌ శ్రోత్రియాద్ధరశర్మణః ।
ఉభావధ్యయనం కర్తుం కంచిన్నారాయణాహ్వయమ్ ॥ 70

శుశ్రూషయా తోషయిత్వా గురుం తత్రైవ తస్థతుః ।
నారాయణసుతాం చారుహాసాం చంద్రనిభాననామ్ ॥ 71

దృష్ట్వా పరస్పరం మైత్ర్యం బహుధా ప్రార్థ్య తాం స్త్రియమ్ ।
అవాభ్యాం చ హి సా భుక్తా తత్జ్ఞాతం గురుణా చిరాత్ ॥ 72

అవాభ్యాం చ దదౌ శాపం తస్యై చాప్యశపత్క్రుధా ।
యువాం చాపి కుమారీయం పిశాచత్వం గమిష్యథ ॥ 73

తతోఽస్మాభిస్త్రిభిస్తం తు మునిం నత్వా పునః పునః ।
శాపస్యాంతస్తతో లబ్ధస్తచ్ఛృణుష్వ మనోరమే ॥ 74

చైత్రమాసే నృసింహాఖ్యః కశ్చిద్విప్రశ్చ కాననే ।
దదాతి స్నానజం పుణ్యం తదోద్ధారో భవిష్యతి ॥ 75

ఏవం జాతాః పిశాచా హి వయం త్వద్వస్త్రబిందుభిః ।
ప్రోక్షితాః స్మోऽద్య తైర్జ్ఞాతా పూర్వజన్మస్మృతిః శుభా ॥ **76**

తత్తేషాం వచనం శ్రుత్వా జ్ఞాత్వా శాపస్య మోక్షణమ్ ।
సాంత్వయిత్వా కరేణైవ శీఘ్రం స నృహరిః స్త్రియా ॥ **77**

ఆగమిష్యతి మా చింతాం కురుతేతి వరాంగనా ।
యయౌ రామేశ్వరం శీఘ్రం పూజయిత్వా గతా దివమ్ ॥ **78**

చైత్రమాసే హ్యతిక్రాంతే మార్గే స నృహరిర్ద్విజః ।
భార్యయా సహితో దృష్టః పిశాచైస్తైః పితా మమ ॥ **79**

స్థిత్వా దూరం చ తే సర్వే తమూచుర్నృహరిం ద్విజమ్ ।
నైజం వృత్తం సమస్తం హి శాపస్యాపి విమోక్షణమ్ ॥ **80**

తచ్ఛ్రుత్వా నృహరిర్విప్రస్తాన్ ప్రోవాచ ముదాన్వితః ।
మా భేతవ్యం పిశాచత్వాద్యథాశంభుద్విజేన సః ॥ **81**

రాక్షసో మోచితః పూర్వం మోచయిష్యామ్యహం తథా ।
పిశాచ ఉవాచ
కః శంభుశ్చ కదా ముక్తో రాక్షసః కః సవిస్తరమ్ ॥ **82**

వాటిలో రెండుపిశాచము లిట్లు చెప్పుచున్నవి. "మేమిరువురును పూర్వ జన్మమున హరశర్మ, విరజయను దంపతులకు జన్మించితిమి, మా తండ్రి శ్రోత్రియుడు. మేమిద్దరము అధ్యయనము చేయుటకై నారాయణశర్మ అను గురువును సేవించుచు అతనిని సంతోషపరచి అచ్చటనే వసించు చుంటిమి. ఇట్లుండగా సర్వాంగ సుందరియగు ఆ నారాయణ గురుపుత్రిని మేమిరువురము ఎట్లో ప్రార్థించి అనుభవించితిమి. బాలకన్యకా సంగమ సంగతిని గురువు తెలుసుకుని "మీరు ఇరువురును, నా యీ కూతురును పిశాచత్వమును అనుభవింపుడ"ని శపించెను. అంత మేము ముప్వరము "మా శాపాంతమును అనుగ్రహింపు"డని పలుమార్లు ప్రార్థించితిమి. ఆయన, "నృసింహుడు అను బ్రాహ్మణుడు చైత్రమాసమున స్నానపుణ్యము మీకిచ్చి యుద్ధరించు," నని శాప మోచనమును తెలిపెను. కావున మేమిట్లు పైశాచిక వృత్తిలో ఉన్నాము. నీ వాసోబిందు ప్రోక్షణముచే మాకు జన్మాంతర స్మృతిగల్గె" అనిన, అంత ఆ రంభ, వారిని త్వరలో మీ శాపముక్తి కాగలదని సంజ్ఞచే సమాధానపరచి శ్రీరామేశ్వరుని ఆరాధించి స్వర్గము జేరెను. పిదప చైత్రమాసానంతరమున మా తల్లిదండ్రులు అడవిలో

వారికి అగుబడిరి. అప్పుడు వారు శరణాగతులై తమ వృత్తాంతమును నివేదించికొనిరి. అందుకు మాతండ్రి, "భయమువలదు. శంభుశర్మ యెట్లు రాక్షసుని ముక్తునిజేసెనో అట్లే మిమ్మును నేను ముక్తుల జేసెద"నని అభయమిచ్చెను. అంత వారు అ కథను సవిస్తారముగా అనుగ్రహింపుడనిన (82) మా తండ్రి యిట్లు చెప్పుచున్నాడు.

**కథయస్వ ద్విజశ్రేష్ఠ కృపాం కృత్వా తు కౌతుకాత్ ।**
**నృసింహ ఉవాచ**
**శృణుధ్వం కథయిష్యామి యద్వృత్తం చ పురాతనమ్ ॥ 83**

**శివకాంచీపురీమధ్యే కశ్చిద్విప్రః శుచివ్రతః ।**
**శంభునామా చిరం కాలం తస్థౌ స చ స్వభార్యయా ॥ 84**

**స కస్మింశ్చిద్వనే విప్రశ్చైకాంబరశివాంతికే ।**
**పౌరాణికముఖాచ్చైత్రమాసమాహాత్మ్యవర్తినీమ్ ॥ 85**

**కథాం శ్రోతుం సమాయాతస్తత్ర శృత్వా మహత్ఫలమ్ ।**
**అయోధ్యాయాం హి చైత్రస్య స్నానాత్కైవల్యదాయకమ్ ॥ 86**

**తతో బహుగతే కాలే సంస్మరన్ తాం కథాం శుభామ్ ।**
**జ్ఞాత్వా సమాగతం చైత్రం స్వగృహాన్నిర్గతస్తదా ॥ 87**

**భార్యయా సహితో విప్రః శనైర్మార్గేణ వై యయౌ ।**
**తీర్త్వా తాం జాహ్నవీం రమ్యాం యావదగ్రే స గచ్ఛతి ॥ 88**

**తావద్దృష్టో హి భిల్లేన కర్కశాఖ్యేన కాననే ।**
**గృహీత్వా సశరం చాపం ధర్షయిత్వా చ భూసురమ్ ॥ 89**

**లులుఠం కర్కశః క్రూరో వస్త్రైణైకేన తం ద్విజమ్ ।**
**ముమోచ తస్య పాథేయం గృహీత్వా సకలం శుభమ్ ॥ 90**

**ద్విజోఽపి ప్రార్థయామాస కర్కశం చ పునః పునః ।**
**వస్త్రాదికం గృహాణ త్వం భక్ష్యపిష్టం దదస్వ మామ్ ॥ 91**

**తత్తస్య వచనం శ్రుత్వా ముక్త్వా తద్వస్త్రబంధనమ్ ।**
**సర్వం దదర్శ పాథేయం నానావిధమనుత్తమమ్ ॥ 92**

తస్మిన్దదర్శ స వ్యాధో దశ రంభాఫలాని వై ।
అపక్వాన్యతిశుష్కాణి తతశ్చిత్తేఽవిచారయత్ ॥ 93

ఏతైః ఫలైర్న మే కార్యం జానామి బ్రాహ్మణోత్తమమ్ ।
తర్హి దాస్యామ్యహం దీనం క్షుద్రాక్రాంతం చ సస్త్రికమ్ ॥ 94

ఇతి నిశ్చిత్య స వ్యాధో దదౌ తాని ద్విజన్మనే ।
గృహీత్వాఽభక్షయద్విప్రః ప్రారంభే భార్యయా మధౌ ॥ 95

తద్రంభాఫలదానేన కర్కశస్య తదా శుభా ।
జాతా బుద్ధిః క్షణాదేవ సాత్వికీ క్రూరతా గతా ॥ 96

## శంభుశర్మ ఉపాఖ్యానము

శివకాంచీపురమున శంభుశర్మయను ఒకానొక బ్రాహ్మణుడు సదాచార సంపన్నుడు తనపత్నితో నివసించియుండే. అతడు ఏకాంబర శివసన్నిధి. నొకతోటలో ఒక పౌరాణికుడి నుండి అయోధ్యా చైత్రస్నాన మాహాత్మ్యమును వినియుండెను. చాలాకాలము తరువాత ఒకనాడు దానిని స్మరించి, తన పత్నితోడ అయోధ్యకు ప్రయాణముచేసి తిన్నగావచ్చుచు వచ్చుచు, గంగను దాటి పయనించి, యడవిని బడిపోవుచుండగా, అచ్చట కర్కశుడను వేటగాడొకడు వీరిని చూచి, ధనుర్బాణధారియై వెరపించి, ఏకవస్త్రముతో ఆ శంభుశర్మను వదలి, సర్వస్వమును అపహరించి తిండిమూట విప్పసాగెను. అంత ఆ శంభుడు, "నాయనా! ఈ వస్త్రాదులనన్నిటిని తీసికొనుము. కానీ తినుటకు పిండినైన కొంత యిమ్ము," అని పలుమార్లు వేడుకొనెను. అపుడు కర్కశుడైన ఆ దొంగ మూటవిప్పిచూచి, అందులో పది అరటిపండ్లుండగా వాటిని చూచి, "ఇవి ఇంకా మాగలేదు. మఱి యెండినవి. ఇవి నాకేల? పోనిమ్ము, బ్రాహ్మణోత్తముడు ఇల్లాలితోనున్నాడు, ఆకలిగొనియుండు వీరికి వీటినిచ్చెదను." అని నిశ్చయించి వాటిని వారికిచ్చెను, వారు వాటిని భక్షించిరి. అంత ఆ కర్కశునికి కదలీఫలదాన మహిమచే అప్పుడే సాత్వికభావము ఉదయించెను.

ఏవం పిశాచాః సకలాస్తతః పరం
భిల్లాయ తస్మై తు శుభా మతిర్హ్యభూత్ ।
సమాగతం చాత్ర కుతః స పృష్టవాన్
విప్రం స వై ప్రాహ వనే చ కర్కశమ్ ॥ 97

శంభురువాచ

కాంచీపుర్యాః సమాయాతో గమ్యతేఽయోధ్యకాం పురీమ్ ।
చైత్రమాసేఽవ గాహోర్థం సరయూనిర్మలే జలే ॥ 98

ఇతి విప్రవచః శ్రుత్వా పునః పప్రచ్ఛ కర్కశః ।
కిం లభ్యతే హి స్నానేన తన్మే వద సవిస్తరమ్ ॥ 99

పునః ప్రాహ స విప్రేంద్ర కర్కశం భక్తితః ఫలమ్ ।
స్నానేన మధుమాసే హి రఘునాథః ప్రసీదతి ॥ 100

ప్రసాదాత్సకలాన్ భోగాన్ లభంతే మానవా భువి ।
అంతే మోక్షోఽపి భో భిల్ల లభ్యతే నాత్ర సంశయః ॥ 101

ఇతి విప్రవచః శ్రుత్వా పునః పప్రచ్ఛ కర్కశః ।
మోక్షస్వరూపం కథయ కృపాం కృత్వా మమోపరి ॥ 102

తత్తస్య వచనం శ్రుత్వా పత్నీం ప్రాహ ద్విజోత్తమః ।
పశ్య పశ్య వరారోహే కౌతుకం మహదద్భుతమ్ ॥ 103

యద్రంభాఫలదానేన చైత్రే మాసి వరాననే ।
అయం క్వ భిల్లజాతీయః క్వ ప్రశ్నశ్చేదృశః శుభః ॥ 104

మోక్షస్వరూపజ్ఞానార్థం తస్మాద్దానం ప్రశస్యతే ।
ఇత్యుక్త్వా తాం ప్రియాం విప్రః కర్కశం ప్రాహ సాదరమ్ ॥ 105

సాధు సాధు మహావ్యాధ సమ్యక్ ప్రశ్నః కృతస్త్వయా ।
ఇదానీం ప్రోచ్యతే మోక్షస్వరూపం తన్నిశామయ ॥ 106

స మోక్షస్త్వం హి జానీహి యతో నాస్తి పునర్భవః ।
ఇతి విప్రవచః శ్రుత్వా పునః పప్రచ్ఛ కర్కశః ॥ 107

తస్య ప్రాప్తిర్యథా స్యాన్మే తన్మే వద ద్విజోత్తమ ।
శృణు కర్కశ తత్ప్రాప్తిర్యథా స్యాత్తద్వదామి తే ॥ 108

**దారపుత్రగృహాదీనాం ప్రీతిం ముక్త్వా జనార్దనమ్ ।**
**దివారాత్రం చింతయిత్వా సర్వదేహస్య చాలకమ్ ॥ 109**

**ఆత్మానం బహుపుణ్యౌఘైర్నిర్మలీకృత్య మానసమ్ ।**
**తత్స్వరూపే యదా తిష్ఠేత్స ముక్తో నేతరో జనః ॥ 110**

పిశాచములారా వినుడు, "వెంటనే మంచిబుద్ధి పుట్టిన కర్కశుడు వారిని, "ఎచ్చటినుండివచ్చితిరి? మీసంగతి యే"మని అడిగెను. శంభుడందుకు, "మేము కాంచీపురమునుండి బయలుదేరి చైత్రమాసమున సరయూ స్నానమునకై పోవుచున్నాము," అనిపలికెను. వాడంతతో నుండక, ఆస్నానమువలన ఏమి ఫలము? దానిని వివరింపు" మనెను. శంభుడు భక్తితో, "నాయనా! ఈ చైత్రస్నానముచే శ్రీరామప్రీతి గల్గును. అందుచే ఈలోకమున సమస్త భాగ్యములును, చివరలో ముక్తియును మానవునికి లభించును" అని చెప్పగా విని, కర్కశుడు, ''నాయందు దయజేసి, మోక్షస్వరూపమును చెప్పు"మని అడిగెను. అపుడు శంభుడు తన సతిని జూచి, "చూడుము సతీ! చూడుము! ఇది ఎంత వింత! అరటిపండు దానమిచ్చుటచే ఎట్టి బుద్ధిబుట్టె? ఈ బోయవాడెక్కడ! ఈవిధమైన మోక్ష జిజ్ఞాసయెక్కడ! కావున మోక్షస్వరూప జ్ఞానమునకై దానము ముఖ్యము"అని అభివర్ణించి, వానితో "చక్కగా అడిగితివి! చెప్పెద వినుము. దేనిచే మరల జన్మము గలుగదో అది మోక్షమని యెఱుగుదువుగదా?" అనెను. అంత ఆ కర్కశుడు "అది నాకెట్లుగల్గునో అనుగ్రహింపు"మనెను. దానికి శంభుడు, "ఇల్లు, భార్య, సంతానముపట్ల ప్రీతినివదలి రాత్రింబగలు ముకుందుని చింతించుచు, దేహములన్నీ మట్టికుండవంటివని గుర్తించి, అనేక సుకృతములచే మనస్సును నిర్మలపరచుకొని, తదాత్మ స్వరూపమందే ఎవడుండునో వాడు ముక్తుడగును. ఇతరుడు కాడు."

**ఏవం వదతి విప్రేంద్రే వ్యాధో ముక్త్వా శరం ధనుః ।**
**శంభుపాదౌ జవాన్నత్వా త్రాహి త్రాహీతి వై వదన్ ॥ 111**

**ప్రోవాచ ద్విజవర్యం స వ్యాధో మాముద్ధరేతి చ ।**
**ఏతస్మిన్నంతరే తత్ర రాక్షసో ఘోరదర్శనః ॥ 112**

**దుద్రావ దీర్ఘశబ్దేన యాత్రాసంస్తే త్రయో వనే ।**
**ఆయాంతం రాక్షసం దృష్ట్వా చక్రుస్తే తు పలాయనమ్ ॥ 113**

**తావజ్జవేన తాన్ ధర్తుం నికటం రాక్షసో యయౌ ।**
**తం దృష్ట్వా నికటం శంభుస్తుంబికాం సజలాం నిజామ్ ॥ 114**

కృత్వోచ్చాం ప్రాక్షిపత్తస్మిన్ రామచంద్రం స్మరన్ ముఖే ।
మంత్రితం రామనామ్నా చ యత్తోయం మధుమాసి వై ॥ **115**

తత్సేకాద్రాక్షసస్యాపి జాతా పూర్వభవస్మృతిః ।
తతః స రాక్షసో దూరం స్థిత్వా శంభుం వ్యజిజ్ఞపత్ ॥ **116**

మాముద్ధర మునిశ్రేష్ఠ ఘోరాద్రాక్షసదేహతః ।
శరణం తే గతోఽస్మ్యద్య జాతా పూర్వస్మృతిర్మమ ॥ **117**

ఇతి తత్కౌతుకం దృష్ట్వా రాక్షసం ప్రాహ స ద్విజః ।
కస్మాత్తే రాక్షసత్వం హి జాతం తత్త్వం వదాఽధునా ॥ **118**

రాక్షసః ప్రాహ వేగేన శంభుం వృత్తం నిజం తదా ।
జనస్థానే పురా చాహం విప్రః కర్మపరాఙ్ముఖః ॥ **119**

ప్రతిగ్రహపరః పాపీ దుర్మార్గవ్యసనీ సదా ।
ఏతస్మిన్నంతరే చైత్రే మమ భార్యా సతీ శుభా ॥ **120**

స్నానార్థం రామతీర్థం సా మామపృష్ట్వా గృహాద్యయౌ ।
సా మార్గే చ మయా దృష్టా ధృత్వా మార్గే చ తాం శుభామ్ ॥ **121**

ప్రోక్తా క్రోధాన్మయా రండే మామపృష్ట్వా క్వ యాస్యసి ।
సా ప్రాహ భయభీతా తు రామతీర్థం ప్రగమ్యతే ॥ **122**

మధుమాసేఽవగాహార్థం న మయా దుష్కృతం కృతమ్ ।
ఏవం శ్రుత్వాపి తద్వాక్యం తాడితా సా మయా బలాత్ ॥ **123**

ప్రేషితా స్వగృహం మార్గాత్తతః కాలాంతరే గతే ।
మృతోఽహం చ తదా నీతో యమలోకం యమానుగైః ॥ **124**

అనుచుండగా, ఆ వేటగాడు ధనుర్బాణములను పారవైచి, శంభుని కాళ్లమీదబడి రక్షించుము, పరిరక్షించుము, ఉద్ధరించుమని చెప్పసాగెను. అంతలో అచ్చట ఘోర రాక్షసుడొకడు వీరి ముగ్వురినిచూచి వచ్చెను. ఆ రాక్షసుని జూచి వీరు పరుగెత్తిరి. అంత ఆ రాక్షసుడు వీరిని పట్టుకొనుటకై వీరి దగ్గర చేరెను. అపుడు శంభుడు తన నీటిసొరబుఱ్ఱను మంత్రించి, రామధ్యానము జేయుచు వానిపై వేసెను.

చైత్రమాసమున ఆ జలము ఆ రాక్షసిపై పడుటచే వానికి జన్మాంతర స్మృతిగల్గి, “మునీంద్రా! ఘోరమైన ఈ రాక్షసదేహము నుండి నన్నుద్ధరింపుము. నాకు జన్మాంతర స్మృతిగల్గె. కావున ఇప్పుడు నిన్నే శరణుజొచ్చితిని” అని శంభుని వేడుకొనెను. ఈ వినోదముజూచి శంభుడు, “నీవెందుకు రాక్షసుడవై జనించితి”వని యడిగెను. అందుకు వాడు, “నేను జనస్థానమునందలి విప్రుడను. పుణ్యకర్మలు చేయక, దానములను స్వీకరించి పాపినైతిని. ఎప్పుడూ దుర్వ్యసనములలో చిక్కియుండగా, ఒకప్పుడు సతియగు నాయిల్లాలు చైత్రమున రామతీర్థ స్నానమునకై నన్నడుగక యింటినుండి వెడలెను.

## చైత్రమాస తాంబూలదాన మహిమ

దారిలో ఆమెను చూచీ ఓసీ! ఎచ్చటకు పోతివని తిట్టుచు, కొట్టగా, ఆమె “నేను పాపినిగాను , తీర్థస్నానమునకై రామతీర్థమునకు పోదు”నని వేడినను వినక యింటి నుండి వెళ్లగొట్టితిని. కాలాంతరమున కాలాధీనుడైతిని. అంత యమభటులు నన్ను గొనిపోయిరి.

**చిత్రగుప్తోఽపి దృష్ట్వా మాం ధిక్కృత్వాపి పునః పునః ।**
**యమరాజం స వై ప్రాహ ధర్షయన్మాం స్వగర్జితైః ॥ 125**

**భో ధర్మరాజ పాపోఽయం చైత్రస్నాననివారకః ।**
**భుక్త్వాదౌ రాక్షసీం యోనిం నిరయాన్ భోక్తుమర్హతి ॥ 126**

**ఇతి తద్వచనం శ్రుత్వా యమః ప్రాహానుగాంస్తదా ।**
**భో భటా రాక్షసీ యోనిర్దీయతాం నిర్జనే వనే ॥ 127**

**పాపినేఽస్మై చ మద్వాక్యాత్తతస్తైశ్చ యమానుగైః ।**
**దత్వా మే రాక్షసీం యోనిం త్యక్త్వా చాత్ర గతా యమమ్ ॥ 128**

**తదారభ్య వనే చాహం క్షుత్తృషాపరిపీడితః ।**
**పంచత్రింశత్సహస్రాణి వర్షాణ్యత్ర స్థితశ్చిరమ్ ॥ 129**

**కిం మయా సుకృతం పూర్వం కృతం యస్మాద్వనే తవ ।**
**సంగతిశ్చాద్య వై జాతా సాధుసంగో గతిప్రదః ॥ 130**

**ఇతి తద్వచనం శ్రుత్వా శంభుర్ధ్యాత్వా క్షణం హృది ।**
**జ్ఞాత్వా తత్సుకృతం పూర్వం రాక్షసాయ న్యవేదయత్ ॥ 131**

శృణు రాక్షస యత్పూర్వం కృతం వై సుకృతం త్వయా ।
యస్మాజ్జాతా సంగతిర్మే వనే నిర్మానుషే శుభా ॥ **132**

ఏకాదశ్యాం చైత్రశుక్లే కృత్వాన్యశ్రాద్ధభోజనమ్ ।
తాంబూలో దక్షిణాయుక్తః కట్యాం వస్త్రే త్వయా ధృతః ॥ **133**

ద్వాదశ్యాం ప్రాతరుత్థాయ గత్వా స్నానం త్వయా కృతమ్ ।
పతితః స హి తాంబూలో విస్మృత్యా గౌతమీతటే ॥ **134**

దక్షిణాసహితో దృష్టః స కేనాపి ద్విజేన వై ।
గృహీత్వా స హి ద్వాదశ్యాం న జ్ఞాతశ్చ త్వయా పునః ॥ **135**

తాంబూలదానాద్వరచైత్రమాసే
జాతా వనే మేఽద్య హి సంగతిస్తే ।
తస్మాన్మధౌ రాక్షస మానవైర్హి
తాంబూలదానం కరణీయమేతత్ ॥ **136**

ఇత్యుక్త్వా రాక్షసం శంభుశ్చైత్రమాహాత్మ్యముత్తమమ్ ।
ఉభాభ్యాం శ్రావయిత్వాఽథ కర్కశం వాక్యమబ్రవీత్ ॥ **137**

భో కర్కశ మహాబుద్ధే శృణుష్వ వచనం మమ ।
ఆగచ్ఛ త్వం సహైవాద్య మయాఽయోధ్యాపురీం ప్రతి ॥ **138**

సరయూస్నానమాత్రేణ మధౌ పాపాద్విమోక్ష్యసే ।
ఇత్యుక్త్వా కర్కశం శంభుస్తతః ప్రోవాచ రాక్షసమ్ ॥ **139**

నన్ను చూచి చిత్రగుప్తుడు పలుమార్లు ఛీగొట్టి, "ధర్మరాజా! వీడు మహాపాపి, చైత్రస్నానమునకు అడ్డుతగిలినాడు, కనుక మొదట రాక్షసజన్మను అనుభవించి నరకములను పొందును," అని విన్నవించెను. అంత యముడు తన భటులతో "ఈపాపికి నిర్జనవనమున రాక్షసజన్మను ఇవ్వ"మని ఆజ్ఞజేసెను. వారిట్లు నన్నిచ్చట వదలి వెడలిరి. అది మొదలు 35 వేలఏండ్లుగా ఇట్లు ఆకలితో, దప్పికతో డస్సి, ఘోరాకృతితో పడియున్నాను. సాధుసంగతి గతిసాధకము గాన నీతో సమాగమము నాకు యే సుకృతము చేయగల్గె అనుగ్రహింపుము." అని శంభునితో విన్నవించెను. అంత ఆ శంభుముని ధ్యానించి, "వినుము! చైత్రశుక్ల ఏకాదశినాడు నీవు పరుని యింటిలో శ్రాద్ధభోజనముజేసి దక్షణతో

కూడిన తాంబూలమును నడుములో జెక్కికొనియుండి, ద్వాదశినాడు ప్రొద్దున గోమతీనదిలో స్నానము జేసితివి. అది వీడి తీరమున బడియుండే, దానినొక ద్విజుడు తీసికొనెను కానీ నీ వెఱగవు. ఇట్టి అజ్ఞాత తాంబూల దానముచే ఇప్పుడు నాతో గలిసితివి. కావున తాంబూలదానము ఈచైత్రమున ప్రశస్తమైనది," అని చెప్పి, కర్కశ రాక్షసులకు చైత్రమాహాత్మ్యమును విస్తరించి, పిదప కర్కశునితో, "ఓరి బోయవాడా! నామాట వినుము. నీవు నాతోడ అయోధ్యకువచ్చి చైత్రస్నానముచే నిష్పాపుడవు అగుదువుగాక" అనియు; రాక్షసునితో, "రాక్షసుడా! ఇచ్చట ఇట్లే నెలరోజులు ఓర్చియుండుము.

**భో రాక్షస త్వమత్రైవ మాసమాత్రం స్థిరో భవ ।**
**అయోధ్యాయాం ప్రవేశశ్చ రాక్షాసానాం న విద్యతే ॥ 140**

**అతోఽహం మధుమాసే హి స్నాత్వాఽనేన పథా పునః ।**
**యదాగచ్ఛామి కాంచీం త్వాం చోద్ధరిష్యామ్యహం తదా ॥ 141**

**మా సందేహోఽస్తు తే చిత్తే శపథేన బ్రవీమ్యహమ్ ।**
**యత్పాపం బ్రహ్మహత్యాయాస్తథా గోయతినిందనాత్ ॥ 142**

**నోద్ధృత్య త్వాం హి గచ్ఛామి తర్హి తన్మయి తిష్ఠతు ।**
**మద్యపానే చ యత్పాపం హేమస్తేయాదికం చ యత్ ॥ 143**

**నోద్ధృత్య త్వాం హి గచ్ఛామి తర్హి తన్మయి తిష్ఠతు ।**
**యత్పాపం భ్రూణహత్యాయాస్తథా చైత్రే హ్యమజ్జనాత్ ॥ 144**

**నోద్ధృత్య త్వాం హి గచ్ఛామి తర్హి తన్మయి తిష్ఠతు ।**
**ఇత్యాది శపథైస్తర్హి రాక్షసం హర్షయన్ ద్విజః ॥ 145**

**యావత్పశ్యతి సర్వత్ర తావజ్జాతం హి కౌతుకమ్ ।**
**వ్యాధాయ చైత్రమాసస్య మాహాత్మ్యస్యోపదేశతః ॥ 146**

**తరవః ఫలినో జాతాః పరితో దశయోజనమ్ ।**
**పత్రైః పుష్పైర్వినమ్రాశ్చ సౌగంధః పవనో వవౌ ॥ 147**

**నద్యస్తోయాం వహంత్యశ్చ ననృతుర్బర్హిణో వనే ।**
**తద్దృష్ట్వా కర్కశశ్చాపి చైత్రమాహాత్మ్య కీర్తనాత్ ॥ 148**

దుర్వనం సువనం జాతం చైత్రశ్రైష్ఠ్యమమన్యత ।
తతస్తే హి త్రయస్తస్మాద్వనాన్మార్గేణ నిర్గతాః ॥ 149

శనైః శనైరయోధ్యాయాః పథ్యపశ్యన్ వనస్థలీమ్ ।
తావచ్ఛబ్దో మహాన్ జాతః సింహమాతంగసంభవః ॥ 150

ధావన్నగ్రే తు మాతంగః పృష్ఠే ధావంశ్చ కేసరీ ।
ఏవం తౌ శంభుసాన్నిధ్య ప్రాప్తౌ కలహకారిణౌ ॥ 151

మార్గరోధకరౌ దుష్టౌ తౌ దృష్ట్వా శంభురబ్రవీత్ ।
పశ్య కర్కశ విఘ్నాని చైత్రస్నానే పదే పదే ॥ 152

సంభవంతీతి వై బుద్ధ్వా చైత్రస్నానం న లంఘయేత్ ।
కాశ్యాం వివాహే గీతాయాం గతాయాం రామచింతనే ॥ 153

చైత్రస్నానే మహాదానే విఘ్నాని సంభవంతి హి ।
ఏవం వదతి విప్రేంద్రే తౌ దుష్టౌ కరిసింహకౌ ॥ 154

అయోధ్యలో రాక్షసులకు ప్రవేశము లేదు. నేను పోయి మరలి వచ్చునపుడు నిన్ను ఉద్ధరించెదను, సందేహము వలదు, ఇదిగో శపథము. నేను తిరిగి వచ్చి నిన్ను ఉద్ధరింపకపోతినా బ్రహ్మహత్య, గోవు, సన్యాసి నింద, స్వర్ణచౌర్యము, మద్యపానము, భ్రూణహత్య, చైత్రస్నానపరిత్యాగము మొదలగు పాపముల పొందినవాడగుదును.” అని చెప్పి సెలవిచ్చెను. అప్పటికి వ్యాధుడు చూచువేళకు చుట్టు తనంతట పదియామడలో చెట్లన్నీ పత్ర, పుష్పములచే సమృద్ధమయ్యెను. చల్లనిగాలివీచే. వంకలు వెల్లువలా పారె. నెమళ్లు తాండవమాడె. ఆహా! చైత్ర మాహాత్మ్య కీర్తనచే దుర్దినము సుదినమయ్యె నని యెంచెను. అంత శంభుడు, అతని భార్య, బోయవాడు ముగ్గురును వనమార్గమున తిన్నగా వెడలిపోవుచుండగా, ఒక వనస్థలమున గొప్ప చప్పుడయ్యే. వీరి మార్గమునకు అడ్డముగా పరుగిడు ఏనుగును తరుముచుండు సింహము వచ్చెను.

## గజ, సింహముల కథ.

శంభుడు ఆ సింహమును చూచి, “కర్కశా! చైత్రస్నానమునకు ఎన్నివిఘ్నములురా! అయినను వదలరాదు సుమా! కాశీ యాత్రకు, వివాహమునకు, గీతాశ్రవణమునకు, గయకు వెళ్ళుటకు, రామధ్యానమునకు, చైత్ర స్నానమునకు చాలా విఘ్నములు వచ్చును.” అని చెప్పుచుండగా,...

చైత్రరామశ్రవాత్పూర్వజన్మస్మృత్యాఽతివిస్మృతౌ ।
భూత్వా వై త్రాహి త్రాహీతి కృత్వా దీర్ఘం మహారవమ్ ॥ 155

శరణం ద్విజవర్యాయ జగ్మతుః శంభుశర్మణే ।
సోఽపి శంభుశ్చ తాభ్యాం హి పృష్టవాన్ తత్కృపాన్వితః ॥ 156

కిమర్థం దుష్టజాతిర్హి ప్రాప్తా తత్కథ్యతాం మమ ।
ఇతి విప్రవచః శ్రుత్వా కేసరీ వాక్యమబ్రవీత్ ॥ 157

సేతౌ రామేశ్వరక్షేత్రే పూర్వజన్మన్యహం ద్విజః ।
నిందకః సర్వధర్మాణాం పాషండోక్త్యేకతత్పరః ॥ 158

కదాచిచ్చైత్రమాసే తు తత్ర శ్రీరామ సంజ్ఞకే ।
తీర్థే జనసమూహే చ శ్రుత్వా పౌరాణికీం కథామ్ ॥ 159

పౌరాణికేన కథితాం చైత్రమాహాత్మ్యసూచికామ్ ।
కృతవాన్ నిందనం చాహం వారం వారం పునః పునః ॥ 160

తన్మత్కృతం నిందనం చ కశ్చిద్విప్రః స్తపః స్థితః ।
శుశ్రావ సకలం దుష్టం తేన శప్తోఽస్మ్యహం తదా ॥ 161

క్రూరాం జాతిం త్వరం గచ్ఛ యదా చైత్రేశకీర్తనమ్ ।
భవిష్యతి మహారణ్యే శాపశాంతిస్తదేతి చ ॥ 162

ఏవం ప్రోక్తం మయా సర్వం పూర్వజన్మని యత్కృతమ్ ।
తేన శాపేన జాతోఽస్మి కేసరీ భయకారకః ॥ 163

చైత్రరామశ్రవాజ్జాతా పూర్వస్మృతిరనుత్తమా ।
ఇదానీం రక్ష మాం విప్ర త్వం చైతత్సింహదేహతః ।
ఇతి సింహస్య వృత్తం తు జ్ఞాత్వోవాచ గజం ద్విజః ॥ 164

కస్మాచ్చ మాతంగ గతోఽసి దుష్ట-
జాతౌ వదస్వాద్య మహాఘసంఘాత్ ।
స చాపి మాతంగవరః సమస్తం
వృత్తం నిజం చాకథయచ్చ జీర్ణమ్ ॥ 165

**శృణు విప్ర ప్రవక్ష్యామి పూర్వవృత్తం మయా కృతమ్ ।**
**రామనాథపురే చాహం కావేర్యా ఉత్తరే తటే ॥ 166**

**విప్రః పరమదుర్వృత్తః సర్వశాస్త్రపరాఙ్ముఖః ।**
**లక్ష్మీభరమదాక్రాంతః పుణ్యస్త్రీభోగకారకః ॥ 167**

**ఏకదా సుహృదా చాహం భోజనార్థం నిమంత్రితః ।**
**శ్రాద్ధాహే మనుమాసే హి శుక్లే శ్రీనవమీదినే ॥ 168**

**మయా భుక్తం సుహృద్గేహే నవమ్యాం ద్విజసత్తమ ।**
**తేన శాపేన జాతోఽస్మి కరిజాతౌ న సంశయః ॥ 169**

**సర్వదా ప్రతిమాసేఽపి నవమ్యాం న హి భోజనమ్ ।**
**కార్యం విశేషతో రామనవమ్యాం నిందితం చ తత్ ॥ 170**

ఆ దుష్ట ఏనుగు, సింహములు! 'చైత్ర, రామ' శబ్దములు వినగానే జన్మ స్మృతిగల్గి, ఆశ్చర్యపడుచు వచ్చి, రక్షింపుము రక్షింపుమని చెప్పి, శంభుశర్మను శరణుజొచ్చినవి. అంత అతడును దయాళువై మీరేల యిట్టి దుష్టజాతిని పొందితిరని అడిగెను. అప్పుడు సింహము, "పూర్వజన్మమున నేను రామేశ్వర క్షేత్రమునందు ధర్మనిందకుడును, పాషండ మతమును అనుసరించే బ్రాహ్మణుడుగానుంటిని. ఒకసారి శ్రీరామతీర్థమున పౌరాణికుడు చైత్రమాహాత్మ్యమును వర్ణించుచుండగా పలుమార్లు నిందించితిని. తపోనిరతుడైన విప్రుడు దానిని విని, "అరణ్యమున క్రూరజాతిలో పుట్టి కాలాంతరమున చైత్రేశ్వరుడగు శ్రీరాముని కీర్తనను విన్నప్పుడు శాపశాంతిగల్గునని శపించెను. అట్లే మృతుడైన తరువాత నిట్లుపుట్టి నీవాక్యముచే శ్రీరామనామమును విని, ఆ స్మృతిగల్గి శరణుజొచ్చితిని, ఉద్ధరింపుము." అని వేడుకొనెను.

అంత ఆ గజము, "విప్రవర్యా! నేను తొలిజన్మమునందు రామనాథ పురమున కావేరికి ఉత్తర తటమున దుర్మార్గుడును, వేదశాస్త్రవర్జితుడును, వారాంగనారతుడను, ధనమదాంధుడునైన బ్రాహ్మణుని గా ఉంటిని. ఒకసారి నామిత్రుడు చైత్రశుక్ల నవమినాడు వానియింటిలో శ్రాద్ధము జరుగగా నన్ను భోజనమునకు రమ్మనెను. నేను కాదని తెగదింటిని. ఆ పాపముచే ఇట్లు పుట్టితిని. ప్రతి నెలలోను నవమినాడు భోజనము నిషిద్ధముగదా? అందులో రామనవమినాటి కూడు పరమనింద్యము.

**ఇదానీం న హి జానామి కేన పుణ్యేన తేఽత్ర వై ।**
**సంగతిశ్చ వనే జతా సర్వేషాం పరమార్తిహృత్ ॥ 171**

ఇతి తస్య వచః శ్రుత్వా శంభుర్ధ్యానేఽవిచారయత్ ।
జ్ఞాత్వా మాతంగపుణ్యం తు ప్రోవాచ కరిణం ద్విజః ॥ 172

శృణు మాతంగ వక్ష్యామి యత్పుణ్యం చ త్వయా కృతమ్ ।
పూర్వజన్మని తత్సర్వం యేన మే సంగతిర్వనే ॥ 173

జాతా త్వాముద్ధరిష్యామి మా చింతాం కురు సర్వథా ।
రామనాథపురే రమ్యే కావేరీతటశోభితే ॥ 174

రామాయణకథా చైత్రే శ్రుతా శ్రీనవమీదినే ।
రామతీర్థే త్వయా స్నానం దృష్టో రామేశ్వరః శివః ॥ 175

తేన పుణ్యేన తే జాతా సంగతిర్మమ కాననే ।
ఇదానీం శృణు సింహ త్వం శృణోతు చ కరీ మహాన్ ॥ 176

సాకేతే మధుమాసే హి స్నాత్వాఽనేన పథా పునః ।
యదా గచ్ఛామి తాం కాంచీం యువాముద్ధారయామ్యహమ్ ॥ 177

మా సందేహోఽత్ర కర్తవ్యః శపథైః ప్రబ్రవీమ్యహమ్ ।
సంతోషార్థం యువాభ్యాం హి ప్రోచ్యంతే శపథా మయా ॥ 178

పరస్త్రీగమనాత్పాపం తథా మిత్రవధాదికమ్ ।
యువాం నోద్ధృత్య గచ్ఛామి తర్హి తన్మయి తిష్ఠతు ॥ 179

బ్రహ్మస్వహరణాత్పాపం యత్ స్మృతం మాతృనిందనాత్ ।
యువాం నోద్ధృత్య గచ్ఛామి తర్హి తన్మయి తిష్ఠతు ॥ 180

ఇత్యుక్త్వా ద్విజవర్యః స స్త్రియా భిల్లేన సంయుతః ।
కరిసింహౌ వనే స్థాప్య గచ్ఛన్మార్గే శనైః శనైః ॥ 181

దదర్శాన్యపథా యాంతం శ్రేష్ఠం కార్పటికోత్తమమ్ ।
వహంతం రామలింగార్థం శ్రేష్ఠం భాగీరథీజలమ్ ॥ 182

శంభుః పప్రచ్ఛ తం నత్వా నమ్రం కార్పటికోత్తమమ్ ।
కుతః సమాగతం విప్ర గమ్యతే క్వాధునా వద ॥ 183

**కార్పటిక ఉవాచ**

**ప్రయాగాదాగతం విద్ధి మాం త్వం భూసురసత్తమ ।**
**మధుమాసేఽవగాహార్థమయోధ్యాం ప్రతి గమ్యతే ॥ 184**

**ఇదానీం త్వం నిజం వృత్తం వద బ్రాహ్మణసత్తమ ।**
**కుతః సమాగతం చాత్ర గమ్యతే త్వధునా వద ॥ 185**

ఆహా! నేడు, నేను ఏపుణ్యమువలన మిమ్ము చూస్తినో సెలవిండు," అని వేడెను. అందుకు శంభుడు కొద్దిసేపు ధ్యానించి, దర్శించి "గజమా! వినుము, నీవు ఆ కావేరీతీర రామనాథపురమున శ్రీరామనవమినాడు తీర్థస్నానముచేసి, రామకథనువిని, రామేశ్వర సాంబమూర్తిని దర్శించితివి. ఆ పుణ్యమువలన నాతో గలసితివి. నిన్నుద్ధరించెదను." అని చెప్పి; మరియు వాటి రెంటితో. "ఓ సింహమా! ఓ ఏనుగా! వినుడు. నేను అయోధ్యకు వెళ్ళి, చైత్ర స్నానమును ఆచరించి, తిరిగి కాంచికి వచ్చునప్పుడు మిమ్ములను ఉద్ధరించెదను. మీ సంతోషమునకై యిట్లు శపథము చేసెదను. మీ విషయమున నేను చెప్పినట్లు చేయనియెడల మిత్రద్రోహ, పరనారీగమన, బ్రహ్మహత్యా, మాతృ నిందన పాపములు పొంది దుఃఖింతును." అని వాటిని సమాధానపరచి, శంభుశర్మ భిల్లునితో, ఇల్లాలితో కలసి అయోధ్యకు ప్రయాణమైపోవసాగెను.

పయనించుచున్న వారికి వేరొకమార్గమునుండి వచ్చుచుండు వాడు కనపడెను. అతడు రామేశ్వరుని కై కాశీ నుండి గంగ కావడి మోసికొనువచ్చు తీర్థాటన పరుడు. శంభుశర్మ ఆ తీర్థాటన పరునితో, "స్వామీ! తమరు ఎచ్చటినుండి వచ్చితిరి? ఎచ్చటికి పోవుచున్నారు?" అనెను.

## చైత్రమాస అన్నదాన ప్రభావము, పైశాచిక కథ.

అందుకా తీర్థాటనుడు, "బ్రాహ్మణుడా! నేను ప్రయాగనుండి అయోధ్యానగరమునకు చైత్రస్నానము నకై పోవుచున్నాను. ఇక మీరెక్కడికి? ఎక్కడినుండి? సంగతి సెలవియ్యండి," అని వారిని అడిగెను.

**ఇతి తద్వచనం శ్రుత్వా శంభుః ప్రోవాచ తం తదా ।**
**శివకాంచ్యాః సమాయాతమయోధ్యాం ప్రతి గమ్యతే ॥ 186**

**చైత్రమాసేఽవగాహార్థం గమ్యతే కథితం మయా ।**
**ఇతి శంభువచః శ్రుత్వా పునః కార్పటికోత్తమః ॥ 187**

పప్రచ్ఛ ద్విజవర్యాయ కౌతుకావిష్టమానసః ।
శివకాంచ్యాం శంభునామా కశ్చిద్విప్రోఽస్తి భో ద్విజ ॥ 188

తత్తస్య వచనం శ్రుత్వా పునః శంభుస్తమబ్రవీత్ ।
బహవః శంభునామానో వర్తంతే ద్విజ తత్ర హి ॥ 189

కస్త్వయా పృచ్ఛ్యతే తస్య వద గోత్రోపనామనీ ।
ఇతి విప్రవచః శ్రుత్వా పునః కార్పటికోఽబ్రవీత్ ॥ 190

భారద్వాజకులోత్పన్నం చక్రగోప్యుపనామకమ్ ।
మహాదేవసుతం సర్వవేదశాస్త్రవిశారదమ్ ।
బ్రాహ్మణం శంభునామానం జానీషే త్వం న వా వద ॥ 191

ఏవం మహాకార్పటికేన సర్వం
గోత్రోపనామాదికమాదరేణ ।
ప్రోక్తం యథా తత్ర స భూసురోఽపి
జ్ఞాత్వా నిజం సర్వమథావదత్తమ్ ॥ 192

భో భో కార్పటికశ్రేష్ఠ కిమర్థం త్వం హి పృచ్ఛసి ।
తద్వదస్వ సవిస్తారం మా శంకాం కురు చాత్ర హి ॥ 193

కార్పటిక ఉవాచ

శృణు విప్ర ప్రవక్ష్యామి యదర్థం పృచ్ఛ్యతే మయా ।
యదాఽహం గతవాన్ గంగాసాగరం ద్రష్టుమాదరాత్ ॥ 194

సీతాకుండసమీపే హి దేశే కైకటనామకే ।
దృష్టోఽహం మార్గమధ్యే చ పిశాచేనోగ్రరూపిణా ॥ 195

మాం హంతుం నికటం ప్రాప్తం తం దృష్ట్వాఽహం తదా ద్విజ ।
శ్రీరామకీర్తనం దీర్ఘం కృతవాన్ భయకంపితః ॥ 196

కీర్తనాద్రామచంద్రస్య స పిశాచః పలాయనమ్ ।
మత్తః కృత్వా దూరదేశే స్థిత్వా శుశ్రావ కీర్తనమ్ ॥ 197

**తస్మాజ్జ్ఞాతా పూర్వజన్మ స్మృతిస్తస్య శుభావహా ।**
**త్రాహి త్రాహీతి మాం ప్రాహ మయా పృష్టః స వై పునః ॥ 198**

**కస్మాత్పిశాచదేహే త్వం జాతస్తద్వద సత్వరమ్ ।**
**ఇతి మే వచనం శ్రుత్వా పిశాచః ప్రాహ మాం పునః ॥ 199**

**కాంచీపుర్యాం ద్విజశ్చాహం ధుండినామా పురా స్థితః ।**
**నాన్నదానం మయా పూర్వం కృతం స్వల్పమపి క్వచిత్ ॥ 200**

అంత ఆ శంభుడు "సంతానము కొరకు చైత్రస్నానార్థమై కాంచినుండి అయోధ్యకు పోవుచున్నాను, నీకై నాసంగతిని చెప్పితిని," అని పలికెను. పిదప ఆ తీర్థసేవి, "శివ కంచిలో శంభుడు అనువాడు ఉన్నాడా?" అని ఆశ్చర్యముతో అడిగెను. అందుకతడు "శంభు అని పేరుగలిగినవారు అక్కడ ఎందరో గలరు, నీ వెవనిగురించి అడిగితివి? వాని గోత్రము, ఇంటిపేరును చెప్పు"మనెను. తీర్థవాసి, "భారద్వాజగోత్రుడు, చక్రగోపం వారని యింటిపేరు, వేదశాస్త్రనిపుణుడు, పేరు శంభుడు, తండ్రి పేరు మహాదేవుడు. ఈ వివరాలు గలవాడు నీకు తెలుసునా?" అని యడిగెను. అంత ఆ శంభుడు తన సంగతిగానున్నదని ఆలోచించి, తీర్థవాసితో, "స్వామీ! తమరు వానిని గురించి ఏల విచారిస్తున్నారు? శంకింపక సంగతి సెలవివ్వండి." యని యడిగెను. అందుకతడు, "వినుము విప్రా! నేను గంగాసాగర సంగమ దర్శనమునకై పోవునప్పుడు, కీకటదేశమున సీతాకుండ సమీపమున మార్గమధ్యమందు నన్నొక ఘోరపిశాచము చంపవచ్చెను, నేను వెరచుచు, అరచుచు శ్రీరాముని కీర్తించితిని. రామ నామ కీర్తనచే పిశాచము పరుగెత్తి దూరమున నిలచి, కీర్తనను వినెను. అందుచే దానికి దాని తొలి జన్మ జ్ఞప్తికివచ్చి, "రక్షింపుము, రక్షింపుము," అని వేడెను. అపుడు నేను, దానితో, "నీవేల పిశాచమై తిరుగుతున్నావ"ని అడిగితిని. అందుకది, "నేను కాంచిలో ధుండిశర్మ కొడుకైన మహాదేవుడను విప్రుడను. నేను కొంచమైన అన్నదానము చేయకపోతిని. అందుచే ఈ పిశాచ జన్మము వచ్చె." అని చెప్పెను.

**తస్మాత్పిశాచదేహత్వం ప్రాప్తం కార్పటికోత్తమ ।**
**ఇతి తస్య వచః శ్రుత్వా పునః ప్రోక్తః స వై మయా ॥ 201**

**కథం పిశాచయోన్యాస్తు తే ముక్తిశ్చ భవిష్యతి ।**
**తతః పునః స మాం ప్రాహ యది మే తనయః శుచిః ॥ 202**

చైత్రే దర్శే మమోద్దేశాదన్నదానం కరిష్యతి ।
భవిష్యతి మమోద్ధారస్తత్క్షణాన్నాత్ర సంశయః ॥ 203

ఇతి తద్వచనం శ్రుత్వా పునః ప్రోక్తః స వై మయా ।
వర్తతే క్వ పునస్తే హి కింనామా వద మాం ప్రతి ॥ 204

తతస్తేన యథా ప్రోక్తం భారద్వాజాద్య చిహ్నజమ్ ।
తత్ప్రోక్తం చ మయా సర్వం నికటే తవ భో ద్విజ ॥ 205

పిశాచం హి పునశ్చాహముక్తవాన్ తద్వదామ్యహమ్ ।
రామేశార్థం భో పిశాచ నీయతే జాహ్నవీజలమ్ ॥ 206

మయా కరండమధ్యే హి యదా గచ్ఛామి దక్షిణామ్ ।
దిశః కాలేన కాంచీం హి ప్రవేక్ష్యామి యదా తదా ॥ 207

తవ పుత్రాయ వృత్తం హి కథయిష్యామ్యహం తవ ।
ఇతి మద్వచనం శ్రుత్వా సంతోషం పరమం గతః ॥ 208

పిశాచః ప్రాహ మాం విప్ర స్తుత్వా నత్వా పునః పునః ।
అవశ్యమేవ వక్తవ్యం మే వృత్తం మమ సూనవే ॥ 209

యథా దృష్టం త్వయా పాంథ యథోక్తం చ మయా తవ ।
అన్యచ్చ కథ్యతాం తస్మై మమ పుత్రాయ సాదరమ్ ॥ 210

మధుదర్శేఽన్నదానస్య మహిమా శ్రూయతే దివి ।
అతస్త్వం హి మమోద్దేశేనాన్నదానం మధౌ కురు ॥ 211

ఏవముక్త్వా స పిశాచః శపథం మాం చకార హ ।
న బ్రూషే స్మరణం కృత్వా మమ పుత్రాయ తద్ద్విజ ॥ 212

భవిష్యతి వృథా సర్వయాత్రా తవ మహామతే ।
ఇతి మద్వచనం శ్రుత్వా సాంత్వయిత్వా చ తం పునః ॥ 213

నిర్గతోఽస్మి మధౌ స్నాతుమయోధ్యాం గంతుమాదరాత్ ।
కృత్వాఽయోధ్యాపురీమధ్యే చైత్రస్నానం మహాఫలమ్ ॥ 214

**యదా గచ్ఛామి తాం కాంచీం తదా తస్మై వదామ్యహమ్ ।**
**అతఏవ మయా పృష్టస్తవ శంభుర్ద్విజోత్తమః ॥ 215**

**ప్రోక్తం గోత్రాదిభిర్లింగం వర్తతే చేద్వదస్వ మామ్ ।**
**ఇతి శంభుః పితుర్వృత్తం జ్ఞాత్వా మూర్ఛాం గతస్తదా ॥ 216**

**ఆశ్వాసితశ్చ భిల్లేన విప్రః ప్రోవాచం తం పునః ।**
**భోః భోః కార్పటికశ్రేష్ఠ న మత్తోఽస్తి నరోఽధమః ॥ 217**

**యస్త్వయా పృచ్ఛ్యతే శంభుః సోఽహం విద్ధి న సంశయః ।**
**మయా పుత్రేణ న కృతం స్వపితుర్మోక్షదాయకమ్ ॥ 218**

**అన్నదానాదికం కర్మ ధిగ్ధింగ్మేఽయం వృథా భవః ।**
**ఇదానీం తవ వాక్యేన దాస్యామ్యన్నం మధౌ పితుః ॥ 219**

దీనినుండి విముక్తి యెట్లుకాగలదనగా, “నా కుమారుడు నన్ను ఉద్దేశించి చైత్రమాస అమావాస్య యందు అన్నదానముచేసితే వెంటనే నాకు పైశాచికముక్తి గల్గును.” అని తనకొడుకుయొక్క గోత్రనామాదులను చెప్పెను. అప్పుడు నేను “రామలింగునికై గంగను కొనిపోదును. మార్గవశమున కాంచికిపోయి నీ పుత్రునికి ఈ సంగతిని చెప్పెదను.” అని మాట ఇచ్చితిని. అంత ఆ పిశాచము సంతసించుచు పలుమార్లు నమస్కరించి, “చైత్రమాసపు అన్నదానమును స్వర్గము కొనియాడుచున్నది. కావున ఆనాడే చేయునట్లు నాపుత్రునికి చెప్పుము. అట్లు చెప్పనిచో నీ యాత్రాఫలమంతయు వ్యర్థమగును.” అని నాకు శపథము చెప్పెను. పిమ్మట వారిని సమాధానపరచి ఇట్లు చైత్ర స్నాన మునకై వెడలివచ్చితిని. కాంచికి పోయినప్పుడీసంగతి ఆ శంభునితో చెప్పవలెను. నీకు వాడు తెలిసియుండిన జెప్పుమనెను. ఇట్లు తండ్రి వృత్తాంతమును విని శంభుడు మూర్ఛనొందెను. వ్యాధుడు ఉపచారములు చేసెను. తెలివివచ్చిన తరువాత శంభుడు తీర్థాటనునితో, “భూసురవర్యా! నావంటి నరాధముడుండడు, నీవెవని గురించి అడిగితివో ఆ శంభుడనువాడు నేనే”. తన తండ్రికి ముక్తియగుటకై అన్నదానము చేయని పాపియైతిని. నాజన్మమువ్యర్థము. ఇదిగో ఈ చైత్రమున చేయుదును” అని చెప్పెను.

**ఏవం శంభుః కార్పటికాయ చోక్త్వా**
**అయోధ్యాం రమ్యాం దూరతో వై దదర్శ ।**
**తే ప్రణేముస్తాం దంపతీపాంథభిల్లా**
**స్తతః శంభుశ్చావదత్కర్కశం సః ॥ 220**

పాదాంగుళీః సదా పాతు మమ నూపురనిఃస్వనా ।
రోమాణ్యవతు మే నిత్యం పీతకాశేయవాసినీ ॥ 25

రాత్రౌ పాతు కాలరూపా దినే దానైకతత్పరా ।
సర్వకాలేషు మాం పాతు మూలకాసురఘాతినీ ॥ 26

ఏవం సుతీక్ష్ణసీతాయాః కవచం తే మయేరితమ్ ।
ఇదం ప్రాతః సముత్థాయ స్నాత్వా నిత్యం పఠేత్తు యః ॥ 27

ఇక సుతీక్ష్ణ – అగస్త్య సంవాదాత్మకమగు సీతాకవచము చెప్పబడుచున్నది :

ఆవరణచిహ్నితమగు సీతాకవచము గురువుగారివద్ద ఉపదేశము పొంది, భక్తితో జపించవలయును. ప్రొద్దున లేచి స్నానము చేసి, కవచమును జపించి, శ్రీ సీతాదేవిని ఆరాధించినవాడు స్త్రీ, పుత్ర, సుఖ, ధనాది సకల కామములను పొందును. దీని నియమము ఏమనిన; ఎనిదిమార్లు సతతము జపింపవలయును, సీతాప్రీతికై ఎనిమిదిమంది బ్రాహ్మణులను ఫల పుష్పాది ఉపచారములతో ఆరాధింపవలయును.

జానకీం పూజయిత్వా చ సర్వాన్కామానవాప్నుయాత్ ।
ధనార్థీ ప్రాప్నుయాద్ద్రవ్యం పుత్రార్థీం పుత్రమాప్నుయాత్ ॥ 28

స్త్రీకామార్థీ శుభాం నారీం సుఖార్థీ సౌఖ్యమాప్నుయాత్ ।
అష్టవారం జపనీయం సీతాయాః కవచం సదా ॥ 29

అష్టభ్యో విప్రవర్యేభ్యో నరః ప్రీత్యఽర్పయేత్సదా ।
ఫలపుష్పాదికాదీని యాని తాని పృథక్ పృథక్ ॥ 30

సీతాయాః కవచం చేదం పుణ్యం పాతకనాశనమ్ ।
యే పఠంతి నరా భక్త్యా తే ధన్యా మానవా భువి ॥ 31

పఠంతి రామకవచం సీతాయాః కవచం వినా ।
తథా వినా లక్ష్మణస్య కవచేన వృథా స్మృతమ్ ॥ 32

తస్మాత్సదా నరైర్జప్యం కవచానాం చతుష్టయమ్ ।
ఆదౌ తు వాయుపుత్రస్య లక్ష్మణస్య తతః పరమ్ ॥ 33

తతః పఠేచ్చ సీతాయాః శ్రీరామస్య తతఃపరమ్ ।
ఏవం సదా జపనీయం కవచానాం చతుష్టయమ్ ॥ 34

ఇతి సీతాకవచమ్ ।

ఏవం సుతీక్ష్ణ సీతాయాః కవచం తే మయేరితమ్ ।
అతః పరం శృణుష్వాప్యత్సీతాయాః స్తోత్రముత్తమమ్ ॥ 35

యస్మిన్నష్టోత్తరశతం సీతానామాని సంతి హి ।
అష్టోత్తరశతం సీతానామ్నాం స్తోత్రమనుత్తమమ్ ॥ 36

యే పఠంతి నరాస్త్వత్ర తేషాం చ సఫలో భవః ।
తే ధన్యా మానవా లోకే తే వైకుంఠం వ్రజంతి హి ॥ 37

అస్య శ్రీసీతానామాష్టోత్తరశతమంత్రస్య ।
అగస్త్య ఋషిః । అనుష్టుప్ ఛందః । రమేతి బీజం ।
మాతులింగీతి శక్తిః । పద్మాక్షజేతి కీలకమ్ । అవనిజేత్యస్త్రమ్ ।
జనకజేతి కవచమ్ । మూలకాసురమర్దినీతి పరమో మంత్రః ।
శ్రీసీతారామచంద్రప్రీత్యర్థం సకలకామనాసిద్ధ్యర్థం జపేవినియోగః ।

అథ అంగులిన్యాసః

ఓం సీతాయై అంగుష్ఠాభ్యాం నమః ।
ఓం రమాయై తర్జనీభ్యాం నమః ।
ఓం మాతులింగ్యై మధ్యమాభ్యాం నమః ।
ఓం పద్మాక్షజాయై అనామికాభ్యాం నమః ।
ఓం అవనిజాయై కనిష్ఠికాభ్యాం నమః ।
ఓం జనకజాయై కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

అథ హృదయాదిన్యాసః ।

ఓం సీతాయై హృదయాయ నమః ।
ఓం రమాయై శిరసే స్వాహా ।

**ఓం మాతులింగ్యై శిఖాయై వషట్ ।**
**ఓం పద్మాక్షజాయై నేత్రత్రయాయ వౌషట్ ।**
**ఓం జనకాత్మజాయై అస్త్రాయ ఫట్ ।**
**ఓం మూలకాసుర మర్దిన్యై ఇతి దిగ్బంధః**

ఈ కవచమును పఠించినవాడు ధన్యుడు. ఇది మిక్కిలి పుణ్యకరము, పాపపరిహారకము. సీతా, లక్ష్మణ కవచములను పఠింపక శ్రీరామకవచమును పఠింపరాదు. కావున హనుమత్, లక్ష్మణ, సీతా, రామ కవచములను నాల్గింటిని క్రమముగా పఠించవలయును. అట్లు పఠించనిచో అది వ్యర్థము. (34)

జన్మ సాఫల్యతనిచ్చి వైకుంఠప్రాప్తిని కలిగించునట్టి సీతాష్టోత్తర శతనామస్తోత్రమిది. ఇది భుక్తి, ముక్తి ప్రదము.

అథ సీతాఽష్టోత్తర శతనామ స్తోత్రమ్ ।

**వామాంగే రఘునాయకస్య రుచిరే యా సంస్థితా శోభనా**
**యా విప్రాధిపయానరమ్యనయనా యా విప్రపాలాననా ।**
**విద్యుత్పుంజవిరాజమాన వసనా భక్తార్తిసంఖండనా**
**శ్రీమద్రాఘవ పాదపద్మయుగళన్యస్తేక్షణా సాఽవతు ॥ 38**

**శ్రీసీతా జానకీ దేవీ వైదేహీ రాఘవప్రియా ।**
**రమాఽవనిసుతా రామా రాక్షసాంతప్రకారిణీ ॥ 39**

**రత్నగుప్తా మాతులింగీ మైథిలీ భక్తతోషదా ।**
**పద్మాక్షజా కంజనేత్రా స్మితాస్యా నూపురస్వనా ॥ 40**

**వైకుంఠనిలయా మా శ్రీర్ముక్తిదా కామపూరణీ ।**
**నృపాత్మజా హేమవర్ణా మృదులాంగీ సుభాషిణీ ॥ 41**

**కుశాంబికా దివ్యదా చ లవమాతా మనోహరా ।**
**హనుమద్వందితపదా ముగ్ధా కేయూరధారిణీ ॥ 42**

**అశోకవనమధ్యస్థా రావణాదికమోహినీ ।**
**విమానసంస్థితా సుభ్రూః సుకేశీ రశనాన్వితా ॥ 43**

రజోరూపా సత్వరూపా తామసీ వహ్నివాసినీ ।
హేమమృగాసక్తచిత్తా వాల్మీక్యాశ్రమవాసినీ ॥ 44

పతివ్రతా మహామాయా పీతకౌశేయవాసినీ ।
మృగనేత్రా చ బింబోష్ఠీ ధనుర్విద్యావిశారదా ॥ 45

సౌమ్యరూపా దశరథస్నుషా చామరవీజితా ।
సుమేధాదుహితా దివ్యరూపా త్రైలోక్యపాలినీ ॥ 46

అన్నపూర్ణా మహాలక్ష్మీర్ధీర్లజ్జా చ సరస్వతీ ।
శాంతిః పుష్టిః క్షమా గౌరీ ప్రభాఽయోధ్యానివాసినీ ॥ 47

వసంతసీతలా గౌరీ స్నానసంతుష్టమానసా ।
రమానామభద్రసంస్థా హేమకంకణమండితా ॥ 48

సురార్చితా ధృతిః కాంతిః స్మృతిర్మేధా విభావరీ ।
లఘూదరా వరారోహా హేమకంకణమండితా ॥ 49

ద్విజపత్న్యర్పితనిజభూషా రాఘవతోషిణీ ।
శ్రీరామసేవనరతా రత్నతాటంకధారిణీ ॥ 50

రామవామాంకసంస్థా చ రామచంద్రైకరంజనీ ।
సరయూజలసంక్రీడాకారిణీ రామమోహినీ ॥ 51

సువర్ణతులితా పుణ్యా పుణ్యకీర్తిః కలావతీ ।
కలకంఠా కంబుకంఠా రంభోరుర్గజగామినీ ॥ 52

రామార్పితమనా రామవందితా రామవల్లభా ।
శ్రీరామపదచిహ్నాంకా రామరామేతిభాషిణీ ॥ 53

రామపర్యంకశయనా రామాంఘ్రిక్షాలినీ వరా ।
కామధేన్వన్నసంతుష్టా మాతులుంగకరే ధృతా ॥ 54

దివ్యచందనసంస్థా శ్రీర్మూలకాసురమర్దినీ ।
ఏవమష్టోత్తరశతం సీతానామ్నాం సుపుణ్యదమ్ ॥ 55

యే పఠంతి నరా భూమ్యాం తే ధన్యాః స్వర్గగామినః ।
అష్టోత్తరశతం నామ్నాం సీతాయాః స్తోత్రముత్తమమ్ ॥ **56**

జపనీయం ప్రయత్నేన సర్వదా భక్తిపూర్వకమ్ ।
సంతి స్తోత్రాణ్యనేకాని పుణ్యదాని మహాంతి చ ॥ **57**

నానేన సదృశానీహ తాని సర్వాణి భూసుర ।
స్తోత్రాణాముత్తమం చేదం భుక్తిముక్తిప్రదం నృణామ్ ॥ **58**

ఏవం సుతీక్ష్ణ తే ప్రోక్తమష్టోత్తరశతం శుభమ్ ।
సీతానామ్నాం పుణ్యదం చ శ్రవణాన్మంగళప్రదమ్ ॥ **59**

నరైః ప్రాతః సముత్థాయ పఠితవ్యం ప్రయత్నతః ।
సీతాపూజనకాలేఽపి సర్వవాంఛితదాయకమ్ ॥ **60**

అన్యత్సీతాతోషదాని వ్రతాదీని మహాంతి చ ।
యాని సంత్యద్య తే శిష్య తాని సమ్యగ్వదామ్యహమ్ ॥ **61**

నారీభిస్తు సదా కార్యం సీతాయాస్తుష్టిహేతవే ।
వసంతసీతలాగౌరీస్నానం తీర్థే తు తత్కృతేః ॥ **62**

యత్ర సీతాకృతం తీర్థం రామతీర్థం న వర్తతే ।
తథా లక్ష్మ్యాశ్చ గౌర్యాశ్చ సరస్వత్యాదియోషితామ్ ॥ **63**

తీర్థేషు చ సదా కార్యం తద భావే నదీషు చ ।
యత్ర యత్ర రామతీర్థం తద్వామే జానకీకృతమ్ ॥ **64**

సీతాష్టోత్తర స్తోత్రము స్వర్గప్రదము. దీనితో సమమైన స్తోత్రము వేరొకటి లేదు. వినిన మాత్రమున మహామంగళ దాయకము. ఉదయపు సమయాన సీతాదేవిని పూజించే సమయంలో దీనిని పఠించిన, సకలకోరికలు తీరును.(60)

జ్ఞేయం తీర్థం తు సర్వత్ర నైకం జ్ఞేయం తు రాఘవమ్ ।
వసన్తశీతలాగౌరీస్నానం సౌభాగ్యవర్ధనమ్ ॥ **65**

న కుర్వంత్యత్ర యా నార్యః స్నానం తాః సప్తజన్మసు ।
భవంతి విధవాస్తస్మాత్సదా స్నానం సమాచరేత్ ॥ 66

సుతీక్ష్ణ ఉవాచ

భో గురో శీతలాగౌరీస్నానస్యోద్యాపనం కథమ్ ।
స్త్రీభిః కార్యం వదస్వాద్య సవిస్తారం శుభావహమ్ ॥ 67

అగస్తిరువాచ

సమ్యక్ పృష్టం త్వయా శిష్య సుతీక్ష్ణ శృణు సాదరమ్ ।
చైత్రమాసే సితే స్త్రీభిస్తృతీయాయాః సదాऽత్ర వై ॥ 68

కార్యం తు శీతలాగౌరీస్నానం త్రింశద్దినాని హి ।
వైశాఖస్య సితే పక్షే ద్వితీయాయాముపోష్య చ ॥ 69

స్త్రీభిశ్చ విధినా కార్యం నిశాయామధివాసనమ్ ।
పూర్వవచ్చ ప్రకర్తవ్యం మండపాదికముత్తమమ్ ॥ 70

తత్ర రమానామభద్రమష్టోత్తరసహస్రకమ్ ।
అథవాऽష్టోత్తరశతం సూక్ష్మాణ్యన్యాని వా క్రమాత్ ॥ 71

స్థాపనీయం మధ్యదేశే తన్మధ్యే పంకజోపరి ।
ధాన్యరాశౌ తోయపూర్ణః స్థాపనీయో ఘటః శుభః ॥ 72

తన్ముఖే తత్రపాత్రం చ స్థాపనీయం తు విస్తృతమ్ ।
ఆచ్ఛాద్య పాత్రం కౌశాయవస్త్రేణ తన్మనోరమమ్ ॥ 73

తస్మిన్ సీతారామయోశ్చ ద్వే మూర్తీ రుక్మనిర్మితే ।
స్థాపనీయే పూజనీయే షోడశైరుపచారకైః ॥ 74

నవమాషాత్మకో రామః సీతాऽష్టమాషనిర్మితా ।
నిజశక్త్యాऽథవా కార్యే ద్వే మూర్తీ రజతస్య వా ॥ 75

గంధపుష్పధూపదీపనైవేద్యవసనాదికమ్ ।
సర్వం పృథగష్టవిధం జానక్యై తు నివేదయేత్ ॥ 76

తతః స్త్రీణాం వాయనాని వస్త్రాలంకార వస్తుభిః ।
కుంకుమాదిపూరితాని దేయాని వివిధానిచ ॥ 77

దేయాని కాంస్యపాత్రాణి పక్వాన్నపూరితాని చ ।
త్రయస్త్రింశత్తథా వాఽష్టౌ స్త్రిభిర్దేయాని శక్తితః ॥ 78

త్రయస్త్రింశచ్చ యుగ్మాని భోజయేచ్చ ప్రయత్నతః ।
అథవాఽష్టౌ యథాశక్త్యా భోజనీయాని షడ్రసైః ॥ 79

రాత్రౌ జాగరణం కార్యం గీతవాద్యాదిమంగళైః ।
ప్రాతః కాలే తృతీయాయాం స్నాత్వా సంపూజ్య జానకీమ్ ॥ 80

హోమశ్చాపి ప్రకర్తవ్యః సీతామంత్రేణ యత్నతః ।
తిలాజ్యైః పాయసైశ్చాపి సహస్రాణ్యష్టభూసురైః ॥ 81

ముద్గహీనం నవాన్నం చ జ్ఞేయమష్టాన్నముత్తమమ్ ।
తత్సీతాతోషదం జ్ఞేయం తేన వా జుహుయాత్సుఖమ్ ॥ 82

సీతాదేవికి ఇష్టమైన మరికొన్ని వ్రతములు ఏవి అనిన- స్త్రీలు వసంతసీతలా గౌరీ స్నానమును ప్రొద్దునే చేయవలయును. దీనికి సీతాతీర్థమే ముఖ్యము. నదులలో త్రిశక్తి ఆవాహనము జేసి చేయునది, అదిలేనిచో ఎచ్చటెచ్చట రామతీర్థముండునో దానికి ఎడమప్రక్కలో సీతాతీర్థమును కల్పించికొని, దానిలో చేయునది. దీనిని ఆచరించినవారు విధవలు కారు. దాని ఉద్యాపనవిధి అగస్త్యముని సుతీక్ష్ణునికి జెప్పుచున్నాడు.

చైత్ర శుద్ధతృతీయ మొదలు, వైశాఖ శుద్ధతృతీయ వరకు శీతలాగౌరీ స్నాన వ్రతమును ఆచరించి, ఆ తదియనాడు ఉపవాసవిధితో ఆ రాత్రి అధివాసముజేసి, వెనుక జెప్పినట్లు మంటపాదులను నిర్మించి, అచ్చట 1008 గాని, 108 గాని రమానామ భద్రమును ఇంక తక్కువగా సూక్ష్మముగా నైనను లిఖించి, నడుమ తామరమీద ధాన్యరాశిపై పూర్ణకలశమును పెట్టి, అలంకరించి, అందు 9 మాడలతో రామమూర్తిని, 8 మాడలతో సీతాప్రతిమను యథాశక్తితో చేయించి, అష్టవిధ పుష్ప గంధాదులచే షోడశోపచారములతో ఆరాధించునది. శక్తి ఉన్నచో కనీసం 33 మందికి శక్తిలేనిచో కనీసం 8 మందికైనను సువాసినులకు మంగళద్రవ్య వస్త్రాలంకారాదులతో, పక్వాన్నములుగల కంచుపాత్రలను వాయనములుగా భక్తితో సమర్పింపవలయును.

తతః స్వయం సుహృన్మిత్రైర్భోక్తవ్యం చ యథాసుఖమ్ ।
ఏవముద్యాపనవిధిస్తవాగ్రే వినివేదితః ॥ 83

శ్రీరామదాస ఉవాచ

అగస్తినా సుతీక్ష్ణాయ యదిదం కథితం పురా ।
తత్సర్వం చ త్వయా పృష్టం మయా తేఽద్య నివేదితమ్ ॥ 84

విష్ణుదాస ఉవాచ

కథం రమానామభద్రం కార్యం స్త్రీభిః ప్రపూజనే ।
తత్సర్వం విస్తరేణాద్య కథయస్వ మమాగ్రతః ॥ 85

శ్రీరామదాస ఉవాచ

యథా ప్రోక్తం మయా శిష్య రామతోభద్రముత్తమమ్ ।
కార్యం రమానామభద్రం తథైవ సకలం శుభమ్ ॥ 86

కించిద్విశేషస్తత్రాస్తి తత్తుభ్యం కథయామ్యహమ్ ।
లింగస్థలేషు కర్తవ్యా వాపికాశ్చైవ పూర్వవత్ ॥ 87

ముద్రాయామేవ కించిచ్చ విశేఽషోస్తి శృణుష్వ తత్ ।
నాకారశ్చ మకారశ్చ పూర్వవద్రచయేదధః ॥ 88

ఊర్ధ్వం రమేత్యక్షరే ద్వే రచనీయే తు పూర్వవత్ ।
ఏవం కృత్వా రామనామ శ్వేతవర్ణం నిరీక్షయేత్ ॥ 89

ఏతద్రామనామభద్రం దేవీనాం పూజనాదిషు ।
నానాకర్మసు సర్వేషు కర్తవ్యం చ ప్రయత్నతః ॥ 90

వినా రమానామభద్రాద్యాని దేవ్యాః కృతాని హి ।
పూజనాదీని కర్మాణి తాని జ్ఞేయాని మానవైః ॥ 91

అకృతాన్యత్ర తస్మాద్ధి కర్తవ్యం యత్నతస్త్విదమ్ ।
కృతా రమానామభద్రే యా పూజా మానవైర్భువి ॥ 92

**సా దేవ్యై తోషదా జ్ఞేయా తస్మాత్కార్యా ప్రయత్నతః ।**
**పూర్వోక్తాని దైవతాని తాన్యేవాత్ర విచింతయేత్ ॥ 93**

**ఆవాహయేచ్చ ముద్రాయాం జానకీం రఘునందనమ్ ।**
**అన్యచ్ఛృణుష్వ భో శిష్య సీతారామప్రపూజనే ॥ 94**

**రమానామతోభద్రం చ కార్యం వా మానవైర్భువి ।**
**తచ్చాపి పూర్వవత్సర్వం కర్తవ్యం మానవైర్ధియా ॥ 95**

**ఇదం సీతారామయోశ్చ పూజనార్థం ప్రకల్పయేత్ ।**
**రామనామ్నా రమానామ్నా ఇదం భద్రం మహత్తమమ్ ॥ 96**

**యత్ర ద్వయోర్నామానీ చ రమా రామేతి చోత్తమే ।**
**రమారామతో భద్రం చ తస్మాచ్ఛ్రేష్ఠం ప్రకారయేత్ ॥ 97**

**రామాసనోపమాన్యేవ దేవన్యత్ర విచింతయేత్ ।**
**ఏవం శిష్య త్వయా పృష్టం యద్యత్తత్తన్మయోదితమ్ ॥ 98**

33 మందికి గాని, 8 మందికి గాని దంపతులకు భోజనము పెట్టవలయును. రాత్రి మంగళ గీతములతో జాగారము జేసి, తదియనాడు ప్రొద్దున సీతాదేవిని పూజించి, 1008 మార్లు సీతామంత్రము తో తిల, ఆజ్య, పాయసముతో హోమమును చేయించవలయును. ఇంతకుమునుపు చెప్పిన నవాన్నము లలో ముద్గాన్నము లేనిది అష్టాన్నమనబడును. అష్టాన్నముతో నైనను హోమము చేయవచ్చును. పిదప మిత్ర, బంధు పరివారముతో కూడి భుజించునది. ఇక రామనామ భద్రక్రమమును రామతోభద్రమువలెనే రచింపవలయును. ఇది దేవీ పూజనాదులలో ఉత్తమము. ఇచ్చట దేవత ఆవాహనాదిక మంతయును మునుపటివలెనే చేయునది. రామాసనము వలెనే దేవతా చింతనము. ఇది శ్రీసీతారాములకు సుప్రీతికరము. **'రమా' 'రామా'** దినామ భద్రరచనలేక చేయు పూజనము వ్యర్థము. కనుక దానిని ముఖ్యముగా రచింపవలయును అని రామదాసముని విష్ణుదాసమునికి చెప్పుచున్నాడు. సుతీక్ష్ణమునికి అగస్త్యమునీంద్రుడు ఉపదేశించిన లక్ష్మణ, భరత, శత్రుఘ్న కవచములను చెప్పుచున్నాడు.

**కా తేఽన్యాస్తి స్పృహా శ్రోతుం వద తాం తద్వదామ్యహమ్ ।**
**విష్ణుదాస ఉవాచ**
**కవచం లక్ష్మణస్యాపి పఠనీయమితి స్మృతమ్ ॥ 99**

పురా గురో త్వయా తచ్చ మాం వదస్వ సవిస్తరాత్ ।
భరతస్యాపి కవచం శత్రుఘ్నస్య తథా వద ॥ **100**

శ్రీరామదాస ఉవాచ
ఏవమేవ సుతీక్ష్ణేన పృష్టం చ కుంభజన్మనా ।
పురా తద్విస్తరేణాద్య తవాగ్రే కథయామ్యహమ్ ॥ **101**

సుతీక్ష్ణ ఉవాచ
గురో త్వయా పురా ప్రోక్తం కవచం లక్ష్మణస్య చ ।
పఠనీయం జనైశ్చేతి తన్మామద్య ప్రకాశయ ॥ **102**

భరతస్యాపి కవచం శత్రుఘ్నస్య తథా వద ।
అగస్తిరువాచ
సమ్యక్ పృష్టం త్వయా వత్స సావధానమనాః శృణు ।
ఆదౌ సౌమిత్రికవచం కథ్యతేఽద్య మయా శుభమ్ ॥ **103**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, సీతారామకవచాదినిరూపణం నామ, చతుర్దశః సర్గః ॥**

శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని మనోహరకాండలో సీతారామకవచమును బోధించు 14వ సర్గ ముగిసినది.

# పంచదశః సర్గః-15వ సర్గ

లక్ష్మణ, శత్రుఘ్న కవచములు.

## శ్రీలక్ష్మణ కవచమ్

సౌమిత్రిం రఘునాయకస్య చరణద్వంద్వేక్షణం శ్యామలం
బిభ్రంతం స్వకరేణ రామశిరసి ఛత్రం విచిత్రం వరమ్ ।
బిభ్రంతం రఘునాయకస్య సుమహత్కోదండబాణాసనే
తం వందే కమలేక్షణం జనకజావాక్యే సదా తత్పరమ్ ॥ 1

ఓం అస్య శ్రీలక్ష్మణకవచమంత్రస్య । అగస్త్యఋుషిః । అనుష్టుప్ ఛందః ।
శ్రీలక్ష్మణో దేవతా । శేష ఇతి బీజమ్ । సుమిత్రానందన ఇతి శక్తిః ।
రామానుజ ఇతి కీలకమ్ । రామదాస ఇత్యస్త్రమ్ ।
రఘువంశజ ఇతి కవచమ్ । సౌమిత్రిరితిమంత్రః ।
శ్రీలక్ష్మణప్రీత్యర్థం సకలమనోఽభిలషితసిద్ధ్యర్థం జపే వినియోగః ।

అథ అంగులిన్యాసః

| | | |
|---|---|---|
| ఓం లక్ష్మణాయ | అంగుష్ఠాభ్యాం | నమః । |
| ఓం శేషాయ | తర్జనీభ్యాం | నమః । |
| ఓం సుమిత్రానందనాయ | మధ్యమాభ్యాం | నమః । |
| ఓం రామానుజాయ | అనామికాభ్యాం | నమః । |
| ఓం రామదాసాయ | కనిష్ఠికాభ్యాం | నమః । |
| ఓం రఘువంశజాయ | కరతలకరపృష్ఠాభ్యాం | నమః । |

ఏవం హృదయాది అంగన్యాసః

| | |
|---|---|
| ఓం లక్ష్మణాయ | హృదయాయ నమః । |
| ఓం శేషాయ | శిరసే స్వాహా । |
| ఓం సౌమిత్రాయ | శిఖాయై వషట్ । |

ఓం రామానుజాయ కవచాయ హుమ్ ।
ఓం రామదాసాయ నేత్రత్రయాయ వౌషట్ ।
ఓం రఘువంశజాయ అస్త్రాయ ఫట్ ।
ఓం సౌమిత్రయే ఇతి దిగ్బంధః ।

అథ ధ్యానమ్ ।

రామపృష్ఠస్థితం రమ్యం రత్నకుండలధారిణమ్ ।
నీలోత్పలదళశ్యామం రత్నకంకణమండితమ్ ॥ 2

రామస్య మస్తకే దివ్యం బిభ్రంతం ఛత్రముత్తమమ్ ।
వీరం పీతాంబరధరం ముకుటేనాతిశోభితమ్ ॥ 3

తూణీరే కార్ముకే చాపి బిభ్రంతం చ స్మితాననమ్ ।
రత్నమాలాధరం దివ్యం పుష్పమాలావిరాజితమ్ ॥ 4

ఏవం ధ్యాత్వా లక్ష్మణం చ రాఘవన్యస్తలోచనమ్ ।
కవచం జపనీయం హి తతో భక్త్యాఽత్ర మానవైః ॥ 5

లక్ష్మణః పాతు మే పూర్వే దక్షిణే రాఘవానుజః ।
ప్రతీచ్యాం పాతు సౌమిత్రిః పాతూదీచ్యాం రఘూత్తమః ॥ 6

అధః పాతు మహావీరశ్చోర్ధ్వం పాతు నృపాత్మజః ।
మధ్యే పాతు రామదాసః సర్వతః సత్యపాలకః ॥ 7

స్మితాననః శిరః పాతు ఫాలం పాతూర్మిలాధవః ।
భ్రూవోర్మధ్యే ధనుర్ధారీ సుమిత్రానందనోఽక్షిణీ ॥ 8

కపోలే రామమంత్రీ చ సర్వదా పాతు వై మమ ।
కర్ణమూలే సదా పాతు కబంధభుజఖండనః ॥ 9

నాసాగ్రం మే సదా పాతు సుమిత్రానందవర్ధనః ।
రామన్యస్తేక్షణః పాతు సదా మేఽత్ర ముఖం భువి ॥ 10

సీతావాక్యకరః పాతు మమ వాణీం సదాఽత్ర హి ।
సౌమ్యరూపః పాతు జిహ్వామనంతః పాతు మే ద్విజాన్ ॥ 11

చిబుకం పాతు రక్షోఘ్నః కంఠం పాత్వసురార్దనః ।
స్కంధౌ పాతు జితారాతిర్భుజౌ పంకజలోచనః ॥ 12

కరౌ కంకణధారీ చ నఖాన్ రక్తనఖోఽవతు ।
కుక్షిం పాతు వినిద్రో మే వక్షః పాతు జితేంద్రియః ॥ 13

పార్శ్వే రాఘవపృష్ఠస్థః పృష్ఠదేశం మనోరమః ।
నాభిం గంభీరనాభిస్తు కటిం చ రుక్మమేఖలః ॥ 14

గుహ్యం పాతు సహస్రాస్యః పాతు లింగం హరిప్రియః ।
ఊరూ పాతు విష్ణుతుల్యః సుముఖోఽవతు జానునీ ॥ 15

నాగేంద్రః పాతు మే జంఘే గుల్ఫౌ నూపురవాన్మమ ।
పాదావంగదతాతోఽవ్యాత్ పాత్వంగాని సులోచనః ॥ 16

చిత్రకేతుపితా పాతు మమ పాదాంగులీః సదా ।
రోమాణి మే సదా పాతు రవివంశసముద్భవః ॥ 17

దశరథసుతః పాతు నిశాయాం మమ సాదరమ్ ।
భూగోళధారీ మాం పాతు దివసే దివసే సదా ॥ 18

సర్వకాలేషు మామింద్రజిద్ధంతాఽవతు సర్వదా ।
ఏవం సౌమిత్రికవచం సుతీక్ష్ణ కథితం మయా ॥ 19

ఇదం ప్రాతః సముత్థాయ యే పఠంత్యత్ర మానవాః ।
తే ధన్యా మానవా లోకే తేషాం చ సఫలో భవః ॥ 20

సౌమిత్రేః కవచస్యాస్య పఠనాన్నిశ్చయేన హి ।
పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనార్థీ ధనమాప్నుయాత్ ॥ 21

పత్నీకామో లభేత్పత్నీం గోధనార్థీ తు గోధనమ్ ।
ధాన్యార్థీ ప్రాప్నుయాద్ధాన్యం రాజ్యార్థీ రాజ్యమాప్నుయాత్ ॥ 22

పఠితం రామకవచం సౌమిత్రికవచం వినా ।
ధృతేన హీనో నైవేద్యస్తేన దత్తో న సంశయః ॥ 23

ఈ లక్ష్మణకవచము విజయప్రదము, శ్రీరామ కవచము సంతోషప్రదము మరియు కోరినవారి కోర్కెలు తీర్చునది. ఈ లక్ష్మణ కవచమును పారాయణము చేయకుండా శ్రీరామకవచమును పారాయణ చేయుట అంత ఫలదాయకము కాదు. కనుక రామకవచమునకు ముందు లక్ష్మణకవచమును కూడా పారాయణ చేయవలయును.

కేవలం రామకవచం పఠితం మానవైర్యది ।
తత్పాఠేన సుసంతుష్టో న భవేద్రఘునందనః ॥ 24

అతః ప్రయత్నతశ్చేదం సౌమిత్రికవచం నరైః ।
పఠనీయం సర్వదైవ సర్వవాంఛితదాయకమ్ ॥ 25

అతః పరం భరతస్య కవచం తే వదామ్యహమ్ ।
సర్వపాపహరం పుణ్యం సదా శ్రీరామభక్తిదమ్ ॥ 26

కైకేయీతనయం సదా రఘువరన్యస్తేక్షణం శ్యామలం
సప్తద్వీపపతేర్విదేహతనయాకాంతస్య వాక్యే రతమ్ ।
శ్రీసీతాధవసవ్యపార్శ్వనికటే స్థిత్వా వరం చామరమ్
ధృత్వా దక్షిణ త్కరేణ భరతం తం వీజయంతం భజే ॥ 27

ఓం అస్య శ్రీభరతకవచమంత్రస్య, అగస్త్యఋషిః ।
శ్రీభరతో దేవతా, అనుష్టుప్ ఛందః । శంఖ ఇతి బీజమ్ ।
కైకేయీనందన ఇతి శక్తిః । భరతఖండేశ్వర ఇతి కీలకమ్ ।
రామానుజ ఇత్యస్త్రమ్ । సప్తద్వీపేశ్వరదాస ఇతి కవచమ్ ।
రామాంశజ ఇతి మంత్రః ।
శ్రీభరతప్రీత్యర్థం సకలమనోరథసిద్ధ్యర్థం జపే వినియోగః ।

అథ అంగులిన్యాసః

ఓం భరతాయ అంగుష్ఠాభ్యాం నమః ।
ఓం శంఖాయ తర్జనీభ్యాం నమః ।

ఓం కైకేయీనందనాయ మధ్యమాభ్యాం నమః ।
ఓం భరతఖండేశ్వరాయ అనామికాభ్యాం నమః ।
ఓం రామానుజాయ కనిష్ఠికాభ్యాం నమః ।
ఓం సప్తద్వీపేశ్వరదాసాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

ఏవం హృదయాది అంగన్యాసః

ఓం భరతాయ హృదయాయ నమః ।
ఓం శంఖాయ శిరసే స్వాహా ।
ఓం కైకేయీనందనాయ శిఖాయై వషట్ ।
ఓం భరతఖండేశ్వరాయ కవచాయ హుమ్ ।
ఓం రామానుజాయ నేత్రత్రయాయవౌషట్ ।
ఓం సప్తద్వీపేశ్వరదాసాయ అస్త్రాయ ఫట్ ।
ఓం రామాంశజాయ ఇతి దిగ్బంధః ।

## భరతకవచమ్

అథ ధ్యానమ్ ।

రామచంద్రసవ్యపార్శ్వే స్థితం కైకేయజాసుతమ్ ।
రామాయ చామరేణైవ వీజయంతం మనోరమమ్ ॥ **28**

రత్నకుండలకేయూరకంకణాదివిభూషితమ్ ।
పీతాంబరపరీధానం వనమాలావిరాజితమ్ ॥ **29**

మాండవీధౌతచరణం రశనానూపురాన్వితమ్ ।
నీలోత్పలదళశ్యామం ద్విజరాజసమాననమ్ ॥ **30**

ఆజానుబాహుం భరతఖండస్య ప్రతిపాలకమ్ ।
రామానుజం స్మితాస్యం చ శత్రుఘ్నపరివందితమ్ ॥ **31**

రామన్యస్తేక్షణం సౌమ్యం విద్యుత్పుంజసమప్రభమ్ ।
రామభక్తం మహావీరం వందే తం భరతం శుభమ్ ॥ **32**

ఏవం ధ్యాత్వా తు భరతం రామపాదేక్షణం హృది ।
కవచం పఠనీయం హి భరతస్యేదముత్తమమ్ ॥ 33

ఓం పూర్వతో భరతః పాతు దక్షిణే కేకయీసుతః ।
నృపాత్మజః ప్రతీచ్యాం హి పాతూదీచ్యాం రఘూత్తమః ॥ 34

అధః పాతు శ్యామలాంగశ్చోర్ధ్వం దశరథాత్మజః ।
మధ్యే భరతవర్షేశః సర్వతః సూర్యవంశజః ॥ 35

శిరస్తక్షపితా పాతు ఫాలం పాతు హరిప్రియః ।
భ్రువోర్మధ్యం జనకజావాక్యైకతత్పరోఽవతు ॥ 36

పాతు జనకజామాతా మమ నేత్రే సదాఽత్ర హి ।
కపోలే మాండవీకాంతః కర్ణమూలే స్మితాననః ॥ 37

నాసాగ్రం మే సదా పాతు కైకేయీతోషవర్ధనః ।
ఉదారాంగో ముఖే పాతు పాతు వాణీం జటాధరః ॥ 38

పాతు పుష్కర తాతో మే జిహ్వాం దంతాన్ ప్రభామయః ।
చిబుకం వల్కలధరః కంఠే పాతు వరాననః ॥ 39

స్కంధౌ పాతు జితారాతిర్భుజౌ శత్రుఘ్నవందితః ।
కరౌ కవచధారీ చ నఖాన్ ఖండధరోఽవతు ॥ 40

కుక్షౌ రామానుజః పాతుః వక్షః శ్రీరామవల్లభః ।
పార్శ్వే రాఘవపార్శ్వస్థః పాతు పృష్ఠం సుభాషణః ॥ 41

జఠరం చ ధనుర్ధారీ నాభిం శరకరోఽవతు ।
కటిం పద్మేక్షణః పాతు గుహ్యం రామైకమానసః ॥ 42

రామమిత్రః పాతు లింగమూరూ శ్రీరామసేవకః ।
నందిగ్రామస్థితః పాతు జానునీ మమ సర్వదా ॥ 43

శ్రీరామపాదుకాధారీ పాతు జంఘే సదా మమ ।
గుల్ఫౌ శ్రీరామబంధుశ్చ పాదౌ పాతు సురార్చితః ॥ 44

రామాజ్ఞాపాలకః పాతు మమాంగాన్యత్ర సర్వదా ।
మమ పాదాంగులీః పాతు రఘువంశవిభూషణః ॥ 45

రోమాణి పాతు మే రమ్యః పాతు రాత్రౌ సుధీర్మమ ।
తూణీరధారీ దివసే దిక్పాతు మమ సర్వదా ॥ 46

సర్వకాలేషు మాం పాతు పాంచజన్యః సదాభువి ।
ఏవం శ్రీభరతస్యేదం సుతీక్ష్ణకవచం శుభమ్ ॥ 47

మయా ప్రోక్తం తవాగ్రే హి మహామంగళకారకమ్ ।
స్తోత్రాణాముత్తమం స్తోత్రమిదం జ్ఞేయం సుపుణ్యదమ్ ॥ 48

పఠనీయం సదా భక్త్యా రామచంద్రస్య హర్షదమ్ ।
పఠిత్వా భరతస్యేదం కవచం రఘునందనః ॥ 49

యథా యాతి పరం తోషం తథా స్వకవచేన చ ।
తస్మాదేతత్సదా జప్యం కవచానామనుత్తమమ్ ॥ 50

అస్యాత్ర పఠనాన్ మర్త్యః సర్వాన్ కామానవాప్నుయాత్ ।
విద్యాకామో లభేద్విద్యాం పుత్రకామో లభేత్సుతమ్ ॥ 51

పత్నీకామో లభేత్పత్నీం ధనార్థీ ధనమాప్నుయాత్ ।
యద్యన్మనోఽభిలషితం తత్తత్కవ చ పాఠతః ॥ 52

లభ్యతే మానవైరత్ర సత్యం సత్యం వదామ్యహమ్ ।
తస్మాత్సదా జపనీయం రామోపాసకమానవైః ॥ 53

ఇతి భరతకవచమ్ ।

ఈ భరతకవచమును పఠించినవారికి సకల అభీష్టములు తీరును. దీనిని పఠించక శ్రీరామ కవచాదికమును పారాయణము చేయరాదు కావున రామోపాసకులు దీనిని కూడా పఠించవలయును.

## అథ శత్రుఘ్న కవచమ్

అథ శత్రుఘ్నకవచం సుతీక్ష్ణ శృణు సాదరమ్ ।
సర్వకామప్రదం రమ్యం రామసద్భక్తివర్ధనమ్ ॥ 54

శత్రుఘ్నం ధృతకార్ముకం ధృతమహాతూణీరబాణోత్తమం
పార్శ్వే శ్రీరఘునందనస్య వినయాద్వామే స్థితం సుందరమ్ ।
రామం స్వీయకరేణ తాలదలజం ధృత్వాఽతిచిత్రం వరం
సూర్యాభం వ్యజనం సభాస్థితమహం తం వీజయంతం భజే ॥ 55

ఓం అస్య శ్రీశత్రుఘ్నకవచమంత్రస్య, అగస్తిఋషిః ।
శ్రీశత్రుఘ్నోదేవతా । అనుష్టుప్ ఛందః । సుదర్శన ఇతి బీజమ్ ।
కైకేయీనందన ఇతి శక్తిః । శ్రీభరతానుజ ఇతి కీలకమ్ ।
భరతమంత్రీత్యస్త్రమ్ । శ్రీరామదాస ఇతి కవచమ్ ।

లక్ష్మణాంశజ ఇతి మంత్రః ।

శ్రీశత్రుఘ్న ప్రీత్యర్థం సకలమనః కామనాసిద్ధ్యర్థం జపే వినియోగః ।

అథ అంగులీన్యాసః ।

ఓం శత్రుఘ్నాయ అంగుష్ఠాభ్యాం నమః ।
ఓం సుదర్శనాయ తర్జనీభ్యాం నమః ।
ఓం కైకేయీనందనాయ మధ్యమాభ్యాం నమః ।
ఓం భరతానుజాయ అనామికాభ్యాం నమః ।
ఓం భరతమంత్రిణే కనిష్ఠికాభ్యాం నమః ।
ఓం శ్రీరామదాసాయ కరతలకర పృష్ఠాభ్యాం నమః ॥

ఏవం హృదయాదిన్యాసః ।

ఓం లక్ష్మణాంశజ ఇతి దిగ్బంధః ।

అథ ధ్యానమ్ ।

రామస్య సంస్థితం వామే పార్శ్వే వినయపూర్వకమ్ ।
కైకేయీనందనం సౌమ్యం మకుటేనాతిరంజితమ్ ॥ 56

రత్నకంకణకేయూరవనమాలావిరాజితమ్ ।
రశనాకుండలధరం రత్నహారసునూపురమ్ ॥ 57

వ్యజనేన వీజయంతం జానకీకాంతమాదరాత్ ।
రామస్యేక్షణం వీరం కైకేయీతోషవర్ధనమ్ ॥ 58

ద్విభుజం కంజనయనం దివ్యలీలాంబరాన్వితమ్ ।
సుభుజం సుందరం మేఘశ్యామలం సుందరాననమ్ ॥ 59

రామవాక్యే దత్తకర్ణం రక్షోఘ్నం ఖడ్గధారిణమ్ ।
ధనుర్బాణధరం శ్రేష్ఠం ధృతతూణీరముత్తమమ్ ॥ 60

సభాయాం సంస్థితం రమ్యం కస్తూరీతిలకాంకితమ్ ।
ముకుటస్థావతంసేన శోభితం చ స్మితాననమ్ ॥ 61

రవివంశోద్భవం దివ్యరూపం దశరథాత్మజమ్ ।
మథురావాసినం దేవం లవణాసురమర్దనమ్ ॥ 62

ఏవం ధ్యాత్వా తు శత్రుఘ్నం రామపాదేక్షణం హృది ।
పఠనీయం వరం చేదం కవచం తస్యపావనమ్ ॥ 63

పూర్వే త్వవతు శత్రుఘ్నః పాతు యామ్యే సుదర్శనః ।
కైకేయీనందనః పాతు ప్రతీచ్యాం సర్వదా మమ ॥ 64

పాతూదీచ్యాం రామబంధుః పాత్వధో భరతానుజః ।
రవివంశోద్భవశ్చోర్ధ్వం మధ్యే దశరథాత్మజః ॥ 65

సర్వతః పాతు మామత్ర కైకేయీతోషవర్ధనః ।
శ్యామలాంగః శిరః పాతు ఫాలం శ్రీలక్ష్మణాంశజః ॥ 66

భ్రువోర్మధ్యే సదా పాతు సుముఖోఽవ్యాత్రావనీతలే ।
శ్రుతకీర్తిపతిర్నేత్రే కపోలే పాతు రాఘవః ॥ 67

కర్ణౌ కుండలకర్ణోఽవ్యా న్నాసాగ్రం నృపవంశజః ।
ముఖం మమ యువా పాతు వాణీం పాతు స్ఫుటాక్షరః ॥ 68

జిహ్వాం సుబాహుతాతోఽవ్యాద్యూపకేతుపితా ద్విజాన్ ।
చిబుకం రమ్యచిబుకః కంఠం పాతు సుభాషణః ॥ 69

స్కంధౌ పాతు మహాతేజా భుజౌ రాఘవవాక్యకృత్ ।
కరౌ మే కంకణధరః పాతు ఖడ్గీ నఖాన్మమ ॥ 70

కుక్షిం రామప్రియః పాతు పాతు వక్షో రఘూత్తమః ।
పార్శ్వే సురార్చితః పాతు పాతు పృష్ఠం వరాననః ॥ 71

జఠరం పాతు రక్షోఘ్నః పాతు నాభిం సులోచనః ।
కటిం భరతమంత్రీ మే గుహ్యం శ్రీరామసేవకః ॥ 72

రామార్పితమనాః పాతు లింగమూరూ స్మితాననః ।
కోదండపాణిః పాత్వత్ర జానునీ మమ సర్వదా ॥ 73

రామమిత్రః పాతు జంఘే గుల్ఫౌ పాతు సునూపురః ।
పాదౌ నృపతిపూజ్యోఽవ్యాచ్ఛ్రీమాన్పాదాంగులీర్మమ ॥ 74

పాత్వంగాని సమస్తాని హృద్యాదారాంగః సదామమ ।
రోమాణి రమణీయోఽవ్యాదాత్రౌ పాతు సుధార్మికః ॥ 75

దివసే సత్యసంధోవ్యాద్భోజనే శరసత్కరః ।
గమనే కలకంఠోఽవ్యాత్సర్వదా లవణాంతకః ॥ 76

ఏవం శత్రుఘ్నకవచం మయా తే సముదీరితమ్ ।
యే పఠంతి నరాస్త్వేతత్తే నరాః సౌఖ్యభాగినః ॥ 77

శత్రుఘ్నస్య వరం చేదం కవచం మంగళప్రదమ్ ।
పఠనీయం నరైర్భక్త్యా పుత్రపౌత్రప్రవర్ధనమ్ ॥ 78

అస్య స్తోత్రస్య పాఠేన యం యం కామం నరోఽర్థయేత్ ।
తం తం లభేన్నిశ్చయేన సత్యమేతద్వచో మమ ॥ 79

పుత్రార్థీ ప్రాప్నుయాత్పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్ ।
ఇచ్ఛాకామం తు కామార్థీ ప్రాప్నుయాత్పఠనాదినా ॥ 80

కవచస్యాస్య భూమ్యాం హి శత్రుఘ్నస్య వినిశ్చయాత్ ।
తస్మాదేతత్సదా భక్త్యా పఠనీయం నరైః శుభమ్ ॥ 81

ఆదౌ నరైర్మారుతేశ్చ పఠిత్వా కవచం శుభమ్ ।
తతః శత్రుఘ్నకవచం పఠనీయమిదం శుభమ్ ॥ 82

పఠనీయం భరతస్య కవచం పరమం తతః ।
తతః సౌమిత్రికవచం పఠనీయం సదా నరైః ॥ 83

పఠనీయం తతః సీతా కవచం భాగ్యవర్ధనమ్ ।
తతః శ్రీరామచంద్రస్య కవచం సర్వథోత్తమమ్ ॥ 84

పఠనీయం నరైర్భక్త్యా సర్వవాంఛితదాయకమ్ ।
ఏవం షట్ కవచాన్యత్ర పఠనీయాని సర్వదా ॥ 85

పఠనం షట్కవచానాం శ్రేష్ఠం మోక్షైకసాధనమ్ ।
జ్ఞాత్వాఽత్ర మానవైర్భక్త్యా కార్యం చ పఠనం సదా ॥ 86

అశక్తేనాత్ర చత్వారి పఠనీయాని సాదరమ్ ।
హనూమతశ్చ సౌమిత్రేః సీతాయా రాఘవస్య చ ॥ 87

ఇమాని పఠనీయాని చత్వారి కవచాని హి ।
చతుర్ణాం కవచానాం చ పఠనే మానవస్య చ ॥ 88

న యద్యత్రావకాశశ్చేత్తదా త్రీణి పఠేన్నరః ।
మారుతేశ్చాథ సీతాయాస్తథా శ్రీరాఘవస్య చ ॥ 89

ఈ శత్రుఘ్నకవచము సర్వమంగళప్రదము. పుత్ర పౌత్రాది వర్ధనము. శ్రీరామ కవచము ప్రీతికరము. కావున, మొదట శుభమగు హనుమత్కవచమును, పిదప మంగళప్రదమగు ఈ శత్రుఘ్న కవచమును, పిదప భరతకవచమును, అటుమీద లక్ష్మణకవచమును, తరువాత భాగ్యప్రదమగు సీతాకవచమును, కడపట శ్రీరామకవచమును, ఇట్లు ఈ 6 కవచములను వరుసగా పారాయణము చేయువారు శ్రీరామ ప్రీతినంది సుఖించెదరు. వీటినన్నిటిని పఠింప అవకాశములేని వారు హనుమత్, లక్ష్మణ, సీతా, రామ, కవచములను నాల్గింటిని, దానికి నవకాశము లేనిచో హనుత్, సీతా, రామ కవచములను పారాయణ చేయవలయును.

**త్రయాణాం కవచానాం చ న పాఠవసరో యదా ।**
**పఠనార్థం మానవస్య తదా ద్వే కవచే స్మృతే ॥ 90**

**మారుతేశ్చాథ రామస్య సీతాయా రాఘవస్య వా ।**
**నైకమేవ పఠేచ్చాత్ర శ్రీరామకవచం శుభమ్ ॥ 91**

**అవకాశే కవచానాం షట్కమేవ సదా నరైః ।**
**పఠనీయం క్రమేణైవ కర్తవ్యో నాలసః కదా ॥ 92**

**యదాఽవకాశో నాస్త్యేవ తదా తేషాం సుఖాప్తయే ।**
**మయా విశేషః ప్రోక్త్వాఽయం న సర్వేషాం మయేరితః ॥ 93**

**ఇతి శత్రుఘ్న కవచమ్ ॥**

హనుమత్, సీతా, రామకవచములను పారాయణ చేయుటకు అవకాశములేకున్న, సీతా, రామ కవచములను రెండింటిని, అంతకూ అవకాశము లేనిచో శ్రీరామకవచము నొకదానినైనా పారాయణ చేయవచ్చును. అయితే అవకాశ శక్తులుండీ శ్రీరామ కవచమొక్కటినే చేసితే అది ఫలదాయకము కాజాలదు. కావున సద్భక్తితో యథావకాశముగా శక్తివంచన లేక శ్రీరామానుగ్రహ పాత్రులగు సద్భక్తులు కవచాదులను గురువుగారివద్ద నేర్చుకుని, ఉపదేశముపొంది, పారాయణ చేసి కృతార్థులు కాగలరు.

**శ్రీరామదాస ఉవాచ**

**ఏవం శిష్య త్వయాం యద్యత్పృష్టం తత్తన్మయోదితమ్ ।**
**అన్యత్కించిత్ ప్రవక్ష్యామి తచ్ఛృణుష్వాద్య సాదరమ్ ॥ 94**

గీతైః ప్రబంధైః శ్రీరామః సదా గేయోఽత్ర మానవైః ।
వీణావాద్యాదిభిర్భక్త్యా నృత్యాన్యపి సమాచరేత్ ॥ 95

దశరథనందనేతి పూర్వముక్త్వా తతః పరమ్ ।
మేఘశ్యామేతి వై చోక్త్వా తథా రవికులేతి చ ॥ 96

మండనరాజారామేతి ద్వావింశాక్షరజపస్త్వయమ్ ।
మనుః సదా జపనీయో వీణావాద్యేన సుస్వరమ్ ॥ 97

దశరథనందన మేఘశ్యామ
రవికులమండన రాజారామ ఇతి మనుః ।

కీర్తనేఽస్య మనోర్నైవ కార్యో న్యాసో జపే స్మృతః ।
ఏవం సర్వేషు మంత్రేషు బోద్ధవ్యం మానవైర్భువి ॥ 98

రామజయేతి చోక్త్వా తు త్రివారం చాత్ర సుస్వరమ్ ।
రామేతి ద్వేఽక్షరే త్వంతే సోక్త్వా వీణాస్వరేణ చ ॥ 99

చతుర్దశాక్షరశ్చాయం కీర్తనార్థం మయేరితి ॥ 100

రామ జయ రామ జయ రామ జయ రామ ఇతి మనుః ।

మంత్రశాస్త్రేషు యే మంత్రాస్తే జపార్థం ప్రకీర్తితాః ।
ఇమే మంత్రాః కీర్తనార్థం జ్ఞాతవ్యా మానవోత్తమైః ॥ 101

ఏతేషామపి చేద్భక్త్యా మంత్రాణాం చ జపః కృతః ।
తదా భస్మీభవిష్యంతి తేషాం పాపాని వై క్షణాత్ ॥ 102

అన్యాన్ మంత్రాన్ ప్రవక్ష్యామి తాన్ శృణుష్వ ద్విజోత్తమ ।
రాజీవలోచనేత్యుక్త్వా మేఘశ్యామేతి వై తతః ॥ 103

## శ్రీరామ సంకీర్తన మంత్రములు

రామదాసముని యిక వీణాగానముతో శ్రీరామ కీర్తనలను గానము చేయుక్రమమును విష్ణుదాసునికి చెప్పుచున్నాడు.

1) 22 అక్షరముల కీర్తనమంత్రము. కీర్తనమంత్రమును జపమంత్రముగా నెంచరాదు.

2) ఇది 14 అక్షరముల కీర్తనమంత్రము. ఇట్లు రామమంత్రకీర్తనముచే పాపములు భస్మమగును

3) ఇది 21 అక్షరములది. 4) ఇది 13 అక్షరములది. 5) ఇది 18 అక్షరములది, 6) ఇది 17 అక్షరములది. ఈ కీర్తన మంత్రములచే మహా పాపములు లయించును. 7) సర్వపాప క్షయకరమిది 16 అక్షరములది. 8) ఈ 20 వర్ణముల కీర్తన పుణ్యప్రదము, 9) ఈ 14 వర్ణములది మంగళ ప్రదము, 10) ఇదియును 14 వర్ణములది దురితహరము.

**తథా సీతారంజనేతి రాజారామేతి వై తతః ।**
**ఏకోనవింశత్ వర్ణశ్చ రామమంత్రస్త్వయం స్మృతః ॥ 104**

**రాజీవలోచన మేఘశ్యామ సీతారంజన రాజారామ ఇతి మంత్రః ।**

**అయం మంత్రః సు స్వరేణ కీర్తనీయో ముహుర్ముహుః ।**
**వీణాస్వరేణ సంయుక్తశ్చాసనే గమనేఽపి చ ॥ 105**

**శ్రీశబ్దపూర్వం జయశబ్దమధ్యం**
**జయద్వయేనాపి పునః ప్రయుక్తమ్ ।**
**త్రిః సప్తకృత్వా రఘునాథనామ**
**జపం నిహన్యాద్ద్విజకోటిహత్యాః ॥ 106**

**త్రయోదాశాక్షరశ్చాయం రామమంత్రః శుభావహః ।**
**జపనీయః కీర్తనీయః సర్వదాఽయం ముహుర్ముహుః ॥ 107**

**శ్రీరామ జయ రామ జయ జయ రామ ఇతి మనుః ।**

**అయం మంత్రః సుస్వరేణ తథా వీణాస్వరాదినా ।**
**కీర్తినీయో ముదామర్త్యైర్మంత్రశాస్త్రేఽప్యయం స్మృతః ॥ 108**

**తస్మాత్సదా జపనీయః సర్వసిద్ధిప్రదాయకః ।**
**అష్టాదశాక్షరం మంత్రం త్వన్యం శృణు శుభావహమ్ ॥ 109**

ఉక్త్వా సీతారంజనేతి మేఘశ్యామేతి వై తతః ।
కౌసల్యాసుతేత్యుక్త్వాథ రాజారామేతి వై తతః ॥ 110

సీతారంజన మేఘశ్యామ కౌసల్యాసుత రాజారామ ఇతి మనుః ।

అష్టాదశాక్షరశ్చాయం కీర్తనీయో మహామనుః ।
వీణాస్వరసమేతశ్చ కలకంఠేన సుస్వరః ॥ 111

రవివరకులజాతం వందే చేతి ప్రకీర్త్య చ ।
సురభూసురేత్యుక్త్వాఽగ్రే గీతం చేతి తతః పరమ్ ॥ 112

సప్తదశసువర్ణశ్చ రామమంత్రస్త్వయం శుభః ।
కీర్తనీయః సుస్వరం హి వీణావాద్యస్వరాదినా ॥ 113

రవివరకులజాతం వందే సురభూసురగీతమ్ ఇతి మనుః ।

విష్ణుదాస శృణుష్వాన్యాన్ రామమంత్రాన్ శుభావహాన్ ।
యేషాం స్మరణమాత్రేణ మహత్పాపం లయం వ్రజేత్ ॥ 114

కౌసల్యాసుతేత్యుక్త్వాథ రామేతి ద్వ్యక్షరే తథా ।
తథా సీతారంజనేతి మేఘశ్యామేతి వై తతః ॥ 115

షోడశాక్షరమంత్రోఽయం కీర్తనీయః శుభావహః ।
వీణాస్వరపూర్వకశ్చ కలకంఠేన సుస్వరః ॥ 116

కౌసల్యాసుత రామ సీతారంజనమేఘశ్యామ ఇతి మను ।

షోడశాక్షరమంత్రోఽయం కీర్తనీయః సదా నరైః ।
సర్వపాపక్షయకరః సర్వవాంఛితదాయకః ॥ 117

దశరథనందనేతి పూర్వముక్త్వా తతః పరమ్ ।
మేఘశ్యామేతి వై చోక్త్వా సీతేతి ద్వ్యక్షరే తతః ॥ 118

రంజనేతి తతశ్చోక్త్వా రాజారామేతి వై తతః ।
వింశాక్షరమనుశ్చాయం మహాపాతక నాశనః ॥ 119

దశరథనందన మేఘశ్యామ సీతారంజన రాజారామ ఇతి మనుః ।

అయం వింశాక్షరో మంత్రః కీర్తనీయః సుఖప్రదః ।
వీణాస్వర సమేతశ్చ మహాపుణ్యప్రదః స్మృతః ॥ **120**

వందే రఘువీరమితి చోక్త్వా చైవ తతః పరమ్ ।
ఉక్త్వా సీతాకాంతమితి రణధీరమితి క్రమాత్ ॥ **121**

చతుర్దశాక్షరశ్చాయం రామమంత్రః శుభావహః ।
కీర్తనీయో జనైర్భక్త్యా మహామంగళకారకః ॥ **122**

వందే రఘువీరం సీతాకాంతం రణధీరన్ ఇతి మనుః ।

జయ రామ జయ రామ సంకీర్త్య సుస్వరం తతః ।
జయ జయేతి సంకీర్త్య రామేతి ద్వ్యక్షరే పునః ॥ **123**

చతుర్దశాక్షరశ్చాయం తృతీయః కథితో మనుః ।
కీర్తనీయో జనైర్నిత్యం మహాపాతకనాశనః ॥ **124**

జయ రామ జయ రామ జయ జయ రామ ఇతి మనుః ।

మనుః సీతారాఘవేతి పంచవర్ణాత్మకః స్మృతః ।
జపనీయః కీర్తనీయో వీణావాద్యేన సుస్వరః ॥ **125**

సీతా రాఘవ ఇతి మనుః ।
భజేతి ద్వ్యక్షరే పూర్వం సీతారామమితి క్రమాత్ ।
మానసేతి తతశ్చోక్త్వా భజేతి ద్వ్యక్షరే పునః ॥ **126**

తతో రాజారామ ఇతి మంత్రః పంచదశాక్షరః ।
కీర్తనీయో మనుశ్చాయ వీణావాద్యేన సుస్వరః ॥ **127**

భజ సీతారామం మానస భజ రాజారామమ్ ఇతి మనుః ।

శ్రీసీతారామమిత్యుక్త్వా వందే చోక్త్వా తతః పునః ॥
శ్రీరాజారామమితి చ కీర్తయేత్సుస్వరం ముహుః । **128**

ద్వాదశాక్షర మంత్రోఽయం కీర్తనీయః సదా జనైః ।
వీణావాద్యాదినా పుణ్యః సర్వవాంఛితదాయకః ॥ 129

శ్రీసీతారామం వన్దే శ్రీరాజారామమ్ ఇతి మనుః ।

రావణమర్దనేత్యుక్త్వా రామేత్యుక్త్వా తతః పరమ్ ।
రాఘవేతి తతశ్చోక్త్వా వాలీ చేతి తతః క్రమాత్ ॥ 130

మర్దనేతి పునశ్చోక్త్వా రామేతి ద్వ్యక్షరే పునః ।
స్మృతోఽష్టాదశవర్ణైశ్చ ద్వితీయోఽయం మనుః శుభః ॥ 131

రావణమర్దన రామ రాఘవ వాలీమర్దన రామ ఇతి మనుః ।

అయం మంత్రః కీర్తనీయః సర్వదా మానవోత్తమైః ॥
శ్రీసీతారామమితి చ మానసేతి తతః పరమ్ ॥ 132

భజేతి ద్వ్యక్షరే చోక్త్వా రామేతి ద్వ్యక్షరే పునః ।
రామమితి ద్వ్యక్షరే చ మంత్రోఽయం పరమః శుభః ॥ 133

చతుర్దశాక్షరశ్చాయం చతుర్థశ్చ మయేరితః ।
కీర్తనీయః సుస్వరోఽయం వీణావాద్యపురఃసరః ॥ 134

శ్రీసీతారామం మానస భజ రాజారామమ్ ఇతి మనుః ।

సీతారామ జయేత్యుక్త్వా రాజారామేతి వై తతః ॥
అయం దశాక్షరో మంత్రః కీర్తనీయోఽత్ర సుస్వరః ॥ 135

సీతారామ జయ రాజారామ ఇతి మనుః ।

శ్రీసీతారామమితి చ వందే రామమితి క్రమాత్ ।
జయ రామం తతశ్చోక్త్వా త్రయోదశాక్షరో మనుః ॥ 136

కీర్తనీయః సదా మర్త్యైః సర్వపాతకనాశనః ।
వీణావాద్యాదినా నిత్యం ద్వితీయోఽయం మనుః స్మృతః ॥ 137

శ్రీసీతారామం వందే రామం జయ రామమ్ ఇతి మనుః ।

మాం పాహ్యతీతి చోక్త్వాదౌ దీనం రాఘవ చేతి హి ।
త్వత్పదయుగళినం వై చేత్యేష షోడశాక్షరః ॥ 138

కీర్తనీయో మనుర్మర్త్యైః సర్వపాతక కృంతనః ।
వీణావాద్యస్వరేణోచ్చైః కలకంఠేన సుస్వరః ॥ 139

మాం పాహ్యతిదీనం రాఘవ త్వత్పదయుగలీనమ్ ఇతి ।

ద్వితీయోఽయం మయా ప్రోక్తో మంత్రో వై షోడశాక్షరః ॥ 140

జయ జయేతి వై చోక్త్వా రాఘవేతి తతః పరమ్ ।
సప్తాక్షరమనుశ్చాయం కీర్తనీయః సదానరైః ॥ 141

జయ జయ రాఘవ ఇతి మనుః ॥

జయజయేతి సంకీర్త్య తథా రఘువరేతి చ ।
అష్టాక్షరమనుశ్చాయం కీర్తనీయః సదా నరైః ॥ 142

జయ జయ రఘువర ఇతి మనుః ॥

త్వం మాం పాలయేత్యుక్త్వా సీతారామేతి వై పునః ।
నవాక్షరమనుశ్చాయం కీర్తనీయః సదా నరైః ॥ 143

వీణావాద్యస్వరేణైవ మహాపాతకనాశనః ॥ 144

త్వం మాం పాలయ సీతారామ ఇతి మనుః ।

సీతారామ జయేత్యుక్త్వా మనుః షడక్షరః స్మృతః ।
కీర్తనీయః సదామర్త్యైర్వీణావాద్యేన సుస్వరః ॥ 145

సీతారామ జయ ఇతి మనుః

శ్రీసీతారామేతి మనుర్జ్ఞేయః పంచాక్షరః శుభః ।
కీర్తనీయః సదా మర్త్యైః వీణావాద్యేన సుస్వరః ॥ 146

11) ఇది పంచవర్ణ కీర్తనము. (12) 15 వర్ణనముల కీర్తనము, (13) వాంఛితఫలమునిచ్చు నది ఇది 13 వర్ణములది. (14) పదునెనిమిది వర్ణములది మరియొకటి. (15) ఇదియును 14 అక్షరములుగలది. (16) ఇది 10 వర్ణములకీర్తన (17) ఇది ఏడు అక్షరముల కీర్తన, (18) ఇది 16 వర్ణముల కీర్తన. కలుషహరము. (19) ఇది సప్తాక్షరము. (20) ఇది అష్టాక్షరము, (21) దురిత హరమిది నవాక్షరము. (22) ఇది షడక్షరము. (23) ఇదియే పంచాక్షరము.

**శ్రీసీతారామ ఇతి మనుః ।**
**సీతారామేతి మనుశ్చతుర్వర్ణాత్మకః స్మృతః ।**
**సీతారామ ఇతి మనుః ।**
**శ్రీరామేతి త్ర్యక్షరశ్చ రామేతి ద్వ్యక్షరో మనుః ॥ 147**

**శ్రీరామ ఇతి మనుః ।**
**రామ ఇతి మనుః ।**
**రాకారో బిందునా యుక్తశ్చైక వర్ణాత్మకో మనుః**
**అయం సదా జపనీయః కీర్తనీయో న వై కదా ॥ 148**

**రాం ఇతి మనుః ।**
**రామజయేతి చోక్త్వాఽఽదౌ సీతారామేతి వై తతః ।**
**రాఘవేతి తతశ్చోక్త్వా మంత్రస్త్వేకాదశాక్షరః ॥ 149**

**రామ జయ సీతారామ రాఘవ ఇతి మనుః ।**
**దశరథనందనేతి రఘుకులేతి వై తతః ।**
**భూషణేతి తతశ్చోక్త్వా కౌసల్యేతి తతః పరమ్ ॥ 150**

**విశ్రామేతి తతశ్చోక్త్వా పంకజలోచనేతి చ ।**
**రామేది ద్వ్యఽక్షరే చాపి హ్యష్టావింశాక్షరో మనుః ॥ 151**

**అయం సదా కీర్తనీయో వీణావాద్యేన సుస్వరః ।**
**ప్రోక్తః పాతకవిధ్వంసీ సర్వవాంఛితదాయకః ॥ 152**

**దశరథనందన రఘుకులభూషణ కౌసల్యావిశ్రామ**
**పంకజలోచన రామేతి మనుః ॥**

సీతారామ జయేత్యుక్త్వా రాఘవేతి తతః పరమ్ ।
రామేతి ద్వేఽక్షరే చాపి మంత్రస్త్వేకాదశాక్షరః ॥ **153**

కీర్తనీయః సుస్వరోఽయం మంత్రో వీణాస్వరేణ చ ।
మహాపాతకహృత్ ప్రోక్తః సర్వవాంఛిత దాయకః ॥ **154**

సీతారామ జయ రాఘవ రామేతి మనుః ।

ఏకాదశాక్షరశ్చాయం మంత్రః ప్రోక్తో మయాఽత్ర హి ।
ద్వితీయః పరమః శ్రేష్ఠో మహాపాతక నాశనః ॥ **155**

పంచవటీస్థితేత్యుక్త్వా రామజయజయేతి చ ।
దశరథనందనేతి రామేతి ద్వేఽక్షరే తథా ॥ **156**

ఏకవింశాక్షరశ్చాయం కీర్తనీయో మహామనుః ।
కలకంఠేన మర్త్యైశ్చ మహాపాతకనాశనః ॥ **157**

పంచవటీస్థిత రామ జయ జయ దశరథనంద రామేతి మనుః ॥

దశరథసుతేత్యుక్త్వా బాలం వందే త్వితి క్రమాత్ ।
రామం ఘననీలమితి మంత్రోఽయం షోడశాక్షరః ॥ **158**

తృతీయోఽయం మయా ప్రోక్తః కీర్తనీయో మనోరమః ।
వీణావాద్యస్వరేణైవ మహాపుణ్యవివర్ధనః ॥ **159**

దశరథసుతబాలం వందే రామం ఘననీలమితి మనుః ।

కోదండఖండనేత్యుక్త్వా దశశిరమర్దనేతి చ ।
కౌసల్యాసుత రామేతి సీతారంజన చేతి వై ॥ **160**

రాజారామేతి వై చోక్త్వా హ్యేకోనత్రింశవర్ణకః ।
కీర్తనీయో మనుశ్చాయం వీణావాద్యేన సుస్వరః ॥ **161**

కోదండఖండన దశశిరమర్దన కౌసల్యాసుత
రామ సీతారంజన రాజారామేతి మనుః ।

**కోదండభంజనేత్యుక్త్వా రావణమర్దనేతి చ ।**
**కౌసల్యేతి తతశ్చోక్త్వా విశ్రామేతి తతః పరమ్ ॥ 162**

**సీతారంజనేతి తతో రాజరామేతి వై తతః ।**
**సప్తవింశాక్షరశ్చాయం మనుః ప్రోక్తః శుభప్రదః ॥ 163**

(24) ఇది నాలుగు అక్షరముల మంత్రము. (25) ఇది 3 వర్ణములమంత్రము (26) ఇది రెండు అక్షరముల మంత్రము. (27) ఈ యేకాక్షరము జపించదగినదియేగాని కీర్తనకుతగదు. (28) ఇది 11 వర్ణములది. (29) ఇది 28 అక్షరములది దురితమునుహరించి మరి యిష్టార్థములనిచ్చును. (30) ఇదియును 11 అక్షరములది పాపనాశకము. (31) 21 అక్షరములుగల దీనిని పాడుటచే పాతకములు పారిపోవును. (32) 16 అక్షరములుగల్గిన ఈ కీర్తనము పుణ్యప్రదము, (33) 29 అక్షరములది. (34) 27 అక్షరములుగలది ఇది శుభకరమైనది. (35) కీర్తనమంత్రరాజమిది 50వర్ణములుగలది.

**కోదండభంజన రావణమర్దన కౌసల్యావిశ్రామ**
**సీతారంజన రాజారామేతి మనుః ॥**

**కోదండఖండనేత్యుక్త్వా వాలీతాడన చేతివై ।**
**లంకాదాహనేతి తతః పాషాణతారణేతి చ ॥ 164**

**రావణమర్దనేత్యుక్త్వా రవికులేతి వై తతః ।**
**భూషణేతి తతశ్చోక్త్వా కౌసల్యేతి తతః పరమ్ ॥ 165**

**విశ్రామేతి తతశ్చోక్త్వా సీతారంజన చేతి వై ।**
**రాజారామేతి వై చోక్త్వా పంచశదక్షరో మనుః ॥ 166**

**అయం సదా కీర్తనీయో వీణావాద్యేన సుస్వరః ।**
**మంత్రాణాం హి వరిష్ఠోఽయం మహాపాతకనాశనః ॥ 167**

**కోదండఖండన వాలీతాడన లంకాదాహన**
**పాషాణతారణ రావణమర్దన రవికులభూషణ**
**కౌసల్యావిశ్రామ సీతారంజన రాజారామేతి మనుః ।**

ఏవం నానావిధాః మంత్రాః సంతి శిష్య సహస్రశః ।
సహస్రవర్షపర్యంతం కస్తాన్ వక్తు భవేత్ క్షమః ॥ **168**

ఏతే సర్వే కీర్తనీయా వీణావాద్యేన సుస్వరాః ।
ఇమే మంత్రా జపనీయా న జ్ఞేయా మానవోత్తమైః ॥ **169**

మంత్రశాస్త్రేషు యే ప్రోక్తాస్తే జప్యా ఏవ మానవైః ।
తే మంత్రాః కీర్తనీయా న కీర్తనీయాస్త్విమే స్మృతాః ॥ **170**

ఏతాన్ మంత్రాన్ పురస్కృత్య ప్రబంధా వివిధాః శుభాః ।
రచనీయా బుద్ధిమద్భిః నానాభాషాభిరాదరాత్ ॥ **171**

యే యే నోక్తా మయా మంత్రాస్తాన్ యుక్త్యా రచయేన్నరః ।
రచనే నైవ దోషోఽస్తి తైస్తుష్టో జాయతే హరిః ॥ **172**

మంత్రైః ప్రబంధైః కావ్యైశ్చ స్తుతిభిః కీర్తనాదిభిః ।
ప్రాచీనైర్వా కల్పితైర్వా రామో గేయః సదా నరైః ॥ **173**

యేన కేన ప్రకారేణ కార్యం రాఘవచింతనమ్ ।
పాపరాశిః క్షణాద్దగ్ధా శ్రీరామచింతనేన హి ।
భవత్యత్ర న సందేహః పావకేన యథాకుటీ ॥ **174**

దంభేన వాతిభక్త్యా వా నిష్కామాద్వా సకామతః ।
యద్యత్ర రాఘవో గీతస్తేన పాపం హృతం భవేత్ ॥ **175**

యథా వహ్నిః తూలరాశిం స్పర్శితః కామనాం వినా ।
కామేన వా దహత్యేవ క్షణాత్తద్వన్న సంశయః ॥ **176**

మంత్రైః ప్రబంధైః కావ్యైశ్చ నానాచారిత్రవర్ణనైః ।
అత్యశుద్ధైః స్తుతో రామః కల్పితైరపి స్వేచ్ఛయా ।
తైశ్చ తుష్టో భవత్యత్ర శ్రీరామో నాత్ర సంశయః ॥ **177**

**వినాశ్రయేణ రామస్య యత్కృతం స్తవనాదికమ్ ।**
**తేనాపితుష్టః శ్రీరామో భవత్యేవ న సంశయః ॥ 178**

**అశ్రయేణాపి యా నిందా కృతా శ్రీరాఘవస్య చ ।**
**సా భవేన్నరకాయైవ నాత్ర కార్యా విచారణా ॥ 179**

**కిం శాస్త్రైశ్చ పురాణైశ్చ పఠితైః పాఠితైరపి ।**
**యది రామే రతిర్నాస్తి తైర్భవేన్మానవస్య కిమ్ ॥ 180**

**రామప్రీతి యుతస్యాత్ర మూర్ఖస్యాపి వరస్య చ ।**
**తద్భాషాకృతస్తుత్యాద్యైః ప్రసన్నో జాయతే హరిః ॥ 181**

దురిత విధ్వంసకమగు కోట్లకొలది కీర్తనమంత్రములుగలవు. చెప్పుటకు వేయేండ్లయినను ముగియవు. వాటిని నిరూపింప ఎవనితరము? వీటినన్నిటిని వీణాగానముతో సుస్వరముగా పాడవచ్చును. వీనిలో నర్తనముగల్గి యుండవచ్చును, ఇవి జప్యములు గావు. మంత్ర శాస్త్రప్రోక్త శ్రీరామమంత్రములే జపనీయములు. వీటిని అనుసరించి బుద్ధిమంతులు శుభప్రబంధములను సకలభాషలలోను రచియింతురు గాక! నేను చెప్పని మరియు అనేక కీర్తన మంత్రములను కల్పించుకొనవచ్చును. వానివలనను శ్రీరాముడు సుప్రీతుడగును. ఎవ్విధముగానైనను శ్రీరామ కీర్తనముచే పాపములు తొలగును. నిప్పును తెలిసికొని తాకినా, తెలియక తాకినను అది దహించు నట్లు శ్రీరామకీర్తనమును తెలిసి చేసినను, తెలియకజేసినను దురితములను పరిహరించును. రామభక్తి కలిగిన వాడైనను, లేనివాడైనను శ్రీరామకీర్తనను ఉచ్చరించిన మాత్రమున శ్రీరాముడతనికి ప్రసన్నుడగు చుండును. ఎవరెట్లు రామప్రీతికై యేమిచేసినా అంతటితో శ్రీరాముడు సుప్రీతుడై భుక్తి, ముక్తుల నిచ్చువాడుగానుండును.

**రామచంద్రస్య ప్రాప్త్యర్థం యత్కృతం మానవైర్భువి ।**
**తేనాతితుష్టః శ్రీరామో భవత్యేవ న సంశయః ॥ 182**

**రామో గేయశ్చింతనీయోఽత్ర రామః**
**స్తవ్యో రామః స్సేవనీయోఽత్ర రామః ।**
**ధ్యేయో రామో నందనీయోఽత్ర రామో**
**దర్శ్యో రామః సర్వభూతాంతరేషు ॥ 183**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, లక్ష్మణాదీనాం కవచాది నిరూపణం నామ పంచదశః సర్గః ॥**

శ్రీరామ నామమును గానము చేసియును, చింతన జేసియును, స్తుతించియును, సేవించి యును, ధ్యానించియును, వందించియును, దర్శనము జేసియును, సర్వభూతాంతర్వర్తిగానుండు శ్రీరాముడే మానవులకు శరణమైయున్నాడు. సమస్తమును శ్రీరామాత్మకము.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని మనోహరకాండలో
లక్ష్మణాదికవచములను బోధించు 15వ సర్గ ముగిసినది.

# షోడశః సర్గః-16వ సర్గ

హనుమత్ ధ్వజారోపణము

శ్రీరామదాస ఉవాచ

ఏవం యద్యత్త్వయా పృష్టం తన్మయా పరివర్ణితమ్ ।
కిమన్యచ్ఛ్రోతుకామస్త్వం తద్వదస్వ వదామి తే ॥ 1

విష్ణుదాస ఉవాచ

రామాయణం నరః శ్రుత్వా కిం విధానం సమాచరేత్ ।
తత్త్వం వద మహాభాగ యద్యస్తి తత్సవిస్తరమ్ ॥ 2

శ్రీరామదాస ఉవాచ

రామాయణే శ్రుతే దద్యాద్రథం హేమమయం సుధీః ।
చతుర్భిర్వాజిభిర్యుక్తం తథా క్షౌమపతాకయా ॥ 3

ఏతైశ్చైవ సమాయుక్తం కింకిణీనాద నాదితమ్ ।
సంపాదితైశ్చ సమ్యగ్వై ధేనుం దద్యాత్పయస్వినీమ్ ॥ 4

బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్ శతమష్టోత్తరం సుధీః ।
ఏవం కృతే విధానే తన్మహాకావ్యం ఫలప్రదమ్ ॥ 5

రామాయణం భవేన్న్యూనం నాత్ర కార్యా విచారణా ।
యస్మిన్ రామస్య సంస్థానం రామాయణమథోచ్యతే ॥ 6

ఏవం త్వయా యథా పృష్టం మయా తత్తే నివేదితమ్ ।
విష్ణుదాస ఉవాచ
కించిద్ వ్రతం హనుమతస్త్వం మాం వక్తుమిహార్హసి ॥ 7

## శ్రీరామాయణము వినిన తరువాత చేయవలసిన కార్యక్రమము

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, శిష్యా! నీవు నానుండి ఇంకా ఏమి వినదలిచావో చెప్పు" అనగా. విష్ణుదాసు, "స్వామీ! రామాయణము శ్రవణము చేసిన తరువాత చేయవలసిన విధానమును విస్తరింపుమని వేడుచున్నాను". అనగా, అందుకు రామదాసు చెప్పుచున్నాడు....

"శ్రీరామచరిత్రని వినిన తరువాత తెల్లని ధ్వజమును, గజ్జలు గంటలును, నాలుగు గుఱ్ఱములును గల సువర్ణరథమును, పాలుపితుకుచున్న మంచిఆవును కూడ దానముచేయవలెను. 10 మంది బ్రాహ్మణులకు అన్న సమారాధన జేయవలెను. ఇట్లు ఆచరించక పోయిన అతనికి శ్రీరామాయణము ఫలప్రదము కాజాలదు." అనగా, వినిన విష్ణుదాసు, హనుమత్ వ్రతమును చెప్పుమని వేడెను. అందుకు శ్రీరామదాసు చెప్పుచున్నాడు.

శ్రీరామదాస ఉవాచ

**యదా రామస్త్రికూటాద్రౌ నాగపాశైస్తు పీడితః ।**
**నారదస్య వచః శ్రుత్వా సస్మార వినతాసుతమ్ ॥ 8**

**తదాఽసౌ కాశ్యపో వీరః సమాగత్య రణాంగణే ।**
**ప్రణామమకరోత్తస్మై రామాయామిత తేజసే ॥ 9**

**నివార్య పన్నగాస్త్రం తన్మేఘనాదసమీరితమ్ ।**
**తుష్టావ రఘువీరం తం ససైన్యం చ సలక్ష్మణమ్ ॥ 10**

**ఉవాచ ప్రణిపత్యాథ రామభద్రం ఖగేశ్వరః ।**
గరుడ ఉవాచ
**ఆశ్చర్యమిదమత్యంతం యద్భవానస్మరద్ధి మామ్ ॥ 11**

**సతి వీరే మహారుద్రే సగణే శ్రీహనూమతి ।**
**సుగ్రీవే చ నలే నీలే సుషేణే జాంబవత్యపి ॥ 12**

**అంగదే దధివక్త్రే చ తారే చ తరళే తథా ।**
**మైందే సతి మహావీర్యే కిం మేఽత్రాస్తి ప్రయోజనమ్ ॥ 13**

శ్రీరామ ఉవాచ

**భవద్భీతిముపాగమ్య విద్రుతాశ్చ భుజంగమాః ।**
**ఏతేషు సత్సు వీరేషు కిము సైన్యమపీడయన్ ॥ 14**

గరుడ ఉవాచ

**రామదేవ మహాబాహో కపీనాం చరితం శృణు ।**
**ఆత్మనోఽపి సమావిష్టాన్మా కురుష్వాత్ర గర్హణమ్ ॥ 15**

సాక్షాత్త్వం భగవాన్ విష్ణుః లక్ష్మీస్తు జనకాత్మజా ।
సౌమిత్రిః ఫణిరాజోఽయం రుద్రాశ్చ కపయః స్మృతాః ॥ 16

సుగ్రీవో వీరభద్రోఽయం శంభురేష స్మృతో నలః ।
విద్ధి దాశరథే నూనం గిరిశో నీల ఏవచ ॥ 17

మహాయశాః సుషేణోఽయం జాంబవాంశ్చాప్యజైకపాత్ ।
అహిర్బుధ్న్యస్త్వంగదోఽత్ర దధివక్త్రః పినాకధృక్ ॥ 18

అయుతా జిత్త్వయం తారః స్థాణుశ్చ తరళో మతః ।
మైందోభర్గతనుః సాక్షాత్ హనుమాన్ భగవాన్ స్మృతః ॥ 19

అవతీర్ణా మహారుద్రాస్త్వదర్థం రఘునందన ।
అవసన్ సర్వదేశేషు నానాపర్వతమధ్యతః ॥ 20

ధృత్వా చ కపిరూపాణి అవతేరుర్మహీతలే ।
సర్వేఽపి కపితాం ప్రాప్తాః కారణం తద్ బ్రవీమి తే ॥ 21

పురా దేవాసురైః సింధోర్మథితా హ్యథయోఽభవన్ ।
నానాపీడాకరాః సర్వా లూతావిస్ఫోటకాదయః ॥ 22

## ఏకాదశరుద్రులు కపివీరులై అవతరించుట.

శ్రీరాముడు త్రికూటాచలమున నాగపాశముచే పీడింపబడుచున్నప్పుడు నారద ముని వచ్చేసి చెప్పినట్లు గరుడునిని స్మరించెను. అంత ఆ వైనతేయుడు యుద్ధభూమికి వచ్చి, శ్రీరామమూర్తికి నమస్కరించి, మేఘనాథుని పన్నగాస్త్రమును ఉపసంహరించి, ఆ సమయానికి సకలసేనలతోడ లక్ష్మణసమేతుడైన శ్రీరామునికి నమస్కరించి, "స్వామీ! ఇక్కడ ప్రమథగణములతో శ్రీరుద్రుడగు హనుమంతుడు– సుగ్రీవ, నల, నీల, సుషేణ, జాంబవంత, అంగద, దధివక్త్ర, తార, తరల, మైందులుండగా నీవు నన్ను స్మరించితివిగదా? ఇది మిక్కిలి ఆశ్చర్యముగానున్నది. నా వలన తమరికి ఏమి ప్రయోజనమిచ్చుటగలదు?" అని యడిగెను. అందుకు శ్రీరాముడు "నీవలన భయపడి గదా పాములు పరుగిడినవి? మహావీరులు ఉండినను, అవిసైన్యమును పీడించినవిగదా," అని పలుకగా, అంత ఆ గరుడుడు, మహాత్ముడగు శ్రీరామమూర్తీ! కపులయొక్క చరిత్రమును వినుము. పరమాత్మ వలన సమావిష్టులగు వీరిని నీవు నిందించవలదు. సాక్షాద్భగవంతుడగు శ్రీమన్నారాయణుడవు నీవు, లక్ష్మియే సీత, ఈ లక్ష్మణుడు ఆదిశేషుడు, రుద్రులందరును ఈ కపులైయున్నారు. ఎట్లనిన..

1. ఈ సుగ్రీవుడే-వీరభద్రుడుగా, 2. ఈ నలుడు-శంభుడు, 3. ఈ నీలుడు-గిరిశుడు, 4. సుషేణుడు-మహాయశుడు, 5. జాంబవంతుడు-అజైకపాద్దేవత, 6. అంగదుడు- అహిర్బుధ్న్యుడు, 7 దధివక్త్రుడు-పినాకధారి, 8 తారుడు-యుధాజిత్తు, 9. తరలుడు-స్థాణుడు, 10. మైందుడు-భర్గుడు, 11, శ్రీహనుమంతుడు- సాక్షాత్ రుద్రావతారుడు.

శ్రీరామా! ఇట్లు ఏకాదశమహారుద్రులు నీకొరకై అవతరించిరి. వివిధపర్వతములనడుమ, దేశములయందంతట వీరు వసించిరి. వీరు కపులగుటకు కారణమేమనిన, మునుపు దేవతలు సముద్రమును మథించినపుడు లూతావిస్ఫోటకాదులు, బహుపీడాకరములగు రోగములు కలిగినవి.

**తైరేవ వ్యాధిభిః సర్వం పీడితం జగతీతలమ్ ।**
**ఋషయోఽపి నృపాలాశ్చ బ్రహ్మాణం శరణం యయు ॥ 23**

**ఊచుశ్చ జగతాం నాథం బ్రహ్మాణం కమలోద్భవమ్ ।**
**త్రాహి త్రాహి జగన్నాథ వ్యాధిభ్యో జగతీమిమామ్ ॥ 24**

**పీడితాం దారుణైర్దోషైర్జ్వరాద్యైశ్చ మహోల్బణైః ।**
**త్రిదోషైర్జర్జరీభూతాం విభ్రమైర్వ్యాకులీకృతామ్ ॥ 25**

**ఔషధాని న సిద్ధ్యంతి మంత్రయంత్రాణి చైవ హి ।**
**పీడయంతి మహారోగా మానవాన్నాశకారిణః ॥ 26**

**ఏతత్తే కథితం సర్వం బ్రహ్మంస్త్వత్పురతః సుధీః ॥ 27**

**తత్తేషాం వచనం శ్రుత్వా రుద్రాత్సంప్రార్థయద్విధిః ।**
**తేఽపి శ్రుత్వా బ్రహ్మవాక్యం రుద్రా ఏకాదశామలాః ॥ 28**

**సమాశ్వాస్య విరించి తే వీరభద్రాదయః సురాః ।**
**సంభూయ వానరేష్వేవ సుగ్రీవప్రముఖా ఇమే ॥ 29**

**పర్యటన్ పర్వతాగ్రాణి మండలాని చ సర్వశః ।**
**నాదయంతో జగత్సర్వం బుభుక్కారైః సుదా రుణైః ॥ 30**

**క్ష్వేడితైః క్రీడనైస్తేషాం వ్యాధయో నాశమాప్నుయుః ।**
**తతస్తు సకలాం దృష్ట్వా వానరైర్వేష్టితాం భువమ్ ॥ 31**

**తుతోష భగవాన్ బ్రహ్మా దదౌ తేభ్యో వరాన్ బహూన్ ।**
**బ్రహ్మోవాచ**
**యుష్మాస్వపి చ ముద్రాఽస్తు మృతసంజీవినీ కలా ॥ 32**

**ఆజ్ఞాస్తు సర్వజగతి వేగోఽస్తు మనసః సమః ।**
**యుష్మాన్ స్మరంతి యే మర్త్యాన్ పూజయంతి భవత్తనూః ॥ 33**

**పతాకా వివిధాః కృత్వా చిత్రతోరణ సంయుతాః ।**
**భక్ష్యభోజ్యాని ఖాద్యాని లేహ్యం పేయం చ సర్వశః ॥ 34**

**యుష్మానుద్దిశ్య యే మర్త్యా జుహ్వంతి హి హుతాశనే ।**
**హవిః పుణ్యతమం రుద్రాస్తేషాం సిద్ధిర్న సంశయః ॥ 35**

**పాయసేనైవ సాజ్యేన తథైవ తిలసర్పిషా ।**
**యజంతి భవతాం వృందం తే యాంతి పరమం పదమ్ ॥ 36**

రోగములు లోకమును పీడించసాగెను. ఋషులును, రాజులును బ్రహ్మదేవుని శరణుజొచ్చిరి. "జగమంతయు త్రిదోష సంకలితములగు మహాజ్వరాది వ్యాధులచే విభ్రాంతినందే. మంత్ర, యంత్ర, ఓషధములు నిష్ఫలదాయకములైనవి, రక్షింపుము రక్షింపుము" అను వీరి మొరను ఆలకించి, నీయెదుట బ్రహ్మదేవుడు రుద్రులను ప్రార్థించెను. ఏకాదశ రుద్రులును బ్రహ్మవాక్యమును విని, వెంటనే వీరభద్రాదులగు తాము సుగ్రీవాది కపులుగా దేవగణములతో అవతరించి, అంతట పర్వతాగ్రములపై చరించుచు, గర్జించుచు, క్రీడించుచువచ్చిరి. అంత ఆ వ్యాధులు ఉపశమించెను. అంత వానరులచే ఈ భూమండలము నిండుటను చూచి సంతోషించిన బ్రహ్మదేవుడు వారికిట్లు వరములనొసగెను.

"మీయందు మృతసంజీవనీ ముద్రగానుండని. మీ యాజ్ఞ సర్వజగమున గల్గునుగాక! మీవేగము మనోవేగ మగునుగాక! యే మానవులు చిత్రతోరణ పతాకలతో మీ రూపములను పూజించి, మిమ్ము ఉద్దేశించి హోమముచేయుదురో, వారికి రుద్రులు ప్రసన్నులై సిద్ధిప్రదులగుచుందురుగాక! తిల, పాయస, ఆజ్యములతో హవనము చేసినవారు పరమపదము నందెదరు.

**ఏవం వై రుద్రమఖిలం గాథా వైశ్వానరీస్తథా ।**
**మనస్తోకేతి వా మంత్రో మనోజ్యోతిరథాపి వా ॥ 37**

**భవతాం యజనం చాత్ర గాయత్ర్యా వా ప్రకీర్తితమ్ ।**
**ఏవం యే మానవా లోకే విధానం పరికుర్వతే ॥ 38**

వ్యాధిం ముక్త్వా సుఖాసీనాస్త్వంతే యాత్యక్షయం పదమ్ ।

గరుడ ఉవాచ

ఇతి రామ పరావృత్తం కపీనాం కథితం మయా ॥ 39

ఏషు రుద్రేషు సర్వేషు హనూమాన్ భద్రనాయకః ॥ 40

విధానం తత్ర కర్తవ్యం యాత్రాస్తే హనుమత్తనుః ।
గోపురే హనుమన్మూర్తిః శిలాయాం చ ప్రతిష్ఠితా ॥ 41

తత్ర సర్వం ప్రకర్తవ్యం విధానం సురసత్తమః ।

శ్రీరామ ఉవాచ

కేన కేన ప్రకారేణ క్రియతే కపిపూజనమ్ ॥ 42

పతాకాః కీదృశీస్తత్ర కతి కార్యా విహంగమ ।
హవనం కతి సంఖ్యాకం కిం ద్రవ్యం కో జపోఽత్ర వై ॥ 43

కిం దాన కేన విధినా తన్మమాచక్ష్వ సువ్రత ।

గరుడ ఉవాచ

జనమారే సముత్పన్నే గ్రామే వా పత్తనేఽపి వా ॥ 44

ప్రభవత్యౌషధం నైవ మణిమంత్రపురః క్రియాః ।
విధానం తత్ర కర్తవ్యమేకాదశ్యాం తిథౌ నృప ॥ 45

ప్రాతః కాలే సముత్థాయ కృతశౌచో ద్విజోత్తమః ।
స్నాత్వా గంగాజలే పుణ్యే తిలామలకసంస్కృతః ॥ 46

ఏకాదశ ద్విజాన్ శ్రేష్ఠాన్ సోపవాసాన్నిమంత్రయేత్ ।
జాగరస్తైస్తు కర్తవ్యః సర్వోపస్కరసంయుతః ॥ 47

ఆదౌ తు మండపం కృత్వా సర్వత్రాపి సుశోభితమ్ ।
పుష్పమండపికామధ్యే మండపే స్థాపయేద్ధరాన్ ॥ 48

**పంచామృతైస్తు స్నపనం రుద్రేభ్యః పరికల్పయేత్ ।**
**తతస్తు కుసుమైః పూజా శతపత్రాదిభిః శుభైః ॥ 49**

**చందనం చ సకర్పూరం రుద్రేభ్యో లేపనం వరమ్ ।**
**దశాంగధూపమాదద్యాద్దీపైర్నీరాజయేత్తతః ॥ 50**

**నైవేద్యం వివిధం దద్యాత్తాంబూలేనైవ సంయుతమ్ ।**
**ఏకాదశ పతాకాస్తు పటైః సుపరికల్పయేత్ ॥ 51**

**యా యా యస్మై సముద్దిష్టా పతాకా చ సుశోభనా ।**
**తస్య తస్యైవ రూపం తు తస్యామేవ ప్రకల్పయేత్ ॥ 52**

ఇదేవిధముగా మహారుద్రము అఖిలము, అట్లే వైశ్వానరీ గాధయును. 'మానస్తో కేతనయే... , మనోజ్యోతి...., గాయత్రీ మంత్రములలో దేనిచేతనైనా హవనము చేయవచ్చును. ఇట్లు యజించిన నరులు మహావ్యాధివిముక్తి నంది అంతమున అక్షయపదమందెదరు." అని బ్రహ్మావరముగలదు. కావున

శ్రీరామా! ఈ రుద్రమూర్తులలో అందరిలో హనుమంతుడు భద్రనాయకుడు, ఇవ్విధానమును హనుమన్మూర్తి గలచోట చేయదగును. గోపురశిలయందు హనుమన్మూ ర్తియున్న అచ్చట ఈక్రమమును అనుసరింప వచ్చును.

శ్రీరాముడు గరుడునితో హనుమంతుని పూజావిధిని విస్తరించి చెప్పుమనగా, గరుడుడు చెప్పుచున్నాడు.

## జనమార శాంతికై కపిపూజా విధానము

గ్రామములలోగాని, పట్టణమున గాని, మణి, మంత్ర, ఔషధ క్రియలు పారని జననాశక రోగములు కలిగినప్పుడు ఈ కపివ్రతము ఉత్తమమైనది. బ్రాహ్మణోత్తముడు ఏకాదశినాడు ప్రొద్దున తిలామలక సంస్కృత పుణ్యజలమున స్నానముజేసి ఉపవాసముండదగిన 111 మంది బ్రాహ్మణులను నిమంత్రించి, వారితోడ ఉపవసించి, జాగరవ్రతమును ఆచరించవలెను. నాడు పుష్పమంటప మధ్యమున దివ్యాలంకృతమంటపమును స్థాపించి, అందు హనుమంతుని బింబమును స్థాపించి, దానికి రుద్రసూక్తములచే పంచామృత స్నానమును చేయించి, గంధ, అక్షత, పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూలనీరాజనాది సకల ఉపచారములచే అర్చించి, కమలాది పుష్పములతో పూజించి, ఎదుట 11 ధ్వజపతాకములపై పదునొకండు రుద్రకపిమూర్తులను లిఖించి స్థాపించునది.

ఏవం కృతే విధానే చ సుపతాకాసుతోరణైః ।
ప్రాతః కాలే తు రాజేంద్ర జాగరాంతే ద్విజోత్తమః ॥ 53

కృతస్నానో నదీతోయే హోమం కుర్యాత్సమాహితః ।
పాయసేన తు సాజ్యేన తథైవ తిలసర్పిషా ॥ 54

అయుతం హవనం కృత్వా పునః పూజాం ప్రకల్పయేత్ ।
పతాకా హనుమద్ద్వారే తస్యైవ చ నిధాపయేత్ ॥ 55

రాజద్వారే తు సౌగ్రీవీం సౌషేణీమాపణే న్యసేత్ ।
సలనీలపతాకే చ శివద్వారే తు విన్యసేత్ ॥ 56

తరస్య తరళస్యాపి మైందస్య హ్యంగదస్య చ ।
గ్రామాద్బహిశ్చతుర్దిక్షు మార్గేషు స్థాపయేద్ధియా ॥ 57

జలస్థానే జాంబవంతీం దధివక్రీం చతుష్పథే ।
స్థాపయేత్పరమాం దివ్యాం మహావాద్యాదిమంగళైః ॥ 58

ద్వారదేశే జనానాం చ రుద్రమూర్తిం విలేఖయేత్ ।
చిత్రితాం పంచవర్ణైశ్చ గ్రామమాత్రైష్ట వేష్టయేత్ ॥ 59

ప్రత్యహం కారయేద్విద్వాన్ భక్త్యా బ్రాహ్మణతర్పణమ్ ।
దద్యాద్వస్త్రాణి ఋత్విక్భ్యో సాలంకారాణి భూరిశః ॥ 60

ఛత్రాణి కరపత్రైశ్చ పాదుకాశ్చ విశేషతః ।
ధేనుం పయస్వినీం దద్యాదాచార్యాయ సవత్సకామ్ ॥ 61

సదక్షిణాం సవస్త్రాం చ సాలంకారాం గుణాన్వితామ్ ।
ద్విజాయ మహిషీం దద్యాత్ తథైవ పృథివీపతే ॥ 62

అన్యేభ్యో బ్రాహ్మణేభ్యశ్చ సప్త ధాన్యాని భూరిశః ।
లవణం సఘృతం దేయం తైలం చ సగుడం తథా ॥ 63

**శయ్యాదానాని భూరీణి ఛత్రాణి వివిధాని చ ।**
**ఏతత్ కృత్వా విధానం చ రాజా క్షేమమవాప్నుయాత్ ॥ 64**

**రుద్ర ఏవాత్ర నిర్దిశో జపః సర్వైః సులక్షణః ।**
**అథవా హవనం శస్తం మానస్తోక ఇతి స్ఫుటమ్ ॥ 65**

**ఇతి హనుమత్పతాకాభిధానం వ్రతమ్ ।**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతగర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, అదికావ్యే, మనోహరకాండే, హనుత్పతాకారోపణవ్రతవర్ణనం నామ షోడశః సర్గః ॥**

జాగరవ్రతానంతరమున లేచి, నిత్యకర్మను ఆచరించి, పాయస ఆజ్యముతో నైనను, తిల ఆజ్యముతో నైనను హోమవిధిని ఆచరించవలయును. మరల అన్నిటికిని పూజచేయునది. హనుమద్ధ్వజము అచ్చటనే స్థాపించి, రాజద్వారమున సుగ్రీవధ్వజమును, అంగడి బజారులో సుషేణధ్వజమును, శివాలయ ద్వారమున నల, నీల ధ్వజములను, ఊరికి బైట నాల్గుదిక్కులలోను తార, తరల, మైంద, అంగదుల ధ్వజములను, జలస్థానమున జాంబవద్ధ్వజమును, నాలుగుదారులు జేరినచోటున దధి వక్త్ర ద్వజమును, మహామంగళ వాద్యములతో స్థాపించునది.

జనులు మార్గద్వారమున శ్రీరుద్ర మూర్తిని లిఖించవలయును. ఐదురంగుల గ్రామసూత్రములచే వాటిని చుట్టవలయును. అది మొదలు 11 రోజులు భక్తితో బ్రాహ్మణ సంతర్పణ జరుగవలయును. ఇట్లు చేయించురాజు ఋత్విక్కులకు వస్త్రాలంకార ఛత్ర పాదుకలనిచ్చి, ఆచార్యునికి సాలంకార దూడతో ఉన్న ఆవును ఇచ్చి, వేరుగా దున్నపోతును దానముజేసి, ఇతరులకు సప్తధాన్య, గుడ, తైల, లవణ, ఘృత, శయ్యాది భూరిదానములనిచ్చినచో అంతట సుక్షేమమునందును. మానస్తోకేతి... మంత్రముతో హోమము, రుద్రసూక్తజపమును సర్వులకు సూక్తము. అని గరుడుడు విన్నవించి వెడలెను.

**శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో మనోహరకాండలో హనుమత్ధ్వజారోహణను వివరించు 16వ సర్గ ముగిసినది.**

# సప్తదశః సర్గః-17వ సర్గ

సార రామాయణము

శ్రీరామదాస ఉవాచ

విష్ణుదాస త్వయా యద్యత్పృష్టం తత్తన్మయేరితమ్ ।
రామాజ్ఞయా తవ ప్రీత్యాఽఽనందచారిత్ర ముత్తమమ్ ॥ 1

రామేణైవ మమాస్యేన తవోపదిష్టమాదరాత్ ।
త్వయ్యస్తి రామసంప్రీతిస్తస్మాద్రామేణ మే ద్విజ ॥ 2

ఆజ్ఞాపితం పూజనాంతే పురా తవ తపోబలాత్ ।
ఆనందరామచరితం మమేదం మంగళప్రదమ్ ॥ 3

విష్ణుదాసాయ విప్రాయ కథయస్వేతి వై ముహుః ।
త్వదర్థం పూజనాంతే మే దర్శనం దత్తవాన్నిజమ్ ॥ 4

నవోత్తరశతశ్లోకసారరామాయణేన చ ।
పురా మే గ్రథితేనాత్ర రామేణ స్మారితోఽస్మ్యహమ్ ॥ 5

శ్రీరాఘవోపదిష్టేన మహామంగళదేన చ ।
నవాధికశతశ్లోకసారరామాయణేన చ ॥ 6

యద్యన్మయా విస్మృతం చ శ్రుతం పూర్వకథానకమ్ ।
మమ తచ్చాపి స్మారితం వాల్మీకిముఖనిర్గతమ్ ॥ 7

తతో మయా విష్ణుదాస రాఘవస్యాజ్ఞయా తవ ।
శతకోటిమితాద్రామచరితాత్సంవివిచ్య చ ॥ 8

సారం సారం చ కథితం మహామాంగళ్యకారకమ్ ।
విష్ణుదాస ఉవాచ
త్వయైతత్కథితం చేదమానందసంజ్ఞకం మమ ॥ 9

శ్రీరామచరితం రమ్యం మమతోషార్థముత్తమమ్ ।
శతకోటిమితాత్తత్కిం కథితం చ వివిచ్య చ ॥ 10

అథవా భరతఖండాంతర్భాగాదుక్తం వదస్వ తత్ ।
రామదాస ఉవాచ
శతకోటిమితం కృత్స్నం మయా రామాయణం శుభమ్ ॥ 11

వివిచ్యా జ్ఞానదృష్ట్యాఽత్ర తవేదముపదేశితమ్ ।
విశేషాత్స్మారితం చాపి సారరామాయణశ్రవాత్ ॥ 12

రామోపదేశితాద్రమ్యాత్తతస్తే కథితం మయా ।
విష్ణుదాస ఉవాచ
శతకోటిమితే రామచరితే పాతకాపహే ॥ 13

కతి కాండాని సర్గాశ్చ తన్మాం వక్తుం త్వమర్హసి ।
శ్రీరామచంద్ర ఉవాచ
నవ లక్షాణి కాండాని శతకోటిమితే ద్విజ ॥ 14

## సార రామాయణము

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, విష్ణుదాసా! వినుము నీవడిగిన విషయములను వివరించితిని. శ్రీరామాజ్ఞచే నీ శ్రద్ధను గమనించి చెప్పబడినదీ ఆనందరామాయణము. ఈ రామ చరితము ఉత్తమమైనది. మంగళప్రదమగు ఈ ఆనందరామాయణమును శ్రీరాముడే నానోటినుండి అభివర్ణించెనని తెలియుము. విష్ణుదాసుడను విప్రునికి చెప్పుమని పలుమార్లు నీకొరకై పూజానంతరము శ్రీరామస్వామి దర్శనమిచ్చెను. శ్రీరాముడు ఉపదేశించిన ఈ 109 శ్లోకముల సారరామాయణము మంగళప్రదము. దానిపై నేను విస్తరించి చెప్పినదంతయును శ్రీవాల్మీకి ముఖమునుండి వచ్చిన శతకోటిరామాయణమునందలిది. కావున, శ్రీరామాజ్ఞ చేత శతకోటి రామచరితమునుండి సారసారమగు దానిని సంగ్రహించి నీకుజెప్పితిని" అని రామదాసు అనగా,

విష్ణుదాసు రామదాసుతో, "గురూత్తమా! నాకు నీవు ఉపదేశించిన ఆనంద రామాయణము శతకోటి రామాయణము నుండియా? భరతఖండాంతర్భాగమగు రామాయణమునుండియా? దేనినుండి సంగ్రహించితివి?" అని వేడగా,

"విశేషముగా శ్రీరామానుగ్రహ లబ్ధ సారరామాయణ బలమున జ్ఞానదృష్టిచే, శ్రీశతకోటి రామాయణమునుండి సంగ్రహించితిని నాయనా! ఇది రామోపదిష్టమగు రమ్యచరిత్ర" అని ఆనతిచ్చెను. అనగా

విష్ణుదాసుడు, "గురువా! శతకోటి రామాయణము యొక్క కాండ, సర్గ, స్వరూప ప్రమాణమెంత?" యని వేడగా, శ్రీరామదాసుడు "నూరుకోట్ల శ్లోకములు గలది శతకోటి రామాయణము.

సర్గా నవతిలక్షాశ్చ జ్ఞాతవ్యా మునికీర్తితాః ।
కోటీనాం చ శతం శ్లోకమానం జ్ఞేయం విచక్షణైః ॥ 15

విష్ణుదాస ఉవాచ

గురోఽహం శ్రోతుమిచ్ఛామి యత్త్వాం శ్రీరాఘవేణ హి ।
ఉపదిష్టం మదర్థం హి సారరామాయణం శుభమ్ ॥ 16

నవోత్తర శతశ్లోకసంమితం చ మనోహరమ్ ।
తత్త్వం వదాధునా పుణ్యం వరం కౌతూహలం మమ ॥ 17

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయా శిష్య సావధానమనాః శృణు ।
సారరామాయణం తేఽద్య ప్రోచ్యతే రామకీర్తితమ్ ॥ 18

ఆవిర్భూత్వా పూజనాంతే మదగ్రే భ్రాతృభిః శ్రియా ।
మాం ప్రోవాచ రఘుశ్రేష్ఠః ప్రసన్నముఖపంకజః ॥ 19

## అథ సార రామాయణమ్

శ్రీరామచంద్ర ఉవాచ

రామదాస శృణుష్వాద్య యత్సారం ప్రోచ్యతే తవ ।
చరిత్రం సకలం స్వీయం మయా తత్త్వం సవిస్తరమ్ ॥ 1

విష్ణుదాసాయ శిష్యాయ మద్భక్తినిరతాయ చ ।
కథయస్వ యథాఽన్యచ్చ జ్ఞానాద్దృష్టం యథాశ్రుతమ్ ॥ 2

యథా భరతఖండాంతర్భాగే చాపి త్వయేక్షితమ్ ।
స్మరణార్థం త్వహం కించిత్తవ వక్ష్యామి సాదరమ్ ॥ 3

పార్వతీశివసంవాదః సూర్యవంశార్ధపార్థివాః ।
మత్పిత్రోర్హరణం లంకాం రావణేన విసర్జనమ్ ॥ 4

దశరథవివాహోశ్చ కైకేయ్యై ద్వివరార్పణమ్ ।
కైకేయ్యై ద్విజశాపశ్చ వరదానకరాయ చ ॥ 5

రాజ్ఞః శాపో వైశ్యహత్యా ఋష్యశృంగార్థముద్యమః ।
ఋష్యశృంగమునేస్తేజః ప్రతాపాద్వహ్నినాఽర్పితమ్ ॥ 6

పాయసం తద్విభక్తం చ గృధ్రీ భాగం గిరౌ నయత్ ।
అంతగర్భ నృపపత్న్యస్తాసామాసాన్ సుదోహదాః ॥ 7

తతో భూమ్యా బ్రహ్మణా మే ప్రార్థనం మంథరాజనిః ।
చైత్రే మాసి మమోత్పత్తిర్బంధుభిశ్చ హనూమతా ॥ 8

బాలక్రీడా మత్కృతా చ వ్రతబంధస్తతో మమ ।
వేదాభ్యాసో వసిష్ఠాచ్చ తీర్థయాత్రా చ బంధుభిః ॥ 9

విశ్వామిత్రాద్ధనుర్విద్యా తాటికామర్దనం వనే ।
ప్రారంభో రణదీక్షాయాః సుబాహోమర్దనం మఖే ॥ 10

శతకోటి రామచరితములో– కాండలు తొమ్మిదిలక్షలు. సర్గలు తొంభై లక్షలు.” అని చెప్పెను. అంత విష్ణుదాసుడు “గురువర్యా! నాకొరకై సారరామాయణమును సాక్షాత్ శ్రీరాముడే పలికెనంటిరే, వానిని విన కుతూహలియై యున్నాను” అని ప్రార్థించెను. (17)

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, “శిష్యా! సావధానముగా వినుము! పూజానంతరము శ్రీరాముడు సపరివారుడుగా ప్రత్యక్షదర్శనమిచ్చి యిట్లు సారరామాయణమును ఉపదేశించెను.

## సార రామాయణము

శ్రీరాముడు చెప్పుచున్నాడు, “రామదాసా! నా చరిత్రమును సంగ్రహించి చెప్పెదను. నీవు విష్ణుదాసునికి ఉపదేశింపుము. తక్కిన సంగతులు నీవు వినినట్లు జ్ఞానదృష్టికి గోచరించుచుండును. భరతఖండాంతర్భాగమున నీవు చూచినట్లు, స్మరణార్థముగా నీకు సాదరముతో కొంత చెప్పెదను, ఎట్లనిన పార్వతీ–పరమేశ్వర సంవాదము,

సూర్య వంశమునందలి పూర్వార్ధ రాజుల పరంపర, లంకకు నాతండ్రిని రావణుడు గొనిపోయి వదలుట, దశరథ వివాహములు, కైకేయికి రెండు వరములును ఇచ్చుట, చేతికి వరదానము, వైశ్యహత్యచే రాజుకు శాపమువచ్చుట, ఋష్యశృంగునికై ప్రయత్నము, తన్మహిమచే పాయసము

వచ్చుట, తద్విభాగము, దానిని గ్రద్ద అపహరించుట, రాజమహిషులు గర్భిణులగుట, తద్వర్ధనము, భూదేవీ బ్రహ్మలచే నేను ప్రార్థింపబడుట, మంథరపుట్టుక, తమ్ములతోడ, ఆంజనేయునితోడ చైత్రమాసమున నాఅవతారమగుట, నా బాల్యక్రీడనము, నాఉపనయనము, వసిష్ఠునివద్ద వేద ధ్యయనము, తమ్ములతోడ తీర్థయాత్ర, విశ్వామిత్రునిచే ధనుర్విద్య, తాటకాసంహారము, యజ్ఞరణ దీక్షారంభమున సుబాహు సంహారము ....

**మారీచక్షేపణం చాపి హ్యహల్యోద్ధరణం మయా ।**
**స్వయంవరం చ శాపశ్చ మునిపత్న్యాః సవిస్తరమ్ ॥ 11**

**నౌకాపేన హి గంగాయాం మదంఘ్రిక్షాళనం కృతమ్ ।**
**శివం ధనుర్జామదగ్న్యస్తం భగ్నం సభాంగణే ॥ 12**

**సీతోత్పత్తిశ్చ సీతాయా లంకాగమననిర్గమౌ ।**
**బంధూనాం మే వివాహాశ్చ జామదగ్న్యపరాజయః ॥ 13**

**దీపావళ్యుత్సవశ్చాపి నృపైః పథి మహారణః ।**
**జీవనం భరతస్యాపి మద్భావి మునినేరితమ్ ॥ 14**

**వృందాశాపః పితుః పుణ్యం కైకేయీపూర్వకర్మ చ ।**
**తతో మద్దినచర్యా చ గర్భాధానమహోత్సవః ॥ 15**

**నారదాగ్రే ప్రతిజ్ఞా మే యౌవరాజ్యార్థముద్యమః ।**
**కైకేయీవరదానేన దండకే గమనం మమ ॥ 16**

**దర్శనం గుహకస్యాపి సీతావాక్యం చ జాహ్నవీమ్ ।**
**భారద్వాజవాల్మీకయోర్దర్శనం చ గిరౌ స్థితిః ॥ 17**

**కాకాక్షిర్భేదనం చాపి రాజ్ఞశ్చ మరణం పురి ।**
**దర్శనం భరతస్యాపి భరతస్య విసర్జనమ్ ॥ 18**

**సీతాయాస్తిలకోఽరణ్యేఽనసూయాభూషణార్పణమ్ ।**
**విరాధమర్దనం మార్గే నానాఽఽశ్రమవిలోకనమ్ ॥ 19**

**అగస్త్యేశ్చాథ గృధ్రస్య దర్శనం సాంబమర్దనమ్ ।**
**విరూపణం శూర్పణఖాయాః ఖరాది ప్రమర్దనమ్ ॥ 20**

**సీతాదేహవిభాగశ్చ మారీచస్య వధో మయా ।**
**సీతాయా హరణం లంకాం సంగరశ్చ జటాయుషః ॥ 21**

**ఇంద్రేణ పాయసం దత్తం సీతాయై గిరిజేక్షణమ్ ।**
**కబంధమర్దనం మార్గే శబర్యా పూజితస్త్వహమ్ ॥ 22**

**తతః సఖ్యం కపీంద్రేణ శిరసః క్షేపణం మయా ।**
**ఛేదనం సప్తతాడానాం సర్పేణ మాలికా హతా ॥ 23**

**వాలేర్ఘాతో మయా తత్ర సీతాశుద్ధ్యర్థముద్యమః ।**
**హనూమతాఽబ్ధితరణం లంకాయాం జానకీక్షణమ్ ॥ 24**

మారీచ ఉచ్చాటనము, అహల్యోద్ధరణము, స్వయంవరము, మునిపత్ని యొక్క శాపవిస్తారము, గుహుడు నాపాదములు కడుగుట, శివధనుర్భంగము, సీతోత్పత్తి, సీత లంకకు పోయి వచ్చుట, తమ్ములతోపాటు నాకువివాహము, పరశురాముని జయించుట, దీపావళి ఉత్సవము, దారిలో రాజులపోరు, భరతునిబ్రతుకించుట, మునిప్రోక్త మధ్భవిష్యత్కథనము, వృందాశాపము, పితృ పుణ్యమహిమ, కైకయీపూర్వకర్మ , నాయొక్క దినచర్య, గర్భాదానమహోత్సవము, నారదునియెదుట నాప్రతిజ్ఞ, యౌవరాజ్య సముద్యమము, కైకేయీ వరముచే దండకారణ్య గమనము, గుహునికి దర్శనము, సీత గంగను ప్రార్థించుట, భరద్వాజ వాల్మీకుల దర్శనము, గిరిపర్ణశాలలో నివసించుట, ఐంద్రకాకాక్షిభేదనము, అయోధ్యలో దశరథమరణము, భరతుడు వచ్చిపోవుట, అరణ్యమున సీత తిలకమును అలంకరించుకొనుట, సీతకు అనసూయ యలంకారమును అర్పించుట, విరాధ సంహారము, దారిలో వివిధాశ్రమములను దర్శించుట, అగస్త్యదర్శనము, గృధ్రదర్శనము, సాంబ సంహారము, శూర్పణఖా వికృతము, ఖరాది రాక్షస సంహారము, సీతాదేహవిభాగము, మారీచుని సంహారము, రావణుడు మాయాసీతను అపహరించుట, రావణునికి జటాయువుతో యుద్ధము, ఇంద్రుడు సీతకు పాయసమును అర్పించుట, సీతావిరహ సమయమున పార్వతి పరీక్షించుట, కబంధ వధ, శబరీ పరిచర్య, సుగ్రీవ సఖ్యము, దుందుభి శిరఃక్షేపణము, సప్తతాళ వృక్షచ్ఛేదనము, తాళ వృక్ష గతసర్పరూప మాలికాహరణము, వాలిసంహారము, సీతను వెదకుయత్నము, ఆంజనేయుడు సముద్రమును దాటుట, అతను సీతను దర్శించుట,

**మందోదరీసముత్పత్తిర్వనపాక్షాదిమర్దనమ్ ।**
**లంకాదాహశ్చ దేహాంతం కర్తుం సిద్ధోఽభవత్కపి ॥ 25**

జంబూనదవృక్షశాఖా కథాఽభ్దే స్తరణం పునః ।
బహుముద్రాదర్శనం చ సేతుబంధస్తతః పరమ్ ॥ 26

విభీషణాభిషేకశ్చ విశ్వనాథకథా శుభా ।
గంధమాదనేశాఖ్యానం సంగరశ్చ తతః పరమ్ ॥ 27

కాలనేమివధశ్చాథ తథైరావణమర్దనమ్ ।
మైరావణమర్దనం చ మయామంచక భంజనమ్ ॥ 28

కుంభకర్ణవధశ్చాపి మేఘనాదస్య మర్దనమ్ ।
తతో హోమస్య విధ్వంసస్తతో రావణమర్దనమ్ ॥ 29

సీతాయా దివ్యదానం చ స్వపురీగమనం మమ ।
రణదీక్షాసమాప్తిశ్చ రాజ్యాభిషేచనం మమ ॥ 30

ఉత్పత్తీ రావణాదీనామింద్రజేత్రుపరాక్రమః ।
మానభంగో రావణస్య వాలిసుగ్రీవజన్మనీ ॥ 31

వాయుపుత్రజన్మకర్మ వరదానం హనూమతః ।
శాపోఽపి వాయుపుత్రాచ్చ హ్యగస్తేశ్చ విసర్జనమ్ ॥ 32

ఇతి సారకాండమ్ ॥ 1 ॥

గంగాయాత్రాసముద్యోగః సరయూభేదనం తతః ।
మయా స్వబాణరేఖా చ సీతావాక్య విసర్జనమ్ ॥ 33

కుంభోదరస్య వాక్యేన పృథ్వీయాత్రా మయా కృతా ।
కుమారీవరదానం చ సురభీ కేన మేఽర్పితా ॥ 34

చింతామణేః శివాల్లాభస్తతోఽయోధ్యాప్రవేశనమ్ ।

ఇతి యాత్రకాండమ్ ॥ 2 ॥

ఆరంభో వాజిమేధస్య పృథ్వ్యాం వాజీ విమోచితః ॥ 35

తురగాయ ససైన్యాయ మార్గదానం తు గంగయా ।
పృథ్వీప్రదక్షిణాం కృత్వా వాటేఽశ్వశ్య ప్రవేశనమ్ ॥ 36

**తమసాతటశాలా చ కుంభోదరప్రదర్శనమ్ ।**
**అష్టోత్తరశత నామ్నాం మమ స్తోత్రం మునీరితమ్ ॥ 37**

**దినచర్యాధ్వజారోపావవభృథోత్సవో మమ ।**
**సీతాదానం చ తన్ముక్తీ రామతీర్థాదివర్ణనమ్ ॥ 38**

**తతో యజ్ఞసమాప్తిశ్చ దశ యజ్ఞా విశేషతః ।**

**ఇతి యాగకాండమ్ ॥ 3 ॥**

మందోదరీ జన్మకథ, అక్షాది వధ, లంకాదహనము, ఆంజనేయుని ప్రతిజ్ఞ, జాంబూనద వృక్షశాఖా కథ, హనుమంతుడు సముద్రమును దాటివచ్చుట, బహురామ ముద్రికాదర్శనము, సేతునిర్మాణము, విభీషణునికి లంకా పట్టాభిషేకము, విశ్వేశ్వరునికథ, గంధమాదన ఈశ్వరాఖ్యానము, యుద్ధారంభము, కాలనేమి వధ, ఐరావణ వధ, మైరావణ వధ, రావణుని మంచక భంగము, కుంభకర్ణ వధ, మేఘనాద వధ, హోమభంగము, రావణసంహారము, సీతాదివ్యము, అందఱు అయోధ్యకు వచ్చుట, రణదీక్షాసమాప్తి, రాజ్యాభిషేకము, రావణాదుల ఉత్పత్తి, ఇంద్రజిత్ పరాక్రమము, రావణ మానభంగము. వాలి, సుగ్రీవుల ఉత్పత్తి, హనుమద్వరదానము, రావణుడు శాపగ్రస్తుడగుట, అగస్త్యముని శ్రీరాముని స్తుతించిపోవుట, **ఇది సార కాండము.**

గంగాయాత్రా ప్రయత్నము, సరయూనదీ భేదనము, నాచే స్వబాణరేఖారచన, సీతావాక్యము, జనార్దనము, అగస్త్యునిమాటమీద భూయాత్ర, కన్యాకుమారీ వరదానము, సురభ్యర్పణము, శివునినుండి చింతామణిలాభము, తిరిగి అయోధ్యా ప్రవేశము. **ఇది యాత్రకాండము.**

అశ్వమేధారంభము, భూమిమీద అశ్వమునువదలుట, గుఱ్ఱముతో పాటు సైన్యమునకు గంగ దారియిచ్చుట, అది భూమిని చుట్టి యజ్ఞశాలకు తిరిగి వచ్చుట, తమసాతీరమున యాగశాలా నిర్మాణము, అగస్త్యదర్శనము, అగస్త్యుడు నా అష్టోత్తర శతనామావళిని చెప్పుట, మరియు అప్పటి నా దినచర్య, ధ్వజారోపణము, అవభృథోత్సవము, సీతాదానము తన్మోచనము, రామతీర్థాదివర్ణనము, యజ్ఞ పరిసమాప్తి, విశేషముగా దశ యజ్ఞములు. **ఇది యాగ కాండ.**

**తతో మమ స్తవరాజః క్రీడాశాలాప్రవర్ణనమ్ । 39**

**పక్షీణాం నవకం స్తోత్రం జానక్యా వర్ణనం మయా ।**
**దేహరామాయణం పత్న్యై మయా కథితముత్తమమ్ ॥ 40**

**దినచర్యా పునర్మే హి సీతాలంకారవర్ణనమ్ ।**
**పక్వాన్నానాం చ విస్తారో జలక్రీడా చ సీతయా ॥ 41**

మాధ్యాహ్నికం భోజనాది మమ కర్మప్రవర్ణనమ్ ।
ద్విజపత్న్యై భూషణానాం దానం జనకజాకృతమ్ ॥ 42

రాత్రౌ నానాస్థలేష్వత్ర క్రీడాశ్చ వివిధాః స్త్రియః ।
రుక్మషోడశమూర్తీనాం న్యాసాగ్రే దానమర్పితమ్ ॥ 43

తతో నిర్జరపత్నీభ్యో వరదానం మయాఽర్పితమ్ ।
గుణవత్యై వరదానం పింగళాయై వరార్పణమ్ ॥ 44

సీతాయాః ప్రత్యయార్థం చ దివ్యదానం మయా ముదా ।
కురుక్షేత్రేఽగస్తిపత్న్యా సంవాదే జానకీజయః ॥ 45

ఇతి విలాసకాండమ్ ॥ 4 ॥

సీతాయా దోహదార్థం హి క్రీడాఽఽరామాదిషు కృతా ।
సీమంతోన్నయనాదీని నానాకర్మాణి వై తతః ॥ 46

విసర్జితశ్చ జనకో వాల్మీకేరాశ్రమం మయా ।
సీతయా ద్వే నిజే రూపే కృతం మద్వాక్యగౌరవాత్ ॥ 47

అంగుష్ఠయోగ్యో లిఖితః కైకేయ్యా రావణో మహాన్ ।
లోకానాం రజకస్యాపి హ్యపవాదాద్విదేహజా ॥ 48

మయా రజస్తమోయుక్తా త్యక్త్వాఽఽనీతశ్చ తద్భుజః ।
గుప్తరూపేణ పుత్రస్య కృతం గత్వా తు జాతకమ్ ॥ 49

శతయజ్ఞా మయా గత్వా కృతాః శ్రీజాహ్నవీతటే ।
వాల్మీకినా లవానాం చ లవః పుత్రః కృత పరః ॥ 50

తయోః కృతం తు మునినాం రామరక్షాభిమంత్రణమ్ ।
కమలానాం చ హరణే లవస్య విజయో మహాన్ ॥ 51

రామాయణస్య శ్రవణం పుత్రాస్యాభ్యాం మయాఽధ్వరే ।
యుద్ధం లవకృతం చాథ జలైస్తస్యాభిషేచనమ్ ॥ 52

శ్రీరామస్తవ రాజము, క్రీడాశాలాభి వర్ణనము, పక్షిగీత నవరత్నము, నాచే జానకివర్ణింపబడుట, నేను సీతకు దేహరామాయణమును అభివర్ణించుట, నాయొక్క దినచర్య, సీతయొక్క అలంకారాభి వర్ణనము. పక్వాన్న విస్తారము, సీతాజలక్రీడనము, నాయొక్క మధ్యాహ్న భోజనాది క్రియాభివర్ణన, బ్రాహ్మణ స్త్రీలకు ఆభరణదానము, రాత్రిపూట బహుస్థలములయందు నానాక్రీడలు, షోడశ సువర్ణ ప్రతిమాదానము, దేవకాంతలకు వరమిచ్చుట, గుణవతికి వరదానము, పింగళకు వరదానము, సీతకు నమ్మకమిచ్చుటకై దివ్యదానము, కురుక్షేత్రమున సీత లోపాముద్రను జయించుట.

**ఇది విలాసకాండము.**

ఉద్యాన క్రీడాదులచే సీతాదోహద విలాసము, సీమంతాది వైభవము, నాచే వాల్మీక్యాశ్రమమున జనకుడు విసర్జింపబడుట, నావాక్యగౌరవముచే సీతరూపద్వయమునందుట, కైకేయిచేత అంగుష్ఠోచిత ముగా రావణుడు లిఖింపబడుట, రజకోక్తిచే రజస్తమోరూపిణియగు సీతను పరిత్యజించుట, ఆమె భుజమును దెప్పించుట, గుప్తరూపముతో పుత్రదర్శనము, గంగా తీరమున 100 యజ్ఞములను ఆచరించుట, వాల్మీకిముని లవములతో లవుని నిర్మించుట, ఆ పుత్రులకు రామరక్షాభి మంత్రణము, కమలాపహరణమున లవుని విజయము, యజ్ఞశాలలో పుత్ర ముఖమున రామాయణమును వినుట, లవకృతయుద్ధము, అతనికి జలాభిషేకము ...

**మమ యుద్ధం కుశేనాథ సీతాయాః శపథస్తతః ।**
**సీతాయా గ్రహణం చాపి వింశత్యా భూతలం పునః ॥ 53**

**తతో యజ్ఞసమాప్తిశ్చ బంధుపుత్రజనిస్తతః ।**
**బాలక్రీడోపనయనం వేదానాం గ్రహణం క్రమాత్ ॥ 54**

**బాలానాం శుభచిహ్నాని సీతయాః పుత్రలాలనమ్ ।**
**సర్వేషాం వ్రతబంధాశ్చ తేషాం యాతాస్తతః పరమ్ ॥ 55**

**ఇతి జన్మ కాండమ్ ॥ 5 ॥**

**భూరికీర్తిః పత్రికాయా తత్పురం గమనం మమ ।**
**వ్యగ్రతాఽఽసీత్పురస్త్రీణాం దర్శనార్థం తదా మమ ॥ 56**

**వందితోఽహం నృపైః సర్వైస్తదా రాజసభాంగణే ।**
**క్రమేణ వర్ణనం చాపి పార్థివానాం హి నదయా ॥ 57**

కుశకంఠే చంపికయా రత్నమాలావిసర్జనమ్ ।
క్రమేణ వర్ణనం చాథ పార్థివానాం సునందయా ॥ 58

సుమత్యా రత్నమాలాయాః లవకంఠే విసర్జనమ్ ।
ఉత్సాహోఽథ వివాహస్య నానాసమ్మానపూర్వకః ॥ 59

గమనం హి స్నుషాభ్యాం చ సీతయా స్వపురీం మమ ।
నిగ్రహో జలదేవీనాం బాలకానాం ప్రమోచనమ్ ॥ 60

సర్వేషాం తు వివాహాశ్చ పృథక్ పుత్రగృహాణి హి ।
కాంతిపుర్యాశ్చ మదనసుందరీహరణం తతః ॥ 61

యూపకేతోర్వివాహశ్చ పౌత్రాణాం గణనా తతః ।
పౌత్రీణాం గణనా చాపి సర్వైః సౌఖ్యం తతో మమ ॥ 62

ఇతి వివాహకాండమ్ ॥ 6 ॥

సహస్రనామస్తోత్రం మే కల్పవృక్షసురద్రుమై ।
సమానీతౌ మయా స్వర్గాద్ధ్రువం దుర్వాససేక్షణాత్ ॥ 63

మత్కృష్ణోపాసకయోశ్చ సంవాదశ్చ పరస్పరమ్ ।
కాకాయ వరదానంచ శతస్త్రీణాం వరార్పణమ్ ॥ 63

కుశునితో నాకుయుద్ధము. సీతాశపథము, భూమిలో ప్రవేశించుచుండు సీతను గ్రహించుట, అంత యజ్ఞ సమాప్తి. తమ్ములకు పుత్రులు పుట్టుట, వారి బాలక్రీడ ఉపనయనాదులు, వారికి క్రమముగా వేదాదుల అభ్యాసము, బాలకుల శుభ లక్షణములు, సీతాదేవి పుత్రులను లాలించుట, వారందరికి వ్రతబంధము, అటుమీద యాత్ర.

**ఇది జన్మకాండము.**

భూరికీర్తి పత్రికా ప్రకారము వెడలుట, పురస్త్రీ దర్శనమునకై వ్యగ్రత, నేను రాజసభయందు రాజులచే పూజింపబడుట, నందచే రాజులువరుసగా అభివర్ణింపబడుట, చంపిక కుశుని వరించుట, సునంద రాజులను వర్ణించుట, సుమతి లవుని వరించుట, పిదప వారి వివాహోత్సాహము, కోడండ్లతోడ నేను అయోధ్యకువచ్చుట, జలదేవతలను నిగ్రహించుట. బాలకులను విడిపించుట,

అందరికిని పెండ్లిండ్లు, వేర్వేరుగా రాజమందిరములను ఏర్పరచుట, కాంతిపురిలో మదనసుందరీ హరణము, యూపకేతు వివాహము, మనుమల పరిగణనము, అందరితోడ నాయొక్క సౌఖ్యము.

**ఇది వివాహకాండము.**

శ్రీమత్ ఆనందరామ సహస్రనామస్తోత్రము, కల్పవృక్ష సురద్రుమములను రప్పించుట, దుర్వాసో దర్శనము, రామోపాసక, కృష్ణోపాసకుల పరస్పరసంవాదము. కాకవరదానము. శతస్త్రీ వరదానము.

**స్థానాన్యుక్తాని నిద్రాయై కృతః క్రోధోఽను గాదిషు ।**
**శతశీర్ష్ణే రావణస్య పౌండ్రకస్య వధోఽపిచ ॥ 65**

**సీతాయా విరహో జాతో హతశ్చ మూలకాసురః ।**
**సీతాయాశ్చ స్తుతిః కేన లంకాయాం చ ప్రవేశనమ్ ॥ 66**

**లంకాయాః పరితశ్చాపం భ్రామయిత్వా పురీం గతః ।**
**లాభః కపిలవారాహమూర్తేర్దత్తా చ బంధవే ॥ 67**

**లవణాసురఘాతశ్చ మధురాయాం నివేశనమ్ ।**
**పుత్రాణాం రాజ్యభాగాశ్చ సప్తద్వీపజయో మయా ॥ 68**

**యతిశూద్రగృధ్రశిక్షా సప్తప్రేతసుజీవనమ్ ।**
**శూద్రాణాం వరదానం చ ద్విజస్త్రీణాం వరార్పణమ్ ॥ 69**

**షోడశస్త్రీసహస్రాణాం వరాశ్చ మృగయా మమ ।**
**కాళింద్యై వరదానం చ పిప్పలం ఛేత్తుముద్యమః ॥ 70**

**ఇతి రాజ్యకాండ పూర్వార్ధమ్ ॥**

**వాల్మీకేర్వచనాద్ధాస్యం కర్తుమాజ్ఞాపితం జనాన్ ।**
**శాపోఽశ్వినీకుమారాభ్యాం గణయోశ్చ పరస్పరమ్ ॥ 71**

**బ్రహ్మణా మేఽవతారాణాం వర్ణనం చ పృథక్కృతమ్ ।**
**జన్మత్రయం చ వాల్మీకేర్వరదానస్మృతిర్మమ ॥ 72**

**మద్రాజ్యవర్ణనం చాథ హేమాయాశ్చ స్వయంవరమ్ ।**
**చిత్రాంగదేన సంగ్రామః కథా కంకణయోస్తథా ॥ 73**

లవస్య జీవదానం చ రామముద్రా సవిస్తరా ।
రామనాథపురదానం విప్రైర్దృష్టశ్చ మారుతిః ॥ **74**

దినచర్యా మమ తతః స్వల్పసంతతికారణమ్ ।
కర్ణధ్వనైః కథా చాపి మేఽవతారేస్వయం వరః ॥ **75**

పత్రపార్శ్వే శ్రీరామేతి లేఖనస్య చ కారణమ్ ।
సుగుణాయై వరదానం ద్వే రూపే చ మయా ధృతే ॥ **76**

తులసీపత్రసంధిశ్చ రామాయణశ్రుతేః ఫలమ్ ।
సుమంత్రజీవదానం చ సంగ్రామశ్చ యమేన హి ॥ **77**

సప్తద్వీపేషు సర్వత్ర ధర్మశిక్షా మయా కృతా ।
నారదోక్తం శతశ్లోకైశ్చరితం మమ పావనమ్ ॥ **78**

**ఇతి రాజ్యకాండ ఉత్తరార్ధమ్ ॥ 7 ॥**

స్త్రీ వరదానము, నిద్రకొరకు స్థానముక్తి, అనుంగులయందు క్రోధముచేయబడుట, శతకంఠ రావణవధ, పౌండ్రక వధ, సీతావిరహవర్ణన, మూలకాసుర సంహారము, సీతయొక్క స్తుతి, లంకా ప్రవేశము, లంకాదర్శనము, దొరకిన కపిలవరాహమూర్తిని తమ్మునికిచ్చుట, లవణాసురసంహారము, మధురానివేశనము, పుత్రులకు రాజ్యభాగము, సప్తద్వీపజయము, యతిశూద్ర గృధ్రశిక్షణము, 7మందిని బ్రతికించుట, శూద్రులకు వరదానము, బ్రాహ్మణ స్త్రీవరదానము, 16 వేలమంది స్త్రీలకు వరదానము, నాయొక్క వేట, కాలిందికివరదానము, అశ్వత్థ ఛేదనోద్యోగము,

**ఈ విధముగా రాజ్యకాండ పూర్వార్ధము.**

వాల్మీకి వచనముచే లోకులను నవ్వుటకు ఆజ్ఞాపించుట, అశ్వినీకుమారులచే గణులకు పరస్పరముగా శాపము, బ్రహ్మ నా అవతారములను వర్ణించుట, వాల్మీకి జన్మత్రయ వర్ణనము, నాయొక్కస్తుతి, నారాజ్య వర్ణనము, హేమాస్వయంవరము, చిత్రాంగదునితో యుద్ధము, కంకణ కథ, లవునికి జీవదానము, రామముద్రా విస్తారము, రామనాథపుర దానము, బ్రాహ్మణులు మారుతిని దర్శించుట, మరల నాదినచర్య, అల్పసంతతికారణము, పత్రపార్శ్వమున శ్రీరామయని వ్రాయుటకు కారణము, సుగుణకు వరదానము, నేను రూపద్వయమును ధరించుట, కర్ణధ్వనికథ, నాయవతారమున నీవరము, తులసీసంధానము, రామాయణశ్రవణఫలము, సుమంత్రునికి జీవదానము, యమునితో యుద్ధము, అంతట నాచే ధర్మశిక్షయేర్పడుట. **ఇది రాజ్యకాండ ఉత్తరార్ధము.**

పౌరాణేముపదేశశ్చ మన్మాతౄణాం వరాస్యతః ।
మనః పూజా బహిః పూజ నవరూపధరస్త్వహమ్ ॥ 79

రామలింగతోభద్రాణాం నానాభేదా విచిత్రితాః ।
మాసనవమ్యా విస్తారః కథా స్త్రీరాజ్యసంభవా ॥ 80

మమనామలేఖనస్యోద్యాపనం దానవిస్తరః ।
చిరంజీవిత్వవిస్తారో వేదాదీనాం శ్రుతేః ఫలమ్ ॥ 81

సార్ధమాసద్వయం నామ తే వ్రతం తిథివిస్తరః ।
గౌరీవ్రతస్య విస్తారో దోలకే మమ పూజనమ్ ॥ 82

నవమ్యాం మూర్తిదానం చ దమనోత్సవవిస్తరః ।
కామ్యదైవతవిస్తారో రకారాద్యవరో గుణః ॥ 83

మమ నామ్నశ్చ మహిమా మన్నామార్థ ఉదాహృతః ।
చైత్రవ్రతస్య విస్తారో రాక్షసాదిగతిః స్మృతా ॥ 84

అద్వైతం దర్శితం లోకాన్నారీణాం చ వరార్పణమ్ ।
మన్ముద్రావస్త్రమహిమా కవచం మే హనూమతః ॥ 85

సీతాయా లక్ష్మణాదీనాం కవచాని పృథక్ పృథక్ ।
సీతలావ్రతమాహాత్మ్యం తస్య చోద్యాపనం తథా ॥ 86

రామనామతోభద్రం చ మంత్రాశ్చ కీర్తనాయ చ ।
పతాకారోపణం నామ వ్రతం మారుతితోషదమ్ ॥ 87

మయోపదిష్టమేతత్తే సారరామాయణం త్వపి ।
హనూమతా శరసేతోరర్జునస్యాత్ర ఖండనమ్ ॥ 88

ఇతి మనోహరకాండమ్ ॥ 8 ॥

వాల్మీకినా సోమవంశ నృపవృత్తనివేదనమ్ ।
పుత్రయోరభిషేకశ్చ ప్రస్థానం హస్తినాపురమ్ ॥ 89

తతో మహాన్ సంగరశ్చ పుత్రయోశ్చ జయో మమ ।
బ్రహ్మణా ప్రార్థనా మేఽత్ర వాల్మీకేశ్చ కుశస్య చ ॥ **90**

రిపుస్త్రీణాం ప్రార్థనయా సీతా పుత్రం న్యవారయత్ ।
తతో విధేశ్చ వాక్యేన వైకుంఠం గంతుముద్యమః ॥ **91**

సోమవంశోద్భవాయాథ దత్తం వై హస్తినాపురమ్ ।
అజమీఢాభిషేకశ్చ సర్వేషాం చ విసర్జనమ్ ॥ **92**

కుశస్య గమనం స్వీయపురి రాజ్యం శశాస సః ।
సర్పస్వసుః కుముద్వత్యా వారవంశసముద్భవః ॥ **93**

వరదానం లక్ష్మణాయ వానరేభ్యస్తథా మయా ।
అయోధ్యాసంస్థితానాం చ తతో దేహవిసర్జనమ్ ॥ **94**

నారదుడు 100 శ్లోకములచే నా చరిత్రను చెప్పుట, పౌరులకు ఉపదేశించుట, నాతల్లులకు ఉపదేశము చేయించుట, అంతర పూజనము, బాహ్య పూజనము, నేను నవరూపధరుడనగుట, రామలింగతోభద్రాది నానాభేదములు, మాస నవమి విస్తారము, స్త్రీ రాజ్య సంభవకథ, మన్నామలేఖన వ్రతోద్యాపనాదులు, చిరంజీవిత్వ విస్తారము, వేదాదిశ్రవణఫలము, 45 రోజులు నావ్రతము, తిథి వ్రతము, గౌరీవ్రత విస్తారము, డోలాపూజనము, నవమీమూర్తిదానము, దమనోత్సవము, కామ్య దైవతవిస్తారము, రేఫాది మహిమ, మన్నామ మహిమ, చైత్రవ్రత విస్తారము. రాక్షసాదిగతిక్రమము, లోకులకు అద్వైత ప్రదర్శనము, స్త్రీలకు వరములిచ్చుట, సముద్రావస్త్ర మహిమ– హనుమత్, సీతా, రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న కవచములు– సీతలావ్రతోద్యాపనములు, రమానామతోభద్రము, కీర్తనమంత్రములు, మారుతీ వ్రతపతాకారోపణము, నాచే ఉపదేశింపబడిన సారరామాయణము, అర్జున శరసేతువును ఆంజనేయుడు ఖండించుట.

**ఇదీ మనోహర కాండ.**

వాల్మీకి చంద్రవంశ రాజవృత్తమును చెప్పుట, పుత్రులకు పట్టాభిషేకము, హస్తినాపుర ప్రయాణము, గొప్పయుద్ధము, నాకును పుత్రులకును జయము, నాకును వాల్మీకికిని కుశునికిని బ్రహ్మప్రార్థన, శత్రు స్త్రీ ప్రార్థనచే సీతాపుత్రుని నివారించుట, విధివాక్యముచే వైకుంఠ ప్రయాణప్రయత్నము, సోమ వంశ రాజులకు హస్తినాపురమునిచ్చుట, అజమీఢాభిషేకము. అందరిని వదలుట, కుశుడు వెడలి తన రాజ్యమును పాలించుట, సర్పస్వసయగు కుముద్వతిచే వీరవంశోద్భవము, లక్ష్మణునికి వర దానము, వానరులకును నేను వరమునిచ్చుట, అయోధ్యావాసులతోకలసి దేహమును వదలుట,

వానరాస్తే సురా జాతాః సీతా జాతా రమా మమ ।
లక్ష్మణః పన్నగో జాతః శంఖోఽభూద్భరతస్తదా ॥ 95

సుదర్శనం చ శత్రుఘ్నో విష్ణురూపధరస్త్వహమ్ ।
తదోర్మిలాదికానాం చ ప్రయాణం సర్వయోషితామ్ ॥ 96

నీరాజనం సురస్త్రీభిస్తేషాం సాంతానికం పదమ్ ।
శంభునా సంస్తుతశ్చాహం గరుడారోహణం మమ ॥ 97

పుష్పవృష్టిర్మయి తదా వైకుంఠే గమనం మమ ।
వైకుంఠే రమయా స్థిత్వా దేవానాం చ విసర్జనమ్ ॥ 98

సూర్యవంశానుక్రమశ్చానందరామాయణస్య చ ।
కాండసంఖ్యా సర్గసంఖ్యా గ్రంథసంఖ్యా ఫలశ్రుతిః ॥ 99

రామాయణ శ్రవణస్యోద్యాపనం చ మహత్తమమ్ ।
గ్రంథదానమనుష్ఠానం ప్రకారాః పంచ వై తతః ॥ 100

అనుష్ఠానోద్యాపనం చ శకునస్య చ విస్తరః ।
సంవాదస్య పూర్ణతాపి యువయోర్గురుశిష్యయోః ॥ 101

ఆశంకాచ్ఛేదనం దేవ్యాః కలాఽస్య పఠనస్య చ ।
రామాయణస్య మహిమా చైక శ్లోకేన వై త్విదమ్ ॥ 102

మమ ధ్యానం చేశదేవ్యోః సంవాదస్యాపి పూర్ణతా ।

ఇతి పూర్ణ కాండమ్ ॥ 9 ॥

ఏవం మయా రామదాస సారరామాయణం తవ ॥ 103

స్మరణార్థం చరిత్రాణాం సంక్షేపేణ నివేదితమ్ ।
ఇదం గోప్యం త్వయా కార్యం మహత్పుణ్యప్రదం స్మృతమ్ ॥ 104

శతకోటిమితగ్రంథాత్సారం సారం మయోదితమ్ ।
కః క్షమః సకలం వక్తుం వినా వాల్మీకినా భువి ॥ 105

**స ఏవ ధన్యో వాల్మీకిర్యేన మచ్చరితం కృతమ్ ।**
**సారరామాయణమిదం యే పఠంత్యత్ర మానవాః ॥ 106**

వానరులు–దేవతలగుట, సీత–లక్ష్మి యగుట, లక్ష్మణుడు–శేషుడగుట, భరతుడు–శంఖమగుట, శత్రుఘ్నుడు–సుదర్శనమగుట, నేను–మహావిష్ణువగుట, ఊర్మిళాది స్త్రీల ప్రయాణము, దేవస్త్రీలు నీరాజనమిచ్చుట, శివస్తుతుడై నేను గరుడుని ఆరోహించుట, నేను పుష్పవృష్టినిచ్చుట, నేను వైకుంఠమున కరుగుట, లక్ష్మీతోడ వైకుంఠమున వసించి దేవతలను పంపుట, సూర్యవంశానుక్రమము, ఆనంద రామాయణముయొక్క గ్రంథ సంఖ్యా ఫలశ్రుతులు, రామాయణ శ్రవణోద్యాపనము, గ్రంథదానానుష్ఠానము, శాకునవిస్తారము, మీ గురు శిష్యులసంవాదసమాప్తి, కళామాత్ర పఠనాది శంక దేవికి నివృత్తించుట, రామాయణ మహిమ, ఏకశ్లోకము చేతనే మద్ధ్యానము, పార్వతీ పరమేశ్వర సంవాదసమాప్తి.

**ఇది పూర్ణ కాండ.**

ఓయి రామదాసా! నా చరిత్ర సంగ్రహమగు ఈ సార రామాయణమును నీకు స్మరణార్థము ఉపదేశించితిని. పుణ్యప్రదమిది మిగుల గోప్యమైయుండు, శతకోటి రామాయణమున ఇది సారసారము. వాల్మీకి తప్ప తక్కినవారెవరును చెప్పజాలరు, నాచరిత్రమును వర్ణించిన అతడొక్కడే కృతకృత్యుడు.

**తేభ్యో భుక్తిశ్చ ముక్తిశ్చ ద్విజ దాస్యామ్యహం ముదా ।**
**కృత్స్నం రామాయణం శ్రోతుం పఠితుం వా నరోత్తమాన్ ॥ 107**

**అవకాశో యదా నాస్తి తదైతత్సంపఠేన్నరః ।**
**అన్యద్యద్యన్మయా కర్మ కృతం పూర్వం శుభాశుభమ్ ॥ 108**

**తన్మచ్ఛందాత్వన్ముఖాన్నిర్గమిష్యతి నిశ్చయాత్ ।**
**త్వద్దృష్టిగోచరం కృత్స్నం చరితం మే భవిష్యతి ॥ 109**

**విష్ణుదాసాయ శిష్యాయ వద త్వమధునా సుఖమ్ । 110**

**శ్రీరామదాస ఉవాచ**

**ఏవం శ్రీరామచంద్రేణ యథాఽత్ర కథితం మమ ।**
**సారరామాయణం రమ్యం తదిదం తే నివేదితమ్ ॥ 111**

**ఇదం రమ్యం పవిత్రం చ మహాపాతక నాశనమ్ ।**
**సర్వదా మానవైర్జప్యం భుక్తిముక్తిప్రదాయకమ్ ॥ 112**

**కృత్స్నం రామాయణం శ్రుత్వా యత్ఫలం ప్రాప్యతే నరైః ।**
**తదస్య పఠనాదేవ సత్యం సత్యం వచో మమ ॥ 113**

**తస్మాన్నృభిః సదా జప్యం సర్వేషాం శాంతికారకమ్ ।**
**పుత్రపౌత్రప్రదం స్త్రీదం మహత్సౌఖ్యప్రద్రం నృణామ్ ॥ 114**

**రామాయణాని శతశః సంతి శిష్యావనీతలే ।**
**తథాఽప్యనేన సదృశం న భూతం న భవిష్యతి ॥ 115**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, రామదాస విష్ణుదాససంవాదే, శ్రీరామచంద్రోపదిష్టం, సారరామాయణం నామ, సప్తదశస్సర్గః ॥**

ఈ సారరామాయణమును పఠించినవారికి భుక్తి, ముక్తుల నొసంగుచుందును. సమస్త రామాయణ పఠనమునకు అవకాశము లేనివారు దీనిని పఠించి ధన్యులగుదురు. ఇతరములు మత్కృతములేవి నీ జ్ఞానదృగ్గోచరములగునవి అన్నియును మచ్చరిత్రము కాగలదు. నీశిష్యుడగు విష్ణుదాసునికి సుఖముగా జెప్పుము. ఇది రామాయణము.

విష్ణుదాసా! ఇట్లు రామచంద్రోపదిష్టముగు సార రామాయణమును నీకు ఉపదేశించితిని, ఇది రమ్యము, పవిత్రము, దురితపరిహారకము, నరులచే నిరంతరము జపనీయము. భుక్తి, ముక్తిప్రదము. దీనిని పఠించుటచే సమగ్రరామాయణ పఠన పుణ్యమబ్బునని సత్యముగా జెప్పెదను. నాపలుకిది సత్యము. కావున శాంతి కారకమగు దీనిని పఠించి మానవులు పుత్రపౌత్రవనితాది సమస్త భోగముల నంది సుఖింతురు గాక! ఈ పుడమిన నూర్లకొలది రామాయణములు గలవు. అయినను దీనితో సమానము లేదు, మరికలుగదు. (133)

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములో మనోహరకాండలో
సారరామాయణమును బోధించు 17వ సర్గ ముగిసినది.

# అష్టాదశః సర్గః-18వ సర్గ

హనుమంతునిచే శరసేతు భంగము

విష్ణుదాస ఉవాచ

కపిధ్వజోఽర్జునశ్చేతి మయా పూర్వం శ్రుతం గురో ।
తన్నామకారణం మాం త్వం విస్తరాద్వక్తుమర్హసి ॥ 1

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయా శిష్య సావధానమనాః శృణు ।
ద్వాపరాంతం భావికథాం త్వాం వదామి చమత్కృతామ్ ॥ 2

ఏకదా కృష్ణరహితోఽర్జునః స్యందనసంస్థితః ।
యయావరణ్యే విచరన్మృగయార్థం హి దక్షిణామ్ ॥ 3

ఏకాకీ సూతసంస్థానే స్థిత్వా తత్కృత్యమాచరన్ ।
హత్వా వనే మృగాన్ ధన్వీ మధ్యాహ్నే స్నాతుముద్యతః ॥ 4

యయౌ రామేశ్వరం సేతౌ ధనుష్కోట్యాం విగాహ్య చ ।
మధ్యాహ్నకృత్యం సంపాద్య పునః స్యందనసంస్థితమ్ ॥ 5

అబ్ధేస్తటే విచచార కించిద్గర్వసమన్వితః ।
ఏతస్మిన్నంతరేఽరణ్యే పర్వతోపరిసంస్థితమ్ ॥ 6

## అర్జునుని భవిష్యత్ కథనము.

విష్ణుదాసు అడుగుచున్నాడు. "మునుపొక ప్రస్తావమున అర్జునుడు కపిధ్వజుడని వింటినిగదా! తత్కారణమును వినగోరుచున్నాను. గురుమూర్తీ! సెలవివ్వండి"యనెను. అంత శ్రీరామదాసు చెప్పుచున్నాడు- చక్కగా అడిగితివి విష్ణుదాసా! సావధానముగా వినుము! నాచే రచింపబడిన ద్వాపరయుగము చివర్న జరుగు భవిష్యత్కథను చెప్పెదను,

ఒకసారి అర్జునుడు ఒంటరిగా రథమునెక్కి వేటాడుటకై దక్షిణముగా వెడలెను. ఒంటరిగా వన్యమృగములను వేటాడుచు వెడలి, మధ్యాహ్న స్నానమునకు సేతువుకు వెడలెను. అచ్చట ధనుష్కోటిలో స్నానముజేసి మాధ్యాహ్నిక కృత్యమును నెరవేర్చి, రథమునెక్కి గర్వముతో సంచరించుచుండెను.

దదర్శ మారుతిం వీరః సామాన్యకపిరూపిణమ్ ।
రామ రామేతి జల్పంతం పింగలోమధరం శుభమ్ ॥ 7

తమర్జునోఽబ్రవీద్వాక్యం కిం నామాస్తి కపే తవ ।
తదర్జునవచః శ్రుత్వా విహస్య కపిరబ్రవీత్ ॥ 8

యత్ప్రతాపాచ్చ రామేణ శిలాభిః శతయోజనమ్ ।
బద్ధోఽయం సాగరే సేతుస్తం మాం త్వం విద్ధి వాయుజమ్ ॥ 9

ఇతి తద్గర్వసహితం వాక్యం శ్రుఽత్వాఽర్జునస్తదా ।
గర్వాద్విహస్య ప్రోవాచ మారుతిం పురతః స్థితమ్ ॥ 10

వృథా రామేణ సేత్వర్థం శ్రమః పూర్వం కృతస్త్వయమ్ ।
కథం తేన శరైః సేతుం కృత్వా కార్యం కృతం న హి ॥ 11

తదర్జునవచః శ్రుత్వా మారుతిః ప్రాహ తం పునః ।
మత్తుల్యకపిభారేణ శరసేతుః పయోనిధౌ ॥ 12

న్యుబ్జిష్యతీతి మత్వా తం నాకరోద్రఘునందనః ।
తత్కపేర్వచనం శ్రుత్వాఽర్జునో మారుతిమబ్రవీత్ ॥ 13

కపిభారాద్యదా సేతుర్జలే మగ్నో భవిష్యతి ।
ధనుర్విద్యా ధన్వినః కా తదా వానరసత్తమ ॥ 14

అధునాఽహం కరిష్యామి శరసేతుం తవాగ్రతః ।
త్వం తస్యోపరి నృత్యాది కురుష్వాత్ర యథాసుఖమ్ ॥ 15

ధనుర్విద్యాం మమాద్య త్వం కపే పశ్యతుమర్హసి ।
తదర్జునగిరం శ్రుత్వా తమాహ సస్మితః కపిః ॥ 16

మమాంఘ్ర్యంఘ్రుష్ఠ భారేణ శరసేతుస్త్వయా కృతః ।
చేన్మగ్నః స్యాత్సముద్రే హి తదా కార్యం త్వయాఽత్ర కిమ్ ॥ 17

తత్కపేర్వాక్యమాకర్ణ్య సోఽర్జునః ప్రాహ తం పునః ।
యది మగ్నః శరసేతుస్త్వద్భారాత్తర్హ్యహం కపే ॥ 18

**విశామ్యత్రానలం సత్యం త్వం చాప్యద్య పణం వద ।**
**తత్ప్రతిజ్ఞాం కపిః శ్రుత్వాఽర్జునం వచనమబ్రవీత్ ॥ 19**

**మయా స్వాంగుష్ఠభారేణ త్వత్సేతుశ్చేన్న లోపితః ।**
**తర్హి త్వద్ధ్వజసంస్థోఽహం తవ సాహాయ్యమాచరే ॥ 20**

ఆ సమయానికి పర్వతాగ్రమున సామాన్య వానరరూపముతో, 'శ్రీరామ రామ' అని కీర్తించుచు పింగళ కేశుడై ఒప్పునట్టి హనుమంతుని చూచిన అర్జునుడు "కపీ! నీపేరేమి?" అని అడిగెను. అందుకాంజనేయుడు నవ్వుచు "ఎవనిప్రతాపముతోరాముడు కొండలతో శతయోజనమగు ఈ సేతువును సముద్రముపై నిర్మించెనో, అట్టి వాయుపుత్రుడను నేను." అనెను. ఆ అహంకార వాక్యమును వినిన అర్జునుడు నవ్వుచు, "సేతువునకై రాముడు వ్యర్థముగా నీశ్రమను స్వీకరించెను. ఆ రాముడెందుకు బాణములతో సేతువును నిర్మించలేదు? అనియడిగెను. అందుకు హనుమంతుడు "నా వంటి కపులబరువుకు శరసేతువు సముద్రమున మునిగిపోవునని శ్రీరాముడట్లు చేయలేదు." అనెను. ఆమాటవిని అర్జునుడు "కోతుల బరువుకే శరసేతువు సముద్రమున మునిగిపోవునెడల ధనుర్ధారులకు ధనుర్విద్యవలన ప్రయోజనమేమున్నది? నీయెదట నేను శరసేతువును నిర్మించెదను. నీవు దానిమీద నీ ఇష్టమువచ్చినట్లు తాండవముజేయుము. కపివీరా! నాధనుర్విద్యనపుడు చూతువుగాక" అని అర్జునుడు విఱ్ఱవీగెను. అంత

ఆంజనేయుడు అర్జునుని పరిహసించుచు "నాయొక్క చేతి బొటనవ్రేలు భాగముచే నీవు నిర్మించబోయే శరసేతువు మునిగిన నీవేమి చేయుదువు?" అని శపథమడిగెను. అందుకర్జునుడు "అట్లైనచో నేను అగ్నిప్రవేశము జేయుదును. నీభారముచే అది మునుగకపోయిన నీవేమి చేయుదువు! చెప్పు" మనెను. అంత ఆంజనేయుడును "నాబొటనవ్రేలు భారము చే నీసేతువును పడద్రొక్కనిచో నీధ్వజమందు నివసించుచు, నీకుసహాయకుడగుదు"నని పలికెను. (20)

**తథాఽస్త్విత్యర్జునః ప్రాహ టణత్కృత్య మహద్ధనుః ।**
**నిర్మమే శరసంజాలైః సేతుం దృఢతరం ఘనమ్ ॥ 21**

**శతయోజనవిస్తీర్ణం సాగరస్యోర్ధ్వతః స్థితమ్ ।**
**తం సేతుం మారుతిర్దృష్ట్వార్జునాగ్రేంఽగుష్ఠభారతః ॥ 22**

**అకరోత్సాగరే మగ్నం క్షణమాత్రేణ లీలయా ।**
**తదా దేవాః సగంధర్వాః కిన్నరోరగరాక్షసాః ॥ 23**

విద్యాధరాశ్చాప్సరసః సిద్ధాద్యా గగనస్థితాః ।
మారుతిం హ్యర్జునస్యాగ్రే వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 24

తత్కర్మణాఽర్జునశ్చాపి చితాం కృత్వాఽబ్ధిరోధసి ।
నివారితోఽపి కపినా దేహం త్యక్తుం సముద్యతః ॥ 25

ఏతస్మిన్నంతరే కృష్ణస్తం ప్రాహ వటురూపధృత్ ।
జ్ఞాత్వాఽర్జునముఖాత్సర్వం పూర్వవృత్తం పణాదికమ్ ॥ 26

ఉభాభ్యాం యద్యచ్చరితం పూర్వం తచ్చ వృథా గతమ్ ।
సాక్షిత్వేన వినాకర్మ సత్యం మిథ్యా న బుధ్యతే ॥ 27

సాక్షిత్వేనాధునా మేఽత్ర యువాభ్యాం కర్మ పూర్వవత్ ।
కర్తవ్యం తదహం దృష్ట్వా సత్యం మిథ్యా వదామ్యహమ్ ॥ 28

తద్వటోర్వచనం శ్రుత్వా ద్వావూచతుస్తథేతి చ ।
తతశ్చకార గాండీవీ శరసేతుం హి పూర్వవత్ ॥ 29

సేతోరంతర్గతం చక్రం శ్రీకృష్ణశ్చాకరోత్తదా ।
తతః స్వాంగుష్టభారేణ కపిః సేతుం ప్రపీడయత్ ॥ 30

సేతుం దృఢం కపిర్జ్ఞాత్వా పాదజానుకరాదిభిః ।
బలేన పీడయామాస స సేతుస్తైశ్చచాల న ॥ 31

తదా తూష్ణీం హనూమాన్స మంత్రయామాస చేతసి ।
పూర్వం మయాంగుష్ఠ భరాత్సేతుశ్చాబ్ధౌ విలోపితః ॥ 32

హస్తాదిభిః కథం నాయమిదానీం న విలుప్యతే ।
కారణం వటురేవాత్ర వటుర్నాయం హరిస్స్వయమ్ ॥ 33

అస్తీత్యహం విజానామి స్మృతం పూర్వవరాదికమ్ ।
మద్గర్వపరిహారోఽద్య కృష్ణేనానేన కర్మణా ॥ 34

కృతోఽస్త్యత్ర క్వ కృష్ణాగ్రే మన్మర్కట సుపౌరుషమ్ ।
ఇతి నిశ్చిత్య మనసి కపిః సోఽర్జునమబ్రవీత్ ॥ 35

## అర్జునుడు శరసేతువును నిర్మించి గర్వభంగపడుట

హనుమంతుని మాటలు విన్న అర్జునుడు అట్లే కానిమ్మని పలికి, ధనస్సు, బాణములు చేతపట్టి, శరపరంపరలతో దృఢతరము, శతయోజన విస్తీర్ణము అగు సేతువును నిర్మించెను. దానిని జూచిన ఆంజనేయుడు లీలావినోదముగా బొటన వ్రేలితో ఆ బాణసేతువును సముద్రమున పడద్రోసెను. అంత అంతరిక్షమున విద్యాధరాది సకలదేవతలును పుష్పవర్షముతో ఆంజనేయుని సన్మానించిరి. అది జూచిన అర్జునుడు చింతపడి, కపివీరుడు వద్దని నివారించినను మానక దేహత్యాగమునకు యత్నించెను. అంతలో శ్రీకృష్ణుడు వటువేషముతో వచ్చి అర్జునుని ద్వారా జరిగిన విషయమును విని, "సాక్షిత్వము లేనందున మీరు చేసిన ప్రతిజ్ఞలయొక్క సత్యాసత్యములు చెల్లవు, నేను సాక్షిగా ఉందును. మళ్ళీ అలా చేయుదురుగాక" యని చెప్పెను, అందులకు ఇరువురును ఒప్పుకొనిరి.

అంత అర్జునుడు మరల శరసేతువును నిర్మించెను. ఆ సేతువునకు క్రిందుగా శ్రీకృష్ణుడు తన చక్రమును నిలబెట్టెను. అప్పుడు ఆంజనేయుడు తన బొటనవ్రేలుతో సేతువును కదిల్చెను. అదికదలనందున పాదములు, మోకాళ్లు, చేతులువేసి కదిపినా అది చలించనందున, ఏమిది? మొదట నా బొటనవ్రేలుతో ఇది సముద్రమున గూలె. ఇప్పుడింత ప్రయత్నించినను కదలదు? ఇందునకేమి కారణము! చూడబోతే ఈవటువే ఏదో ఆశ్చర్యముగా ఉన్నాడు. అని ఆలోచించగా గతము జ్ఞప్తికి వచ్చెను. శ్రీకృష్ణుడీపని జేసి నాగర్వమునణచెను. ఆ పరమాత్మ యెదుట ఈ కోతి పరాక్రమమా! తగదు అని మనసున నిశ్చయించి, అర్జునునితో "ఈ వటువు వచ్చి చేరుటతో నేను ఓడితిని. నీకు సహాయము జేయుదును, ఇతడు సామాన్య వటువు కాదు.

**జితం త్వయా వటోర్యోగాత్తవ సాహాయ్యమాచరే ।**
**నాయం వటుస్స్వయం కృష్ణః సేతుచక్రప్రవేశకృత్ ॥ 36**

**త్వత్సహాయార్థమాయాతః సత్యం జ్ఞాతో మయాఽర్జున ।**
**అనేన రామరూపేణ త్రేతాయాం మే వరోఽర్పితః ॥ 37**

**దాస్యామి దర్శనం తేఽహం ద్వాపరే కృష్ణరూపధృక్ ।**
**తత్సత్యం వచనం చాద్య కృతం త్వత్సేతుహేతుతః ॥ 38**

**ఇత్యర్జునం కపిర్యావదబ్రవీత్తావదగ్రతః ।**
**వటురేవాభవత్కృష్ణః పీతవాసా ఘనప్రభః ॥ 39**

తద్దర్శనోర్ధ్వరోమాఽ భూత్ప్రణనామాంజనీసుతః ।
ఆలింగితోఽపి కృష్ణేన స మేనే కృతకృత్యతామ్ ॥ 40

చక్రం యయౌ యథాస్థానం శ్రీకృష్ణస్యాజ్ఞయా తదా ।
సాగరేణ స్వకల్లోలైః శరసేతు ర్విలోపితః ॥ 41

తదాఽర్జునో గర్వహీనో మేనే కృష్ణేన జీవితః ।
కృష్ణస్తదాఽర్జునం ప్రాహ త్వయా రామేణ స్పర్ధితమ్ ॥ 42

హనూమతా ధనుర్విద్యా తవాత్రోఽత్ర మృషా కృతా ।
యత్ర్పతాదితి గిరా త్వయాఽపి వాయునందన ॥ 43

రామేణ స్పర్ధితం యస్మాత్తస్మాదర్జున సంజ్ఞితః ।
అతః పరం వీతగర్వస్త్వం మాం భజ నిరంతరమ్ ॥ 44

ఇత్యుక్త్వా మారుతిం పృష్ట్వాఽర్జునేన తత్పురం యయౌ ।
అతః కపిధ్వజశ్చేతి జనైరర్జున ఈర్యతే ॥ 45

ఇతి భావికథా పృష్టా త్వయా సాఽపి మయోదితా ।
కిమగ్రే శ్రోతుకాఽమోసి తత్పృచ్ఛస్వ వదామి తే ॥ 46

విష్ణుదాస ఉవాచ

గురోఽధునా రాఘవస్య వైకుంఠారోహణోత్సవమ్ ।
మాం వదస్వ సవిస్తారం యేనాహం తోషమాప్నుయామ్ ॥ 47

శ్రీరామదాస ఉవాచ

పూర్ణకాండం తవాద్యాహం వదిష్యామి శృణుష్వ తత్ ।
యస్మింశ్చ రామచంద్రస్య వైకుంఠారోహణోత్సవమ్ ॥ 48

సేతువున చక్రమును ప్రవేశపెట్టిన శ్రీకృష్ణుడు నీకు సహాయము చేయుటకై యిచ్చటికి వచ్చెనని నేను సత్యముగా గుర్తించితిని. రామరూపియగు ఇతనిచే త్రేతాయుగమున, ద్వాపరాంతమునందు శ్రీకృష్ణుడై దర్శనమిచ్చెదనని నాకు వరముగలదు, సత్యవచనమిది. ఈశరసేతు హేతువున ఇట్లు

గల్గె" నని చెప్పుచుండగా, ఆ వటువే పీతాంబరధర ఘన నీలగాత్రుడై ప్రత్యక్షమయ్యె. హనుమంతుడు నమస్కరించి, శ్రీకృష్ణునిచే సమాలింగితుడై కృతకృత్యత నందెను. శ్రీకృష్ణాజ్ఞచే చక్రము యథాస్థానమునకు వెళ్ళెను. సముద్రుడు తన తరంగములచే సేతువును పడగొట్టెను. అంత అర్జునుడు గర్వము తొలగి కృష్ణునిచే బ్రతికింపబడెను. శ్రీకృష్ణుడు అర్జునునితో, "నీవు రామునితో స్పర్ధజేసితివి కావున ఆంజనేయుడు నీశర సేతువును ఖండించెను" అనియు, ఆంజనేయునితో "ఎవని ప్రతాపమువలన నీవు గర్వించుటచే రామునితో స్పర్ధజేసితివిగాన అర్జునకృత శరసేతువు సుస్థితమయ్యెను.

**ఇదం మనోహరం కాండం మయా తే సముదీరితమ్ ।**
**యే శృణ్వంతి నరా భూమ్యాం తేషాం రామే రతిర్భవేత్ ॥ 49**

**మనోఽభిలషితాన్ కామాన్ తే లభంతి న సంశయః ।**
**పుత్రార్థీ ప్రాప్నుయాత్పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్ ॥ 50**

**ఇదం రమ్యం పవిత్రం చ శ్రవణాన్మంగళప్రదమ్ ।**
**పఠనీయం ప్రయత్నేన రామసద్భక్తివర్ధనమ్ ॥ 51**

**ఆనందరామాయణమధ్యసంస్థం**
**మనోహరం కాండమిదం విచిత్రమ్ ।**
**పఠంతి శృణ్వంతి గృణంతి మర్త్యా**
**స్తే స్వీయకామానఖిలాన్ లభంతే ॥ 52**

**ఇదం పవిత్రం పరమం విచిత్రం**
**నానాచరిత్రం త్వతిపుణ్యదం చ ।**
**సదా నరైః శ్రావ్యమిదం ముదా శ్రీ**
**సీతాపతేర్భక్తివివృద్ధికారి ॥ 53**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, మనోహరకాండే, రామదాసవిష్ణుదాససంవాదే, హనూమతాశరసేతుభంగో నామ అష్టాదశః సర్గః ॥**

**ఇతి మనోహర కాండం సమ్పూర్ణమ్ ॥**

హనుమా! ఇకమీద గర్వములేక నిరంతరము నన్ను గొల్చుచుండుమని జెప్పి అర్జునునితో ఆ పట్టణమునకు వెడలెను. కావున అర్జునుడు కపిధ్వజుడయ్యె. ఇట్టి భవిష్యత్కథ నడిగితివి. దానినిజెప్పితిని, ఇక ఏమి వినగోరుదువని శ్రీరామదాసు అడిగెను. అంత విష్ణుదాసుడు ఇక శ్రీరాముని వైకుంఠారోహణకథను అభివర్ణింపుమని వేడెను. అందుకు రామదాసు ఇట్లనెను. అట్టి చరిత్రము కలిగిన పూర్ణకాండను ఇక నిరూపించెదను. ఇలా మనోహరకాండ నీకు జెప్పబడినది. దీనిని వినినవారికి శ్రీరామభక్తి గల్గును. వారి వాంఛలు పండును, సత్యము. శ్రీసీతారామ భక్తి ప్రవర్ధకమగు ఈ మనోహరకాండ ఆనందరామాయణమున మధ్యలోనుండునది. అత్యంత పవిత్రము బహువిచిత్రము, వివిధచరిత్రము, పుణ్యకరము, రమణీయము, సర్వసమాదరణీయము.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని మనోహరకాండలో
హనుమంతుడు శరసేతువును భంగపరచేవిషయమును తెలుపు 18వ సర్గ ముగిసినది.

**ఇట్లు శ్రీమదానందరామాయణమున మనోహరకాండ ముగిసినది.**

## 9. పూర్ణ కాండ

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 61 |
| 2. | 87 |
| 3. | 65 |
| 4. | 66 |
| 5. | 51 |
| 6. | 55 |
| 7. | 36 |
| 8. | 69 |
| 9. | 87 |
| **9** సర్గలు | **577** శ్లోకాలు |



# ప్రథమః సర్గః-1వ సర్గ

## సోమవంశ రాజుల వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథ శాసతి రాజేంద్రే రామే సీతాభిరంజితే ।
సభాయామేకదా దూతః సుషేణస్య గజాహ్వయాత్ ॥ 1

సమాయయౌ స వికలో రామం నత్వాఽబ్రవీద్వచః ।
రామ రాజీవపత్రాక్ష సోమవంశోద్భవైర్నృపైః ॥ 2

సంవేష్టితం గజపురం నలాద్యైశ్చిరజీవిభిః ।
తద్దూతవచనం శ్రుత్వా రాఘవోఽతీవ విస్మితః ॥ 3

వసిష్ఠ ప్రాహ మద్రాజ్యే న కదా పార్థివోత్తమాః ।
సమాగతా మయా యోద్ధుం కిమిదానీం హి శ్రూయతే ॥ 4

కిం కారణం గురో హ్యత్ర విచారయ సవిస్తరమ్ ।
తద్రామవచనం శ్రుత్వా తం గురుః ప్రత్యభాషత ॥ 5

ప్రష్టవ్యమద్య వాల్మీకిం యేన తే చరితం కృతమ్ ।
తచ్ఛ్రుత్వా లక్ష్మణం ప్రేష్య సమాహూయాథ తం మునిమ్ ॥ 6

సీతాయా పూజనం కృత్వా రామో వృత్తం న్యవేదయత్ ।
వాల్మీకిస్తు తదా ప్రాహ రామ కించిద్విహస్య సః ॥ 7

కిం త్వం న వేత్సి రాజేంద్ర వినోదాన్మాం తు పృచ్ఛసి ।
శృణుష్వ తర్హి మే వాక్యం సర్వే శృణ్వంతు తే ప్రియాః ॥ 8

ఏకాదశ సహస్రాణి వత్సరాణి తథా పునః ।
ఏకాదశ సమాశ్చాపి మాసాస్త్వేకాదశావ హి ॥ 9

ఏకాదశ దినాన్యత్ర ఘటికాశ్చాపి తన్మితాః ।
ఏకాదశ పలాన్యేవ తే రాజ్యం నిశ్చితం మయా ॥ 10

## శ్రీరాముడు వాల్మీకి మునిని ఆహ్వానించుట

శ్రీరామదాసు ఇట్లుచెప్పుచున్నాడు, "నొకనొకసారి రాజరాజేంద్రుడగు శ్రీరామచంద్రుడు సభలో ఆసీనుడై ఉండగా, హస్తినాపురి నుండి సుషేణుని దూత ఒకడువచ్చి, చింతతో రామునికి నమస్కరించి, "మహా ప్రభూ! సోమ వంశోద్భవులు చిరంజీవులగు నలాది మహారాజులు హస్తినాపురిని ఆక్రమించారు" అని విన్నవించెను. అంత రఘుపతి వసిష్ఠులవారితో "స్వామీ! సౌరాజ్యమున రాజులు ఎప్పుడూ యుద్ధమునకు కాలు దువ్వువారు కాదే, మరి ఇప్పుడు ఎందుకు ఇలా జరుగుతున్నది? ఇప్పుడిది యేమివింత? దీనికి కారణమేమైయుండును," అని యడిగెను. అందుకా మునిపుంగవుడు "రామా! నీచరితమును రచించిన వాల్మీకిమునిని అడుగవలయు" ననెను. అంత లక్ష్మణునిపంపి వాల్మీకి మునిని ఆహ్వానించి, సీతతోపాటు వాల్మీకిని సత్కరించి, శ్రీరాముడు సమాచారమును వాల్మీకికి విన్నవించెను. అప్పుడు వాల్మీకి, "రాజేంద్రా! నీ వెరుగవా? నన్నడుగుట ఒకవినోదమా? ఐనా వినుము! నీయిష్టులందరును విందురుగాక! నీయవతారమునకు మునుపే నూరుకోట్ల శ్లోకములతో నాచే రచింపబడిన రామాయణంలో, తమరిచే రాజ్యము 1,111 సంవత్సరముల, 11 నెలల, 11 ఘటికలుండునని నిర్ణయింపబడినది. అది ముగియుచున్నది.

**శతకోటిమితే కావ్యే పురైవ తేఽవతారతః ।**
**తన్మధ్యేఽత్ర హ్యతీతాని సహస్రాణి తథా సమాః ।**
**అతీతాః శేషభూతాశ్చ మాసాః శేషం దినాదికమ్ ॥ 11**

**అష్టాదశదినైర్న్యూనమగ్రే వర్షం ప్రభోఽత్ర యత్ ।**
**శేషభూతం సంగరేణ పరిపూర్ణం భవిష్యతి ॥ 12**

**అయం కాలోఽవతారస్య సమాప్తేస్తే సమాగతః ।**
**గత్వా భాగీరథీం పుణ్యాం పూర్వజేనావనీతలమ్ ॥ 13**

**ప్రాపితాం తవ రాజేంద్ర తస్యాం స్నాత్వా యథావిధి ।**
**స్తుతో బ్రహ్మాదికైః సర్వైః పదం స్వీయం గమిష్యతి ॥ 14**

**తన్మునేర్వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్ ।**
**ఏతావత్కాలపర్యంతం నలాద్యాః కుత్ర సంస్థితాః ॥ 15**

**కుతోఽధునాసమాయాతాస్తత్సర్వం విస్తరాద్వద ।**
**తద్రామవచనం శ్రుత్వా వాల్మీకిర్వాక్యమబ్రవీత్ ॥ 16**

శృణు రామ మహాబాహో సర్వం తే కథయామ్యహమ్ ।
అత్రిర్మునిః పురా రామ పూర్ణిమాయాం కృతే యుగే ॥ 17

వైశాఖ్యామేఽకదా సోమం దృష్ట్వా నారీముఖోపమమ్ ।
ముమోచ వీర్యం భూమ్యాం స తస్మాత్పుత్రో బభూవ హ ॥ 18

సోమస్య దర్శనాజ్జాతః సోమాఖ్యః స బభూవ హ ।
సోఽరణ్యే జాహ్నవీతరే చకార తప ఉత్తమమ్ ॥ 19

ఏతస్మిన్ సమయే తత్ర కశ్చిద్ధస్తీ సమాయయౌ ।
నిహతః పక్షిభిస్తత్ర తద్దృష్ట్వా కౌతుకం మహత్ ॥ 20

సోమో విచారయామాస పక్షిభిర్నిహతః కరీ ।
అస్య భూమ్యాః ప్రభావోఽయం పురం తత్ర చకార సః ॥ 21

హస్తినాశాత్పురం జాతం తస్మాత్తద్ధస్తినాపురమ్ ।
తత్ర పౌరైః కృతో రాజా సోమ ఏవ రఘూత్తమ ॥ 22

ఇక 18 దినములు తక్కువగా ఒక సంవత్సరము మిగిలియున్నది. అది యుద్ధమున గతించును. నీయవతార పరిసమాప్తికై ఈ యుద్ధము వచ్చినది. నీపూర్వీకులు భూమికి తెచ్చిన శ్రీగంగా నదికి పోయి యథావిధిగా అందులో స్నానముచేసి, బ్రహ్మాదులచే సంస్తుతుడవై స్వీయధామమునకు పోదువుగదా!" అని చెప్పెను. ఆ ముని పలుకులను విన్న శ్రీరామచంద్రుడు "ఇంతవరకు నరాదులెచ్చట యుండిరి? ఇప్పుడెచ్చటినుండివచ్చిరి? దానిని వివరింపుము". అనగా, వాల్మీకి చెప్పుచున్నాడు,

## సోమవంశ వృత్తాంతము

"రామా! కృతయుగమున ఒక పూర్ణిమనాడు అత్రిముని వైశాఖ చంద్రుని చూచి, స్త్రీముఖమని మోహించి స్ఖలిత వీర్యుడగుటచే పురుషవ్యక్తి ఒకడుపుట్టె. అతడు సోమదర్శన జాతుడు కావున సోముడనబడెను. ఆ సోముడు గంగాతీరములోని అరణ్యమున మహాతపమును చేయుచుండెను. అచ్చటికొక యేనుగు(హస్తి)వచ్చి పక్షులగుంపుచే చంపబడెను. దానిని జూచిన సోముడు "ఇది యేమి వింత! పక్షులు ఏనుగును చంపె, ఆహా! దైవవిలాసము," అని ఆ ఆశ్చర్యమునకు విచారించుచు, అచ్చటనే పురమును నిర్మించుకొనెను. హస్తి (ఏనుగు)నాశనమున ఏర్పడిన పురమది కనుక అది హస్తినాపురమయ్యెను. ఆ ఊరివారిచే ఏలికగా అంగీకరింపబడిన సోముడే అచ్చట రాజయ్యెను.

తస్య జాతో బుధః పుత్రస్తావుభౌ జగతీతలమ్ ।
సద్వీపం స్వవశం కృత్వా సురలోకం ప్రజగ్మతుః ॥ 23

తత్ర జిత్వా సూరాన్ సర్వాన్ సురస్త్రీభిశ్చ సంయుతౌ ।
ముక్త్వా దేవాన్ స్వర్గలోకే నివాసం చక్రతుర్ముదా ॥ 24

తయోర్దదౌ వరాన్ బ్రహ్మా యువాం మద్వంశసంభవౌ ।
యువాభ్యాం మోచితస్త్వద్య దేవసంఘయుతస్త్వహమ్ ॥ 25

యువాభ్యాం తర్హ్యహం వచ్మి వరాంచ్ఛృణుత బాలకౌ ।
యుష్మద్వంశే నృపాః కేచిదగ్రే త్రిపురుషోర్ధ్వతః ॥ 26

అన్యైః పరాజితాః సప్త పురుషా న భవంతి హి ।
ఇతి దత్వా వరం బ్రహ్మా యయౌ నిజపదం ప్రతి ॥ 27

తతః సోమాయ దౌహిత్రీ దత్తా పద్మావతీ శుభా ।
ఇంద్రేణ తత్ర తౌ సోమబుధౌ స్వైరం స్థితౌ చిరమ్ ॥ 28

బుధస్య తనయో భూమ్యాం నామ్నాఖ్యాతః పురూరవాః ।
చకార రాజ్యం ధర్మేణ తథా తద్ధస్తినాపురే ॥ 29

తస్య పుత్రశ్చ గవ్యోఽభూద్గవ్యపుత్రోఽల్ప ఉచ్యతే ।
అల్పపుత్రో నల శ్రీమాన్ దిక్పాలాన్ జేతుముద్యతః । 30

రాజ్యే పురూరవాదీంశ్చ త్రీన్ స్థాప్య నిజపూర్వజాన్ ।
సప్తద్వీపనృపైర్యుక్తః ప్రయయౌ మేరుమున్నతమ్ ॥ 31

ఆదౌ జిత్వా స వహ్నిం హి యమం జిత్వాఽథ నిర్‌ఋతిమ్ ।
ప్రయయౌ వరుణం జేతుం రావణాదిభిరన్వితః ॥ 32

ఏతస్మిన్నంతరే రామ తూర్ణం సైన్యేన రావణః ।
ప్రయయౌ నాకలోకం హి సురానింద్రాదికాన్ రణే ॥ 33

జిత్వా నినాయ స్వాం లంకాం సోమో యుద్ధాయ సాత్మజః ।
నిర్యయౌ సుహృదః సర్వాన్ సేంద్రాన్ మోచయితుం సురాన్ ॥ **34**

తదా నివారయామాస బ్రహ్మ సోమం త్వరాన్వితః ।
విష్ణుర్భూత్వా నృవేషేణ రావణం హి హనిష్యతి ॥ **35**

త్వం మాఽద్య రావణం యాహి వరస్తస్మై మయాఽర్పితః ।
తద్బ్రహ్మవచనం శ్రుత్వా యయౌ సోమోఽమరావతీమ్ ॥ **36**

సోముడు అతని పుత్రుడగు బుధుడు. వారిరువురును కలసి సప్తద్వీప పృథ్విని, స్వర్గమున దేవతలను జయించి, అప్సరసలను కూడి, దేవతలను వదలి, సుఖముగా స్వర్గమున వసించిరి.

## చంద్ర, బుధులకు బ్రహ్మ వరములనిచ్చుట.

“బిడ్డలారా! మీరు నా వంశీయులు. దేవతలను బాధించక వదలితిరి. కావున మీకు వరములను ఇచ్చెద. ఇక మీ త్రిపౌరుషేయానంతరము మీ వంశీయులగు పురుషులు ఏడుమంది ఇతరులచే పరాజయము నందరు.” అని చంద్ర, బుధులకు బ్రహ్మదేవుడు దేవతలతో కలసి వరమునిచ్చెను. అంత ఇంద్రుడు సోమునికి తన దౌహిత్రి యగు పద్మావతినిచ్చి వివాహముచేసెను. స్వర్గములోనే సోమ, బుధులు యథేష్టముగా నుండిరి. బుధునికి పురూరవుడనే కుమారుడు కలిగెను. పురూరవుడు గొప్ప ప్రఖ్యాతుడయ్యెను. అతడు హస్తినాపురమున ధర్మముగా రాజ్యము నేలెను. పురూరవుని కుమారుడు గవ్యుడు. గవ్యుని సుతుడు అల్పుడు. అల్పుని తనయుడు నలుడు.

## నలుడు మొదలగు ఏడుమందిరాజుల దిగ్విజయ వర్ణనము.

ఆ నలుడు తన పూర్వజులగు పురూరవ, గవ్య, అల్పులను రాజ్యమున నిలిపి. సప్తద్వీపాధిపులతో వెరసి దిక్పతులను జయింపదలచి, మేరుపర్వతమునకు పోయి– అగ్ని, యమ, నిర్ఋతులను జయించి, రావణాదులతో కలసి, వరుణుని జయించుటకు బయలుదేరెను. అంతలో అచ్చట త్వరపడి రావణుడు సేనతో స్వర్గమునకు పోయి, ఇంద్రుడు మొదలగు దేవతలను జయించి, తన లంకా ద్వీపమునకు వెడలెను. అంత సోముడు, బుధుడును మిత్రులగు ఇంద్రాదులను విడుపింప దలచి, రావణునిపై దండెత్తిరి. అప్పుడు బ్రహ్మయేతెంచి, “శ్రీమహావిష్ణువు మానుషావతారముదాల్చి రావణుని వధించును. నీవు రావణునిమీదకు పోవలదు, అట్లు నావరముగలదు” అనెను. దానితో సోమ, బుధులు వెనుతిరిగిరి.

భూమ్యాం నలస్తతో గత్వా వరుణం పవనం తథా ।
జిత్వా కుబేరమీశానం కృత్వాకార్యమమన్యత ॥ 37

ఆత్మానం చ తతః స్వర్గే చేంద్రం జేతుం సముద్యతః ।
ఏవం నలేన భ్రమతా గతం తచ్చ కృతం యుగమ్ ॥ 38

త్రేతాయుగసమాప్తౌ స దదర్శ సకలం బలమ్ ।
తత్రాదృష్ట్వా రావణం స దూతాచ్ఛృత్వాఽవనౌ త్వితి ॥ 39

దేవాన్ స్వవశగాన్ కృత్వా లంకాం స్వాం స గతః పురాః ।
తత్ర మార్గే తు భ్రమతో నలస్య నద్యుకః సుతః ॥ 40

పుత్రస్తస్య జాతీకరస్తత్సుతో వసుదః స్మృతః ।
తస్య పుత్రో లఘుశ్రుతః సురథస్తత్సుతః స్మృతః ॥ 41

అజమీఢస్తు తత్పుత్రస్త్వేవం వంశోఽభవత్పృథి ।
తతః స మంత్రయామాస నలో మంత్రిజనైః సహ ॥ 42

కిమర్థమింద్రలోకం తం గంతవ్యమధునా యది ।
భువి దేవాః సమానీతా లంకాయాం రావణేన హి ॥ 43

అస్మాకం సేవకః సోఽస్తి దశాస్యః కరభారదః ।
నిజం పురం ప్రగంతవ్యమధునా చిరకాలతః ॥ 44

దిగాశ్రయాద్వయం సర్వే జీవితాః స్మ చిరం త్విహ ।
పురూరవాదికాస్తే నః పూర్వజాః సంతి వా మృతాః ॥ 45

నాస్మాభిశ్చిరకాలం హి తద్వృత్తం భ్రమతః శ్రుతమ్ ।
అతః స్వీయపురం గత్వా ద్రష్టవ్యాస్తేఽత్రిపూర్వజాః ॥ 46

చేత్సోమబుధయోర్నాకం గంతవ్యం దర్శనేచ్ఛయా ।
తర్హి తాభ్యాం యుతా దేవాః కిం జేతా రావణేన హి ॥ 47

**కిం తాభ్యాం రహితా దేవా జితాశ్చేతి న వేద్మ్యహమ్ ।**
**అతస్తత్సకలం వృత్తం విదితం హస్తినాపురే ॥ 48**

**భవిష్యతి తతో యద్ధి కర్తవ్యం తత్కరోమ్యహమ్ ।**
**ఇతి నిశ్చిత్య స నలః శనైః స్వనగరం యయౌ ॥ 49**

ఇచ్చట భూమిపై నలుడు; వరుణ, వాయు, కుబేర, ఈశానులను జయించి, తాను కృతకృత్యుడ నైతిననుకొని, స్వర్గమున ఇంద్రుని జయింప పూనుకొనెను. ఇట్లు దిగ్భ్రమణమున ఉండు నలునికి కృతయుగము గతించి, త్రేతాయుగ సమాప్తికావచ్చె. అప్పుడతడు తన పరివారముతో రావణుని గానక "రావణుడు దేవతలను తన వశము చేసికొని లంకలో ఉన్నాడు. వాడు మునుపే ఇచ్చటనుండి వెడలె" నని దూతద్వారా తెలుసుకుని, తనకు ఆదిగ్భ్రమణ సమయమునందు జనించిన కుమారుడు నద్యుకుడు. ఆ నద్యూకుని కుమారుడు జాతీకరుడు, జాతీకరుని కుమారుడు వసుదుడు, వసుదుని కుమారుడు లఘుశ్రుతుడు, లఘుశ్రుతుని కొడుకు సురథుడు. సురథుని కుమారుడు అజమీఢుడు అను ఆరుమంది కుమారులతోను, మనుమలతోను, మంత్రులతోను "ఇప్పుడేల మనము స్వర్గమునకు పోవలయును? ఇప్పుడు ఇంద్రాదులు రావణునికి లొంగి భూమిపైన లంకలోనున్నారుగదా! ఆ రావణుడు మనకు కానుకలను అప్పగించు సేవకుడు. మనము ఇపుడు హస్తినాపురికి పోదాము, లోకమును చుట్టుటలో మనము ఇట్లు చిరకాలము ఇచ్చట నిలచిపోతిమి. మా పూర్వజులు పురూర వాదులు ఇప్పుడు బ్రతికియున్నారో లేదో! చిరకాలము నుండి వారివృత్తాంతము తెలియలేదు. కావున మనపట్టణనమునకుపోయి వారిని చూడవలయును మరియు సోమ, బుధుల దర్శనమునకై స్వర్గమునకు పోవలె. అయిన దేవతలతోకలిసి వారును రావణునిచే పీడింపబడినారో ఏమో తెలియదు. సమాచార మంతయును హస్తినాపురిలో తెలియును. పిదప చేయతగిన దానిని చేయుదము. అని ఆలోచించి, అందరితో నలుడు తన రాజధాని యగు హస్తినకు వచ్చెను.

**ఏతస్మిన్నంతరే రామ త్వం జాతోఽస్యవనీతలే ।**
**హత్వా తం రావణం దేవా మోచితాస్తే దివం గతాః ॥ 50**

**సప్తద్వీపాంతరస్థా యే నృపాస్తే స్వవశీకృతాః ।**
**పురూరవాదికాః స్త్రీశ్చ విష్కాస్యాత్ర గజాహ్వయే ॥ 51**

**సుషేణః స్థాపితః పూర్వం వానరైః సహితస్త్వయా ।**
**తతః పురూరవాద్యాస్తే స్వకాలేన మృతాస్త్విహ ॥ 52**

ఇదానీం తే సమాయాతాః సోమవంశోద్భవా నృపాః ।
నలాద్యాః సప్త స్వపురం సప్తద్వీపనృపోత్తమాః ॥ **53**

త్వత్కృతాః స్వవశగా యే చ ద్వీపాంతరస్థితాః ।
నృపాస్తేషాం పూర్వజాశ్చ స్వసైన్యైస్తే నృపోత్తమాః ॥ **54**

బలినః కోటిశః సర్వే సమాయాతా గజాహ్వయమ్ ।
భవిష్యతి త్వయా తైశ్చ సంగరః సోమవంశజైః ॥ **55**

తదా బ్రహ్మా సురైర్యుక్తః సమాగత్య తవాంతికమ్ ।
పాదయోస్తే ప్రణామాంశ్చ నలాద్యైః కారయిష్యతి ॥ **56**

కృత్వా కః ప్రార్థనాం తేఽపి త్వాం వైకుంఠం ప్రణేష్యతి ।
ఏవం రామ సవిస్తారం తవాగ్రే కథితం మయా ॥ **57**

యత్పృష్టం మాం త్వయా పూర్వం నలాదీనాం కథానకమ్ ।
వివాహకాండమారభ్య రమ్యం రామాయణం శుభమ్ ॥ **58**

సమగ్రం హి మయా రామ పురాణం శ్రావితం తవ ।
పుత్రాభ్యామధునా సర్వం శృణుష్వ రఘునందన ॥ **59**

ఇత్యుక్త్వా కుశలవయోశ్చకారాజ్ఞాం మునిస్తతః ।
వివాహకాండాత్కాండాని చత్వారి జగతుః శిశూ ॥ **60**

తత్సర్వం రాఘవః శ్రుత్వా పరాం ముదమవాప సః ।
విదుః సర్వే జనాశ్చాపి వైకుంఠారోహణం ప్రభోః ॥ **61**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, సోమవంశనృపకథావిస్తారో నామ ప్రథమః సర్గః ॥**

రామా! ఇంతలో నీవు భూమిపై అవతరించితివి, రావణాదులను వధించితివి, దేవతలును విముక్తులై స్వర్గమునకు వెడలిరి. సప్తద్వీపాంతరస్థులగు రాజులందరును నీకు వశవర్తులయిరి. ఈ హస్తినాపురిలో పురూరవాదులను ముప్వురిని పట్టి, తీసివేసి మునుపు సుషేణుని అచ్చట కపులతోడ

స్థాపించితివిగదా? వారు ముప్వురును కాలగతి నందిరి. కావున వారిచ్చటలేరు. ఇప్పుడు సోమ వంశీయులు నలాదులు, సప్తద్వీప పతులలో కొందరు తమ పూర్వజులు వచ్చిరని స్వసైన్యములతోడ వెడలి వారితో గలసికొనియున్నారు. నీకును వారందరితోడ యుద్ధము కాబోవుచున్నది. అప్పుడు బ్రహ్మదేవుడు దేవతలతో వచ్చి నలాదులను నీ పాదపద్మముల వద్ద పడవేయును. బ్రహ్మాది దేవతల ప్రార్థనచే నీవు వైకుంఠమునకు పోవుదువు. నీవడిగిన సంగతిని సమగ్రముగా వివరించితినిగదా. (57)

## శ్రీరాముడు కుశ లవులచే సమగ్రముగ రామాయణమును వినుట.

ఇంతకు మునుపు వివాహకాండ మొదలు నాలుగు కాండలను నీకు నేను వినుపింపలేదు. ఇపుడు సమగ్ర రామాయణమును విని యానందింపుము. ఇదిగో నీ పుత్రులు పఠించుచున్నారు.” అని వాల్మీకి కుశలవులను ఆజ్ఞాపించెను. వారు వివాహకాండము మొదలు నాల్గు కాండలను శ్రీరామ సన్నిధిలో పఠించి విన్న వించిరి. శ్రీరాముడు సమగ్ర ఆనందరామాయణమును విని ఆనందించెను. జనులందరును శ్రీరాముని వైకుంఠారోహణమును తెలుసుకొనిరి.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
సోమవంశవిస్తారమును తెలుపు 1వ సర్గ ముగిసినది.

# ద్వితీయః సర్గః-2వ సర్గ

## శ్రీరాముని మహాప్రస్థానం

శ్రీరామదాస ఉవాచ

అథ రామస్తదా ప్రాహ వాల్మీకిం మునిసత్తమమ్ ।
ఆగంతవ్యం త్వయా తత్ర మునిభిస్తు గజాహ్వయమ్ ॥ 1

తథేతి స మునిః ప్రాహ రాఘవం భక్తవత్సలమ్ ।
తతః స లక్ష్మణం శీఘ్రం రాఘవో వాక్యమబ్రవీత్ ॥ 2

పత్రాణి ప్రేషయస్వాద్య కుమారాన్ రాజ్యసంస్థితాన్ ।
స్వస్వరాజ్యే మంత్రిణశ్చ కృత్వాఽత్రాగమ్యతాం బలైః ॥ 3

ఏవమేవ ప్రలేఖ్యాని జంబూద్వీపపతీన్ వరాన్ ।
తథా ద్వీపపతీంశ్చాపి దూతాస్తాన్ త్వరయంతు నః ॥ 4

తథేతి లక్ష్మణశ్చోక్త్వా తథా చక్రే యథోదితమ్ ।
రాఘవేణ సభామధ్యే వాల్మీకిగురుసన్నిధౌ ॥ 5

తతః ప్రాహ పునః శ్రీమాన్ రాఘవో లక్ష్మణం ముదా ।
వాసోగేహాని నేయాని బహిర్మమ రఘూద్వహ ॥ 6

ముహూర్తో వర్తతే శ్వో వై సేనాం చోదయ సాదరాత్ ।
ఆయుధాన్యథ యంత్రాణి జీర్ణాని చ బహూని హి ॥ 7

పూర్వజైర్విహితాన్యేవ కోశాగారేషు వై సదా ।
తాని నిష్కాసనీయాని తేషాం కాలోఽద్య వర్తతే ॥ 8

అంతః పురాణి సర్వాణి బహిర్నేయాని మేఽగ్రతః ।
అగ్నిహోత్రం పురస్కృత్య సీతాప్యఽగ్రేనుగచ్ఛతు ॥ 9

కోశాగారాణి సర్వాణి బహిర్నేయాని వాహనైః ।
హస్త్యశ్వరథపాదాతా నేయాః సర్వే బహిస్త్వయా ॥ 10

**ఇత్యాజ్ఞాప్య రఘుశ్రేష్ఠో లక్ష్మణం వినయాన్వితమ్ ।**
**మంత్రిణో నైగమాంశ్చైవ వసిష్ఠం చేదమబ్రవీత్ ॥ 11**

**అభిషేక్ష్యామి భరతం సప్తద్వీపపతేః పదే ।**
**లక్ష్మణో మాం వినా నైవ భూమ్యాం వాసం కరిష్యతి ॥ 12**

**ఏవం వదతి రాజేంద్రే పౌరాస్తే భయవిహ్వలాః ।**
**ద్రుమా ఇవ చ్ఛిన్నమూలా దుఃఖార్తాః పతితాభువి ॥ 13**

## హస్తినాపుర ప్రయాణ సన్నాహము

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "పిదప శ్రీరాముడు వాల్మీకితో "మునీంద్రా! నీవును మునులతోడ మా వెంట హస్తినాపురికి రావలయు"నని ప్రార్థించెను. అతడట్లేయని ఆమోదించెను. అంత శ్రీరాముడు లక్ష్మణునిజూచి, "నేడే మన కుమారుల కందరికిని– మీ మీ రాజ్యములను మంత్రుల అధీనముజేసి, సేనలతో వచ్చి చేరుడు. అని ఆజ్ఞలను వ్రాయింపుము. అట్లే సప్తద్వీప రాజులకును లిఖింపుము. మన దూతలను త్వరపరుపుము." అని చెప్పి, అట్లు చేయించిన పిదప మరలా, "లక్ష్మణా! నా గుడారములను సిద్ధము చేయింపుము. రేపే ముహూర్తము బాగుగానున్నది. సేనలను ఆదరముతో ప్రేరేపింపుము. మన పూర్వజులు చిరకాలముగా జేర్చిపెట్టియుండు ఆయుధములు యుద్ధయంత్రములు జీర్ణములగును, వాటినన్నిటిని ఇప్పుడు ఉపయోగింపవలయును. సకల అంతః పురవాసులు నావద్దకు రావలయును. అగ్నిహోత్రమును తీసుకొని సీతాదేవి ముందు బయలుదేరునుగాక. భాండాగారములు అన్నియును వెంబడి రావలయును. రథ, గజ, తురగ, పదాతులందరితోడ నీవును వెడలుము." అని ఆజ్ఞాపించెను.

## శ్రీరాముడు పురజనుల ప్రార్థనను అంగీకరించుట.

వినయ సంపన్నుడగు లక్ష్మణునితోను, మంత్రులతోను, ప్రజలతోను, వసిష్ఠునితోను, "సప్తద్వీప పతిస్థానమున భరతునికి పట్టాభిషేకము గావించెదను. లక్ష్మణుడు నన్ను వదలి భూమిపై ఉండడానికి ఇష్టపడడు. అనిచెప్పుచుండగనే పౌరులందరును భయముతో దుఃఖార్తులై వ్రేళ్లూడిన చెట్లవలే నేల కూలిరి.

**మూర్ఛితో భరతశ్చాపి శ్రుత్వా రామాభిభాషితమ్ ।**
**గర్హయామాస రాజ్యం స ప్రాహ దుఃఖాద్రఘూత్తమమ్ ॥ 14**

**సత్యేన తు శపే నాఽహం త్వాం వినా దివి వా భువి ।**
**కాంక్షే రాజ్యం రఘుశ్రేష్ఠ శపే త్వత్పాదయోః ప్రభో ॥ 15**

అముం యోగ్యం వరం రాజన్ అభిషించస్వ రాఘవ ।
అయోధ్యాయాం కుశం వీరం సప్తద్వీపపతేః పదే ॥ 16

అస్త్యుత్తరకురుష్వత్ర జంబూద్వీపపతేః పదే ।
లవోఽభిషేచితః పూర్వం స ఏవ తేషు గచ్ఛతు ॥ 17

భరతేనోదితం శ్రుత్వా పతితాస్తాః సమీక్ష్య చ ।
ప్రజా వై భయసంవిగ్నా రామవిశ్లేషకాతరాః ॥ 18

వసిష్ఠో భగవాన్ రామమువాచ సదయం వచః ।
పశ్యతామాదరాత్సర్వాః పతితా భూతలే ప్రజాః ॥ 19

తాసాం తావానుగం రామ ప్రసాదం కర్తుమర్హసి ।
శ్రుత్వా వసిష్ఠ వచనం తాః సముత్థాప్య పూజ్య చ ॥ 20

సస్నేహో రఘునాథస్తాః కిం కరోమీతి చాఽబ్రవీత్ ।
తతః ప్రాంజలయః ప్రోచుః ప్రజా భక్త్యా రఘూద్వహమ్ ॥ 21

గంతుమిచ్ఛామి వైకుంఠం త్వమస్మాకం నయ ప్రభో ।
యత్ర గచ్ఛసి త్వం రామ హ్యనుగచ్ఛామహే వయమ్ ॥ 22

అస్మాకమేషా పరమా ప్రాప్తిర్ధర్మోఽయమక్షయః ।
తవానుగమనే రామ హృద్గతా నో దృఢా మతిః ॥ 23

పుత్రదారాదిభిః సార్ధమనేయామోఽద్య సర్వథా ।
తపోవనం వా స్వర్గం వా పురం వా రఘునందన ॥ 24

జ్ఞాత్వా తేషాం మనోదార్ఢ్యం కారుణ్యాద్రఘునాయకః ।
భక్తం పౌరజనం దీనం బాఢమిత్యబ్రవీద్వచః ॥ 25

రాముని మాటలువినిన భరతుడు మూర్ఛితుడయ్యెను. తరువాత "అన్నా! నిన్ను వదలి స్వర్గములో గాని, భూమిపై గాని నేనుండను, ఇది సత్యము. రాజ్యమును నేను కోరను. ప్రభో! నీ పాదపద్మముల యందు పడియుందును. ఇది నాకు యోగ్యమగు వరము. సప్తద్వీపపతిత్వమున ఈ అయోధ్యలో వీరుడగు కుశుని అభిషేకింపుము. మునుపే ఉత్తర కురుభూములలో జంబూద్వీప పతిగా లవుడు అభిషేకింపబడి యున్నాడుగదా! అతడట్లేయుండని," అని తిన్నగా విన్నవించెను. శ్రీరామ విరహ

విహ్వాలులగు ప్రజలు, భరతవాక్యమును కూడ విని భయకంపితులై భూమిపై పడిరి. అప్పుడు వసిష్ఠుడు రామునితో "ప్రజలందరును నేలగూలిరే!, ఆదరముతో వీరిని అవలోకింపుము, వారి యిష్టానుసారము నీప్రసాదమును అనుగ్రహింపుము." అని పలుకగా శ్రీరాముడు సుస్నేహకటాక్షములను ప్రసరింపజేసి, వారినందరిని లేవనెత్తి, సత్కరించి, యేమి చేయవలయునని వారిని అడిగెను. పిదప వారందరును అంజలిబద్ధులై భక్తితో. "రఘునాథా! వైకుంఠమునకు పోవనెంచితివా మమ్ములను కూడ తీసుకొనిపొమ్ము, మీరెచ్చటికి వెళ్ళెదరో మేమూ అచ్చటికే వచ్చెదము. మీతోపాటు మా మనసులు అనుసరించుచున్నవి. ఇప్పుడే వనమునకు గాని, పురమునకు గాని, స్వర్గమునకుగాని భార్యా, పిల్లలతో మిమ్ము అనుసరించెదము." అని విన్నవించిరి. వారిపట్టుదలను చూచి, దయతో రఘునాయకుడు భక్తులగు పౌరజనులతో అట్లే కానిమ్మని అనుగ్రహించెను. (25)

**కృత్వైవం నిశ్చయం రామస్తస్మిన్నేవాహని ప్రభుః ।**
**కుశం తమభిషేక్తుం వై చోదయామాస లక్ష్మణమ్ ॥ 26**

**సౌమిత్రిశ్చాపి గురుణా విప్రైః పౌరజనైస్తదా ।**
**శోభయిత్వా స్వనగరీం ముదా తమభ్యషేచయత్ ॥ 27**

**అభిషేకే కుశస్యాసీన్మహోత్సాహో గృహే గృహే ।**
**రామావరోధే సుమహాన్సముత్సాహస్తదాऽభవత్ ॥ 28**

**తదా సింహాసనారూఢం ఛత్రతామరశోభితమ్ ।**
**ప్రజాః కుశం పతిం ప్రాప్య ప్రణామం చక్రురాదరాత్ ॥ 29**

**తదా కుశో నృపో విప్రాన్ ధనం బహుతరం దదౌ ।**
**ప్రజాస్తం పూజయామాసువస్త్రాలంకారవాహనైః ॥ 30**

**తతః ప్రపూజయత్సర్వాః ప్రజాః స కుశభూపతిః ।**
**భోజయామాస విప్రౌఘాన్ కోటిశః స కుశేశ్వరః ॥ 31**

**అథ రామాజ్ఞయా శీఘ్రం సౌమిత్రిః సీతయా సహ ।**
**అంతః పురాణి సర్వాణి నినాయ నగరాద్బహిః ॥ 32**

**నానావాహనసంస్థాని నృత్యవాద్యాదిమంగళైః ।**
**తతో రామః స్వయం బంధుపుత్రాద్యైః సర్వతో వృతః ॥ 33**

మునిభిర్జయశబ్దైశ్చ స్తుతో మంగళనిఃస్వనైః ।
అయోధ్యాయా బహిః పౌరైర్యయౌ మాగధసంస్తుతః ॥ **34**

రథారూఢశ్చామరాద్యైర్వీజితశ్చ శనైర్ముదా ।
వివేశ వాసోగేహాని తదా రామో జనైః సహ ॥ **35**

సనృతుర్వారనార్యశ్చ తదా శ్రీరాఘవాగ్రతః ।
తతః పౌరాః సావరోధాశ్చండాలాంతా వినిర్యయుః ॥ **36**

నిన్యుస్తే పారమేయంతాన్ పుర్యాః పౌరాశ్చతుష్పదాన్ ।
నాసన్ పక్షీకులాన్తాద్యాస్తత్పుర్యాం తే బహిర్యయుః ॥ **37**

నాసీత్కోఽపి తదా పుర్యా జనశూన్యా బభూవ సా ।
అయోధ్యానగరీ పుణ్యా గజభుక్త కపిత్తవత్ ॥ **38**

ఏతస్మిన్నంతరే సర్వే ద్వీపాంతరనివాసినః ।
జంబూద్వీపాంతరస్థాశ్చ యయుః సైన్యైర్ నృపోత్తమాః ॥ **39**

కోటిశో రాఘవం నేముస్తతోనేముః కుశేశ్వరమ్ ।
ఉపాయనాని రామాయ కుశాయ చ పృథక్ పృథక్ ॥ **40**

శ్రీరాముడు ఆరోజే కుశుని పట్టాభిషేకమునకై లక్ష్మణుని ప్రేరేపించెను. లక్ష్మణుడు గురు, విప్ర, పౌరులతో కలసి పట్టణమును అలంకరించి, కుశునికి పట్టాభిషేక మహోత్సవమును జరిపించెను. అంత ఛత్ర చామరాలంకృతుడై సింహాసనమునందు ప్రకాశించుచుండు కుశపతికి ప్రజలందరు ప్రణమించి, వస్త్రాలంకారాది కానుకలనర్పించి కొనియాడిరి. కుశుడు విప్రులకు విశేషముగా ధనములనొసగి ప్రజలనందరిని సత్కరించెను. కోట్లాది బ్రాహ్మణులకు సంతర్పణము చేసెను. (31). అంత శ్రీరామాజ్ఞాను సారముగా లక్ష్మణుడు పట్టణమునకు వెలుపల సీతతో సకల అంతఃపురములను మంగళవాద్యాది ఘోషతో తీసికొనివచ్చెను.

## శ్రీరాముడు సపరివారముగా బయలుదేరుట

పిదప శ్రీరాముడును రథమునెక్కి సకల రాజోపచారములు జరుగుచుండ, గురు విప్ర పౌరుల జయజయ ధ్వానములు వినిపించుచుండగా, బంధు పుత్ర పరివారముతో బయలుదేరి, ఊరిబయట పటగృహము(షామియానా)లలో నిలచెను. అప్పుడు అయోధ్యలో ఆచండాలాంత మొకరైనను నిలువక

అందరును తమ పశు, పక్ష్యాది పరివారముతో శ్రీరాముని అనుసరించివచ్చిరి. నగరంలో ఒక కుక్క కూడ నిలువలేదు. అంత అయోధ్య యేనుగుమ్రింగిన వెలగపండువలె శూన్యమయ్యెను. ఆ వేళకు ద్వీపాంతర నివాసులు, జంబూ ద్వీపవాసులునగు అనేకులు, రాజులు, తమతమ సైన్యములతో వచ్చి చేరిరి.

దత్వా సంపూజీతాస్తాభ్యాం తస్థుః సర్వే నృపోత్తమాః ।
తతోఽంగదశ్చిత్రకేతుః పుష్కరస్తక్ష ఏవ చ ॥ **41**

సుబాహుర్యూపకేతుశ్చ యయుః సర్వే నిజైర్బలైః ।
సావరోధాః సపుత్రాశ్చ సపౌత్రాస్తే స్నుషాదిభిః ॥ **42**

ప్రణేమూ రాఘవాదీంశ్చ సీతాదీశ్చాపి సాదరాత్ ।
రామేణాలింగితాః సర్వే సీతయా భోజితా అపి ॥ **43**

తస్థుః సర్వే సభాయాం తే స్వస్వపౌరజనైః సహ ।
తదాగతాన్ నృపాన్సర్వాన్ రామో వృత్తం న్యవేదయత్ ॥ **44**

పునః పప్రచ్ఛ తాన్ సర్వాన్ సంస్థితాన్ రఘునందనః ।
యుష్మాకం పూర్వజాః సర్వే సమాయాతా గజాహ్వయే ॥ **45**

భవతాం రోచతే యుద్ధం యది తైః పూర్వజైః సహ ।
ఆగంతవ్యం తర్హి సర్వం మయా సహ గజాహ్వయమ్ ॥ **46**

నోచేద్భవద్భిర్గంతవ్యమిత ఏవ నిజస్థలమ్ ।
నిర్బంధోఽత్ర న మే జ్ఞేయః సర్వైః పార్థివసత్తమైః ॥ **47**

ఇతి రామవచః శ్రుత్వా నృపా రాఘవమబ్రువన్ ।
రామ రామ మహావీర్య వయం సర్వే తవానుగాః ॥ **48**

త్వయైవ వర్ధితాః సర్వే తవాన్నైః పోషితా వయమ్ ।
వీరాః క్షత్రియవంశీయా రణే తాతప్రహారిణః ॥ **49**

తవాజ్ఞయా వధామోఽద్య పితృపుత్రాన్ రణాజిరే ।
నాఽస్మాంస్త్వం విద్ధి రాజేంద్ర స్వామికార్యే పరాఙ్ముఖాన్ ॥ **50**

**ఇతి తేషాం వచః శ్రుత్వా తానాలింగ్య స రాఘవః ।**
**సంపూజ్యాభరణైర్వస్త్రైః సుఖం సుష్వాప సీతయా ॥ 51**

రాజులందరూ... శ్రీరామునికి, కుశపతికినీ వేర్వేరుగా కానుకలనర్పించి, నమస్కరించి కొనియాడి, వారిరువురిచే సత్కృతులైరి. అంత నగదుడు, చిత్రకేతువు, పుష్కరుడు, తక్షుడు, సుబాహువు, యూపకేతువు కొడుకులను, మనుములను, కోడండ్రను వెంటదీసికొని తమ అంతఃపుర పౌర పరివారముతో వచ్చి శ్రీరామాదులకు నమస్కరించి, సీతమ్మచే ఆదరింపబడిరి. శ్రీరాముడు వారినందరిని తగిన ఆలింగనాది బహుమతులచే సంతోషపరచెను. వారును భుజించి వచ్చి సభాసీనులైరి. ఇట్లుండ శ్రీరాముడు విచ్చేసిన రాజులందరిని చూచి, "మీయొక్క పూర్వులు గజపురి (హస్తిన) లో కూడియున్నారు. మీకు సమ్మతమైతే వారి పై దండెత్తిపోవ నా వెంటవచ్చి మీ పూర్వులతో యుద్ధము జేయవచ్చును. సమ్మతము లేనిచో మీ మీ ప్రాంతములకు మీరుపోవచ్చును. నా యొక్క నిర్బంధ మేమియును లేదు" అని చెప్పెను. అంత వారు "శ్రీరామా! మహానుభావా! మేమందరము నిన్నే అనుసరించి వచ్చువారము. నీచే పెంచబడిన బిడ్డలము. మీ భోజన ప్రభావ పోషితులము. క్షత్రధర్మమును అవలంబించి తండ్రులనైనను, పుత్రులనైనను రణమున తెగనరుకుదుము. స్వామి కార్యమున వెనుదీయువారము కాము." అని ఉద్ఘోషించగా, శ్రీరాముడు వారినందరిని సత్కరించి, ఆ రాత్రి సీతతో సుఖముగా నిద్రించెను. (51)

**తతః ప్రభాతే శ్రీరామో గత్వా తాం సరయూనదీమ్ ।**
**స్నాత్వా దానాది వై దత్వా సీతయా విధిపూర్వకమ్ ॥ 52**

**నత్వా తాం సరయూం పుణ్యాం గంతుం పప్రచ్ఛ వై ముహుః ।**
**తద్రామవచనం శ్రుత్వా సరయూ రామమబ్రవీత్ ॥ 53**

**ఏతావత్కాలపర్యంతం స్థితా త్వద్దర్శనేచ్ఛయా ।**
**అహమద్య త్వయా రామ యాస్యామి త్వత్పదం త్వితః ॥ 54**

**తత్తస్యా వచనం శ్రుత్వా తామాహ రాఘవః పునః ।**
**యావత్కథా మమ శుభా స్థాస్యత్యత్రాఘనాశినీ ॥ 55**

**తావత్త్వమంశరూపాత్ర వస లోకాఘనాశినీ ।**
**తథేతి రామవచనా దంశరూపం నిధాయ సా ॥ 56**

**సాకేతేఽత్ర పూర్ణరూపం యయౌ రామేణ తత్పదమ్ ।**
**అథ రామః సరయ్వాఽసౌ పరిక్రమ్య నిజాం పురీమ్ ॥ 57**

సాష్టాంగం తాం నమస్కృత్య గంతుం పప్రచ్ఛ పూజ్య తామ్ ।
అయోధ్యేఽంబ నమస్తేఽస్తు త్వయాఽహం రక్షితస్త్విహ ॥ 58

ఆజ్ఞాం దదస్వ పృచ్ఛామి స్వస్థలం గంతు ముద్యతః ।
క్షమస్వ మేఽపరాధాంస్త్వం పునర్దర్శనమస్తు తే ॥ 59

ఇతి రామవచః శ్రుత్వా పురీ రాఘవమబ్రవీత్ ।
ఏతావత్కాలపర్యంతం స్థితా త్వద్దర్శనేచ్ఛయా ॥ 60

యాస్యే త్వయా సమర్థా న సోఢుం త్వద్విరహం త్వహమ్ ।
సతస్యా వచనం శ్రుత్వా పురీమాహ రఘూత్తమః ॥ 61

యావత్కథా మమ శుభా స్థాస్యత్యత్రాఘనాశినీ ।
తావత్త్వమంశరూపేణ వసాత్ర మృన్మయీ చిరమ్ ॥ 62

తథేతి రామవచనాదంశరూపాత్ర మృన్మయీ ।
అయోధ్యా సంస్థితా దివ్యా హైమా రామేణ సా యయౌ ॥ 63

అయోధ్యయా సరయ్వాఽపి రామః సేనాస్థలం యయౌ ।
అయోధ్యాయాః సరయ్వాశ్చ ప్రభావౌ న గతౌ త్వితః ॥ 64

అథ సీతా మహానాగీమారురోహ సఖీజనైః ।
పృథక్ నాగ్నీమూర్మిళాద్యాస్తాః సమారురుహుస్తదా ॥ 65

అథ రామో ముదా వేగాత్సమారుహ్య గజోపరి ।
ఉవాచ లక్ష్మణం వాక్యం పుష్పకే సకలాన్ జనాన్ ॥ 66

పౌరానారోహయస్వ త్వం స్వబంధుభ్యాం సుతాదిభిః ।
నాగారూఢైః పృథక్ శీఘ్రం సమారుహ్య గజోపరి ॥ 67

## శ్రీరాముడు సరయ్వాదులను అనుగ్రహించుట

అంత మరునాడు ప్రాతఃకాలమున శ్రీరాముడు సీతతోడ సరయూనదికి వచ్చి స్నాన సంధ్యాద్య నుష్ఠానానంతరము విధివిధానముగా దానధర్మములను చేసి, పుణ్యమూర్తియగు సరయూనదికి నమస్కరించి, పలుమార్లు తన పయనమునకై వేడెను. అప్పుడు సరయూనదీ దేవత మూర్తీభవించి "శ్రీరామా! ఇంతవరకు నీయొక్క దివ్యదర్శనేచ్ఛ చేతనే ఇచ్చట వసించియున్నాను. ఇక నిచ్చటినుండి యిపుడు నీ చరణమునందెదను" అని ప్రార్థించెను. అందుకు శ్రీరాముడు పాపపరిహారకమగు నా

కథ లోకమునందుండు నంతవరకు నీవు నాస్వరూపముగా లోకులపాపమును పరిహరించు నదియై ఇచ్చట వసింపుము.” అని ఆజ్ఞాపించగా ఆమె యట్లేయని అయోధ్యలో తన అంశరూపమును శ్రీరామునితో నిలిపి పూర్ణరూపయగు తాను శ్రీరాముని పాదపద్మములను చేరెను.

పిదప శ్రీరాముడు సరయువుతో వచ్చి తన రాజధానియగు అయోధ్యను పూజించి, సాష్టాంగముగా నమస్కరించి, “అయోధ్యా! తల్లీ! నీకు నమస్కారము, ఇచ్చట నీచే పరిరక్షింపబడితిని. నేను నాస్థలమునకు పోవుటకు అనుజ్ఞ యిమ్మనివేడుచున్నాను. నా అపరాధములను మన్నింపుము, మరల నీకుదర్శన మగునుగాక.” అని చెప్పగనే, పురదేవత మూర్తీభవించి, “ఇంతవరకు నేను నీదర్శనాపేక్షచే ఇచ్చట వసించితిని ఇంక నిన్ను వదిలి నేనుండజాలను. నీవెంబడి వచ్చెద”ను. అని పార్థించెను. అందుకు శ్రీరాముడు “నాయొక్క మంగళ చరిత్ర ఇచ్చట దురితహరమై యుండునంతవరకు నీవు అంశ రూపముతో మృణ్మయాకారముతో ఉండుము,” అని అనుజ్ఞనిచ్చెను. తన అయోధ్యా దేవి మృణ్మయయై అంశరూపముతో అచ్చట నిలచి దివ్య సువర్ణమయమగు నిజ రూపముతో శ్రీరాముని వెంటవెడలెను. కావున ఇచ్చట అయోధ్యా, సరయూ ప్రభావములకు లోపము కాలేదు. శ్రీరాముడు పిదప అయోధ్య, సరయూలతో కూడి సైన్యము వద్దకు విచ్చేసెను. వెంటనే సీతాదేవి మొదలగు రాజాంగనలు తమతమ సఖీవర్గముతో మహాగజములనెక్కిరి.

**అనుగచ్ఛస్వ మత్పృష్ఠే లక్ష్మణః స తథాఽకరోత్ ।**
**అథ సర్వే నృపతయో నానాయానేషు సంస్థితాః ॥ 68**

**యయుః స్వస్వబలైర్యుక్తాః శీఘ్రం శ్రీరామపార్శ్వతః ।**
**యయావగ్రే త్వగ్రసరో రజ్జుకుద్దాలధారిభిః ॥ 69**

**ధృషత్కారైస్తక్షకైశ్చ కుఠారటంకపాణిభిః ।**
**తతో యయౌ మహానాగః పతాకాధ్వజశోభితః ॥ 70**

**తతో యయుర్వృత్రహస్తా నానావాహనసంస్థితాః ।**
**తతో యయుః శతఘ్నీభిః పూరితాః శకటాః శుభాః ॥ 71**

**తతోఽశ్వసంస్థా వాద్యాని వాదయంతో యయుర్భటాః ।**
**తతోఽశ్వసంస్థాః శతశో యయుస్తే వేత్రపాణయః ॥ 72**

**తతో యయుర్మాగధాశ్చ వందినో యానసంస్థితాః ।**
**తతో నటాశ్చారణాశ్చ యానస్థాః సువిభూషితాః ॥ 73**

తతస్తా వారనార్యశ్చ కాష్ఠమంజకవాహితాః ।
మస్తకేషు భటైర్మార్గే నృత్యన్త్యః ప్రయయుః సుఖమ్ ॥ **74**

తతోయయుర్భూషితాస్తే శ్రీరామస్య తురంగమాః ।
తతః పురుషవద్వేషాన్ బిభ్రంత్యః ప్రమదోత్తమాః ॥ **75**

యయుస్తరుణ్యః శతశః శస్త్రహస్తాః సభూషితాః ।
గోపితాస్యాః కంచుకిన్యస్తురంగాదిషు సంస్థితాః ॥ **76**

తతో యయుర్దండహస్తా దాసీపుత్రాః సుభూషితాః ।
తతో యయౌ రామచంద్రస్తత్పృష్ఠ లక్ష్మణో యయౌ ॥ **77**

తత్పృష్ఠే భరతశ్చాపి శత్రుఘ్నశ్చ తతో యయౌ ।
తతః కుశో లవశ్చాథ తతః సోऽప్యంగదో యయౌ ॥ **78**

యయౌ తతశ్చిత్రకేతుః పుష్కరశ్చ తతో యయౌ ।
తతస్తక్షః సుబాహుశ్చ యూపకేతుస్తతో యయౌ ॥ **79**

శ్రీరాముడు సంతోషముగా మహాగజమునెక్కి, "తమ్ముడా! పౌరులను, బంధుపుత్రాదులను, సకల జనులను పుష్పకముమీద ఆయా వాహనములమీద ఎక్కించుకొని నావెంటరమ్ము" అని ఆజ్ఞాపించెను. అతడు అట్లేచేసెను. నానాదేశ రాజులందరును తమతమ సైన్యములతో శ్రీరాముని ఇరువైపులా వెడలిరి. మొదట త్రాళ్ళు, గుద్దళ్ళుగలవారు, రాళ్ల పనివాండ్రు, వడ్రంగులు, గండ్రగొడ్డలి కాశవుళ్లు గలవారు, వారి వెనుక మహాగజములు, ధ్వజ పతాకాలంకృతములు, వాటి వెనుక వివిధ వాహనములనెక్కిన యంత్రధారకులు, వారి వెనుక శతఘ్నులనిన ఫిరంగులుగలబండ్లు కోట్లకొలది, వాటి వెంబడి తురగారూఢులగు వాద్యగాండ్రు, వేత్రధరులు, వందిమాగధులు, పిదప నటనాట్య గీత వర్గమువారు, పురుష వేషులగు స్త్రీలు, దివ్యాలంకృత శ్రీరామ అశ్వ సమూహము, దండధరులును వెడలగా, శ్రీరామచంద్రుడు, పిదప లక్ష్మణుడు, వెనుక భరతుడు అనుసరించి, శత్రుఘ్నుడు, తరువాత కుశలవులు, పిమ్మట అంగదుడు, ఇటొకరి వెనుక ఒకరుగా చిత్రకేతువు, పుష్కరుడు తక్షకుడు, సుబాహువు, యూపకేతువును,

తతః సీతా యయౌ శీఘ్రమ్ ఊర్మిళా చ తతః పరమ్ ।
మాండవీ శ్రుతకీర్తిశ్చ స్నుషాః సర్వాః క్రమాద్యయుః ॥ **80**

తతస్తే మంత్రిణాః సర్వే శిబికాసంస్థితా యయుః ।
తతో యయుర్వానరాశ్చ కోటిశః పర్వతోపమాః ॥ **81**

తతో యయుర్ నృపాః సర్వే కోటిశో వారణస్థితాః ।
తతో నృపాణాం సైన్యాని యయుర్వాజిస్థితాని హి ॥ 82

యయుస్తతస్తే యంత్రాణాం శకటాః కోటిశో వరాః ।
శతఘ్నీఖడ్గచర్మాదిపూరితాః శకటాస్తదా ॥ 83

తతో వారణముఖ్యాశ్చ నవవాద్యసమన్వితాః ।
తతశ్చోష్ట్రాః సువర్ణానాం తతః పృష్ఠే ఖరాదయః ॥ 84

ఏవం రామః శనైర్మార్గే చానురాద్యైః సువీజితః ।
సీతయా జాలరంధ్రైశ్చ వీక్షితశ్చ ముహుర్ముహుః ॥ 85

యయౌ శనైః శనైః శ్రీమాన్ స్తుతో మాగధవందిభిః ।
పశ్యన్నృత్యాన్యప్సరసాం శృణ్వన్ సగాయనాన్యపి ॥ 86

సేనానివేశస్థానానాం యాత్రాకాండే యథోదితా ।
మయా పూర్వం సురచనా తద్వదాసీత్పునస్త్విహ ॥ 87

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, అదికావ్యే, పూర్ణకాండే, రామదాస విష్ణుదాస సంవాదే, రామప్రస్థానం నామ, ద్వితీయః సర్గః ॥**

సీతాదేవి, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి, కోడండ్రును సేనాపరివృతులుగా వెడలిరి. పిదప మంత్రులు పల్లకీలలో కూర్చుండి వెడలిరి. వెనుక వానరులు పర్వతాకారులై పరివేష్టించి వెడలిరి. ఆయుధములు, యంత్రములు, శతఘ్నులు మొదలగు యుద్ధసామాగ్రులు అపారముగా వెడలె. గజ, ఉష్ట్రంబులపై యథేష్టముగా సువర్ణరాసులు వచ్చుచుండె. సకలరాజులును సైన్యంబులతోడ వెడలిరి. నవవాద్యములు మ్రోగుచుండె. ఇట్లు శ్రీరాముడు గీతములను వింటూ, నృత్యములను చూచుచు, సర్వానందకర వినోదముగా ప్రయాణిస్తూ, జైత్రయాత్ర వెడలెను. వందిమాగధులు పొగడుచుండిరి. మరి పూర్వము యాత్రాకాండలో చెప్పబడినట్లే సేనానివేశ స్థానాదులు గల్గుచుండెను.

శ్రీ వాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
శ్రీరామప్రస్థానమును వివరించు, 2వ సర్గ ముగిసినది.

# తృతీయః సర్గః-3వ సర్గ

సోమవంశ రాజుల యుద్ధవర్ణన

**శ్రీరామదాస ఉవాచ**

**అథ రామః శనైర్మార్గే నానాదేశాన్విలంఘ్య చ ।**
**ఏకాదశదినైః ప్రాప్య సేనయా తద్గజాహ్వయమ్ ॥ 1**

**రామమాగతమాజ్ఞాయ సుషేణో వేగవత్తరః ।**
**ప్రత్యుద్యయౌ స్వకపిభిర్వింశల్లక్షసమన్వితైః ॥ 2**

**నత్వా రామం చ సీతాం చ సర్వం వృత్తం న్యవేదయత్ ।**
**రామ రామ మహాబాహో ప్రతాపాత్తవ వై మయా ॥ 3**

**చతుర్దశదినం యుద్ధం కృతమేభిః సుదుష్కరమ్ ।**
**అధునా త్వం సమాయాతః క్వైతే స్థాస్యంతి భూతలే ॥ 4**

**సుషేణస్య వచః శ్రుత్వా తమప్యాశ్వాసయత్ ప్రభుః ।**
**అథ రామః స జాహ్నవ్యాశ్చోత్తరే పరమే తటే ॥ 5**

**సేనానివాసమకరోద్దదర్శ రిపువాహినీమ్ ।**
**తాం నిశాం సమతిక్రమ్య ద్వితీయే దివసే తతః ॥ 6**

**చోదయామాస యుద్ధాయ వానరాన్ రఘునందనః ।**
**తతస్తే వానరాః సర్వే జాహ్నవ్యామవప్లుత్య చ ॥ 7**

**రామం సీతాం నమస్కృత్య నిర్యయుః సమరం ముదా ।**
**తతస్తే వానరాశ్చక్రుః సింహనాదాన్ భయంకరాన్ ॥ 8**

## శ్రీరాముడు యుద్ధమునకు కపివీరులను ఆజ్ఞాపించుట.

అంత శ్రీరాముడు తిన్నగా దారిలో దేశములను దాటుతూ, 11 రోజులకు హస్తినాపురమునకు చేరెను. సుషేణుడు ఈసమాచారము తెలుసుకుని, 10 లక్షల కపిసేనతోడవచ్చి, శ్రీసీతారాములకు నమస్కరించి "రఘువీరా! నీ ప్రభావముచేతనే వీరితోడ నేను 14 రోజులుగా పోరితిని, ఇప్పుడు నీవు వచ్చితివి. ఇక వారెచ్చట నిలువగలరు?" అని జరిగిన సకలవృత్తాంతమును విన్నవించెను. శ్రీరాముడు వానికి సమాధానముజెప్పి, గంగానదికి ఉత్తరతీరమున సేనను నిలిపి, శత్రువర్గమును అవలోకించుచు

ఆరాత్రి గడపి, మరునాడుదయమున వానరసైన్యమును యుద్ధమునకు ఆజ్ఞాపించెను. పిదప వారు గంగలోస్నానము జేసి, శ్రీసీతారాములకు నమస్కరించి, సంతోషముగా యుద్ధమునకు వెడలి సింహనాదములు జేయుచు, వాద్యధ్వనులతో శత్రుసేనలను తరిమిరి.

వాదయామాసుర్వాద్యాని దుద్రువుః శత్రువాహినీమ్ ।
నలాద్యాస్తేఽపి శ్రీరామసేనాం దృష్ట్వాఽతివిస్మితాః ॥ 9

చకితా భయభీతాశ్చ నిర్యయుః సంగరం జవాత్ ।
తతస్తే వానరాః సర్వే గంగాముల్లంఘ్య వేగతః ॥ 10

దృషద్భిః పర్వతైర్వృక్షైః శిలాభిర్ముష్టిభిః పదైః ।
నిజఘ్నుః శత్రువీరాంస్తే కీర్తయంతో రఘూత్తమమ్ ॥ 11

నలవీరాశ్చ తే సర్వే శస్త్రైస్తీక్ష్ణైః కపీశ్వరాన్ ।
నిజఘ్నుః సమరే వేగాద్బభూవ తుములో రణః ॥ 12

అథ తైర్వానరైః సర్వైః బలాద్వృక్షైః ప్రపీడితాః ।
పరాఙ్ముఖాః కృతాః సర్వే రణాత్తే నలసైనికాః ॥ 13

తాన్ దృష్ట్వా తే నలాద్యాశ్చ రణాద్వీరాన్ పరాఙ్ముఖాన్ ।
నిహతాన్ కపివీరైశ్చ చోదయన్నృపతీంస్తదా ॥ 14

తతస్తే పార్థివాః సర్వే జంబూద్వీపనివాసినః ।
తథా ద్వీపాంతరోద్భూతా యే వృద్ధాశ్చ పురోదితాః ॥ 15

యయుర్యుద్ధాయ సన్నద్ధా నానావాహన సంస్థితాః ।
తాన్ సర్వానాగతాన్ దృష్ట్వా యయుః శ్రీరామసైనికాః ॥ 16

జంబూద్వీపాంతరస్థాశ్చ తథాద్వీపాంతరస్థితాః ।
యువానశ్చ నృపాః సర్వే నానావాహనసంస్థితాః ॥ 17

సుగ్రీవశ్చాంగదశ్చాథ హనుమాంశ్చ విభీషణః ।
జాంబవాంశ్చ సుషేణశ్చ సంపాతిర్మకరధ్వజః ॥ 18

గుహకో భూరికీర్తిశ్చ కంబుకంఠః ప్రతాపవాన్ ।
తథాఽన్యే జనకాద్యాశ్చ యయుః సంగ్రామభూతలమ్ ॥ 19

**తదోభయోర్మహానాసీత్ సైన్యయోర్వీరనిఃస్వనః ।**
**నవవాద్యాని వై నేదురుభయోః సైన్యయోః పృథక్ ॥ 20**

**తదా బ్రహ్మాదయో దేవాః శివేన సహితాశ్చ ఖే ।**
**సబుధేనాథ సోమేన దేవేంద్రేణ యుతా ముదా ॥ 21**

**నానావిమానమారూఢా దదృశుర్యుద్ధకౌతుకమ్ ।**
**అథ చంద్రాదయో దేవాశ్చక్రుర్మంత్రం పరస్పరమ్ ॥ 22**

అచ్చట నలాది వీరులును, శ్రీరాముని సేనలనుచూచి ఆశ్చర్యపోయి, భయభ్రాంతులయినను త్వరగా రణమునకు బయలుదేరిరి. అంత వానరులు గంగనుదాటి రాళ్లు, గుండ్లు, కొండలు, చెట్లు ఆయుధములుగా గలగి, శ్రీరామసంకీర్తనము చేయుచు, ఆ శత్రువీరులను చంపుచువచ్చిరి. నలాది వీరులును తీక్ష్ణశస్త్రములతో కపివీరులను వధించిరి. రణకోలాహలము పెరిగెను. (12)

## సోమ-సూర్య వంశజుల మహాయుద్ధము.

అప్పుడు వానరవీర పీడితులైన శత్రువీరులు యుద్ధమునుండి పారిపోవుచుండిరి. నలాది ప్రముఖులు వారిని జూచి ఓదార్చి, ధైర్యము జెప్పి మరల యుద్ధమువైపు మరలించ ప్రయత్నించిరి. అంత జంబూద్వీప రాజులును, ఇతర రాజులందరును తమ తమ సేనలతో విజృంభించి వెడలిరి. ఇచ్చట శ్రీరామసైన్యముగల జంబూద్వీపాన్య ద్వీపవర్తి రాజులందరును వారి వారి వాహనములను ఎక్కి ప్రతిఘటించిరి. హనుమ, అంగద, సుగ్రీవ, విభీషణ, జాంబవంత, సుషేణ, సంపాతి, మకరధ్వజ, గూహక. భూరికీర్తి, కంబుకంఠ, ప్రముఖులును; మరియు జనకాది మహావీరులును రణాంగణమున కు విచ్చేసిరి. అప్పుడు ఉభయ సేనలయందును వీరుల సింహనాదములు గగనమును ఆక్రమించె. బ్రహ్మాది దేవతలు శివునితో, ఇంద్ర, చంద్ర, బుధులతో విమానములమీదనెక్కి రణవినోదమును చూచుచుండిరి. అంత చంద్రాది దేవతలు...

**మహాభయం సముత్పన్నం ప్రళయోఽద్య భవిష్యతి ।**
**బ్రహ్మదత్తవరాశ్చైతే సోమవంశోద్భవా నృపాః ॥ 23**

**రామో విష్ణురయం సాక్షాత్ కథం జయపరాజయౌ ।**
**భవిష్యతః కథం యుద్ధాన్నివృత్తిరుభయోరపి ॥ 24**

**భవిష్యతి ఉపాయః కః కార్యోయుద్ధానవారణే ।**
**తదా బ్రహ్మ సురానాహ కించిద్దృష్ట్వా వయం రణమ్ ॥ 25**

కరిష్యామస్తయోః సఖ్యం రామసోమజయోస్త్విహ ।
ఇత్యుక్త్వా సకలాన్ వేధా దదర్శ రణకౌతుకమ్ ॥ 26

తథోభయోః సైన్యయోశ్చ బభూవుర్యంత్రనిః స్వనాః ।
యంత్రోత్థవహ్నిజ్వాలాభిర్వ్యాప్తా దశ దిశోఽభవన్ ॥ 27

యత్రోత్థనానాఘుటికాభిర్నిజఘ్నుస్తే పరస్పరమ్ ।
శతఘ్నీభిస్తథా జఘ్నుః శకటస్థాభిరాదరాత్ ॥ 28

తథా వీరా నిజఘ్నుస్తే బాణైః ఖడ్గైః పరశ్వధైః ।
పరస్పరం తోమరైశ్చ భిందిపాలైశ్చ ముద్గరైః ॥ 29

పరిఘైశ్చక్రబాణైశ్చ కుంతైః శూలైశ్చ పట్టిశైః ।
తదా జఘాన పితరం పుత్రః పుత్రం తథా పితా ॥ 30

పితామహస్తథా పౌత్రం పౌత్రశ్చాపి పితామహమ్ ।
అన్యోన్యం కులజాత్యాఖ్యాదికం సంశ్రావ్య వై ముహుః ॥ 31

తథా రణే ప్రపౌత్రం చ జఘాన ప్రపితామహః ।
తథా బాణైః ప్రపౌత్రోఽపి జఘాన ప్రపితామహమ్ ॥ 32

మాతామహం తు దౌహిత్రస్తదా బాణైరతాడయత్ ।
తథా మాతామహశ్చాపి దౌహిత్రం చ రణేఽహనత్ ॥ 33

ఏవం పరస్పరం చాసీద్యుద్ధం తల్లోమహర్షణమ్ ।
తత్ర యే యే హతావీరాః సంగరే రామసేవకాః ॥ 34

తాన్సర్వాన్ జీవయామాస తదా పవననందనః ।
ద్రోణాచలౌషధీభిశ్చ వారం వారం స్వసైనికాన్ ॥ 35

రిపుసైన్యే మృతా యే తే మృతా ఏవ తు నోత్థితాః ।
ఏవం తదా సోమవంశనృపాస్తే క్షీణతాం యయుః ॥ 36

"గొప్పభయము గల్గెనే, ఇచ్చట ప్రళయమగునేమో! ఈ చంద్రవంశపురాజులు వీరు బ్రహ్మవర సంపన్నులు, సాక్షాద్విష్ణువే రాముడగును, జయ పరాజయములెట్లు ఘటిల్లునో? ఇరువురికిని కలహమెట్లు నివారింపబడును? ఇందుకుపాయమేమి?" అని పరస్పర మాలోచించిరి. అప్పుడు బ్రహ్మదేవుడు "మనము కొంత రణ వినోదమును జూతము. పిదప నేను వీరిరువురికిని సఖ్యము

నేర్పరచెద.” అని పలికి చూచుచుండెను. రెండు సైన్యములలోను యుద్ధయంత్ర ధ్వనులు వెలువడే. వాటియగ్ని జ్వాలలు దిఙ్మండలము నాక్రమించె. వాటితప్తాయోగోళకముల ప్రహారములచే ఇరువైపులా అనేకులు మృతులయిరి. శకటస్థిత శతఘ్నులచే పోరుచుండిరి. బాణ, ఖడ్గ, తోమర, ముద్గర, బిందిపాల, పరశ్వదాది ఆయుధ ప్రయోగములు పెరిగె. ఆ వింతను ఏమనదగును! తండ్రి–కొడుకును, కొడుకు–తండ్రిని, తాత–మనమని, మనమడు–తాతను, తాను–కూతురికొడుకును, కూతురి కొడుకు–తనను, ఇట్లు పరస్పరముగా కుల, జాతి, పేర్లను వినియూ ఒకరినొకరు కొట్టుకొనుచుండిరి. అచ్చట ఆంజనేయుడు శ్రీరామ సైన్యమున నేలగూలిన వీరులను ద్రోణాచల మహౌషధిం దెచ్చి బ్రతికించుచుండె. శత్రుసైన్యమున పడినవారు పడినట్లే మరలలేవలేదు. ఇట్లు చంద్రవంశపువీరులు క్షీణదశనందుచుండిరి.

**తధా లోహితపూరా సా బభూవ సురనిమ్నగా ।**
**అర్కపద్మమితా సేనా నలాదీనాం తదా రణే ॥ 37**

**నిపాతితా రాఘవీయైః నృపైః సా వరసంగరైః ।**
**ఏవం బభూవ సమరః షణ్మాసం హస్తినాపురే ॥ 38**

**తతస్తే సోమవంశస్థా నృపాః కించిద్బలైర్యుతాః ।**
**విషణ్ణా విగతోత్సాహా నిర్యయుః సంగరం స్వయమ్ ॥ 39**

**తానాగతాంస్తదా వీక్ష్య కుశాద్యా బాలకాశ్చ తే ।**
**రామదీనాం యయుస్త్వగ్రే రథస్థా రణభూతలమ్ ॥ 40**

**నలం యయౌ కుశః శీఘ్రం నద్యుకం స యయౌ లవః ।**
**జాతీకరమంగదశ్చ తథా చ వసుదం నృపమ్ ॥ 41**

**చిత్రకేతుర్యయౌ శీఘ్రం తథా లఘుశ్రుతం నృపమ్ ।**
**యయౌ స పుష్కరః శీఘ్రం తక్షకః సురథం యయౌ ॥ 42**

**అజమీఢం సుబాహుశ్చ యూపకేతుర్యయౌ బలమ్ ।**
**యూపకేతుర్హి తత్ సైన్యం చకారాగోచరం శరైః ॥ 43**

**వాయవ్యాస్త్రేణ చిక్షేప లవస్తం లవణాంభసి ।**
**తదా తే సప్త వీరాశ్చ నలాద్యాః పర్వతా ఇవ ॥ 44**

యుయుధూ రఘువీరస్య బాలకైః సహ సంగరే ।
న విరేజుర్బలైర్హీనాః స్కంధహీననగోపమాః ॥ 45

కుశో వివ్యాధ బాణైస్తం నలం సంగ్రామమూర్ధని ।
తదా నలః ప్రభిన్నాంగః స్వబాణైస్తం వ్యతర్జయత్ ॥ 46

తతః కుశః స్వబాణౌఘైర్నలస్యాశ్వాన్ ధ్వజం ధనుః ।
ఛత్రం సారథినం ఛిత్వా నలం బాణైరతాడయత్ ॥ 47

నద్యుకం చాపి వివ్యాధ స్వబాణౌఘైర్లవస్తతః ।
నద్యుకశ్చ లవం బాణైస్తదా వ్యాకులమాతనోత్ ॥ 48

నద్యుకం నిజబాణౌఘైశ్చకార విరథం లవః ।
ఏవం జాతీకరం బాణైరంగదః సంప్రతాడయత్ ॥ 49

ప్రతాడయజ్జాతీకరః పరిఘేణాంగదం తదా ।
తతో జాతీకరం బాణైరంగదోఽపాతయద్భువి ॥ 50

చిత్రకేతుః స్వబాణౌఘైః క్రోశేన వసుదం నృపమ్ ।
చిక్షేప స్యందనాద్వేగాత్ తదద్భుతమివాభవత్ ॥ 51

గంగానది రక్తప్రవాహముతో నిండిపోయెను. 12 పద్మములు గల నలాదులసేన రాఘవవీరులచే హతమయ్యెను. ఇట్లు హస్తినాపతివద్ద 6 నెలలు ఘోరయుద్ధమయిన పిదప సోమవంశస్థులగు ఆరుమంది నళాది మహారాజులు చావగా మిగిలిన సైన్యము తీసుకుని స్వయంగా తామేయుద్ధమునకు వచ్చిరి, వారు వచ్చుట చూసి, కుశాది బాలకులు శ్రీరాముని యెదుట వారిని ప్రతిఘటించిరి. కుశుడు–నలుడిని, లవుడు–నలుడిని, అంగదుడు–జాతీకరుడిని, చిత్రకేతువు–వసుదుడిని, పుష్కరుడు–లఘుశ్రుతుడిని, తక్షకుడు–సురథుడిని, సుబాహువు–అజమీఢుని, యూపకేతువు–సకలసైన్యమును తారసిల్లిరి, సకల సైన్యమును యూపకేతువుచే నిర్మూలమయ్యె. మరి దానిని లవుడు వాయవ్యాస్త్రముచే సముద్రములో కలపగా, అప్పుడు నలాది సప్తవీరులును రఘువీరుని బాలకులతో పర్వతముల వలె పోరుచున్నను సైన్యములు లేని వారగుటచే, కొమ్మలులేని ఎండిన వృక్షములవలె ప్రకాశించకపోయిరి. పిదప కుశుడు తనబాణ పరంపరచే గణాగ్రమున నలుని వేధించెను. నలుడు ప్రభిన్నగాత్రుడైనను కుశునిని తన బాణములతో భయపెట్టెను, అంత కుశుడు నలుని గుఱ్ఱములను, ధనస్సును, ధ్వజమును, ఛత్రమును, సారథిని కత్తిరించి నలునిని బాణములచే గొట్టెను. అపుడు

లవుడు నద్యుడుని బాణములతో విదిలించెను. నద్యుకుడును బాణములతో లవుని వ్యాకులపరచెను. లవుడు వానిని విరథునిచేసెను, ఇట్లే అంగదుడు జాతీకరునితో పోరి వానిని నేలగూల్చెను. చిత్రకేతువు వసుదునిని రథమునుండి క్రోసెడు దూరమునకు ఎగరగొట్టెను. చూచుటకు అది మిగులచిత్రమయ్యె.

**తథా లఘుశ్రుతో బాణైర్ హృది వివ్యాధ పుష్కరమ్ ।**
**తదా స పుష్కరః క్రోధాద్బాణైర్లఘుశ్రుతం రథే ॥ 52**

**భిత్తిచిత్రోపమం కృత్వా వాదయాస దుందుభిమ్ ।**
**సురథశ్చాపి తక్షం స వవర్ష శరవృష్టిభిః ॥ 53**

**తతస్తక్షః స్వబాణౌఘైః సురథం గగనాంగణే ।**
**సరథం భ్రమయామాస శుష్కపర్ణం యథా మరుత్ ॥ 54**

**అజమీఢస్తదా సర్వాన్ పూర్వజాన్ వ్యాకులీకృతాన్ ।**
**వీక్ష్య రామాత్మజాద్యైస్తైర్వవర్ష శరవృష్టిభిః ॥ 55**

**సుబాహుస్తం స్వబాణౌఘైశ్చకార విరథం తదా ।**
**అజమీఢస్తతోఽన్యే స రథే స్థిత్వా యయౌ పునః ॥ 56**

**ముమోచ పవనాంస్త్ర స కుశాదీనాం వధే కృధా ।**
**తం దృష్ట్వాయూపకేతుస్తం పన్నగామం ముమోచ సః ॥ 57**

**తదా తే కోటిశః సర్పాః పపుస్తం కంపనం క్షణాత్ ।**
**రథస్థః స నలః సర్పాన్ దృష్ట్వా గారుడముత్తమమ్ ॥ 58**

**ముమోచ పన్నగాస్త్రస్య నివృత్త్యర్థం తతోఽస్త్రవిత్ ।**
**తదా కుశః ప్రముమోచ రాక్షసాస్త్రం భయావహమ్ ॥ 59**

**నద్యుకశ్చ తదా వేగాద్వహ్న్యాస్త్రం తం వ్యసర్జయత్ ।**
**తదా క్రోధాల్లవశ్చాపి మేఘాస్త్రం తం వ్యసర్జయత్ ॥ 60**

**తదా లఘుశ్రుతశ్చాపి పవనాస్త్రం ముమోచ సః ।**
**తదా స హనుమాన్ శీఘ్రం వ్యాదాయ వికటాననమ్ ॥ 61**

**ప్రపిబన్మారుతం వేగాన్ననాద జలదస్వనః ।**
**ఏవం తచ్చ మహాద్యుద్ధం పుష్పకారామసంస్థితౌ ॥ 62**

**సీతారామౌ ముదా యుక్తౌ లక్ష్మణాద్యైర్దదర్శతుః ।**
**ఏవం యుద్ధం పంచమాసాన్ ఏకాదశ దినాన్యభూత్ ॥ 63**

**ఏకాదశే దినేమార్గే గతాస్తేఽస్మిన్ సమీరితాః ।**
**ఏవమేకాదశైర్మాసైః ఏకాదశదినైరపి ॥ 64**

**త్రేతాయుగభవైర్దివ్యైః సమాప్తిం సంగరస్య చ ।**
**అదృష్ట్వా స కుశో వేగాద్బ్రహ్మాస్త్రం సందధే తదా ॥ 65**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, రామదాస విష్ణుదాస సంవాదే, సోమవంసోద్భవనృపాణాం యుద్ధవర్ణనం నామ, తృతీయః సర్గః ॥**

లఘుశ్రుతునిచే పీడింపబడిన పుష్కరుడు, లఘుశ్రుతుని రథమున అందమైన ఒక బొమ్మవలె నిల్పి జయదుందుభిని మ్రోగింపజేసెను. సురథుని శరపరంపరలో జిక్కిన తక్షుడు వానిని సరథునిగా ఆకాశమున ఎండుటాకును ఎగురగొట్టిన గాలివలే భ్రమింప జేసెను. అజమీడుడు అప్పుడు వ్యాకులము నందిన తనపూర్వజులను జూచి, రామపుత్రాదుల మీద శరవృష్టి కురిపించెను. సుబాహువు అపుడు వానిని విరథునిజేసెను. అంత ఆ అజమీఢాది వీరులు రథమునెక్కి మరల వచ్చిరి. అజమీఢుడు క్రోధముతో కుశునిమీద వాయవ్యాస్త్రమును ప్రయోగించెను. దానిని జూచి యూపకేతువు సర్పాస్త్రమును ప్రయోగించగా, కోట్లకొలది సర్పములు వెలువడి క్షణమాత్రమున ఆక్రమించెను. రథారూఢుడగు నలుడు దానిని గుర్తించి, గారుడాస్త్రమును ప్రయోగించె. తన్నివారణమునకై కుశుడు భయంకరమగు రాక్షసాస్త్రమును విడిచెను. అద్యుకుడు అపుడు వేగముగా ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. దానిపై క్రోధముచే లవుడు మేఘాస్త్రమును ప్రయోగించె. లఘుశ్రుతుడును అపుడు వాయవ్యాస్త్రమును ప్రయోగించగా ఆంజనేయుడు త్వరబడి తన నోటిని పెద్దగాజేసి ఆ వాయువును పీల్చి, గర్జించెను. ఇట్లు జరుగుచుండు మహాద్భుతరణమును పుష్పక ఉద్యానమున సుఖాశీనులయిన శ్రీ సీతారాములు లక్ష్మణాదులతో కలసి సంతోషముగా చూచుచుండిరి. ఈ విధముగా 11 నెలల, 11 దినములు గడచి పోవుచుండగా, ఆయుద్ధమునకు ముగింపు తెలియక కుశుడు వేగముగా అప్పుడు బ్రహ్మాస్త్రమును సంధించెను.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
సోమవంశోద్భవరాజులతో యుద్ధమును వర్ణించు 3వ సర్గ ముగిసినది.

# చతుర్థః సర్గః–4వ సర్గ

## సూర్యవంశరాజుల మైత్రి

శ్రీరామదాస ఉవాచ

బ్రహ్మాస్త్రం సందధానం తం దృష్ట్వా వేధాః సురైః సహ ।
సోమేన చ బుధేనాపి విమానేన యయౌ భువమ్ ॥ 1

విమానాదవరుహ్యాథ తదా బ్రహ్మా కుశం యయౌ ।
కుశం తం ప్రార్థయామాస మా త్వమస్త్రం విసర్జయ ॥ 2

పాలయస్వ వచో మేఽద్య నాకే సోమాయ వై మయా ।
ద్వాపరాంతం వరో దత్త స్త్వజేయాశ్చ రణాజిరే ॥ 3

భవిష్యంతి నలాద్యాశ్చ సర్వే యుష్మత్కులోద్భవాః ।
పురా త్వితి సురాగ్రే హి కస్మింశ్చిత్కారణాంతరే ॥ 4

అతస్త్వం కుశ మాస్త్రం మే నలాద్యేషు విసర్జయ ।
తద్బ్రహ్మవచనం శ్రుత్వా కుశో వాక్యమథాబ్రవీత్ ॥ 5

అధునా క్షణమాత్రేణ సర్వాన్ దగ్ధాన్ కరోమ్యహమ్ ।
నోచేత్కథయ రామాయ తస్యాజ్ఞాం మానయామ్యహమ్ ॥ 6

యదా త్వయా వరో దత్తస్తదా కిం విదితం తవ ।
నాసీచ్ఛ్రీరామసామర్థ్యం హ్యధునా ప్రార్థ్యసే ముదా ॥ 7

త్వయి చేద్వర్తతే కించిత్సారం ధర్తుం రణం మయా ।
తర్హి కురుష్వ సాహాయ్యం నళాదీనాం సురైర్యుతః ॥ 8

త్వయా రణే సంగరోఽద్య మమ పశ్యతు రాఘవః ।
సీతాఽపి పుష్పకాసీనా జాలరంధ్రైశ్చ పశ్యతు ॥ 9

ఏవం కుశస్య వచనం శ్రుత్వా లజ్జాయుతో విధిః ।
సోమేనాథ బుధేనాపి నలాద్యాన్ ప్రాహ వేగతః ॥ 10

## బ్రహ్మదేవుడు కుశాదులను ప్రార్థించుట.

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "ఆకాశమున దేవతలతో కలసి విమానమునుండి యుద్ధమును గమనించుచున్న బ్రహ్మదేవుడు, చంద్ర, బుధులతో కలసి భూమికి దిగివచ్చి, కుశుని చెంతకు వెళ్ళి, "నీవు బ్రహ్మాస్త్రమును ప్రయోగించవద్దు. ఇప్పుడు నామాటను గౌరవింపుము. స్వర్గమునందు మునుపు చంద్రునికి–ద్వాపరాంతమునకు నీకులమందుబుట్టిన నలాదులు రణరంగమునందు అజేయులైయుందురు, అని నేను వరమిచ్చియున్నాను. కావున నా బ్రహ్మాస్త్రమును నలాదులపై ప్రయోగింపకుము." అని వేడెను. అందుకు కుశుడు "ఇప్పుడే క్షణమాత్రమున అందరిని కాల్చివేయుదును అది నీకిష్టముగాకున్న శ్రీరామునితో జెప్పికొనుము. నేనతని ఆజ్ఞను పాలించెదను, నీవు వారికి వరములిచ్చునప్పుడు ఏమని భావించితివి? శ్రీరామసామర్థ్య మెట్లున్నదిపుడు? వ్యర్థముగా ప్రార్థించెదవు, నీకేమైన నాతో పోరుటకు బలముగలియుండిన దేవతలదోడ నలాదులకు సహాయము జేయుము. మనిద్దరి రణవినోదమును శ్రీరాముడిపుడు చూచునుగాక. సీతా దేవియును పుష్పకవిమానముపై కూర్చుని ఈ వినోదముజూడని," అని నిరాకరించగా; ఆ బ్రహ్మ సిగ్గుపడి సోమ, బుధులతో నలాదులను పిలచి, ఇట్లనెను.....

**రే రే మూఢాః శృణుధ్వం మే వచనం హి గతాయుషః ।**
**సాక్షాన్నారాయణం రామం యూయం యోద్ధుం సముద్యతాః ॥ 11**

**కేనేయం శిక్షితా బుద్ధిః సర్వేషాం ఘాతకారిణీ ।**
**గచ్ఛధ్వం శరణం రామం నోచేద్యూయం మరిష్యథ ॥ 12**

**మమాయం జనకః సాక్షాత్ రామో విష్ణుర్న సంశయః ।**
**ఇతి ధిక్కృత్య తాన్ వేధాః కుశం వచనమబ్రవీత్ ॥ 13**

**యావద్యాస్యామ్యహం రామాత్పునస్త్వాం కుశబాలక ।**
**తావచ్ఛేన్మోక్ష్యసే బాణం తర్హి మాం హతవానసి ॥ 14**

**ఇత్యుక్త్వా తం కుశం వేధా నలాద్యైః పరివేష్టితః ।**
**యయౌ రామం సురైర్యుక్తః పురస్కృత్య వృషధ్వజమ్ ॥ 15**

**శివమాగతమాజ్ఞాయ పుష్పకాద్రఘునందనః ।**
**ప్రత్యుద్గమ్య శివం నత్వా ప్రణనామ తతో విధిమ్ ॥ 16**

తతస్తాన్ పూజయామాస శివాదీన్ రఘునందనః ।
తతః సభాయాం రామస్య తిష్ఠన్ వేధా నలాదిభిః ॥ 17

ప్రణామాన్ కారయామాస సోమేన చ బుధేన చ ।
తతస్తాన్ సహసోత్థాయ రామచంద్రః కరేణ హి ॥ 18

శ్రుత్వా తేషాం హి నామాని విధేరాస్యాత్పృథక్ పృథక్ ।
తతః పప్రచ్ఛ వేగేన బ్రహ్మాణం పురతః స్థితమ్ ॥ 19

సర్వే కిమర్థమానీతా స్త్వత్రైతే సోమవంశజాః ।
వద త్వం కారణం శీఘ్రం సత్యమేవ మమాగ్రతః ॥ 20

తద్రామవచనం శ్రుత్వా రామం వేధా వచోఽబ్రవీత్ ।
రామ రామ మహాబాహో పాలయస్వాద్య మే వచః ॥ 21

రక్షస్వైతాన్ నృపానద్య వరదానాన్మమ ప్రభో ।
ద్వాపరాంతమజేయత్వం దత్తమస్తి మయా పురా ॥ 22

మమాస్త్రం సందధానం తం నివారయ కుశం సుతమ్ ।
ఇతి ద్వచనం శ్రుత్వా విహస్య రఘునాయకః ॥ 23

సభాయామాహ బ్రహ్మాణ మజేయత్వం త్వయోదితమ్ ।
క్వ గతం చాద్య సమరాత్కిమర్థమిహ చాగతాః ॥ 24

"ఓరోరి మూఢులారా! అల్పాయుష్షుగల వారవుచున్నారు, నామాట వినుడు, శ్రీరామునికి శరణాగతులై బ్రతకండి, లేనిచో తప్పక మరణించెదరు. ఈ రాముడు నాతండ్రియగు సాక్షాత్ నారాయణుడు. సందేహము లేదు." అని వారిని ఛీ కొట్టి, కుశునిజూచి "నాయనా! నేను శ్రీరామసన్నిధికి పోయివచ్చునంత వరకు నీవు బ్రహ్మాస్త్రమును ప్రయోగించితివేని నన్నుచంపిన వాడవగుదువు" అని చెప్పి, నలాదులతో కూడి రుద్రుని వెంటదీసికొని శ్రీరామసన్నిధికి వచ్చెను.

## బ్రహ్మ శ్రీరాముని ప్రార్థించుట.

సాంబమూర్తి వచ్చుట గమనించిన శ్రీరాముడు పుష్పకమునుండి దిగి వచ్చి, మొదట శివ స్వామికి నమస్కరించి, బ్రహ్మదేవునికి నమస్కరించి, వచ్చిన వారందరికి పూజ సత్కారములు గావించెను. పిదప బ్రహ్మదేవుడు శ్రీరామసభలో నలాదులతో గూర్చుని; బుధ, సోములతో జేరి

శ్రీరామునికి నమస్కరించెను. అప్పుడు శ్రీరాముడు వారిని త్వరగా లేవనెత్తి బ్రహ్మ వాక్యముచే సోమ, బుధాదుల పేర్లను తెలుసుకొని, "ఈ సోమాదులతో నీవేల యిచ్చటికి వచ్చితివి? యథార్థము చెప్పు" మని బ్రహ్మనడిగెను. "శ్రీరామా! మహాప్రభూ! ద్వాపరాంతమువరకు వీరికి అజేయత్వము వరము నాచే ఇంతకు మునుపు ఇవ్వబడినది. దానిని పరిపాలింపుము. బ్రహ్మాస్త్రమును సంధానము జేసియున్న కుశబాలకుని నివారింపుము." అని బ్రహ్మ వేడెను. అందుకా సభలో శ్రీరాముడు, "బ్రహ్మదేవా! నీవు వారికి అజేయత్వము నిచ్చితివి. అది యిపుడు యుద్ధమున ఎక్కడికిపోయె?" అనెను.

తద్రామవచనం శ్రుత్వా రామం ప్రాహ విధిః పునః ।
సర్వేషాం పురతో మేఽస్తి బలం న తు తవాఽగ్రతః ॥ 25

త్వం తు మే జనకః సాక్షాదతస్త్వాం ప్రార్థయామ్యహమ్ ।
తతో రామః పునః ప్రాహ విహస్య చతురాననమ్ ॥ 26

న శ్రోష్యతి వచో మేఽద్య కుశోఽయం యౌవనస్థితః ।
ప్రాయః కుమారా వృద్ధానాం వాక్యమగ్రే భజంతి న ॥ 27

అన్యచ్చాపి శృణుష్వ త్వం యచ్ఛాస్త్రేఽప్యుచ్యతే వచః ।
లాలయేత్పంచ వర్షాణి దశ వర్షాణి తాడయేత్ ॥ 28

ప్రాప్తే తు షోడసే వర్షే పుత్రం మిత్రవదాచరేత్ ।
అతస్తే బాలకాః సర్వే కుశాద్యాః స్వార్థతత్పరాః ॥ 29

న శ్రోష్యంతి వచో మేఽద్య తాన్గత్వా ప్రార్థయస్వ హి ।
తతః ప్రాహ పునర్బ్రహ్మ రణక్రోధాత్కుశో మయా ॥ 30

వాక్యం రమ్యం మంజులం చ నైవాద్య వదతి ప్రభో ।
తతః ప్రాహ విధిం రామః పునర్వాక్యం వినోదయన్ ॥ 31

విధే త్వం గచ్ఛ వాల్మీకిం స త్వాం యుక్తిం వదిష్యతి ।
తతః స రామవాక్యేన వాల్మీకిం పుష్పకే స్థితమ్ ॥ 32

మునిభిర్మునిశాలాయామ్ ఊర్ధ్వం సర్వైః స్థితం విధిః ।
నలాద్యైః సహితో గత్వా వృత్తం సర్వం న్యవేదయత్ ॥ 33

**వీధిమాహాథ వాల్మీకిః జ్ఞాత్వా రామమనోగతమ్ ।**
**స్త్రీలబ్ధజీవితాశ్చైతే భవంతు సుఖినస్త్వితి ॥ 34**

**నళాదీనాం స్త్రియః సర్వాః ప్రార్థయంతు విదేహజామ్ ।**
**కుశోఽపి జానకీవాక్యాచ్ఛాంతి మేష్యతి బాలకః ॥ 35**

**తథేతి తే నలాద్యాశ్చ దూతాన్ ప్రేష్యాఽథ సాదరమ్ ।**
**ఆనీయ స్వకళత్రాణి శతశస్తు తదా జవాత్ ॥ 36**

**జానకీం ప్రేషయామాసుస్తాః సర్వాః పార్థివస్త్రియః ।**
**ఉపాయనాని సంగృహ్య జానకీం ప్రయయుర్జవాత్ ॥ 37**

మరల బ్రహ్మదేవుడు "స్వామీ! అందఱియెదుట నాకు బలముగలదు. కానీ నీయెదుట లేదు. నాకు ప్రత్యక్షజనకుడవే, కావున ఇట్లు ప్రార్థించుచున్నాను." అని వేడగా, శ్రీరాముడు నవ్వి, "తరుణుడగు కుశుడు నామాట వినడు! ఇకమీద ప్రాయికముగా కుమారులు ముసలివాండ్రమాట వినరు! మరియు శాస్త్రవచనమును వినుము–

బిడ్డలను 5 సంవత్సరములవరకు లాలించవలయును. పిమ్మట 10 సంవత్సరములు శిక్షించునది. 14 వ సంవత్సరము రాగానే పుత్రుని మిత్రునిగా ఎంచవలయును. కావున కుశాది బాలకులందరును స్వార్థపరులుగా నుందురు, నామాటవినరు. వారినే ప్రార్థింపుము." అని శ్రీరాముడు చెప్పిన వేడుక పలుకులను వినిన బ్రహ్మ, "రణావేశమునందిన కుశుడు నా మాట ఆలకించడు. ప్రభువగు నీవు ఇంతకుమించి మాటను చెప్పలేదే" అని విలపించెను. పిదప శ్రీరాముడు వేడుక జేయుచు "బ్రహ్మా! నీవు వాల్మీకిని గలసికొనుము అతడు నీకు యుక్తిని జెప్పునుగాక!" అని యనుగ్రహించెను.

## బ్రహ్మ వాక్యముచే వాల్మీకి ఉపాయముజెప్పుట.

అపుడు బ్రహ్మదేవుడు నలాదులతో కలసి పుష్పకవిమానమున పయనించి, మునిశాలలో ఋషి సమూహమునందు అగ్రగణ్యుడైయుండు వాల్మీకి చెంతకు వెళ్ళి సంగతిని విన్నవించెను. అపుడు వాల్మీకిమహర్షి శ్రీరాముని యింగితము నెరిగి, బ్రహ్మతో, "వీరు స్త్రీ లబ్ధప్రాణులై సుఖింతురుగాక, నలాదుల పత్నులందరునువచ్చి జానకీదేవిని ప్రార్థించనీ. సీతావాక్యముచే కుశుడును శాంతినొందును." అని ఉపాయము జెప్పెను.

**దదృశుర్జానకీం నారీశాలాయాం స్వసఖీవృతామ్ ।**
**స్నుషాభిః సేవితపదాం పర్యంకే నిద్రితాం ముదా ॥ 38**

తతః స్త్రీః సమాగతాః సీతా దృష్ట్వా చామరవీజితా ।
మంచకాదవరుహ్యాథ ధృతపార్శ్వోపబర్హణా ॥ 39

స్వపృష్ఠే మంచకం కృత్వా సంస్థితాఽఽసీత్సఖీవృతా ।
స్నుషాభిర్వీజితాం రమ్యాం ప్రణేముస్తాం పరస్త్రియః ॥ 40

తాసాం సీమంత రత్నౌఘప్రభయా పాదపంకజే ।
విరేజతుస్తే సీతాయాశ్చిత్రరాగవిచిత్రితే ॥ 41

ఉపాయనాని సంగృహ్య తాభ్యః సా జనకాత్మజా ।
సమాలింగ్య నివేశ్యాథ తాః ప్రాహ సుస్వరం వచః ॥ 42

కిమర్థమాగతా యూయం మా భేతవ్యమితః పరమ్ ।
కథయధ్వం స్వీయమిష్టం యత్తద్వోఽయం కరోమ్యహమ్ ॥ 43

తదా తాః కథయామాసుః సర్వం వృత్తం సవిస్తరమ్ ।
దేహి కంకణదానాని కుశం యుద్ధాన్నివారయ ॥ 44

తథేతి జానకీ చోక్త్వా జ్ఞాత్వా రామమనోగతమ్ ।
నారీహస్తాన్మోచనీయాశ్చైతే నిర్జరవత్త్వితి ॥ 45

ఆరుహ్య శిబికాయాం సా తాభిర్యుక్తా కుశం యయౌ ।
తదా తం సాంత్వయామాస క్రోధం త్యజ కుశాధునా ॥ 46

నివర్తస్వ రణాదద్య శృణు మే వచనం శిశో ।
తథేతి జననీవాక్యాద్విహస్యాథ కుశస్తథా ॥ 47

మాత్రా తైర్బంధుభిర్యుక్తః సేనయా సంన్యవర్తత ।
పుష్పకం ప్రయయౌ సీతా నృపస్త్రీపరివేష్టితా ॥ 48

కుశోద్యాస్తే కుమారాశ్చ సభాయాం రాఘవం యయుః ।
తతో వాల్మీకినా బ్రహ్మో నలాద్యైః సహితస్తదా ॥ 49

సనిర్జరః సభాం గత్వా తస్థౌ శ్రీరాఘవాగ్రతః ।
కుశాద్యాస్తేఽపి శ్రీరామం ప్రణమ్య తస్య సన్నిధౌ ॥ 50

అలాగే అనిన బ్రహ్మదేవుడు చెప్పగా, ఆ నలాదులు దూతలను పంపి 106 మంది తమ భార్యలను పిలుపించి శ్రీసీతాదేవి వద్దకు బంపిరి. వారు తమ సఖులతో కానుకలను తీసుకొనివచ్చి స్త్రీల సభలో జానకమ్మకు కానుకలను అప్పగించిరి.

## సీతామాత మాటపై కుశుడు నలాదులను విడిచిపెట్టుట

కోడండ్రచే కొల్వబడుచు రాజోపచార రంజితయై మంచము మీదనున్న సీతాదేవి, వీరి రాకను గుర్తించి మంచముదిగి, నిలబడెను. కోడండ్రు చామరాదులతో సేవించుచుండిరి. అపుడు శత్రు పత్నులు సమస్కరించిరి. వారి శిరోరత్నప్రభలచే సీతాచరణ కమలములు చిత్రరాగ విచిత్రితములై ఒప్పుచుండెను. అంత ఆ జనకపుత్రి వారి కానుకలను స్వీకరించి, ఆలింగనాదులచే సత్కరించి, కూర్చుండుడని చెప్పి, సుశాంత మధుర స్వరముతో, "మీరేల వచ్చితిరి? ఇక భయపడవలదు. మీ కోరికను వెలిబుచ్చుడు ఇపుడే తీర్చెదను." అని పలికెను. వారు తమ సమాచారమును సర్వము విన్నవించి తల్లీ! మాకు కంకణదానమునిమ్ము. యుద్ధమునుండి కుశ మహారాజును నివారింపుము." అని ప్రార్థించిరి. అపుడు జానకీదేవి– ఈ రాజులు అబలలచే బ్రతుకింపబడవలయునని గదా శ్రీరాముని యిష్టమని తెలుసుకొని, పల్లకినెక్కి, ఆ స్త్రీలతో పాటు కుశుని వద్దకు వచ్చి, అతనిని శాంతునిజేసి "నాయనా! నామాటను ఆలకింపుము, సమర సంరంభమికచాలును." అని నివారించెను. అపుడు కుశుడు నవ్వి వైదేహీ వాక్యమువలన రణరంగమునువదలి తమ్ములతోను, సేనలతోను తన తల్లివెంట వచ్చెను. సీతాదేవి రాజపత్నులతో పుష్పకము జేరెను. కుశాది కుమారులు సభలో శ్రీరామసన్నిధికి చేరిరి. అంత ఆ బ్రహ్మ వాల్మీకితోను, నలాదులతోను, సురులతోను సభకు విచ్చేసి, శ్రీరాముని యెదుట నిలచెను. కుశాదులు తండ్రికి నమస్కరించి, వారి ఆలింగము పొంది, స్త్రీల నీరాజనములు అందుకొని సుఖముగా కూర్చుండిరి. (50)

**తస్థుస్తేనాలింగితాశ్చ స్త్రీభిర్నీరాజితా అపి ।**
**తదా రామో௨బ్రవీద్వాక్యం బ్రహ్మాణం సదసి స్థితమ్ ॥ 51**

**రణాన్నివర్తితా బాలాః కిమగ్రే తవ వాంఛితమ్ ।**
**న మే రాజ్యే ఛత్రపతిర్ద్వితీయో௨త్ర భవిష్యతి ॥ 52**

**కరణీయం నళాద్యైః కిం తద్వదస్వ సవిస్తరమ్ ।**
**తదా௨௨సనాదుత్థితః స వేధా రామాగ్రతః స్థితః ॥ 53**

**ఉవాచ మధురం వాక్యం సభాయాం రఘునందనమ్ ।**
**రామ రామ మహాబాహో భూభారశ్చ త్వయా హతః ॥ 54**

చిరకాలం కృతం రాజ్యం వైకుంఠం పాలయాధునా ।
కురు సత్యం వచో మేఽద్య దదస్వ హస్తినాపురమ్ ॥ 55

నలాదిభ్యస్త్వయోధ్యాయాం కుశో రాజ్యం ప్రశాసతు ।
తదా రామో విధిం ప్రాహ మమాత్యేతత్తు రోచతే ॥ 56

వైకుంఠం శ్వో గమిష్యామి సీతయా బంధుభిర్యుతః ।
దశవర్షసహస్రాణి ప్రోక్తమాయుర్యుగేఽత్ర హి ॥ 57

తన్మయా స్వీయసామర్థ్యాత్కృతమత్ర విధే మృషా ।
ఏకాదశ సహస్రాణి సమాస్త్వేకాదశైవ తు ॥ 58

తదైకాదశ మాసాశ్చ గతా మే దివసా అపి ।
శేషమాయుశ్చ కించిన్మే తచ్ఛుకః పూర్ణం భవిష్యతి ॥ 59

ద్వాదశాయాం ఘటికాయాం సోఽహం వైకుంఠ మాశ్రయే ।
తతో విధిం కుశః ప్రాహ నలాద్యా యది మాం విధే ॥ 60

దాస్యంతి కరభారం మే తర్హి తిష్ఠతు చాత్ర తే ।
మదాజ్ఞాం పాలయంత్వేతే తవ వాక్యాత్సురక్షితాః ॥ 61

ఛత్రహీనాః సుఖం త్వద్య వసంతు హస్తినాపురే ।
తద్వాక్యం స విధిః శ్రుత్వా పునః ప్రాహ కుశం ప్రతి ॥ 62

ఛత్రమజ్ఞాపయస్వైతాంస్తవాజ్ఞావశవర్తినః ।
దాస్యంతి కరభారం త్వాం మమ వాక్యం హి పాలయ ॥ 63

## అజమీడునికి హస్తినాపురమున పట్టాభిషేకము.

పిదప బ్రహ్మను "చారులు కలహమును మానిరి. ఇక నీ ఇష్టమేమి? నా రాజ్యమున మరియొకడు ఛత్రపతి లేడు. నలాదులకేమి పని? నిరూపింపుము. అని శ్రీరాఘవుడు అడుగగా, బ్రహ్మదేవుడు, "స్వామీ! చిరకాలము రాజ్యమును ఏలితివి. ఇక వైకుంఠమును అలంకరించి పాలింపుము. నా మాటను సత్యమనిపింపుము. నలాదులకు హస్తినపురిని అనుగ్రహింపుము. అయోధ్యలో కుశుడు మహారాజై యుండని," అని ప్రార్థించెను. అందుకు శ్రీరాముడు, "నాకు ఇది సమ్మతమే సపరివారుడుగా

రేపు వైకుంఠమునకు బయలుదేరుదును. ఈ త్రేతాయుగమున 10,000 సంవత్సరములు మానవ ఆయుష్షుగదా? వానినందరిని అతిక్రమించి, నాశక్తిచే దానిమీద 1,010 సంవత్సరముల, 11 నెలల, 11 దినములు అనుభవించితిని. మిగిలిన నా ఆయుష్షు రేపటితో పూర్ణమగును. ఇక నుండి 11 గడియలలో వైకుంఠమునకు వెళ్ళెదను," అని సమ్మతించెను. అపుడు కుశుడు బ్రహ్మతో, "పరమేష్ఠీ! సోమకులు నాకు కప్పము సమర్పించునట్లైనచో నిచట నా ఆజ్ఞను పాలించుచు ఛత్రహీనులై సుఖముగా ఉండవచ్చును," అని వివరించెను.

**తథేతి స కుశః ప్రాహ విధిం కించిత్ స్మితాననః ।**
**అథ తే సోమవంశస్థా నృపాః సర్వే విధిం తదా ॥ 64**

**ప్రోచుర్వయం త్వయా స్త్రీభిర్యాస్యామో దివమద్య వై ।**
**అజమిఢోఽద్య నృపతిర్భవత్వత్ర గజాహ్వయే ॥ 65**

**తథేతి తాన్ విధిశ్చోక్త్వా సభాయాం సముపావిశత్ ।**
**అథ బ్రహ్మాఽజమీఢాయ బ్రాహ్మణైరభిషిచ్య చ ।**
**గజాహ్వయే చ రాజానం చకార రాఘువాజ్ఞయా । 66**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, సోమ సూర్య వంశజయో మైత్రీకరణం నామ చతుర్థః సర్గః ॥**

అందుకు బ్రహ్మదేవుడు "కుశా! వీరికి ఛత్రమును ఆజ్ఞాపింపుము. నీ ఆజ్ఞకులోబడి కానుకలు అర్పించుచుందురు. నామాటవినుము!" అని చెప్పెను. కుశుడును నవ్వుచు ఆమోదించెను. అపుడు నలాదులు బ్రహ్మ దేవునిని "ఇప్పుడే నీవెంబడి మేము మా పత్నులతోడ వచ్చుచున్నాము. ఈ గజపురిలో అజమీడుడు రాజుగా రాజిల్లునుగాక" అని ప్రార్థించిరి. చతుర్ముఖుడును సరేయని శ్రీరామాజ్ఞచే అప్పుడే బ్రాహ్మణులమధ్యన అజమీఢుని రాజుగా అభిషేకించి హస్తినావతీ సింహాసనపట్టము గట్టి రాజన్యుని చేసెను. (4)

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
సోమ సూర్య మైత్రిని వర్ణించు 4వ సర్గ ముగిసినది.

# పంచమః సర్గః-5వ సర్గ

శ్రీరాముడు అందరిని వదిలివేయుట

శ్రీరామదాస ఉవాచ

అథ రామం సుషేణశ్చ సుగ్రీవశ్చ విభీషణః ।
వానరాః ప్రార్థయామాసుః వయం రామ త్వయా దివమ్ ॥ 1

యాస్యామో నాత్ర జీవామస్త్వయా రామ వినా భువి ।
దదస్వాజ్ఞాం త్వయా గంతుం తథాహ రాఘవోఽపి సః ॥ 2

విభీషణ త్వయా స్థేయం లంకాయాం మమ వాక్యతః ।
ప్రచరిష్యతి యావన్మే రామనామావనీతలె ॥ 3

త్వం గచ్ఛాద్యైవ మే వాక్యాత్తథేతి స విభీషణః ।
నత్వా రామం యయౌ లంకాం రాఘవేణాతిమానితః ॥ 4

తతః ప్రాహ జాంబవంతం రాఘవః పురతః స్థితమ్ ।
హే జాంబవన్ త్వయా స్థేయం యావద్భూమ్యాం కథా మమ ॥ 5

ప్రచరిష్యతి తావచ్చ ద్వాపరాంతే పునర్మమ ।
భవిష్యతి దర్శనం తే గచ్ఛాద్యైవ సుఖం వస ॥ 6

త్వయా కృతం యత్సాహాయ్యం లంకాయాం మే వనేఽపి చ ।
అతస్త్వం శ్వశురో భూత్వా ద్వాపరే ఖ్యాతిమేష్యసి ॥ 7

## శ్రీరాముడు తన పరివారమును వదిలివేయుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, పిదప సుషేణుడు, సుగ్రీవుడు, విభీషణుడు, వానరులు, "శ్రీరామచంద్రస్వామీ! నిన్ను వదలి మేము ఈ భూమిపై ఉండలేము, నీవెంబడే వచ్చుటకు అంగీకరించుము" అని ప్రార్థించిరి. అందుకు శ్రీరాముడు "విభీషణా! నీవు నా మాట ప్రకారము ఈ భూమిపై రామనామము ఉండునంత వరకు లంకలో ఉండుము. ఇప్పుడే త్వరగా లంకకు పొమ్ము," అని ఆజ్ఞాపించెను. విభీషణుడు అట్లే అని శ్రీరామునికి నమస్కరించి, లంకకు వెళ్ళెను. ఆ తరువాత శ్రీరాముడు జాంబవంతుని జూచి, జాంబవంతుడా! భూమిపై నా కథ ఉన్నంత వరకు నీవును

ఉండవలయును. ద్వాపరాంతమున మరల నీకు నాదర్శనమగును, ఇప్పుడే బయలుదేరి సుఖముగా ఉండుము. నీవు నాకు శ్రీలంకలోను, **రెండవ ముద్రణకోసం సిద్ధచేసిన ప్రతి**వనమునను జేసిన సహాయమునకై ద్వాపరయుగమున నాకు నీవు పిల్లనిచ్చిన మామవై ఖ్యాతి నందుదువు" అనెను. జాంబవంతుడు సీతారాములకు నమస్కరించి, రాముని చే సత్కరింపబడి వెడలెను.

**తథేతి రామవచనాద్రామం సీతాం ప్రణమ్య సః ।**
**జాంబవాన్నిర్యయౌ శీఘ్రం రాఘవేణాతిపూజితః ॥ 8**

**రామః ప్రాహ హనూమంతం వత్స తిష్ఠ యథాసుఖమ్ ।**
**యదా సేతౌ పణస్పే హి ద్వాపరాంతేఽర్జునేన వై ॥ 9**

**భవిష్యతి శరైః సేతుం కర్తుం మే దర్శనం తదా ।**
**త్వం భవిష్యసి గచ్ఛాద్య సుఖం వస భజస్వ మామ్ ॥ 10**

**తద్రామవచనం శ్రుత్వా నత్వా రామం చ లక్ష్మణమ్ ।**
**సీతాం ప్రణమ్య హనుమాన్ గమనాయోపచక్రమే ॥ 11**

**తతో రామో నిజాత్కంఠాన్నవరత్నవిభూషితమ్ ।**
**హారం దదౌ తథా సీతా తం దదౌ బాహుభూషణే ॥ 12**

**తతో నత్వా రామచంద్రం సార్ద్రనేత్రః స మారుతిః ।**
**పరిక్రమ్య యయౌ వేగాత్తప్తుం తు హిమపర్వతమ్ ॥ 13**

**తతోఽంగదం రామచంద్రః పూజ్య వస్త్రాదిమండనైః ।**
**ప్రేషయామాస కిష్కింధాం శృంగబేరం తు గూహకమ్ ॥ 14**

**పాతాళం ప్రేషయామాస రాఘవో మకరధ్వజమ్ ।**
**వస్త్రాదిభిస్తోషయిత్వా సుహృదః స్వస్థలాని హి ॥ 15**

**తతో రామః సమాహూయ యూపకేతుం మహామనాః ।**
**వస్త్రాదిభిస్తోషయిత్వా విదిశానగరం ప్రతి ॥ 16**

**ప్రేషయామాస సైన్యేన సోఽపి నత్వా రఘూత్తమమ్ ।**
**జానకీం చ యయౌ వేగాత్ స్త్రీపుత్రైః పరివారితః ॥ 17**

**ఏవం రామః సుబాహుం తం మథురాం ప్రేషయత్తదా ।**
**ఏవం రామః పుష్కరం చ ప్రేషయామాస బాలకమ్ ॥ 18**

**సైన్యేన పుష్కరావత్యాం తక్షం తక్షశిలాహ్వయే ।**
**తతోఽంగదం గజాశ్వం తం ప్రేషయామాస రాఘవః ॥ 19**

**ధనరత్నం చిత్రకేతుం స్త్రీపుత్రబలవాహనైః ।**
**ప్రేషయామాస శ్రీరామః తోషితం వసనాదిభిః ॥ 20**

**తతో లవం సమాహూయ ససీతో రఘునందనః ।**
**వస్త్రాలంకారయానాద్యైస్తోష్య స్త్రీపుత్రసంయుతమ్ ॥ 21**

శ్రీరాముడు, "ఆంజనేయా! యథాసుఖముగా ఉండుము! ద్వాపరాంతమున ఎప్పుడు అర్జునునితో నీకు శరసేతు విషయక ప్రతిజ్ఞ కలుగునో అప్పుడు మరల నన్ను చూచెదవు. సుఖముగాపోయి నన్ను భజించు చుండుము" అని పలుకగా ఆంజనేయుడు శ్రీసీతా, రామ, లక్ష్మణులకు నమస్కరించి బయలుదేరుచుండగా, శ్రీరాముడు మారుతి కంఠమును నవరత్న హారముతో అలంకరించెను. సీతాదేవి తన భుజాలంకారములను ఇచ్చెను. వాటిని స్వీకరించిన హనుమ వారికి ప్రదక్షిణ నమస్కారములు జేసి తపము జేయుటకై హిమవంతమునకు బయలుదేరెను.

పిదప శ్రీరాముడు అంగదుని అంగవస్త్రాభరణాదులచే సత్కరించి కిష్కింధకును, గుహుని శృంగబేరమునకును, మకరధ్వజుని పాతాళమునకు, మిత్రులను వారివారి స్థలములకును పంపించి, యూపకేతువును పిలిచి వస్త్రాభరణాదులనిచ్చి, స్త్రీ పుత్ర పరివార సైన్యములతో విదిశా నగరమునకు పంపించెను. అట్లే సుబాహువును మథురకును, పుష్కరుని పుష్కరావతికి, తక్షుని తక్షశిలా నగరమునకును, అట్లే- అంగద, గజ, అశ్వ, ధనరత్న, చిత్రకేతువులనుగూడ పంపెను. వారందరును వస్త్రాది విభూషణంబులను పొంది శ్రీసీతారాములకు నమస్కరించుచు వెడలిరి. పిదప శ్రీరాముడు లవుని పిలిచి ఉత్తర కురుభూములకు వెళ్ళమనెను. అతడు విశేష భూషణాదికాలను పొంది, పుత్ర పరివారముతో పోవునపుడు సీతాదేవి సంతోషముతో అతనికి కామధేనువునిచ్చెను.

**ఉత్తరేషు కురుష్వత్ర ప్రేషయామాస సేనయా ।**
**కామధేనుం దదౌ సీతా లవాయ వ్రజతో ముదా ॥ 22**

**తతః కుశం సమాహూయ రామః స్త్రీపుత్రసంయుతమ్ ।**
**ప్రేషయామాస సాకేతం సైన్యేన పార్థివైర్యుతమ్ ॥ 23**

దత్వాస్వీయాని శస్త్రాణి కోదండం చ మహోజ్వలమ్ ।
నానాయానాని వస్త్రాణి రామశ్చింతామణిం దదౌ ॥ **24**

సస్త్రీపుత్రం కుశం తోష్య రాఘవో వాక్యమబ్రవీత్ ।
వత్స గచ్ఛ సుఖం తిష్ఠ భూమిం ధర్మేణ పాలయ ॥ **25**

జంబూద్వీపనృపాన్ సర్వాంస్తథా ద్వీపాంతరస్థితాన్ ।
సర్వానేతాన్ పాలయస్వ పుత్రవత్కుశబాలక ॥ **26**

ఇత్యుక్త్వా తన్నృపాన్ ప్రాహ యుష్మాభిః కుశబాలకః ।
మత్స్థానే మాననీయోఽయం రక్షణీయస్త్వహర్నిశమ్ ॥ **27**

తద్రామవచనం శ్రుత్వా నృపాః ప్రోచూ రఘూత్తమమ్ ।
త్వత్తేజాః పూరితో బాలస్త్వత్తోఽస్మాకం శతాధికః ॥ **28**

అస్త్యేవ నాత్ర సందేహః సత్యం విద్ధి రఘూత్తమ ।
యథా త్వయా పాలితాః స్మో వయం తద్వత్కుశోప్యయమ్ ॥ **29**

రక్షిష్యతి సదాఽస్మాకం దృష్టోఽబాలపరాక్రమః ।
ఇత్యుక్త్వా రాఘవం నత్వా సర్వే తే పార్థివోత్తమాః ॥ **30**

రామేణ పూజితాః సమ్యక్ వస్త్రాలంకారవాహనైః ।
యయుః కుశం పురస్కృత్య స్వస్వసైన్యసమన్వితాః ॥ **31**

కుశోఽపి రాఘవం నత్వా మూర్ధ్ని సీతాఽవఘ్రాపితః ।
వసిష్ఠేన రథే స్థిత్వా పురీం గంతుం ప్రచక్రమే ॥ **32**

తదా రామస్తం రజకం మంథరాం ప్రేషయత్పురీమ్ ।
కుశేన సహ వేగేన సమాహూయాథ సాదరమ్ ॥ **33**

పూర్వవైరమనుస్మృత్య నాభ్రం యాతామధర్మిణౌ ।
కృష్ణావతారే తావేవ రజకో రజకోఽభవత్ ॥ **34**

**మంథరా పూతనా జాతా హతౌ తౌ పూర్వవైరతః ।**
**తతః కుశః సార్ద్రనేత్రః పశ్యన్ రామం చ జానకీమ్ ॥ 35**

తరువాత రాఘవుడు కుశుని పిలిచి, తనశస్త్రములను, మహాధనస్సులను, వివిధ వాహనములను, చింతామణి రత్నమును, దివ్య వస్త్రాలను అతనికిచ్చి సంతోషపరచి, "వత్స! పొమ్ము, సుఖముగా నుండుము, ధర్మముతో ధరణిని పాలింపుము, జంబూద్వీపాది అఖిల ద్వీపములలోని రాజుల నందరిని బిడ్డలవలె రక్షింపుము." అని చెప్పి, సాకేత రాజధానియగు అయోధ్యకు పంపెను. అపుడు శ్రీరామ వచనములను విన్న రాజులందరును మహాప్రభూ! నీ తేజస్సుతో నిండియుండు కుశ బాలకుడితడు, నీకన్న మాకు నూరింతలధికుడగును. సందేహములేదు, ఇది సత్యము. నీవు పాలించినట్లే ఇతడును మమ్ము పరిరక్షించుచున్నాడు," అని కొనియాడి సత్కరింపబడి, కుశుని వెంట సేనలతో వెడలిరి.

కుశుడు శ్రీరామునికి నమస్కరించి, సీతాదేవిచే శిరము ఆఘ్రాణింపబడి వసిష్ఠునితో రథమునెక్కి, ప్రయాణము కాగా; శ్రీరాముడు రజకుని, మంథరను పిలుపించి, కుశుని వెంట త్వరగా పంపించెను. వారిని పూర్వవైర స్మరణచే శ్రీరాముడు వైకుంఠమునుకు తీసుకువెళ్ళలేదు. మరి వారు అధార్మికులు కావుననే కృష్ణావతారములో రజకుడు-రజకుడుగా, మంథర-పూతనగా జన్మించి హతులయిరి.

**పరివర్త్య ముఖం పృష్ఠే వారం వారం రథే స్థితః ।**
**గచ్ఛ గచ్ఛేతి రామేణ సీతయాఽపి నిజైః కరైః ॥ 36**

**సూచితః సన్యయౌ సైన్యైర్వేష్టితః స్వపురీం ప్రతి ।**
**దదర్శ నగరీం శూన్యాం శ్రీరామవిరహాతురామ్ ॥ 37**

**గత్వా పుర్యాం మహోత్సాహైర్నిజసింహాసనస్థితః ।**
**పూజ్య సర్వాన్ పార్థివాంశ్చ సమాలింగ్య వ్యసర్జయత్ ॥ 38**

**తేఽపి నత్వా కుశం స్వం స్వం స్థలం జగ్ముర్నృపోత్తమాః ।**
**కరభారం దదుస్తస్మై తదాజ్ఞావశవర్తినః ॥ 39**

**మంథరారజకౌ ద్వౌ తౌ దైవాత్పుర్యా బహిర్మృతౌ ।**
**ప్రాపతుర్జన్మ సాకేతే మృతానాం న పునర్భవః ॥ 40**

**అథ రామోఽబ్రవీత్సర్వాన్ వానరాన్ జాహ్నవీతటే ।**
**మదర్థం భ్రమితాః సర్వే యూయం వానరసత్తమాః ॥ 41**

ద్వాపరాగ్రే పునః సర్వే వ్రజే గోపా భవిష్యథ ।
యుష్మాభిః సహితః ప్రీత్యా కరిష్యామ్యశనాదికమ్ ॥ 42

తదాఽబ్రవీత్స సౌమిత్రిం రామః ప్రీత్యా పురః స్థితమ్ ।
మహాన్ శ్రమః కృతః పూర్వం సేవాయాం మమ దండకే ॥ 43

భవ త్వం ద్వాపరే జ్యేష్ఠః శుశ్రూషాం తే కరోమ్యహమ్ ।
తతస్తాన్ రాఘవః ప్రాహ ఋక్షాన్ పౌరాన్ కపీనపి ॥ 44

సర్వానేవ మయా సార్ధం ప్రయాతేతి దయాన్వితః ।
తతో దదౌ కల్పవృక్షపారిజాతౌ సురాధిపమ్ ॥ 45

తతస్తం పుష్పకం ప్రాహ కుబేరం వహ సాదరమ్ ।
గచ్ఛాద్యైవ తథేత్యుక్త్వా రామం నత్వా తు పుష్పకమ్ ॥ 46

సీతాం దృష్ట్వా యయౌ శీఘ్రం రాఘవేణాఽతిమానితమ్ ।
తతః ప్రాహ రఘుశ్రేష్ఠశ్చోర్మిలా మాండవీం తథా ॥ 47

కండ్లనిండా నీరునిండిన కుశుడు, సీతారాములను పలుమార్లు చూచుచు, మోముద్రిప్పి రథమును ఎక్కెను, "పొమ్ము, పొమ్ము" అని సీతారాముల కరసంకేతములను అవలోకించుచు విధిలేక సేనతో కూడి అయోధ్యకు వచ్చెను.

అయోధ్యకు చేరి శూన్యమైన నగరమును చూచి చింతిస్తూ, రాజపరివారముతో సింహాసనము నెక్కి, కానుకలను స్వీకరించి, వారినందరిని సత్కరించి, వారివారి నెలవులకు పంపి, సుఖముగా నుండెను. దైవవశమున రజకుడును, మంథరయును అయోధ్యకు జేరకమునుపే దారిలో మృతులయిరి. ఎందువల్లననిన అయోధ్యలో మృతినొందిన జన్మము లేదు.

హస్తినలో శ్రీరాముడు వానరులతో "మీరందరును నాకు మిక్కిలి సహాయముజేసితిరి. కావున మీరు ద్వాపరాంతమున గోపాలురై జన్మించవలయును. నేను మీతో యథేష్టముగా భోజనాదికముల ను ఆచరించెదను." అని యనుగ్రహించెను.

పిదప లక్ష్మణునితో "తమ్ముడా! నీవు నాకై దండకారణ్యములో ఎంతో శ్రమపడితివి. ద్వాపరాంతమున నీవు నాకు అన్నవు అగుదువుగాక! నిన్ను నేను సేవించెదను" అని వరమొసగి అందరిని జూచి, "మీరందరూ నాతోరండి" అ దయానిధి అనుజ్ఞనిచ్చి, పారిజాత కల్పవృక్షములను ఇంద్రునకిచ్చి, పుష్పకవిమానమును జూచి మూర్తీభవించిన తద్దేవతకు "సాదరముతో కుబేరుని

వహింపుము, నేడే వెడలుము," అని అనుజ్ఞనిచ్చెను. శ్రీరాముని ఆజ్ఞానుసారము పుష్పకవిమానము శ్రీరామునికి నమస్కరించి, సీతవద్ద శలవు వేడి, రాఘవునిచే సన్మానింపబడి, త్వరగా కుబేరుని వద్దకు వెడలెను.

**శ్రుతకీర్తిం సమాహూయ వాల్మీకేశ్చ మునేః పురాః ।**
**యుష్మాభిర్ భర్తృదేహైశ్చ నిజదేహాది వేగతః ॥ 48**

**శ్వోఽగ్నౌ దగ్ధ్వా స్వర్గలోకం గంతవ్యం మమ వాక్యతః ।**
**తథేతి రాఘవం ప్రోచుస్తదా తాశ్చోర్మిలాదికాః ॥ 49**

**రామం నత్వా యయుః సర్వాః స్వం స్వం తద్వసనగృహమ్ ।**
**అథ రామోఽపి తాం రాత్రిం సీతయా రుక్మమంచకే ॥ 50**

**ఋషిభిః శివబ్రహ్మాద్యాస్తస్యుస్తత్రైవ సంగతాః ।**
**సౌమిత్రాద్యాః పత్నీభిః శిశ్యరే పరయా ముదా ॥ 51**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, సర్వేషాం విసర్జనం నామ పంచమః సర్గః ॥**

పిదప శ్రీరాముడు వాల్మీకిమునీంద్రుని యెదుట– ఊర్మిళా, మాండవి, శ్రుతకీర్తులను పిలిపించి "నేను చెప్పినట్లు మీరు రేపటిదినమున పతుల దేహములతోడ సహగమన విధిననుసరించి స్వర్గము నందవలయును" అని చెప్పెను. వారును సన్మానించి నమస్కరించి, తమతమ గూడారములకు వెళ్ళిరి. పిదప శ్రీరామప్రభువు జనకపుత్రితో కనక పర్యంకము నెక్కి ఆరాత్రి గడపెను.

శంకరాది దేవతలు మునీంద్రులతో అచ్చటనే వసించిరి. లక్ష్మణాదులు తమభార్యలతో ఆ రాత్రి సుఖక్రీడలనందుచుండిరి.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
శ్రీరాముడు అందరిని వదిలివేసే విషయమును తెలుపు, 5వ సర్గ ముగిసినది.

# షష్ఠః సర్గః–6వ సర్గ

## శ్రీరాముని వైకుంఠారోహణము

శ్రీరామదాస ఉవాచ

అథ రామః సముత్థాయ ప్రభాతే సీతయా సహ ।
అజమీఢం సమాహూయ మంజులం వాక్యమబ్రవీత్ ॥ **1**

అద్యాహం సీతయా స్వీయం పదం గచ్ఛామి బంధుభిః ।
వానరైః సకలైః పౌరైస్త్వయా శేషం తు యజ్జలమ్ ॥ **2**

వస్త్రగృహాదికం సర్వం ప్రేషణీయం కుశం ప్రతి ।
యచ్చరం కీటకాంతం తన్మయా యాస్యతి వై దివమ్ ॥ **3**

అతస్త్వం తం కుశం గత్వా సర్వం వృత్తం నివేదయ ।
కరోత్యుత్తరకార్యాణి కుశోఽస్మాకం సవిస్తరమ్ ॥ **4**

మా కరోతు కుశోఽస్మాకం ఖేదం తం త్వం నివారయ ।
ఇతి రామవచః శ్రుత్వా సాశ్రునేత్రస్తథేతి సః ॥ **5**

అజమీఢస్తదా ప్రాహ ననామ రఘునాయకమ్ ।
అథ రామః శనైః పౌరైః స్నాత్వా భాగీరథీజలే ॥ **6**

కృత్వా నిత్యవిధిం పూర్వం హుత్వా వహ్నిం సవిస్తరమ్ ।
దదౌ దానాన్యనేకాని గంగాసైకత సంస్థితః ॥ **7**

తతః ప్రాస్థానికం కర్మ చకార స యథావిధి ।
వహ్నిం విసర్జయామాస వైకుంఠం ప్రతి రాఘవః ॥ **8**

తదా రామస్య పద్మా సా గతా దక్షిణహస్తతః ।
మూర్తిరూపధరా వేదా వైకుంఠమాయయుస్తదా ॥ **9**

### శ్రీరాముడు వైకుంఠమునకు పయనించుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "తరువాత ఆ మరునాడుదయమున సీతతోడ మేల్కొని అజమీఢుని పిలిచి, "నేడు నేను సీతతోడ లక్ష్మణాదులను, వానరులను, సమస్తపౌరులను వెంటదీసికొని

నా ధామమునకు వెడలుచున్నాను. జడమగు వస్త్ర, గృహాది వస్తువులనన్నిటిని కుశునికి పంపవలయును. కీటకము మొదలు అందరూ నాతోపాటు స్వర్గమునకు వచ్చునుగదా? కావున నీవు కుశునివద్దకు పోయి జరిగిన సకల వృత్తాంతమును దెలుపుము, సవిస్తరముగా ఉత్తరకార్యములను మాకొరకు అతడు చేయును. మమ్ముగూర్చి దుఃఖింపక యుండునట్లు నీవతనిని ఓదార్చుము," అని మెల్లగా చల్లని పలుకులు పలికె. అందుకు అజమీఢుడు కన్నీరు గార్చుచు, అట్లే చేయుదునని నమస్కరించెను.

పిదప శ్రీరాముడు జనులతోపాటు గంగానదిలో మంగళ స్నానముజేసి, నిత్యకర్మలను నిర్వర్తించి, అగ్నులకు ఆహుతులనిచ్చి, గంగాతీరమునందు అనేకదానములు చేసి, యథావిధిగా మహాప్రాస్థానిక కర్మగావించి, అగ్నిని వైకుంఠమునకు పంపించెను. అపుడు శ్రీరాముని చేతినుండి పద్మము మూర్తీభవించి వైకుంఠమునకు వెళ్ళెను. వేదములు ప్రత్యక్షరూపము దాల్చి వైకుంఠమునకు వెళ్ళెను.

త్రిపదా ప్రణవేనైవ శ్రీరామాస్యాద్వినిర్గతా ।
నత్వా రామం యయౌ శాంతిః క్షమా మేధా ధృతి ర్దయా ॥ **10**

తేజో బలం యశః శౌర్యం యయౌ సర్వం తదా పురః ।
తతః పౌరా వానరాశ్చ సర్వే భాగీరథీజలే ॥ **11**

స్నాత్వా నిరుధ్య వాయూంశ్చ నిజదేహాని నిత్యజుః ।
అథ రామో ముదా గంగాం స్పృష్ట్వా దర్భాసనోపరి ॥ **12**

దర్భపాణిః స్థితస్తూష్ణీముత్తరాభిముఖః స్త్రియా ।
తావత్సర్వే దదృశుస్తే దేవా విష్ణుః పురః స్థితమ్ ॥ **13**

చతుర్భుజం నీలకాంతిం పీతకౌశేయధారిణమ్ ।
కౌస్తుభాంకితహృద్దేశం శ్రీవత్సాంకోపశోభితమ్ ॥ **14**

సీతా బభూవ సా లక్ష్మీర్విష్ణోర్వామాంగసంస్థితా ।
శేషో బభూవ సౌమిత్రిః ఫణాభిరతిభాసురః ॥ **15**

శంఖో బభూవ భరతః శ్రీవిష్ణో సవ్యసత్కరే ।
వామే కరే బభూవాథ శత్రుఘ్నశ్చ సుదర్శనమ్ ॥ **16**

దేవేషు వివిశుః సర్వే వానరాస్తే క్షణాత్తదా ।
చాండాల కృమికీటాంతా అయోధ్యాపురవాసినః ॥ **17**

ప్రాపుస్తే దివ్యదేహాని విమానే సంస్థితా బభుః ।
తదా నినేదుర్వాద్యాని దేవానాం గగనాంగణే ॥ **18**

వవర్షుర్దేవపత్న్యశ్చ పుష్పవృష్టిభిరాదరాత్ ।
ననృతుర్వై హ్యప్సరసో జగుర్గంధర్వకిన్నరాః ॥ **19**

ప్రణనామ తదాతార్‌క్ష్యః శ్రీవిష్ణు రవిభాసురమ్ ।
దేహాని ముముచుః సర్వే స్త్రీభిః సోమాదికాశ్చ తే ॥ **20**

పతిదేహాని చాలింగ్య తదా తా ఊర్మిలాదికాః ।
దేహాన్యగ్నౌ జహుః సర్వా రమ్యే భాగీరథీతటే ॥ **21**

ప్రణవముతోపాటు గాయత్రీమంత్రము శ్రీరాముని ముఖమునుండి వెలువడెను. క్షమ, శాంతి, మేధ, ధృతి, దయ, తేజస్సు, బలము, యశస్సు మొదలగునవి మూర్తిమంతములై వచ్చి శ్రీరామునికి నమస్కరించి స్వర్గమునకు పోయెను. అపుడు పౌరులు, వానరులు, అందరును జాహ్నవిలో అవగాహన స్నానముచేసి ప్రాణాదివాయువులను నిరోధించి, యోగబలముతో తమ దేహములను వదిలిరి. పిదప శ్రీరాముడు సంతోషముగా గంగను స్పృశించి, దర్భాసనముమీద పవిత్ర పాణియై, సీతతోడ ఉత్తరాభిముఖుడుగా ఊరకే కూర్చుండెను.

## శ్రీరాముని మొదలు క్రిమికీటకాదులు సైతం వైకుంఠమునకు వెళ్ళుట

ఆ సమయానికి దేవతలందరును ప్రత్యక్షమగు విష్ణుమూర్తిని ఇట్లు దర్శించిరి. చతుర్భుజుడు, నీలద్యుతి, పీతాంబరధారి, కౌస్తుభాంకిత వక్షుడు, శ్రీవత్సాంకితుడు, దివ్యానందరూపుడైయుండ ఎడమప్రక్క సీత–లక్ష్మియై మెరయుచుండెను. లక్ష్మణుడు–ఆదిశేషుడయ్యె. భరత, శత్రుఘ్నులు–శంఖ, చక్రాకృతులై కుడి, ఎడమ చేతులలో నిలచిరి. క్షణమాత్రమున అంశావతరణములను పొందియున్న వానరులందరూ ఆయా దేవతలలో జేరిరి. చాండాల, క్రిమికీటాంతముగా అయోధ్యా వాసులు దివ్యదేహాలు దాల్చి విమానమునెక్కి రారాజించిరి. ఆకాశ వీధిలో దేవదుందుభులు మ్రోగుచుండెను. దేవకాంతలు పుష్పవృష్టి కురిపించిరి. అప్సరసలాడిరి. కిన్నర గంధర్వులు పాడిరి, గరుడుడువచ్చి భాస్కరుని వలె భూసురుడగు శ్రీవిష్ణువునకు నమస్కరించెను. ఆ సోమాదులును తమ పత్నులతో పాటు దేహములను వదలిరి. ఊర్మిళాదులు అందరును పతుల దేహములను హత్తుకొని గంగాతీరమున అగ్నిలో తమ దేహములను వదలిరి.

అథ తా దేవపత్న్యశ్చ రత్నదీపైః సహస్రశః ।
విష్ణుం నీరాజయామాసుర్లక్ష్మీయుక్తం మహాభుజమ్ ॥ 22

విష్ణుస్తతోఽబ్రవీద్వాక్యం వేధసం మంజులం శనైః ।
అయోధ్యావాసినః సర్వే తిర్యఙ్మాత్రాదయః శుభాః ॥ 23

ఏతే సమాగతా బ్రహ్మన్నేషాం స్థానం వదాధునా ।
తద్విష్ణోర్వచనం శ్రుత్వా తదా బ్రహ్మాబ్రవీద్వచః ॥ 24

మల్లోకాదుపరిష్టాచ్చ లోకాన్సాంతానికాంఛుభాన్ ।
ఏతే యాంతు జనాః సర్వే త్వద్దర్శనమహోజ్జ్వలాః ॥ 25

తతః ప్రాహ మునిర్విష్ణురయోధ్యాయాం మృతాశ్చ యే ।
అగ్రే తేఽపి సమాయాంతు లోకాన్సాంతానికాంచుభాన్ ॥ 26

తథేతి స విధిః ప్రాహ మహావిష్ణుం ముదాన్వితః ।
తతస్తే దివ్యదేహాశ్చ సాకేతపురవాసినః ॥ 27

నానావిమానసంస్థాశ్చ దివ్యవస్త్రవిభూషితాః ।
దివ్యాలంకారసంయుక్తా హ్యప్సరోభిర్విలేపితాః ॥ 28

నానాసుగంధగంధాద్యైర్దివ్యచామరవీజితాః ।
విరేజుర్గగనే చంద్రవదనా రవిభాసురాః ॥ 29

తతో బ్రహ్మాదయో దేవాః ప్రణేముర్విష్ణుమాదరాత్ ।
తుష్టువుర్వివిధైః స్తోత్రైర్వేదఘోషైర్మునీశ్వరాః ॥ 30

తదా తుష్టావ శంభుస్తం విష్ణుం త్రైలోక్యపాలకమ్ ।
వనమాలాం దధానం తం దివ్యచందనచర్చితమ్ ॥ 31

## అయోధ్యలో మరణము-దివ్యలోక ప్రాప్తి

దేవపత్నులు వేలకొలది రత్నదీపములతో శ్రీలక్ష్మీ నారాయణులను అర్చించిరి (22). అంత ఆ శ్రీవిష్ణుమూర్తి బ్రహ్మతో "అయోధ్యా వాసులందరు, పశుపక్ష్యాది క్రిమికీటకాదులును, శుభులు వచ్చిరి గదా చతురాననా! వీరికి స్థానము జెప్పుము." అని పలుకగా, ఆ బ్రహ్మ "నాలోకమునకు పైన

సాంతానికములను “దివ్యలోకములను పొంది, మీయొక్క దర్శన కుతూహలురై సుఖించెదరుగాక!” అని చెప్పెను. మరల శ్రీమన్నారాయణుడు “ఇకమీద అయోధ్యలో గతించెడు వారుగూడ సాంతానిక లోకములను పొందెదరుగాక!” అని వరమిచ్చెను. అది సరియని బ్రహ్మవిధించెను.

పిదప అయోధ్య వాసులందరును దివ్యవిమానములనెక్కి, దివ్య అలంకారములనంది, అప్సరస స్త్రీలచే సేవింపబడుతూ, చంద్ర సూర్యులవలె ప్రకాశించుచుండిరి. బ్రహ్మాది దేవతలు శ్రీమన్నారాయణునికి నమస్కరించి, వివిధ స్తోత్రములతో స్తుతించిరి. మునుల వేదఘోషలతో సంస్తుతించుచుండిరి. అప్పుడు శివునిచే శతనామకమగు 9 శ్లోకములుగల నవరత్నమాలిక స్తుతి చెప్పబడెను.

## శ్రీశివకృత అష్టోత్తరశతనామ నవరత్నామాలికాస్తుతి.

**శంభురువాచ**

**రాఘవం కరుణాకరం భవనాశనం దురితాపహం**
**మాధవం ఖగగామినం జలరూపిణం పరమేశ్వరమ్ ।**
**పాలకం జనతారకం భవహారకం రిపుమారకం**
**త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 32**

**భూధవం వనమాలినం ఘనరూపిణం ధరణీధరం**
**శ్రీహరిం త్రిగుణాత్మకం తులసీధవం మధురస్వరమ్ ।**
**శ్రీకరం శరణప్రదం మధుమారకం మధురస్వరం**
**త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 33**

**విఠ్ఠలం మథురాస్థితం రజకాంతకం గజమారకం**
**సన్నుతం బకమారకం వృకఘాతకం తురగార్దనమ్ ।**
**నందజం వసుదేవజం బలియజ్ఞగం సురపాలకం**
**త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 34**

**కేశవం కపివేష్టితం కపిమారకం మృగమర్దనం**
**సుందరం ద్విజపాలకం దితిజార్దనం దనుజార్దనమ్ ।**
**బాలకం ఖరమర్దినం ఋషిపూజితం మునిచింతితం**
**త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 35**

శంకరం జలశాయినం కుశబాలకం రథవాహనం
సరయూనతం ప్రియపుష్పకం ప్రియభూసురం లవబాలకమ్ ।
శ్రీధరం మధుసూదనం భరతాగ్రజం గరుడధ్వజం
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 36

గోప్రియం గురుపుత్రదం వదతాం వరం కరుణానిధిం
భక్తపం జనతోషదం సురపూజితం శ్రుతిభిః స్తుతమ్ ।
భుక్తిదం జనముక్తిదం జనరంజనం నృపనందనం
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 37

చిద్ఘనం చిరజీవినం మణిమాలినం వరదోన్ముఖం
శ్రీధరం ధృతిదాయకం బలవర్ధనం గతిదాయకమ్ ।
శాంతిదం జనతారకం శరధారిణం గజగామినం
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 38

శార్‌ఙ్గిణం కమలాననం కమలాదృశం పదపంకజం
శ్యామలం రవిభాసురం శశిసౌఖ్యదం కరుణార్ణవమ్ ।
సత్పతిం నృపబాలకం నృపవందితం నృపతిప్రియం
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 39

నిర్గుణం సగుణాత్మకం నృపమండనం మతివర్ధనమ్
అచ్యుతం పురుషోత్తమం పరమేష్ఠినం స్మితభాషిణమ్ ।
ఈశ్వరం హనుమన్నుతం కమలాధిపం జనసాక్షిణం
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 40

ఈశ్వరోక్త మేతదుత్తమాదరాచ్ఛతనామకం
యః పఠేద్భువి మానవస్తవ భక్తిమాంస్తపనోదయే ।
త్వత్పదం నిజబంధుదార సుతైర్యుతశ్చిరమేత్య నో
సోఽస్తు తే పదసేవనే బహుతత్పరో మమ వాక్యతః ॥ 41

ఇతి స్తుత్వా మహావిష్ణుం ప్రోవాచ గిరిజాపతిః ।
ఆరుహస్వ రమానాథ గరుడోపరి వేగతః ॥ 42

వైకుంఠారోహణస్యాయం కాలో వాల్మీకినా కృతః ।
ఏకాదశ సహస్రాశ్చ సమాస్త్వేకాదశైవచ ॥ 43

తథైకాదశ మాసాశ్చ దినాన్యేకాదశైవ చ ।
తథైకాదశ నాడీశ్చ పలాన్యేకాదశైవ చ ॥ 44

గతాని తేఽత్ర భూమ్యాం హి జన్మాదారభ్య రాఘవ ।
వసంతపంచమీనామ్నీ తిథిశ్చైత్రాసితాఽద్య హి ॥ 45

పుణ్యేఽహ్ని స్వపదం గంతుం త్వరాం కురు రమేశ్వర ।
తదా విహస్య శ్రీవిష్ణుర్వాల్మీకిం మునిపుంగవమ్ ॥ 46

సమాలింగ్య మునీన్ పృష్ట్వా తస్థౌ స గరుడోపరి ।
ధ్వనత్సు దేవవాద్యేషు స్తువత్సు నారదాదిషు ॥ 47

పుష్పైర్వర్షత్సు దేవేషు ప్రనర్తత్స్వప్సరస్సు చ ।
నానావిమానజాలైశ్చ సర్వత్ర పరివేష్టితః ॥ 48

యయౌ విష్ణుః స వైకుంఠ లోకాన్పశ్యన్ శనైః శనైః ।
వైకుంఠే స్వపదే స్థిత్వా విససర్జ శివాదికాన్ ॥ 49

తస్థౌలక్ష్మ్యాఽఽనందమయః పరిపూర్ణమనోరథః ।
ఖగేంద్రసేవితపదః శేషతల్పవిభూషితః ॥ 50

ఈశ్వరునిచే చెప్పబడిన ఈ స్తుతిని ప్రాతఃకాలమున పఠించువాడు సపరివారుడుగా నీపదము నందునని వరమునిచ్చెను. ఇట్లు స్తుతించిన పిదప ఈశ్వరుడు శ్రీవిష్ణుమూర్తితో, "లక్ష్మీపతీ! ఇక గరుత్మంతునిపై ఆసీనులవ్వగలరు. ఇది వైకుంఠారోహణ కాలమని వాల్మీకిచే చెప్పబడినదిగదా? నీ వవతరించి 11,011 సంవత్సరములా, 11 నెలలా, 11 దినములా, 11 ఘడియలా 111 విఘటియలు అయ్యెను.

## శ్రీమహావిష్ణు వైకుంఠ ప్రవేశము

నేడు చైత్రకృష్ణ పంచమి. వసంత పంచమిగదా? స్వపదముజేర ఇది పుణ్యదినము. త్వర బడుము రమాపతీ!" అని పలికెను. అపుడు నారాయణుడు నవ్వి, వాల్మీకి మునీంద్రుని కౌగిలించి, ఋషివర్యులను పరామర్శించి, గరుడునెక్కి; దేవవాద్యములు మ్రోగుచుండ, నారదాదులు స్తుతించుచుండ, దేవతలు పుష్పవృష్టిని గురిపించుచుండ, అప్సరసలాడుచుండ, వివిధ విమానములచే పరివేష్టింపబడి, నడుమ నానాలోకములను చూచుచు, తిన్నగా వెడలి వైకుంఠముజేరి స్వపదమును ఆరోహించి, శివాదులను వారివారి లోకములకు పంపెను. శ్రీమదానందమయుడగు ఆపరమాత్మ, శ్రీలక్ష్మీసమేతముగా శేషతల్పముమీద గరుడునిచే సేవింపబడుతూ, పరిపూర్ణ మనోరూథుడయ్యె

**అయోధ్యావాసినస్సర్వే యయుః సాంతానికం పదమ్ ।**
**తతస్తే మునయః సర్వే యయుః స్వం స్వం స్థలం ప్రతి ॥ 51**

**రామవాక్యాత్సోఽజమీఢః స్వాంత్వయామాస త కుశమ్ ।**
**స్వర్గారోహణవిస్తారం కథయామాస తం కుశమ్ ॥ 52**

**కుశేన మానితః సోఽపి యయౌ స్వీయం గజాహ్వయమ్ ।**
**లబ్ధ్వా కుముద్వతీం తస్యాం కుశః పుత్రాన్స నిర్మమే ॥ 53**

**ఏవం శ్రీరఘునాథస్య స్వర్గారోహణకౌతుకమ్ ।**
**యే శృణ్వంతి నరా భక్త్యా తేఽపి స్వర్గం ప్రయాన్తి హి ॥ 54**

**వైకుంఠారోహణాధ్యాయమిమం నిత్యం పఠేత్తు యః ।**
**సోఽంతే గచ్ఛతి వైకుంఠం రామచంద్రప్రసాదతః ॥ 55**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, వైకుంఠారోహణం నామ షష్ఠః సర్గః ॥**

అయోధ్యావాసులు సాంతానిక లోకములు చేరిరి, మునులందరును తమతమ తపోవనములకు వెళ్ళిరి. శ్రీరాముని మాటప్రకారము అజమీఢుడు కుశుని సమాధాన పరచి, శ్రీరామస్వర్గారోహణ విస్తారమును విన్నవించి, పిదప కుశునిచే సంమానితుడై గజపురి చేరెను. కుశుడు కుముద్వతితో కూడి, ఆమెతో పుత్రులను కనెను. ఇట్టి శ్రీరామస్వర్గారోహణ కౌతుకమును ఆకర్ణించినవారు స్వర్గసుఖ మందుదురు. ఈ వైకుంఠారోహణాధ్యాయమును పఠించినవారు శ్రీరామచంద్ర ప్రసాదముచే అంత్యకాలమున శ్రీవైకుంఠమునందు ఆనందించెదరు.

**6వ సర్గ ముగిసినది.**

# సప్తమః సర్గః-7వ సర్గ

సూర్యవంశవర్ణన

శ్రీరామదాస ఉవాచ

ఏవం త్వయా యథా పృష్టం స్వర్గారోహణమంగళమ్ ।
శ్రీరామస్య మయా చైతత్తవాఽగ్రఽద్య నివేదితమ్ ॥ **1**

కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛాఽస్తి తాం త్వం వద వదామ్యహమ్ ।
ఏవం గురోర్వచః శ్రుత్వా విష్ణుదాసస్తమబ్రవీత్ ॥ **2**

విష్ణుదాస ఉవాచ

కుశాంతః సూర్యవంశోఽత్ర గురో పూర్వం త్వయేరితః ।
కుశాగ్ర శ్రోతుమిచ్ఛామి సూర్యవంశం సవిస్తరమ్ ॥ **3**

శ్రీరామదాస ఉవాచ

విష్ణోరారభ్య కథితా ఏకషష్టితమాః పురా ।
ఏకషష్టినృపా హ్యగ్రే తాన్ వదామి సవిస్తరమ్ ॥ **4**

శ్రీరామస్య కుశః పుత్రోఽతిథిః పుత్రః కుశస్య సః ।
నిషధస్త్వతిథేః పుత్రో నిషధస్యాత్మజో నభః ॥ **5**

నభాజ్జాతో పుండరీకః క్షేమధన్వా తు తత్సుతః ।
దేవానీకస్తత్సుతోఽభూద్దేవానీకసుతో మహాన్ ॥ **6**

అహీనః ప్రోచ్యతే సద్భిః పార్యాత్రస్తత్సుతః స్మృతః ।
పార్యాత్రస్య బలః పుత్రః స్థలః పుత్రో బలస్య హి ॥ **7**

## కుశుని తరువాత వచ్చు వంశ వివరణ

ఇంకేమి కావలయునో చెప్పుమనిన గురువాక్యమును వినిన విష్ణుదాసుడు, "గురుమూర్తీ! కుశుని వరకు సూర్యవంశము చెప్పబడినది. ఆ తరువాత వచ్చిన సూర్యవంశ విస్తారమును వినగోరుచున్నాను," అని విన్నవింపగా అందుకు శ్రీరామదాసు ఇలా చెప్పుచున్నాడు.

శ్రీవిష్ణుమూర్తి మొదలు 60 మంది రాజులను వింటివిగదా? ఇక అట్లే ఆ తరువాతి 61మంది మహారాజులనుగురించి చెప్పుచున్నాను వినుము. శ్రీరాముని పుత్రుడు కుశుడు. అతని తనయుడు అతిథి. అతని సుతుడు నిషధుడు. అతని ఆత్మజుడు నభుడు. నభుని కుమారుడు పుండరీకుడు, వాని తనుజుడు క్షేమధన్వుడు. క్షేమధన్వుని కుమారుడు దేవానీకుడు, వానికొమరుడు అహీనుడు. అహీనుని కుమారుడు పార్యాత్రుడు. వానికొడుకు బలుడు. బలుని కుమారుడు స్థలుడు.

**స్థలస్య వజ్రనాభస్తు ఖగణస్తస్య కీర్త్యతే ।**
**ఖగణాద్విధృతిర్జాతో విధృతేస్తనయః శుభః ॥ 8**

**జాతో హిరణ్యనాభస్తు తస్య పుష్యః ప్రకీర్త్యతే ।**
**పుష్యాత్స ధ్రువసంధిస్తు ధ్రువసంధేః సుదర్శనః ॥ 9**

**సుదర్శనాదగ్నివర్ణస్తస్మాచ్ఛీఘ్రః ప్రకీర్త్యతే ।**
**శీఘ్రాజ్జాతో మరుః పుత్రీ మనోశ్చ ప్రశ్రుతః సుతః ॥ 10**

**ప్రశ్రుతస్య చ సంధిర్హి సంధేః పుత్రస్తు మర్షణః ।**
**మర్షణస్య మహస్వాంశ్చ విశ్వవాహశ్చ తత్సుతః ॥ 11**

**తస్మాత్ త్రసేనజిత్ ప్రోక్తస్తస్మాజ్జాతస్తు తక్షకః ।**
**బృహద్బలస్తక్షకాచ్చ తస్మాజ్జాతో బృహద్రణః ॥ 12**

**తస్మాదురుక్రియః ప్రోక్తో వత్సవృద్ధస్తు తత్సుతః ।**
**వత్సవృద్ధస్య వ్యోమస్తు వ్యోమాద్భానుః ప్రకీర్త్యతే ॥ 13**

**భానోః పుత్రో దివాకస్తు సహదేవశ్చ తత్సుతః ।**
**సహదేవాత్మజో వీరో వీరస్య తనయః శుభః ॥ 14**

**బృహదశ్వ ఇతి ఖ్యాతస్తస్య పుత్రస్తు భానుమాన్ ।**
**భానుమంతః ప్రతీకాశః సుప్రతీకశ్చ తత్సుతః ॥ 15**

**సుప్రతీకస్య పుత్రోఽభూన్మరుదేవ ఇతి స్మృతః ।**
**మరుదేవాత్సునక్షత్రః సునక్షత్రాచ్చ పుష్కరః ॥ 16**

**పుష్కరస్యాంతరిక్షశ్చ సుతపా అంతరిక్షజః ।**
**సుతపాతనయో మిత్రో మిత్రజిత్తత్సుతః శుభః ॥ 17**

**బృహద్రాజ ఇతి ఖ్యాతస్తస్య బర్హిః స్మృతో బుధైః ।**
**బర్హేః కృతంజయః పుత్రస్తస్య పుత్రో రణంజయః ॥ 18**

**రణంజయాత్సంజయస్తు సంజయాచ్ఛాక్య ఉచ్యతే ।**
**శాక్యపుత్రస్తుశుద్ధోదః శుద్ధోదాల్లాంగలః స్మృతః ॥ 19**

**ప్రసేనజిల్లాంగలస్య తత్పుత్రః క్షుద్రకః స్మృతః ।**
**క్షుద్రకాద్రణకః ప్రోక్తో రణకాత్సురథః స్మృతః ॥ 20**

**సురథాత్తనయో జాతస్తనయస్య సుతో మహాన్ ।**
**నామ్నా సుమిత్రః పరమః పూర్ణో వంశస్తతః పరమ్ ॥ 21**

స్థలుని కుమారుడు వజ్రనాభుడు, వజ్రనాభునికి ఖగణుడు. ఖగణునికి విధృతి, విధృతికి శుభుడు, శుభునికి హిరణ్యానాభుడు, హిరణ్యానాభునికి పుష్పుడు, పుష్పునికి ధ్రువుడు, ధ్రువునికి ధ్రువసంధి, ధ్రువసంధికి సుదర్శనుడు పుత్రుడు. సుదర్శనుని నుండి అగ్నివర్ణుడు, అగ్నివర్ణుని నుండి శీఘ్రుడు, శీఘ్రుని నుండి మరుడు, మరుని నుండి ప్రశ్రుతుడు, ప్రశ్రుతుని నుండి సంధి, సంధి నుండి మర్షణుడు, మర్షనుని నుండి సహస్వంతుడు, సహస్వంతుని నుండి విశ్వవాహుడు, విశ్వవాహుని నుండి ప్రసేనజిత్తు, ప్రసేనజిత్తు నుండి తక్షకుడు, వానినుండి బృహద్రణుడు, వానినుండి ఉరుక్రియుడు, వానినుండి వత్సవృద్ధుడును వరుసగాగల్గిరి. అతనికి వ్యోముడు, అతనికి భానువు, అతనికి దివాకుడు, అతనికి సహదేవుడు, అతనికి వీరుడు, అతనికి బృహదశ్వుడు, అతనికి భానుమంతుడు, అతనికి ప్రతీకాశుడు, అతనికి సుప్రతీకుడు, అతనికి మరుదేవుడు, అతనికి సునక్ష త్రుడు, అతనికి పుష్కరుడు, అతనికంతరిక్షుడు, అతనికి సుతస్సు, అతనికి మిత్రుడు, అతనికి మిత్రజిత్తును గలిగెను. మిత్రజిత్పుత్రుడు బృహద్రాజు, తత్సుతుడు బర్హిస్సు, వానికొడుకు కృతంజయుడు, వానికి రణంజయుడు, వానికి సంజయుడు, వానికి శాక్యుడు, వానికి శుద్ధోదుడు, వానికి లాంగలుడు, వానికి ప్రసేనజిత్తు, వానికి క్షుద్రకుడు, వానికి రణకుడు, వానికి సురథుడు, వాని తనయుడు సుమిత్రుడు. అతనితో వంశము పూర్ణమయ్యెను.

**పూర్వముక్తో మరురితి నామ్నా యో నృపతిర్మయా ।**
**కలాపగ్రామమాశ్రిత్య హిమాద్రౌ బద్రికాశ్రమే ॥ 22**

**స తపశ్చిరకాలం హి కరోత్యత్ర సమాధిమాన్ ।**
**కృతే యుగే పునః ప్రాప్తే సూర్యవంశం కరిష్యతి ॥ 23**

**ఏవం మయా సమాఖ్యాతః సూర్యవంశో మనోరమః ।**
**విష్ణోరారభ్య కథితా ఏకషష్టితమా మయా ॥ 24**

ఏకషష్టినృపాశ్చాగ్రే మధ్యే రామో విరాజతే ।
త్రయోవింశోత్తరశతాశ్చైవం విష్ణోర్మయోదితాః ॥ **25**

ఏవం యథా త్వయా పృష్ట శిష్య వంశానుకీర్తనమ్ ।
తన్మయా కథితం సర్వం శ్రవణాత్పుణ్యవర్ధనమ్ ॥ **26**

విష్ణుదాస ఉవాచ

గురో మయా శ్రుతం కస్య చిన్మునేర్ముఖతః పురా ।
రామాయణం సవిస్తారం తచ్చేదం నైవ భాసతే ॥ **27**

తస్మాదత్రాంతరం ప్రోక్తం త్వయా సర్వత్ర మాం గురో ।
సందేహోఽనేన మేజాతస్తం త్వం ఛేత్తుమిహార్హసి ॥ **28**

శ్రీరామదాస ఉవాచ

పునః పునః కల్పభేదాజ్జాతాః శ్రీరాఘవస్య చ ।
అవతారాః కోటిశోఽత్ర తేషు భేదః క్వచిత్ క్వచిత్ ॥ **29**

కృతోఽస్తి రాఘవేణైవ న సర్వే సదృశాః కృతాః ।
రామాయణాన్యపి తథా పురా వాల్మీకినైవ హి ॥ **30**

అనేకాన్యంతరేణైవ కీర్తితాని సవిస్తరాత్ ।
శతకోటిమితా తేషాం సర్వేషాం గణనా కృతా ॥ **31**

తస్మాత్త్వయా న సందేహః కార్యః శిష్యాత్ర బుద్ధిమన్ ।
యన్మయా కథితం తే హి తత్తథ్యం విద్ధి నాన్యథా ॥ **32**

భాగాద్భరతఖండాంతర్గతాద్రామాయణాత్పురా ।
నారదాదిపురాణాని వ్యాసేనాత్ర కృతాని హి ॥ **33**

మునుపు నేను చెప్పిన మరుడు అను మహారాజు బదరికాశ్రమమున హేమాద్రిలో కలాప గ్రామమును ఆశ్రయించి చిరకాలము తపస్సు చేసి, సమాధినిష్ఠుడైయుండి మరల కృతయుగము వచ్చినపుడు సూర్యవంశ ప్రతిష్ఠ నిలుపును. మనోహరమగు సూర్యవంశము నీకిట్లు చెప్పబడినది. విష్ణువు నుండి 61 మంది రాజులు, ఆ తరువాత 61 మంది, నడుమ శ్రీరాముడు. వెరసి 163 మంది, ఈ సూర్యవంశరాజులు వంశ పరంపరను వినుట పుణ్యప్రదము. అని శ్రీరామదాసు చెప్పగా వినిన విష్ణుదాసు గురువుకు నమస్కరించి, "స్వామీ! నేను మరియొక మునిచే రామాయణమును

వినియున్నాను దానికిని దీనికిని అనేక స్థలములలో భేదము గల్గియున్న ది. వీటిలో యథార్థమేది? ఈసంశయమును పరిహరింపుడు” అని ప్రార్థించెను.

## శ్రీరామ కథలలో వ్యత్యాసములు.

అందుకు శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు. అనాదియైన జగత్సృష్టి ప్రవాహమున అవతారము లు కోట్లకొలదిగా కలిగినవి. కొన్నిచోట్లలో భేదము శ్రీరాముని చేతనే చూపబడినది. సర్వమును సమానముగా లేదు. అట్లాగే రామాయణములును మునుపు వాల్మీకిచేతనే కీర్తింపబడినవి. సవిస్తరముగా వాటియన్నిటి చేరికయే శతకోటి రామాయణమని గణింపబడె. బుద్ధిశాలియగు శిష్యుడా! నీవు సందేహింపవలదు, నేను చెప్పినదానినే యథార్థమని విశ్వసింపుము. వేరుగా ఎంచవలదు.

**తేషు మత్కథితం చేదం సమ్యగ్విస్తారితం ద్విజ ।**
**తవ జాతో యథా శిష్య సందేహోఽత్ర కథాంతరాత్ ॥ 34**

**భవిష్యతి తథాఽన్యేషామగ్రే యది కదా క్వచిత్ ।**
**నారదాదిపురాణేషు దర్శనీయం హి తైర్జ్ఞైః ॥ 35**

**దృష్ట్వా మదుక్తం సర్వేషు పురాణాదిషు పండితైః ।**
**త్యక్తవ్యాః స్వీయసందేహాః సత్యం జ్ఞేయం మయేరితమ్ ॥ 36**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, సూర్యవంశవర్ణనం నామ సప్తమః సర్గః ॥**

మునుపు వ్యాసునినుండి భరతఖండాంతర్గతమగు నారదాది పురాణములు చెప్పబడినవి. వానిలో నేను చెప్పినదిగూడ చక్కగా విస్తరింపబడియున్నది. నీకు సందేహము గల్గినట్లే కథాంతరము నుండి యికమీద ఇతరులకును సందేహమొకప్పుడు గల్గును. నారదాది పురాణములలో పండితులు నాకు సంబంధించి విషయాలను పరికించి తమసందేహములను నివృత్తి చేసికొనవచ్చును. నేను చెప్పినదానిని సత్యమని తెలియుము.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
సూర్యవంశమునువర్ణించు 7వ సర్గ ముగిసినది.

# అష్టమః సర్గః 8వ సర్గ

## సర్గానుక్రమణిక

విష్ణుదాస ఉవాచ

గురోఽధునా వదస్వ త్వం యన్మయా పృచ్ఛ్యతే తవ ।
అనుక్రమణికాసర్గం తథా పాఠాదిభిః ఫలమ్ ॥ 1

కాండసంఖ్యాం సర్గసంఖ్యాం శ్లోకసంఖ్యాం సవిస్తరామ్ ।
ఉద్యాపనం గ్రంథదానఫలం వై శకునేక్షణమ్ ॥ 2

అనుష్ఠానవిధానం చ శ్రోతుం కాలవినిర్ణయమ్ ।
కాండానాం చ పృథక్ సంఖ్యాం సర్వం త్వం వక్తుమర్హసి ॥ 3

శ్రీరామదాస ఉవాచ

అనుక్రమణికాసర్గః ప్రోచ్యతేఽయం మయాధునా ।
యస్యాః సంశ్రవణాత్ప్రోక్తం సర్వగ్రంథఫలం శుభమ్ ॥ 4

సర్గేఽత్ర ప్రథమే ప్రోక్తం కౌసల్యాయాః స్వయంవరమ్ ।
రామాదీనాం సుజన్మాని ద్వితీయే కీర్తనాని హి ॥ 5

సీతాస్వయంవరం ప్రోక్తం తృతీయే మిథిలాపురి ।
వృందాశాపాదికథనం చతుర్థం ముద్గలేన హి ॥ 6

దశరథపూర్వజన్మ కైకేయ్యాశ్చాపి పంచమే ।
వనప్రయాణం రామస్య ప్రోక్తం షష్ఠే సవిస్తరమ్ ॥ 7

విరాధఖగమారీచవధాదిసప్తమేఽకథి ।
కిష్కింధాయాం వాలిఘాతో రాఘవేణాష్టమే కృతః ॥ 8

గురూత్తమా! ఇపుడు నేనడగునట్టి అనుక్రమణికా సర్గను, అట్లే తత్పఠనాది ఫలవిచారమును, కాండ, సర్గ, శ్లోక సంఖ్యా విస్తారమును, ఉద్యాపన, గ్రంథదాన, శకున దర్శనాదికమును సర్వము అనుగ్రహింపుమని శ్రీవిష్ణుదాసుడు ప్రార్థింపగా; శ్రీరామదాసుడు చెప్పుచున్నాడు.

నేనిప్పుడు చెప్పునట్టి ఆనందరామాయణ అనుక్రమణికా సర్గను పఠించుటచే సంపూర్ణ ఆనంద రామాయణ ఫలము కలుగును అని నవకాండ సర్గవిషయానుక్రమణిక నిరూపింపబడినది.

నవమే జానకీశుద్ధిర్లంకా దగ్ధాహనూమతా ।
దశమే సేతుమాహాత్మ్యం కాశీవిశ్వేశ్వరాగమః ॥ 9

ఏకాదశేరావణాదివధాః ప్రోక్తాశ్చ రాఘవాత్ ।
సీతయా స్వపురీ గత్వా ద్వాదశేఽభూన్నృపో విభుః ॥ 10

త్రయోదశే రాఘవస్య విక్రమశ్చ హనూమతః ।
సమాప్తం సారకాండం హి యాత్రాకాండముదీర్యతే ॥ 11

వాల్మీకేః ప్రథమే సర్గే శ్లోకోత్పత్తిః ప్రకీర్తితా ।
రామాయణవిభాగోఽత్ర ద్వితీయే సముదాహృతః ॥ 12

తృతీయే సీతయా రామో యాత్రార్థం ప్రార్థితో ముదా ।
చతుర్థే రామచంద్రస్య ప్రస్థానం జాహ్నవీం ప్రతి ॥ 13

పంచమే మునివాక్యేన యాత్రాం గంతుం వినిశ్చయః ।
షష్ఠే ప్రోక్తా పూర్వదేశతీర్థయాత్రా సవిస్తరా ॥ 14

ప్రోక్తా దక్షిణతీర్థానాం యాత్రా రామస్య సప్తమే ।
తీర్థాటనం పశ్చిమాయామష్టమే రాఘవస్య చ ॥ 15

యాత్రోత్తర ప్రదేశస్య రామస్య నవమేఽకథి ।
యాత్రాకాండం సమాప్తం తు యాగకాండముదీర్యతే ॥ 16

సర్గేఽత్ర ప్రథమే ప్రాహ యజ్ఞోపకరణం గురుః ।
ద్వితీయే రామచంద్రస్య యాగారంభోఽత్ర వర్ణితః ॥ 17

పృథ్వీప్రదక్షిణా ప్రోక్తా తృతీయేఽధ్వరవాజినః ।
కుంభోదరస్య రామస్య సంవాదోఽత్ర చతుర్థకే ॥ 18

పంచమే రామనామ్నాం వై హ్యష్టోత్తరశతం శుభమ్ ।
షష్ఠేఽహ్నికం హి సర్వేషాం వాజిమేధే ప్రకీర్తితమ్ ॥ 19

ధ్వజారోపవిధానం చ సప్తమే సముదాహృతమ్ ।
అష్టమేఽవభృథస్నానం రాఘవస్యాత్ర వర్ణితమ్ ॥ 20

నవమే వాజిమేధస్య సమాప్తిః కీర్తితాఽత్ర సా ।
యాగకాండం సమాప్తం హి విలాసాఖ్యముదీర్యతే ॥ 21

ప్రథమే రఘువీరస్య స్తవరాజోఽత్ర కీర్తితః ।
ద్వితీయే రతిశాలాయా జానక్యాశ్చాపి వర్ణనమ్ ॥ 22

తృతీయే రాఘవేణోక్తం దేహరామాయణం స్త్రియై ।
దినచర్యాభూషణాని జానక్యాశ్చ చతుర్థకే ॥ 23

జలయంత్రగతా క్రీడా పంచమే శేషమాహ్నికమ్ ।
ద్విజస్య పత్న్యై ప్రాసాదే షష్ఠేఽలంకారమండనమ్ ॥ 24

మూర్తీనాం సప్తమే దానం దేవస్త్రీణాం వరాస్తథా ।
గుణవత్యా పింగలాయా వరదానమథాష్టమే ॥ 25

కురుక్షేత్రస్య యాత్రాయాం నవమే జానకీజయః ।
విలాసాఖ్యం సమాప్తం హి జన్మకాండముదీర్యతే ॥ 26

ఆరామే దోహదక్రీడా సీతాయాః ప్రథమేకథి ।
ద్వితీయే వివిధాః క్రీడాః సీమంతోన్నయనోత్సవః ॥ 27

రజకస్యోదితం శ్రుత్వా సీతాత్యాగస్తృతీయకే ।
జన్మకర్మ చతుర్థేఽత్ర కుశస్యాథ లవస్య చ ॥ 28

సర్గేఽత్ర పంచమే ప్రోక్తా రామరక్షా సుఖావహా ।
షష్ఠే లవస్య కమలహరణే జయ ఈరితః ॥ 29

యుద్ధాదికౌతుకం ప్రోక్తం పుత్రయోః సప్తమే విభోః ।
సీతాదివ్యం చ తల్లాభోఽష్టమే ప్రోక్తోఽత్ర మండపే ॥ 30

జన్మోపనయనాదీని బాలానాం నవమేఽకథి ।
జన్మకాండం సమాప్తం హి వివాహాఖ్యముదీర్యతే ॥ 31

స్వయంవరార్థం గమనం రామస్య ప్రథమేఽకథి ।
స్వయంవరం చంపికాయా ద్వితీయే సముదాహృతమ్ ॥ 32

స్వయంవరం సముత్థాశ్చ తృతీయే పరికీర్తితమ్ ।
కుశస్యాథ లవస్యాపి వివాహౌ ద్వౌ చతుర్థకే ॥ 33

గంధర్వనాగకన్యానాం మోచనం పంచమేఽకథి ।
షష్ఠే తాసాం వివాహానాం నిశ్చయః సముదాహృతః ॥ 34

వివాహో ద్వాదశే ప్రోక్తాః సర్వాసాం సప్తమేఽత్ర హి ।
అష్టమే యూపకేతోశ్చ వర్ణితోఽత్ర పరాక్రమః ॥ 35

ప్రోక్తో మదనసుందర్యా వివాహో నవమే మహాన్ ।
పూర్ణం వివాహకాండం చ రాజ్యకాండముదీర్యతే ॥ 36

రామనామసహస్రం చ సర్గే ప్రాథమికేఽకథి ।
ద్వితీయేఽత్ర సమానీతౌ రామేణ సురపాదపౌ ॥ 37

రామకృష్ణోపాసకయోః సంవాదశ్చ తృతీయకే ।
శతస్త్రీణాం చ నిద్రాయాం వరదానం తథా పునః ॥ 38

రామవిశ్లేషవిరహః సీతాయాః పంచమేఽకథి ।
మూలకాసురఘాతశ్చ షష్ఠే రాజ్యాని వై పృథక్ ॥ 39

జయో భారతఖండస్య రామేణ సప్తమే కృతః ।
జంబూద్వీపజయః ప్రోక్తోఽష్టమే రామస్య విస్తరాత్ ॥ 40

షట్ ద్వీపానాం జయః ప్రోకో నవమే రాఘవస్య చ ।
యతిశూద్రగృధ్రశిక్షా రామేణ దశమే కృతా ॥ 41

చతుఃస్త్రీణాం వరదానం రామేణైకాదశే కృతమ్ ।
స్త్రీషోడశసహస్రాణాం ద్వాదశేఽత్ర వరార్పణమ్ ॥ 42

అశ్వత్థహసితం హాస్యముక్తేరాజ్ఞా త్రయోదశే ।
చతుర్దశే వాల్మీకినా స్వజన్మత్రయమీరితమ్ ॥ 43

పంచదశే రామరాజ్యవర్ణనం విస్తరాత్కృతమ్ ।
వర్ణితా రాజనీతిః శ్రీరాఘవేణాఽత్ర షోడశే ॥ 44

సప్తదశేఽత్ర కథితం కుశకన్యాస్వయంవరమ్ ।
అష్టాదశే రామనాథపురం దత్తం ద్విజన్మనామ్ ॥ 45

ఏకోనవింశే రామస్య దినచర్యేరితా శుభా ।
రాజ్ఞాం వింశేఽవతారే తు శ్రేష్ఠః ప్రోక్తస్త్వయం మహాన్ ॥ 46

ఏకవింశే రాఘవేణ దాస్యై దత్తో వరో ముదా ।
సీతయా తులసీపత్రం ద్వావింశే సంధితం శుభమ్ ॥ 47

త్రయోవింశే స్మృతాఽఽనందరామాయణఫలశ్రుతిః ।
యమశిక్షా చతుర్వింశే ధర్మశిక్షా చ భూతలే ॥ 48

రాజ్యకాండం సమాప్తం హి మనోహరముదీర్యతే ।
సర్గేఽత్ర ప్రథమే ప్రోక్తం లఘురామాయణం శుభమ్ ॥ 49

నాగరాణాం చ మాతౄణాముపదేశం ద్వితీయకే ।
రామపూజోపాసనాదివిస్తారశ్చ తృతీయకే ॥ 50

రామతోభద్రవిస్తార శ్చతుర్థే సముదీరితః ।
రామలింగతోభద్రాణాం భేదాః ప్రోక్తాశ్చ పంచమే ॥ 51

నవమీవ్రతవిస్తారః షష్ఠే ప్రోక్తా చ తత్కథా ।
శ్రీరామనామ్నాం లక్షస్యోద్యాపనాదీని సప్తమే ॥ 52

వేదాదీనాం హి సర్వేషామష్టమే ఫలమీరితమ్ ।
సార్ధమాసద్వయీ పూజా కథితా నవమే విభోః ॥ 53

దశమే చైత్రమాసస్య మహిమా సముదీరితః ।
ఏకాదశే మధుస్నానాత్సర్వేషాం గతిరీరితా ॥ 54

అద్వైతం దర్శితం రాజ్ఞా ద్వాదశే స్త్రీకదంబకమ్ ।
వాయుపుత్రస్య రామస్య కవచే ద్వే త్రయోదశే ॥ 55

సీతాయాః కవచాదీని ప్రోక్తాన్యత్ర చతుర్దశే ।
పంచదశే కవచాని తద్బంధూనాం స్మృతాని హి ॥ **56**

వ్రతం హనుమతః ప్రోక్తం పతాకాఖ్యం హి షోడశే ।
ప్రోక్తం సప్తదశే సారరామాయణమనుత్తమమ్ ॥ **57**

అష్టాదశే శరసేతోః ఖండనం చ హనూమతా ।
జాతం మనోహరం కాండం పూర్ణకాండమథోచ్యతే ॥ **58**

వాల్మీకినా సోమవంశవిస్తారః ప్రథమేఽకథి ।
రామచంద్రస్య ప్రస్థానం ద్వితీయే హస్తినాపురమ్ ॥ **59**

సూర్యసోమవంశజయోర్యుద్ధం ప్రోక్తం తృతీయకే ।
సోమసూర్యవంశజయోర్మైత్రికీ చ చతుర్థకే ॥ **60**

కుశాదీనాం రాఘవేణ పంచమేఽత్ర విసర్జనమ్ ।
వైకుంఠారోహణం షష్ఠే గంగాయాం రాఘవస్య చ ॥ **61**

సప్తమే సూర్యవంశీయనృపాణాం వర్ణనం కృతమ్ ।
అనుక్రమణికాసర్గః పోక్తోఽయమష్టమో మహాన్ ॥ **62**

గ్రంథశ్రుతిఫలాదీని నవమే కీర్తితాని హి ।
నవసర్గం పూర్ణకాండం సమ్పూర్ణం నవమం త్విదమ్ ॥ **63**

అనుక్రమణికా చేయం మయా శిష్య ప్రవర్ణితా ।
అస్యాః శ్రవణమాత్రేణ రామాయణశ్రుతేః ఫలమ్ ॥ **64**

రామాయణపుస్తకస్య నిత్యం కార్యం ప్రపూజనమ్ ।
విశేషం పూజనస్యాపి శృణు శిష్య వదామి తే ॥ **65**

సారకాండం విభోః స్థానే లక్ష్మణీయే ద్వితీయకమ్ ।
నవాయతనరిత్యేత్థం శేషాణి స్థాపయేత్ క్రమాత్ ॥ **66**

సప్త కాండాని విధివత్తేషాం పూజనమాచరేత్ ।
అథవా రాజ్యకాండస్య పూర్వార్ధం రామసత్ స్థలే ॥ **67**

**రాజ్యకాండస్యోత్తరార్ధం సీతాస్థానే నివేశయేత్ ।**
**లక్ష్మణీయే సారకాండం శేషాణ్యగ్రే క్రమేణ తు ॥ 68**

**ఏవం సంస్థాప్య కాండాని తేషాం పూజనమాచరేత్ ।**
**నవాయతనపూజాయాః ఫలమేతేన కీర్తితమ్ ॥ 69**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, అనుక్రమణికావర్ణనం నామ అష్టమః సర్గః ॥**

నిత్యము శ్రీరామసన్నిధిలో వేర్వేరుగా ఆనంద రామాయణముయొక్క తొమ్మిది కాండలు గల స్వహస్తములతో వ్రాసిపెట్టి, భక్తితో నవావరణాత్మక శ్రీరామచంద్రస్వామి స్వరూపముగా పూజించదగును. అందు రామస్థానమున సారకాండను స్థాపించునది ఒకపక్షము. రాజ్యకాండ పూర్వార్ధమును రామస్థానమున, ఉత్తరార్ధమును సీతాస్థానమున, సారకాండను లక్ష్మణస్థానమున, తక్కినకాండలను భరత, శత్రుఘ్న, హనుమదాది స్థానములయందును స్థాపించి పూజించుటచే నవాయతన శ్రీరామార్చనాఫలము గల్గునని నిరూపింపబడినది.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
ఆనందరామాయణములోని సర్గల క్రమమును వివరించు 8వ సర్గ ముగిసినది.

# నవమః సర్గః–9వ సర్గ

ఫలశ్రుతి

శ్రీరామదాస ఉవాచ

సారం యాత్రా చ యాగాఖ్యం విలాసాఖ్యం తు జన్మకమ్ ।
వివాహాఖ్యం హి రాజ్యాఖ్యం శ్రీమనోహర పూర్ణకే ॥ **1**

కాండాన్యనుక్రమేణైవాఽఽనందరామాయణే నవ ।
త్రయోదశ సారకాండే సర్గా వాల్మీకినేరితాః ॥ **2**

యాత్రాకాండే నవ జ్ఞేయా యాగకాండేఽపి వై నవ ।
నవ జ్ఞేయా విలాసాఖ్యే జన్మకాండేఽపి వై నవ ॥ **3**

నవ జ్ఞేయా వివాహాఖ్యే చతుర్వింశాచ్చ రాజ్యకే ।
మనోహరాఖ్యే జ్ఞాతవ్యాః సర్గా అష్టాదశాత్ర వై ॥ **4**

పూర్ణకాండే నవ జ్ఞేయాః సర్గాః పాపహరా నృణామ్ ।
ఏవం నవోత్తరశతం సర్గా జ్ఞేయాః శుభావహా ॥ **5**

సారకాండే పంచవింశచ్ఛతం శ్లోకాః సత్రింశకాః । (2530)
యాత్రాకాండే సప్తశతం పంచత్రింశోత్తరం స్మృతాః ॥ (735) **6**

యాగకాండే షట్ శతం చ పంచవింశోత్తరం శుభాః । (625)
విలాసాఖ్యే షట్ శతం చ సాష్టసప్తతి సంస్మృతాః ॥ (678) **7**

జన్మకాండే హ్యష్టశతాః సద్విశ్లోకాః ప్రకీర్తితా । (802)
వివాహాఖ్యే పంచశత కీర్తితాః సత్ర్యశీతయః ॥ (563) **8**

సద్వావింశా రాజ్యకాండే సుషడ్వింశచ్ఛతం స్మృతాః । (2602) ।
ఏకత్రింశచ్ఛతం శ్లోకాః ప్రోక్తాః కాండే మనోహరే ॥ (3100) ॥ **9**

పూర్ణకాండే పంచశతం సప్తసప్తతిమిశ్రితాః । (577)
ఆనందరామచరితే సహస్రాణి హి ద్వాదశ ॥ (12,000) **10**

ద్వే శతే చ ద్విపంచాశశ్లోకా జ్ఞేయా మనీషిభిః । (12,352)
ఏవం శిష్య మయా ప్రోక్తం యథా పృష్టం త్వయా పురా ॥ **11**

రామస్య తోషచరితం శ్రవణాత్పాతకాపహమ్ ।
పూర్ణకాండమిదం జ్ఞేయం శ్రవణాత్పుణ్యవర్ధనమ్ ॥ **12**

సారకాండశ్రవాదేవ కంసారాన్ముచ్యతే నరః ।
యాత్రాకాండేన యాత్రాణాం లభ్యతే మానవైః ఫలమ్ ॥ **13**

యాగకాండేన యజ్ఞానాం లభ్యతే ఫలముత్తమమ్ ।
విలాసకాండశ్రవణాదప్సరోభిర్విమోదతే ॥ **14**

జన్మకాండేన ప్రాప్నోతి నరః పుత్రాదిసంతతిమ్ ।
వివాహకాండశ్రవణాద్రమ్యా స్త్రీ లభ్యతే భువి ॥ **15**

రాజ్యకాండేన రాజ్యం హి మానవైర్భువి లభ్యతే ।
కాండం మనోహరం శ్రుత్వా లభ్యతే మానసేప్సితమ్ ॥ **16**

పూర్ణకాండశ్రవాదేవ విష్ణోః పూర్ణపదం లభేత్ ।
సర్వం విస్తరతః శ్రుత్వాఽఽనందరామాయణం త్విదమ్ ॥ **17**

## కాండ, సర్గ, శ్లోక నిర్ణయము.

శ్రీమత్ ఆనందరామాయణ గ్రంథములో- సార, యాత్రా, యాగ, విలాస, జన్మ, వివాహ, రాజ్య, మనోహర, పూర్ణ- అను పేర్లు గల 9 కాండలు గలవు.

1) సారకాండయందు-13 సర్గలు, 2) యాత్రాకాండయందు-9సర్గలు, 3) యాగకాండ యందు-9 సర్గలు, 4) విలాస కాండ యందు-9 సర్గలు, 5) జన్మ కాండయందు-9 సర్గలు, 6) వివాహకాండయందు-9సర్గలు, 7) రాజ్యకాండయందు-24 సర్గలు, 8) మనోహర కాండ యందు-18 సర్గలు, 9) పూర్ణకాండయందు-9 సర్గలు గలవు. ఆనంద రామయణంలోని మొత్తం సర్గలు-109. ఇవన్నీ పాపములను పారద్రోలునవని గుర్తించుము.

ఇక శ్లోకముల వివరములు : సారకాండయందు- 2,530, యాత్రాకాండయందు- 235, యాగకాండ యందు 925, విలాసకాండయందు-678, జన్మ కాండయందు-802, వివాహకాండ యందు-583, రాజ్యకాండయందు- 2,622, మనోహర కాండయందు- 3,100, పూర్ణకాండ యందు- 577. ఇట్లు వెరశిమొత్తం శ్లోకములు- 12,257. శ్రీమదానంద రామచరిత్ర శ్రవణ, మననములచే పాపములు తొలగిపోవును.

పూర్ణకాండ శ్రవణముచే పుణ్యము వృద్ధియగును. సారకాండ శ్రవణముచే జనన, మరణ దుఃఖ ప్రవాహము తొలగిపోవును. యాత్రాకాండ శ్రవణముచే సకలతీర్థయాత్రాఫలము కలుగును, యాగకాండ శ్రవణముచే యజ్ఞకర్మాచరణఫలము లభించును. విలాసకాండ శ్రవణముచే అప్సరస స్త్రీ భోగము కలుగును. జన్మకాండ శ్రవణముచే పుత్ర పౌత్ర సంతానము కలుగును, వివాహకాండ శ్రవణముచే సుందరమైన స్త్రీతో సంసారసౌఖ్యము కలుగును. రాజ్యకాండ శ్రవణముచే రాజ్యభోగము కలుగును. మనోహరకాండ శ్రవణముచే మనోరథసిద్ధి కలుగును. పూర్ణకాండ శ్రవణముచే శ్రీహరి పాదపద్మములు లభించును. శ్రీమదానంద రామాయణము పూర్తిగా శ్రవణముచేసినచో సచ్చిదానంద శ్రీరామసాయుజ్యము కలుగును.

**సచ్చిదానందరూపే స లీనో భవతి మానవః ।**
**రామాయణం నరైః శ్రుత్వా కార్యముద్యాపనం నరైః ॥ 18**

**రామాయణే శ్రుతే దద్యాద్రథం హేమమయం సుధీః ।**
**చతుర్భిర్వాజిభిర్యుక్తం తథా క్షౌమపతాకయా ॥ 19**

**యంత్రైశ్చైవ సమాయుక్తం కింకణీనాదనాదితమ్ ।**
**సంపాదితేఽస్య సమ్యగ్వై ధేనుం దద్యాత్పయస్వినీమ్ ॥ 20**

**బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాచ్ఛతమష్టోత్తరం సుధీః ।**
**ఏవం కృతే విధానే తు మహాకావ్యం ఫలప్రదమ్ ॥ 21**

**రామాయణం భవేన్నూనం నాత్ర కార్యా విచారణా ।**
**యస్మిన్ రామస్య సంస్థానం రామాయణమథోచ్యతే ॥ 22**

**నరః ప్రాతః సముత్థాయానందరామాయణం పఠేత్ ।**
**యః స కామానవాప్నోతి సకలాన్ దివి దుర్లభాన్ ॥ 23**

**చైత్రమాసే సితే పక్షే నవమ్యాం రామజన్మని ।**
**శతమాషసువర్ణేన వాయుపుత్రం విధాస్య చ ॥ 24**

**ఏకవింశతి మాషైర్వా యథాశక్త్యాఽథవా నరైః ।**
**వాయుపుత్రం సంవిధాయాఽఽనంద రామాయణం త్విదమ్ ॥ 25**

**మౌల్యద్వారాలిఖిత్వాన్యైర్లిఖిత్వా వా స్వహస్తతః ।**
**తత్పునశ్చిత్రరంగాద్యైర్భూషితం సువిశోధితమ్ ॥ 26**

**వేష్టితం పట్టతూలాద్యైస్తతస్తత్పుస్తకం శుభమ్ ।**
**స్కంధే శ్రీమారుతే రూపం పూజితం దక్షిణాన్వితమ్ ॥ 27**

**మధ్యాహ్నే బ్రాహ్మణం పూజ్య నానాశాస్త్రవిశారదమ్ ।**
**తస్మిన్ దేయం పుస్తకం తద్వాయుపుత్రసమన్వితమ్ ॥ 28**

**ఏవం యః కురుతే దానం తస్య పుణ్యం వదామ్యహమ్ ।**
**కోటిభారసువర్ణస్య కురుక్షేత్రే రవిగ్రహే ॥ 29**

## ఆనందరామాయణం శ్రవణానంతరం ఉద్యాపన విధి

శ్రీమదానంద రామాయణము శ్రవణము చేసిన తరువాత ఉద్యాపనము చేయవలయును. ఆ ముగింపు కార్యవిధానము ఎట్లనిన... తెల్లని పట్టు ధ్వజముగల నాలుగు గుఱ్ఱములుగట్టి, చక్కగా అలంకరింపబడిన బంగారు రథమును, లేగదూడ ఉన్న గోవును దానము చేసి, 108 మంది బ్రాహ్మణులకు సమారాధన చేయవలయును. ఉద్యాపన చేయువారు ఆ రోజు ప్రొద్దున లేచి ఆనంద రామాయణమును పఠించి, చైత్రశుక్ల నవమినాడు రామజన్మ దినమున 100 మాడల యెత్తు లేనిచో యథాశక్తి సువర్ణముతో ఆంజనేయ ప్రతిమను చేయించి శ్రీమదానందరామాయణమును వెలయిచ్చి వ్రాయించిన సరే లేదా తానే స్వయముగా వ్రాసినదానినైనను పట్టువస్త్రముతో అలంకరించి, దానిని ఆంజనేయ ప్రతిమ ముందు పెట్టి, పూజించి మధ్యాహ్నమున బ్రాహ్మణునికి దానము ఇవ్వవలయును. ఇట్లు చేయు రామాయణ దానము; కురుక్షేత్రమున సూర్యగ్రహణ సమయమున చేసిన కోటిభార సువర్ణదానముకన్నను వంద రెట్లు అధిక పుణ్యమునిచ్చును.

**దానేన పుణ్యం యత్ ప్రోక్తం తస్మాదేతచ్ఛతాధికమ్ ।**
**అక్షరాణ్యత్ర యావంతి సంతి హ్యానందసంజ్ఞికే ॥ 30**

**తావద్యుగసహస్రాణి వైకుంఠే మోదతే నరః ।**
**సప్తజన్మ భవేద్విప్రస్తతోఽయం వేదపారగః ॥ 31**

రమ్యం పవిత్రమానందదాయకం చ మనోహరమ్ ।
ఆనందసంజ్ఞకం రామచరితం పుణ్యవర్ధనమ్ ॥ 32

రామాయణమిదం యేఽత్ర భక్త్యా శృణ్వంతి మానవాః ।
పుత్రః పౌత్రైః సుహృద్భిశ్చ న వియోగం లభంతి తే ॥ 33

రామాయణమిదం యేఽత్ర భక్త్యా శృణ్వంతి మానవాః ।
తేషాం స్త్రీభిర్వియోగాఽత్ర న కదాఽపి హి జాయతే ॥ 34

ఆనంద సంజ్ఞకం పుణ్యం యాః శృణ్వంత్యత్ర వై స్త్రియః ।
స్వభర్తృర్వియోగం తా న గచ్ఛంతి యథా రమా ॥ 35

గ్రామం దేశాంతరం తీర్థం యే గతాశ్చ చిరం నరాః ।
తేషామాగమనార్థం హి పఠనీయమిదం సదా ॥ 36

యేషాం భావీని కార్యాణి లబ్ధుం వర్తయతే మనః ।
ఆనందసంజ్ఞకం తేస్తు పఠనీయం ప్రయత్నతః ॥ 37

ప్రథమే దివసే కాండమేకమేవ పఠేచ్ఛుభమ్ ।
ప్రథమం చ ద్వితీయం చ ద్వితీయే దివసే పఠేత్ ॥ 38

ఏవం క్రమేణ కాండానాం వృద్ధిః కార్యా దినేదినే ।
నవ కాండాని నవమే దివసే సంపఠేన్నరః ॥ 39

అష్ట కాండాని దశమే క్షయస్త్వేకేన వై క్రయాత్ ।
సప్తదశాదనైర్జ్ఞేయమనుష్ఠానమిదం మహత్ ॥ 40

అథవా క్రమేణ కాండాని ప్రథమం ప్రథమం పఠేత్ ।
ద్వితీయం చ ద్వితీయేఽహ్ని నవమం నవమే దినే ॥ 41

దశమం దశమే ప్రోక్త క్షయః కార్యః క్రమేణ హి ।
సప్తదశ దినేరేతదనుష్ఠానం సుఖావహమ్ ॥ 42

అథవా పృథక్ కాండేషు సర్గవృద్ధిక్షయః క్రమాత్ ।
ఏవమేకదినన్యూనసప్తమాసైశ్చరేద్వ్రతమ్ ॥ 43

# శ్రీమత్ ఆనంద రామాయణ పారాయణవిధానము

ఆనంద రామాయణమును పారాయణ చేసినవారు, అందులో యెన్ని అక్షరములుగలవో అన్ని వేల సంవత్సరములు విష్ణులోకసుఖమును అనుభవింతురు. రమ్యము, పవిత్రము, సౌఖ్యము, మనోహరము, పుణ్యవర్ధనము, ఆనందసంజ్ఞకము అగు ఈ ఆనంద రామాయణమును వినిన మహాత్ములు- సంతానము, మనుమలు, మిత్రులు, కళత్రము వియోగము పొందక, ఇహ పరములలో భుక్తి, ముక్తులను- పొందుదురు. ఆనందరామాయణమును వినిన స్త్రీలు యావజ్జీవితము భర్త సౌఖ్యమునంది, నారాయణునితో లక్ష్మివలె ఒప్పుదురు. విదేశ వాసులగువారు వచ్చి స్వస్థలముచేరి సుఖించుటకై గాని ఇతరములగు నెట్టి కామితములు సిద్ధించుటకుగాని ఈ ఆనంద రామాయణమును చెప్పబోవు విధిని అనుసరించి పఠింపవలయును. మొదటిదినమున మొదటి కాండను, రెండవదినమున ప్రథమ ద్వితీయ కాండలును, మూడవ దినమున ప్రథమ, ద్వితీయ, తృతీయ కాండలును ఇట్లు, తొమ్మిదవ దినమున తొమ్మిది కాండలును, పదియవ దినమున యెనిమిది కాండలును ఇట్లు తగ్గించుచువచ్చి పదునేడు దినములలో పారాయణానుష్ఠానమును చేయుట ఒక విధానము. కాండనియమము లేక సర్గ వృద్ధి క్షయముననుసరించి 209 దినములు పారాయణానుష్ఠానము చేయుట మరియొకవిధము.

అథవా ప్రథమే సర్గస్త్వేక ఏవ పఠేన్నరః ।
ద్వౌ సర్గౌ చ ద్వితీయేఽహ్ని వృద్ధిస్త్వేవ క్రమేణ హి ॥ **44**

నవోత్తరశతే ప్రాప్తే దినే కృత్స్నం త్విదం పఠేత్ ।
పునః క్షయోఽనుక్రమతస్త్వేవం సప్తదినోత్తరైః ॥ **45**

సప్తమాసైరనుష్ఠానం జ్ఞేయం కార్యైకసాధనమ్ ।
అథవా ప్రథమే చాఽహ్ని సర్గం ప్రాథమికం పఠేత్ ॥ **46**

ద్వితీయేఽహ్ని ద్వితీయంచ తృతీయేఽహ్ని తృతీయకమ్ ।
నవోత్తరశతే ప్రాప్తే దినం చ చరమం పఠేత్ ॥ **47**

దశోత్తర శతేప్రాప్తే హ్యష్టోత్తరశతాభిదమ్ ।
పఠేత్సర్గం క్రమేణైవ శిష్య సప్తదినోత్తరైః ॥ **48**

సప్తమాసైరనుష్ఠానం జ్ఞేయం సాధారణం నృణామ్ ।
పంచానుష్ఠానభేదాశ్చ మయైవం పరికీర్తితాః ॥ **49**

**అనుష్ఠానసమాప్తౌ హి హోమః కార్యో యథావిధి ।**
**పృథక్ శ్లోకం సముచ్చార్య స్వాహాంతం పాయసైః ఫలైః ॥ 50**

**నవాన్నేనాథవా కార్యో హోమో ద్విజవరైః సహ ।**
**బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాద్ అనుష్ఠానదినైర్మితాన్ ॥ 51**

**ఏతత్ప్రాతః సముత్థాయానందరామాయణం శుభమ్ ।**
**యే పఠంతి నరాః భక్త్యా తే సుఖం ప్రాప్నువంతి హి ॥ 52**

**ద్వాదశ్యామపి చేత్తద్వై పఠనీయం ప్రయత్నతః ।**
**పారాయణం నవదినైః కార్యమస్యసుఖావహమ్ ॥ 53**

**కాండం సర్గోఽథవా శ్లోకస్త్వానందాఖ్యస్య ప్రత్యహమ్ ।**
**న నరః కీర్తయంస్త్యత్ర తేషాం జన్మ నిరర్థకమ్ ॥ 54**

మొదటిదినమున ఒక సర్గ, రెండవదినమున రెండుసర్గలు, మూడవదినమున మూడుసర్గలు, ఇట్లు ప్రతిరోజూ ఒక సర్గ చొప్పున క్రమంగా 109 దినములు వృద్ధిచేసి; పిమ్మట 108 దినములు ప్రతిరోజూ ఒక కాండమును తగ్గిస్తూ పారాయణ అనుష్ఠానము చేయుట మరియొక పద్ధతి. మొదటినాడు మొదటిసర్గ, రెండవ నాడు రెండవసర్గ, మూడవనాడు మూడవ సర్గ, ఇట్లు 109 దినములలో 109 సర్గలు పఠించి, పిమ్మట 110 యవ దినమునాడు 108వ సర్గ ఇట్లు ఒక్కొక్క సర్గనే తగ్గిస్తూ పఠించుచు, 7 నెలలు పారాయణ అనుష్ఠానము చేయవచ్చు. యెట్లు పారాయణము చేసినను చివరిగా వేర్వేరుగా శ్లోకములను ఉచ్చరించి నేతితోను, పాలతోను హోమము చేయుట మంచిది. నవాన్నముల తోనైనను చేయవచ్చును. బ్రాహ్మణ భోజనాది అనుష్ఠానాదికమంతా చేయవలయును.

ప్రాతః కాలమున భక్తితో ఆనందరామాయణమును పఠించువారు దుఃఖమునందరు. కాండమునో, సర్గనో, శ్లోకమునో దేనినైనను, కొంచమునైనను ఆనంద రామాయణమున పఠించని వానిజన్మ నిరర్థకము. దంపతులు తమ పడక గదిలో ఆనందరామాయణమును పారాయణ చేసినచో, పుత్రసంతానము కలుగును.

**పుత్రార్థం రతిశాలాయాం శృణోతి పురుషః స్త్రియా ।**
**నిశాయాం శయనారూఢోఽపుత్రీ పుత్ర మవాప్నుయాత్ ॥ 55**

**ననరాశిషు వ్రీహీణాం ధ్యాత్వా కార్యం తు విన్యసేత్ ।**
**పూగీఫలాని చత్వారి పూర్వేణ కాండముచ్యతే ॥ 56**

ద్వితీయేన హి సర్గస్తు తృతీయేన ఫలేన హి ।
దశమో౽స్య చ విజ్ఞేయశ్చతుర్థేన ఫలేన చ ॥ 57

శ్లోకో జ్ఞేయః పూర్వరాశేః సర్వేషాం గణనేరితా ।
సర్వత్రాంత్యేన శ్లోకేన విపరీతం ఫలం స్మృతమ్ ॥ 58

ఏవం సర్వైర్దర్శనీయః శకునశ్చ శుభో౽శుభః ।
ఏవం శిష్య త్వయా యద్యత్ పృష్టం తత్తన్మయోదితమ్ ॥ 59

ఆనందరామాయణమేతదుత్తమం
నవోత్తరం సర్గగతం మయేరితమ్ ।
కాండాని యస్మిన్నవ కీర్తితాని తే
హే విష్ణుదాసాఘహరం మనోహరమ్ ॥ 60

దినేదినే పాపచయాన్ ప్రకుర్వన్
నరః పఠేత్ శ్లోకమపీహ భక్త్యా ।
విముక్తసర్వాపచయః ప్రయాతి
రామస్య సాలోక్యమనన్యలభ్యమ్ ॥ 61

## శుభాశుభ శకునములు చూచు క్రమము.

శ్రీరామ నవాయతన స్వరూపముగా రామధ్యానము జేసి, వడ్లరాసులను పోసి, వాటిపై నాలుగు వక్కలనెత్తికొని ఆ ధాన్యరాశికి పూజజేసి, తన కోరిక నెరవేరుటకు దారియివ్వుమని కోరి, ప్రార్థన అనంతరము ఆ వక్కలను ఆరాసులపై వేసి, పిమ్మట మొదటి వక్కతోకూడ నెత్తబడిన ధాన్యసంఖ్యను తొమ్మిదింట భాగించగా నిలిచినది. ఇన్నియవకాండయని యేర్పడును. పిదప రెండవవక్కతో యెత్తిన ధాన్యమును వెనుక వచ్చిన కాండలోని సర్గసంఖ్యచే భాగించగా నిలిచిన శేషము సర్గసంఖ్యగా నేర్పడును. మూడవ వక్కతోడ నెత్తిన ధాన్యమును వెనుక వచ్చిన సర్గయందలి శ్లోక దశక సంఖ్యచే విభజించి, శేషించిన సంఖ్యకు తగినట్లు అన్నియవ దశకమనుకొనునది. నాల్గవవక్కతోడ ఎత్తిన ధాన్యమును పదింట భాగించి, మిగిలిన శ్లోకమును ప్రశ్నశ్లోకముగా ఎంచునది. ఆశ్లోకము...ఉదా...

శ్లో॥ అవిసర్గితపూర్వార్ధః తవర్గేతరపంచమః ।
విధిలిద్వర్జితశ్లోకః శకునేతు ప్రశస్యతే ॥

తా॥ ఆ శ్లోకపూర్వార్ధమున విసర్గలుండరాదు, అయిదవ యక్షరము– త, థ, ద, ధ, న– లు గా

నుండగూడదు. లింగ్, లఙ్ లకారముల క్రియాపదములుండగూడదు. ఇట్టిశ్లోకము శకునమునకు ప్రశస్తము. శుభాశుభ శకున పరిజ్ఞానము గల్గును. సర్గాంత శ్లోకము వచ్చిన విపరీత ఫలమని యెంచవలయును. (59) ఇట్లు మహాఫలమునిచ్చు శ్రీమదానంద రామాయణమును నిత్యము పఠించువారు పాపముక్తినంది ఇతరదుర్లభమగు రామసాలోక్యముచే సుఖింతురు.

**అనందరామాయణ మేతదుత్తమం**
**యే రామదాసస్య ముఖేన కీర్తితమ్ ।**
**శ్రీరాఘవేణైవ జనాఘనాశనం**
**నానాచరిత్రైర్వరకౌతుకైర్యుతమ్ ॥ 62**

**ధన్యః స వాల్మీకిమునిః కవీశ్వరో**
**రామాయణం వై శతకోటిసంమితమ్ ।**
**కృతం పురా యేన సవిస్తరం శుభం**
**యస్మాచ్చ సారం కథితం మయా తవ ॥ 63**

**ఆనందరామాయణమేతదుత్తమం**
**శ్రీజానకీక్రీడనకౌతుకైర్యుతమ్ ।**
**శృణ్వంతి గాయంతి వదంతి వాఽపరాన్**
**కుర్వంతి పారాయణమాదరాచ్చ యే ॥ 64**

**లభంతి పుత్రానతిబుద్ధిమత్తరాన్**
**స్త్రీశ్చాపి పౌత్రాన్ పరమాన్ మనోహరాన్ ।**
**ధనాని ధాన్యాని పశూంశ్చ మానవాః**
**శ్రీరామచంద్రస్య పదం ప్రయాంతి తే ॥ 65**

**ఆనంద సంజ్ఞం పఠతశ్చ నిత్యం**
**శ్రోతుశ్చ భక్త్యా లిఖితుశ్చ రామః ।**
**అతిప్రసన్నశ్చ సదా సమాపే**
**సీతాసమేతః శ్రియమాతనోతి ॥ 66**

**ఆనందరామాయణజాహ్నవీయం**
**పాపాపహంత్రీ మలినస్య జంతోః ।**
**ఆనందరామాయణకామధేను**
**స్త్వియం జనానామతికామదోగ్ధ్రీ ॥ 67**

**రామాయణం జనమనోహరమాదికావ్యం**
**బ్రహ్మాదిభిః సురవరైరపిసంస్తుతం చ ।**
**శ్రద్ధాన్వితః పఠతి యః శృణుయాత్స నిత్యం**
**విష్ణోః ప్రయాతి సదనం స విశుద్ధ దేహః ॥ 68**

**నవోత్తరశతైః సర్గై రామకీర్తనమాలికామ్ ।**
**కృత్వా కంఠే సుఖం తిష్ఠ శిష్యేమాం త్వం మయోదితామ్ ॥ 69**

**శ్రీశివ ఉవాచ**

**ఆనందరామచరితమిదం స్వీయగురోర్ముఖాత్ ।**
**శ్రుత్వా స విష్ణుదాసస్తం ననామార్చ్య పునః పునః ॥ 70**

## శ్రీమదానంద రామాయణ పారాయణ ఫలశ్రుతి.

శ్రీరామునిచేతనే అనుగ్రహింపబడిన శ్రీరామదాసు స్వయంగా విష్ణుదాసుకు చెప్పినదే ఈ ఆనంద రామాయణము. ఇది నానా చరిత్రలచే ప్రేరణ రూపముగా ఉండు శతకోటి శ్లోకములతో రామచరిత్రను రచియించిన శ్రీ వాల్మీకి కవి ధన్యుడు. నూరుకోట్ల శ్లోకముల సారమే శ్రీమత్ ఆనంద రామాయణముగా నీకు నేను చెప్పితిని, దీనిని విని, గానము చేసి, పఠించి, వినిపించి, లిఖించి శ్రీరామచింతనము చేయు సద్భక్తులకు శ్రీసీతారాముడు సుప్రసన్నుడై సంపదలనిచ్చును.

ఆనందరామాయణమను గంగాప్రవాహము ప్రాణుల పాపములను పరిహరించును. మరి యిది కామధేనువువలె జనుల కోర్కెలను తీర్చుచుండును. శ్రీరామచరిత్ర బ్రహ్మేంద్రాదులచే పొగడబడినది. విష్ణుదాసా! ప్రియశిష్యా! 109 సర్గలుగల శ్రీమత్ ఆనంద రామకీర్తన మాలికను కంఠమున అలంకరించుకొని సుఖముగా ఉండుము. అని శ్రీరామదాసు చెప్పెనని శివుడు పార్వతికి చెప్పు చున్నాడు.

రామదాసః స్వశిష్యాయానందరామాయణం ప్రియే ।
ఏవముక్త్వా మునిః సంధ్యా కర్తుం గోదాం గమిష్యతి ॥ 71

ఏవం దేవి తవాగ్రేఽద్య మయాఽపి పరికీర్తితమ్ ।
ఆనందరామచరితం శ్రవణాత్పుణ్యవర్ధనమ్ ॥ 72

రామకీర్తనమాలాయాం మేరుస్థానే త్వయం మహాన్ ।
సర్గో మయా తే కథితః శ్రవణాన్మంగళప్రదః ॥ 73

శ్రీపార్వత్యువాచ

యదా వాల్మీకినా దేవ కృతం రామాయణం వరమ్ ।
తదా క్వ రామదాసః స సంవాదోఽస్మింస్త్వయాఽకథి ॥ 74

క్వ తదా విష్ణుదాసోఽపి సంశయో మేఽత్ర జాయతే ।
శ్రీశివ ఉవాచ
త్రికాలయా జ్ఞానదృష్ట్యా మునినాఽత్ర కథాంతరే ॥ 75

ఉభయోర్భావిసంవాదః సోఽపి పూర్వం ప్రవర్ణితః ।
యథా రామస్య చరితం రామాత్పూర్వం ప్రవర్ణితమ్ ॥ 76

సందేహోఽత్ర త్వయా నైవ కార్యః పర్వతకన్యకే ।
రామదాసముఖేనైతద్రాఘవేణైవ వర్ణితమ్ ॥ 77

ఆనందరామాయణమాదరేణ
శ్రీరామచంద్రేణ మునేర్ముఖేన ।
తద్రామదాసస్య ముదైవ ప్రోక్తం
భక్తిప్రదం ముక్తిదమేతదత్ర ॥ 78

ఆనందరామాయణమాదరేణ
పుత్రే ప్రజాతే పఠనీయమేతత్ ।
వివాహకాలే వ్రతబంధకాలే
శ్రాద్ధే పఠేత్పర్వణి మంగళే చ ॥ 79

ఆనందరామాయణ శ్రవణానంతరము విష్ణుదాసు గురువుకు నమస్కరించి, పూజించి, మరల నమస్కరించెను. రామదాసు శిష్యునికి ఉపదేశించి, సంధ్యావిధికై గోదావరినదికి వెడలెను.

పార్వతీ! నీయెదుట ఈ శ్రీమత్ ఆనందరామాయణము ఇట్లు చెప్పబడే. దీనిని వినుటచే సుకృత వర్ధనము. రామకీర్తనమాలికలో ఈ కడపటిసర్గ ప్రథమ స్థానముగా ఎంచబడి శ్రవణముచే మంగళకరమైయుండును," అనిన శివునితో పార్వతి, "దేవా! రామాయణమును వాల్మీకి యెపుడు చేసె? అపుడు రామదాస సంవాద మెచ్చటిది? విష్ణుదాసు ఎచ్చటనుండె? ఈవిషయమున మిగుల సంశయముగా ఉన్నది." అని అడుగగా, శివుడు "త్రైకాలీకమగు జ్ఞానదృష్టిచేత శ్రీమద్వాల్మీకిముని శ్రీరామదాస–విష్ణుదాస సంవాదాత్మకముగా కథాంతర ప్రస్తావమున వర్ణించియున్నాడు. ఇది యేమివింత? రామునికి మునుపే రామచరిత్రము ఉపనిషదుక్తముగాదే! కావున పార్వతీ! నీవు సందేహింపవలదు. ఈ చరిత్రమును రామదాసముఖమున శ్రీరాముడే అభివర్ణించియున్నాడు" అని శ్రీశివుడు చెప్పెనని వాల్మీకిప్రోక్త శ్రీమదానంద రామాయణమున పూర్ణకాండ నవమసర్గయయ్యె.

శ్రీరామచంద్రుడు ఆ రామదాసుని ప్రీతికై అతనినోటినుండి తానే శ్రీమదానంద రామాయణమును సాదరముగా పలికెను. ఇది యిచ్చట భుక్తి, ముక్తి ప్రదము. మంగళ కార్యములలోను, శుభ సమయము లలోను, పర్వకాలములలోను, పితృతృప్తి సమయాన, వివాహ వేదికవద్ద, వ్రతాది కాలములలోను, పుత్రోత్సవాదుల లోను ఈ ఆనంద రామాయణమును పఠింపవలయును.

**ఆనందరామాయణమాదరేణ**
**కారాగృహస్థస్య విముక్తయే చ ।**
**ఉత్పాతశాంత్యై భయనాశనాయ**
**ప్రభోః కృపార్థం పఠనీయమేతత్ ॥ 80**

**ఆనందరామాయణమాదరేణ**
**శృణోతి వా శ్రావయతే చ భక్త్యా ।**
**స స్వీయకామానఖిలానవాప్య**
**వైకుంఠలోకం ఖలు గచ్ఛతి స్వైః ॥ 81**

**ఆనందరామాయణతోఽధికాని**
**న సంతి తీర్థాని హరేః స్థలాని ।**
**క్షేత్రాణి దానాన్యపి పుణ్యదాని**
**తథా పురాణాన్యథ కీర్తితాని ॥ 82**

అనందరామాయణమేతదుత్తమం
ప్రోక్తం మయా తే గిరిజే సవిస్తరమ్ ।
త్వం చింతయస్వాఘహరం నిరంతరం
మనోహరం లప్స్యసి రాఘవే మతిమ్ ॥ **83**

ఆదౌ హత్వా దశాస్యం ద్విజవచనగురుత్వేన యాత్రాశ్చ యజ్ఞాన్
కృత్వా భక్త్యాతిభోగానవనితలవిశంతీం గృహీత్వాథ సీతామ్ ।
లబ్ధ్వా నానాస్నుషాస్త్వవనితలగతాన్పార్థివాదీంశ్చ జిత్వా
కృత్వా నామోపదేశాన్ గజపురనికటే స్వీయలోకం జగామ ॥ **84**

వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పృష్ఠే సుమిత్రా సుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయవ్యకోణాదిషు ।
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్ ॥ **85**

చెరసాలలో పడి విడుదల కావలసినవాడును, ఉత్పాత శాంతిని కోరువాడును, భయపడినవాడును, ప్రభుప్రసాదమును అపేక్షించువాడును, శ్రీమదానందరామాయణమును ఆదరముతోవిని కృతార్థుడు కావలెను.

శైలతనయా! ఉత్తమమగు ఈ ఆనందరామాయణమును నేను నీకు ఉపదేశించితిని. మనోహరము, పాపపరిహారకమగు దీనిని సదా నీవు చింతించుచుండుము. శ్రీరాముని యందే చిత్తవృత్తిగల్గును.

శ్రీరాముడు రావణుని వధించెను, తీర్థయాత్రలను చేసెను, సకలభోగములను అనుభవించి, భూమిలో ప్రవేశించిన భూపుత్రి సీతను ఉద్ధరించి, కొడుకులను కోడండ్రలను పొంది, రాజులనందరిని జయించి, రాజేంద్రుడై అనేక సదుపదేశములనిచ్చి, హస్తినాపురివద్ద తన లోకమునకు వెళ్ళెను. ఇట్టి సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, హనుమత్, సుగ్రీవ, జాంబవంత, విభీషణ సమేతుడగు నల్ల కలువవంటి చల్లని మేనుగల శ్రీరామమూర్తికి వందనము. ఆనందరామాయణమున బంగారము వంటిదగు కడపటిదగు పూర్ణకాండను యేమానవోత్తములు పఠింతురో అట్టివారు సకల అభీష్టములను పొంది హరిపదము చేరుదురు. ఈ ఉత్తమమగు ఆనందరామాయణము జపించదగినది.

**ఆనందరామాయణహారకోపమం**
**యే పూర్ణకాండం చరమం నరోత్తమాః ।**
**పఠంతి శృణ్వంతి హరేః పరం పదం**
**గచ్ఛంతి పూర్ణేప్సితమాలభంతి తే ॥ 86**

**ఆనందరామాయణ మేతదుత్తమం**
**జప్యం పవిత్రం శ్రవణీయమాదరాత్ ।**
**యన్మంగళానామపి మంగళప్రదం**
**స్మరామి నిత్యం ప్రణమామి సాదరాత్ ॥ 87**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, పూర్ణకాండే, ఉమామహేశ్వర సంవాదే, తథా రామదాస విష్ణుదాస సంవాదే, గ్రంథఫలశ్రుతిర్నామ నవమః సర్గః ॥**

**॥ ఇతి పూర్ణకాండం నవమం సంపూర్ణమ్ ॥**

పరమపవిత్రము, శ్రవణీయము, సర్వోత్తమమంగళము, కావున దీనిని నిత్యము స్మరించుచుందును, మరి ప్రణమించుచుందును.

శ్రీవాల్మీకిమహర్షి రచించిన ఆనందరామాయణములోని పూర్ణకాండలో
గ్రంథఫలశ్రుతిని వివరించు 9వ సర్గ ముగిసినది.

**ఇట్లు శ్రీమదానంద రామాయణము సంపూర్ణము.**

శ్రీమత్ ఆనందరామ చరణారవిందార్పణమస్తు.

శ్రీమద్వాల్మీకి విరచిత

# ఆనందరామాయణ వివరములు

| వ. | కాండముపేరు | సర్గలు | శ్లోకములు (ఉన్నవి) | శ్లోకములు (ఉండవలసినవి) | భేద శ్లో (అధికము/తక్కువ) |
|---|---|---|---|---|---|
| 1. | సార కాండ | 13 | 2,561 | 2,530 | ఎక్కువ 31 |
| 2. | యాత్రా కాండ | 9 | 744 | 735 | ఎక్కువ 9 |
| 3. | యాగ కాండ | 9 | 629 | 625 | ఎక్కువ4 |
| 4. | విలాస కాండ | 9 | 678 | 678 | – |
| 5. | జన్మ కాండ | 9 | 804 | 802 | ఎక్కువ 2 |
| 6. | వివాహ కాండ | 9 | 585 | 563 | ఎక్కువ 22 |
| 7. | రాజ్య కాండ | 24 | 2,639 | 2,602 | ఎక్కువ 37 |
| | (పూర్వార్థం (అ1–12) | 12 | 1,252) | | |
| | (ఉత్తరార్థం (అ13–24) | 12 | 1,387) | | |
| 8. | మనోహర కాండ | 18 | 3,064 | 3,100 | తక్కువ 36 |
| 9. | పూర్ణ కాండ | 9 | 577 | 577 | – |
| | **మొత్తం** | **109** | **12,281** | **12,212** | **ఎక్కువ 69** |

ఈ ఆనందరామాయణములోని పూర్ణకాండ 9వ సర్గలో శ్లో॥ 6 నుండి 10వరకు గ్రంథముయొక్క వివరాలు తెలుపుతూ...**9 కాండలు, 109 సర్గలు 12,000 శ్లోకాలు** ఉన్నట్లు చెప్పారు. కాండలు, సర్గలు సరిపోయాయి. కానీ శ్లోకాల సంఖ్యనే అధికముగా కనిపిస్తోంది. ఇందులో చెప్పిన విధముగా చూస్తేనే 212 శ్లోకాలు అధికముగా కనిపిస్తున్నాయి. ప్రస్తుత పుస్తకంలో 12,281 శ్లోకాలు ముద్రింపబడ్డాయి. అంటే 281 శ్లోకాలు అధికమయ్యాయన్నమాట.

మనోహర కాండలో మాత్రం ఉండవలసిన శ్లోకముల కంటే 36 తగ్గినట్లు కనిపిస్తున్నాయి. ఈ వివరాలు పైపట్టికలో తెలుపబడ్డాయి, పాఠకులు గమనించగలరు.

పండితులు సరియైన సంఖ్యను తెలిపినచో తరువాతి ముద్రణలో ముద్రించవీలగును..

శ్రీమద్వాల్మీకి మహర్షి విరచిత

శ్రీపార్వతీపరమేశ్వర సంవాదమున, శ్రీరామదాస విష్ణుదాసుల సంవాదాత్మక

# ఆనందరామాయణ అనువాద, ముద్రణ వివరాలు.

శ్రీమత్ ఆనందరామాయణము ఉత్తరదేశమున సుప్రసిద్ధమైనది, కర్ణాటక రాష్ట్రములో పద్య రూపకముగా ప్రసిద్ధినొందినట్లు చెబుతున్నారు. మన తెలుగునాట అక్కడక్కడ కొద్దిమంది పండితులు ప్రచారముగావిస్తున్నట్లు విన్నాను. ఈ గ్రంథము తెలుగులో సంక్షిప్తముగా లభిస్తున్నదే కాని ప్రస్తుతము పూర్ణముగా లభించడములేదు.

ఇపుడు మీ చేతులలో ఉన్న ఈ పుస్తకమునకు మూలము 1902వ సంవత్సరము చెన్నపురి (చెన్నై)లో ఆల్బేనియన్ ప్రింటింగ్ ప్రెస్‌లో శ్రీ జి. సుబ్బరాయ శాస్త్రులవారిచే ముద్రింపబడినది.

దీనికి తాత్పర్యకర్త బ్రహ్మశ్రీ సిద్ధాంతి- శివశంకర శాస్త్రులవారు అని తెలుస్తోంది. దీనికి నిదర్శనము ఆ పుస్తకము చివర్న ముద్రింపబడిన ఈ క్రింది శ్లోకమే.

**శ్లో ॥ కల్యాణపుర సిద్ధాంతి శివశంకర శాస్త్రిణా ।**
**ఆనంద రామచరితస్యాంధ్ర తాత్పర్యమీరితమ్ ॥**

1902లో మూడు సంపుటములుగా ముద్రింపబడిన ఈ గ్రంథమును, తిరిగి 2005లో తూర్పు గోదావరి జిల్లా, కపిలేశ్వరపురం సర్వారాయ ధార్మిక విద్యాట్రస్టువారు ఫోటో ముద్రణ గావించారు.

అక్షరాలు చిన్నవి, శ్లోకములు వరుసగా గొలుసుకట్టుగా ఉన్నవి. అప్పటికి అదే ఎక్కువ.

2021 సంవత్సరము ఏప్రిల్-17న మా గురువుగారైన పూజ్య స్వామిని శారదా ప్రియానంద గారి 21 ఆరాధన సందర్భముగా మొదటి సంపుటమును విడుదలచేయడమైనది. ఈ మొదటి సంపుటములో 1. సారకాండ, 2. యాత్రాకాండ, 3. యాగకాండ, 4. విలాసకాండ, 5. జన్మకాండ, 6. వివాహకాండలు గలవు.

ఈ రెండవ సంపుటములో 7. రాజ్యకాండ, 8. మనోహరకాండ, 9. పూర్ణకాండలు గలవు.

పై గ్రంథమునే ఆధారముచేసుకుని, 1. చౌకాంబ సంస్కృత ప్రతిష్ఠాన్, న్యూఢిల్లీ వారు ముద్రించిన నాగరలిపికి హిందీ అనువాద పుస్తకమును, 2. పరిమళ పబ్లికేషన్స్, ఢిల్లీ వారు ముద్రించిన నాగర లిపికి ఆంగ్లానువాద పుస్తకములను సహాయముగా ఉంచుకుని ఈ పరిష్కారము శ్రీసీతారాములవారు చేయించారు. రామకోటిగా భావించి, అక్షరకూర్పు నేనే చేసినందులకు సంతోషిస్తున్నాను.

ఈ గ్రంథమునకు మరింత పరిశ్రమ కావలసియున్నది. ఇప్పటికిది ప్రాప్తమని సంతోషిస్తూ...

స్వామి సత్యాత్మానంద. 28-6-2021.